SRI

# SRUNGARA KADAMBARI

BY

Chintalapalli NARASIMHA SASTRI GARU

*Senior Telugu Pandit, Municipal High School, Bellary.*



Published

With the gracious help of

Captain: Sir The Raja of Venkatagiri,

K. C. I. E., M. G. A. F. (I)

(29th Generation.)

---

Printed at

VAVILLA PRESS,

MADRAS.

1926.

శ్రీరామస్సహాయోస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీశృంగారకాదంబరి.

బ్రహ్మశ్రీ, బళ్లారి మునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

చింతలపల్లి నరసింహశాస్త్రి

ప్రణీతము.



శ్రీవేంకటగిరిసంస్థానాధిపతులలో 29 పురుషులగు

కెప్టన్ సర్. రాజా వెలుగోటి శ్రీ గోవిందకృష్ణయాచేంద్ర
బహాదరు కే. సి. ఐ ఇ. గారి సంపూర్ణసాహాయ్యముచేఁ

ప్రకటితము.

---

'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

చెన్నపురి.



కాపీరైటు] 1926. [వెల. 3-0-0.

'VAVILLA'Press, Madras —1926.



చింతలపల్లి. నరసింహశాస్త్రి,

గ్రంథకర్త.

శ్రీరామస్సహాయోస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగారకాదంబరి

## గ్రంథకర్తృవిజ్ఞప్తి.

---

పండితవర్యులారా!

నే నెట్టిలోకసమారాధనం బొనరించి జన్మంబు సార్థకంబుఁ గావించుకొని నాపితృదేవతల నరకోత్తీర్ణులఁ జేసి శాశ్వతోత్తమలోకవాసుల నొనర్చి కృతకృత్యుండనై సద్గతిఁ గాంతునా యని యాలోచించుకొనుచుఁ గాలంబు నొక్కరీతిం బుచ్చుచుండ నొక్కనాఁడు, నాకత్యంతాప్తమిత్రులును బళ్లారిజిల్లా కౌశికపురవాస్తవ్యులును నగు మ-రా-రా-శ్రీ, దేశాయి. చంద్రమౌళిగారును, మత్ప్రియాంతేవాసియు,సరససద్గుణనిధియు,మృదుమధురశ్రుతిసుభగసువచనానందితకవిబుధనికరుండును, మృదులకవితారసజ్ఞుండును, బళ్లారి మునిసిపల్ హైస్కూలునందు సహాయోపాధ్యాయుఁడును నగు కప్పగల్లు. సంజీవమూర్తియు, నాయనుంగుశిష్యుండు సోమేశ్వర. వీరరాఘవనాయుఁడును లోనగుమదీయాప్తమిత్రచ్ఛాత్రనికరంబు కరంబు సంతసంబునం బొదలుచు నిరుపక్కియలం గొలిచియుండ, వారితో నిష్టకథాగోష్ఠిం దవిలి లోకాభిరామవచస్సుధాంభోధివీచికలఁ దేలుచు సరసకవికవితాకావ్యమధురాలాపంబుల వినోదించుచు సుఖసుఁ బుచ్చుచున్నతఱి భట్టబాణకవిప్రస్తావంబు వచ్చుటయుఁ దదీయకాదంబరి నద్భుతానల్పకథాకల్పనాసుధారసలహరిఁ బహుప్రకారంబుల నుగ్గడించి నన్నుం గాంచి వారు "మహాత్మా! మీ రప్పుడప్పుడు తత్కాదంబరీచమత్కారసుధారసంబు మావీనుల వెల్లిఁ గొల్పి ప్రహృష్టచిత్తులం గావించుచుందురు. తత్కథారసం బెంత గ్రోలినను మావీనులు దనియకున్నవి. దాని నాంధ్రంబునఁ బరివర్తనంబుఁ గావించి మాకుం గర్ణరసాయనం బొనరించి యీయాంధ్రప్రపంచంబును దదీయమధురామృతరసవాహినీప్లావితంబు నొనరింపుఁడు." అనుటయు నేను దత్కాలసంజాతప్రహర్షప్రకర్షప్రకారప్రముదితస్వాంతుండనై చిఱుతతనముంగోలె నాకాగ్రంథముపైఁ గలభక్తివిశేషంబునకుఁ దదీయాభిలాషం బుపశ్రుతియగుటయు, శ్రీ వేంకటగిరిమహారాజుగారగు వెలుగోటి. శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర

బహాదరువారు సంతరించిన శృంగారపద్యరత్నావళిపీఠికయందలి తద్గ్రంథభాషాం తరీకరణవిషయప్రస్తావనం బద్దానిని నుపబృంహణంబుఁ గావించుటయు, నిది నా యుద్యమంబు నెఱవేర్పఁగల దని తలఁచి మదీయసామర్థ్యము విచారింపక యా గాముల నారయక యవిచారమూఢుండనై దాని కియ్యకొని వినోదగోష్ఠిం జాలించి గృహంబునకుం జని సాయంతనాహ్నికంబులఁ దీర్చుకొని విశ్రమించియుండ నామధ్యాహ్నంబున జరిగిన వినోదగోష్ఠీప్రసంగంబు చిత్తంబు హత్తుటయు మనం బున నిట్లని వితర్కించితి.

సీ. కావ్యప్రపంచంబు♦ కడఁ గానఁగా లేదు సారె కభ్యాసంబు ♦ సలుప లేదు
శబ్దసమయహేతు♦శాస్త్రవాసన లేదు సదలంకృతులవీధిఁ ♦ జనఁగ లేదు
ఛందోవిశేషంబు ♦ చవిఁ గానఁగా లేదు కళలపొం దింతేనిఁ ♦ గనఁగ లేదు
పూర్వకవీంద్రుల♦పోలు పెఱుంగఁగ లేదు భావరసస్ఫూర్తిఁ ♦ బడయ లేదు
తే. పడయఁగా లేదు బహుపద♦పాటవంబు
తెలియఁగా లేదు నాచితి ♦ తెన్ను సుంత
నేర్వఁగా లేదు సందర్భ♦నిపుణతయును
నెటుల నెఱవేర్తు వీరియ♦భీప్సితంబు?.

ఉ. ఎక్కడ భట్టబాణకవి, ♦ యెక్కడఁ దత్తనుజాతుఁ, డేడ నేఁ
జొక్కుబుధోత్తముల్ రసముఁ ♦ జొబ్బిల భావము లర్థసంపదల్
తక్కక యుండఁ, దత్కృతినిఁ ♦ దజ్జ్ఞులు మెచ్చఁగఁ దెల్గు నేత దా
నెక్కడ, నెట్టికార్యమున ♦ కీకొనితిం గట! మందబుద్ధినై.

ఉ. ఒక్కొకభాషకుం గలుగు ♦ నొక్కొకసొంపును నింపు పెంపునుం
జిక్క విఁకొక్కభాష కవి ♦ సిద్ధము; ప్రాణు లటన్న మాత్రనే
యొక్కఁడె మానవుల్ పశువు; ♦ లుండదె భేదము వానిరెంటికిం
నిక్క మెఱుంగఁగా వలయు ♦ నేర్పరియాకవి వీని నన్నిటిం.

క. ఆయాభాషకు ననువగు, నాయాపోకల నెఱింగి ♦ యర్థావిధమునం
బోయినకవిత మనోజ్ఞము; బోయకుఁ దగుభూషణములు ♦ భూపతి కగునే!.

క. చేపలగుడులను ద్రాటను, దోఁపినగతి నుడులగుడులఁ ♦ దోఁపినఁ గవితం
భూపతులు కవులు మెత్తురె!, కాఁపులుఁ గుకవులును గాక ♦ గానఁగ నవనిం.

మ. తలమే నాకిది! మిత్రశిష్యులప్రమో♦దం బేగతిం దీర్తు నేఁ
దలకొంటి న్గద యేత మెత్తజలధిం ♦ దర్పించి యుం కెట్లొకో!

తలఁతుఁ దెంచము మీఱఁగాఁ దగదు మేధాదక్షిణామూర్తి! నా
తలఁకుం బాపు మటంచు నిశ్చితమతిన్ ♦ ధ్యానించితిన్ భక్తిమై.

వ. అంత.

సీ. ఒకకేల ముత్యాల♦యుజ్జ్వలజ్జపమాల యొకకేల జ్ఞానము♦ద్రిక యుఁ గ్రాల
నొకకేల నకళంక♦సకలవిద్యాముద్ర యొకకేల సుధఘటం ♦ బోలిఁ దేల
నురగసరంబులు ♦ నిరుకతక్షతలముల మాళిపాళి హిమాంశు♦బాలుఁ దేలఁ
గన్నులమూఁడిటఁ ♦ గరుణారసము పొంగి ఝరమయి ధరణిపైఁ ♦ జాలువాఱ
తే. మేను స్ఫటికంపుఁగాంతుల ♦ నీన లీల
సకలభూషణభూషిత♦సన్నుతాంగుఁ
డగుచు నాస్వామి శ్రీదక్షి♦ణాస్యుఁ డాత్మఁ
దోఁచి యిట్లనినట్టులు ♦ దోఁచె మదికి.

శా. నే నుండన్ భయ మేమి నీకు వినుమీ ♦ నిచ్చల్ సహాయుండనై
తో నుందున్ సదసత్తులం దెలుపుచున్ ♦ దూఁగింపు నీకార్యమున్
భూనాథుల్ కవినాథులున్ శిరములన్ ♦ భూషింప నీయీకృతిన్
నే నిర్వాహ మొనర్తుఁ జింత విడుమా ♦ నిత్యోత్సవం బూనుమా.

ఉ. భానుఁడు చంద్రుఁడున్ నభము ♦ భంబులు దిక్కులు సాగరంబులున్
భూనగముల్ మరుత్తులును ♦ బొల్చును నెంతకు నంత దాఁక స
న్మాన మొనర్ప సత్కృతులు ♦ మానవనాథులు పొల్చుఁ గాక యీ
మానిత మైననీదుకృతి ♦ మానుము శంక వరం బొసంగితిన్.

వ. అని సాదరసంభాషణంబుల వచియించిన ట్టగుటయు నేను మహానందసందో
హామహాంబుధినిమగ్నమానసుండనై మదిష్టదేవతానుగ్రహం బీపాటి గలుగ
నాకుం గొఱంత యేమిట నుండ దని దృఢనిశ్చయుండనై సర్వమునకు నా
మహాదేవుండె గలం డని సర్వభారంబుఁ దన్మ్రోలం బెట్టి నే నిమిత్తమాత్రుండ
నై పూర్వకవీంద్రులు, శ్రీనాథాదులు చూపినపక్కని యథామూలంబుగ
నిమ్మహాప్రబంధంబు నుదిష్టదేవతాంకితంబుగా నాంధ్రీకరించి మిత్రశిష్యుల
యభీష్టప్రకారంబు "శ్రీశృంగారకాదంబరి" యనుపేరిడి దీనిం బ్రచారంబు
నకుం దెచ్చి లోకంబున వెలయించు నుదాత్తచరిత్రుని నుదారచిత్తునిఁ బ్రభు
వతంసుని నెవనిం జూపునో యాభగవంతుండని యారయుచు నొక్కవేసఁగి
కాలపునెలతుల నిమ్మహాప్రబంధంబుం గొని,

సీ. కవిసార్వభౌముండు ♦ కంపించెఁ బాండితి నెదిరింపఁగా లేక ♦ యేధరేశుఁ
గనె భూసురుల కేని ♦ కల్గని సర్వజ్ఞ బిరుద మేనరపాల ♦ వరసుతుండు
సురభాష రచియించె ♦ వరరసార్ణవకృతి సత్కవుల్ మెచ్చ నే ♦ త్సార్థవుండు
కవిజనకల్పక ♦ కామధేను వనంగఁ జిరకీర్తి నందె నే ♦ క్షితివరుండు
తే. నట్టి శ్రీసింగనృపతి యే ♦ యన్వయమునఁ
బొడమె నారావువంశాబ్ధి ♦ పూర్ణచంద్రుఁ
గీర్తనీయు శ్రీగోవింద ♦ కృష్ణయాచ
ఘనుని వేంకటగిరినాథుఁ ♦ గనఁగఁ జనితి.
క. చని నేఁ దత్సమ్ముఖమునఁ, జనవరిఁ గోశాధికారి ♦ సన్నుతచరితుఁ
ఘను ధర్మగాడికులజుని, ఘనమతిఁ గల్యాణరావుఁ ♦ గాంచి తెలిపితిన్.
క. విని నాసంగతియంతయు, మన మలరఁగ నతఁడు "పనుపు ♦ మనవిని లేఖన్
జని రాజసమ్ముఖమునకు, మనవి యొనర్చెద న"టంచు ♦ మన్నన సేసెన్.
వ. అంత నేసంతసించి నావచ్చినకార్యంబు సర్వంబు నివేదించుచు మనవిపత్త్ర
ము నంపుకొంటిని. దానిం దిలకించి యనంతమహీకాంతసంతతసంస్తూయ
మానానూనదిగంతవిశ్రాంతాత్యంతనిర్మలనిజయశోవిజిత రజనీకాంతుండును
వేంకటగిరిమహీకాంతుండును నగు నా శ్రీవెలుగోటి. శ్రీగోవిందకృష్ణయా
చేంద్రభూకాంతుండు మది హర్షించి మదీయాభిలాషం బంగీకరించి, మదీయ
గ్రంథముం బరిశీలింప స్వద్వితీయకుమారునిఁ దేజోవిజితకుమారుని ననుపమ
రూపాపహసితమారుని సకలసద్గుణమణినికరపారావారుని శ్రీవేంకటరాజ
గోపాలకృష్ణయాచేంద్రబహదరు వారిని నియోగించుటయు వారు నన్నుఁ బిలి
పించి గ్రంథమును సాంతముగఁ జదివించి విని సంతసించి తమకు నివేదించు
టయు,నంత సంతోషించి పరమాదరంబున నేతద్గ్రంథముద్రణమునకు వలయు
ద్రవ్యం బొసంగిరి. తత్సంపూర్ణసాహాయ్యంబుచే నేనీగ్రంథమును ముద్రించి
లోకంబున వెలయింపఁ గల్గితిని.

ఇట్టిమహోదారుని దివ్యచరితుని మహోదాత్తుని నాగ్రంథము లోకమున
వెలయుటకు ముఖ్యకారకునిఁగఁ బ్రసాదించిన యాయిందుకలాధరుని నచింత్యా
ద్భుతచరిత్రుని నాగురుమూర్తిని శ్రీమేధాదక్షిణామూర్తిని మిక్కిలి స్తుతించుచు
నాగ్రంథమును బ్రశంసించి లోకమున వెలయుటకు ముఖ్యకారకులై నన్నుభయ
విధముల ధన్యుం గావించి నాయుద్దేశము నెఱవేర్చి నాశ్రమము సార్థక మొన
ర్చిన యీవేంకటగిరి సంస్థానాధిపతులగు శ్రీవెలుగోటి. శ్రీకృష్ణయాచేంద్రబహా

దరువారికిని దదీయపుత్త్రపౌత్త్రకళత్త్రసచివప్రముఖనిఖిలప్రకృతివర్గంబునకును నిత్యో
ధితాఖండాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిం బ్రసాదింప భగవంతుని నత్యర్థంబుఁ
బ్రార్థించుచుఁ గృతజ్ఞతాపూర్వకము లగు పెక్కుధన్యవాదముల నొనరించు
చున్నాను.

మఱియు, నాకీవిషయమున ముఖ్యముగాఁ దోడ్పడిన మ-రా-రా శ్రీ ధర్మ
గాడి కల్యాణరావుగారికిని, ముద్రణస్ఖాలిత్యముల నోర్పుమెయిఁ దిద్దుచు మంచి
సూచన లొసంగిన బ్రహ్మశ్రీ కావ్యతీర్థ మద్దులపల్లి. వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రుల
వారికిని, నీగ్రంథమును జక్కఁగ ముద్రితంబు నొనర్చిన వావిళ్ల. రామస్వామి
శాస్త్రులు అండ్ సన్స్ వారికిని గృతజ్ఞతాపురస్సరము లగునమస్కృతంబుల సమర్పించు
చున్నాను.

అందఱికంటెను నేఁ గడుఁగృతజ్ఞతఁ జూపవలసినవారు మఱియిద్దఱు
గలరు. వారు నాకుఁ బరమాప్తమిత్త్రులగు బళ్లారిజిల్లా మోకపురవాస్తవ్యులును
సహజపరోపకారధురీణులును నిరంతరకవితారసాస్వాదనతత్పరులును నగు మ-రా-
రా-శ్రీ, దేశాయి. చంద్రమౌళిగారును, నాకుఁ బ్రియశిష్యుండగు కప్పగల్లు
సంజీవమూర్తిరావును. వీరు నాకుఁ జేసినసాహాయ్య మనిర్వచనీయము. వీరిసాహా
య్యము లేకున్న నేనీగ్రంథమును నిర్వహించియుండననుట యతిశయోక్తి గానే
రదు. ఏ రప్పుడప్పు డాధివ్యాధులచే నే నుత్సాహహీనుండనై డిల్లపడి నిస్పృహుం
డనై యున్నతఱిని మృదుమధురవచోక్తులచే నాకుత్సాహముం గల్పించి నవీన
సత్త్వసామర్థ్యంబు లావేశింపఁజేసి మరల నన్నీ రచనకుం బురికొల్పుచు వచ్చుటయే
వీరు నాకొనర్చిన యనిర్వచనీయసాహాయ్యము. నామనోవృత్తి వీరెఱింగినట్లు
దేవుఁడు సయితము నెఱుంగఁడన వచ్చును. వీరియుత్సాహవాక్యములే నాకు నూఁ
తలై నాచే నీకార్యము నిర్వహింపించినవి. అందు సంజీవమూర్తి నాకుఁ జేదో
డును వాదోడును నై నాయీగ్రంథపద్యముల మృదుమధురకలస్వనంబునఁ జదివి
వినువారివీనులకు విందొనరించునపుడు నే నందు మహానందమునకు మేరలేదు.
ఆనాఁడు నాకుం గలచింతలన్నియు వీడి యత్యుత్సాహము జనింప నిత్యమున
కంటె నెక్కువపద్యములను రచియించువాఁడను. ఈతనివాణి యదెట్టిదో కాని
యాతఁడు చదువ దొరంకొను నేని యెట్టిరసహీనము లైనపద్యములును మహా
రసవంతములై తేనియసోనలు గురియుచుండు. వాచకుని సామర్థ్య మింతప్రశంస
నీయము గావుననే పెద్దన్నగారు,

“నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె, మాత్మ కింపయిన భోజన, ముయ్యెలమంచ, మొప్పు ద
ప్పరయురసజ్ఞు, లూహ తెలియం గలలేఖకపాఠకోత్తముల్
దొరకినఁ గాదె! యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే.”

అని సంగీతము పాడువానికిఁ దాళమృదంగాదియంత్రసాధనములవలెఁ గవికి వాచకునిసాచివ్య మున్నం గాని తత్కవితచిత్తరంజనము సేయ దని భావించి రని తోఁచెడిని. ఇతఁడు నా కొనరించినసాహాయ్య మిది యొక్కండె గాదు. అచ్చుచిత్తుల దిద్దుటయందు మిక్కిలి యోర్పుతో సాయపడి గ్రంథముద్రణము పూర్తి యగువఱకు ముద్రణమునకు వలయువ్యవస్థల నేర్పఱచి చక్కనిముద్రణము సమకూర్చినవాఁడు. ఇతనికిని, నామిత్రులు దేశాయిగారికిని, సమగ్రముగా గ్రంథము నవలోకించి యోరిమిపేరిమి శోధనపత్రమును సిద్ధపఱచి యొసంగినవాఁడును నా కత్యంతప్రియశిష్యుండును సంస్కృతాంధ్రపండితకవియును పుంగనూరు శ్రీ బసవరాజాగారి యాంగ్లపాఠశాలయందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయుఁడును నగు బ్రహ్మశ్రీ. స్థానీకం. సుబ్రహ్మణ్యదీక్షితులకును నేఁ గడుఁగృతజ్ఞుఁడనై సకలాభీష్టప్రదాయకంబు లగునాశీరాసుల నొసంగుచు నవిచ్ఛిన్నాయురారోగ్యైశ్వర్యపుత్రపౌత్రాదిసమృద్ధిని ననుగ్రహింప భగవంతుని వేఁడుకొనుచున్నాఁడను.

“గచ్ఛత స్స్ఖలనం క్వాపి భవత్యేవ న సంశయః” అనునార్యోక్తివడువున ననితరసాధారణమనీషావిశేషు లగుపండితప్రకాండులకె దొసంగులు పొసంగుచుండ నల్పజ్ఞుఁడ నగునావిషయంబున నయ్యవి పొసంగుట యేమి వింత! కావున నిందెందేని నెరసులు వొరసిన సరసు లగుధీరవరులు “గుణదోషౌ బుధో గృహ్ణన్నిందుక్ష్వేడా వివేశ్వరః, శిరసా శ్లాఘతే పూర్వం పరం కణ్ఠే నియచ్ఛతి.” అను సూక్తిని మనమున సంస్మరించుచుఁ గరుణాతరంగితాంతరంగులై వాని నెఱింగించిన శిరసావహించి గైకొని కృతజ్ఞుఁడనై ప్రణతిశతంబుల నొనరించుచుఁ బునర్ముద్రణమున సవరించుకొనఁగలవాఁడను.

ఇట్లు విన్నవించు, సుధీజనవిధేయుఁడు,
చింతలపల్లి. నరసింహశాస్త్రి,
కృతికర్త.

బళ్లారి
12-11-1925.

*

# శ్రీశృంగారకాదంబరియందువచ్చు ప్రధానపాత్రములు.

## పురుషులు.

**శూద్రకుఁడు:**—విదిశాపురాధిపతి, చంద్రాపీడుని యవతారము, శుకకథాశ్రోత.

**కుమారపాలితుఁడు:**—శూద్రకునిమంత్రి.

**జాబాలి:**—ఒకమహర్షి, స్వాశ్రమస్థులకు శుకవృత్తాంతమును జెప్పినవాఁడు.

**హారీతుఁడు:**—శుకమును దెచ్చినవాఁడు, జాబాలిపుత్త్రుఁడు.

**తారాపీడుఁడు.**—కథానాయకుఁ డగుచంద్రాపీడునితండ్రి, ఉజ్జయినీపురరాజు.

**శుకనాసుఁడు:**—తారాపీడునిమంత్రి, వైశంపాయనునితండ్రి.

**చంద్రాపీడుఁడు:**—కథానాయకుఁడు, తారాపీడునికొడుకు, చంద్రునియవతారము, కాదంబరిప్రియుఁడు.

**వైశంపాయనుఁడు:**—శుకనాసునిపుత్త్రుఁడు, చంద్రాపీడునిమిత్త్రుఁడు, పుండరీకునియవతారము, మహాశ్వేతామనోహరుఁడు.

**శ్వేతకేతువు:**—పుండరీకునితండ్రి, ఒకమహర్షి.

**పుండరీకుఁడు:**—శ్వేతకేతువుకొడుకు, వైశంపాయనునిపూర్వజన్మముపేరు.

**కపింజలుఁడు:**—పుండరీకునిమిత్త్రుఁడు, ఇంద్రాయుధ మనునశ్వముయొక్క పూర్వజన్మముపేరు.

**కేయూరకుఁడు:**—కాదంబరీ వీణావాహకుఁడు, నాయికా నాయకుల పరస్పరసందేశహరుఁడు.

**మేఘనాదుఁడు:**—చంద్రాపీడుని ముఖ్యపరిచారకుఁడు.

**చిత్త్రరథుఁడు:**—గంధర్వాధిపతి, కాదంబరితండ్రి.

**హంసుఁడు:**—గంధర్వాధిపతి, మహాశ్వేతతండ్రి.

వీరుగాక త్వరితకుఁడు, క్షీరోదుఁడు, శబరసైన్యాధిపతి, మొదలగువా రప్రధానులు మఱికొందఱు వత్తురు.

## స్త్రీలు.

**చండాలకన్యక:**—లక్ష్మీదేవియవతారము, పుండరీకునితల్లి, చిలుకను శూద్రకమహారాజునకు సమర్పించినది.

**విలాసవతి:**—తారాపీడుని పట్టపుదేవి, కథానాయకుఁ డగుచంద్రాపీడునితల్లి.

**మనోరమ:**—శుకనాసునిభార్య, వైశంపాయనునితల్లి.

**మదిర:**—చిత్త్రరథునిపత్ని, కథానాయికయగు కాదంబరితల్లి.

**గౌరి:**—హంసుని పెండ్లాము, మహాశ్వేతతల్లి.

**మహాశ్వేత:**—వైశంపాయనుని ప్రియురాలు, హంసునికూఁతురు.

**కాదంబరి:**—కథానాయిక, చంద్రాపీడునిభార్య, చిత్త్రరథుని కూఁతురు.

**తరళిక:**—మహాశ్వేతా ప్రియసఖి.

**మదలేఖ, తమాలిక:**—కాదంబరీ ప్రాణసఖులు.

**పత్త్రలేఖ:**—చంద్రాపీడుని ముఖ్యపరిచారిక, కాదంబరీసందేశమును నాయకున కందిచ్చినది.

వీరు గాక మఱికొందఱు స్త్రీలు వత్తురు.

శ్రీరస్తు.

# విషయసూచిక.

## పూర్వభాగము - ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

# విషయసూచిక.

## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

# విషయసూచిక.



## షష్ఠాశ్వాసము.

## ఉత్తరభాగము - ప్రథమాశ్వాసము.



## ద్వి తీ యా శ్వా స ము.



## తృ తీ యా శ్వా స ము.

## చతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# కథాసంగ్రహము.

---

ఒకనాఁడు విదిశాపురాధిపతియగు శూద్రకమహారాజునకు నొకమాలెత సర్వవిషయములు దెలిసినయొకచిలుకను గానుకగా సమర్పించెను. ఆరాజాచిలుకను దానివృత్తాంతమును జెప్పుమని యడుగ నాచిలుక తనవృత్తాంతము నిట్లు చెప్పఁ దొడంగెను.

"వింధ్యాటవియందుఁ బద్మసరోవరముగట్టున నొకగొప్పబూరుగుచెట్టు గలదు. ఆచెట్టునందు ననేకములగుచిలుకలు గూళ్లు కట్టుకొని నివసించుచుండును. నాతండ్రియు నందే యొకజీర్ణకోటరమునఁ గాఁపుర ముండెను. నేను బుట్టిన నాఁడే నాతల్లి పరలోకమున కరిగెను. నాతండ్రికి నే నొక్కఁడనే కుమారుఁడను. నాతండ్రియే నన్నుఁ బోషించుచుండెను. ఇట్లుండ నొకనాఁ డాచెట్టుక్రింది కొక బోయ వచ్చి యాచెట్టెక్కి యందుఁ గలచిలుకల నెల్లఁ బట్టుకొని చంపి క్రిందఁ బడవైచి మే ముండు కోటరముచాయకు వచ్చి నాతండ్రిని సహితము పట్టుకొని చంపి క్రిందఁబడవైచెను. నేను నాతండ్రి ఱెక్కలసందున దాఁగి యుండుటంబట్టి నన్నాతఁడు గనుఁగొనఁ జాలఁడయ్యె. నాతండ్రితోడ నే నొక యెండుటాకుల కుప్పపైఁ బడి యాబోయ చెట్టుదిగి వచ్చులోపల దప్పిచే నీళ్ల నరయుచు నొక సరోవరముచెంతకుఁ బోయితిని. అచ్చటికి స్నానము సేయ వచ్చిన జాబాలి మహర్షిపుత్త్రుఁడు హారీతుఁ డనువాఁడు నన్నుం గాంచి దయగల్గి నీళ్లు ద్రావి సేదఁ దేర్చి తానును స్నానమాడి నన్నుఁ గొని తనయాశ్రమమునకు వచ్చి యనేక మహర్షిజనపరివృతుండై యున్నజాబాలిసమీపమున నన్నుంచెను. ఆజాబాలి నన్నుఁ బూర్వము చూచినవానివలెఁ గాంచి నవ్వి "ఇది స్వాపరాధఫల మనుభవించుచున్నది." అనియెను. అచ్చటి ఋషు లందఱును "నిది యేమి సేసినది? పూర్వజన్మమున నిది యెవరు? దీనివృత్తాంతమును సాంతంబుగా నానతీయవే?" యని యడుగ నాఋషి నావృత్తాంతము నిట్లు చెప్ప నారంభించెను.

"ఉజ్జయినీపురమునఁ దారాపీడుఁ డని యొకరాజు గలఁడు. ఆతనిభార్య విలాసవతి. ఆతనిమంత్రి శుకనాసుఁడు. ఈమంత్రిభార్య మనోరమ. ఆరాజునకుఁ జాలకాలమునకు లేకలేక యొకపుత్త్రుఁడు గలిగెను. మంత్రికిని నొకపుత్త్రుఁడు

గలిగెను. రాజుకొడుకుపేరు చంద్రాపీడుఁడు. మంత్రికొడుకుపేరు వైశంపాయనుఁడు. ఈరాజపుత్ర మంత్రిపుత్రు లిరువురును పెరిగి పెద్దవారై యౌవనవంతులును విద్యావంతులును నైన పదంపడి సమస్తసైన్యపరివృతులై జైత్రయాత్రకుఁ బోయి సమస్తదేశములఁ జయించుకొని స్వపురమునకు వచ్చుచుండ మార్గమధ్యమున నారాజపుత్రునకు నొకకిన్నరమిథున మగపడెను. దానిఁ బట్టుకొన నాతఁడు దానివెంబడిఁ బరుగెత్తెను. సైన్యాధ్యక్షుఁ డగుమంత్రిపుత్రుఁడును సమస్తసైన్యమును వెనుచిక్కెను. రాజపుత్రుఁడు దానివెంబడిఁ బడి పోవుచుండ నామిథునము కైలాసపర్వతశిఖర మెక్కి యెక్కడికో కనఁబడకుండఁబోయెను. అంత నారాజపుత్రుఁడు దానిని బట్టుకొనవలె నన్నప్రయత్నము మాని ప్రతినివృత్తుండై శ్రమముచే దప్పికొని జల మన్వేషించుచు వచ్చివచ్చి యచ్ఛోద మనుసరోవరమును జేరెను. అచ్చట నింద్రాయుధ మనుపేరఁ బరఁగు తనగుఱ్ఱమును దిగి నీళ్లు ద్రావి మేయ విడిచి తానును నాసరస్సున స్నానము సేసి దప్పి దీర్చుకొనివచ్చి తత్తీరంబున నొకచెట్టుక్రిందఁ బరుండి యుండ నాసరోవరమునుత్తరతీరమునుండి యొకయమానుషవీణాగానము వినఁబడెను. ఆయపూర్వగానమున కచ్చెరు వంది దానికిఁ గారణముఁ గనుఁగొనుతలంపున గుఱ్ఱ మెక్కి యాధ్వని వచ్చినదిక్కుఁ బట్టి కొంతదవ్వు పోవ నచ్చట నొకశివాలయము నందొకగంధర్వస్త్రీ పూజావసానంబున వీణవాయించుచు నాభగవంతుని స్తుతించుచుండుట కనఁబడెను. ఆ వీణాగానము వినుచు నారాజపుత్రుఁ డొకస్తంభముమాటున నుండెను. ఆగంధర్వస్త్రీ వీణ వాయించుటఁ జాలించి శివునకుఁ బ్రదక్షిణము సేయుచు రాజపుత్రునిం గాంచి యాతనివృత్తాంతమును సర్వమును నడిగి తెలిసికొని తనయాశ్రమమునకుఁ బిలుచుకొని పోయి యాతిథేయసత్కారముఁ జేసి తానును నాహారమును గొని వచ్చి తనయాశ్రమముముందటి శిలాఫలకము నధిష్ఠించెను. రాజకుమారుఁడును మఱియొకరాతిపైఁ గూర్చుండెను. అంత నారాజపుత్రుండు కొండొకవడి యూరకుండి భక్తివినయంబులు ముప్పిరిగొన నామె కిట్లనియె. "అమ్మా! నిన్నుఁ గన్నదిమొదలు లోకసంగతి యడుగవలయునని నాడెందము కుతూహలాక్రాంతమై యున్నయది. దయచేసి నాప్రార్థన మంగీకరింపుము. నీవెవరు? నీతలిదండ్రు లెవరు? తపం బొనర్ప నేల? పెక్కుసిద్ధాశ్రమము లుండ నీనిర్జరారణ్యమునఁ దపం బొనర్పఁ గారణం బేమి? తెల్పఁ దగునేని దీనిని దెల్పి నను ధన్యుం జేయుము" అన నా గంధర్వపుత్రి మనస్సున మిక్కిలి యుమ్మలించుచుఁ దనవృత్తాంతము నిట్లు చెప్ప మొదలుపెట్టెను.

చిత్రరథుఁడు హంసుఁడు ననునిద్దఱు గంధర్వాధిపతులు గలరు. వీరికి నివాసము హేమకూట మనుపర్వతము. అందు నేను హంసుఁ డనువాని కొమార్తెను. మాతల్లిపేరు గౌరి. నాపేరు మహాశ్వేత. మాతండ్రియింటనే నేను శైశవావస్థఁ గడపితిని. అంత యువతినై యొకనాఁడు వసంతఋతువునందు నాతల్లితోడను నాముఖ్యపరిచారికయగుతరళికతోడను నీయచ్ఛోదసరస్సునకు స్నానమునకై వచ్చితిని. తత్సర స్తీరంబునందలివింతలను జూచుచు విహరించుచు నపూర్వపరిమళము నొకదానిని మూర్కొంటిని. అదెచ్చటనుండి వచ్చినదని యించుక దవ్వరిగి యసమానరూపలావణ్యములు గలయొకఋషికుమారునిఁ గంటిని. అతనిచెవి నొక కుసుమ స్తబక ముండెను. మున్ను వచ్చినపరిమళము దానిదై యుండునని యూహించి యాతనితోడఁ బుష్పములు గోయుచుండిన యతనివయస్యునిఁ గని యతని వృత్తాంతమును జెప్పుమని యడిగితిని. అతఁ డిట్లు చెప్పెను.

"శ్వేతకేతు వనుఋషి యొకఁడు గలఁడు. అతఁ డొకనాఁడు దేవతార్చనకుఁ గమలములు గొనితేర నాకాశగంగకుం జని కమలములఁ గోయుచుండ నందు నిత్యనివాస మొనర్చుచున్న లక్ష్మీదేవి యతనిం గాంచి మోహించి తత్క్షణమే గర్భవతియై యొకపుత్రునిం గనియెను. ఆపుత్రుని శ్వేతకేతువునకు సమర్పించెను. అతఁ డాబాలుని బెంచి పెద్దవానినిఁ జేసి వానికిఁ బుండరీకుఁ డనిపేరు పెట్టి సమస్తవిద్యలను నేర్పెను. అతఁడును నేనును నొకనాఁడు, నందనోద్యానమార్గమున వచ్చుచుండ నందనవనలక్ష్మి మాకడకు వచ్చి యీతనిచెవి నున్నపుష్పమును సమర్పించెను. ఇదిపారిజాతపుష్పము." అనిచెప్పుచుండ నాఋషిపుత్రుఁడు నే నాపుష్పంగూర్చి విశేషముగ నడుగుచుండుటఁ గని యాపుష్ప మంతమనోహరముగ నున్నఁ గైకొను మని తనచెవి నున్నదానినిఁ దీసి నాచెవి నుంచెను. మత్కపోలస్పర్శనముచేఁ బరవశుండై తనచేత నున్నజపమాల క్రిందఁ బడినను నెఱుంగఁ డయ్యె. నే నంతదానిని దీసి కొంటిని. అది సయిత మాఋషిబాలుఁ డెఱుంగఁడు. అప్పుడే మాకన్యోన్య మనురాగ ముద్భవించెను. పిదప మాతల్లి స్నానముచేసి యింటికిఁ బోవ ననుం బిలుచుచున్నదని నాచెలి చెప్పెను. నే నట్టకేలకు నాఋషిపుత్రుని వీడి స్నానమాడ వచ్చితిని. అంత నాతోడిఋషిపుత్రుఁడు కపింజలుఁడు ఆపుండరీకునిచిత్తవిక్షోభమును గాంచి, 'జపమాల జాఱి దిగువఁ బడినను నెఱుంగకున్నావు. దాని నాబాల తీసికొనిపోవుచున్నది. ఏమి నీతెలివి?' యని పరిహసింప నాపుండరీకుఁడు కుపితునట్లు 'నాజపమాల నీయక యెట కేగెద' వని నన్నడుగుటయు, నేను నా యేకావళిని 'ఇదిగో! మీజపమాల' యని యా

తనిచేత నుంచితిని. అతఁడు దానినే తనజపమాలయని యనుకొని తీసికొని యింటి కేగెను. నేనును నింటికి వచ్చితిని. అదిమొదలు మే మిరువురమును బరస్పరవిరహానలతప్తులమై వేగుచుంటిమి. నాతోడనే స్నానమునకు వచ్చినతరళిక మాతోడ రాక యించుక వెనుచిక్కి వచ్చెను. ఆపుండరీకుఁడు దానిచే మద్విరహానలము దుస్సహ మని యొక లేఖ వ్రాసి పనిపెను. దానిం గని మద్విరహానలము ద్విగుణమై మండసాగెను. ఇట్లుండ నొకనాఁడు కపింజలుఁడు నాకడ కరుగుదెంచి తన వయస్యునివియోగాగ్నివిశేషముల వర్ణించి చెప్పి తద్విరహానలబాధ మాన్పి వయస్యుని బ్రతికింపుమని చెప్పి, నే నేమి చెప్పుదునో యని యైనను విచారింపక మాతల్లి ననుఁ జూడవచ్చుసమ్మర్దమునకు వెఱచి వెడలిపోయెను. నేనును దరళికతో నాలోచించి యెవరికిం జెప్పక దానితోడ నానిశీథమధ్యమున నాఋషికుమారుని కడకుఁ బోవఁ బ్రయాణమై పోవుచుండ నొకరోదనధ్వని వినఁబడెను. అదేమక కలగుండు వడుచు నతిరయంబునఁ జని చూడ నాపుండరీకుండు మద్విరహానల దగ్ధుండై విగతజీవుండై పడియుండెను. వానిం గని విదీర్ణహృదయనై చిరము విలపించి సహగమన మొనర్పఁ గడంగి తరళికచేఁ జితి పేర్పించి యందుఁ బడ నుద్యుక్తురాలనై యుండ చంద్రలోకమునుండి యొకదివ్యతేజస్సు వచ్చి పుండరీకుని నెత్తికొనిపోవుచు నన్ను శరీరత్యాగ మొనర్పవలదని యోదార్చి యంతర్ధానమొందెను. ఇదేమని కపింజలుని నడిగితిని. అతఁడును నాసంగతి యేమైనది చెప్పకయ తనచెలికానితోడ నాకసమున కెగిరి పోయెను. అంత నేను నివ్వెఱపడియుండఁ దరళిక దానివాస్తవస్థితి దెలియక యేసాహసము నొనర్పరాదని బోధింప నప్పటి కదియే సముచితం బని యెంచి పునస్సమాగమ మగు నను నిచ్ఛచే నిచ్చటఁ దపం బొనర్చుచున్నదాన నని మహాశ్వేత తనవృత్తాంతమును జెప్పెను.

అంతఁ జంద్రాపీడుఁడు దాను మహాశ్వేత నూఱడించి యుపశాంతచిత్తం గావించి తరళిక యేదని యామె నడిగెను. తరువాత నామహాశ్వేత తనయవస్థం గాంచి చిత్రరథునకును మదిరకును గుమార్తె యగుకాదంబరియు వివాహము మాని యుండ నామెతల్లియుఁ దండ్రియుఁ దనను వచ్చి తత్కుబుద్ధినిమాన్పి వివాహమాడునట్లు చేసి పొమ్మని చెప్పిపుచ్చి రనియు, దానికై తాను బోవ నిష్టములేక తరళికను బంపినా ననియును జెప్పెను. అప్పుడే తరళిక కాదంబరీవీణావాహకుండగుకేయూరకునితోడ వచ్చి కాదంబరీవృత్తాంతమును సర్వమును నివేదించెను. అంత మహాశ్వేత నేనే వచ్చి సర్వమును జక్కఁబఱచెద నని చెప్పి కేయూరకుని బంపి చంద్రాపీడునిం జూచి హేమకూటమును వర్ణించి కాదంబరీసౌశీల్యాదుల

నుగ్గడించి యచటికిఁ దనతోడ రమ్మనియు, మఱునాఁడు వత్తు ననియుఁ జెప్పెను. చంద్రాపీడుఁ డందుల కియ్యకొని యామెతోడ హేమకూటమునకుం జనియెను.

అట్లు చని మహాశ్వేతతోడఁ గన్యాంతఃపురంబుం బ్రవేశించి కాదంబరిని సందర్శించెను. మహాశ్వేత తనకుఁ బ్రణమిల్లి సముచితోపహారంబుల నడుప వచ్చినకాదంబరికిఁ జంద్రాపీడుని నివేదించి తొలుత నాతనిని సత్కరింపు మని చెప్పఁ గాదంబరి యతనిని సముచితవిధిని సత్కరించెను. పిదప మహాశ్వేత నుపచరించెను. అనుక్షణము కాదంబరి చంద్రాపీడునిరూపలావణ్యాదులం గని యతని యందు గాఢానురాగ యయ్యెను. చంద్రాపీడుఁడును నామెయెడ ననురక్తుఁ డాయెను. అంత మహాశ్వేత చంద్రాపీడునకుఁ బ్రమదవనమందలి మణిగృహమును విడిదిగా నేర్పఱుపు మని కాదంబరికిఁ జెప్పి తాను నామెతలిదండ్రులఁ గాంచఁ బోయెను.

కాదంబరియుఁ జంద్రాపీడునిం గాంచ సౌధం బధిరోహించెను. చంద్రాపీడుండు నాప్రమదోద్యానమునఁ దత్తద్రమ్యప్రదేశంబులఁ గనుంగొనుచు వినోదించుచుండెను. అప్పు డాయిరువురకుఁ బరస్పరావలోకనంబులఁ బ్రేమానుబంధంబు దృఢపడి క్రమముగా నభివృద్ధిం గాంచెను. కాదంబరి తనగాఢానురాగంబుం దెల్పుచు మదనలేఖచే నొకముక్తికహారంబుఁ జంద్రాపీడునకుఁ బంపెను. అతఁడును నామె యొనర్చినసత్కారమునకు డెందమున మహానందంబుం బొందెను. కాదంబరి ప్రమదోద్యానవనంబునకు వచ్చి చంద్రాపీడునితో సరససంభాషణంబులఁ గొంత యుబుసు పుచ్చి స్వగృహంబున కేగెను. చంద్రాపీడుఁడును మరలఁ గాదంబరీగృహంబునకు నరిగి మహాశ్వేతసహిత యైనదానిం గాంచి స్వదేశంబున కేగఁ దలంచి మహాశ్వేతను జూచెను. మహాశ్వేత తదభిప్రాయ మెఱింగి యతనిని స్వదేశంబును జేర్పఁ గాదంబరికిం జెప్పెను. కాదంబరి స్వపరిజనంబులఁ దోడిచ్చి యారాజకుమారుని సగౌరవముగా వీడుకొలిపెను. తరువాతఁ జంద్రాపీడుండు పోయినత్రోవనే మహాశ్వేతాశ్రమమున కేతెంచెను. అచ్చటికి స్వసైన్యంబును వైశంపాయనుఁడు పత్రలేఖ మొదలగువారును వచ్చియుండిరి. వారిం గాంచి రాకొమరుఁడు సంతసించి స్వపటకుటీరంబున నుండ, నుజ్జయినినుండి తారాపీడుఁ డతని రమ్మని సందేశహరుని బంపెను. అప్పుడే కాదంబరియు మరల దర్శనం బిచ్చి పోవలయు నని కేయూరకుని ననిపెను. చంద్రాపీడుఁడు తనతండ్రియొద్దనుండి వచ్చిన సందేశహరుని శీఘ్రముగ వెడలి రాఁగల నని చెప్పి పంపి కేయూరకుని తోడఁ గాదంబరిని మరలఁ జూడఁ బోయి యచటఁ బెద్దయుం బ్రొద్దుండి పత్ర

లేఖ నట నుంచఁ గాదంబరి ప్రార్థింపఁ దదిచ్ఛానుసారముగా దానిని మేఘనాదుని తోడ నటనుంచి, మహాశ్వేతాకాదంబరుల వీడ్కొని వెడలి వచ్చి, వైశంపాయనుని సైన్యాధిపతినిఁ గావించి నిదానముగా రమ్మని పరిమితపరివారుండై యధిక రయంబున నుజ్జయినికి వచ్చి తల్లిదండ్రులం గాంచి సుఖంబుండెను. అంతఁ గొన్ని దినములకుఁ గాదంబరియొద్దనుండి మేఘనాదునితోడఁ బత్రలేఖ వచ్చెను. కాదంబరి చెప్పిపంపిన సందేశము నంతయుఁ జెప్పెను. దానిని విని చంద్రాపీడుఁడు కాదంబరిపైఁ జిత్తంబు హత్తించి తద్వియోగమును సైపఁజాలక యెట్లో దినంబులు పుచ్చుచుండఁ గేయూరకుండు వచ్చి కాదంబరీమదనావస్థనంతయు సవిస్తరముగ వివరించి చెప్పి యతఁడు రాకున్నఁ గాదంబరి జీవింప దని చెప్పెను.

చంద్రాపీడుఁడు హేమకూటమునకుఁ బోవ మిష యేదియుఁ జిక్కక యరయుచుండ వైశంపాయనుఁడు దశపురము చెంతకు వచ్చినాఁ డని విని యతని కెదురుగాఁ బోవునెపంబుతోఁ దండ్రియాజ్ఞఁ గొని కాదంబరిం జూడఁ బ్రయాణమయ్యెను. కేయూరకుని, బత్రలేఖను, మేఘనాదుని ముందుగాఁ దాను వైశంపాయనుని జూచి శీఘ్రముగా వచ్చుచున్నానని చెప్పు మని కాదంబరిసమీపమునకుఁ బంపెను. అంతఁ గతిపయప్రయాణంబుల దశపురము చెంత నున్నస్కంధావారమునకు వచ్చి వైశంపాయనుఁ డేఁడీ యని యడుగ నచ్చటిరాజపుత్రులాతఁడచ్ఛోదసరోవరంబునకు స్నానమున కరిగి యందలిరమ్యప్రదేశంబులం గాంచుచుఁ దత్తీరంబున విహరించుచు నందొక్కలతామండపముం గాంచి యందుఁ జొచ్చి విలక్షణునట్లు సికతాతలం బధిష్ఠించి బద్ధలక్ష్యుండై దానిం గాంచుచు నంతసేపునకును లేచి రాక యెవరు పిలిచినను రాక యుండె ననియు, మేము ప్రొద్దు దిరుగువఱకు నుండి భోజనము: జేయు మని వేఁడ నెట్టకేలకు భుజించి తాను రా ననియు, మమ్ములఁ బురంబునకుఁ బోయి మీకీవార్త నెఱింగింపుఁ డనియును జెప్పి రాఁడయ్యెను. మే మట నుండినఁ బ్రయోజనము లేదని తలంచి కొంతసైన్యము నతనికి గాఁపుగా నుంచి మేమిట కరుగుదెంచినార మని చెప్పుటయుఁ, జంద్రాపీడుండు కడు దుఃఖితుండై యేమి సేయుటకును దోఁచక పరిపరివిధముల నాలోచించి యుజ్జయినికిఁ బోయి తల్లిదండ్రుల కీవార్తఁ దెలిపి వైశంపాయనుని దాను బిలుచుకొని రా ననుజ్ఞఁ దీసికొని, యతనియొద్దకుఁ బోయి వానితోడ నక్కడ నుండియే కాదంబరియొద్దకుఁ బోయెదనని యెంచి స్వపురమునకు వచ్చెను అంతకు మున్నీ సమాచారమెట్లో తెలిసి, విలపించుచున్న వైశంపాయనునితల్లిదండ్రులను, స్వజనపరిజనులను నూఱడించి, తనప్రియవయస్యునిఁ గొని రా నాజ్ఞఁ గొని సపరి

హారుండై బయలుదేరి, యచ్ఛోదసరస్సుకడకు వచ్చి వైశంపాయనుఁ డచట లేమికి
విచారించి మహాశ్వేతయాశ్రమమునకుఁ బోయిన సర్వమును దెలియు నని యచ్చ
టికిం బోయెను. మహాశ్వేత తనయాశ్రమమునందలి ఱాతిపైఁ దరళిక యూతగాఁ
గూర్చుండి దుఃఖించుచుండఁ గాంచి కారణముఁ దెలియక యెవరి కేమో యని
కలంగుచుఁ దత్కారణం బామె నడిగెను. ఆమె యిట్లు చెప్పఁ దొడంగెను.

"చంద్రాపీడా! నీవు వచ్చినపదంపడి నేనును హేమకూటమునుండి మరలఁ
దపంబు సేయ నిచటికి వచ్చితిని. నీవలెనుండి యేమో వెతకువానివలె నాయా
శ్రమమందుఁ బరిభ్రమించు చుండిన యొకబ్రాహ్మణయువను గాంచితిని అతఁడు
నాయొద్దకు వచ్చి కాముకజనవాక్యంబు లాడ నే నేమియుఁ బలుకక దేవతార్చ
నకుఁ బువ్వులు గోయ నొండెడ కేగి యతనిని రా నీయవల దని తరళికతోఁ జెప్పి
తిని. అతఁడు దానిమాట వినక వచ్చుచుండెను. ఒకనాఁడు వెన్నెలలోఁ గూర్చుండి
యేమో యాలోచించుకొనుచుండ నాతఁడు మరల నాకడకు వచ్చి ముందుఁ బలి
కినకాముకునిపలుకులు పలికెను. నే వానికిఁ గినిసి యతనిని జిలుకజాతియందుఁ బుట్ట
శపించితిని. తత్క్షణ మాతఁడు మృతుండై నేలఁ గూలెను. గతాసుఁ డవుటఁ గని
యేడ్చునతనిపరిజనంబు లతఁడు నీమిత్రుఁ డగువైశంపాయనుఁ డని చెప్పిరి." అని
మహాశ్వేత చెప్పుడుఁ దోడనే చంద్రాపీడుండును మూర్ఛితుండై దిగువఁ బడెను.
తత్పరిజనంబు విలపించుచుండ నింద్రాయుధ మనునశ్వమును దనతురంగమత్వమును
వీడఁ గోరి కళ్లెముచు లాగుచుండుతఱి నచ్చటికిఁ జంద్రాపీడుఁడు వచ్చు నని పత్ర
లేఖ చెప్ప నతనిని గాంచువేడుకఁ గాదంబరి వచ్చి, మూర్ఛితుండై పడియున్న
చంద్రాపీడునిం గాంచి విలపించు చుండ నాకాశమునుండి యొకదివ్యతేజ మరు
దెంచి మహాశ్వేతంగూర్చి యిట్లనియె. "అమ్మా! నీపుండరీకుండు నాలోకంబున
సుఖంబున్నవాఁడు. మరల నిన్నుఁ గలసికొనును. మత్తేజోమయంబైన చంద్రా
పీడునిశరీరమును నశింపదు. ఈశరీరము నిందే యుంచుకొని పునస్సమాగమ మగు
వఱకుఁ జెడకుండ సంరక్షింపుడు" అనిచెప్పెను ఆమాట విని పత్రలేఖ యింద్రా
యుధము నొడిసి పుచ్చుకొని, దానితోడ నచ్ఛోదమునం బడియెను. అంత కొంత
సేపునకు నాసరోవరమునుండి కపింజలుఁడు లేచివచ్చెను. మహాశ్వేత దొలుత నతని
గుఱుతుపట్టలేక యెట్టకేలకు గుర్తించి పుండరీకునివృత్తాంతము నడుగ నతండు,

"అమ్మా! పుండరీకశరీరమును గొనిపోయినయాదివ్యతేజంబువెంబడి నే
నును బోయితిని ఆతేజంబు చంద్రలోకంబుం జొచ్చి పుండరీకశరీరమును మహో
దయమను సభయం దునిచి నాతో నిట్లనియెను. నేను జంద్రుఁడను. నీమిత్రుఁడు

పుండరీకుఁడు కామపరవశుఁడై నన్ను భూలోకమునఁ బుట్ట శపించెను. నేనును నత
నిని నక్కడనే పుట్ట మరల శపించితిని. అంత నాతనివృత్తాంతమును దెలిసికొని
యతఁడును నేనును ఒక్కచోటనే పుట్టున ట్లనుగ్రహించితిని. శాపదోషముపాయు
వఱకును, నతనిశరీరమునకును నాపద యేదియును గలుగకుండ నుంచుటకై యిచ
టికిఁ గొని వచ్చితిని. మహాశ్వేతను దుఃఖపడకుండ నూఱడించితిని. నీవు పోయి
యీవృత్తాంతమును శ్వేతకేతువునకుఁ జెప్పుము. అని నన్నుఁ బంపించెను. నేను
మిత్రదుఃఖముచే వేగముగఁ బోవుచు మార్గమున వచ్చునొకవైమానికుని జూడక
యొరసికొని దాఁటి చనితిని. అతఁడు నన్నశ్వజాతిం బుట్ట శపించెను. నేను వేఁడు
కొన నతఁడు దయచేసి భూలోకంబున నొకరాజునకు వాహనమవై యుండుమనెను.
చంద్రునితోఁడఁ బుట్టు నామిత్రుఁడు పుండరీకునియొద్ద నుండున ట్లనుగ్రహింపు
మని మరల వేఁడితిని. అతఁడు, 'చంద్రుఁడు తారాపీడునకుఁ గొడుకుగాఁ బుట్టును.
నీమిత్రుఁడు పుండరీకుఁడును దారాపీడునిమంత్రికిం గుమారుఁడుగా జన్మించును.
అప్పు డా రాజపుత్రునికి నీవు వాహనమవు కమ్ము.' అని చెప్పెను. నేనే గుఱ్ఱమనై
చంద్రావతారం బైన చంద్రాపీడుని నింతదూరము కొనితెచ్చితిని. నీచే శపింపఁ
బడినవాఁడు నావయస్యుఁ డగుపుండరీకుఁడు." అనిచెప్పెను. అది విని మహాశ్వేత
మిగులదుఃఖితయై యుండఁ గపింజలుం డామెను నూఱడింప నామె యూఱడిల్లి
యుండెను.

అంతఁ గాదంబరి కపింజలుం గాంచి పత్రలేఖ యేమయ్యె నని యడుగ నతం
డిట్లనియె. "అమ్మా! మీరు చూచు చుండ నే నీటఁ బడితిని. ఆవల నేమయ్యెనో
నే నెఱుఁగను చంద్రాపీడుఁ డెచ్చటఁ బుట్టినదియుఁ, బుండరీకుం డెందు జనించు
నదియుఁ, బత్రలేఖ యెందుఁ బ్రభవ మందినదియు సర్వజ్ఞుఁడైన యాశ్వేతకేతువు
నడిగి తెలిసికొని వచ్చెద" నని చెప్పి యంతర్ధాన మయ్యెను.

అంతఁ గాదంబరి మహాశ్వేతం గాంచి 'యిది యిట్లయ్యె. ఇంక నేఁ జేయ
వలసిన దేమి?' అని యడుగుటయు నమ్మహాశ్వేత యిట్లనియె. "అమ్మా! ఏమి యేల
చేసెదవు? ఈచంద్రాపీడునిశరీరమును బూజించుచుండుము. అదియే నీమనోరథ
మీడేర్చును." అనవుడుఁ గాదంబరి యాచంద్రాపీడునిశరీరమును సముచితస్థల
మున నుంచి పూజించుచు నుపవాస మొనర్చి యతనిప్రక్క నఁగూర్చుండియారాత్రి
గడపెను. మరునాఁ డుదయమున సమున్మీలితం బైన (జీవమును గన్న) చంద్రా
పీడునిదేహముం గాంచి చేతితో నంటి చూచి మదలేఖ కాసంగతిఁ జెప్ప నామె
కపింజలుఁడు చెప్పినమాట సత్య మనియు, శాపవిముక్తి యయ్యె ననియును వచిం

పంగా నిర్భరానందపరవశలై మహాశ్వేతకును రాజపుత్రలోకంబునకును నాసంగతిఁ జెప్పెను. వారందఱును సంతోషభరితస్వాంతులైరి. అందఱును స్నానం బాచరించి యాహారవిధి నడపిరి. కాదంబరి మరలఁ జంద్రాపీడునొద్దఁ గూర్చుండి తచ్చరణంబుల నంకతలంబున వహించి యాశరీరము చెడునది గాదని విశ్వసించి, యావార్త మదలేఖచేతఁ దనతల్లికిని దండ్రికిని జెప్పి పంపెను.

అంత నొక్కనాఁడు తారాపీడునియొద్దనుండి సందేశహరులు చంద్రాపీడునిసమాచారమును దెలిసికొని పోవ వచ్చిరి. వారితోఁ గాదంబరి జరిగినసర్వవృత్తాంతమును జెప్పి, త్వరితకుఁ డనువానిని వారితోడఁ బోయి జరిగినసమాచారము నంతయుఁ జెప్పి రమ్మని యనిపెను. వాఁడు వారితోడఁ బయనమై యుజ్జయినికి వచ్చెను.

ఇట విలాసవతి చంద్రాపీడుఁ డెన్నాళ్లకును రాకుండుటచే శీఘ్రముగా రా మ్రొక్కుకొన్నమ్రొక్కుబడులఁ జెల్లింప నవంతినామనగరదేవతాలయమునకు వచ్చి పూజ సలుపుచుండెను. కొడుకుసమాచారమును దెలిసికొన రాఁ బోయిన సందేశహరులు వచ్చి యేమియుఁ జెప్పక యూరకుంటం గాంచి విలాసవతి విలపింప నారంభించెను. తారాపీడుఁ డావృత్తాంతమును విని యాదేవాలయమునకుఁ బరుగిడుచు వచ్చి, దుఃఖించి త్వరితకుఁడు చెప్ప వాస్తవం బెఱింగి యుపశాంతదుఃఖుండై, శుకనాసుఁడు విలాసవతి మనోరమ మున్నగువారు వెంటరాఁ జంద్రాపీడునిం గాంచ మహాశ్వేతాశ్రమమునకు వచ్చెను. పరస్పరావలోకనమున నందఱు దుఃఖించుచుండఁ దారాపీడుఁ డందఱను నూఱడించి కాదంబరిఁ జంద్రాపీడునిఁ బాయక పరిచర్య సేయ నియోగించి తాను మంత్రులపై రాజ్యమొంచి తపంబు సేయఁ గడంగెను." అని జాబాలి చెప్పి కథవినుచున్న హారీతప్రముఖులఁ జూచి 'యేతత్కథారసాకర్షణంబుచేఁ జాలదూరము వచ్చితి' మని తనయువినీతిచే సురలోకభ్రష్టుండై భూలోకమునందు జనించిన వైశంపాయనుఁడే మహాశ్వేత శపింపఁగా నీచిలుకజన్మంబు నొందె నని చెప్పెను. తక్షణమే నాకుఁ బూర్వజన్మవిషయంబు లన్నియును నవగతంబు లయ్యెను. దేహము మాత్రము మాఱలేదు. ఇట్లవగతపూర్వజన్మసర్వవిషయుండనై జాబాలిం గాంచి యిట్లంటిని. "మహాత్మా! నాప్రియమిత్రునిఁ జంద్రాపీడుని విడిచి నే నొక్కనిముసం బైన నుండఁజాల. అతఁ డిపుడెక్కడనుండునో చెప్పుము. నే నచ్చటికిఁ బోయి వానిచెంత సుఖం బుండెద." అనుటయు, నాజాబాలి "నీకు ఱెక్కలు వచ్చి పోవ సామర్థ్యంబు గలిగినపు డాతనిసమాచార మడుగుము, అపుడు చెప్పెదను' అని చెప్పెను.

అంత హారీతుండు 'మునిజాతి నుండునీతని కీమోహాంధ్య మెట్లు గలిగె? సురలోకంబున నుండువానికి నాయువు స్వల్ప మనుటకు హేతు వేమి?' అని యడుగ నాతనికి జాబాలి యిట్లనియె. వీఁడు స్త్రీవీర్యముచేఁ బుట్టుటంజేసి వీని కిట్టిమోహాంధ్యమును, నల్పాయువును గలిగె ననియు, శాపము దీఱినపిదప దీర్ఘాయువు నందు ననియును జెప్పెను. నేను నతనికి మ్రొక్కి నాకు దీర్ఘాయు వెట్లు గల్గునో తెలుపు మన నతఁ డిది యెట్లు తెలిసికొంటివో యదియు నట్లే తెలిసికొనఁ గలవని చెప్పి ప్రాతఃకాలకరణీయంబులం దీర్ప లేచెను. అతనితోడ నందఱును లేచి స్వస్వకార్యంబుల సల్ప నేగిరి. హారీతుండు నన్నుం గొనిపోయి తన శయ్యకు సమీపమున నొకయుచితస్థలమున నుంచి ప్రాభాతికవిధులం దీర్పఁ జోయెను. నేను నాయప్పటియవస్థం గూర్చి చింతించుచుండ నిద్ర వచ్చి కన్నుమూసితిని. అంత హారీతుండు ససంభ్రమమున నాయొద్దకేతెంచి 'మాతండ్రిదగ్గఱనుండి కపింజలుం డిదె యరుదెంచె' నని చెప్పెను. నే నులికిపడి లేచి కనుదెఱచి చూడఁ గపింజలుం డగపడెను. అంత నతఁడును నేనును గొంత చింతించి మాపూర్వవృత్తముం గూర్చి యతిదీర్ఘసల్లాపం బొనర్చితిమి. అతఁడు నన్నచ్చటనుండి యెందును జనవలదని మాతండ్రి చెప్పి పంపె నని చెప్పి నన్ను నెందును బోనీయక సంరక్షింపవలె నని హారీతున కప్పగించి వియన్మార్గమునఁ జనెను. నాఁడుమొదలు హారీతుఁడే ప్రతిదినము నాకాహారం బొసంగుచుండెను. అంత నాకు ఱెక్కలు వచ్చి యెగిరి పోవ సమర్థుండ నైతిని. అంతట మహాశ్వేతను గాంచ నిచ్ఛ పొడమి యొకనాఁటివఱువాత నాహారార్థంబు పోయిననేను మరల జాబాల్యాశ్రమమునకు రాక యక్కడనుండియే యుత్తరదిక్కునుబట్టి పోవం దొడంగితిని. నడచునలవాటు లేనిదానను గానఁ బ్రయాసపడుచుఁ బోయి పోయి మార్గాయాసం బపనయించుకొన నొకసరస్తీరమునందలి లతామండపముపై వ్రాలి శ్రమమువాపికొని దిగి దానిసైకతస్థలంబున విశ్రమించి యాసరోవరజలంబున దప్పిఁ దీర్చుకొని, యందలి కమలకర్ణికామధుబీజంబుల నాఁకలిం బోకార్చుకొని విశ్రాంతిఁ గాంచి యెండకుఁ బోవం జాలక ప్రొద్దువ్రాలినపదంపడి పోవుద మనుకొని యొకతరుకోటరంబునఁ బరుండి నిద్రించితిని. అంతఁ గొంతసేపునకు మేల్కొని చూడ నొకవలలోఁ దగులుకొని యుంటిని. అతిదీర్ఘకాయుఁ డగు నొకపురుషుఁడు నాయెదుట నిలిచి యుండెను అతనిని, 'నీవెవ్వఁడవు? నన్నేల పట్టి కట్టితివి?' అని యడుగ నతఁడు 'తనయజమానుఁడగు నొకమాతంగునికొమార్తె, నీ విక్కడ నుండుసంగతి నెట్లో తెలిసికొని, నిన్నుఁ బట్టికొని రమ్మన్న వచ్చి పట్టుకొంటిని.' అని చెప్పి, విడువుమని

యెంత ప్రార్థించినను విడువక తనపల్లియకుంగొనిపోయి తనయజమానునికొప్పగి కిచ్చెను. ఆమె నన్నొకపంజరము నందుంచి భోజనవేళకు నాహారపదార్థములను దెచ్చి తినుమని నిర్బంధము చేసెను. నేను జండాలు రొసఁగునాహారముఁ దిన నని మౌనముద్రను వహించియుండ సాంత్వవచనంబులను, దర్జనభర్జనాదుల నిర్బంధముసేయ నాఁకలివెల్లున నెట్టకేని భుజించితిని. మౌనముద్రను మాత్రము మాన నైతిని. అట్లా చండాలకన్యక యొసంగునాహారంబుచేఁ బ్రవర్ధమానుం డనై క్రమమునఁ దారుణ్యమును వహించితిని. ఆవల నొకనాఁడు వేకువను లేచి చూతును గదా! యీకనకపంజరమున నుంటిని. ఆచండాలకన్యక నాయెదుట నిలఁబడియుండెను ఆమాలపల్లియు స్వర్గముగా నుండెను. ఏమిది? యని యాశ్చర్య పడుచు, నాచండాలదారిక నడుగుద మని యుండ, నది నన్ను మీయొద్దకుఁ గొని తెచ్చెను. ఆమె నన్నేల పట్టి తెప్పించెనో, యిట కేల తెచ్చెనో, మీవలె నేనును నెఱుంగను" అనిచిలుక తనవృత్తాంత మంతయుం జెప్పెను. శూద్రకమహారా జాశ్చర్యపడి యాచండాలదారికం బిలిపించి, యవ్వలివృత్తాంత మేమనియడుగ నామె, తానాచిలుకకుఁ దల్లి ననియు, లక్ష్మీదేవియవతార మనియు, నాచిలుక తన ప్రియురాలియొద్దకుఁ బోవఁ బ్రయాణ మగుట నీతనితండ్రి జ్ఞానదృష్టిచే నెఱింగి, యతనికనుతాపమును బుట్టించి, చక్కఁబఱుపు మని నా కాజ్ఞాపింప నేఁ బట్టి తెప్పించి, బంధించితి ననియు, జనసంగతిఁ బాపికొనఁ జండాలత్వమును వహించితి ననియు, శాపముదీఱెఁ గావున మీయిద్దఱకును నొక్కచోటనే నివాసము గలుగ వలయు నని యిచ్చటికిఁ దెచ్చితి ననియు, మీరికనువులవీడి మీనిజరూపంబుల ధరియించి మీప్రియురాండ్రంగూడి సుఖంపుఁ డనియును జెప్పి, స్వస్థానము నకుం జనియెను. శూద్రకమహారాజును జిలుకయును శాపవిముక్తులై (చంద్రా పీడవైశంపాయనులు) స్వస్వరూపమును ధరించి, కాదంబరీమహాశ్వేతలను వివా హమాడి సర్వసుఖంబులం దేలుచుండ, నొక్కనాఁడు కాదంబరి పత్రలేఖ యే మాయె నని చంద్రాపీడుని నడుగ, నాతఁడు అదిరోహిణియనియుఁ దాను భూలో కంబునఁ బుట్టునప్పుడు తనతోడఁగూడ వచ్చి మరలఁ జంద్రలోకంబునకుఁ బోయె ననియు, నచ్చట నీవు దానిని జూడఁ గలవనియును జెప్పి సంతోషపరవశం గావించెను.

ఓం తత్సత్.

---

శ్రీ ర స్తు.

# ప ం డి తా భి ప్రా య ము లు.

మ-రా- శ్రీ, సంస్కృతాంధ్రద్రావిడాంగ్లభాషాకోవిదులును బహుగ్రంథ పరిశోధకులును విద్వత్కవులును నగు నాగపూడి. కుప్పుసామయ్య, బి. ఏ. గారిట్లు వ్రాయుచున్నారు.

బ్రహ్మశ్రీ, చింతలపల్లి. నరసింహశాస్త్రిగారిచే విరచితంబగు శృంగార కాదంబరియను నాంధ్రపద్యకావ్యమునం దక్కడక్కడఁ గొన్నిభాగములు చదివినాఁడను.

'బాణోచ్ఛిష్టం జగత్త్రయ'మ్మను ప్రసిద్ధిఁ గాంచిన సమిద్ధయశుండగు బాణ కవీంద్రునిచే రచింపఁబడి పండితప్రకాండముల కమందానందంబు గావించు కాదంబరియను గీర్వాణభాషాత్మకమగు గద్యరూపహృద్యకావ్యమున కియ్యది పద్యగద్యాత్మికముగా గ్రంథకర్తగారిచే సరసరీతిని నిర్మింపఁబడిన యాంధ్రభాషాప్రతిబింబము. సంస్కృతకావ్యములలోఁ గాదంబరి నానారసోల్లాసభాసురము. సురుచిరభావోదయవిలాస మనోహరము, నానాలంకారకలాపపరిశోభితము, మృదుపదశయ్యాచమత్కారహృదయంగమము, అమరద్రుమకుసుమవిసరకుసుమరసాసారసగంధిసుగంధబంధురమధురవచనరచనాసౌకుమార్యపరితోషితమనీషిప్రపంచము. కావుననే రసజ్ఞులగు సహృదయులు "కాదంబరీ రసజ్ఞేభ్య ఆహారోపి నరోచతే" యని నుడువుదురు. ఇట్టి యుద్గ్రంథరాజంబని పండితమండలిచేఁ బొగడ్తఁ గాంచిన కాదంబరి నాంధ్రీకరింపఁబూనుట కడిందిపని. అయ్యాంధ్రీకరణమునందును గద్యరూపముగాఁ గాక పద్యరూపముగాఁ జేయఁ గడంగుట యంతకుం గడిందిపని. స్వతంత్రముగాఁ గబ్బము వ్రాయుటకంటెను భాషాంతరపరివర్తనముచేసివ్రాయుట కఠంబు దుష్కరంబని స్వానుభవంబున నేనును లెస్స యెఱుంగుదు. సామాన్యగ్రంథములవిషయమే యిట్టులుండఁ గాదంబరింబోని మహాగ్రంథము నాంధ్రీకరించుటయందలి కష్టమింతయ్యని చెప్పవలయునే? ఇట్టి గొప్పకార్యమునకుఁ దలకొని గ్రంథకర్తగారు నిజోద్యమంబును నిపుణతరంబుగా నిర్వహించి జితకాశులై చెలువారుటకే నెంతయు స్వాంతంబున సంతసిల్లెద.

ఇమ్మహాగ్రంథము ప్రాయికముగా మూలానురోధమనియే చెప్పవచ్చు కొన్నిచోటుల మూలగ్రంథస్థవర్ణనముల నుచితభంగుల మార్చుటయుఁ గొన్నిపట్టుల నిర్మూలములగు వానిని యథాసౌకర్యము చేర్చుటయు నిట్టి గొప్పగ్రంథములందు విబుధగణములు దోషములుగాఁ బరిగణింపరు. మూలమునందలి రసపుష్టి

దీనియందుఁ జూపట్టుచున్నదా యనియే పరికింపఁదగు. రసపోషకములగు పట్టులు మూలమున నున్నవానిని భాషాంతరపరివర్తనకర్త యుజ్జగించెనేని యది లోపంబుగా నెన్నందగు. ఏభాషయందు మూలగ్రంథము పరివర్తింపఁబడుచున్నదో తద్భాషోచితశైలి యొప్పారకున్న నదియు గొప్పలోపముగా గ్రహింపఁదగు. ఈ మర్యాదల ననుసరించి యిక్కావ్యంబు నాలోకింప నాచూచినంత కీపరివర్తనము సమంజసముగాఁ గానంబడియెడు. దోషైకదర్శనదక్షులును స్తనశల్యపరీక్షణవిచక్షణులును నగు మహాత్ములకు నెరసులెన్నియేని యుద్ఘాటింపఁదగుం గాని సామాన్యముగా నెల్లవారికి నిక్కావ్యము మనంబులకు ముదంబాపాదింప నోపునని తలంతు.

మొత్తముమీఁద నీమహాకావ్యము సరసమైనదనియుఁ బండితజనాదరణీయమై యలరారుననియు నేఁ దలంతు. దీనిని సాదరంబుగ మన్నించి దీని ముద్రించుటకు వలయు ధనసాహాయ్యంబును నేతత్కవిపుంగవుల కొసంగి లోకంబునఁ బ్రకటింపఁజేసిన విద్వత్సమాదరణశీలురగు శ్రీ వేంకటగిరిప్రభువర్యుల యౌదార్యంబును గవిజనపక్షపాతంబును గరంబు సంస్తవనీయంబులు.

కాదంబరిని బూర్వ మెవరో యొకకవీశ్వరుఁడు తెనుఁగునఁ బద్యకావ్యముగా వ్రాసియున్నట్లు కవిజీవితములోఁ జెప్పఁబడియున్నది. కాని యది యుపలబ్ధము కాదు. నరసింహశాస్త్రిగారీమహాకావ్యమును రచియించి యుచితయశోవిరాజమానులైరి ఆంధ్రలోక మీగ్రంథమును సదయహృదయమై స్వీకరించి కవిగారిని బహూకరించి ధన్యులఁ జేయుఁగాక.

---

బళ్లారి మునిసిపల్ హైస్కూలునందు సంస్కృతపండితులగు బ్రహ్మశ్రీ, కావ్యతీర్థ: రావాడి. వేంకటరామశాస్త్రులవారిట్లు వ్రాయుచున్నారు.

కాదంబరీరసము తన్ను సేవించినవారి నానందపారవశ్యముచే మత్తిల్లి తలయూఁచులాగొనర్చి పండితపామరజనులసమాదరమునకు గుఱియై యుండుట యందఱకును దెలిసినవిషయమే దీనిఁ జదివిచూచినవారలు "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అనియు, "కాదంబరీరసజ్ఞానాం సుధయా కిం ప్రయోజనం" అనియు నేటికిని నుడువుచున్నారు. శ్రీశాస్త్రులవారు భాషాంతరీకరణపద్ధతిని, సందుండు శ్లేషములను, బాగుగ నెఱింగినవారు. కావుననే జాతీయపదపారదలేపనచే వెలయు వీరిశృంగార కాదంబరీముకురమున భట్టబాణునియభిప్రాయమూర్తి చక్కఁగఁ బ్రతిబింబించి గ్రంథకర్తగారిపాండిత్యప్రతిభాదుల వేనోళ్లఁ జాటుచున్నది. ఇట్టి మహాగ్రంథము

నాంధ్రీకరించి యాంధ్రలోకమునకు మహోపకారమొనర్చిన బ్రహ్మశ్రీ, చింతల పల్లి నరసింహశాస్త్రులవారియెడఁ బ్రత్యాంధ్రుఁడును గృతజ్ఞతఁ గలిగియుండిన యథాశక్తి స్వధర్మమును నిర్వహించిన ట్లగును.

---

మ-రా-రా-శ్రీ, పుంగనూరు బసవరాజుగారి హైస్కూలునందుఁ బ్రథా నాంధ్రోపాధ్యాయులును సంస్కృతాంధ్రపండితకవులు నగు స్థానీకం. సుబ్రహ్మణ్య దీక్షితులుగా రిట్లు వ్రాయుచున్నారు.

శ్లో. శ్రీమ చ్చింతలపల్లి సంతతిమహాసింధోస్సుధాదీధితేః
నానాకావ్యవిచక్షణస్య సుమనస్త్రైలింగభాషాకవేః
స్వీయచ్ఛాత్రముఖార్జితాచ్ఛయశస శ్శ్రీపాదయో స్సన్నిధౌ
విజ్ఞప్తిర్మమ శ్రీనృసింహవిదుషో భూయాత్ప్రదేయం ముదే. 1

శా. కనితి న్మోదము మీఱ మీఁదయిన శృంగారంపుఁ గాదంబరిన్
ఘనసవ్యోజ్జ్వలకల్పనోరులహరిన్ గమ్యోక్తిపారంపరిన్
గనదత్యంతమనోహరాంధ్రమృదువాగ్వ్యాఖ్యాతబాణోక్తినా
తనసచ్చాతురిమాధురిమహిమ భూతస్వచ్ఛకాదంబరిన్. 2

సీ. రసికజనాళిమానసరాజికసమాన తోషంబు నొదవించు శ్లేషములును
వీక్షణమాత్రానతక్షణపులకముల్ వెలయించి మించు నుత్ప్రేక్షితములు
సహృదయసముదాయసమ్మోదసంధాన పటువులౌ గంభీరభావములును
మధుమాధురీఝరీమధురవాణీసౌష్ఠవంబులన్ భాసిల్లు వరరసములు

గీ. నమర నలరించు జవరాలి యనువుఁ బోలి
తనరు బాణకృతంబు గాదంబరి యది;
యిది యు మదికట్లు సంతసం బొదవఁ జేయు
మహితభాషాంతరీకృతి మహిమ కతన. 3

క. శిష్టులు జగతిని "బాణో, చ్ఛిష్టం బీలోక" మంచుఁ జెప్పఁగఁ బాణో
త్కృష్టత యింతంతని వి, స్పష్టంబుగ నుడువ నేను వలఁతినె? యార్యా!. 4

ఉ. పండితు లెవ్వరేని యుల బాణకృతిం దెనిగించినట్టు లె
వ్వండును జెప్పఁగా వినము, పండితవర్య! యుదారవాక్సము
ద్దండకవిత్వధోరణిని దానిని నాంధ్రముఁ జేసి మీరు భూ
మండలిఁ గీర్తిఁ బొందితిరి మండనమా నిది యాంధ్రభాషకున్. 5

గీ. బాణకవితఁ గల్గు భావంబులకు నిది
దర్పణం బటంచుఁ దలఁచువాఁడ;
నాంధ్రబాణబిరుదమర్హమౌఁ గాదె! మీ
కింకననుచు మదిని నెంచువాఁడ. 6

క. వాసిగఁ బంచమవస్థా,శ్వాసంబులు దీనఁ జూడ ♦ సహృదయహృదయో
ల్లాసాస్పదము లు; పదములు, భాసురములు మృదుత నందు♦భావంబులునుఁ.
చ. ఒకతఱి ముగ్ధయూచు హృద♦యోత్థితభావ మెఱుంగ నీక యొ
క్కొకతఱి మధ్యయూచు వెల♦యు న్సవిలాసవిచేష్టితాళి నిం
కొకతఱిఁ బ్రౌఢయూచును మ♦హోజ్జ్వలపాటవయుక్తి నివ్విధిం
బ్రకటదశాత్రయంబుఁ గని ♦ రాజిలు మీకవితావధూటియుఁ. 8
శ్లో. శ్రీవీరబసవవిద్యా శాలాయా మాంధ్రపండిత స్సోఽహం
సుబ్రహ్మణ్యసమాహ్వః, ప్రహ్వభావేన సూచయామ్యేవమ్. 9

ARCOT BHIMACHAR. M. A., L. T.,
HEAD MASTER.

MUNICIPAL HIGH SCHOOL,
*Bellary*. 30-8-1925

I had the good fortune to read a few of the printed pages of the "Sringara Kadambari" by Brahma Sri Chintalapalli Narasimha sastrulu, the senior Telugu Pandit of the Municipal High School, Bellary. I know personally that the Pandit has worked at it with great assiduity, so as to make it conform to the original, as much as possible. The simplicity and purity of diction, the remarkable ease in versification and the sweet melody of the easy flowing verse reflect much credit upon the author's accomplishments as a poet. The 'Andhra Sringara Kadambari' is in my humble opinion, an improvement on the Kannada Kadambari by Nagavarma and as near an approximation as possible to the Sanskrit Kadambari. I congratulate the author upon this, his valuable contribution to the modern Andhra Literature.

(Sd) A. BHIMACHAR.

B. K. GURURAJA RAO. B. A., B. L.,
Vakil.

*Bellary.*
25-7-25

This work is a Telugu rendering in verse of that famous Bana's Sanskrit Kadambari, whose wonderful plot and superb diction have ever been a marvel in the Sanskrit world. The author of this Sringara Kadambari, while scrupulously conforming to the original in plot and development of characters, has with utmost success entered into some what elaborate description, wherever necessary to make the imagery more complete and vivid. Its diction and style are full of melody and vigour, though rather high flown and terse in some places. It may be said without any fear of contradiction that it is given to only a very few of the modern poets to venture to translate in verse, works of the standard of Kadambari. I am sure that this work will win the appreciation— nay the admiration of the Andhra literary public. The work is so full of Telugu idioms that it reads more like an original than a translation. The Telugu public will, I am sure receive this work with a sense of gratitude to the author for having enriched the Telugu literature with such a valuable work as this.

(Sd) B. K. GURURAJA RAO

శ్రీ

శ్రీరామ స్సహాయో౽స్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీశృంగారకాదంబరి

## పూ ర్వ భా గ ము.

---

## ప్ర థ మా శ్వా స ము.

---

### ఇష్టదేవతాస్తుతి.

శా. శ్రీగౌరీసములంకృతార్ధతనుఁడై ♦ చెన్నొంది దివ్యాపగా
యోగోద్భాసితమౌళియై యలరి ని♦త్యోత్సాహసంపత్తిస
ద్భోగంబుల్ ప్రకటింప స్వేశ్వరత సం♦పూర్ణత్వముం జిత్సుఖా
భోగాత్ముం డగుదక్షిణాస్యుఁడు మముం♦బ్రోచుం గృపాపూర్ణుఁడై. 1

మ. పతి దేహార్ధ మొసంగి వీడి తనుఁ బో♦వం జాల కేవేళ ద
న్మతియై యర్ధము వాక్కునుం బలెఁ గడున్ ♦ మన్నింప నత్యాదృతిన్
బతివాల్లభ్య మనంగ నిట్టి దనుచున్ ♦ భక్తాళికిం దెల్పు పా
ర్వతి మ మ్మెప్పుడుఁ బ్రోచుఁగాత శుభముల్ ♦ రాజిల్లఁగా సత్కృపన్. 2

చ. గణముల నెల్లఁ దాఁ బ్రథమ♦గణ్యత నందుచు విఘ్నవార్ధిశో
షణచణబాడబం బగుచు ♦ సర్వులు తన్గొనియాడ నాది వా
రణవదనుండు నా భువిని ♦ రాజిలువాఁడు మదంతరాయవా
రణ మొనరించి మత్కృతిని ♦ రాజిలఁ జేయుత నిచ్చ లిద్ధరన్. 3

ఉ. వేదము లుద్ధరించి పృథి♦వీధర మెత్తి క్షితిన్ వహించియున్
బాదుఁ గడల్చి దైత్యవిభుఁ ♦ బంపి బలీంద్రుని గ్రిజగానకున్
త్స్మాదయితాళిఁ దున్మి దశ♦మస్తకుఁ ద్రుంచి హలంబుఁ దాల్చియున్
సాదరుఁ డౌచు మ్లేచ్ఛుల ల♦యం బొనరించిన శౌరిఁ గొల్చెదన్. 4

చ. తనప్రియుఁ డెందు నేతనువుఁ ♦ దాల్చునొ తాను నదాని కర్హమా
తనువును దాల్చి యందుఁ బ్రమ♦దంబునఁ బాయక ప్రీతిఁ బ్రాణనా

ఘనిమది కెక్క వర్తిలుచు ♦ దుర్గతిదూరులఁ జేసి భక్తులన్
దనరెడియాదిలక్ష్మి మము ♦ ధన్యులఁ జేయుత శ్రీలొసంగుతన్. 5

చ. సకలజగంబులం దనదు♦చారుదృగంచలచాలనంబె త
ప్పక సృజియింప వేదములఁ ♦ బాడుచు నాడుచుఁ దమ్మిగద్దె ను
త్సుకత దలిర్ప వాక్సుదతి♦తోఁ గొలువుండి వినోదగోష్ఠి స
ల్పుకమలసూతి మత్కృతిని ♦ బ్రోచుత నారవితారకంబుగాన్. 6

మ. తలఁతున్ వాక్సతి బ్రహ్మవాగ్వసతి శ♦బ్దబ్రహ్మవిద్యాయతిన్
లలితామ్నాయశిరోవిహారమతి లీ♦లాలోలబాలాయుతా
మలవిద్యాధరసిద్ధసాధ్యసురభా♦మాసంతతిన్ ధీమతిన్
కలవీణారవమాధురీమహిమ శృం♦గారింప నాయీకృతిన్. 7

గురుపురస్కృతి.

సీ. నియతాగ్నిహోత్రి నా ♦ నగడి చతుశ్శాస్త్రవేదాంగవేది నా ♦ వేడ్కఁ దనరి
వరవాదభేదన♦పండితుం డన మించి ధర్మమర్మగుఁ డని ♦ దాల్చి యశము
భోగసురేంద్రుఁ డై ♦ పొల్చి యజస్రంబు తులలేనిసంపదఁ ♦ దోఁగి మెలఁగి
సత్యసంధుం డని ♦ సద్యశంబును గాంచి రాజగురుం డను♦నోజ మెఱసి

తే. సప్తకోటిమహామంత్ర♦సరణిఁ దెలిసి
వినుతశిష్యప్రశిష్యుఁ డై ♦ వెలసి కాశ
హస్తిసంస్థానవిద్వత్ప్ర♦శస్తిఁ గాంచి
వెలయుమద్గురు నరసింహ♦విబుధుఁ దలఁతు. 8

క. శతఘంటాన్వయశశి భా, రతభాగవతముల వచన♦రచనల రచియిం
చి తెనుఁగుబాస నుతిఁ గనిన, శ్రుతవేంకటరంగగురుని♦స్తోత్ర మొనర్తున్.

శా. ముష్టిప్రశ్నల నష్టజాతకవిధిన్ ♦ బూర్వాపరప్రక్రియన్
శిష్టుల్ మెచ్చ యశంబు గాంచి విపుల♦శ్రీనంది ప్రీతి న్నిజా
భీష్టార్థంబుల నెల్లఁ దృప్తిఁ గని ని♦ర్భీకప్రవృత్తిన్ మన
స్తుష్టిం గాంచిననాదుతండ్రి మది నెం♦తున్ త్ర్యంబకాఖ్యుం దమిన్. 10

సీ. సాధ్వీమతల్లి నా ♦ సత్కీర్తిఁ గని యొరుల్ వ్రేలు చూపకయుండఁ♦గ్రాలె నెవతె
సంసారసామ్రాజ్య♦సచివుఁడు సతి యనఁ సత్కీర్తిఁ గడియించెఁ♦జాన యెవతె
యిల్లు భూస్వర్గమై ♦ యొసఁగ విందులపాలి యమరమహీజమై♦యలరె నెవతె
చోరాశివారముల్ ♦ చోర కుండ గృహనిధిఁ గాపాడ సద్భట♦కాండ మెవతె

తే. యట్టినాప్రియజనయిత్రి ♦ నఖిలలోక
మానినీమాన్యగుణధాత్రి ♦ మహితగాత్రి
జితనుతాత్రి మహామాని ♦ సతి సుగాత్రిఁ
దులితసావిత్రిఁ బేరమ్మఁ ♦ గొలుతు భక్తి. 11

## ప్రేయసీస్మృతి.

సీ. కలిమిలేముల నొక్క ♦ గతి మెలంగుచు నాకు స్వర్గాభిరుచిమాన్పఁ ♦ జానయొవతె
వలసల గుడిసెల ♦ వసియించి నాతోడఁ బ్రాసాదముల నేవ ♦ పఱచె నెవతె
చాయపోలిక నన్నుఁ ♦ బాయక యేప్రొద్దు నసహాయబుద్ధి నా ♦ కణఁచె నెవతె
నాఁకలిదప్పుల ♦ నారసి కడుపారఁ బెట్టి తల్లిని మఱ ♦ పించె నెవతె
తే. మంత్రిలేఁ డనులోటుఁ దా ♦ మాన్చె నెవతె
దాసి లే దనులోపంబుఁ ♦ దలఁగె నెవతె
యెల్లవెంటలఁ దానయై ♦ యెనసె నెవతె
దాని శ్రీసుబ్బలక్ష్మి నా ♦ తన్విఁ దలఁతు. 12

## సంస్కృతకవినుతి.

ఉ. వేదముల న్నిబద్ధ మయి ♦ వెల్గెడు ఛందము నెవ్వఁ డీభువిన్
బాదుకొనంగఁ జేసి కవి ♦ పాళికి నెల్లను మేలుబంతియై
యాదికవీంద్రుఁ డై తనరె ♦ నట్టిమహాత్ముని రామసత్కథల్
స్వాదుమృదూక్తులన్ గృతిని ♦ సల్పిననాకుభవుం దలంచెదన్. 13

ఉ. స్త్రీలను బ్రహ్మబంధులను ♦ దేవనదీసహజన్ములన్ దయా
శాలి యెవండు వేదముల ♦ సారముఁ దెల్పి సముద్ధరింపఁగాఁ
జాలినభారతత్రయిని ♦ సల్పెనొ పంచమవేదమో యనం
గ్రాలఁగ నట్టివ్యాసముని ♦ రాజుఁ దలంచెద నెమ్మనంబునన్. 14

సీ. కన సార్థనామ మే ♦ కవిసద్వృత్తుఁ డెవండు లేమి ననామిక ♦ భూమిలోన
నలవిక్రమార్కుని ♦ యాస్థాననవరత్నముల నెవం డొక్కఁడై ♦ చెలఁగెఁ దొల్లిఁ
గవిదండితో నేఁడు ♦ వివదించి కాళికిఁ దనకు భేదములేమి ♦ ధాత్రిఁ జాటెఁ
గాంచె నెవ్వఁడు కాళి ♦ కావరంబున నెల్లచదువులఁ జదువక ♦ సన్నుతింప
తే. నలరఁగాఁ జేయు నెవ్వని ♦ లలితకవిత, యన్యదేశీయులను విస్మ ♦ యమున ముంచి
నాట్య మాడించి సురుచిర ♦ నవ్యకళల, నట్టిశ్రీకాళిదాసుని ♦ నభినుతింతు. 15

సీ. బాణునుచ్ఛిష్ట మీ♦వసుధ యెల్ల నటన్న పేరు సార్థముఁ జేసి ♦ మీఱె నేది
యాహార మరుచియై♦యలరఁ జేయును సురపగిది నన్నయశంబుఁ ♦ బడసె నేది
యతులితాపునరుక్త♦వితతవర్ణనములపుట్టినిల్లని పేరుఁ ♦ బొందె నేడి
యద్భుతకల్పనా♦నల్పశిల్పకలాపచారుకథాకేళి♦సదన మేది

తే. యట్టికాదంబరిని నేవం ♦ డభినవార్థ, భావనవరసభరితమై ♦ పరఁగు నట్లు
సలిపెఁ దలఁచినమాత్రానఁ ♦ జారుఫణితి, నట్టిబాణునిఁ దత్పుత్రు♦నభినుతింతు.

ఉ. భారవి మాఘు బిల్హణుని ♦ భట్టికవిన్ భవభూతిఁ జోరునిన్
సారవచోనిగుంభనల ♦ సత్కృతులన్ సురభాష నల్పి యీ
ధారుణిఁ గీర్తికాయమును ♦ దాల్చినసత్కవులం దలంచెదన్
సారవచోవిసారముల ♦ సారెకు నాకు ననుగ్రహింపఁగన్. 17

ఆంధ్రకవిప్రణతి.

మ. తనకుం దాన సముండు లేఁ డొరుఁ డనం ♦ దాఁ దిక్కయజ్వార్యుఁ డె
వ్వనిఁ గొండాడెనొ శబ్దశాసనుఁ డనన్ ♦ భాసిల్లెనో భారతం
బును నాంధ్రం బొనరించి యెవ్వఁ డలరం ♦ బూర్వంబునన్ సత్కవుల్
గన నాద్యాంధ్రకవీంద్రుఁ డన్నయశముల్ ♦ గైమోడ్తు నానన్నయన్. 18

ఉ. భారత మాంధ్రభాష నలు♦వం దగుసత్కవి యెవ్వఁ డన్న నే
నే రచియింతు నన్నయకు ♦ నెక్కుడు గా నని ఘుంఘుమార్భటిన్
సారవచస్సుధారసము ♦ జాలయి పారఁ బదేనుపర్వముల్
సారతరంబు గాఁ దెనుఁగు♦సల్పినతిక్కనఁ గొల్తు నెమ్మదిన్. 19

ఉ. భారతశేష మైనహరి♦వంశముఁ గాననపర్వశేషముం
జారుమృదూక్తులం దెనుఁగు♦సల్పి కవిత్రయమందు నొక్కఁడై
పేరును బెంపుఁ గన్న యెఱ♦ప్రెగ్గడ శంభుపదాబ్జదాసునిం
గూరిమి మీఱఁ గేల్మొగిచి ♦ కొల్తు నభీష్టశుభంబు లొందఁగన్. 20

శా. శ్రీనాథున్ గవిసార్వభౌమబిరుద♦శ్రీనాథు భోగామర
శ్రీనాథున్ నతగోత్రరాజతనుజా♦సీమంతినీనాథు వి
ద్యానాథున్ గవితారసామృతసరి♦న్నాథోడునాథున్ నుతే
లానాథున్ గవినాథుఁ గొల్చెద మదిన్ ♦ శ్లాఘించి తత్సూక్తులన్. 21

చ. తనకవితాకుమారికను ♦ దద్ద ధనంబులు నగ్రహారముల్
గొను మని యిచ్చుభూమిధవ♦కుంజరు లున్నను లేమిఁ గుందుచు

న్నను హరి కిచ్చి రాజులఁ దృ♦ణంబుగ నెంచి యశంబుఁ గన్నయా
యనఘునిఁ బోతనం దలఁతు ♦ నాదృతి భాగవతోత్తమోత్తమున్. 22

వ. తక్కుంగల పురాతనాధునాతనసంస్కృతాంధ్రకవీంద్రులఁ గీర్తించి మదీయే
తాదృశమహోన్నతపదవికిం గారకులును జిన్ననాఁట నాకాంధ్రభాషయం
దభిరుచి పుట్టించి తదీయప్రయోజనం బుగ్గడించి గురువులై దానిం జదివించి
నను నింతవానిఁగఁ జేసిన సంస్కృతాంధ్రసత్కవులును సంస్కృతాంధ్రాం
గ్లేయభాషాకోవిదులును సహజపరోపకారధురీణులును వైదికమార్గనిష్ఠాగరిష్ఠు
లును నగు నాగపూడి కుప్పుస్వామ్యార్యులకుం బ్రణమిల్లి మఱియు నాకు
సంస్కృతవ్యాకరణంబుఁ జెప్పిన మద్గురుపుత్త్రుం డగు శ్రీనివాససుధీంద్రుం
గొండాడి యుపనిషదర్థంబుఁ దెల్పినపండితకవివర్యులును దర్కాలంకారభూషి
తులును నగు వట్టిపల్లి నరకంఠీరవమహాశయులన్ సంస్మరించి నావిద్యార్థదశ
గ్రాసవాసంబులకుం దోడ్పడినవారి కెల్లన్ నమస్కృతు లొనర్చి. 23

తే. బాణతత్పుత్త్రకృతమయి ♦ పరఁగునట్టి
సరసకాదంబరిని దెల్గు ♦ సలుపువాఁడఁ
గలుగకున్నఁ దదర్హాత ♦ గారవంబు
గలుగుటం జేసి తత్కృతి ♦ గాఢముగను. 24

తే. కలుగ దొకభాషఁ గలచమ♦త్కారమొక్క,భాష కని కవిపండిత♦వరుల కెల్ల
శ్రుతిచరం బౌట శ్రీనాథ♦సుకవివరుఁడె, సాక్షి వచియింపఁగా నేల♦సన్నకవుల.

తే. ఎఱుకచాలమి నెందైన♦వఱలు నెరసు
దాని నా నెర సంచును ♦ దజ్ఞకోటి
సుతుల నెరసులపగిదిని ♦ మతినిఁ దలఁచి
మందలింపంగ నొనరింతు ♦ వందనములు. 26

చ. వరమతి త్ర్యంబకాఖ్యునకు ♦ వందితశీలకుఁ బేరమాంబకున్
వరతనయుండఁ జీర్లదినె♦వ్యాసుఁడ మారెలసీమలోపలం
బరశివదక్షిణాస్యపద♦పంకజభక్తుఁడఁ బండితాళికిన్
గరము వినీతుఁడన్ గరణ♦కమ్మను మౌనివసిష్ఠగోత్రుఁడన్. 27

వ. ఇట్లిష్టదేవతాస్తుతియు గురుపురస్కృతియుఁ శ్రేయసీస్మృతియు సంస్కృతాం
ధ్రకవీంద్రప్రణతియుఁ గావించి మదీయాప్తమిత్త్రప్రియశిష్యాభీష్టప్రకారం
బుగా. 28

### షష్ఠ్యంతములు.

క. ఓంకారమందిరునకున్, శంకాతంకాదిరహిత♦శాంతాత్మునకున్
బంకాద్రివజ్రధారకు, సంకలితార్ధేందుమౌళి♦సర్వజ్ఞునకున్. 29

క. నిర్మలనిత్యారూఢా,కర్మునకున్ గలుషఘోర♦గహనదవునకున్
శర్మునకున్ వ్యక్తాఖిల, ధర్మునకున్ విబుధవినుత♦తత్త్వమయునకున్. 30

క. సత్యజ్ఞానానంద,స్తుత్యోన్నతరూపునకును ♦ శుభరూపునకున్
నిత్యునకు యుష్మదస్మ, త్ప్రత్యయగోచరునకు మృతి♦భవదూరునకున్. 31

క. అపవర్గాత్మునకున్ గత, విపదునకున్ స్థావరాది♦విశ్వాత్మునకున్
వ్యపగతమాయాహంకృతి, విపరీతునకున్ విశేష♦విధిరహితునకున్. 32

క. అగుణునకున్ సగుణునకున్, నిగమాగమవినుతగతికి ♦ నిర్వర్ణునకున్
విగతాఖిలదోషునకున్, సగరునకున్ సకలమాని♦సంభరితునకున్. 33

వ. అంకితముగా నభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనరించు శృంగారకాదంబరీ
మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 34

### గ్రంథారంభము-శూద్రకరాజవర్ణనము.

మ. తనయాజ్ఞం దలమోచి కొల్వ నృపసం♦తానంబు లెప్డుం జతు
ర్వనధిక్రాంతధరేశుఁడై యపరసు♦త్రాముండు నా శూద్రకుం
డనుభూభర్త ప్రతాపరాగనిజపా♦దాక్రాంతసామంతభూ
వనితాకాంతుఁడు శంభునోజ విజిత♦ప్రద్యుమ్నుఁడై పొల్చెడున్. 35

సీ. కమలనాభునిమాడ్కిఁ ♦ గరకమలంబుల శంఖచక్రాంకముల్ ♦ సవురుచెలఁగ
గుహుపోల్కి నెందు న♦కుంఠితశక్తియై జలధికై వడి లక్ష్మి♦జనకుఁ డగుచు
రాజీవభవుమాడ్కి ♦ రాజహంసచయంబుఁ గడిమివిమానంబు♦గను నొనర్చి
యమలగంగాప్రవా♦హంబుమాడ్కి భగీరథపథప్రవృత్తిచేఁ ♦ దనరి మిగిలి
తే. ఛాయపతిగతి ప్రతిదిన♦జాయమాన
సముదయాన్వితుఁ డయి మేరు♦శైలమట్లు
సకలభువనోపజీవిప♦చ్ఛాయుఁ డతుల
విస్మయములకుఁ గర్తయై ♦ వెలుఁగు నతఁడు. 36

శా. దానార్ద్రీకృతహస్తుఁడై వెలయు ది♦గ్దంతీంద్రుమాడ్కిన్ సదా
నానాయజ్ఞవిధాయియై కమలజ♦న్మస్థానమై సద్గుణ

స్థానంబై సకలాగమంబులకు నా♦దర్శంబునై యొప్పునా
భూనాథుం డరిభూమకేతువు సము♦ద్భూతత్యద్రి మిత్రాళికిన్. 37

తే. అతఁడు వెండియుఁ గావ్యామృ♦తాగమంబు, నేర్పరులకెల్ల నేర్పరి,♦నలవు రసిక
జనములకునెల్ల, ధానుష్క♦సమితికెల్లఁ,బరఁగునాదేశమగుచు నా♦పార్థివుండు.

చ. అతఁ డాకవిక్రమంబుననె ♦ యాక్రమితాఖిలలోకుఁ డై జగ
త్త్రితయము విక్రమత్రయుత ♦ దీనత నొందఁగఁ జేసినట్టి యా
సితయశు వాసుదేవుని హ♦సించు; నిజాఖ్యన సర్వశాత్రవ
క్షితిపతిహృద్విదారణముఁ ♦ జేసి నృకేసరిరూపుఁ గేరెడున్. 39

తే పూర్వదుష్టక్షితీశుల♦పొందువలనఁ, గలిగినకళంకమును జిర♦కాలలగ్న
మును గడిగికొను చున్నదో ♦ యన వసించె, ధరణివిభులక్ష్మి తత్ఖడ్గ♦ధారవారి.

సీ. వసియించు నాతని♦వాక్కుల భారతి వసియించుఁ జంద్రుండు ♦ వదనమందు
నెలకొనుఁ గనులను ♦ గలుములపడఁతుక నెలకొనుఁబవనుండు ♦ బలమునందు
జెలఁగురూపమునందుఁ ♦ జిల్కతేజీరౌతు చెలఁగును ధర్మువు ♦ చిత్తమందు
నివసించు బుద్ధిని ♦ నిర్జరేశగురుండు నివసించు రవి తదు♦న్నిద్రకాంతి
తే. జముఁడు ధనదుండు కోపప్ర♦సాదములను,ధరణిదేవత భుజమునఁ♦దనరుచుండు
ననుగతాద్భుతవిశ్వరూ♦పావతార, సర్వదేవమయాంభోధి♦శయనుఁ డతఁడు. 41

చ. మదకరికుంభపీఠముల ♦ మార్కొని వ్రయ్య లొనర్చు వేళలం
దదికినముత్యముల్ వెలుఁగు ♦ నాతనిఖడ్గమునందు, ముష్టిచే
నదుముటఁ గ్రక్కుధారసలి♦లామలబిందువు లోయనంగ నిం
పొదవఁగ దాన లాగఁబడి ♦ యుత్సుక యై యభిసారికాగతిన్. 42

చ. పలుమఱు రాజ్యలక్ష్మి యల♦పార్థివునొద్దకు వచ్చు వారణా
వలికటసంతతస్రవద♦పారమదోదకవర్ష దుర్దినం
బుల సమరత్రియామలను ♦ బొల్పగు సద్భటకోట్యురఃకపా
టలసదనేకవర్మనిబి♦డత్విషలందు నెఱుంగకుండఁగన్. 43

తే. హృదయగతు లగుభర్తల♦వదల కట్టె
దహన మొనరింప నెంచె నాఁ ♦ దత్ప్రతాప
వహ్ని, విరహార్తదైవరి♦వనితహృదయ
దహన మొనరించు చెల్లప్డుఁ ♦ దఱుఁగకుండు. 44

చ. అతఁడు సమస్తలోకముల ♦ నాజ్ఞకు లోపడఁ జేసి యేలుచో
రతములయంద కేశముల ♦ గ్రాహ మొనర్చుట, విండ్లనే గుణ
చ్యుతి, చతురంగకేళికల ♦ శూన్యగృహంబులు, దూత సంపుటల్
రతికలహంబులంద, గదః ♦ రాగవిలాసము గానవేళలన్. 45

చ. ధ్వజములయందుఁ గంపములు, ♦ స్వప్నములన్ దగ విప్రలంభముల్
గజములయందు నున్మదవి ♦ కారము, శాస్త్రములందుఁ జింతలున్
ద్విజపతిఖడ్గవర్ష్ములఁ ♦ దీవ్రకళంకము లుండెఁ దద్ధరా
ప్రజలకు దండబంధములు ♦ పాటిలె ఛత్రమునందు సత్కృతిన్. 46

సీ. భంగంబు శుద్ధాంత ♦ భామాలకములందె ముఖరత్వ మందెల ♦ మోమునందె
చాపటంకృతిపుష్ప ♦ చాపచాపమునందె పాణిగ్రహము పెండ్లి ♦ పనులయందె
ఖరకశాఘాతంబు ♦ తురగవ్రజమునందె జాలమార్గము గవా ♦ క్షములయందె
యశ్రుపాత మజస్ర ♦ యజ్ఞధూమములందె భయమాతనికిఁ గనఁ ♦ బరము నందె
తే. యింక దేనను గల్గ దా ♦ యినవరునకు, సకలలక్షణలక్షిత ♦ చక్రవర్తి
సాహసిజనాగ్రవర్తిశ్రీ ♦ చతురమూర్తి, రాజమాత్రుండె శూద్రక ♦ రాజవరుఁడు.

మహాస్రగ్ధర. జలగాహాయాతమాద్య ♦ జ్జయకరిసుదృఢ ♦ స్ఫారకుంభస్థసిందూ
రలసత్సంధ్యాయమాన ♦ ప్రవిమలసలిల ♦ ప్రౌఢకేళీవిలోల
త్కలహంసారావరాజ ♦ త్తటము, సువిచర ♦ త్స్నానమాలవ్యనారీ
లలితోరోజాతఘాతో ♦ ల్లలదసులజలా ♦ హ్లాదసంధాయకంబై. 48

తే. పొలుచు వేత్రవతీనది ♦ యులరఁ జెంతఁ
గలిభయంబున నొక్కచోఁ ♦ గలసినట్టి
కృతయుగం బనఁగాఁ, ద్రిలో ♦ కీప్రసూతి
భవన మన విస్తృతం బయి ♦ పరిఘవిల్లు. 49

క. విదిశాభిధాననగరము, ముద మొనవఁగఁ జేయఁ దనకు ♦ ముఖ్యనగర మై
పొదలుచు ముల్లోకమ్ములఁ, గదనార్జుం డనఁ గ నతఁడు ♦ కడిమిని నేలెన్. 50

మ. విజితాశేషమహీతలుం డగుట నా ♦ పృథ్వీశుఁ డశ్రాంతమున్
భజియింపన్ సకలావనీపతులు శుం ♦ భన్మౌళిమాలానతిన్
నిజపాదాంబురుహద్వయంబు విడి క్షో ♦ ణీభారచింతన్ మదిన్
భుజమందున్ వలయంబుఁ బూనుగతిఁ దాఁ ♦ బూనెన్ ధరామండలిన్. 51

చ. సురగురువున్ మతిం గెలిచి ♦ శోధితసర్వనయప్రపంచులై
పరఁగి కులక్రమాగతులుఁ ♦ బండితవర్యు లలుబ్ధులున్ సదా

కర మనురక్తులై వెలుఁగు ♦ గౌరవపాత్రులు మంత్రిసత్తముల్
నిరతము తన్నుఁ గొల్వ మది♦నెమ్మది మోదపయోధిఁ దేలఁగన్. 52

క. తనప్రతిబింబములో యన, ననయము సింహార్భకముల♦యనువున శౌర్య
కనిధులయినను వినయమునఁ, దనరుచు సమయజ్ఞులైన♦ధాత్రీశసుతుల్. 53

సీ. ఈడుజోడై తన్ను♦వీడక యేప్రొద్దు నగ్రామ్యపరిహాస ♦ మతిశయిల్లఁ
గావ్యనాటకకళా♦ఖ్యాయికాఖ్యానసద్వ్యాఖ్యాననైపుణీ♦ఖ్యాతిఁ గాంచి
కఠినోరుపీవర♦స్కంధోరుదోర్దండమండితాకారను♦మహితు లగుచు
బహువారవిదళిత♦పరభూధవానేకభద్రఘటావీర♦బంధను లయి

తే. సార్వభౌమకులోత్పన్న ♦ సకలశాస్త్ర
పరిచయకఠోరమతివిభా♦సురులు వినయ
పరులు ప్రెగ్గడ లయి కొల్వఁ ♦ బ్రథమవయసు
నందువారలతోఁ గూడి ♦ యాడుచుండు. 54

ఉ. ఆతతసత్వయుక్తుఁడు మ♦హావిజిగీషుఁడు నాట స్త్రైణమున్
బ్రాఁతిఁ దొఱంగి చూచుచుఁ దృ♦ణంబుగఁ జుల్కన మంత్రిసత్తముల్
ప్రీతినిఁ గోరి సంతతిని ♦ వేఁడిన లేఁతవయస్సు గల్గినన్
వీతరతిప్రసంగుఁ డగు ♦ ద్వేషముఁ బూనినయట్లు దానిపై. 55

ఉ. రూపవిలాసనిర్జితమ♦రుత్పైమదల్ వినయాన్వవాయస
ద్భూపసుతల్ మనోహరను♦భూషణభూషితదేహవల్లరీ
ప్రాపితచిత్తతోషణలు ♦ భార్యలు పెక్కురు గల్గినన్ స్ఫుర
ద్రూపుఁ డతం డజస్రము ని♦రుద్ధమనఃపరివృత్తుఁ డై కడున్. 56

సీ. ఒకవేళ మిత్రుల♦యుల్లంబు రంజిల్లఁ జిత్రలేఖనకళా♦చిత్తుఁ డగుచు
నొకతఱి బుధులకు ♦ నుత్సాహ మొదవంగ సత్కావ్యనిర్మాణ♦చతురుఁ డగుచు
నొక్కయప్పుడు సభ్యు♦లుత్సుకులై గొల్వ ముదమార నితిహాస♦ములను వినుచు
నొకతఱి విద్వాంసు ♦ లుల్లసిల్లఁగ శాస్త్రగోష్ఠీవినోదైక♦నిష్ఠుఁ డగుచు

తే. గానగోష్ఠిని డోలాయ♦మానరత్న, వలయఝర్ఝరికాస్ఫాల♦ప్రచలదలఘు
ఝణఝణాత్కారకర్ణభూ♦షావిశేష, మహితుఁడయి మురజాహతి♦మతిఁ జెలంగు.

చ. ఒకసమయంబునన్ గవుల ♦ కుత్సవ మొప్ప సమస్య లిచ్చు చిం
కొకపరి తద్విమర్శనము ♦ నొప్పఁగఁ జేసి బహూకరించుచున్
వికసితవక్త్రుఁడై కవులు ♦ వీనులవిందుగఁ జెప్పునర్థముల్
ప్రకటమనస్కుఁడై వినుచు ♦ భావచమత్కృతి కిచ్చ మెచ్చుచున్. 58

ఉ. కాలముపుచ్చు రేల్పగలు ♦ క్ష్మాపతి యీగతి స్వస్థచిత్తుఁడై
లీలఁ జెలంగఁ జిత్తము మ♦లీమసవృత్తిఁ జొన్ప కెప్పుడున్
దూల విరోధివర్గము వి♦నూత్నవికాసముఁ జెంద లోకముల్
గ్రాల ధరాతలంబు మదిఁ ♦ గౌతుక మొప్పఁగ నేలు చుండఁగన్. 59

ఉ. ఇంచుక పీడి కెంపుజిగి ♦ నింపుజనింపఁగఁ దమ్మి రేకు లిం
చించుక విచ్చి సౌరభముఁ ♦ జిల్కఁగ నల్దెసలందు భానుఁ డే
తెంచుచు నుండ నప్పుడె ♦ దివ్యపదంబున కల్లనల్ల భూ
చంచలలోచనాధవుఁడు ♦ క్ష్మాసతివర్గము వెంటఁ గొల్చి రాన్. 60

తే. కొల్వుకూటంబునకు వచ్చి ♦ కుతుక మెసఁగ
మంత్రిసామంతహితపౌర♦మాన్యు లెల్ల
బలసి కొలువంగ సరససం♦భాషణముల
లీలఁ గొలువుండ ద్వారపా♦లిక దలిర్ప. 61

సీ. సతుల కనర్ఘ్యమా♦శస్త్రిక డాపట వ్రేల భుజగగంధ♦వృత్తముక్రియ
భీషణోజ్జ్వలకాంతిఁ ♦ బెంపారి, యవిరళచందనసితకుచ♦స్థలము చెలఁగ
మజ్జనోన్మజ్జన♦మమతఁ దేలెడునురగజకుంభములఁ బోల్చు ♦ గంగ యనఁగ
రాజులు మూర్తిమ♦ద్రాజాజ్ఞ నాఁ దాల్పఁ దల వతంసప్రతి♦ఫలనఁ దన్నుఁ
తే. బరశురామునిపరశువు♦పగిది సకల,ధరణిపతులను లోఁగొని ♦ తనువుఁ దాల్చి
నట్టిరాజ్యాధిదేవత♦యనఁగ శరద,యట్లు ధవళాంబరముఁదాల్చి♦యరుగుదెంచె.

ఉ. వచ్చి నమస్కరించి నర♦పాలకపూజ్య! సురేంద్రలోకమున్
జొచ్చెదు వేళఁ గ్రుద్ధబల♦సూదనుహుంకృతి నేలఁ బడ్డయా
సచ్చరితాన్వవర్తనుఁ డ♦సాధుత్రిశంకునిరాజ్యలక్ష్మి నా
వచ్చు నొకర్తు పుల్కసను♦వారిజలోచన ప్రాంగణంబునన్. 63

చ. నిలిచి నినుం గనుంగొనెడు♦నెమ్మినిఁ బంజరమందు నొక్కరా
చిలుకను దెచ్చితిన్ జగతిఁ ♦ జెన్నలరారెడురత్నరాశికిన్
జలధియుఁబోలె భాజనము ♦ క్ష్మాపతి! నీవును నీశుకంబు ను
జ్జ్వలమతి యత్యపూర్వ మని ♦ స్వామి! నినుం గన వేచి యుండెడున్. 64

తే. దర్శన మొసంగి జన్మము ♦ ధన్యముగను
జేయు మని వేఁడుచున్నది ♦ క్షితివరేణ్య !
ముదలయే తోడితేర నా ♦ ముదితుఁ డగుచు
రాజులను గాంచి తప్పేమి ♦ ర మ్మను మిట. 65

క. అని యొసఁగ నాజ్ఞ నదియును, జని వేగమ తోడి తెచ్చెఁ ♦ జండాలసతిన్
జనపతిసన్నిధి కప్పుడు, జననాథసమూహ మెల్లఁ ♦ జన విస్మయమున్. 66

ఆస్థానగతశూద్రకరాజవర్ణనము.

చ. పవికి భయంబుఁ జెంది యొక ♦ పట్టునఁ జేరిన గోత్రశైలమ
ధ్యవసతిఁ గన్న మేరువుక్రి ♦ యన్ నరనాథసహస్రమధ్యసీ
మ వివిధభూషణస్థగిత ♦ మాన్యమణిచ్ఛవి మేనఁ బర్వ వా
సవధనురాత్తదిగ్వితతి ♦ శంబరదాగమవాసరంబు నాన్. 67

సీ. తపనీయశృంఖలా ♦ దానితమణిచతుర్దండికామండితో ♦ ద్భాసితంబు
లంబమానస్థూల ♦ లలితముక్తాదామశోభితాంచలకన ♦ త్సురుచిరంబు
గగనేందుకర్పూర ♦ కైరవశరదభ్రపాటీరకలహంస ♦ పాండురంబు
నవనవోజ్జ్వలదచ్ఛ ♦ నాతివిస్తృతచిత్రచీనిచీనాంశుక ♦ చిత్రితంబు
తే. నగువితానంబుక్రింద సు ♦ ధాంశుకాంత
మణిశయన మధిష్ఠించి చా ♦ మరకలాప
మలసగతి వీవ ముఖకాంతిఁ ♦ గెలువఁ గాళ్లఁ
బద్ధచంద్రుండు నా నొప్పు ♦ స్ఫటికవీథి. 68

చ. పదముల నుంచి నీలమణి ♦ బద్ధధరాద్యుతి యుక్తి నమ్రభూ
మిదయితదీర్ఘనిశ్వసన ♦ మేచకితంబులు నాఁగ నల్లనై
పొదలెడుపన్నఖద్యుతులఁ ♦ బొల్చెడువానిని నాసనోల్లస
త్పదమలపద్మరాగమణి ♦ సాంద్రమరీచులఁ బాటలోరుఁ డై. 69

చ. మధువును గైటభుం దునిమి ♦ మానుగఁ దద్రుధిరారుణోరుఁ డౌ
మధుమథనుండు నాఁ దనరు ♦ మాన్యుని రోచనఁ జిత్రితార్జున
చ్ఛదమిథునాంచితాగ్రములఁ ♦ జారుసుధాధవళంబులన్ సదా
విధుతసుచామరశ్వసన ♦ విస్ఫురితంబులఁ దాల్చి క్షౌమముల్. 70

సీ. పరిమళమలయజ ♦ పరిలిప్తధవళవక్షస్స్థితకుంకుమ ♦ స్థాసకమున
నందందు లేయెండ ♦ నంది చెలంగెడు కైలాసశిఖరి నాఁ ♦ గ్రాలువాని
శశిశంక వచ్చిన ♦ సన్మాల నా నొప్పు ముత్యాలసరమొప్పు ♦ మోమువాని
వికసితాంభోజాత ♦ సకలయశం బెల్ల దమియించెడు సులోచ ♦ నములవాని
తే. నతిచపలరాజ్యలక్ష్మిని ♦ నట్టె పట్టి, కట్ట నుంచినలోహశృం ♦ ఖలము లనఁగ
నలరునీలంపుఁ గేయూర ♦ ములను దాల్చి, సంతసంబున నొప్పెడు ♦ క్ష్మాతలేంద్రు.

తే. అష్టమీచంద్రశకలంబు ♦ నవఘళించి, విమలకలధౌతపట్టంబు ♦ విధముఁ దెల్పు
సకలరాజ్యాభిషేచన ♦ సలిలపూత, ఫాల మూర్ధాసనాథంబు ♦ ప్రభలు నింప.

తే. కించిదవనతకర్ణపం ♦ కేరుహంబు, వింత చెలువంబు గడియింప ♦ వేడ్క నింప
మాలతీపుష్పచూడుఁడై ♦ మహితశిఖర, పతితనక్షత్రగణలస ♦ త్పశ్చిమాద్రి.

తే. అనఁగ భూషారుచిపిశంగి ♦ తాంగుఁ డగుచు
హరునినేత్రాగ్ని మే నెల్ల ♦ నలమికొనిన
స్మరుఁ డనఁగఁ దన్ను సేవింప ♦ నరుగుదెంచి
నట్టి యాశాంగనలఁ బోలు ♦ నతివ లెవుడు. 74

తే. బలసి కొలువంగ మణిసభా ♦ స్థలమునందు
బింబితాశేషదేహుఁడై ♦ ప్రేమఁ దన్ను
ధరణి హృత్సీమఁ దాల్చిన ♦ సరణి తోఁప
సరససంభాషణంబుల ♦ సల్పువాని. 75

సీ. సకలానుభోగ్యయై ♦ సామాన్య గాని రాజ్యరమచే నాశ్లిష్టుఁ ♦ డైనవాని
బహుజనవేష్టిత ♦ పార్శ్వుఁడయ్యును నెప్డు నద్వితీయుం డయి ♦ యలరువాని
నగణితగజరథ ♦ హయసాధనుండయ్యు నసిసహాయుం డయి ♦ యడరువాని
నొకదేశమున నుండి ♦ యొనరంగ సర్వభూవలయంబు నేలెడు ♦ వలనువాని

తే. సతత మాసనగతుఁ డయ్యుఁ ♦ జాప మందె
యుండి సకలారికాష్ఠముల్ ♦ మండఁ జేసి
యుజ్జ్వలత్ప్రతాపాగ్ని యై ♦ యొప్పువాని
ననఘుఁ డయ్యును నురుదోషుఁ ♦ డైనవాని. 76

వ. వెండియు. 77

సీ. అతిదీర్ఘనయనుఁ డై ♦ యలరియు నతిసూక్ష్మదర్శనుం డయి యెప్డు ♦ తనరువాని
నతిశుద్ధమానసుం ♦ డయ్యును నేప్రొద్దు కృష్ణచరిత్రుఁ డై ♦ కెరలువానిఁ
గోపస్వభావుఁ డై ♦ కొమరారియుఁ గళత్రవల్లభుం డయి లీల ♦ వఱలువానిఁ
గరవిహీనుం డయ్యుఁ ♦ గరగతాశేషభూవలయుఁ డై ప్రభుతచేఁ ♦ బరఁగువాని

తే. ననవరతదానశాలియై ♦ యమదుఁ డగుచుఁ
బొలుచువానిని నాస్థాన ♦ భూమి గతుని
దూరమున నిల్చి యొక్కింత ♦ తొలఁగి మ్రోలఁ
గాంచె మాలెత శూద్రక ♦ క్ష్మాతలేంద్రు. 78

చ. కనుఁగొని రత్నకంకణము ♦ ఘల్లని మ్రోవఁగ వేణుదండముం
గొని సభకుట్టిమస్థలినిఁ ♦ గొట్టెను గట్టిగ రాజు లెల్ల నా
ధ్వని విని యొక్కపెట్టున నృ♦పాలుని మాని తదాననంబుపైఁ
బరపిరి దృష్టు లెల్ల గజ♦వారము తాళరవంబునం బలెన్. 79

వ. అంత. 80

చండాలకన్యావర్ణనము.

సీ. వయసు చెల్లుటఁ జేసి♦పలితమస్తమువాఁడు గడు నెఱ్ఱనగు నపాం♦గములవాఁడు
సాము చేయుట నెప్డు ♦ సడలియుఁ బ్రాయంబు సడలని మెయిలావు♦సౌరువాఁడు
నంది చండాలత్వ ♦ మతినృశంసాకృతి గా కార్యవేషంబు ♦ గలుగువాఁడు
ధవళాంశుకము పరి♦ధానంబుగాఁ గల్గి యదియె పైవల్లెగా ♦ నమరువాఁడు
తే. పురుషుఁ డొక్కఁడు ముందుగాఁ ♦ బోవుచుండఁ
గనకమయ మయ్యు లోఁ గీర♦కాంతివలన
మరకతమయంబు నా నొప్పు ♦ మహితపంజ
రంబు గొని యొకబాలుండు ♦ రాఁగ వెంట. 81

ఆ. నీలకంచుకంబు ♦ నీటుగా మీఁగాళ్లఁ, జాఱఁ దొడిగి పైనఁ ♦ జారురక్త
వసన మొప్పఁ బఱిత♦వాసగాంతాతప, మేచకోత్పలవని ♦ మీఱి నగడి. 82

చ. ఒకచెవి దంతపత్త్రపుస♦ముజ్జ్వలకాంతులఁ జెక్కుటద్దముల్
ప్రకటవశీకృతంబు లయి ♦ భాసిల నెక్కు డుడువ్రజేశ్వరా
ప్రకలితయామినీముఖము♦చాడ్పునఁ బొల్చుచు నిందుశేఖరా
నుకృతమతిం గిరాతి యయి ♦ నూత్నవికాసము గొల్పుగౌరి నాన్. 83

మ. సతతోరస్థ్సలవాససంక్రమితకం♦జాతాయతాక్షాంగక
ద్యుతినీలాయితలక్ష్మినాఁ గుపితకం♦తుద్వేషిసందహ్యమా
నతనూసంభవధూమనీలరతి నా ♦ నారాము నాఁ గంటికిన్
దతభీతిం గని పారు సూర్యసుత నాఁ ♦ దళ్కొత్తుచున్ వెండియున్. 84

తే. అపుడె మహిషాసురునిఁ ఖంపి ♦ యతనిరక్త
సిక్తపాదాంబుజాత యై ♦ చెలఁగు గౌరి
యనఁగ లాక్షారసాక్తప♦దంబుజాత
యగుచుఁ గడువింత కాంతుల ♦ నవని మెఱయ. 85

క. ఎఱ్ఱనగు వ్రేళ్ల కాంతుల, నెఱ్ఱనినఖకిరణములను ♦ నిల నడుగు లిడన్
ఎఱ్ఱనగు నంచుఁ జిగురులఁ, జెఱ్ఱుగఁ బఱచిన విధంబుఁ ♦ జేయుచు మిగులన్.

సీ. పై కెగఁ బ్రాఁకెడు ♦ పచ్చలమంజీరమణిమయూఖావళి ♦ మయినిఁ బర్వ
రూపంబుపై మరుల్ ♦ దీపింపఁగా బ్రహ్మ నప్రమాణునిఁగాఁగ ♦ నవఘటింప
జాతిని శోధింప ♦ జాతవేదుఁడు బిగ్గఁ గౌఁగిలించినగతిఁ ♦ గ్రాలఁ జేయు
నూఁగారుతీఁగకు ♦ బాగారఁ దీర్చిన యాలవాలం బన ♦ నతిశయిల్ల
తే. మదనగజమూర్ధ నక్షత్ర ♦ మాల యనఁగ
నలరు మొలనూలు కటిసీమ ♦ నమరఁ దాల్చి
స్థూలముక్తాఫలంబులఁ ♦ గ్రాలుహార
మఱుత ప్రేలాడఁగాఁ గడు ♦ నలసగతిని. 87

సీ. అరయ శరద్వేళ ♦ యటు వికసితసితకంజాతలోచన; ♦ కమలభాతిఁ
గరగతాంభోజాత; ♦ క్రమ్రువర్షర్తువుగతి ఘనకేశాళి; ♦ గహనభూమి
కరణి నక్షత్రరూప; ♦ కాననాంభోజినీవడువున మాతంగ ♦ పరిగతయును
నమరభామినిమాడ్కి ♦ నకులీన; నిద్దురవలె లోచనగ్రాహ ♦ వర్ణనీయ
తే. చిత్రగతగతి దర్శన ♦ సిద్ధిమాత్ర
ఫలద; మధుమాసకుసుమంబు ♦ భాతి జాతి
రహిత; స్మరచాప మన ముష్టి ♦ రహి నణంగు
మధ్య మూర్ఛగతిని జిత్త ♦ మాథినియును. 88

వ. మఱియు. 89

ఉ. జక్కులతేనిలక్ష్మిగతిఁ ♦ జారుతరాలక భాసమానయున్
జక్కఁదనంబు నష్టపుడె ♦ సంజనితం బగుప్రాయ మింపుసొం
పెక్కఁగఁ జేయ స్పర్శసుఖ ♦ హీనయు నట్టు లమూర్తచాడ్పునన్
జక్కలమాల నా శ్రవణ ♦ శోభితభూషణ మై చెలంగుచున్. 90
ఆ. మలయగిరినితంబ ♦ మర్యాదఁ జందన, పల్లవావతంస ♦ ముల్లసిల్ల
నరుగుదెంచి మ్రోల ♦ నణఁకువ దోఁపంగ, నిలిచినట్టిమాల ♦ నెలఁతఁ గాంచి.

చండాలకన్యకం గని విస్మితుండగు శూద్రకునిస్వగతచింత.

చ. మనమున విస్మయంబుఁ గని ♦ క్ష్మాపతి యిట్లను బ్రహ్మసృష్టి కే
మనుదు నసర్హ మైనస్థల ♦ మందు నొనర్చె విచిత్రసృష్టి దీ
నిని నసమానరూపజిత ♦ నిర్జరభామసహస్రఁ గాఁగ స
ర్జనము నొనర్చి నీచకుల ♦ జాతనుగా నొనరించె నక్కటా. 92
ఉ. అంటిన దోష మంచు మది ♦ నంటినభీతిని ధాత చేతితో
నంటక చేసెఁ గాక మఱి ♦ యంటిన నిట్టియనూనకాంతి మై

నుంట ఘుటిల్లునే కరస♦మున్మథితావయవంబు లివ్విధం
బుంట యెఱుంగ మెన్నఁడును ♦ నుర్వి నపూర్వ మి దంచు నెంచెదన్. 93

ఉ. ఏమని మాఱువాఁడ విధి ♦ నిట్టియనర్హవిధిప్రవర్తకున్
భామిని దీని రూపజిత♦పంచశరాంగనఁ గాఁగఁ జేసియున్
భూమిని హీనజాతిగను ♦ బుట్టఁగఁ జేసె; మనోజ్ఞ యయ్యు సు
త్రామవిరోధిలక్ష్మిగతిఁ ♦ దా సురతోచిత గాక పోయెఁ గా. 94

క. అని యీగతి బహుభంగుల, మనమునఁ జింతించుచుండ ♦ మనుజేశ్వరుఁ డా
వనిత కడు భక్తి మ్రొక్కె, శ్రవణభూషణపల్లవంబు ♦ వ్రాల నృపునకున్. 95

తే. మ్రొక్కి మణికుట్టిమంబుపై ♦ ముదలఁ గాంచి
వినయ మలరారఁ గూర్చుండ ♦ విహగమును
బంజరముతోడఁ గైకొని ♦ పజ్జ కరిగి
పురుషుఁ డతఁ డిట్టు లనియె నృ♦పుంగవునకు. 96

### శుకవర్ణనము-తత్సమర్పణము.

ఉ. దేవర! యీవిహంగమము ♦ దివ్యవిహంగము చెప్పనేటికిన్
భూవర! సర్వశాస్త్రములు ♦ పుణ్యకథల్ సకలేతిహాసనా
నావిధకావ్యముల్ బహుళ♦నాటకముల్ శ్రుతిగీతసంగతుల్
భూవలయంబునం గల య♦పూర్వము లెల్ల నెఱుంగు లెస్సఁగన్. 97

వ. మఱియు. 98

సీ. పరిహాససల్లాప♦పరిపాటిఁ దెలియును వీణామృదంగాది♦విధ మెఱుంగు
ప్రణయప్రకోపిత♦భామినీసాంత్వనచారుతరోపాయ♦సరణి నేర్చు
చిత్రకళాపూర్వ♦చిత్రవైఖరి మేటి నృత్తప్రయోగవి♦నీతజగతి
స్త్రీపుంసలక్షణ♦శీలనసంవేది హస్త్యశ్వశాస్త్రజ్ఞ ♦ మఖిలవేది
తే. సకలభూతలరత్న మీ♦శుకవరేణ్య
మనని నిద్ది వైశంపాయ♦నాఖ్యఁ బరఁగఁ
బాత్రమవు రత్నముల కెల్లఁ ♦ బార్థ నీవ
యనుచుఁ గొనితెచ్చె మాస్వామి ♦ యాత్మజాత. 99

క. కైకొనుము దీని మదిఁ గృపఁ, గైకొని మాజన్మ మింకఁ ♦ గైకొన ఫలమున్
నీ కొడఁగూర్చు ముదంబును, నీకీ డవ్వాఁడు దీని ♦ నేర్పు గన భువిన్. 100

క. అని రాజుమ్రోలఁ బంజర,మును నిడి యతఁ డరుగఁ జిలుక♦ముదమున రాజుం
గని యభిముఖమై కుడిపద,మును నెత్తి విజయ మనుచు న♦పూర్వస్ఫూర్తిన్.

క. భవదరివనితాకుచయుగ, మవిరతబాష్పముల స్నాన ♦ మాడి హృదయశో
కవిభావసుచింతను నిల్చి విముక్తాహార మగుచుఁ ♦ జెలఁగెడు వ్రతి నాన్. 102

సీ. అనిరుక్తపద్య మా♦యండజంబు పఠింప నది విని భూపతి ♦ మదినిఁ జెలఁగి
విస్మయావిష్టుఁ డై ♦ పీడి చేష్టలు మ్రానుపడి యొకింతకుఁ దేరి ♦ పజ్జ నున్న
మహితాసనాసీను ♦ మాన్యు బృహస్పతివలె నయశాస్త్రాబ్ధి♦పారదృశ్వు
నఖిలమంత్రులలోన♦నగ్రగణ్యుఁ గుమారపాలితాఖ్యామాత్యుఁ ♦ బరమహితుని
తే. నగ్రజన్మునిఁ గనుఁగొని ♦ యనియె నిట్లు
విన్నవారలె మీర లీ♦విహగరత్న
మెంతస్పష్టముగాఁ బఠి♦యించెఁ బద్య
మేమి మధురిమ సరి దీని ♦ కెందు లేదు. 103

సీ. వర్ణముల్ సాంకర్య♦వర్జితంబులుగాఁగఁ బ్రవిభాగకలనచేఁ ♦ బ్రౌఢిగలిగి
వత్తులు పొల్లులు ♦ హత్తించి యర్థంబు వ్యక్త మయ్యెడుభంగి ♦ వ్యక్తముగను
రసభావములు మ్రోల♦రాజిల్లు విధమునఁ బరఁగ రసోచిత♦భావ మలర
రనసముజ్జ్వలరాగ♦రమణీయ మై యొప్పు శ్రుతిమిళితం బయి ♦ సొబగు నింప
తే. మదికి హర్షంబుఁ బెంపఁ ద♦న్మమత పెంపఁ
బలికె నీచిల్క చక్కర ♦ లొలుక వింత
తొలుక యే మని చెప్పుదు ♦ నిలను నిట్టి
యద్భుతము చూడ నిది కడు ♦ నద్భుతంబు. 104

శా. నానాజాతివిహంగమంబుల భువిన్ ♦ నానాప్రకారంబులన్
గానన్ లేదొ యెఱుంగ మిట్టిఖగమున్ ♦ గానంగ రా దిట్టివి
జ్ఞానం బేఖగజాతికిన్; మిగుల నా♦శ్చర్యంబు, తిర్యక్కునున్
జ్ఞానంబుం గనినట్టిమానవుక్రియన్ ♦ జాతుర్యముం జూపెడున్. 105

క. ననుఁ గని దక్షిణపాదమ్మును నెత్తుచు విజయశబ్ద♦మును వచియించెన్
మన ముప్పొంగఁగఁ బద్యమ్మును జదివెను మృదులఫణితి ♦ ముద్దులు కురియన్.

తే. తఱుచు పక్షులుఁ బశువులు ♦ నెఱుఁగ వేమి
నిద్ర భయమును నాహార ♦ నిధువనములు
మాత్ర మేకాని మహిని వి♦చిత్ర మరయ
ననుచుఁ బృథ్వీశుఁ డనుటయు ♦ నాప్తమంత్రి. 107

క. చిఱునవ్వు నవ్వి నరపతి, వరునకు నిట్లనియె నృపతి♦వర్య! యెఱుఁగవో
ధరశారికాశుకాదులు, పరులు వచించినది యెల్లఁ ♦ బల్కు నటంచున్. 108

ఆ. పూర్వజన్మమునను ♦ బొందినసంస్కార,ముననో, మనుజయత్న♦ముననో, దీని
కిట్టిచతురత లభి♦యించె నృపోత్తమ!, చిత్ర మేమి యిందుఁ♦జెప్పుము సుమ.

వ. వెండియుఁ దొల్లి మనుజులకుం బోలె వీనికిని యతివిస్పష్టం బగువాక్ప్రౌఢిమ కలదు. అగ్నిశాపంబున శుకంబులకు సపరిస్ఫుటాలాపతయు సామజంబులకు జిహ్వాపరిభ్రమణంబును సంప్రాప్తం బయ్యె. అట్టిసంస్కారవిశేషం బెద్దియేని నుండ నోపు నని యనుచుండ లోకబాంధవుం డంబరమధ్యం బధిరోహించుటయు మధ్యాహ్నశంఖధ్వానంబులు పటుపటహనాదంబులు మిన్నుముట్టి చెలంగె. 110

తే. దాని నాలించి రాజును ♦ స్నానమాడ
సమయ మయ్యె నటంచును ♦ సకలనృపుల
వీడ్కో లిచ్చి యనిపి తా ♦ వేడ్కమీఱఁ
గొలువు చాలించి లేచెను ♦ జెలువు మిగుల. 111

తే. ఓలగమునుండి లేవ నా♦యుర్వరేశుఁ, డేమి చెప్పుదు నాకొలు♦వెల్ల క్షుభిత
మయ్యెఁ; గోలాహలారావ♦మన్నిదెసలఁ, జెలఁగెఁ బెల్లుగసందడి♦కలిగెమిగుల.

నృపోత్థానసమయసంరంభవర్ణనము.

సీ. చలితాంగదాగ్రసం♦సక్తంబులై పాటితంబులౌ చీనిచీ♦నాం
నాక్షేపమున డోల ♦ ననుకరించుచుఁ గంఠసీమఁ దూఁగ
నంసదేశంబున ♦ నలరుకుంకుమపటవాసపింజరితది♦గ
సగము వ్రేలాడెడు ♦ శ్రవణోత్పలంబులు ముద్దు
తే. నఱుత నుజ్జూఁత లూఁగెడు ♦ హారములును
మాలతీశేఖరోత్పత♦న్మధులిహములు
వెలయ సహామహమిక మ్రొక్క
మన్నుతేఁడులసందడి ♦ యొన్నఁ

వ. వెండియు వికచారవిందమకరంద
పాండురచ్ఛదంబులని నాదంబుల
లగుభుజాదండంబులఁ జామరఁ
చామరగ్రాహిణులరమణీయము
రించు వారముంచ యానలఘునజః
మాలికలనివదంబులచేతను, గ

పానఫలకంబుల ధవళితంబులఁ గావించుగృహవాపీకలహంసలకోలాహలంబుల చేతను, రసనారత్నరసితంబుల నాలించి కంచుమ్రోఁగువిధంబున ఖణేల్లుఖణేల్లు మని తారతరవిరావంబుఁ గావించుగృహసారసంబులకూజితంబులచేతను, సర భసగతిం జనుసామంతభూకాంతానీకంబులచరణతలాభిఘాతంబయి భూమిని క్రక్కదలించెడునా నిర్ఘాతంబుభంగి గంభీరంబుగ నిర్ఘోషించు నాస్థానమండప ధ్వానంబుచేతను, సారెసారెకు సంభ్రమంబున జనంబుల సముత్సారితులఁ జేయుచుం బ్రాసాదనికుంజపుంజంబులు ప్రతిధ్వను లీన నుచ్చైచ్చరుచ్చారయతా మాలోకయతాలోకయతయని గట్టిగ నఱచుప్రతీహారీవేత్రహస్తులయాలోకన శబ్దంబులచేతను, జూడామణులు చలింపఁ దత్తరంబున నుత్తమాంగంబుల నవన తంబులఁ గావించి ప్రణామంబులఁ గావించురాజులయమలమణిశిలాకాంచిత కిరీటకోటిసంఘట్టితం బయినమణికుట్టిమనిస్వనంబునను, బ్రణామముఁ గావించి లేచుతఱి జాఱి యతికఠినమణికుట్టిమంబుపైఁ బడి ఝణఝణాత్కారంబు చేయుమణికర్ణపూరంబులయులివునను, జయ జీవ యని మృదుమధురగతి గానం బు సేయువందిమాగధులమంగళగీతకలకలంబునను, బ్రయాతజనచరణతలాభి ·తభయంబునఁ గుసుమవిసరంబుల విడిచి పైకెగయు మిళిందబృందంబుల ·ెం పెనుసందడిని, నతిత్వరితగతిం బఱచు నవనీపతులకేయూరాగ్రం ·ంచురత్నమాలికావిరాజితంబు లగుమణిస్తంభంబులసంరావం ·డపంబు చంద్రోదయసమయసముజ్జృంభితమహార్ణవంబు ·ు బయ్యె నట్టియెడ. 114

·మాఁపి కొనఁగ ♦ మరలిచియును దాం
· శుకముఁ గొంచుఁ ♦ దరలుమని వడిఁ. 115

·ొంద అొలసి ♦ నడవఁగ సకలా
వసకరుని♦క్రేణి దలిర్పఁ. 116

·మావనికిని ♦ గుతుకం బొప్పం
డఁ గొంత♦తడ వట వేడ్కఁ.117

·టలంబునందు వ
·ాతిఁ జంద్రుపై
·్రమాతిరే
·వారమో యనఁ. 118

ఉ. సాము నొనర్చి కొంతవడి ♦ క్ష్మాపతివర్యుఁడు స్నానమాడఁ ద
ద్భూమికి నేగుదెంచెఁ గడుఁ ♦ దొందరఁ బర్వులు వారి కింకర
స్తోమము స్నానవస్తువులఁ ♦ దోయములన్ సమకూర్ప, మార్గముల్
స్వామి! యిదే యటంచుఁ దమి ♦ భక్తిని దెల్పఁగ వేత్రహస్తులున్. 119

శూద్రకరాజస్నానవర్ణనము.

సీ. వితతసితోల్లోచ♦విభ్రాజితంబును స్ఫాటికోన్నతపీఠ♦భాసితంబు
గాంగేయగంధోద♦కద్రోణివిలసితమధ్యంబు మణిగణ♦మండితంబు
నభ్యంజనోచితా♦భ్యంచితతైలాదికంబు సువాసనా♦గర్భితంబు
బహువిధాంభోయంత్ర♦పరిగతంబు సుశిక్షితాభ్యంజనక్రియా♦ధ్యాసితంబు
తే. సురభిగంధోదపూరిత♦పరిమళావ
కృష్టమధుకరనికరావ♦కీర్ణనీల
కర్పటావకుంఠితముఖ♦ఘనవితర్క
జనకకలశంబు స్నానవే♦శ్మంబుఁ జొచ్చె. 120

తే. వారవనితలు తలయంట ♦ సారగంధ, బంధురామలకంబునఁ ♦ బార్థివుండు
చొచ్చి గంధోదకద్రోణి ♦ నిచ్చలిట, జలవిహారంబుఁ గావించె ♦ లలితగతిని.

క. జలకలశంబులు గైకొని, జలజాస్యలు కొంద ఱపుడు ♦ జనపతితోడన్
జలకంబు లాడ నేగిరి, సలలితముగఁ దొడవు లూడ్చి ♦ స్తనపరికరులై. 122

ఉ. కమ్మలఁ దీసివైచి యల♦కంబులఁ గర్ణములంట దిద్ది వ
స్త్రమ్మున బిగ్గఁ గట్టె లలి♦త స్తనయుగ్మము; పైకిఁ ద్రోసికొం
చిమ్ముగఁ గంకణంబులను ♦ నిందునిభాస్యలు వచ్చి రంత వే
గమ్మునఁ జెంబులం గొనుచు ♦ క్ష్మాపతితోడుత స్నానమాడఁగన్. 123

ఉ. వారలతోడఁ గూడి నృప♦వర్యుఁ డవారణలీల నెంతకుం
దీరని ప్రీతిఁ దత్సలిల♦దివ్యకటాహమునందుఁ జొచ్చి నా
నారచనల్ చెలంగ వన♦నాగము వోలెఁ గరేణుకాళితో
వారివిహారముల్ సలిపి ♦ వచ్చెను స్ఫాటికపీఠ కర్తతిన్. 124

క. మరకతకలశగభస్తులు, పరఁగ మెయిన్ శ్యామలాంగ♦భామలు రూపుల్
బెరసిన పద్మను లన భూ, వరు నభిషేకించి రెలమిఁ ♦ బత్రపుటములన్. 125

క. కరకలితరజతకలశలు, వరతనువులు గొంద ఱపుడు ♦ పరిపూర్ణనిశా
కరనిర్గతసుజ్యోత్స్నా, ఝరమునఁ దత్స్నానవిధిని ♦ సల్పిరి రేల్మాన్. 126

క. కలశోత్క్షేపశ్రమమునఁ, గలిగినస్వేదమున నార్ద్ర♦గాత్రులు గొందఱ్
జలకము లార్చిరి స్ఫాటిక, కలశంబులఁ దీర్థవారి ♦ క్ష్మాపతి కంతన్. 127

క. చందనరసమిశ్రాంబులఁ, గొందఱు జలజాతముఖులు ♦ క్షోణీపతికిన్
గ్రందుగ మలయాద్రిసరి, ద్బృందముగతిఁ దీర్చి రధిక♦ప్రీతి జలకమున్.

చ. కలశము లెత్తి పార్శ్వములఁ ♦ గ్రాలఁగఁ జేతులు సన్నఖద్యుతుల్
దొలకఁగ వ్రేళ్లసందులను ♦ దోరముగాఁగఁ దొరంగువారిధా
రల జలయంత్రదేవతల♦రాణ చెలంగఁగఁ గొంద ఱమ్మహీ
తలవిభు జల్కమార్చిరి ని♦తాంతముదం బెసలార నంతలోన్. 129

చ. భువనము లెల్ల బూరటిల ♦ భూరితరధ్వని స్నానశంఖముల్
చెవుల నగల్చుచుం జెలఁగెఁ ♦ జేష్టలు వీడఁగ దిగ్గజేంద్రముల్
ప్రవిహతఝల్లరీపటహ♦భాంకృతివేణుమృదంగవల్లకీ
రవములతోడ భోరున ధ♦రారమణుండు కృతాభిషేకుఁ డై. 130

తే. భుజగనిర్మోకపరిలఘు♦పూతవసన
ములను ధరియించి ధవళజీ♦మూతశకల
శుచిదుకూలమ్ముఁ దలఁ జుట్టి ♦ రుచిరగతిని
వార్చి సూర్యున కర్ఘ్యంబుఁ ♦ గూర్చె భక్తి. 131

తే. దేవగృహమున కరుదెంచి ♦ దేవదేవు
శివునిఁ బూజించి యగ్ని న♦ర్చించి నిష్ఠఁ
జన విలేపనభూమికి ♦ క్ష్మావిభుండు
మిత్రు లరుదేర వెంట న♦మేయసరణి. 132

తే. ఝుమ్ముఝుమ్మని మధుపబృం♦దమ్ము లొలసి
క్రమ్ము వాసనగలపచ్చ♦కప్పురమ్ము
కమ్మకస్తురి కేసరి ♦ కలిపినట్టి
చందన మలందె మెయినిండ ♦ క్ష్మావరుండు. 133

తే. మాలతీపువ్వుదామంబు ♦ గ్రాల శిఖను
వస్త్రపరివర్తనము చేసి ♦ వజ్రకర్ణ
పూరమాత్రైకభూషణ♦భూషితాంగుఁ
డగుచు భోజనశాలకు ♦ నరుగుదెంచె. 134

తే. పంక్తిఁ గుదువంగఁ దగుధరా♦పతులఁ గూడి
యారగించెను నలరుచు ♦ నత్యపూర్వ
షడ్రసోపేత మాహార♦సమితి నృపతి
సముచితాలాపసుఖరసా♦స్వాద మొప్ప. 135

వ. అంత నాభూకాంతుండు ధూపధూమవర్తిం బరివీతంబుఁ గావించి ప్రక్షాళిత కరకమలుం డయి తమ్మలంబుం జేకొని యామణికుట్టిమంబు డాసి తత్తరంబునఁ బరువెత్తికొనివచ్చి ప్రతిహారి కై దండ యొసఁగ నభ్యంతరసంచారంబు నకుం దగినపరిజనం బనుగమింపఁ జట్టును స్ఫటికంపుగోడలు వెట్టినభంగి నతి ధవళజవనికానికాయంబుచేఁ బరిగతపర్యంతంబై యతిపరిమళమృగనాభిమిళిత చందనోదకంబున నతిశిశిరంబును విమల మణికుట్టిమం బనుగగనంబున విరా జిల్లుతారాగణంబు నా నొప్పు నవిరళపుష్పోపహారంబుచే సముద్భాసితంబును, సాక్షాత్కరించిన గృహదేవత లన సాలభంజికానివహంబు దనర చందనసలిల క్షాళితంబులయి వెలుఁగువెండికంబమ్ములచే విరాజితంబును, నతిబహుళకాలా గరుధూపధూపితంబును, నిశ్శేషముగ వర్షించుటం జేసి యతిధవళం బగు జల ధరశకలంబు ననుకరించుకుసుమవాసనావాసితం బయినప్రచ్ఛదపటంబును, దలాఁపినిఁ బట్టుదిండ్లును, మణిమయంబు లగు ప్రతిపాదుకలపైఁ బ్రతిష్ఠితంబు లయిన కోళ్లును, బ్రక్కన రత్నపాదపీఠంబును గలిగి చలిమలశిలాఫలకంబుం బోనిశయనంబుచే సనాథీకృతంబును నగుమణివితర్దికచే నతిరమ్యం బగు నాస్థానంబుఁ జొచ్చి యందు. 136

చ. అసిలత నంకమం దునిచి ♦ జ్యాస్థలి భక్తిని గూరుచుండి ఫు
ల్లసరసిజాభహస్తముల ♦ లాలితభంగిఁ బదంబు లొత్తఁగా
నసిధర, సెజ్జఁ బండి నృపుఁ ♦ డాసమయంబున దర్శనీయమి
త్రసచివమేదినీపతులు ♦ దగ్గఱి యిష్టకథావినోదముల్. 137

చ. సలుపుచు నుండ ఖడ్గధర♦చాయఁ గనుంగొని లోని కేగి యా
చిలుకను వేగ తె మ్మతని♦చిత్రకథల్ విన వేడు కయ్యెడుఁ
మలగొనునద్భుతంబు మది ♦ మానిని! యున్న మహాప్రసాద మం
చలఘుగతిన్ శిరంబునఁ ద♦దాజ్ఞ వహించి యొనర్చెఁ దద్విధిన్. 188

వ. అంత. 189

ద్వారపాలిక రాజునొద్దకుఁ జిలుకం దెచ్చుట.

ఉ. బంగరువేత్ర మూఁతఁగొని ♦ పల్కులు దొట్రిలఁ దెల్లకంచుకం
బంగమునిండఁ దాల్చి విన♦తాంగముతోడ విహంగజాతిప్రీ
తిం గలహంసవృద్ధముగ♦తిన్ బడి కంచుకి మెల్ల మెల్ల రా
గం గొని తెచ్చె ఖడ్గధర ♦ క్ష్మాపతియొద్దకు నల్లకీరమున్. 140

చ. కరములు భూమిపై నునిచి ♦ కంచుకి మ్రొక్కి వినీతి నిట్లనున్
వరగుణ! విన్నవించెదరు ♦ పట్టపురాణులు నీదునాజ్ఞ దే
వర! జలకంబు లాడి కడు♦పార భుజించెను నీశుకంబు ని
ర్భరమతిఁ దోడి తెచ్చె నిట ♦ ద్వార్థ్స యటంచు నృపాలశేఖరా!. 141

క. అని విన్నవించి యాతఁడు, చన నరపతి కౌతుకంబు ♦ సందడిగొలుపన్
మనమున, వైశంపాయనుఁ, గనుఁగొని యిట్లనియె నధిక♦గౌరవ మొప్పన్. 142

తే. ఆరగించితె యభిమతా♦హారసమితి
నంతిపురమున నని విభుం ♦ డడుగుటయును
వినయ మలరార నాశుకం ♦ బనియె నిట్టు
లారగించితి సర్వంబు ♦ నడుగ నేల?. 143

సీ. మత్తకోకిలనేత్ర♦మంజులచ్ఛవినీలపాటలజాంబవ♦ఫలరసంబు
హరిభిన్నకరికుంభ♦వరరక్తముక్తాభరాజత్సుదాడిమీ♦బీజములను
నాళీకదళహారి♦న్నవ్యద్రాక్షాఫలమధురచిరంతనా♦మలకములను
దత్తజాంబూనద♦దర్పవిమర్దనపక్వహారిద్రామ్ర♦ఫలచయంబుఁ
తే. గ్రోలితిని మెసవితిఁ దింటిఁ ♦ గూర్మి యొసఁగఁ
బట్టమహిషీగణంబె తాఁ ♦ బెట్ట దేవ!
పల్కు లిఁకఁ జెప్ప నేల యో♦పార్థివేంద్ర!
సర్వ మమృతంబు, లే దెందు ♦ సందియంబు. 144

శూద్రకుండు శుకమును దానివృత్తాంతముఁ జెప్పుమని యడుగుట.

చ. అని వచియించుచుండ నచ♦లాధిపుఁ డిట్లను నోశుకంబ! నే
వినవలతున్ భవత్కథల; ♦ వేడుక పుట్టెడు; నాదుకౌతుకం
బణఁపవె సర్వముం దెలిపి; ♦ యాత్మకథాసుధ వెల్లిగొల్పి; నీ
జననమునన్ బవిత్రతను ♦ సన్నుతిఁ గాంచిన దేశ మెద్దియో. 145

ఉ. ఎవ్వఁడు పేరు పెట్టె?; మఱి ♦ యెవ్వఁడు తండ్రియుఁ? దల్లి యెవ్వరో?
యెవ్విధి వచ్చె వేదములు?; ♦ నెట్టు పఠించితి శాస్త్రజాల? మీ
వెవ్వనిచే గ్రహించితివి ♦ యిన్నికళల్?; తొలిబాముకీర్తిరో?
యెవ్వరదాన? వెంతవయ? ♦ నెచ్చట నుంటివి తొల్లి చెప్పవే. 146

తే. ఎట్టు లీపంజరంబునఁ ♦ బట్టువడితి?
వెట్టు చండాలవాటిక ♦ మెట్టినావు?
ఏల వచ్చితి విచటికి? ♦ నెఱుఁగఁ జెపుమ
సైఁపఁజాలను హర్షంబు ♦ సమ్ముఖంబ!. 147

క. అని సాదరసంభావన, ఘనతరసంభాషణముల ♦ క్ష్మాకాంతుఁడు దాఁ
దను నడిగిన వైశంపా, యనుఁ డించుక ధ్యాన మూని ♦ యనియెను బ్రీతిన్.

మాలిని. సకలభువనపాలా! ♦ సంభృతాస్థ్యేకమాలా!
వికలితకరిలీలా! ♦ విశ్వరక్షైకశీలా!
సుకవివనజహేళీ! ♦ శోభితానంతకేళీ!
ప్రకటితశశిమాళీ! ♦ పాణిరాజత్త్రిశూలీ!. 149

గద్యము. ఇది శ్రీమేధాదక్షిణామూర్తిమంత్రోపాసనాలబ్ధసరసకవిత్వవైభవ చిం
తలపల్లివంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియ
తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతంబయిన శ్రీశృంగారకాదం
బరి యనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీ

శ్రీరామ స్సహాయో౽స్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగారకాదంబరి

## పూర్వభాగము.

---

## ద్వితీయాశ్వాసము.

---



శ్రీగిరిజాపరిరంభణ
భోగైకనిధాన విపులపుణ్యవిధానా!
వాగీశవినుతచరణా!
నాగేంద్రాభరణ! దీననతజనశరణా! 1

వ. దేవా! దయాయత్తమతి నవధరింపుము. అవ్వలి కథావృత్తాంతంబు చెప్పెద. అంత నాశూద్రకధరాకాంతుం గాంచి యాశుకం బిట్లనియె. 2

శుకకథాప్రారంభము. వింధ్యాటవీవర్ణనము.

క. దేవ! కడుఁ బెద్ద దీకథ, భావింపఁగ నొక్కనాఁటఁ బల్కఁగ వశమే?
భూవర! వేడుక పొడమినఁ, బోవఁగనీ కెందు మదినిఁ బొల్పుగ వినుమా. 3

సీ. పరఁగు నెయ్యది పూర్వపశ్చిమాంభోరాశితటవనలగ్నమై ధరణి నెపుడుఁ
బొదలు నెయ్యది కరిమదవారివర్ధితబహువిధభూరుహబహుళ మగుచు
నలరు నెయ్యది మదకలకురరసమాజదృశ్యమానమరీచదళము నగుచుఁ
బొలుచు నెయ్యది కరికలభసంమృదితతమాలపల్లవగంధజాల మగుచు

తే. వెలయు నెయ్యది యిలకు మేఖల యనంగ
దివ్యభూషణమై మధ్యదేశమునకు
సకలసత్వంబులకు సమాశ్రయము నగుచు
నట్టి వింధ్యాటవి నుతింప నౌనె నాకు. 4

ఉ. ఆకస మంటువృక్షముల♦యగ్రములన్ విలసిల్లుఁ దారకా
నీకముభంగి ఫుల్లసిత♦నిత్యసముజ్జ్వలపుష్పజాల; మ
స్తోకమనోజ్ఞమద్యమద♦శోభితరక్తవినూత్నకేరళీ
లోకకపోలదీప్తిని వె♦లుంగుఁ గిసాలయజాల మచ్చటన్. 5

సీ. శుకకులదళితోరు♦శోభితదాడిమీఫలరసార్ద్రీకృత♦స్థలయుతములుఁ
చపలవానరకుల♦చాలితతక్కోలపతితపల్లవఫల♦ప్లావితములుఁ
కేసరకురవక♦కేతకీనారికేరకృతోల్లసత్ప్రాంత♦రాజితములుఁ
బథికజనవ్రాత♦పరికల్పితలవంగపల్లవప్రస్తరో♦ద్భాసితములు
తే. నవ్యతాంబూలవల్లరీ♦నద్ధపూగ
ఖండమండితవల్లరీ♦మండపములు
వనరమావాసభవనంబు ♦ లనఁగ నొప్పు
వేనవే లందు మున మతి♦వేల మందు. 6

క. మదగజకపోలనిస్సృత, మదజలసిక్తం బనంగ ♦ మదగంధిల మై
పొదలును నేలాలతికా, సదమలవన మంధకార♦సంగత మగుచున్. 7

వ. అందు. 8

క. నఖరాగ్రలగ్నముక్తా, నిఖిలంబున కాశఁ జెంది ♦ నిచ్చలు శబరుల్
సుఖముగ యమరాణ్ణగరీ, ముఖమున కనుపుదురు సింహ♦ముల వేవేలన్. 9

సీ. సమవర్తినగరంబు♦చాడ్పున నెప్పుడు మృత్యుఘోరలులాయ♦మిళిత మరయ
యుద్ధసన్నద్ధమై ♦ యొప్పువాహినిమాడ్కి వాజిసింహారావ♦భాసితంబు
కాత్యాయనీదేవి♦కరణిఁ జలత్ఖడ్గభీషణచందన♦భూషితంబు
కడఁగి కర్ణిసుత♦కథమాడ్కి విపులభూధరశశసంగతి ♦ సురుచిరంబు
ఆ. ప్రళయసమయసంధ్య♦పగిదిఁ బల్లవరుచి, నృత్తనీలకంఠ♦విత్త మగుచు
నమృతమథనకాల ♦ మట్లు శ్రీద్రుమశోభి, తంబు వారుణీగ♦తంబు మఱియు.

శా. ప్రావృట్కాలవిధంబునం బొలుచు న♦భ్రశ్యామలంబై; కురం
గావాసంబును ఋక్షసంగతముఁ జం♦ద్రాంగంబు మాడ్కిన్ సదా;
భావింపన్ గజయూథపాలితము శుం♦భద్రాజ్యలక్ష్మీగతిన్
దేవా! చామరవాలవీజనములన్ ♦ దేదీప్యమానంబునున్. 11

తే. చెప్ప వశ మౌనె యాకాన♦చెలువ మెల్ల
స్థాణుసంగత మగజాత♦చందమునను

మృగపతినిషేవితంబును; ♦ మేదినీశ
యట్టులు ప్రసూతకుశలవం ♦ బవనినాథ!. 12

తే. చానపోలిక మృగమద♦చందనోరు, పరిమళవిరాజితంబును ♦ సురుచిరాగ
రుతిలకవిభూషితంబును; ♦ నతివిరహిణి, విధిని బల్లవపవనసు♦వీజితంబు. 13

తే. బాలకునికంఠముగతి శా♦ర్దూలనఖర
పంక్తిచేఁ గ్రాలు గండకా♦భరణములను;
బానభూమివిధంబునఁ ♦ బరిఢవిల్లుఁ
బ్రకటమధుకోశశతములఁ ♦ బ్రసవములను. 14

సీ. ప్రళయకాలముభంగిఁ♦బరఁగును నొకచోటఁ బోత్రిసముత్ఖాత♦భూమియగుచు
దశముఖపురమునాఁ ♦ దనరు నొక్కెడఁ గపికలితోన్నతరమ్య♦సాల మగుచు
నున్మత్తవిధమున ♦ నొప్పును నొకచాయఁ బరభృత్ప్రలాపమై ♦ పరిఢవిలుచు
సమరాంగణముమాడ్కిఁ♦జక్కనా నొకచోట శరశతనిచితమై♦సొరుఁ గనుచు

తే. నచిరనిర్వృత్తపరిణయ♦జ్ఞస్థలంబు
పగిది సమిధలఁ బువ్వులఁ ♦ బత్త్రములను
గుశములఁ జెలంగి యొకచోటఁ ♦ గొమరుమీఱుఁ
గృష్ణతను వనఁ దాపింఛ♦కృష్ణ మగుచు. 15

వ. వెండియు నమ్మహారణ్యం బొకచోట నింద్రునిశరీరంబువిధంబున నేత్రసహస్రం
బులు గలిగియు, నొకచోట విధవఁబోలెఁ దాళపత్త్రంబులు లేకయు, మఱి
యొకచోట నర్జునునిరథపతాకంబుచందంబున వానరాక్రాంతంబై, యొక్క
చాయ విరాటనగరంబుక్రియఁ గీచకాక్రాంతంబయి, యొకక్రేవ రాజగృహాంగణం
బుపగిది వేత్రలతాశతంబును దుష్ప్రవేశంబునై, యొకప్రదేశంబున నాకాశంబు
గతి వ్యాధానుగమ్యమానతరలతారకమృగగణంబులచేఁ దనరియు, నొకచోట
వ్రతంబుఁ దాల్చినవడువున దర్భచీరవల్కలంబులు ధరించియు, ననేకపత్త్రం
బులు గలిగి సప్తపర్ణంబులచే వెలుంగుచుఁ, గ్రూరజంతువులం గలదయ్యు
మునిజనసేవితంబయి, పుష్పవతియయ్యు నతిపవిత్రంబై వెలయునట్టి వింధ్యాటవి
యందు దండకారణ్యంబు నడుమ. 16

## అగస్త్యాశ్రమవర్ణనము.

సీ. సురపతి వేఁడినఁ ♦ బరిపీత మొనరించె సకలాబ్ధిజలములఁ ♦ జతురుఁ డెవ్వఁడు
కడుపుఁజిచ్చున వ్రేల్చి ♦ ఘనుని వాతాపిని దగ్ధునిఁ గావించె ♦ ధన్యుఁ డెవ్వఁడు

దివినుండి యహంకృతిఁ♦దిగఁ ద్రోసిన నహుషునిఁ బ్రకటించెద నప్రభా♦వంబు నేఁడు
దేవదానవు లాత్మ♦దివ్యపదంబుల మ్రొక్కంగఁ గను నెవ్వఁ♦ ముదము నేఁడు

క. కనకగిరిమీఁదిమాత్సర్య♦గరిమ సూర్య
రాకపోకలు లేకుండ ♦ నాకసంబు
నంటఁ బెరిఁగిన శిఖరాళి ♦ నలరువింజ
మాజ్ఞ మెలఁగంగఁ జేసెను ♦ బ్రాజ్ఞుఁ డతఁడు. 17

తే. తిలక మెన్నఁడు యామ్యది♦గ్జలజవదన
ముఖమునకు నట్టిమునిజన♦ముఖ్యుఁ డైన
కుంభసంభవునాశ్రమ♦క్షోణి వెలయు
భువనవిఖ్యాత మై ధర్మ♦భువన మగుచు. 18

తే. కలశభవుఁ డందు భార్యతోఁ ♦ గాఁపురంబు
చేయుచుండును మునిగణ♦సేవ్యుఁ డగుచుఁ
బాదుల నొనర్చి తత్పత్ని ♦ ప్రతిదినమ్ము
జలములను బోయు నందలి♦త్వాజములకు. 19

చ. అతనిసుతుండు ప్రత్యహము ♦ నందుఁ గుశాజినవల్కలాంబరా
న్వితుఁడును బ్రహ్మచారియు వి♦నీతుఁడు నై భసితత్రిపుండ్రభూ
షితవదనంబు మాంజియును ♦ జెన్నలరారఁ బలాశదండి యై
కుతుకమునన్ మధూకరముఁ ♦ గొంచుఁ జరించును బర్ణశాలలన్. 20

క. శుకహారితకదళీకావన, నికరము చీఁకట్లు గ్రమ్మ ♦ నేత్రోత్సవకా
రక మయి తత్పరిసరమునఁ, బ్రకటితమగుఁ దరమె దాని♦వర్ణింపంగన్. 21

క. అనవరతము గోదావరి, కనుపందువు చేయుచుండుఁ ♦ గలశభవుఁడు త్రా
గినసాగరంబుబడి వ, చ్చినదో యన వేణిఁ గట్టి ♦ చెలఁగుచు నచటన్. 22

చ. పుడమియు రాజ్యమున్ విపుల♦భోగములన్ విడనాడి తండ్రిపం
పిడికొని మాళిఁ గానలకు ♦ నేగిన రాముఁడు భార్య తమ్ముఁడున్
బడి చను దేర మానికుల♦భావ్యు నగస్త్యు మునీశుఁ గొల్చుచున్
గడపెను గొన్నినాళ్లిచట ♦ గాఁపుర ముండి కుటీగృహంబులన్ 23

చ. పొదలును వృక్షశాఖలఁ గ♦పోతచయం బట నేఁడు చూచినన్
ముద మొదవంగ లగ్నముని♦ముఖ్యధనంజయధూమరాజి నా;
ముదిత ధరాత్మజాత బలి♦పుష్పములం గొనువేళ సక్తత
న్మృదుకరరాగమో యనఁగ ♦ మీఁజును రాగము పల్లవంబులన్. 24

క. సతతము మృగయావినిహత, తతవనసారంగచోది♦తం బన ధరణీ
సుత పంచించిన కుహనా, ద్భుతహరిణము రాముఁ డిచటఁ♦బొలిపుచ్చె నధిపా.

చ. జనకజఁ బాసి దుఃఖమును ♦ సైఁపఁగ లేక తదార్తిఁ గుందుచుం
జనుదశమస్తకాంతకులు ♦ క్ష్మాపతిపుత్రులు రామలక్ష్మణుల్
దినకరచంద్రులంబలె మ♦దించి కబంధుఁడు తమ్ము మ్రింగ వా
నిని దునుమాడి లోకముల ♦ నవ్వగ మాన్చిరి యిందె భూవరా!. 26

చ. దశరథసూనుబాణపతి♦తం బగు యోజనబాహుబాహు వం
దు శుభమతిన్ ఘటోద్భవునిఁ ♦ దోషితుఁ జేయఁగ వచ్చినట్టి యా
యశివతిలిప్సరూపనహు♦షాయతకాయ మనంగ సందియం
బశనవిహీనసంతతికి ♦ నందఁగఁ జేసెడి నేఁడు చూచినన్. 27

చ. విరహవినోదనార్థ మట ♦ విహ్వలతం బతి వ్రాసినట్టి యా
ధరణిజఁ దన్నివాసమును ♦ దర్శన మొప్పఁగఁ జేయు వేడుకం
దిరిగి ధరిత్రినుండి చను♦దెంచెనో యంచును గాంచుచుండు వా
నరములు భక్తి నిప్పుడును ♦ నర్మిలిఁ బర్ణగృహాంతరంబులన్. 28

తే. సీత పెంచిన ముదుసలి♦జింక లిపుడు
వానకాలపుటుఱుముల ♦ జానకీశు
చాపఘోషంబు స్మృతికి రా ♦ శష్పకబళ
ములను గొన కట్టె మూర్ఛల ♦ మునుఁగుచుండు. 29

తే. రామచంద్రునిశితశర♦రాజిఁ బడిన, రజనిచరబలరక్తపూ♦రప్రసిక్త
మూల మన వన మొప్పెడుఁ ♦ బాలపల్లవములఁ దద్రాగనిర్గత♦వర్ణ మనఁగ.

పంపాసరోవరవర్ణనము.

క. ఏవంవిధ మగుకుంభజ, నావాసముపొంత నొప్పు ♦ నతిరమ్యం బై
భూవర! పంప యనంగాఁ, బావనకాసార మొందు ♦ ప్రథిత మయి భువిన్.

ఉ. అంబుధిపానక్రుద్ధసలి♦లాధిపుప్రేరణఁ గుంభజన్ముపైఁ
బంపిన మత్సరంబునను ♦ బద్మభవుండు తదాశ్రమంబుప్రాం
తంబున నుండ నొండు సరి♦తాంపతి సృష్టి యొనర్చినాఁడో నా
నంబుజమండరమ్యమగు ♦ నాకమలాకర మొప్పు రమ్య మై. 32

సీ. మజ్జదున్మదభిల్ల♦మత్తేభగామినీస్తనకుంభవిలులిత♦జలయుతంబు
సరవిందమకరంద♦వరబిందునిష్యందసంబద్ధచంద్రిక♦సముదయంబు

మదకరినికురుంబ♦మలినీకృతోజ్జ్వలసౌగంధికసుమాలి♦సమున్నతంబు
జలవిహంగమతతి♦సంచారచాలితవాచాలవీచికా♦భాసురంబు

తే. ఫుల్లకువలయకహ్లార♦భూషితంబుఁ, గంజమధుమత్తకలహంస♦కామినీకృ
తకలకలకలసంకలి♦తంబు మఱియు, తారమారసితోన్మత్త♦సారసంబు. 33

వ. వెండియు నాకాసారంబునిర్భయావతరణవారివిహారపరాయణతరుణవనదేవతా
గణకేళిపాళిగళితకుసుమవాసరవాసనావాసితంబును, నొకపట్టునం దిగి నీళ్లు
ముంచుకొను మునిజనులకమండులువులకలకలధ్వనులచే నతిమనోజ్ఞంబును,విక
చోత్పలవనమధ్యంబుల సంచరించుచు సవర్ణంబులగుట రసితానుమేయంబు
లగుకాదంబకదంబకంబులచే సేవ్యమానంబును, నభిషేకార్థం బవతరించిన
పుళిందరాజసుందరీబృందకుచచందనపరాగంబుచే ధవళితంబులగుతరంగంబుల
చే విరాజితంబును,కుఱంగటఁజెలంగు కేతకీతరునికరరజఃపటలంబుచేసముద్భాసి
తంబులగుకూలపులినతలంబులనతిరమ్యంబును, ననతిదూరంబులగునాశ్రమము
లనుండి చనుదెంచినతాపసోత్తములుదికిన కాషాయవల్కలంబులచేఁబాటలితం
బయిన తటజలమ్మును, గట్టుపయిం జాపట్టు మహీరుహపల్లవానిలంబున వీజితం
బును, సాంద్రతమాలవీథుల నంధకారితంబును, వాలినిష్కాసితుం డయి
ప్రతిదినము బుశ్యమూకంబున నధివసించుసుగ్రీవునిచే నవలుప్తంబులగుఫలం
బులననతిలఘువులగులతలును, సమీపగతులగుతాపసులదేవతార్చనకున్వలయు
కుసుమంబులును, మిట్టిపడుజలచరపతంగంబులపక్షపుటవిగళితంబు లగుజల
బిందుసందోహంబున నతిసుకుమారంబు లగుసుమంబులును, వనదేవతాశ్వాస
వాసితంబులు నాఁ గుసుమపరిమళంబుల వహించువనమండమండితం బగు
తీరంబును, లతామండపంబుల విలసిల్లుమయూరమండలతాండవంబులును,
సాగరం బనుసందియంబున జలపానం బొనర్ప నరుదెంచినమేఘంబులు నా
బురదం బొర లాడిన యడవియేనుఁగులచేఁ బరివీయమానంబులగు సలిలంబు
లును గలిగి యగాధంబును నపారంబును నయి వెలుంగు. ఇం దిప్పటికిని
వికచకువలయశ్యామాయమానపక్షపుటంబు లగు చక్రవాకమిథునంబులు
మూర్తిమద్రామశాపగ్రస్తంబు లట్లు చూపట్టెడు. 34

కాల్పతీవృక్షవర్ణనము.

క. నరవర! యీదృగ్విధమగు, సరసిదరిం బఙ్క్తిమాళి ♦ సాకేతపురీ
వరశిరజర్జరితాద్భుత, చిరతరతాళద్రుమంబు ♦ చేరువ నొకచోఁ. 35

తే. పరఁగు నాకజీర్ణశాల్మలీ♦ధరణిజంబు
జరదజగరంబు దిక్కరి♦కరసమంబు
చుట్టుకొనియుండు నద్దాని ♦ చుట్టు మొదల
నాలవాలంబుఁ దీర్చిన♦యట్టు లెపుడు. 36

చ. తనరుచు నుత్తరీయమును ♦ దాల్చినభంగిని బోదె వ్రేలు స్ప
ర్శనచలితాహికంచుకము♦సంగతి; దిగ్వలయంబుఁ గొల్చుమా
డ్కిని భువనాంతరాళములఁ ♦ గ్రీడ యొనర్చెడు శాఖికాచయం
బున లయవేళ వేయిభుజ♦ముల్ దగఁ జాఁచినచంద్రమౌళి నాన్. 37

మ. గగనస్కంధము నూఁతఁగాఁ బొలుచు నా♦త్మోజంబు దాఁ బ్రాఁతమ్రా
నగుటం బాతిభయాతిరేకమున నా; ♦ నంగంబునం దెల్ల ముం
డ్లగణం బొప్పెడు వృద్ధతాతిలకజా♦లం బో యనన్; నిక్కి చూ
చుగతిన్ నందనలక్ష్మియున్నతిఁ గడున్ ♦ శోభిల్లు నెల్లప్పుడున్. 38

ఉ. అంబుధివారిఁ గ్రోలి కడు♦పారఁ దదంబుభరాలసంబులై
యంబుదముల్ తదీయవిట♦పాంతరలీనములౌచుఁ బక్షిసం
ఘంబులయట్టు లుండి క్షణ♦కాలము దానికి సాలయంబు లా
ర్ద్రంబులు చేయుఁ గాని శిఖ♦రంబును గాంచఁగ లేవు భూవరా!. 39

శా. దేహం బంతయుఁ బర్వినట్టివ్రతతుల్ ♦ దీర్ఘంబులై తోఁచుఁ జ
మ్మాహా! వార్ధకజాతనాడు లనఁగా ♦ నామ్రానునం గోటర
వ్యూహాభ్యంతరలీనభృంగరుతి జీ♦వోపేతమో యన్నసం
దేహంబుం జనియింపఁ జేయుచుఁ గడున్ ♦ దీపించు నశ్రాంతమున్. 40

చ. గగనతలప్రయాణజవ♦గాఢపరిశ్రమితార్కవాహసృ
క్వగళితఫేనసంచయము ♦ గ్రాలఁగ నగ్రతలంబునందు బా
గుగ విడినట్టిదూదిగమి♦కూరిమి నెచ్చెలియై వళక్షితం
బగువనదేవతారుచిర♦హర్మ్యముభంగిఁ గుజం బ దొప్పెడున్. 41

క. వనకరికపోలకండూ, యనసంగతమధువిలీన ♦ మళిరాజియుఁ జు
ట్టును గదల కుండఁ గట్టిన, యినుపగొలుసు నాఁగఁ దనరు♦నింపుగ మొదలన్.

సీ. వనజనాభునిమాడ్కి♦వనమాలకలితంబు నవపయోదముక్రియ♦నభమునందు
దర్శితోన్నతి; సుయోధనుమాడ్కి నుపలక్షితశకునిపక్షపా♦తంబు; మఱియు
వింధ్యాద్రినెచ్చెలి; ♦ వివిధభూరుహములపతి; దండకావని♦పరివృఢుండు
శాఖామహాబాహు♦సంశ్లిష్టవింధ్యాటవీమధ్యభాగైక♦విలసితంబు

తే. నమ్మహాభూరుహంబందు ♦ నఖిలదిశల
శకునిజాలంబు లెల్లను ♦ శంకఁ దక్కి
కాఁపురంబుండు శాబక♦గణముతోడ
గూడులం గట్టికొని హాయి ♦ కొమరుమిగుల. 43

వ. అందు. 44

ఉ. కొమ్మలకొమ్ములన్ విపుల♦కోటరమధ్యములన్ గిసాంతరా
శమ్ములఁ జీర్ణవల్కలబి♦లమ్ముల స్కంధముసంధులన్ గులా
యమ్ములు పెక్కుగట్టికొని ♦ హాయిగ నెమ్మది నుండు సర్వదే
శమ్ములనుండి వచ్చి శుక♦సంతతి యెక్కఁగరానితుంగతన్. 45

తే. పలుచవడియును నాకులు ♦ పండి రాలి
నిండికొనియున్నవిధమున ♦ నిచ్చలొప్పు
నమ్మహీజంబునందు నో ♦ యవనినాథ !
శుకశకునిసంతతులచేతఁ ♦ జోద్య మరయ 46

తే. ఆశుకంబులు తమకులా♦యంబులందు
నందు నిశఁ బుచ్చి వఱువాత ♦ నహరహంబు
లేచి బారులు గట్టి స♦లీలఁ జదలఁ
బాఱుచుండును నెరకయి ♦ పార్థివేంద్ర !. 47

సీ. అంబరకాసార♦మందుఁ జెలంగెడు శైవాలపల్లవ♦చయ మనంగ
సురగజోన్మూలిత♦పరిగళదాకాశగంగాసరోజినీ♦గణ మనంగ
మదకలహాలధర♦మహితసీరోత్క్షేపబహువిధసమవర్తి♦భగిని యనఁగ
సమ్యగితస్తత♦స్సంచరన్మరకతసన్మణికుట్టిమ♦స్థల మనంగ
తే. నభోమండల మెల్ల సేం♦ద్రాయుధముగ
దినకరాశ్వప్రభాలేప♦దీప్తముగను
విపులశాద్వలతలముగ ♦ వెలుఁగునట్లు
బారులై పాఱు నాశుక♦పంక్తి చదల. 48

చ. ఎరఁ గొని వచ్చి సంజఁ దమ♦యిక్కల నుండెడుశాబకాళికిన్
గర మనురక్తిఁ జంచువులఁ ♦ గమ్రఫలంబుల శాలివెన్నులన్
బొరిపొరి పెట్టి డెందమునఁ ♦ బొంగెడు వత్సలతన్ గరుత్తులన్
భరఁగఁగఁ గప్పి వానిపయిఁ ♦ బ్రక్కఁ బరుండును దాము నందె రేల్. 49

శుకజన్మవర్ణనము.

*తే. ఇందె యొకజీర్ణకోటర♦మందు నుండు
భార్యతోఁ గూడ మత్తాత♦పాదుఁ డటఁ
యతని కే నొక్కపుత్త్రుండ ♦ నక్కజముగఁ
బుట్టితిని భాగ్యవశమున ♦ ముప్పునందు. 50

తే. ఎట్టితఱిఁ బుట్టితినొ కాని ♦ యెఱుఁగ నాఁడె
ప్రబలమత్ప్రసవవ్యథఁ ♦ బాసె మేను
నాదుజనయిత్రి; యింకేమి ♦ న న్నతండె
ప్రియవియోగంబు మనమునఁ ♦ బెట్టుకొనక. 51

తే. పొంగి పొరలెడుశోకంబు ♦ మ్రింగికొనుచుఁ
బ్రాణముల నెల్ల నాయందె ♦ పాదుకొలిపి
దొఱఁగి విషయాంతరము లెల్లఁ ♦ దొట్రుపడుచుఁ
బెంచుచుండెను నొక్కండె ♦ ప్రియమెలర్ప. 52

సీ. అల్పావశిష్టమై ♦ యలరుచుఁ గుళచీర కీడగు ముసలితోఁ ♦ కీడ్చుకొనుచు
నంసబలం బెల్ల ♦ నణఁగి లేవఁగ శక్తి లేనిఱెక్కలతోడ ♦ లేచి పడుచు
వడఁకుచే నుడికించు♦నొడలివార్ధకమటు లెడనెడఁదడఁబడ♦వడఁకికొనుచుఁ
దిరుగాడఁగా లేక ♦ తీరమి నొకమెయి నాకునై యొండల ♦ నడచుకొనుచు

తే. పరకులాయంబులకు నేగి ♦ పతితశాలి, ఖంజరులఁ గీరములు తాము♦నంజిపార
వై చినఫలంబులను గొని♦వచ్చి పెట్టు, నేను భక్షింప మిగిలినఁ♦దాను దినును.

వ. ఇట్లుండ నొక్కనాఁడు. 54

సూర్యోదయవర్ణనము.

తే సాంధ్యరాగారుణుం డయి ♦ చంద్రుఁ డపర
జలధితటమున స్వర్ణదీ♦సైకతంబుఁ
బాసి చనియెడునంబర♦పంకజాత
పుష్పరసరక్తపక్షసం♦పుటమరాళ
వృద్ధమో యన దిగుచుండ ♦ వేగుచుండ. 55

---

*పాఠాంతరము తే. ఇంద యొకజీర్ణకోటర♦మందు నుండు
భార్యతోఁ గూడ మత్పిత ♦ పరఁగు చెట్లొ
పుట్టితిని నొక్కఁడన నేను ♦ ముప్పునందు
విధివశంబున శకశే ♦ కధిపచంద్ర!.

చ. జలజవనప్రబోధమును ♦ సల్పెడుమంగళగీతికారవం
బులు, గజగండడిండిమము ♦ మ్రోఁతలు; సంకుచదుత్పలాంతరా
ళలగితపక్షబంధరక ♦ లాపవిలాసవిశాలఝుంకృతుల్
చెలఁగుచు నుండఁ గర్ణపుట ♦ సేవ్యములై మది కింపుఁ బెంపుచున్. 56

తే. నెమళు లాడంగఁ బురివిచ్చి ♦ నిబ్బరముగఁ
జెవులపండు వొనర్చుచుఁ ♦ జెలఁగుచుండె
లలితపంపాసరోవర ♦ కలితరాజ
హంసకోలాహలధ్వను ♦ లన్నిదెసల. 57

చ. కరఁగినలక్కతీఁగెలటు ♦ కాననసామజశోణితారుణ
స్ఫురదురుసింహకేసరస ♦ మూహములట్టులువోలె నెఱ్ఱనై
పరఁగెడు దీర్ఘభాస్కరగ ♦ భస్తుల శోధినులం బలెన్ సము
త్సరణమొనర్పఁగాఁ బడుచుఁ ♦ జాఱె నభస్థలపుష్పతారకల్. 58

తే. గగనతలమున కేతెంచు ♦ కర్మసాక్షి
సామజశిరంబునం గ్రాలు ♦ చామరములో
యనఁగ మాంజిష్ఠలోహిత ♦ మస్రజాల
మగపడుచు నుండెఁ జెట్లపై ♦ నప్పుడపుడె. 59

సీ. విరివితాల్చుచునుండ ♦ వేగ మంజులరంకుగోమసదృశుది ♦ క్కోణమెల్లఁ
జనుచుండ ధనదుని ♦ చక్కి మానసమునఁ గ్రుంక నాసప్తర్షి ♦ కోటి యెల్ల
నొసఁగుచుండ సుమాళి ♦ నుదయుద్రవికిఁ బల్లవాంజలిపుటముల ♦ నడవులెల్ల
మేలుకొల్పుచు నుండ ♦ లీల నిద్రితమదకరులఁ గరేణుకా ♦ గణము లెల్ల

ఆ. బొబ్బరించు చుండ ♦ బొబ్బమెకంబులు, కేక లిడుచు నుండఁ ♦ గేకు లెల్ల
మంచుబిందువులను ♦ మహిజంబులెల్లను, గురియుచుండఁ గోళ్లు ♦ కూయుచుండ.

ఉ. కాననదేవతాగృహని ♦ కాయముఁబోని మహీజకోటులన్
గానఁ గపోతపంక్తు లనఁ ♦ గ్రాలుతపోవనవహ్నిధూమసం
తానము లన్నిదిక్కులను ♦ ధర్మపతాకలు నా వెలుంగఁగాఁ
గాననచారు లిట్టటు ని ♦ కామము వచ్చుచుఁ బోవుచుండఁగన్. 61

సీ. కంజాతవనము ,ఁ ♦ గదలించి ప్రాలేయశీకరాసారంబు ♦ సిరి వహించి
రతిఖిన్నశబరప ♦ రారోహఘర్మాంబుకణికాపహరణంబు ♦ గారవించి
పల్లవలతలకుఁ ♦ బరఁగ లాస్యము నేర్పి కుసుమవాసన లెల్లఁ ♦ గొల్లఁగొట్టి
వికచాబ్జమధుబిందు ♦ విస్తార మొనరించి వనమృగరోమంథ ♦ కణము మాధి

తే. మధుపములఁ జోపి యలయిక ♦ మందిమంబుఁ
గాంచెనో యన వేఁకువఁ ♦ గాంచుజడిమ
నల్లన పదంబు లూనుచు ♦ మెల్లమెల్ల
మలయుచుండెను బ్రాభాత♦మారుతములు. 62

తే. ఒయ్యనొయ్యన మిహిరాంశుఁ ♦ డుదయ మంది
రమ్యపంపాసరోవర♦ప్రాంతపాద
పాగ్రములయందు లేయెండ ♦ పర్వుచుండ
వనములం దెల్లఁ దెలతెల♦వాఱె నంత. 63

తే. రెండుగడియల ప్రొద్దెక్కి ♦ చండభానుఁ
డంబరంబున వెలుఁగొందె ♦ నందముగను
నిచ్చవచ్చిన దెసలకు ♦ నేగుచుండె
శుకకులంబులు నెరకయి ♦ సొంపుగులుక. 64

తే. ఏను నాతండ్రియుం దక్క ♦ నెవరు లేర
యవ్వనస్థలిశూన్యమై ♦ యలరుచుండె
మేము మానీడములయంద ♦ మొదల కుండ
నణఁగిమణఁగియు నుండఁగ ♦ నవనినాథ !. 65

— శబరమృగయావర్ణనము. —

సీ. వనచరావళిభీతిఁ ♦ గని పాఱఁ బక్షులు పక్షంబు లల్లార్చి ♦ పైకి లేవఁ
గరికలభంబులు ♦ కంపించి గీపెట్టఁ బందులు గుంపులై ♦ పరువు లెత్త
మధుపముల్ పూఁదేనె ♦ మాని దిక్కులఁ బర్వఁ జెదరి జంతువు లెల్లఁ ♦ జెట్లఁ బట్ట
మేల్కొని సింహముల్ ♦ మించి బొబ్బలు పెట్ట వనదేవతలు భీత♦మనము లంద

తే. నాకసమునుండి భువిఁ బడు ♦ నమరవాహి
నీస్వనంబున కుద్దియై ♦ నిఖిలతరులు
పెల్లగిలునట్లు దిక్కులఁ ♦ బిక్కటిల్లి
యున్నయట్లుండి యొకమూల ♦ నుండి మృగయు
కలకలం బొందు విన నయ్యెఁ ♦ గలఁగ మనము. 66

తే. ఏమిచెప్పుదు నాధ్వని ♦ యెన్నఁ డేను, విన్న యది గాదు; వినిదానఁ♦బీను లగల
విహ్వలత నంది వెఱపున♦వేగ పఱచి, చేరితిని నాదుజనకుని ♦ చెంత కపుడు.

తే. చేరి ఱెక్కలసందునఁ ♦ దూఱి కదల
మెదలకయ యుంటి మే నెల్లఁ ♦ గుదియఁ జేసి

తెక్కలును రావు పసిదాన ♦ దిక్కు దోఁచ
దాయె నాకేమిచేయును ♦ నవనినాథ !. 68

వ. అంత నామృగయులు. 69

సీ. ఈచక్కఁ గిటికులం ♦ బీదెసఁ గరిపోతదారితసల్లకీ♦సారగంధ
మీచాయ శిఖిరావ♦మీక్రేవ హరిభిన్నకుంభకుంజరరావ♦జృంభితంబు
నీయోరఁ గురరంబు ♦ లీయోర నిపతితశుష్కపర్ణారవ♦క్షోభితంబు
నీప్రక్క మహిషంబు ♦ లీప్రక్క గజపతిలులితసరోజాత♦లలితగంధ

తే. మిటు కపింజలకులనాద♦మిచ్చట మృగ,యూథ మిచ్చట సైరభ♦యూథశృంగ
కోటిపవిసముత్ఖాతనా♦కుభవధూళి, యిచట సామజకులములు ♦ నిం పెలర్చు.

సీ. నవఘాసకబళన♦భవరసశ్యామలహరిణరోమంథఫే♦నాళి యిదిగొ
గంధసామజగండ♦కండూయనామోదసంయుక్తమధుకర♦శబ్ద మిదిగొ
పతితశోణితబిందు♦పరిషిక్తపరిశుష్కపత్త్రపాటలరురు♦పదవి యిదిగొ
మాతంగపాదవి♦మర్దితశాఖికాపల్లవసముదయ♦పాళి యిదిగొ

తే. ఆర్ద్రపంకాంకకోలచ♦యాధ్వ మిదిగొ, ఖడ్గమృగకులకేళికా♦కాననమ్ము
నవుడె కనినట్టి కానన♦హరిణగర్భ, శోణితారుణభూస్థలి ♦ చూడుఁ డిదిగొ. 71

తే. ఇదిగొ చమరీమృగావళి ♦ యిదిగొ చూడు
పక్షిచరయూథపతిమద♦వారిమలిన
మార్గ మియ్యది గజపతి♦మార్గ మస్ర
పాటలము కరిమౌక్తిక♦భాసురంబు. 72

ఉ. వేగమె పోవుఁ డీదెసకు ♦ వెంటఁ బడుండు విడుండు కుక్కలన్
వాగుర లొడ్డుఁ డెక్కుఁ డల♦పాదప మందుకొనుండు చాపమున్
ధీ గలఁగంగ నీకుఁ డిదె ♦ తీండ్రిలుచున్నది సింహకార్భకం
బీగుహ; నాలకింపుఁ డదె ♦ యీదెస వ్యాఘ్రకఠోరహుంకృతుల్. 73

చ. అనుచుఁ బరస్పరంబు మది ♦ నంటిననిర్భయవృత్తి నాడుచున్
వన మఖిలం బడంచుచు న♦పారమదంబునఁ జెల్లమాటునన్
మునుకొని వేఁటలాడుచు న♦మోఘగతిం జనుదెంచులుబ్ధకా
ఘనినద మాలకించితిని ♦ గర్ణపుటంబులు వ్రీల బ్రద్దలై. 74

ఉ. ఇంచుకసేపులో విపిన ♦ మెల్లఁ గలంగెఁ గిరాతపాతితా
భ్యంచితసింహఘోణిమహి♦షాండజసామజఖడ్గశాంబరీ

సంచయనిస్స్వనంబుల వి♦శాలమహాంబుధి మందరాహతిం
సంచలనంబునొందుగతి ♦ సత్వర మద్భుత మంద లోకముల్. 75

వ. వెండియు నురుములఁ బురుడించుగజయూథపతులఘీంకారరవంబులను, సార మేయంబులు సరభసగతిం బఱచి కఱవఁ గాతరతరలతారకంబులై గూలు నేణకంబులకరుణకూజితంబులను, యూథపతిం గోలుపోయి వియోగభారం బు భరింప ననువుగామిఁ గలభంబులు వెంటఁబడి రాఁ బర్వులు వాఱుచు నందందు నిలిచి చెవులు ఱిక్కించి కలకలం బాలించి యెటు చనుటకుం దోఁచక యిటునటు పరిభ్రమించుచు దుస్సహనవీనవైధవ్యవ్యథాభారంబున శోకించు కరేణుకానివహంబుల చీత్కారంబులను, వెఱపుచేఁ దముఁ బాసి యెందే నేగిన పిల్లల నన్వేషించుచు గొం తెత్తి యతికరుణంబుగ నఱచుచుం బిలుచుఖడ్గి ధేనుకలయాక్రందనధ్వానంబులను; జెల్లాచెదరై వృక్షాగ్రంబుల వీడి పైకెగయుపత్త్రరథంబులకోలాహలనిస్స్వనంబులను, మృగంబులజాడఁ బట్టికొని యొక్కపెట్టున నతిరభసపాదాభిఘాతంబున భూతలంబు గడగడవడఁకం బ్రధావించుమృగయుల చరణశబ్దంబులను, జెవికొనదాఁక నీడ్చి పెల్లుగ నంపజల్లు కురియు శరాసనంబుల విరావంబులను, మత్తకురరమత్తకాశినీకంఠకూజితకలనినాదంబులను, గాఱుదున్నలమెడల నఱకుతీక్ష్ణధారాఘోరఖడ్గంబులయులివు నను నతిరభసవిముక్తశ్వానంబులఘుర్ఘురధ్వానంబులను నాయరణ్యం బెల్లఁ బ్రచలితంబునా నతిపరిక్షుభితం బయ్యె. 76

తే. కొంతసేపున కంతఁ బ్ర♦శాంతమయ్యె
నమ్మృగవ్యకోలాహలం ♦ బవనినాథ!
కాననం బెల్ల నిర్వ్యాప్త♦ఘనముమాడ్కిఁ
గాంచె మానంబు మథనాంత♦కంధిపగిది. 77

ఉ. డెందములోనికొందలము ♦ డిందుపడంగ నొకింత సంతసం
బంది యిదేమి యంచుఁ బితృ♦సంకమునుండియె తద్దిదృక్ష నన్
దొందరపెట్ట శైశవము ♦ దోడ్పడ దానికిఁ జాఁచి కంధరన్
ముందున కింత తద్దిశకె♦పుచ్చితిఁ జూడ్కుల నేమి చెప్పుదున్. 78

వ. అంత. 79

శబరసైన్యవర్ణనము.

సీ. కార్తవీర్యార్జున♦ఘనభుజసాహస్ర విప్రకీర్ణేందుజా♦వేణి యనఁగ
భానుభానుసహస్ర♦బహుభిన్నబంధురగాఢాంధతమసని♦కాయ మనఁగ

వలమానపవమాన♦చలితప్రధావత్తమాలధాత్రీరుహ♦జాల మనఁగ
దారితాఘోలోక♦తలసముద్భవదైత్యదానవరక్షో♦వితాన మనఁగ
ఆ. నవనికంపవిచలి♦తాంజనాశ్మస్తంభ, చయ మనంగ నొక్క♦స్థలమునందుఁ
గలసినట్టియశుభ♦కర్మజాలంబు నా, సంచరద్యమభట♦జాల మనఁగ. 80
వ. మఱియును. 81
క. శ్రీరామబాణవినిహతి, దోరి తదపరాధజనిత♦దోషమున భువిఁ
ఘోరపిశాచాకారతఁ, గూరినఖరదూషణభట♦కోటి యనంగన్. 82
సీ. సలిలావగాహంబు ♦ సల్పఁగాఁ జనుదెంచు కాననసైరిభ♦కాండ మనఁగ
సకలలోకంబుల ♦ సమయింపఁ బుట్టిన దుమగతికేతుల♦తుటు మనంగ
నచలకూటస్థిత♦హరికరాకృష్టమై పతితశీర్ణాంబుద♦పంక్తి యనఁగ
దండకారణ్యస్థ♦తాపసోత్తమచరద్ఘోరశాపాంకుర♦కోటి యనఁగఁ
తే. గ్రాలు నొకచోటఁ జేరిన ♦ కాళరాత్రి
యామసంఘాత మనఁ గలి♦స్తోమ మనఁగఁ
గానన మ్మెల్లఁ జీకట్లు ♦ క్రమ్మ నెదుర
నరుగుదెంచెడు శబరసై♦న్యంబుఁ గంటి. 83

శబరసేనాపతివర్ణనము.

తే. దానిమధ్యంబునం దొక్క♦తరుణుఁ డమిత
బలుఁడు కర్కశదేహుఁడు ♦ భయదరూపుఁ
డేకలవ్యుండు నా నొప్పు ♦ నెఱుకతేఁడు
నాయకుం డయి యాసేన ♦ నడపు చుండె. 84
తే. వానిఁ దలఁచినఁ బులకలు ♦ మేన నిపుడుఁ
బొడముఁ; జెమ్మట కంపంబుఁ ♦ బుట్టు నృపతి!
యెంత వర్ణింతు నాతని ♦ నంతకాభు
యమునియపరావతార మీ♦యవని నతఁడు. 85
తే. అతనిగాత్రంబు నలువ కా♦లాయసమునఁ
జేసె ననఁ గర్కశం బయి ♦ చెలఁగు యమున
జలము లట్టుల కువలయ♦శ్యామలమ్ము
లగుచుఁ దద్దేహకాంతులు ♦ నలరు చుండు. 86
తే. పరఁగు నూనూఁగుమీసలు ♦ కరికుమార
ప్రథమమదరేఖలట్టుల ♦ పార్థివేంద్ర!

వానిముఖమున కొకవింత ♦ వన్నెఁ గీలు
కొలుపు చెంతయు నెలప్రాయ ♦ మలరఁ జేయు, 87

ఉ. సామజదానమేచకిత♦చారుసటాచ్ఛటసింహమట్టు లా
భీమకిరాతరాజు మెడ ♦ వ్రేలునరాళకరాళకుంతల
స్తోమమునన్ వెలుంగు; నతి♦తుంగభయంకరఘోణ మాయత
స్థేమలలాటపట్టమును ♦ దేజరిలన్ గడు నద్భుతంబులై. 88

చ కరికలభంబులన్ దునిమి ♦ గండములన్ విదళించి యప్పుడే
పరిజనసంగృహీత మగు♦భాసురశారదగంధధుర్యమా
సురభిమదంగరాగమున ♦ శోభిల మే నసితాగరూల్లస
త్సురుచిరకర్దమంబునను ♦ దోఁగినమాడ్కి నతండు పొల్చెడున్. 89

క. ఆయామోదాంధములై, పోయినయళు లతని కెండ♦పొలయక యుండన్
జేయును గానుగచిగురుల, చాయయుఁ బించెంపుగొడుగు ♦ చందం బగుచున్.

తే. ఏకకర్ణావసక్తమై ♦ యొసఁగుభుజగ, పాటలఫణామణిద్యుతుల్ ♦ పర్వి వామ
పార్శ్వ మెత్తినై చెలఁగును♦బల్లవోల్ల, సచ్ఛయునరాగమంటిన♦చందమునను.

ఉ చెక్కిళులందు నింపెసఁగు ♦ స్వేదజలంబులఁ దుడ్చు వానికిన్
జొక్కఁగ గాలికిం గదలు♦శ్రోత్రకిసాలయకైతవంబునన్
స్రుక్కి తదీయదోర్బలవి♦శోషితశౌర్యము వింధ్యకాననం
బెక్కుడుభక్తిఁ గొల్చుచును ♦ నేత్తైఱ వీడి కరంబునం బలెన్. 92

క. మృగకులవినాశకారక, మగురజనీసాంధ్యరాగ♦మున నార్ద్రములై
నగతిని నెత్తుట నెఱ్ఱఁగ, నిగనిగ వెలుఁగొందు నతని♦నేత్రములు గడున్. 93

చ. కగికరమాన మెత్తికొని ♦ కంజభవుండు సృజించెనో యనన్
దరుణతదీయదోర్యుగము ♦ దాఁకును జానువు లంటి దీర్ఘమై
పరఁగును జండికారుధిర♦పారణకై పలుమాఱుశస్త్రికన్
గరకరిఁ గోసికోసి కడుఁ ♦ గాయలుకాచిన మూఁపు లొప్పఁగన్. 94

క. అనవరతకృతశ్రమమునఁ, జని లోనికిఁ గడుపు నతికృ♦శం బగుచుఁ గడున్
దనరును వింధ్యశిలాతల, మన వక్షస్థలం మతనికి ♦ నతివిస్తృతమై. 95

తే. ఊరుదండద్వయము మద♦వారిమలిన
బంధనస్తంభయుగళంబుఁ ♦ బరిహసించు
లక్క నెకసక్కె మాడునా ♦ యుక్కడీని
రక్తకౌశేయవసనంబు ♦ రాజచంద్ర!. 96

ఉ. భూమిప! యొప్పు భ్రూకుటిని ♦ బూని యకారణవృత్తి నుగ్రమై
దీమస మొల్కు తన్నిటల ♦ దేశమునన్ ద్రిపతాకముల్ దగన్
నీమమునం బ్రపత్తిమతి ♦ నిత్యము గొల్చెడుశక్తి వీఁడు నా
ప్రేమకు వచ్చుభక్తుఁ డని ♦ ప్రీతిఁ ద్రిశూలవుముద్ర వేసె నాన్. 97

సీ. సారంగశోణిత♦స్రావంబు సల్పెడి నా నొప్పు నెఱ్ఱని ♦ నాలుకలను
శ్రమవశంబునఁ గడుఁ♦జాఁపి యల్లాడ్చుచు దంతకాంతులు తదం♦తరములందు
సక్తకేసరిసటా♦ఘూటంబులో యన స్పృశద్భాగంబుల ♦ సిరి వహింప
వివృతముఖంబులై ♦ వెలుఁగుచు మెడలందు స్థూలవరాటక♦మాల లలరఁ
తే. బందికోఱలకాటులఁ ♦ బగులువారి
దేహమెల్లను నెత్తుటఁ ♦ దేలుచుండ
వేఁటకుక్కలగుంపులు ♦ వేఁటసేద
తెలుపు చాతనివెంటఁ దో♦తెంచుచుండె. 98

తే. అల్పకాయంబుఁ గలిగిన♦వయ్యు నధిక
సత్వయుక్తంబు లౌటనా ♦ శ్వానచయము
లనుపజాతసటాఘూట♦హరికిశోర
కములు నా నొప్పుచుండె భూ♦కాంతవర్య!. 99

క. సింహముల కభయదానము, సంహస్సుఁ దడవ కిడరె ♦ యుంచు నడుగ భీ
రంహఃక్రాంతత వచ్చిన, సింహాలు నా నొప్పు వాని♦సీమంతినులున్. 100

వ. వెండియు నాతండు. 101

సీ. ప్రమథులచందానఁ ♦ బంచాస్యచర్మముల్ ధరియించికొందఱు; ♦ దనుజులట్లు
మాంసభారముఁ గొని ♦ మఱికొంద ఱు; గృభకులట్లు కాకపక్షమ్ము ♦ లలరఁ దాల్చి
క్షపణకు లట్లు శి♦ఖండిపింఛముఁ దాల్చి కొందఱు; శ్రీకృష్ణు♦చందమునను
గజదంతముల సము♦త్ఖాతంబుఁ గావించి దాల్చి కొందఱు; వాన♦తరుణమట్లు
తే. జలదమలినాంబరాంచిత♦చారుదేహ, మలరఁ గొందఱు;మృగపతు♦లట్లుకుంభి
కుంభమౌక్తికపాణులై ♦ క్రూరశబర, భటులు కొందఱుచుట్టుత♦న్నలసి కొలువ.
తే. బర్హిబర్హవిచిత్రచా♦పంబుఁ దాల్చి, జలధరముమాడ్కి, శిఖండి♦శత్రువగుచు
భీష్మచాడ్పున; నుద్ధృతా♦భీలనాగ, దళనుఁడై విష్ణురథునట్లు ♦ తనరుచుండె.

ఉ. కానవిధాన ఖడ్గి యయి ♦ గ్రాలుచు; గ్రీష్మదినంబు చాడ్పునన్
బూని చెలంగుచున్ సతత♦మున్ మృగతృష్ణ; ఘుటోత్కచుండు నా

నూనియు భీమరూపమును; ♦ నొప్పుచు రాక్షసు నట్లు శోణితా
నూనపరాయణత్వమున ♦ నుబ్బుచు నుండెడి భయంకరాకృతిన్. 104

ఉ. మానవనాథ! తన్మహిమ ♦ మాదృశు లెన్నఁ దరంబె వెండియున్
మానసవేగ మూని యను♦మానము వీడి చరించు చుండు నెం
దేనియు దేవయోనిగతి ♦ నిచ్చఁ జెలంగుచు నుండు నిచ్చలున్
గానకళావిలాసమును ♦ గాంచి వెలుంగు నిషాదయుక్తిచేన్. 105

సీ. గిరిరాజకన్యకా♦కేశపాశమువోలె శిఖిచంద్రకములకై ♦ సేఁతఁ దాల్చి
బకదానవునిమాడ్కిఁ♦బరిగృహీతైకచక్రుఁ డయి హిరణ్యాక్షు♦కోణపుక్రియ
స్తబ్ధరోమక్రూర♦దంష్ట్రావిభిన్నోగ్రవక్షస్స్థలుం డయి ♦ వన్నెఁ గాంచి
యులపరాశరునట్టు ♦ లలరుచు యోజనగంధానుసారియై; ♦ కాముకుగతి

తే. బహుళబందీపరిగ్రహా♦పరతఁ జెలఁగి
యంబికాశూలముం బలె ♦ నదరి మహిష
శోణితార్ద్రశరీరంబు ♦ సొబగు నింప
నలరు నసుదర్శనతఁ గృష్ణుఁ ♦ డయ్యుఁ గడిమి. 106

క. అభినవయౌవనుఁ డయ్యును, నభిభూతానేకవయసుఁ ♦ డగుచుఁ జెలంగున్
బ్రభువర! క్షితిభృత్పాదా, నుభవుం డయి రాజసేవ♦నూల్కొనఁ డెవుడున్.

క. అనుజుఁడు పాపంబునకుం, దనయుఁడు వింధ్యాద్రికతఁడు♦తలఁప యమునకున్
అనుఁగువయస్యుఁడు కలికిం, బ్రణయాంతేవాసి మనుజ♦పాలకచంద్రా!. 108

ఆ. అతని కెదుర నిల్వ ♦ నడలుదు రెవ్వరు, నధికసత్త్వుఁ డగుట ♦ నవనినాథ!
భీషణుం డగుచు గ♦భీరాకృతి వెలుంగు, నప్రధృష్యుఁ డాతఁ ♦ డవని కెల్ల.

తే. వానిపేరు మాతంగుఁడు ♦ పార్థివేంద్ర !
యవల వింటివి నానామ ♦ మఖిలజనము
లాడుకొనుచుండ; నంత నే ♦ నతనిఁ గాంచి
మనమునం దిట్టు లనుకొంటి ♦ మనుజవర్య !. 110

ఆ. వీరిజీవితంబు ♦ వీరిచరిత్రంబు, మోహమయ మసాధు♦మోహనంబు
నవుర మధువు మాంస♦మాహార మార్యవి, నిందితంబు వీరి ♦ కెందుఁ జూడ.

సీ. శాస్త్రముల్ గోమాయు♦శబ్దంబు; లుపదేశకులు సదసత్తుల ♦ ఘూకములును;
మిత్రంబు లనుచిత♦పాత్రచాపంబులు; చదువు మృగయ; ప్రజ్ఞ ♦ శాకునంబు
పరిచితు లల శ్వాన♦పంక్తులు; భార్యలు బందీగృహీతాన్య♦భామ లరయ
సత్సహాయులు విష♦సందిగ్ధముఖములు సర్పంబులునుబోలె ♦ సాయకములు;

తే. క్రూరశార్దూలములతోడఁ ♦ గూడియుంట
మాంసమున దేవతాబలి; ♦ మనుజరక్త
మునను నిజదేవతార్చన; ♦ మ్రుచ్చులింత
జీవన మ్మద్ది రా వీరి ♦ జీవనంబు. 112

తే. వనగజమదంబె మైపూఁత ♦ వఱలు భుజగ
మణులె భూషలు వీరికి ♦ మనుజపిశిత
సముపహారమ్మునని ధర్మ ♦ శాస్త్రబుద్ధి
వీరిగీతంబు మృగవధ ♦ కారకంబు. 113

క. అని నే ననుకొను చుండఁగ, వనగమనపరిశ్రమంబు ♦ వాపికొనంగాఁ
జనుదెంచె నాయనోకహ, మునధోభాగమ్మున కల ♦ బోయ గడు వడిగా. 114

క. చనుదెంచి వేగ లెంకలు, గొని తెచ్చిన కుసుమవీటిఁ ♦ గూర్చుండె ధను
స్సును నెక్కిడించి యాతఁడు, పనివిని యొకశబరుఁ డంతఁ ♦ బరువిడి వేగన్.

సీ. ప్రళయభాస్కరతాప ♦ భయవిలీనాభ్రకదేశంబు నాఁ గడుఁ ♦ దేజరిలుచు
వైడూర్యద్రవము నా ♦ వఱలుచు శశిబింబమందుండి కాఱె నా ♦ నతిశయిల్లి
తళతళలాడెడు ♦ ధవళముక్తాఫలనికరమ్ము నా నైగ ♦ నిగ్య మలర
స్పర్శానుమేయ మై ♦ స్వచ్ఛత నొప్పారి యబ్జరజకషా ♦ యంబుఁ గాంచి
తే. యలరుశీతలమధురోజ్జ్వ ♦ లాంబువులను
గుఱుఁగట మెలంగు నచ్చటి ♦ కొలని కేగి
కమలినీపత్రపుటమునఁ ♦ గడిగినట్టి
నిర్మలమృణాళములతోడ ♦ నెమ్మిఁ దెచ్చె. 115

తే. తెచ్చి యిచ్చిన నాతఁ డా ♦ తేట నీరుఁ
గ్రోలి శశిఖండముల రాహు ♦ వోలె; మెసఁగి
మృదుమృణాళంబు లొకకొన్ని ♦ మేదినీశ!
సేదఁ దేఱి యొకించుక ♦ సేవకులును. 117

తే. క్రోలి జలముల నందఱుఁ ♦ గూడ రాఁగ
నిచ్చవచ్చినదెసకుఁ దా ♦ నేగె నతఁడు
నందుఁ బిశితాశనుండు నా ♦ నలరువికృత
రూపుఁ డొకవృద్ధశబరుండు ♦ రూక్షదృష్టి. 118

శుకశాబకగ్రహణవర్ణనము.

తే. అక్కిరాతులు తన కేమి ♦ హారిణపిశిత
మీమి నాఁకలిదిచ్చు ద ♦ హింపఁ గడుపు

వారితో నేగ కావన♦స్పతితలమ్ము
నందె యొక్కముహూర్తంబు ♦ నాలసించె. 119

తే. కనుమఱుం గగునంతకుఁ ♦ గాచి యుండి
శబరనాయకుఁ; డావృద్ధ♦శబరుఁ డంత
నస్మదాయువులం ద్రావు♦నతఁడువోలె
భ్రుకుటివికటారుణాభీల♦భుగ్నదృష్టి. 120

ఉ. అండజమాంసఖాదనప్రి♦యుం బగు శ్యేనముమాడ్కి మాదుగూ
ళ్లుండుస్థలంబు లెంచుచును ♦ నుండెడువాఁడునుబోలె నట్టె మే
ముండెడు నవ్వనస్పతిని ♦ నూరక కెగాదిగఁ జాలసేపు భూ
మండలనాథ! చూచెఁ బలు♦మాఱును వారక యూరురుత్తుడై. 121

ఉ. చూడఁగ నాతఁ డవ్విధముఁ ♦ జూచి భయంపడి కీరజాలముల్
వీడినమాడ్కిఁ బ్రాణములు ♦ వేగమ చేష్టలు దక్కి చిక్కి య
న్నీడములందె యుండెఁ జన ♦ నేరక యెందును; నింగితోడ రా
పాడెడు తద్వనస్పతి నయ♦త్నమునన్ దృటిమాత్ర నెక్కె దాన్. 122

ఉ. వచ్చియు రానిపక్షముల♦వానిని గొన్నిటి నెత్రుగందులన్
బచ్చిశరీరముల్ గలుగు♦పావలఁ గొన్నిటి గ్రుడ్డునన్ గనుల్
విచ్చియు విచ్చకుండు పసి♦పిల్లలఁ గొన్నిటిఁ ద్రోటిసంపుట
మ్మచ్చుగ విప్పఁ జాల కపు♦డప్పుడె విచ్చుచు మేఁత కేడ్చుచున్. 123

ఉ. ఉండెడివానిఁ గొన్నిటిని ♦ నూరక చూచుచు నేమి చేయ లే
కుండెడువానిఁ గొన్నిటిని ♦ నుల్లము తల్లడ మంద మెల్లఁగాఁ
దుండము సాఁచి పొడ్చుచును ♦ దూఱిచినప్పుడు చేయి తూలుచున్
బండినవానిఁ గొన్నిటినిఁ ♦ బాపమతిన్ శుకశాబకంబులన్. 124

ఉ. పట్టుకొనన్ దయం దొఱఁగి ♦ పాపి కిరాతుఁడు కోటరంబు లా
చెట్టును సర్వమున్ వెదకి ♦ చేతులు చొన్పి యొకండు వీడకే
పట్టి ఫలంబు లట్లు పడ ♦ వైచె గతాసులఁ జేసి భూమిపైఁ
గట్ట దయావిహీనుల క♦కార్యము దుష్కర ముండునే భువిన్. 125

శుకావస్థావర్ణనము.

ఉ. అక్కట నాదుతండ్రియును ♦ నారసి యాయవితర్కితాపదన్
దిక్కులు చూచు చేమియునుఁ ♦ దేఁకువఁ దోఁపక కంపితాంగుఁడై

చిక్కితిఁ జావు నిక్క మని ♦ చిత్తము తత్తర మందఁ జేష్టలుం
దక్కె నొకింత దేఱి కడుఁ ♦ దాలువు లెండ విలోలనేత్రుఁ డై. 126

ఉ. ఏమి ప్రతిక్రియన్ సలుప ♦ నెందును బోవఁగఁ జాల కయ్యొ నా
ప్రేమకుఁ జిక్కి క్రుక్కుకొని ♦ వెల్లువ లై చనునశ్రుధారలన్
మామకరక్షణాతురత ♦ మల్లడి గొల్పఁగ వేగ వచ్చి నా
స్వామి తదీయపక్షముల ♦ చాటున మాటియుఁ జిక్కఁబట్టి నన్. 127

ఉ. భూవర! క్రుక్కుమి క్కనక ♦ పోవునొ యొప్పు డటంచు నుండ నా
పావియు మాదుకోటరము ♦ పజ్జకె యుల్లన నేగుదెంచి శా
ఖావివరంబు లెల్లఁ దిరు ♦ గాడుచు నోలి జరద్భుజంగశం
కావహచాపకర్షణకి ♦ ణాంకితభీషణబాహుదండమున్. 128

ఉ. చాఁచి నిశాతతుండమున ♦ సారెకుఁ బొడ్చుచు నుండిన న్ననున్
బ్రోచినతండ్రిఁ బట్టుకొని ♦ పుచ్చి యసువ్రజ ముర్విపైఁ బడన్
వైచెను దల్లక్రిందులుగఁ ♦ బాదములందు శిరంబుఁ జొన్పి మై
దాఁచి తదీయదేహమున ♦ దైవవశంబున దానితోడనే. 129

చ. ఇనవర! వాయునున్న మగు ♦ నెండినయాకులకుప్పపైన నే
నును బడితిన్ విశీర్ణతను ♦ నొవ్వను గానను దాన; వాఁడు చె
ట్టును దిగునంత కచ్చోటు క ♦ డున్ నిభృతంబుగఁ బాసి యేగితిన్
గనఁబడకుండ నేరికిని ♦ క్ష్మావర! పర్ణసమానపత్త్రతన్. 130

చ. కటకట యెట్టిక్రూరుఁడనొ ♦ కాలము నొందినవానిఁ దండ్రిఁ దొ
ల్లిటిప్రణయంబు నెంచ క వ ♦ లీలను బ్రాణము లైన నీయ నా
నెటుల పరిత్యజించితినొ ♦ యే నవు డంతయుఁ బ్రాణభీతిచేఁ
జటులమతిన్ దొలంగితిని ♦ సాహసవృత్తికి నిచ్చగించితిన్. 131

తే. తొలఁగి యింకను ఱెక్కలు ♦ వఱల రామిఁ
బడుచు లేచుచు యమముఖ ♦ భ్రష్టనై తి
ననుచుఁ దలఁచుచుఁ బోయితి ♦ ననతిదూర
గతతమాలంబుక్రిందికిఁ ♦ గష్టపడుచు. 132

సీ. దేవకీసుతుమేని ♦ తేజంబు కాసుకుం గానిదానిని జేసి ♦ కామపాలు
పటుపటాటోపంబు ♦ ప్రాభవంబు హరించి యమునానదిని నట్టె ♦ యణఁచి పట్టి
యంజనాద్రిని వెను ♦ కంజవేయఁగఁ జేసి నీలనీరదపంక్తిఁ ♦ దూలఁ బుచ్చి
వింధ్యాటవీకేళ ♦ వీరత నణఁగించి కాటుకయందంబు ♦ పీటఁ బుచ్చి

తే. సూర్యకిరణాళికిని జొరఁ ♦ జోటులేక, పెక్కుశాఖల దిక్కులఁ ♦ బిక్కటిల్లు
నత్తమాలంబె మత్పిత♦యంక మయ్యె, దిక్కులే కెందు దీనత ♦ స్రుక్కునాకు.

తే. అంతనావృద్ధశబరుండు ♦ నవతరించి, క్షితిని మృతిఁ జెంది పడియున్న♦కీరశాబ
కముల నన్నిట నొకతీఁగఁ♦గట్టి పెట్టి,పర్ణపుటమునఁ గొని వడిఁ♦బఱచె నటకో.

వ. అంత నాకు. 135

తే. దూరపాతశ్రమంబున ♦ ఘోరనవ్య, జనకమరణజశోకంబు ♦ సైఁప లేక
విడువ కేడది యేడిచి ♦ బడలి కంఠ,మెండుటను దుస్సహపిపాస♦మెండికొనియె.

తే. దానితాపంబునకు నోడల్ ♦ తనవశంబు
గాక విరవిరపోవంగఁ ♦ బోక యుసురు
జీవితాపేక్ష నింకను ♦ జిక్కఁ బట్టి
నీటికొఱకు మెట్లు చూతునా ♦ నేఁ డటంచు. 137

ఉ. ఇంతకు నేగియుండు నని ♦ యెంచి సుదూర మతండు పాపి నే
నంత నిసుంత కంధరము ♦ నల్లన నెత్తి భయంబునన్ సము
ద్భ్రాంతదృశుండనై దిశలఁ ♦ బాఱఁగఁ జూచి చలించినం దృణం
బెంతయు వాఁడె వచ్చె నని ♦ యెంచుచుఁ జూచుచు వెన్క సారెకున్. 138

తే. దారిపొడుగున వానినే ♦ తలఁచుకొనుచు
మరల వచ్చునో యనుభీతి ♦ మరలి మరలి
సారె సారెకుఁ గనుచు నా♦భూరుహంబుఁ
బాసి జలములకడ కేగఁ ♦ బాలుపడితి. 139

సీ. నడవఁగా నలవాటు♦పడయమినొకపదంబుంచియూర్పులుపుచ్చి♦యుస్సురనుచు
ఱెక్కలు రామిచేఁ ♦ జక్కపదం బూని పో లేక సారెకు ♦ బొర్లపడుచు
నడ్డంబుగాఁ బడి ♦ యూని యూఁతగ ఱెక్క నిలుచుచు మాటికి♦నిలను గనుచు
దుమ్ముచే మేనెల్ల ♦ ధూసరితం బయి చెమ్మటఁ జొత్తిల్లి ♦ సొమ్మసిలుచుఁ

తే. బోవు చేను మనంబునఁ ♦ బుణ్యచరిత!
యిట్టు లనుకొంటి నాయాస ♦ మిట్టిపడఁగ
బహువిధంబుల దప్పిచే ♦ బాధపడుచు
సైఁపఁ జాలక తాపంబు ♦ క్ష్మాతలేంద్ర!. 140

తే. ఎట్టికష్టంపు వేళల ♦ నెవ్వరిలను, జీవితాపేక్ష వీడరు; ♦ జీవితంబు
కంటెఁ బ్రియమొండు లేదుగా♦కట్టయేను, బ్రతికియుండెదఁ దండ్రి ని♦బంపియింక.

సీ. అక్కటా ననుఁ బోలు ♦ నదయుండు నకృతజ్ఞుఁ డుండునే జగతి నే ♦ నొక్కరుండ
కులమువా రెల్లను ♦ గుణవంతుఁ డనఁ బేరు వాసిగాంచినతండ్రి ♦ పాసి చనిన
నవికలేంద్రియుఁడ నై ♦ యానని బ్రతికెదఁ దద్దుఃఖమున కోర్చి ♦ తరల కట్టె
కట్ట నాహృదయంబు ♦ కఠినంబు కాగదుఁ దత్కృతంబయినను ♦ దలఁపదాయెఁ

తే. దల్లి దివి కేగఁ దద్దుఃఖ ♦ మెల్ల నాఁగి, పుట్టినదిగోలెఁ గష్టమ్ము ♦ పెట్ట కెదను
వయసు చెల్లియు రక్షించె ♦ వాని నెల్ల, మఱచితిని నొక్కక్షణమున ♦ మహాతఁబీడి.

చ. అతికృపణంబు లీయసువు ♦ లమ్మక చెల్ల మహోపకారి ము
త్పితవెనువెంటఁ బో విఁకను; ♦ వే చనుచుండెడువాఁడ దేఁడకో
హాతమతి జీవితాశయ క ♦ దా సకలంబును దుష్ప్రవృత్తికిన్
సతతము చొన్పు నిత్తఱినిఁ ♦ జంపెడు నీసలిలాభిలాష నన్. 143

తే. జనకమరణజశోకంబు ♦ సరకుఁగొనని
కఠినచిత్తుఁడ నగునాకె ♦ కలిగెఁ గాక
కలుగునే యిట్టిజలపాన ♦ కాంక్ష జగతి
నొరుల కిత్తఱి నేగతి ♦ నరుగువాఁడ 144

సీ. ఆసరోవర మింక ♦ నతిదూరమున నుండు వినరాదు కలహంస ♦ విరుతి యింక
సారసరసితముల్ ♦ చక్కఁగా వినరావు కమలపరాగంబు ♦ కానరాద
యంభోజసౌరభం ♦ బాశాముఖంబుల విరళమై పర్వెడుఁ ♦ గరము రాదు
నీటితుంపర మేను ♦ నిండఁ బుప్పొడి రాల వీవదు పవనంబు ♦ వేగ ముడిగి

తే. భానుఁ డంబరతలమధ్య ♦ వర్తి యయ్యె
ననలపాంసుచయంబు నా ♦ నాతపంబు
ఖరకరంబులఁ జల్లెడుఁ ♦ గరుణ వీడి
యేమిగతి యింక నెట్లు నే ♦ నేగుదాన. 145

తే. ఆతపస్పర్శసంతప్త ♦ మైన నేల, నడుగు వెట్టినమాత్రాన ♦ నధికతృష్ణ
యడరు నీదప్పికిని దప్పి ♦ యల్పమైన, నడువఁగాఁ జాల నవశమౌ ♦ నొడలు నకట.

క. కొందల మందెడు డెందము, నందెనుఁ గను లంధకార ♦ మల ఖలవిధి నన్
బొందించును మరణము నేఁ, డెం దేగుదు ననుచు మదిని ♦ నెంచుచు నుండన్.

— హారీతవర్ణనము. —

తే. అచట కరుదెంచె హారీతుఁ ♦ డనెడి మౌని, తలవనితలంపు నాపాలి ♦ దైవమగుచు
స్నాన మాడంగఁ దనప్రియ ♦ సఖునితోడ, వినుతసత్కీర్తిజాబాలి ♦ తనుజుఁ డంత.

మ. అతితేజస్వితఁ దుర్నిరీక్ష్యుఁ డపరో♦ద్యద్బాలభానుండు నా
వితతశ్రీ వెలుఁగొందుఁ దత్తనువు పృ♦థ్వీనాథ! సౌదామినీ
తతిచేఁ జేసి పసిండినీట నవలి♦ప్తం బైనచందాన; వాఁ
డతిమాత్రంబు చెలంగుఁ జూపఱకు న♦త్యాశ్చర్యముం గొల్పుచున్. 149

ఉ. ఆతని దేహకాంతుల న♦హంబు వెలింగెడి క్ష్మాతలేంద్ర! బా
లాతపయుక్తమైనగతి, ♦ నవ్విపినంబు దవాగ్నియుక్తమా
భాతిని; దప్తలోహరుచి♦పావనదీర్ఘసురక్తసజ్జటా
వ్రాతమునన్ సకీలచయ♦వహ్నివిధంబునఁ గ్రాలు నాతఁడున్. 150

ఉ. తేజరిలున్ దపోవిపిన♦దేవతనూపురమో యనన్ సము
ద్భాజితధర్మశాసనవి♦ధానవుఁగంకణమో యనంగ సం
పూజితదక్షిణశ్రుతిని ♦ బొల్చెడుతత్స్ఫటికాక్షమాల; యు
ద్వేజితసర్వభోగచయు♦ వేగుఁ డతండు నుతింప శక్యమే. 151

క. గగనోన్ముఖబకసన్నిభ, మగుచున్ స్వర్గంబుత్రోవ ♦ నటుచూపెడుదా
నిగతిని నుద్గ్రీవత నిం, పగు స్ఫాటికకుండి యొడమ♦హస్తమునఁ గడున్. 152

క. భూతిత్రిపుండ్ర మొప్పెడు, నాతనిఫాలంబునందు ♦ నడరుచు విషయ
వ్రాతానుభవనివృత్తికి, నై తాఁ జేసినత్రిసత్య ♦ మన నుజ్జ్వలమై. 153

తే. స్కంధదేశావలంబి యై ♦ గ్రాలుచుండు
కృష్ణమృగచర్మ మలతప♦స్స్పృష్ణచేతఁ
బీతమై లోని కేగుప్ర♦భూతధూమ
పటలమో యన నొప్పును ♦ బార్థివేంద్ర!. 154

చ. నవబిససూత్రనిర్మిత మ♦నంగ నితాంతలఘుత్వసంపదన్
బవనవిలోల మై యలర ♦ వామభుజంబున జన్నిదంబు, మా
నవపతి! కుమ్మభాజనస♦నాథసదగ్రపలాశదండము
త్సవ మొదవింప వామకర♦తామరసంబున నాతఁ డొప్పెడున్. 155

సీ. విటపముంబలె మృదు♦విస్ఫురద్వల్కలసంవృతోజ్జ్వలదేహ♦చారుతరుఁడు
సామజకలభంబు♦చాడ్పున సంఫుల్లకైరవదళసిత♦చారుదతుఁడు
కంజాతనికరంబు♦కరణి దివాకరఖరకరావళిపాన♦కలితహృదుఁడు
స్రోతస్వినీతట♦క్షోణీరుహముభంగి సంతతజలధౌత♦సజ్జటుండు

తే. గిరివిధంబున మేఖలా♦పరిగతుండు
వరుణుచాడ్పున సువ్రతోద♦వాసుఁ, డతుల

నర్ధరాపతివడువున ♦ తుషితవిగ్ర
హుండు, హరిచందనమున, గతాం♦హుండు మఱియు. 156

తే. రాహువువిధానఁ గడు సోమ♦రతియుతుండు,
నీరజాప్తునిరథము నా ♦ నియమితాత్మ
చక్రుఁ, డంబుధివడువున ♦ శంఖమండ
లోజ్జ్వలావర్తగర్తుండు ♦ నుర్వరేశ!. 157

తే. ధరణిపతి! దృష్టగంగావ♦తరణుఁ డతఁడు
సారెకు భగీరథునిమాడ్కి; ♦ జలదవేళ
భాతిఁ బ్రశమితరజుఁడు; ప్ర♦భాతవేళ
యట్లు బాలాతపపిశంగుఁ ♦ డరయ నతఁడు. 158

తే. అధిప! యెంతనివర్ణింతు ♦ నతనిమహిమ
సంయతుఁడు గాఁడు మోక్షార్థి; ♦ సామవచన
పరుఁడు సతతమహాదండ♦ధరుఁ, డవామ
నయనుఁడు సునేత్రయుగళుండు ♦ నయవిదుండు. 159

తే. తలఁచు సజ్జనహృదయముల్ ♦ ధరణినాథ!
తలఁప నిర్హేతుకాప్తమి♦త్రములు మఱియు
నధికకరుణార్ద్రములుగదా ♦ యవని; నన్ను
నట్టు లాయాసపడుదాని ♦ నతఁడు గాంచి. 160

చ. దయ తొలుకాడ నిట్లనియె ♦ దగ్గఱనుండు మునీంద్రపుత్రుతో
నయొయొ వయస్య! చూచితె శు♦కార్భక మియ్యది యెట్లు వచ్చెనో
కయికొని పోవు శ్యేనముము♦ఖంబుననుండియొ చెట్టుకొమ్మనుం
డియొ యిది జాఱి క్రిందఁ బడె ♦ నేరదు నిల్పఁగఁ గంధరంబునన్. 161

చ. పలుమఱు దొర్లి పొర్లపడుఁ ♦ బైపయి నూర్పులు పుచ్చు నెంతయున్
నిలువఁగ లేదు; నేత్రములు ♦ నేరదు విప్పఁగ; నోరు తెర్చెడిన్
బలుమఱు దూరపాతమునఁ ♦ బ్రాణము లున్నవొ లేవొ యక్కటా!
నిలువఁగనీయరా దిచట ♦ నీళులయొద్దకుఁ గొంచు రమ్మికన్. 162

చ. అని ననుఁ గొంచు రాఁగ నతఁ ♦ డాసరసీతటి కేగుదెంచి వే
యునిచియుఁ గుండికదండముల ♦ నొక్కచో నీళులచెంతకు న్ననున్
గొని చని నోరుఁ దాఁ దెఱచి ♦ కుత్తుక నొక్కొకనీటిబిందువున్
జొనిపెను మెల్లఁగన్ మెలపు♦చొప్పడ వ్రేళుల నంత భూవరా!. 163

చ. జలములఁ జిల్కరించి సుప♦జాతము లయ్యెను గ్రొత్తప్రాణముల్
జలకము లాడ నంతఁ జనెఁ ♦ జల్లని తామరసాకునీడలో
నిలిపి తటాంతికమ్మున వి♦సీకుఁ డతండు సనుర రయంబునన్
జలకము లాడి యంతమున ♦ సల్పి జపం బఘమర్షణంబులన్. 164

సీ. నవసరోరుహముల ♦ నళినాప్తునకు నర్ఘ్య మిడి లేచి విదిరించి ♦ జడలగుంపు
కరతలంబునఁ గుండి♦కను దోయముల నించి ధౌతవల్కంబులఁ ♦ దాఁ ధరించి
సజ్యోత్స్నచంద్రుని♦చాడ్పున నూతనస్నానార్ద్రజటు లగు ♦ సకలమౌని
తనయులు తనవెంటఁ ♦ దవిలి రా నునుఁ గొని తరలెఁ దపోవన♦స్థలమువైపు

తే. వనతిదూరంబు గా నొక్క♦యాశ్రమంబు
దృష్టిగోచర మయ్యె నో♦దివ్యచరిత!
దాని పెంపు నుతింప నా♦తరమె యౌర
యపరవిధిలోకమే యది ♦ యవనినాథ!. 165

## జాబాల్యాశ్రమవర్ణనము.

వ. అందు. 166

ఉ. ఒక్కెడ వేదఘోషములు ♦ నొక్కెడ శాస్త్రవిచారచర్చ లిం
కొక్కెడ యోగవిద్యగతి ♦ యొక్కెడ సుజ్ఞకళావివేచనం
బొక్కెడ మంత్రసాధనము ♦ లొక్కెడ బ్రహ్మవిచారమండలం
బెక్కెడఁ జూచినన్ మదికి ♦ నింపును సొంపును గూర్చు నయ్యెడన్. 167

క. అన్యత మెఱుంగ; దసంగుఁడు, కనియెఱుఁగడు దానినపుడు; ♦ కలికాలంబున్
గనియునువినియును నెఱుఁగదు,మనుజాధిప! దానిమహిమ♦మహి నెన్నఁడెఱుఁగున్.

చ. జలములఁ బోయుచుండు నట ♦ త్యాగరుహాపంక్తికి నెల్లసామజం
బులు గొనివచ్చి తొండములఁ; ♦ బూని; తపస్వుల కిచ్చు కొ
మ్ముల నలకందమూలములఁ ♦ బొల్పుగఁ ద్రవ్వి మృగంబు లౌర; కే
కులు మునిహోమవహ్నిఁ బురి♦కొల్పును ఱెక్కల వీచి మండఁగన్. 169

క. పరిచితశాఖామృగములు, జరదంధతపస్విసేవ ♦ సల్పుచు నుండున్
గరములఁ గొని గొనిపోవుచు, మరలం గొనివచ్చు చెవుడు ♦ మానవనాథా!.

సీ. హరిహరబ్రహ్మల ♦ నర్చించువారును బిత్రుదైవతంబులఁ ♦ బిల్చువారుఁ
బలుపొత్తములఁ బౌరిఁ ♦ బఠియించువారును ముంగిళ్లనలుకంగ ♦ మొనయువారు

నలిధులఁ గొనివచ్చి ♦ యర్ఘ్య మిచ్చెడువారు వన దేవతల బలిఁ ♦ దనుపువారు
వల్కలతూళన♦పరత నుండెడువారు సమిధలఁ గొనితేరఁ ♦ జనెడువారు

తే. కృష్ణమృగచర్మముల సంస్క♦రించువారు
నీశ్వరధ్యానపరులయి ♦ యొసఁగువారు
నగుచు నిజధర్మపరులయి ♦ యఖిలమునులు
మెలఁగుచుండిరి యచ్చట ♦ మేదినీశ!. 171

సీ. అగ్నిధూమములందె ♦ యలరు మాలిన్యంబు చరితల లే దందు ♦ త్ర్యాతలేంద్ర!
కదళీదళములందె ♦ కలదు చాంచల్యంబు మనముల వెదకినఁ ♦ గనఁగరాదు
తీక్ష్ణత తనరును ♦ దీవ్రకుశాగ్రమ్ములందు స్వభావంబు♦లందు లేదు
కను లెఱ్ఱనౌటయుఁ ♦ గలదు కోయిలలందుఁ బరకళత్రంబులఁ♦బరఁగ దెపుడు

తే. చనుల నంటుట మునిధేను♦చయములందఁ
గామినులయందు లేదందుఁ; ♦ గలశములన
కలదు కంఠగ్రహం బటఁ ♦ గానరాదు
సురతములయందు మునులకు; ♦ ధరణినాథ !. 172

వ. వెండియు. 173

తే. పక్షపాతంబు కృకవాకు♦పంక్తులందె, లేదు విద్యావివాదైక♦లీలలందు
భ్రాంతి యనల ప్రదక్షిణ♦ భ్రాంతియందె, కాని కలుగదు శాస్త్రార్థ♦కలనలందు.

తే. కలదు వసుకీర్తనము దివ్య♦కథలయందుఁ
దృష్ణఁ గలుగదు; గణనంబు ♦ తేజరిల్లుఁ
దలఁప రుద్రాక్షమాలలఁ ♦ దనువులందుఁ
బొనర దేరికి నత్తపో♦భూమియందు. 175

సీ. మునిబాలనాశంబు ♦ పొనరును గ్రతుదీక్ష మృత్యువుచేఁ గాదు ♦ మేదినీశ!
రామానురాగంబు♦రామాయణముననే యౌవనంబునఁ గాద ♦ నంతచిత్త!
ముఖభంగవికృతి తా ♦ మునలితనంబున ధనతృష్ణచేఁ గాదు ♦ దానవీర!
మేఖలాబంధంబు ♦ మేకొను వ్రతచర్యఁ గలహంబుచేఁ గాదు ♦ లలితచిత్త!

తే. శకునివధ భారతంబున; ♦ జాడ్య మరయ, చందనంబున; బుధజన♦సన్నుతాత్మ!
మూలములకె యధోగతి;♦భుజగములకె, భోగసంపద యత్తపో♦భూమియందు.

క. జలకలశపూరణధ్వని, జలధరరావం బటంచు ♦ శంకించి శిఖం
డులు సోత్కంఠము లై యట, సలిపెడి నాట్యంబు పురులు♦సడలించి దమిఁ,

తే. అర్ధపక్వపురోడాశ♦సార్ధపుణ్య, పరిమళామోదితంబున♦పారసుష్మృత
హోమవాలుతవహాఝుంకర♦ణోజ్జ్వలంబు, సంతతాధ్యయనారావ♦సంగతంబు.
తే. అవిరతాకర్ణనంబును ♦ నంది కీర, ములు పఠించువషట్కార♦ములను నచటఁ
జదువుచుండు సుబ్రహ్మణ్య♦సామమెపుడు, సారెసారెకు శారికా♦చయముఁ లధిప!.
తే. రక్తచందనసంలిప్త♦రమ్యమిహిర
మండలంబును గరవీర♦మాన్యకుసుమ
ములను బూజించి సాఁగిలి ♦ మ్రొక్కు లిడెడు
మునులచే నొప్పు న త్తపో♦భూమి యధిప!. 180

వ. మఱియు. 181

క. తిని బ్రతుకు నడవికుక్కలు, దినమును మునినిహితవైశ్వ♦దేవబలి నటఁ
మను వాపీకలహంసము, లును నివ్వరిబలిని మెసవి ♦ లోకస్తుత్యా!. 182

క. మునిబాలుర హరిణంబులు, చను వుట్టిపడంగ మృదుకి♦సాలయజిహ్వా
దనువును మనమును బరవశ, తను గాంచఁగ నాకుచుండు ♦ ధాత్రీరమణా!.

చ. అనవరతాజ్యహోమముల ♦ నంది ప్రియంబును నగ్నిహోత్రముల్
మునిజనముఁ సదేహముగ ♦ ముక్తిపదంబున కంప మీఁదికిఁ
జనియెడు ధూమరేఖమిష ♦ స్వర్గపథంబున మెట్లు గట్టెడుఁ
మనుజవరేణ్య! తన్మహిమ ♦ మాదృశు లెన్నఁగ శక్య మానొకో. 184

సీ. తపసులఁ గన వచ్చి ♦ తమిఁ గ్రుంకుస ప్తర్షు లన పీచికాబింబి♦తార్క లలర
మునులు గొల్వఁగ డిగ్గి♦తనరెడు గ్రహగణ మనఁ బ్రఫుల్లకుముద♦వనముచెలఁగ
మునిజనసంపర్క♦మున నపగత మైనపగిదిఁ గాలుష్యంబుఁ ♦ బాసి చెలఁగ
స్నాన మాడుమునీంద్ర♦సం స్తవగీతంబు లన హంసకలకల♦నినద మలరఁ

తే. జెలఁగు నయ్యాశ్రమోపాంత♦సీమలందు
దివ్యమధుమాధురీధుర్య♦నవ్యనలిల
పూరితోజ్జ్వలదీర్ఘికల్ ♦ భూరివారి
విహగకులసంకులంబులు ♦ వీరవర్య !. 185

చ. అమలచరిత్ర! మానిసుతు ♦ లగ్నుల వ్రేల్చుసమిత్సుమావళీ
చిమచిమనాదముల్ చెలఁగుఁ ♦ జెల్వగ వీనుల కింపుఁ బెంపుచుఁ
దమతమప్రాఁతపాఠములఁ ♦ దద్ద పఠించెడివారికంఠనా
దములకు విందులై యచటఁ ♦ దారతరస్ఫుటమాధురీఝురిఁ. 186

ఉ. దంతికులార్ధభుక్తపతి♦తంబులు వాక్సతిదోఃపరిచ్యుతా
త్యంతమనోజ్ఞశంఖధవల♦యంబు లనంగ మృణాళఖండముల్

వింతచెలంగఁ బొల్పెడిని ♦ విశ్వధురంధర! నాతపోవన
ప్రాంతములన్ సుకర్బురతఁ ♦ గ్రాలఁగఁ జేయుచు నార నిచ్చలున్. 187

చ. సతతగళత్ప్రసూనముల ♦ త్క్ష్మారుహపంక్తుల నర్చ్యమాన మై
సతతగతి స్నతాగ్రవిల♦సద్వనవల్లుల నమ్యమాన మై
వితతకిసాలయాంజలుల ♦ వే విటపంబుల సేవ్యమాన మై
క్షితిప! తదాశ్రమం బెపుడు ♦ చెన్నలరారు మనోజ్ఞ మై గడున్. 188

ఉ. వేదములం బఠించుచును ♦ వెంబడి శిష్యులునుం బ్రశిష్యులున్
భూధవ! గొల్చి రా మునులు ♦ పుష్పసమిత్కుశమృత్ఫలంబులన్
గాదము లింధనంబులను ♦ గైకొని వచ్చుచు నుందు రిందిరా
నాథపదాంబుజాతముల ♦ నర్మిలిఁ జిత్తమునం దలంచుచున్. 189

సీ. పరఁగ నిర్భయవృత్తి ♦ హరిణంబు లెప్పుడు సై్వరవిహారంబు ♦ సలుపు నెచట
సీతాపహరణంబు ♦ చేయ మారీచుండు మాయాకురంగ మై ♦ మలఁగె నెచట
దశరథతనయుండు ♦ దా ధనుఃకోటిచేఁ గందంబులను ద్రవ్వి ♦ కందె నెచట
రావణుసోదరి ♦ రాముని మోహించి ముఖభంగమున వెత ♦ మునిఁగె నెచట

తే. ఖరుఁడు మొదలగురాక్షస♦గణము లెచట
యమునిఁ గొల్వంగ నేగి ♦ యట్టిదండ
కాటవి చెలంగు నాయాశ్ర♦మాంతికమున
ఫుల్లనళినీవనంబుల ♦ నుల్లసిలుచు. 190

సీ. వనదేవతాగణ♦వినుతడోలాయితపూగీలతాజాల♦భూషితములు
మకరందరసపాన♦మత్తమధువ్రతఝుంకారసహకార♦సంయుతములు
తాలసాలతమాల♦తక్కోలతిలకాదసురుచిరానోకహ♦శోభితములు
నేలాలతాజాల♦నాళికేరకలాపలోలలోధ్రలవంగ♦లాలితములు

తే. వికచకైతకరేణుక♦పింజరములు, వికసదగమాంతకిసలయ♦విలసితములు
శారికాకీరకోకిల♦శబ్దితములు, నగున నేకాటవులు దాని ♦ నంటి చెలఁగు. 191

వ. వెండియు జలధరసమయంబునట్లు వనమధ్యసుఖప్రసుప్తహరియును, హనుమంతునివిధంబున శిలాప్రహారసంచూర్ణితాక్షస్థిసంచయంబును, ఖాండవవినాశోద్యతార్జునునిమాడ్కిఁ బ్రారబ్ధాగ్నికార్యంబును, సురభివిలేపనంబు గలిగియు సంతతావిర్భూతధూమగంధంబు గలదియు, మాతంగకులాధ్యాసితం బయ్యు నతిపవిత్రంబును, ధూమకేతుశతభాసురం బయ్యుఁ బ్రశాంతోపద్రవంబును,

బరిపూర్ణద్విజరాజమండలసనాథం బయ్యు సన్నిహితతరుగహనాంధకారంబును,
నతిరమ్యంబును నగునయ్యాశ్రమమధ్యభాగంబున. 192

తే. తనరు నొక్కరక్తాశోక♦తరువరంబు, తాపసాలంబితాజినో♦దకకరండ
కలితవిటపంబు మృగశాబ♦కనికురుంబ, వీయమానాలవాలాంబు♦విలసితంబు.

వ. మఱియు నది. 194

తే. తాపసాబద్ధకుశచీర♦దామకంబు, హరితగోమయసంలేపి♦తామలస్థ
లంబు పుష్పోపహారసు♦లాలితంబు, వరమహాలక్తకాశోణ♦పల్లవంబు. 195

తే. అతివిశాలావకాశత♦ నలరుదాని
క్రింద నీడను దాపస♦బృంద మెల్లఁ
గొలువఁ గూర్చుండి వేదముల్ ♦ కుతుక మెసఁగ
శిష్యులకుఁ జెప్పు నొకతప♦స్సిద్ధుఁ గంటి. 196

జాబాలివర్ణనము.

ఉ. చుట్టును సంద్రముల్ చెలఁగ ♦ శోభిలుభూవలయంబుపోలికన్
గట్టుల వేష్టితం బగుచుఁ ♦ గ్రాలెడుస్వర్ణనగంబు మాడ్కి న
ల్దట్టుల నగ్నిహోత్రములు ♦ తార్కొనఁ బొల్చుముఖంబుభాతిఁ జూ
పట్టెను నత్తపస్వి ఋషి♦పంక్తిసమావృతుఁ డై చెలంగుచున్. 197

క. భూతిత్రిపుండ్రకమ్ముల, నాతనినిటలప్రదేశ ♦ మలరును దివ్య
శ్వేతాకాశనదీత్రి, స్రోతములన్ హిమనగంబు♦రుచిరశిలవలెన్. 198

చ. ప్రణయినిఁబోలెఁ గేశములఁ ♦ బట్టి చెలంగుచు, శాపభీతి నాన్
దనువు చలింపఁ గ్రుద్ధగతిఁ ♦ దాల్చియు భ్రూకుటి, మత్తచాడ్పునన్
దనరఁగ మందయానము ని♦తాంత మలంకృతనాఁగ నిచ్చలున్
గని తిలకంబుఁ బొల్చుజర ♦ గౌరశరీరునిఁ జేసె నాతనిన్. 199

చ. సురపతిలోక మెక్కఁగను ♦ సొంపుగఁ గట్టినపుణ్యరజ్జులో
యురుతరపుణ్యభూరుహస♦ముజ్జ్వలపుష్పగుళుచ్ఛకంబులో
పరమమునీంద్రులం గెలిచి ♦ పట్టినధర్మపతాకలో యనన్
బరఁగును దజ్జటల్ పలిత♦పాండురదైర్ఘ్యవిరాజితంబులై. 200

చ. అవిరతమంత్రపాఠవివృ♦తాధరసంపుటుఁ డౌట బైటవ
చ్చువిశదతద్రదాంశువులు ♦ శోభిలు సత్యపుమొల్కలో యనన్
బ్రవిమలచిత్తవృత్తు లన ♦ భాస్వదనుగ్రహవేణులో యనన్
నృవినుత! వానిచే విబుధ♦నిమ్నగ జహ్నుఁడుపోలెఁ బొల్చెడున్. 201

క. లోనికిఁ బోయినదవుడలు, మూ నగు నెత్తైనముక్కు ♦ మఱి చెక్కిళులుం
బూని చెలంగెడు నాతని, యానన మతివిరళపత్ష్మ ♦ మగుచు నరేంద్రా!. 202

క. అతిదీర్ఘరోమరుద్ధ, శ్రుతివివరము లాకరాళి ♦ సురుచిరదృక్కుల్
అతినాభికూర్చకాళియు, క్షితివర! తద్వాయసు చెప్పఁ ♦ జెప్పకయ వడిన్. 203

క. తల క్రిందు లైనకళిరే, ఖలు నాఁ దద్భ్రూయుగంబు ♦ గ్రాలు వళిసమా
కలితశిథిలంబు లయి గడు, లలితాకృతి నొప్పు చుండు ♦ లాలితచిత్తా!. 204

క. అతిచపలేంద్రియసైంధవ, తతి లోఁ గట్టంగ నుండు ♦ త్రాడు లనంగా
నతిదీర్ఘకంఠనాడులఁ, దత మై తత్కంఠసీమ ♦ దనరు నరేంద్రా!. 205

క. ఎడనెడ స్ఫాటికమణులను, గడు నొప్పుచు బ్రహ్మరాణి ♦ కరహారము నాఁ
బడుమాక్తికాక్షవలయం, బడరఁగ జపియించు చుండు ♦ నవరెడువ్రేళ్లన్.

చ. పవనకృతోర్మికానిచయ ♦ భంగములం దనరారునభ్రగం
గవడువునన్ దదీయతను ♦ గాత్రము పేలవకల్యపంజరం
బు వెలయు; జందె మంసమునఁ ♦ బొల్చెడు నచ్చటఁ దేలుతూఁడు నా
రవినిభతేజ! తన్మహిమ ♦ రాదు నుతింపఁగ నెట్టివారికిన్. 207

ఉ. వండినతీవెజొంపముల ♦ భాసిలు వృద్ధసురద్రుమంబు నా
నుండు సమున్నమద్ధమని ♦ కోజ్జ్వలదేహము గల్గి పొల్చునా
తండు నిరంతరభ్రమిత ♦ తారకచక్రుఁడు దా సునీతిపు
త్రుం డపరుం డనంగ; నఘ ♦ దూరుఁడు వెండియుఁ బొల్చు ధీరుఁ డై. 208

ఉ. చంద్రగభస్తులన్ సుగుణ ♦ సంతతితంతుల సౌధఫేనతా
జిం దగ నిర్మితం బొ యనఁ ♦ జెన్నగు శుభ్రదుకూలవల్కలం
బింద్రసమానతేజ! ధరి ♦ యించి విభూతివిలిప్తదేహుఁ డై
చంద్రధరుండు నాఁ బొలుచు ♦ శాంతికి నిల్లయి చారుమూర్తి యై. 209

ఉ. ఆతనిదండ నింపెసఁగు ♦ నచ్ఛకమండులు వామరాపగా
నీతపవిత్రశీతజల ♦ నిర్భరితంబు త్రిదండవర్తి యై
శ్వేతసరోజరాశికడఁ ♦ జెన్నలరారుమరాళమో యనన్
బూతచరిత్ర! దానికడఁ ♦ బొల్చును నాతని యోగవాగలున్, 210

వ. వెండియు నాతండు. 211

సీ. వైనతేయునిమాడ్కి ♦ స్వప్రభావాప్తసద్ద్విజయాంబమాన్యుఁడై ♦ తిరుగుచుండు
బడబానలమభంగిఁ ♦ బాయక యేప్రొద్దు వారిభక్షుం డయి ♦ వఱలుచుండు

శిశిరర్తునూర్యుని♦చెలువున నుత్తరాసంగంబు దాల్చి యు♦ష్ణాంగు చుండు
నలబృహస్పతిభాతి ♦ నాజన్మవర్థితకచుఁ డయి మిక్కిలి ♦ గ్రాలు చుండు
తే. శూన్యనగరంబువిధమున ♦ సొంపునించు
దీనుల కనాథులకు నార్త♦మానవులకు
శరణుఁ డామౌనిచంద్రుండు ♦ నరవరేంద్ర!
పరఁగు జాబాలి యనుపేర ♦ ధరను నతఁడు. 212

క. కనుఁగొని యామునిచంద్రుని, మనమునఁ గడువిస్మయంబు ♦ మల్లడిగొనఁగా
మనుజేశ! యిట్టులని నే, ననుకొంటిని సారెసారె ♦ కవనీనాథా!. 213

చ. అరెరె తపఃప్రభావ మరె ♦ ప్రోదినిమాడ్కి నితాంతతప్తక
ర్బురరుచిరావదాత మయి ♦ పొల్చెడు నీతనిమేను కాంతిమైఁ
బరఁగియుఁ దేజి చూడ నయ♦నంబులకుఁ మిఱుమిట్టుగొల్పెడిన్
బొరసెడు క్రొత్తవారు గనఁ ♦ బొందక యుందురె భీతి నెంతయున్. 214

ఉ. ఈమునిపల్లె ధన్య మని ♦ యేల వచింపఁగ భూతలంబె యీ
భూమివిరించి నా నెగడు♦పూతచరిత్రుని యున్కి ధన్య మా
నేమి తపం బొనర్చిరొకొ ♦ యీమునిసంఘము లెల్ల రేవగ
ల్లీమునిపాదముల్ గొలువ ♦ నీతనిసత్కథ లాలకింపఁగన్. 215

ఉ. ఎంతటిధన్య భారతియు ♦ నీమహనీయుని మోముఁదామరన్
సంతత మాశ్రయించి ద్విజ♦సంతతి గొల్వఁగ హంసిమాడ్కి న
త్యంత మగాధనిమ్నకరు♦ణాంబుసముజ్జ్వలమానసంబునం
దెంతయు వేడ్క నుండెడు య♦థేష్టవిహారవినోదగోష్ఠులన్. 216

చ. అలవడె నాల్గువేదముల ♦ కంబుజగర్భముఖాంబుజంబులన్
జెలఁగెడువాని కిప్పటికిఁ ♦ జెన్నగు రెండవచో టిదొండు భూ
తలమును నీతదాశ్రితముఁ ♦ దాఁ గని యంబర మింకఁ దాల్చునే
యలగరువంబు సప్తఋషి♦యాశ్రయజన్యము బావురేబళీ. 217

క. కలికాలజలదవానర, కలుషితసర్వాగమములు ♦ గని యితని సరి
త్తులు శరదముకరణి విని, ర్మలతను గని చెలఁగు సహాహ ♦ మరల జగమునన్.

క. కృతయుగనామంబయినను, మతిఁ దలఁచున ధర్మ మితఁడు ♦ మర్దించి కలిన్
సతతము తనుఁ జేపట్టుట, వితతస్నేహమున నెల్ల♦విధముల నియతిన్. 21

మ. ప్రళయాదిత్యమరీచిసన్నిభము శు♦భ్రాంశుప్రాంశుగౌరంబు ను
జ్జ్వల మై యొప్పెడు నీమునీశ్వరు జటా♦భారంబునం దగ్నికి

లల శ్రీరామునిఁ బోలె జహ్నుసుతలీల౯ శూలిమ స్తంబున౯
బొలుచు౯ వార్ధక మెంతధైర్యము భళా ♦ పో నిర్భయస్వాంత మై. 220

చ. అనవరతాజ్యధూమపట♦లాసితపర్ణకుటీరుఁ డై నయీ
తనిమహిమ౯ దపోవనము ♦ దారసిల౯ భయ మందినట్లు తాఁ
జనియెడు దూరదూరమున ♦ సారసబాంధవఘృష్టిజాలముల్
దనరును మేటి యై యితఁడు ♦ తాపసవర్యుల కెల్ల నద్దిరా. 221

చ. అనిలుఁడు మందమందగతి ♦ నాడెడు నీతని మ్రోలఁ బుష్పవా
సనలు వహించి కొంకుచును ♦ జాలితవల్కదుకూలుఁ డై భళా
యనిలవిలోలపుంజితశి♦ఖావళు లై గొను హవ్య మగ్ని లీ
తనిపయిఁ బ్రీతిచేత సత♦తంబు కృతాంజలు లై నపోలిక౯. 222

సీ. సేతువు సంసార♦సింధువుఁ దరియింపఁ బరశు వాశాలతల్ ♦ భంగపఱుప
వనవహ్ని యనురాగ♦పల్లవంబులు గాల్పఁ గులిశంబు లోభాద్రి♦కులముకూల్పఁ
దిగ్మదీధితి మోహ♦తిమిరంబు విరియింప మంత్రంబు క్రోధాగ్ని♦మహిమ నణఁప
నొరగల్లు శాస్త్రక♦ర్బురము పరీక్షింప నగ్రయాయి సదధ్వ ♦ మరసి చూప

తే. మూల మీముని యుపశాంతి♦సాలమునకు
నబ్ధి సంతోషసుధకుఁ బ్ర♦జ్ఞారినాభి
యాదరవు క్షాంతిజలముల ♦ కహహ యితఁడు
మానిమాత్రుండె యారమా♦జాని గాక. 223

సీ. అర్గళబంధనం ♦ బలనారకద్వారమున, కిమ్ము మంగళ♦పుంజమునకుఁ,
గులగృహం బాచార♦కోటికి, నుత్పత్తి సాధుత్వమున, కాఁపు ♦ సత్వమునకుఁ
బుట్టిల్లు సత్పుణ్య♦పుంజమ్మునకుఁ, జెలి నిక్కంబునకు నిక్క, ♦ నియమమునకు
స్థల మార్జనమునకు, ♦ సత్ప్రతిపక్షుండు కలికాలమున, కరి ♦ కలుషమునకు,

తే. నవుర యీమునిపుంగవుఁ ♦ డనభిముఖుఁడు
సుఖముల, కసమ్మతుఁడు ధైర్య♦శోకములకు,
ననుకూలుండు నభిమాన♦మున, కభూమి
మదవికారంబులకు మాని♦మాన్యుఁ డితఁడు. 224

తే. ఔర యీతనిమహిమ నె ♦ యాశ్రమంబు
నలరు నుపశాంతవైర మై ♦ యపగతోరు
మత్సరం బయి యనిశంబు ♦ మహిమఁ గాంచు
నరరె మహాత్ములమహిమంబు ♦ నౌనె పొగడ. 225

తే. సహజవైరంబు మాని ప్ర♦శాంతమాన
సంబులై యుండు నీయాశ్ర♦మంబులోన
నెల్లతిర్యక్కులును సుఖ ♦ మింపెలర్ప
బ్రహ్మలోకంబె యిది తపో♦వనము కాదు. 226

చ. అరెరె భుజంగమంబు లివి ♦ యాతపతాపహతంబు లుత్పత
త్స్ఫురుచిరచంద్రకంబు లయి ♦ శోభిలుచుండుశిఖండిబర్హముల్
సరభసవృత్తిఁ జొచ్చు నవ♦శాద్వలమున్ మృగనేత్రకాంతిఁ గ
ర్బురమును జొచ్చుమాడ్కి వెఱ♦పుం గొన కించుకయున్ మనంబునన్. 227

చ. జననిని వీడి యీహరిణ♦శాబము సింహికయొద్దఁ బాలుఁ ద్రా
గును మృగరాజపోతములఁ ♦ గూడి చెలంగుచు నాట లాడుచున్
మును చను చేఁపు సింహికకు ♦ మోదమునం గనినంత దీని నీ
వన మిటు లొప్పునే విగత♦వైరము శాంతము నై వెలుంగుచున్. 228

మ. బిసకాండభ్రమఁ బిల్లయేనుఁగులు ని♦ర్భీతిన్ మృగాంకాంశుశు
భ్రసటాభారముఁ బట్టి లాగినను హ♦ర్యక్షాధినాథుండు రో
షసమాక్రాంతుఁడు గాఁడు సౌఖ్యమున నీ♦షన్మీలితాక్షుండు నై
పొసఁగన్ మెచ్చుచుఁ జొక్కు నీతఁ డహహా♦ప్రోద్యత్ప్రమోదాత్ముఁ డై.

క. కపికులము లివిగొ యిచ్చట, నపగతచాపల్యభరము ♦ లగుచు ఫలములన్
దపసులకుఁ దెచ్చి యొసఁగుచు, నుపచారము చేయు నహహ♦యుల్లంబలరన్.

క. మదమత్తసింధురంబులు, మదసలిలము లాను చెపుడు ♦ మధుపకులంబుల్
రొదసేయుచున్నఁ గటముల, సదయత శ్రుతితాడనములు ♦ సల్పక యుండున్.

ఉ. భూజములున్ సవల్కఫల♦మూలము లై మునిహోమధూమవి
భ్రాజితకృష్ణచర్మముల ♦ భాసురలీల ధరించి యొప్పును
ద్వ్యాజితమూర్తు లై కడు ని♦వీతజలానలమారుతంబు లై
తేజరిలున్ దపోధనుల ♦ దీప్తినిఁ బ్రాణులఁ జెప్ప నేటికిన్. 232

సీ. అని నేను మనమున ♦ నచ్చెరు వందుచు ననుకొనుచుండ నా♦మునిసుతుండు
హారితుఁ డాభూరు♦హచ్ఛాయ నొకయెడ నుంచి నన్ జనకుస♦మంచితాంఘ్రి
జలజంబులకు మ్రొక్కి♦సరగునఁ గూర్చుండెఁ గుశవీథి వినయంబు♦గొనలుసాఁగ
మును లెల్ల ననుఁ గాంచి♦ముదితాంతరంగు లై యడిగి రాతని నిట్టు♦లమలచరిత!

తే. యెచట దొరకెను నీ కిది ♦ యెట్లు దొరకెఁ
దెలుపు మన నాతఁ డిట్లని ♦ తెలుపసాగె

స్నాన మాడంగఁ గమలినీ♦సరసి కేను
బోయితిని నేఁడు తత్తీర♦భూమియందు. 233

ఉ. ఆతపతప్తసైకతము♦నం దొకచోఁ బడియుండె నాతపా
యాతపరిశ్రమంబునఁ గు♦లాయపరిచ్యుతి దూరపాతసం
జాతమహార్తి మూర్ఛ నవ♦శంబయి యూపిరిపోక యున్నయీ
నూతనకీరశాబము న♦నూనదయన్ గొని తెచ్చితిన్ దమిన్. 234

ఆ. ఎక్కడ నలవికామి ♦ నావనస్పతి నాకు, గూఁటి నిడఁగ లేక ♦ కూర్మితోడఁ
దెచ్చినాఁడ దీనిఁ ♦ దీర ఱెక్కలు వచ్చి, యాకసమున కెగురు♦నంత శక్తి.

తే. వచ్చునంతకు నిత్తపో♦వనమునందె
యొక్కతరుకోటరంబున ♦ నుండి మనము
తెచ్చి యొసఁగెడుఫలములఁ ♦ దినుచు నిచట
నుండు ననదలఁ బ్రోచుట ♦ యుత్తమంబు. 236

క. ఆవల నిచ్చకువచ్చిన, యేవలనికి నైనఁ బోవు ♦ నిచ్చటనైనన్
బోవిడఁ జాలక మనలను, సావాసముబలిమి నుండు ♦ సన్మునులారా!. 237

చ. అని యివి యాదిగాఁ గలుగు♦నస్మదుపాశ్రితభాషణంబులే
యనుకొను చుండఁ దజ్జనకుఁ ♦ డాదట నించుక మోముఁ ద్రిప్పి నన్
గని యుపజాతకౌతుకతఁ ♦ గాంచినవాఁడునుబోలె నెన్నఁడో
మును పలె మాటిమాటికిని ♦ మోమువికాసముఁ జెంద నిట్లనున్. 238

క. తనయువినయఫలమును దాఁ, గను చున్నది యీశుకార్భ♦కంబు ధరణిలో
మునుఁ జేసిన దెవ్వరికిని, గన కూరక పోదటంచుఁ ♦ గలకల నవ్వెన్. 239

ఉ. ఆతఁడు మూఁడుకాలముల ♦ నారయఁ జాలుఁ దపఃప్రభావతన్
భూతల మెల్ల దివ్యనిజ♦బోధమునన్ గరఫేనిలక్రియన్
త్క్ష్మాతలనాథ! గాంచుఁ గత♦జన్మముసంగతి నేత్రగోచరా
యాతసమస్తభూతముల♦యాయువుమాన మెఱింగి చెప్పెడున్. 240

సీ. కాన నత్తాపస♦గణ మెల్ల నాతనిపాదంబులకు మ్రొక్కి ♦ భయము భక్తి
వినయ మ్మలరఁ జేరి ♦ వేడ్క నుప్పొంగుచు ఫాలతలన్యస్త♦పాణులగుచుఁ బ్రమ
ననఘాత్మ!యిది యెట్టి♦యవినయం బొనరించెఁ దొలి యెవ్వరిది మాకుఁ♦దెలియఁ జె
ఖగకులంబునఁ బుట్టఁ ♦ గారణం బేమొకో దీనినామం బేమి ♦ దివ్యచరిత!

తే. యానతి యొసంగి మామది ♦ నడరుచున్న
కౌతుకం బెల్లఁ బాపుము ♦ కరుణతోడ

జగతి నాశ్చర్యముల కెల్ల ♦ జన్మభూమి
గావాకో నీవు నీమూతి♦గామిమహిమ. 241

క. అని యడుగున త్తపోధన, గణమున కిట్లనియె మౌని♦గణ్యుఁ డతం డో
మునివర్యులార! యద్భుత, మును గడుపెద్దదియు నిది యు♦పూర్వముఁ దలఁపన్.

క. కడుప్రొద్దు లేదు స్నానము, నడుపవలెన్ దేవతార్చ♦నంబు సమయమున్
గడచను మీకును లెం డిఁక, నడపుఁడు దినకృత్యముల న♦నంతర మిటకున్.

సీ. కందమూలంబులఁ ♦ గడుపారభుజియించి సాయ మందఱు రండు♦సంధ్యవార్చి
నెమ్మదిఁ గూర్చుండి ♦ యిమ్ముగా సర్వంబు వినిపింతు నిప్పుడు ♦ చనుఁడు మీర
లిది యెవ్వరో తొల్లి♦యే మొనర్చెనో యిది యెట్టులీభువిఁ బుట్టె♦నెఱుకపఱతు
నంతలో దీనిని ♦ నపగతాయాసంబుఁ గావింపుఁ డాహార♦కలన మీర

తే. లాత్మచరితంబు సర్వంబు ♦ నాకళింపుఁ
జేసికొనుఁగాక యిది నేను ♦ చెప్పుచుండ
స్వప్నవృత్తాంతమును గన్న♦పగిదిఁ దాను
ననుచు లేచెను న త్తపో♦ధనుఁడు వేగ. 244

తే. స్నాన మాడంగఁ బోయెను ♦ సకలమునులు
బలసి చనుదేర నాతండు ♦ జలక మాడి
దివసకృత్యంబులను దాను ♦ దీర్చుచుండె
నింతలో సూర్యుఁ డస్తాద్రి ♦ కేగె నృపతి !. 245

సంధ్యాసమయవర్ణనము.

ఉ. స్నానము లాడి యర్ఘ్యవిధి ♦ సల్పెడుమౌను లొసంగురక్తగం
ధానుగతాంగరాగమును ♦ నందె నన రవి శోణకాంతులన్
గానఁగ నయ్యెఁ దాపసులు ♦ గాఢతపం బొనరించువార లూ
ర్ధ్వాననులై తదాతపము ♦ నానిరొ నాఁ గడు మందరశ్మియై. 246

ఉ. మా పుదయించు సప్తఋషి♦మండలిఁ దాఁకునొ యంచుఁ బాదముల్
చాఁపక పశ్చిమాశ రవి ♦ జాఱెఁ గపోతపదానురాగుఁడై
తోఁపుకరంబులన్ వెలఁగెఁ ♦ దోయధిశాయిస్రవన్మరందధా
రాపరిశోభినాభికమ♦లప్రతిబింబ మనన్ బరాంబుధిన్. 247

చ. పతగము లట్లు భాస్కరగ♦భస్తులు వీడి సరోజినీవనిన్
క్షితితలమున్ దినాంతమునఁ ♦ జేరెఁ బదాశ్రమవృక్షకోటులన్

క్షితిధరశృంగకోటులను; ♦ జెల్లెను సంయుతలోహితాతప
క్షితిరుహాపంక్తి మానికుల♦కీలితలోహితవల్కలం బనన్. 248

తే *పశ్చిమాంబుధితలమునఁ ♦ బరఁగుచుండు
పచ్చిపగడంపుఁదీఁగెఁ దాఁ ♦ బైకిఁ బ్రాఁకె
ననఁగ నెఱసంజ దోఁచెను ♦ నస్తమింప
వేవెలుంగు సరోజినీ♦విటుఁడు దాను. 249

వ. అంత నయ్యాశ్రమంబున. 250

సీ మునికన్య లిటునటు ♦ వనదేవతాళికి బలిస్నిగ్ధముల వేయఁ ♦ బరుగు లిడఁగ
మునికుమారకు లగ్ని♦ఘనవేదికలపైనఁ బచ్చనికుశములఁ ♦ బఱవఁ జనఁగ
సంధ్యాభివాదన♦సన్నతి గావింపఁ దాపసబృందంబు ♦ దరలుచుండఁ
గ్రేపు లంభోయని ♦ క్రేళ్లుదాఁటఁగ హోమధేనులఁ బితుకంగఁ ♦ బూనుచుండ
తే. నెందొ విహరించి సంజను ♦ నేగుదెంచు
నత్తపోవనకపిలగో♦వనఁగ రక్త
తారకోజ్జ్వల యగుసంధ్య ♦ తాపసులకు
దృష్టిగోచర మయ్యెను ♦ దేజరిలుచు. 251

చ. కమలిని ప్రోషితుండయినఁ ♦ గాంతుఁడు తద్విరహార్త యై సరో
జముకుళకుండికన్ మధుప♦సంచయచారుజపాక్షమాలికన్
విమలమరాళచేలమును ♦ నిర్మల మౌబిసయజ్ఞసూత్రమున్
దమి ధరియించి తోఁచె దిన♦నాథుఁడు రా వ్రత మూనెనో యనన్. 252

తే పద్మినీనాథుఁ డపరాబ్ధిఁ ♦ బడినవేగ, మున సముత్థితజలబిందు♦పూర మనఁగ
నంబరంబున నందందు ♦ నతిశయిల్లెఁ, దారకాకోరకావళి ♦ ధరణినాథ!.

క. తారకితాంబర మొప్పెను, జారణసుదతీనినిహిత♦సాయంసంధ్యా
చారుసమారాధనసుమ, వారశబల మనఁగ నంతఁ ♦ బార్థివముఖ్యా!. 254

తే. ఊర్ధ్వగతముఖాఖిలతాప♦సోర్ధ్వకీర్ణ, సత్ప్రణామాంజలీజల♦క్షాళ్యమాన
మనఁగ నించుకసేపున ♦ కఖలసాంధ్య, రాగ మంతయు జాఱెను ♦ రాజవర్య!.

—— నిశాముఖవర్ణనము. ——

క. అంతట సాంధ్యవినాశదు, రంతవ్యథఁ గృష్ణచర్మ ♦ మందెనొ రజనీ
కాంత యన నంధకారం, బంతంతకు నిండె జగము♦నంతట నృపతీ!. 256

---

*పాఠాంతరము. తే. తవరెఁ బశ్చిమసాగర♦తటమునుండి, దివికిఁ బ్రాఁకినపగడంపుఁ♦దీఁగె యన గ
వేవెలుంగు సరోజినీ♦విటుఁడు తాను, నస్తమింపంగ నెఱసంజ♦యుపలదిశను.

క. మునిజనహృదయంబులు దఱి, క్కి నిఖిలజగ మంధకార♦గాఢము గావిం
చెను దిమిరము సూచ్యగ్రం, బును మోపఁగ సందు లేక ♦ భూవరముఖ్యా!.

వ. అంత. 258

మ. రవి యస్తంగతుఁ డౌటఁ జేరెఁ గని వై♦రాగ్యంబు చంద్రుండు ధా
తవళక్షౌమాంబరవల్కలుం డయి తను♦ధ్వాంతోరుతాపింఛవీ
థివసత్ప్రస్థుఖుషీశ్వరంబు వినుతా♦దివ్యద్వసిష్ఠాంగనం
బు విశుద్ధామరలోకతాపసవనం♦బుం బోని యాకాశముఁ. 259

తే. [1]ధరణిపైఁ బడ వెన్నెల ♦ తారకాధి, పసమలంకృతమై సతీ♦ప్రాణనాథు
శిరమునుం బోని యాకాశ♦సీమనుండి, హంసధవళాభ్ర వాహిని♦యనఁగ నవుడు.

ఆ. [2]వికచపుండరీక♦విశద మావిధుకమ, లాకరమునఁ జంద్రి♦కాంబువులను
ద్రాగ వచ్చి తత్సు♦ధాసుకర్దమలగ్న, మనఁగఁ దనరె నిశ్చ♦లాంగమృగము.

క. తిమిరాంభోధరసమయము, సమయఁగ సంద్రంబునుండి ♦ చనుదెంచినహం
సములో యనఁ జూపట్టెను, గుముదసరశ్చంద్రపాద♦కూటము లధిపా!. 262

క. గతసకలోదయరాగత, సితకరబింబంబు గగన♦సింధుసమవగా
హాత గతసిందూరైరా, వతకుంభసల మనంగఁ ♦ బరఁగె నృపేందా!. 263

సీ. తుహినాంశుఁ డల్లన ♦ దూరోదితుండయి చంద్రాతపంబున ♦ జగము లెల్ల
ధవళీకృతంబులై ♦ తనర సుధాధూళిపటలిపూసినయట్లు ♦ భాసిలంగఁ
బ్రాలేయజలబిందు♦భారంబు వహియించి యల్లనల్లన భువి♦నడుగు లిడుచుఁ
గుముదవనంబులఁ ♦ గూడి చెలంగుచుఁ దత్సౌరభానంద♦తంద్రుఁ డగుచు

తే. నాశ్రమావాసు లెల్లరు ♦ నభినుతింప
నెమరు వెట్టుచు మృగములు ♦ నిద్రవోవ
సాంధ్యబాలానిలుండు తా ♦ సరసగతిని
వీచుచుండంగ నరజాము ♦ వేయుచుండ. 264

---

1 పాఠాంతరము. చ. హిమకరభూషణాంచితము ♦ ఋక్షకపాలవిభూషితంబు నై
హిమకరమౌళిమస్తమున ♦ కీడగునభ్రతలంబునుండి వే
విమలసురాపగాగతిని ♦ బృథ్విపయిం బడె వెన్నెలల్ సము
ద్రములను నిండఁ జేయుచు మ♦రాళవళక్షము లై మహీపతీ!.

2 పాఠాంతరము. చ. వికసితపుండరీకసిత♦విశ్రుతచంద్రసరోవరంబునన్
బ్రకటితచంద్రికాసలిల♦పానము చేయఁగ వచ్చి డిగ్గి యా
త్సుకత సుధోరుపంకమునఁ ♦ దోఁగి కురంగము లేచి పోవఁజా
లక యట నిశ్చలాంగత ని♦లంబడెనో యనఁ బొల్చె నత్తఱిన్.

శా. ఆహారం బొనరించి యున్ననను నా♦హారీతుఁ డాతాపస
వ్యూహాం బంతయుఁ గొల్వఁ దెచ్చి విశద♦జ్యోత్స్నైకదేశంబునన్
స్నేహం బొప్ప ధవిత్రపాణి యగుచున్ ♦ సేవింప మందానిల
వ్యూహంబుల్ పొలయింపఁ జేయు చొకళి♦ష్మ్యం దల్లనన్ వీచుచున్. 265

ఉ. ఒక్కెడ వేత్రపీఠి సుఖ ♦ మున్న పితం గని మ్రొక్కి నాయనా!
మక్కువ మీఱ నీయఖిల♦మౌనినికాయము వేచి యున్న దీ
యక్కజ మాలకింపఁ గదు ♦ నాతురతన్ గుమిగూడి వచ్చి యీ
పక్కియ సేదదేరెఁ దొలి♦బాముస నియ్యది యేమొనర్చెనో. 266

ఉ. ఏమొనరించు నింక నిది ♦ యెవ్వరొ తెల్పవె యన్న నాముని
స్వామియు మ్రోల నున్ననను ♦ బారఁగఁ జూచి వినంగ వేడ్కతో
నామును లెల్లఁ దత్పరత ♦ నంది సమాహితచిత్తులై కడున్
మోమును గాంచుటన్ విన స♦మున్ముఖు లంచు నెఱింగి యిట్లనున్. 267

క. మునులార! వేడు కయ్యెనె, విన దీనివిచిత్రకథలు ♦ వినుపింతు వినుం
డని చెప్పఁ దొడఁగె నాతఁడు, విన రిట్టివి ము న్నటంచు ♦ వీరవరేణ్యా!.

మాలిని. విమలభుజగభూషా ♦ విశ్వమోహైకవేషా
శమితసకలదోషా ♦ సాధుబాధావిశోషా
భ్రమితదనుజలోకా ♦ పాలితాశేషలోకా
దమితవిధివిపాకా ♦ ధారితాబ్జారిపాకా. 269

గద్యము. ఇది శ్రీమేధాదక్షిణామూర్తిమంత్రోపాసనాలబ్ధసరసకవితావైభవ చింతలపల్లివంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబక ప్రియతనూభవ సకలసుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బయిన శృంగారకాదంబరియను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

శ్రీ

శ్రీరామ స్సహాయో౽స్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీశృంగారకాదంబరి

## పూర్వభాగము.

---

## తృతీయాశ్వాసము.

---



వల్లభనుతమహిమా!
దేవేంద్రప్రముఖనిఖిల♦దివిజనివహాసం
భావితగరిమా! భస్మిత
భావజసంకల్పా! భక్త♦భాసురకల్పా! 1

వ. దేవా! దయాయత్తమతి నవధరింపుము. అవ్వలికథావృత్తాంతము చెప్పెద. దేవా! వైశంపాయనుండు రాజున కిట్లనియె. 2

### ప్రధానకథారంభము, ఉజ్జయినీవర్ణనము.

క. కల దొకనగర మవంతిని, నలరును నుజ్జయని యనఁగ ♦ నపరవిబుధభూ
తలము త్రిభువనలలామము, సలలితవిభవాభిరామ♦సన్నుత మగుచున్. 3

క. భువనత్రయసర్గస్థి, త్యవసాదనకారణుఁడు మ♦హాకాలుఁడు తా
నివసింపఁ దగ నొనర్చిన, భువియన నాపుర మెసఁగు స♦పూర్వశ్రీలన్. 4

క. ఇది యొండుభూతలం బని, కదిసినసంద్రంబు నాఁగఁ ♦ గడు నిమ్నం బై
పొదలు రసాతల మంటుచుఁ, దుది నెఱుఁగనిపరిఘ చుట్ట♦దూషితచిత్తా!. 5

ఉ. ఆకసమంటుచుండు శిఖ♦రావళి నొప్పి సుధావళక్ష మ
స్తోకమహోన్నతంబు నయి ♦ శోభిలు నాపురిసాలపంక్తి యా
నాకధునీధరుండు కడు ♦ నర్మిలి నుండెడురాజతాద్రి నా
వీఁకఁ జెలంగుచుండు నృప♦వీర! యరాతుల కప్రధృష్య మై. 6

శా. ఆయామంబులు జాతరూపసికతా♦ప్రాస్తీర్ణముల్ విద్రుమ
ప్రాయంబుల్ వరశంఖమౌక్తికమణి♦వ్రాతాంచితంబుల్ సుశో

భాయుక్తంబులునై చెలంగువిపణుల్ ♦ భాసిల్లు నవ్వీటిలో
నా[1]యామ్యర్షినివీతపుష్కరమహా♦యాదోధు లొక్కో యనన్. 7

చ. అనవరతోత్సవాంగనల♦యాటలఁ బాటలఁ జూచుకౌతుకం
బున గగనంబునుండి నృప! ♦ భూమికి డించినసిద్ధసాధ్యయ
క్షనళినదృగ్విమానముల♦చందమునన్ జెలువొందుఁ దత్పురీ
కనకవిచిత్రశాలలు వి♦కాసిమణిప్రకరాంచితంబులై. 8

క. గచ్చుటరుంగుల బావులు, నిచ్చలు ఘటయంత్రసిక్త♦నిస్తులవనముల్
పచ్చనిపైరులు గేదఁగు, లచ్చుగ నా ప్రోలిచెంత ♦ నలరు మహీశా!. 9

క. మదముఖరమధుపమేచక, సదమలసుమగంధమంద♦సంచారమరు
త్సదనంబులు పురలక్ష్మీ, వదనంబులు తత్పురోప♦వనములు నృపతీ!. 10

చ. ప్రతిభవనంబునం జెలఁగు♦భాగ్యపుఘంటల రక్తచామర
ప్రతతుల మీనలాంఛనవి♦రాజితవిద్రుమకేతనంబులన్
దతచలరోహితాంశుకప♦తాకల నావుటభేదనంబు సం
తతమును మన్మథోత్సవము ♦ దద్దయొనర్చువిధంబుఁ దెల్పెడున్. 11

వ. మఱియు నప్పురంబు. 12

క. అనయము వేదాధ్యయన, ధ్వనిధౌతసమస్తకలుష♦వారముఁ గదళీ
వనకలితామృతడిండీ, రనిభధవళవలభిపాండు♦రము నగు నెచటన్. 13

వ. అందు. 14

తే. స్తిమితమర్దళసంరావ♦ధీరరసిత
సలిలశీకరదుర్దిన♦సవితృకిరణ
రచితసురచాపకలితధా♦రాగృహంబు
లందుఁ బురి విచ్చి యాడుచు ♦ నఱచు శిఖులు. 15

క. వికచాంబుజధవళోదర, వికసితనీలోత్పలములు ♦ వీతనిమిషనే
త్రకలితములు నాకొలఁకులు, ప్రకటఋభుకౌతు లట్లు ♦ పదినూర్లలరున్.

తే. శ్రీమహాకాలమస్తక♦సీమఁ జెలఁగు, సురతరంగిణిపై నీర్ష్యఁ ♦ జెఱఁగి బద్ధ
భంగభ్రూభంగరేఖన♦భంబునంటి, తూళనమొనర్చు నాశిప్ర ♦ గ్రాలుఁ జెంత.

సీ. గంగాప్రవాహంబు♦కరణిఁ గాత్రస్వరపద్మరాసులు గల♦భాగ్యయుతులు
స్మృతిశాస్త్రములభంగి ♦ వితతకూపప్రపావనసురసదనప్ర♦వర్తకులును

1 యామ్యర్షి—అగస్త్యుఁడు.

మందరగిరిమాడ్కి ♦ మథితాఖిలాంభోధిరత్నసారులు; మిత్ర♦రాజితులును
దివసంబువిధమున; ♦ భవజటాళిశిమాడ్కిఁ గోటిసారులు నుత♦కువలయులును
తే. బౌద్ధు లట్లెప్పు సర్వాస్తి♦వాదభటులు, శీతనగకాననముగతి ♦ శీతలాత్ము
లౌర జినునట్లు దీనజ♦నావనైక, లలితమానసు లచటి వి♦లాసిజనులు. 18

క. రామారాధననిపుణులు, రామానుజుభంగి; సకల♦రాగాభిజ్ఞుల్
భూమీశార్థితవిభవులు, రామాయణభారతాను♦రక్తమనస్కుల్. 19

క. సకలలిపిజ్ఞులు దక్షులు, వికసితముఖు లెపుడు రుచిర♦వేషులు ద్యూతా
దికళాకలాపపారగు, లకలంకయశోవిశాలు ♦ రకుటిలచిత్తుల్. 20

క. జ్ఞాతాఖిలవిజ్ఞానులు, ధూతాంహో రాను లర్థి♦దుఃఖాద్రిహరుల్
జ్ఞాతాఖ్యానాఖ్యాయిక, చాతుర్యరసజ్ఞు లఖిల♦శాస్త్రార్థవిదుల్. 21

సీ. కామార్థపరులయ్యుఁ ♦గలితధర్ములు మహాబలులయ్యుఁబరలోక♦బహుళభయులు
నతిథిజనాభ్యాగ♦మార్థులయ్యును బరప్రార్థనానవగతి♦ప్రాభవులును
బ్రియవాదులయ్యును ♦ నయసత్యవాదులు వీరులయ్యును మహా♦వినయపరులు
బద్ధగారుడులయ్యు ♦ బహుభుజగత్రాసు లభిరూపులై స్వదా♦రాభిరతులు
తే. తలఁప శత్రుఘ్నుపోలిక ♦ లలితభరత
పరిచయులు సాంఖ్యసమయంబు♦వలెఁ బ్రధాన
పురుషసముపేతు లత్యంత♦పుణ్యమతులు
తత్పురవిలాసజను లౌర ♦ ధరణినాథ!. 22

శా. ప్రాసాదంబుల శైలసంయుతము నాఁ ♦ గ్రాలుఁ మహాసద్మతఁ
భాసిల్లుఁ బహుశాఖకాయుత మనం♦గా భిత్తి చిత్రంబులఁ
వాసిం గాంచు సవిశ్వరూప మన భూ♦పాలాగ్రణీ! సజ్జనా
వాసం బౌట సకల్పశాఖ యనఁగా ♦ వర్ధిల్లు నవ్వీడిలఁ. 23

సీ. సురపతిదేహంబు♦కరణి శోభిల్లెడు మఖశతానలధూమ♦మహిత మగుచుఁ
బశుపతిలాస్యంబు♦పగిది భాసిల్లెడు నతిసుధాధవళాట్ట♦హాస మగుచు
భోగీంద్రతనువు నాఁ ♦ బొల్చు నదాసన్నవసుధాధరప్రోషి♦వాసిఁ గనుచు
నతిథివిధంబున ♦ నతిశయిల్లును దేవకులసహస్రావళి♦కలిత మగుచుఁ
తే. బరఁగు సంధ్యవిధంబునఁ ♦ బద్మరాగ
రాగసంకలితంబయి ♦ సాగరంబు
గతి మహాఘోషపూర్ణది♦గంత మగుచు
మఱియు నింపొందు నాప్రోలు ♦ మనుజనాథ!. 24

తే. అధిప! ధేనువుగతిని సిం♦హాసనార్హ
మూర్తి; కద్రువుపోలె స♦మ్మోదితభుజ
గచయము; ప్రభాతసమయంబు♦గతిఁ బ్రబుద్ధ
సర్వలోకంబు వినుతింప♦ శక్య మౌనె. 25

తే. రక్తవర్ణము గలదయ్యె♦ రాజచంద్ర!
తత్పురం బొప్పు నవసుధా♦ధవళ మగుచు
లంబమానోరుముక్తాక♦లాపమయ్యె
నలరును విహారభూషణం♦ బగుచు నెపుడు. 26

సీ. ప్రాభాతచంద్రికా♦పతనంబు లన నొప్పు స్ఫటికభిత్తిప్రభా♦పటలములను
బరిగతతారకా♦పంక్తులు నాఁ దోఁచు మౌక్తికప్రాలంబ♦మంజరులను
గగనసింధుతరంగ♦కలితంబు లన మించు సితపతాకాంశుక♦శ్రేణికలను
బ్రారబ్ధకమలినీ♦పరిమిశ్రణము లన విలసిల్లు మరకత♦వేదికలను
తే. జెలఁగు సిందూరమణిబద్ధ♦సీమలందు
సాంధ్యరాగారుణము లైన♦ చందమునను
గ్రాలుఁ బల్లవితము లనఁ♦ గమలబంధు
శిలల, సూర్యమయూఖముల్ ♦ క్షితిపచంద్ర!. 27

చ. తరుణులభూషణప్రభలఁ♦ దత్పురిఁ జీఁకటి లేమి జక్కువల్
విరహ మనంగ నెట్టిదియొ♦ వీరవరేణ్య! యెఱుంగ వెన్నఁడున్
వరసురతప్రదీపములు♦ వ్యర్థము లాతపపింజరంబులై
నరహి విభావరుల్ చను న♦నంగజవహ్నులు గ్రమ్మినట్లుగన్. 28

శా. సౌధోత్సంగములన్ జెలంగువనితా♦సంగీత మాలించి త
న్మాధుర్యంబున కగ్గమై చన కటన్ ♦ మావుల్ తలల్ వంప భూ
నాథోత్తంస! పతాక వ్రాల మును నా♦నాకావగామాళి భూ
తాధీశున్ గొలువంగ వచ్చె ననఁగా♦ నర్కుండు చూపట్టెడిన్. 29

చ. అనవరతంబు నందు విమ♦మాతుగుఱించి రతిప్రలాపమౌ
యన గృహరాజహంసనిచ♦యార్భటి మన్మథతాపహేతువై
వినఁబడుచుండు నెల్లెడల♦ వీనుల కింపును సొంపుఁ బెంపుచున్
మనుజవరేణ్య! యాసొబగు♦ మాదృశు లెన్నఁగఁ జాల రెన్నఁడున్. 30

ఉ. మాలవభామినీవదన♦మంజులకాంతికి నోడి సిగ్గునన్
దూలుశశాంకునంకమును♦ దుద్బెడినో యన నొప్పెనున్ మరు

ల్లోలపతాకలన్ గగన ♦ రోధివిసారితకేతుబాహులన్
రే లనిశంబు సౌధము ల♦రే విలసిల్లెడు నప్పురంబునన్. 31

శా. సౌధాగ్రోపరిభాగశాయిపురరామా♦పావక్త్రముల్ కాంచి తా
రాధీశుండు విమోహపాశవశుఁడై ♦ రాఁ జాల కచ్చోటఁ గా
మాధిం గుందుచుఁ బొర్లు చుండుఁ బ్రతిమా♦వ్యాజంబునన్ గంధసా
రోదాసేచనశీతలోరుమణిబ♦ద్ధోర్వీప్రదేశంబులన్. 32

సీ. ధ్వజములకస్థితి ♦ ద్వంద్వవియోగంబు చక్రవాకములకు ♦ జనవరేణ్య!
కుముదంబులకె మిత్ర♦కోపంబు మణిదీపముల కనివృత్తిత ♦ ముత్యములకు
నాంతరతరలత ♦ యస్థిరత్వము గీతసంగీతమర్దళ♦శబ్దములకె
వర్ణశోధనము సు♦పర్ణంబులకుఁ గోశగోపన మసిలతా♦కోటులకును
తే. గలదు మఱి దేనికిని లేదు ♦ పలుకు లేల, దేవదానవవందిత♦దివ్యచరణుఁ
డంధకారాతి కొలువుండు ♦ నప్పురమున, వీడి కైలాసగిరిమీఁది♦వేడ్క లెల్ల.

## తారాపీడవర్ణనము.

తే. ఇట్టిపుటభేదనం బేలు♦నినవరుండు, నలభగీరథదశరథ♦నహుషభరత
దుందుమారపురూరవ♦స్తుల్యుఁ డతుల, భుజబలోపార్జితాఖిల♦భూతలుండు.

క. తనరును దారాపీడుం, డను పేరిట బుద్ధిమంతుఁ ♦ డమితోత్సాహుం
డును మూఁడవవాఁ డనఁ గాం,తిని దేజున శశికిఁ దిగ్మ♦దీధితి కవనిన్. 35

తే. పెక్కుయజ్ఞంబు లొనరించి ♦ పేరుఁ గాంచి
పరఁగు శక్తిత్రయుండయి ♦ పరఁగుచుండు
ధర్మశాస్త్రార్థవారాశిఁ ♦ దరిచి తరిచి
నీతిసారామృతముఁ గ్రోలు ♦ నిత్య మతఁడు. 36

తే. పంకజన్మంబు లని వీడి ♦ పంకజముల
వనజనేత్రుండు చూడ వి♦వాహితుండు
ననుచు గణియింప రారాజు ♦ నమితతేజుఁ
గోరి వరియించె నిందిరా♦కోమలాంగి. 37

తే. అఖిలమునిజనసేవితం ♦ బగుచు నెగడు
సురసరిత్తున శామధు♦సూదనాంఘ్రి
సరసిజమువోలె నారాజ♦చంద్రముండు
ప్రభవ మలసత్యమునకు నో♦పార్థివేంద్ర!. 38.

చ. స్థిరమయి యెల్లలోకములు ♦ దేజరిలన్ దిరుగాడు చెప్పెదున్
బరఁగియుఁ జల్లనై రిపుల ♦ బాధలఁ బెట్టుచు నిర్మలంబునై
యరివనితాముఖాబ్జముల ♦ నట్టె కమల్చుచు వెల్లనయ్యె నీ
ధర సకలంబు రక్తమయి ♦ తార్కొనఁ జేసెడుఁ దద్యశం బరే. 39

సీ. మకరధ్వజునిమాడ్కి ♦ మహి నవిగ్రహుఁ,డలశివుచందమునమహా♦సేనయుతుఁడు,
సర్వరాడ్విధమున ♦ త్యాభరదక్షుండు, గ్రహకోటిగతి బుధ♦గ్రహయుతుండు
దశరథేశునిభాతిఁ ♦ దతసుమిత్రాపుత్రుండు వరరేవగతి మహా♦వంశభవుఁడు
బలిసద్మగతి నిజ♦పక్షక్షతిత్రస్తధరణీధరవ్రాత♦పరివృతుండు
తే. ధర్మదేవతయుపరావ♦తార మనఁగఁ
బరమపురుషునిప్రతినిధి♦పగిది నొప్పుఁ
బ్రశమితాశేషజగదుప♦ప్లవుఁ డతండు
మనుజమాత్రుండె యారాజ♦మౌళి తలఁప. 40

చ. అరయఁ దమఃప్రసారమున ♦ నా మలినంబును బంకిలంబు దు
ర్భరమును నౌ కలిన్ దనుజ♦రావణుచే రజతాద్రిమాడ్కి జ
ర్జరితముగాఁగ ధర్మము ధ♦రాస్థలి సర్వము వేరుతోడ సు
స్థిరముగ నిల్పె దాని శశి♦శేఖరుఁ డారజతాద్రిపోలికన్. 41

చ. [1]స్మరవనితావిలాపమున ♦ శంకరుఁ డెంతయు నార్ద్రచిత్తుఁడై
కరుణ సృజించినట్టినవ♦కంతునిఁ గాఁగఁ దలంచు లోకముల్
సురుచిరమూర్తి నానృపతి ♦ శుభ్రయశోవిభవాభిరామునిన్
వరగుణు మోహనాంగు నని♦వారితదృష్టులఁ జూచు చెప్పెదున్. 42

మ. ఉదయాస్తాచలమధ్యసీమఁ గలస♦ర్వోర్వీపతుల్ తద్ధరా
త్రిదశేశున్ భయకంపితాంగు లగుచున్ ♦ దివ్యాంఘ్రిపద్మంబులన్
గదియం జేసి నిజోత్తమాంగకములన్ ♦ గావింత్రు సాష్టాంగముల్
చెదరన్ దన్నఖరాంశుకోటి మకుట♦శ్రేణిన్ విరాజిల్లఁగన్. 43

తే. లోకముల నెల్ల హర్షాబ్ధి♦లోన ముంచు
గుణగణం బంచగమి క్రౌంచ♦గోత్రమందు
నుండి వచ్చి నట్లాతని♦యుండి వచ్చి
లోకముల నెల్లఁ బర్వె న♦లోలహృదయ !. 44

---

1 పాఠాంతరము. ఉ. రతిదీనాలాపంబుల, శితికంఠుం డురుదయార్ద్రచిత్తుం డయి తా
క్షితి సృష్టించిన నూతన, రతిపతిగాఁ దలఁతు రతని ♦ రాజితమూర్తిన్.

ఆ. అతనిగొడుగునీడ ♦ నవనిముసంబును, రాజ్యలక్ష్మి విడిచి ♦ రా దదెవుడు
ధరణినాథ! దుష్ట♦ధారణీనాథుల, దుష్ప్రతాపతాప♦దోషమునను. 45

చ. జన మఖలంబు తన్నృపతి♦చారుచరిత్రము మంత్రముంబలెన్
మనన మొనర్చు నెప్పుడును ♦ మంగళముం బలె నెంచు దిష్టివృ
ద్ధినివలె నాలకించు నుప♦దేశమునుంబలెఁ గైకొనుం దమిన్
మనమునఁ బాయకుండు నిగ♦మంబునుబోలె నృపేంద్రవందితా!. 46

క. ఆతనికీర్తి సురాసుర, భూతలముల నెల్ల ధవళ♦ములఁ జేసె సుధా
ద్యోతితము లనఁగ మందర, ఘాతసుధాంభోధిఫేన♦కాండమువోలెన్. 47

సీ. మలినాంబరత్వంబు ♦ జలదవాసరముల కవనతి ధనువుల ♦ కాభిముఖ్య
మద్దంబులకుఁ దైక్ష్ణ్య ♦ మసిధారలకు యాత్ర దైవతంబుల కగ్ని♦ధారణంబు
వ్రతులకు బంధనా♦వస్థితి పూలకు వైపక్ష్య మలగిరి♦వ్రాతమునకు
నిగ్రహం బింద్రియ♦నిచయంబునకు యోగసాధనంబు మునీంద్ర♦జాలమునకుఁ
తే. బ్రత్యయంబులకే పర♦త్వంబు కేశ, నఖరముల కాయతివినాశ♦నంబు కేతు
వులకు నున్నతి సామజ♦ములకు వాగ్వ్ర, వేశమయ్యెను నారాజు♦పృథివియందు.

తే. శశికి జ్యేష్ఠాతిగమనంబు ♦ శంకరునకు
దుర్గసంశ్రయ మసిపరి♦వర్గమునకుఁ
గుశలయోగంబు లేమియుఁ ♦ గువలయేశ!
యాతఁ డిలఁ బరిపాలించు♦నపుడు గలిగె. 49

—శుకనాసవర్ణనము.—

ఉ. నీతికళాప్రవీణుఁడు వి♦నీతుఁడు విద్యల నెల్ల సద్గుణుం
డాతతకార్యసంకటము♦లందును ధైర్యముఁ బాయనట్టిఁడున్
సేతువు సత్యసంధతకు ♦ శేవధి ధీరతకున్ భువిన్ సమా
మ్నాతుఁడు సద్విజుండు శుక♦నాసుఁ డనన్ దదమాత్యుఁ డొప్పెడున్. 50

సీ. శేషాహిపగిది న♦శేషమహీభారభరణక్షముండకూ♦పారునట్లు
సత్యవంతుఁడు జరా♦సంధునివిధమున ఘటితవిగ్రహసంధి♦కార్యఘనుఁడు
శంకరుపగిదిఁ బ్ర♦సాధితదుర్గుండు ధర్మజువడువున ♦ ధర్మభవుఁడు
ద్విజరాజునట్లు స♦ద్విజరాజ నళినాప్తుగతిని సన్మార్గక♦గమనరతుఁడు
తే. వేదవేదాంగవిదుఁడు వి♦వేకధనుఁడు
నిఖిలరాజ్యనిశ్రేయస♦నిపుణుఁ డలఘు

చరితుఁ డురువిక్రముఁడు వంశ♦పరిగతుండు
మంత్రిమాత్రుండె నిర్జర♦మంత్రి యతఁడు. 51

చ. నరకునిశత్రుసంచయము ♦ నాటి కిణాంకిత మైనయూరమా
వరునియురఃస్థలంబున ని♦వాస మొనర్చెడునిందిరాసతిన్
భర మన కట్టె తేఁగలుగు ♦ ప్రజ్ఞ గలాఁ డతఁ డెన్నఁ బ్రజ్ఞ వి
స్తరమును జెందె వానిఁ గని ♦ క్ష్మాజము వల్లిపోలె నెంతయున్. 52

ఉ. చారసహస్రచారితము ♦ సాగరవేష్టిత మైనయీభువిన్
నేరరు రాజు లన్వహము ♦ నిశ్వసనం బొనరింప నైన నా
ధీరుఁ డెఱుంగ కుండ ననఁ ♦ దేటపడున్ దదమాత్యచాతురిన్
వేర వచింపనేల యిఁక ♦ విశ్వము సర్వము తద్వశం బగున్. 53

సీ. గురుఁడువోలె సుపర్వ♦వరునకు ధౌమ్యుండు వలె యుధిష్ఠిరునకు ♦ భార్గవుండు
వలె వృషపర్వున ♦ కలవసిష్ఠునియట్లు దశరథనృపతికి ♦ దమనునట్లు
నైషధునకు గాధి♦నందనువడువున జనకజాజానికి ♦ శ్వసనపుత్రు
నట్లు సుగ్రీవున ♦ కా యుద్ధవునిమాడ్కి భీష్మనృపాత్మజా♦ప్రేయసునకుఁ
తే. దనకు నుత్తమమంత్రియై ♦ తనర నతఁడు
శైశవముననె యామహీ♦జాని సకల
దిశలను జయించి తనదివ్య♦తేజ మెల్ల
కడల మెఱయించి సుఖమునఁ ♦ గ్రాలుచుండు. 54

—❀❀ రాజవిలాసప్రకారము. ❀❀—

మ. సకలద్వీపపరీతభూవలయమున్ ♦ సంధానధౌరేయత
చ్ఛుకనాసాహ్వయమంత్రిసత్తమునిపై ♦ శోభిల్లఁగా నుంచి తాఁ
బ్రకృతివ్రాతము సుస్థితం బగుచు నొ♦ప్పం జేసి నిర్భీకుఁడై
యకలంకస్థితి నుండు యౌవనసుఖ♦వ్యాపారనిర్మగ్నుఁడై. 55

సీ. పులకింపఁగఁ గఠోర♦లలితకపోలముల్ పుణికి నవ్వఁగఁ జేసి ♦ పొలఁతుకలను
దత్స్మితామృతధారఁ ♦ దాన మాడుచు గంధసారోదమునబలె ♦ సరసభంగిఁ
దల్లోచనమయూఖ♦తాడ్యమానుం డౌచుఁ జెవికమ్మకలువల♦చేతఁ బోలెఁ
దత్కరనఖరాంశు♦తతులచే హతుఁడౌచు ధవళాంశుకములచే♦తవలెఁ దమిని
తే. భూషణచ్ఛవిఁ గుంకుమ♦పొడినిఁ బోలె
నాకులీక్రియమాణాత్ముఁ ♦ డగుచు బాహు

వల్లికలచేత బిగియింపఁ♦బడుచు బహుళ
సురతములఁ దేలు నొకవేళ ♦ నరవరేణ్య!. 56

తే. పంచబాణునినారాచ♦పంక్తు లనఁగ, నలరుకుంకుమజలధార ♦ లలరుఁబోండ్లు
చల్లఁ బింజరితాంగుఁడై ♦సరసగోష్ఠిఁ, దేలు నొకవేళ నారాజు ♦ దివ్యచరిత!.

తే. చెలులు చిమ్మనగ్రోవులఁ ♦ జిప్పిలంగ, లత్తుకజలంబులను జల్ల ♦ లలితగతిని
బాటలీకృతసుదుకూల♦పల్లవుండు, నగుచు మేలంపుమెయివడి ♦ నడరుచుండు.

సీ. స్తనతటచందన♦ధవళితవీచికచికురగళత్పుష్ప♦చిత్రితంబు
చటులతులాకోటి♦శబ్దాయమానాంఘ్రిలాక్షారసాసిక్త♦లలితహంస
మున్నతఘనజఘ♦నోరువిక్షోభితజర్జరితోర్మి♦కా♦సంచయంబు
దళితనాళనిపాత♦నళినపుష్పపరాగపటలసంకలితవి♦భాసురంబు

తే. కరతలాస్ఫాలనస్ఫుర♦త్కమ్రఫేన, బిందుచంద్రకితంబునై ♦ ప్రియమెలర్ప
భవనవాపీజలం బొక♦పరి నతండు, జలవిహారంబు గావించుఁ ♦ జెలులఁగూడి.

ఉ. వచ్చెదనంచు రాత్రిఁ దము ♦ వంచనఁ జేసినఁ బ్రేయసీజనుల్
వచ్చి యహంబు చిత్తమునఁ ♦ బాయనికిన్కను బద్ధభ్రూకుటిన్
దెచ్చి ప్రసూనదామముల ♦ దివ్యపదంబులఁ గట్టి కొట్టఁగా
మచ్చిక నవ్వుకొంచు నతి♦మాత్రముదంబున వారిఁ దేర్చెదున్. 60

ఆ. వకుళతరువునట్లు ♦ భామినీగండూష, శీధు వాని ముదిత♦చిత్తుఁ డగుచు
నతనువికసనంబు ♦ నంది చెలంగును, నొక్కవేళ నాతఁ ♦ డుర్వరేశ!. 61

తే. తరుణిపదతాడనంబునఁ ♦ దగిలినట్టి
యావకరసంబుచే రాగ ♦ మంది చొక్కు
నరయఁగ నశోకవృక్షంబు♦నటు లతండు
ధారణీనాథ! యొక్కొక ♦ తరుణమునను. 62

తే. పుష్పహారంబులను మెడఁ ♦ బొలుపుమీఱఁ
దాల్చి చందనధవళుఁడై ♦ తాళకేతు
పగిదిఁ బ్రమదలతోఁ గూడి ♦ పానగోష్ఠి
సలుపు నొక్కొకవేళ నా♦త్మావిభుండు. 63

తే. మత్తమాతంగమునుబోలె ♦ మదకపోల
పరిచలత్కర్ణపల్లవ♦భాసమానుఁ
డగుచు వ్యాకోచకుసుమవ♦నాంతరముల
సతివలను గూడి విహరించు ♦ నతఁ డొకప్డు. 64

ఆ. కుసుమకోరకములఁ ♦ గోమరారుపొదరిండ్ల
మధుకరంబుమూఁక ♦ మలఁగుచుండ
సింహమట్లు స్కంధ♦సీమ కేసరమాలఁ
దగుచుఁ గృతకగిరుల ♦ నాడుచుండ. 65

తే. మదమరాళంబుగతిఁ గ్వణ♦న్మణిపదాంగ
దారవోజ్జ్వలమానసుం ♦ డగుచుఁ గమల
వనములందును విహరించు ♦ వనజముఖుల
తోడ నొక్కొక్కతఱి మది♦తోఁగఁ బ్రీతి. 66

తే. నీలవసనావకుంఠన♦లీల చెలఁగ, బహుళనిశలందు సంకేత♦వసతులందు
సంజవేళల నభినవ♦సరసిజాత, ముఖుల నభిసారణము చేయు ♦ ముద మెలర్ప.

తే. కొంద ఱాప్తులతో సౌధ♦కుత్తులందు, బహుళపారావతాధ్యుష♦వలభులందు
భర్మవాతాయనంబులఁ♦బాపిచూచుఁ, గాంతలొనరించు సంగీత♦కంబునతఁడు.

సీ. ఇది యది యన నేల ♦ యింక నప్పుడు భువి నవిరుద్ధమతిహృద్య♦మభిమతంబు
నగుదానినెల్ల న♦నాతృప్తచిత్తుఁడై భోగించె భూతల♦భోగములను
భూభరణోచితా♦పూర్వకార్యము లేవి గలుగమి నతికాంక్షఁ ♦ గాకతండు
పరిసమాప్తాఖిల♦ధరణీకార్యుండయి ప్రముదితప్రజుఁ డగు♦పార్థివునకు

తే. భూషణం బలవిషయాను♦భోగలీల
యొరునకు విడంబనం బయి ♦ పరఁగుచుండుఁ
బ్రజలయనురాగమునకునై ♦ పర్వములను
సింహపీఠికఁ గొలువుండు ♦ క్షితిపతిలక!. 69

క. సకలంబును దద్రాజ్యము, శుకనాసుఁడ యేలుచుండు ♦ సుఖముగ లీలన్
బ్రకటితమేధాబలమున, నకలంకస్థితిఁ జెలంగ ♦ నాతఁడు వోలెన్. 70

చ. అతసినిరాజువోలె సక♦లావనినాథులు మ్రొక్కుచుండ రా
నతకుసుమావతంసకవి♦నమ్రమరందపృషన్నిషిక్తమై
యతిశయిలన్ సభాభవన ♦ మంగదకోటివిఘట్టితంబునై
తతమకుటోజ్జ్వలన్మణివి♦తానగభస్తులు పర్వ దవ్వులన్. 71

సీ. బధిరీకృతంబులై ♦ పరఁగ లోకములెల్లఁ జటులాశ్వఖురపుట♦శబ్దములను
ధూసరితంబులై ♦ భాసిల్ల సింధువుల్ సంసర్పదతిరజ♦స్సంచయముల
డోలాయితంబులై ♦ గ్రాలంగ శైలముల్ సంచరద్బలధరా♦చాలనమున
స్ఫుటితంబు లై యొప్ప♦శ్రోత్రాంతరాళముల్ పదగకోలాహల♦ధ్వానములను

తే. గంధగజదానధారాంధ♦కారితములు
ఘుష్యమాణోరుజయజయ♦ఘోషితములు
ధవళచామరసాహస్ర♦ధవళితములు
నగును దశదిక్కు లొక్కింత ♦ యతఁడు కదల. 72

ఉ. ఈవిధి రాజ్యభారమును ♦ నెల్లను నాతనియందు నుంచి యా
భూవరుఁ డెప్డు యౌవనపు ♦ భోగములన్ గనుచున్ క్రమంబునన్
భూవలయంబునం గలుగు♦భోగము లన్యము లెల్లఁ గాంచె నిం
పావహిలంగఁ దక్కఁ దను♦జాననదర్శనసౌఖ్య మొక్కఁడున్. 73

చ. ఘనతరశౌర్య! పుష్పములఁ ♦ గ్రాలియు నిష్ఫల మైనతెల్లుపో
ల్కని మహిషీగణం బలరె ♦ లీల చెలంగఁగ భుజ్యమాన మ
య్యును జన యౌవనం బెటెటు ♦ లోలిని నట్టటు వృద్ధిఁ జెందె నా
తని కనపత్యతావ్యథయుఁ ♦ దద్దయుఁ దీఱనిదుఃఖమై మదిన్. 74

తే. వదలె విషయోపభోగేచ్ఛ ♦ మదిని నెపుడు
నవనిపసహస్రపరివృతుం♦డయ్యుఁ దన్నుఁ
దలఁచె నసహాయునిగఁ గనుల్ ♦ గలిగియుండి
నంధకునిగ నిరాలంబ♦నాత్మకునిగ. 75

సీ. చంద్రరేఖయుఁబోలె ♦ శంభుజటాజూటమునకు వేలయుఁ బోలె ♦ వనధికట్లు
కౌస్తుభమణిఁబోలెఁ ♦ గైటభారాతివక్షమునకు లతవోలె ♦ క్ష్మాజమునకుఁ
గమలినీవిధమునఁ ♦ గమలాకరమునకుఁ జంద్రికవడువునఁ♦జంద్రమునకుఁ [నకు
గుసుమోద్గమముభాతిఁ♦గుసుమమాసమునకునుడుపంక్తి తెఱఁగున♦వ్యోమము
తే. వెలయు భూషణ మగుచు నా♦విభున కఖిల
లోకవిస్మయజననియు ♦ లోలనయన
విభ్రమములకు జనని నా ♦ వెలుఁగు మహిషి
తనరును విలాసవతినామ♦మునను నధిప.! 76

తారాపీడుఁడు విలాసవతిగృహంబునకుఁ బోవుట.

చ. పరిజన మెల్ల శోకమునఁ ♦ బల్కక నిశ్చలదృష్టిఁ జూచుచున్
బరిగతమై చెలంగ నటు ♦ పజ్జనఁ గొల్చుచునుండఁ గంచుకుల్
గర మవరోధవృద్ధతను♦గాత్రలు నూఱటఁ గొల్వ నెప్పుడున్
దొరఁగెడు నశ్రుబిందువులఁ ♦ దోఁగ దుకూలము కీర్ణకేశయై. 77

చ. తొడవుల నూడ్చి వామకర ♦ తోయజముం గదియించి చెక్కుటన్
గడునిబిడంపుశయ్య వని ♦ నాదముగా విలపించుచుండు నా
పడఁతుక నొక్కనాఁడు గనెఁ ♦ బార్థివముఖ్యు! యదృచ్ఛ నేగి యా
యొడయఁడు తద్గృహంబునకు ♦ నుల్లము పెల్లుగ సొమ్మసిల్లఁగన్. 78

చ. కని యెదు రేగుదెంచు తన ♦ కాంతను దచ్ఛయనోపవిష్టఁగా
నొనరిచి తాను బార్శ్వమున ♦ నూఁది వసించి తొరంగు బాష్పబిం
దునికరముం గపోలములఁ ♦ దుడ్చుచుఁ జేఁ జికురంబు లొత్తుచున్
గనుఁగొనలేక కంటితడి ♦ కారణ మిట్లను భీతుపోలికన్. 79

విలాసవత్యపత్యాజన్యవిషాదవర్ణనము.

చ. ఉవిదరో! శోకభారమున ♦ నూరక యేడ్చెద వేల లోన; యీ
యవిరతబాష్పబిందునివ ♦ హంబుల మౌక్తికరాజివోలె న
త్యవిరళభంగిఁ గూర్చెదివి ♦ నంబుజలోచన! నీదుపక్ష్మముల్
అవిదితమధ్య! సొమ్ముల న ♦ నర్ఘ్యములన్ ధరియింప వేలకో. 80

ఉ. భామిని! లేఁతయాతపము ♦ భాతిని రక్తసరోరుహంబులం
దేమొకొ నీదుపాదముల ♦ నింపెసలార దలక్తకద్రవం
బామరునీరజాకరవు ♦ హంసల మాణిపదాంగదంబులన్
గోమలి! నీపదాబ్జములఁ ♦ గూర్చి ప్రసాద మొసంగ వేలకో. 81

చ. అపగతమేఖలం బగుచు ♦ హస్తము గూర్పదు నీవలగ్న మే
ల పడఁతి! యేలకో హరిణ ♦ లాంఛనునందు మృగంబుమాడ్కిఁ దీ
రుపవో యురోజభారమున ♦ రూపసి! నీలవులోహపత్రముల్
చెపుమ నిమిత్త మేమి యిటు ♦ చింతిల నీకు నరాళకుంతలా!. 82

క. హరమకుటచంద్రరేఖా, సరణిని గంగాప్రవాహ ♦ సంగతి నీకం
ధరము సమలంకృతం బయి, పరఁగదు హారమున నేల ♦ భామిని! చెపుమా.

తే. నీకపోలంబు లేలకో ♦ నీరజాక్షి!
బాష్పజలధౌతకుంకుమ ♦ పత్త్రతిలక
లాయె నీగతిఁ గత మేమి ♦ యతివ! చెపుమ
నీదుదుఃఖనిమిత్తంబు ♦ నెలఁత! నాకు. 84

తే. కోమలాంగుళిదళములఁ ♦ గోకనదము, లీల నలరునీకరతల ♦ మేల బాల!
కర్ణపూరమ్ముఁ జేసితి ♦ కారణంబు, చెప్ప వేటికి వదియింప ♦ సిగ్గ దేల. 85

తే. లలితగోరోచనాబిందు♦తిలక మేల
తాల్పవు లలాటపట్టికఁ ♦ దరుణి! నేఁడు
చిక్కువడియున్న చికురముల్ ♦ చిక్కువాపి
ముడుచుకొన వేల మోమునఁ ♦ బడెడుఁ జూడు. 86

తే. చంద్రరేఖావిహీనమై ♦ సాంద్రతిమిర
బహుళపక్షప్రదోషంబు♦భాతి నీదు
కుసుమమాలారహితమయి ♦ యొసఁగు కేశ
పాశ మిది నాదు దృష్టికి ♦ వ్యథను గొల్పు. 87

తే. పయ్యెఁట తొలంగ వచ్చునీ♦బహుళదీర్ఘ
నిశ్వసనమారుతంబులు ♦ నెలఁత! నాదు
స్వాంతము సరాగమును బల్ల♦వమును బోలెఁ
జెలియ! కంపింపఁ జేసెడిఁ ♦ జెప్ప వే. 88

చ. కలిగెనొ తప్పు నాయెడలఁ ♦ గల్గెనొ భృత్యులయందుఁ జెప్పుమా
కలికిరొ నాదుత ప్పొకటఁ ♦ గల్గదు గా యొకయింత నీయెడన్
దలఁచిన నెంత యెవ్వఁ డిఁక ♦ ధాత్రి వలంతి యొనర్ప దోషముల్
దెలుపుము శోకకారణము ♦ దేవి! త్వదీయము నాదుజీవముల్. 89

చ. అని యిటు లెంత వేఁడినను ♦ నాయమ చెప్పక యూరకున్న నా
మనుజవిభుండు భృత్యులను ♦ మానని యీవగ కేమి కారణం
బను చడిగెన్ నృపా! మకరి♦కాఖ్య తదీయసమీపవాసయై
యనిశము తమ్మలం బొసఁగు ♦ నంబుజలోచన వాని కిట్లనున్. 90

చ. నృపవరుఁడ! యించు కేనియును ♦ నీయెడఁ గల్గునె తప్పితంబు నీ
వవిరత మాభిముఖ్యమును ♦ నంది చెలంగఁ ద్వదీయకాంత కిం
కెవఁ డొనరించుఁ దప్పితము ♦ నించుక భీతినిఁ బొంద కింత నీ
మెవగ నరేంద్రసంగమము ♦ మిన్నక యాయెను నాకు నంచుఁ బో. 91

ఉ. దానవలక్ష్మిఁ బోలె సత♦తంబు వినిందితసౌరభం గదా
నే నని తొంటినుండియును ♦ నెవ్వగ భోజనమజ్జనాసనా
దానముఖోచితక్రియలఁ ♦ దాఁ జరియించెడు నట్టికేలకున్
మానవనాథ! మాదుజత♦నంబున నింత సశోకచాడ్పునన్. 92

తే. ఎన్నిరొయొ దినమ్ము లాయెను ♦ నీమె యిట్లు
పరితపింపంగసాగి తో♦పార్థివేంద్ర!

నీకు నెవ్వగ ఘటియింప ♦ నేర కెపుడు
తెలుపదాయెను దనమన♦ స్త్రీవ్రతుజను. 93

క. ఈదినము చతుర్దశియని, యాదివ్యపదాంబురుహ మ♦హాకాలుఁ గనఁ
నీదేవి పోయి యొక్క,మ,హీదేవుఁడు భారతంబు ♦ నెల్లరు వినఁగన్. 94

చ. చదువుచు నుండ నందు విన ♦ క్ష్మావర! బిడ్డలు లేనివారికిన్
బొదలవు పుణ్యలోకములు; ♦ పున్నరకంబుఁ దరింపఁ జేసెడిన్
సదమలపుత్రుఁడంచు; విని ♦ చయ్యన నింటికి వచ్చి సేవకుల్
పదములఁ బట్టి వేఁడినను ♦ బల్కఁడు వాంచినమోము నెత్తడున్. 95

తే. అభిలషింపదు కుడువ నా♦హార మెపుడు
స్నాన మాడదు తొడవులఁ ♦ బూన దంగ
రాగము నలంద దుపవన♦రాజులందుఁ
గేళి సలుపంగ నేగదు ♦ లీల వీడి. 96

తే. అశ్రుజలబిందుచయదుర్ది♦నాంధకారి
తానన మెసంగ నూరక ♦ యనుదినంబు
కేవలము రోదనము సేయు ♦ క్షితిపవర్య!
చిత్త మని యూరకున్న నా♦క్షితివరుండు. 97

విలాసవతీసాంత్వనము.

తే. ఒకముహూర్తంబు పలుకక ♦ యూరకుండి
వేడి నిట్టూర్పు నిగిడించి ♦ పృథ్వినేత
యిట్టు లనియెను మెల్లన; ♦ నింతి! దైవ
చేష్టితమునకు మనమేమి ♦ చేయఁగలము. 98

తే. పుత్రగాత్రపరిష్వంగ♦మునను గలుగు
నమృత మాస్వాదనము చేసి ♦ హర్ష మొందు
భాగ్యమున కభాజనములు ♦ పడఁతి! మనదు
హృదయములు; చింత సేయంగ ♦ నేల యబల!. 99

తే. మన మనుగ్రాహ్యులముగాము ♦ మగువ! దేవ
తలకుఁ బుణ్యంబు సేయుము ♦ తొలుత మనము
తొలికపుణ్యంబె యిప్పుడు ♦ ఫల మొసంగు
దైవమును మీఱ నెవ్వరి♦తరము దేవి !. 100

తే. మనుజులకు నెంత సేయంగ ♦ ననువుపడునొ
యంతయును జేయు వగ పేల ♦ యింతి! నీకు
భక్తిఁ గొలువుము గురువుల ♦ బాల! మిగుల
దేవతాపూజనము సేయు ♦ ద్విగుణముగను. 101

సీ. పడఁతిరో! ఋషుల స♦పర్యలఁ దనుపుము పరదేవతలు గద ♦ వారు తరుణి!
పూన్కి నారాధింపఁ ♦ బోరి వార లతిదుర్లభము లైనకోరిన♦వరము లిత్తు్ర
మును బృహద్రథుఁ డను♦జనపతి చండకౌశికముని మహిమచే♦శ్రీశుఁ గొల్చు
తనయు జరాసంధుఁ ♦ డాఁ గాంచు టెఱుఁగవో వృద్ధుండు దశరథ♦పృథ్వివరుఁడు

తే. ఋశ్యశృంగు విభాండక♦ఋషికొమారుఁ
గొలిచి తత్ప్రీతిభావంబున ♦ జలజనాభు
భుజము లన నొప్పు నల్గురు ♦ పుత్రవరుల
నప్రధృష్యులఁ గాంచుట ♦ యతివ! వినవె. 102

తే. ఇంక నెందఱొ రాజర్షు ♦ లింతి! ఋషులఁ
గొలిచి యాత్మజదర్శన♦కుతుకమునకుఁ
బాత్రములు గారె ఋషివర♦పాదసేవ
తలఁపఁగ నమోఘఫలకమై ♦ తనరుఁ గాదె. 103

శా. ఆసన్నోదయపూర్ణచంద్రనిశ నా♦నాపాండువక్త్రంబునన్
వాసిం గాంచు ప్రరూఢగర్భభరణా♦భారాలసన్ దేవి! నిన్
భాసిల్లం దమిఁ గాంతు నెప్పుడు సుత♦ప్రాదుర్భవానందసం
భాసత్పారిజనంబు నా కెపుడు శుం♦భత్పూర్ణపాత్రం బిడన్. 104

శా. హారిద్రాంశుకమున్ ధరించి యొడిలో ♦ నాసీనునిం జేసి యిం
పారం బుత్రు దరప్రకాశముదితా♦జ్ఞాప్తంబునై యొప్పు నా
తారాధ్వంబునువోలు దేవి ముఖముం ♦ దాఁ గూర్చు టెన్నండొకో
నీరేజానన! యంచుఁ జిత్తమున నే ♦ నిత్యంబు చింతించెదన్. 105

సీ. సర్వౌషధులచేత ♦ జలకంబు గావించి బుగ్గ నేతిని రక్ష♦బొట్టు పెట్టి
నొసటఁ దెల్లావాల♦ధసిత రేఖలఁ దీర్చి మెడను గోరోచనా♦మిళితచిత్ర
గ్రంథిలసూత్రంబుఁ ♦ గట్టి బంగరుతొట్ల మెత్తని వెలిపట్టు♦పొత్తికలను
బవ్వళింపఁగఁ జేయ ♦ నవ్వుచు వెలికిలఁ బవళించి పాదముల్ ♦ పైకి నెత్తి

తే. యల్లనల్లన విదిలించి ♦ యాడుచున్న, దంతములు రానిముద్దుల♦తనయుఁ గాంచి
మోదవారాశితరఁగల♦మునుకలిడెడు, భాగ్య మెన్నండు నా కబ్బుఁ♦బద్మగంధి.!

ఉ. ఒక్కరిచేతినుండి మఱి ♦ యొక్కరు గైకొని ముద్దులాడఁగా
మక్కువమీఱ నంతిపురి♦మానిను లెల్లఁ బిశంగకాంతులన్
జొక్కపురోచనన్ బలెను ♦ శోభిలుపుత్త్రుఁడు లోకవంద్యుఁడున్
స్రుక్కఁగఁ జేయు నెప్డు దృశ♦శోకతమిన్ శుభదీపముంబలెన్. 107

ఆ. తోయజాక్షి! ధరణి♦ధూళిధూసరుఁ డయి
మందిరాంగణంబు ♦ మండితంబు
చేయు నాదుదృష్టి ♦ చిత్తంబుఁ దనతోడఁ
గూడఁ దిరుగఁ దిరిగి ♦ కొమరుఁ డెపుడు. 108

చ. పటికపుగోడ కావలను ♦ భాసిలుగేహమృగార్భకంబులన్
బటుహరిశాబకంబు క్రియఁ ♦ బట్టఁగ నెన్నఁడు దోఁగియాడుచున్
ఇటునటుసంచరించు నిఁక ♦ నింటిమరాళము లంటఁ బాఱు తన్
దటుకునఁ బట్టఁ బర్వులిడు♦దాదులఁ ద్రిమ్మటఁ బెట్టు నెన్నఁడో. 109

సీ. కృష్ణవంశకపంక♦కృతమదరేఖావిరాజమానకపోల♦రాజితుండు
నూర్ధ్వకరప్రకీ♦ర్ణోరుచందనచూర్ణధూళిధూసరితాంగ♦పాళియుతుఁడు
కుంచితాంగుళిశిఖ♦రాంచితాంకుశసమాకర్షణాధూనన♦కలితశిరుఁడు
వదనడిండిమనాద♦పరికలితామోదముదితమానసలోక♦విదితగుణుఁడు
తే. నగుచు మత్తకరీంద్రంబు♦నట్టు లెపుడు
వివిధలీలావిహారంబు ♦ వేడ్కఁ జేయు
మాతృపదలిప్తశిష్ట మా ♦ మంజుయావ
రసము కంచుకిముఖముల ♦ రాచు నెపుడు. 110

ఆ. తప్పుటడుగు లిడుచుఁ ♦ దనప్రతిబింబంబుఁ, బట్టుకొనఁగను మణి♦కుట్టిమముల
సంచరించు నెపుడు♦చంచలనేత్రుఁడై, క్రిందఁ గనుచు నెపుడు♦క్రీడ సలుపు.

చ. క్షితిపతు లెల్ల నెత్తికొనఁ ♦ జేతులు చాఁపఁగ భూషణప్రభా
వితతులు లోచనంబులకు ♦ విస్ఫురణం బిడ లోలదృష్టియై
కుతుకమునన్ సభాభవన♦కుట్టిమసీమల నాడు నెప్డు నా
సుతుఁ డిఁకఁ గొల్వుకూటమున ♦ శోభిలు నాయెదుటన్ మనోజ్ఞుఁడై. 112

చ. అని యివి యాదిగాఁ గలుగు♦నైకమనోరథసంచయంబులన్
మనమునఁ జింత సేయుచు న ♦ మానని! నెవ్వగ రాత్రి వుచ్చెదన్
వినుము దహించు నన్ను నిది ♦ పీడక యెప్పుడు వహ్నిపోలికన్
వనితరో! శూన్యమట్టులు ప్ర♦పంచము సర్వము నాకుఁ దోఁచెడిన్. 113

చ. లలనరో! రాజ్య మెల్ల విఫ♦లంబుగఁ దోఁచెడు; నేమి సేయ నౌ
నలవిధివ్రాఁతకుం గలదె ♦ యన్యము; మానుము లోనినవ్వగల్;
నిలుపుము ధైర్యధర్మముల ♦ నీమది, ధర్మము సేయువారికిన్
మెలఁగుఁ గుఱంగటన్ సతము ♦ మేదిని మంగళసంపదల్ గదా. 114

చ. అని వచియించి తాన చని ♦ యంబుజకోరకసన్నిభాంజలిన్
గొని యగుడెంచి నీరములఁ ♦ గోమలఫుల్లసరోజతుల్యమా
వనితముఖంబుఁ దాఁ దుడిచె ♦ బాష్పజలంబులచాఱ లెల్లఁ బోన్
సనయశుగాపనోదసర♦సప్రియధర్మగభీరభాషలన్. 115

ఉ. సారెకుసారె కూఱడిలు ♦ చాన! వహింపుము శాంతి; యంచు నో
దారిచి యొద్దనే తడవు ♦ ధాత్రిపరుం డతఁ డుండి పోవ నా
సారసనేత్రయు న్నగులు ♦ సన్నగిలన్ దివసార్హకృత్యముల్
చీరలు సొమ్ములున్ మొదలు ♦ చేసి యొనర్చె యథాప్రకారమున్. 116

చ. అదిమొదలావిలాసవతి ♦ యాదర ముంచె ధరామరార్చనన్
త్రిదశులపూజనంబులను ♦ దివ్యమునీంద్రసపర్యలన్ గడున్
విదితగురూపదేశముల ♦ వించును నెంచక యెట్టికష్టమున్
మది భువి నెవ్వఁ డే మనిన ♦ మానక చేసెను వాని నెల్లఁ దాన్. 117

విలాసవతి పుత్త్రులఁ బడయఁ దత్తన్నియమముల నాచరించుట.

సీ. సతతగుగ్గులుధూప♦సంభరితంబులై గాఢాంధకారసం♦గతము లైన
చండికాగృహములఁ ♦ బండెఁ బచ్చనిదర్భ పఱచినరోకండ్ల♦పైని నియతి
శుక్లాంబరముఁ దాల్చి ♦ శుచియయి యనశన వ్రతమూనిగోకుల♦వ్రజమునందు
వృద్ధగోపాంగనల్ ♦ తద్దఁ బూజించినగంగగోవుల క్రింద♦వంగి నిలిచి
తే. వివిధఫలపుష్పరత్నాళి♦విలసితములు, క్షీరభూరుహపల్లవ♦శ్రేణియుతము
లైనబంగరుకడవల ♦ నఖిలతీర్థ, పుణ్యజలముల స్నానంబుఁ ♦ బొరి నొనర్చె.

తే. ఉదయమున లేచి ప్రతిదిన ♦ మువిద తాను
సర్వరత్నంబులను నించి ♦ సద్ద్విజులకు
హేమతిలపాత్రముల నిచ్చె ♦ నెన్నియేని
గ్రుంకె నాగకులప్రాస♦కోటులందు 119

చ. మగువ మహానరేంద్రకృత♦మండలమధ్యమునందు నిల్చి తా
దిగధిపదైవతంబులకుఁ ♦ దృప్తి యొనర్చి బలిప్రదానమున్

దగ నొనరించి స్నానవిధి ♦ నర్మిలి సల్పెఁ జతుష్పథంబులన్
బగవక పెక్కునాళ్లు మది ♦ వారక కృష్ణచతుర్దశీనిశన్. 120

సీ. సిద్ధాయతనముల ♦ సేవించి ముడుపులఁ గట్టెను దేవతా♦గణములకును
దప్పక ఫలముల ♦ దయసేయుమాతృకాభ♦వనంబులకు నేగి ♦ భక్తిఁ గొలిచె
నశ్వత్థముఖభూరు♦హంబుల వలగొనెఁ బూజానమస్కార♦పూర్వకముగ
దర్శింప వచ్చిన♦ధాత్రీసురులచేత వేదముల్ చదివించె ♦ వినయమలర

తే. శకునములఁ జెప్పువారల ♦ సత్కరించెఁ
బ్రశ్న లడిగించెఁ బ్రాశ్నిక♦వారములను
భూర్జచర్మాంతరములైన ♦ భూరియంత్ర
ములను ధరియించెఁ బ్రతిసర♦ములను గట్టె. 121

క. మణివలయంబులు డోలల, యనువునఁ దోఁపంగఁ దనదు♦హస్తయుగళిచేఁ
గొని వెండిగిన్నె దధ్యో, దనమును గాకుల కొసంగెఁ ♦ దద్దయు శుచియై. 122

క. అనుదినము గొలిచె దుర్గను, మనమలరఁగఁ బుష్పములను ♦ మంజులగంధం
బున ధూపదీపముల న, ర్చన మొనరిచి పాయసాన్న♦సద్భక్ష్యములన్. 123

క. కొని భిక్షాపాత్రంబులఁ, జనుదెంచినసిద్ధవరుల ♦ క్షపణకవరులన్
గనిభక్తి మ్రొక్కియడిగెను,మనమునఁ గలవాంఛితంబు♦మహిమ వొగడుచున్.

తే. సతతము పఠింపఁబడుచుండు ♦ వితతపుణ్య
కథల నాలించి కాలంబు ♦ గడపఁ జొచ్చెఁ
జత్వరంబుల శివబలి ♦ సంతరించె
నక్కల కొసంగె మాంసంబు ♦ నక్తములను. 125

తే. కలలఁ గన్నట్టియాశ్చర్య♦కథల నెల్లఁ, జెప్పె నాచార్యులకు; గద్దె♦చెప్పువారి
గద్దె లడిగెను విసువక♦గర్భకాంక్ష, నన్నికష్టంబులైనను ♦ నెంచదాయె 126

తారాపీడశుకనాసులు స్వప్నము గనుట, దాని నొండొరులతోఁ జెప్పుకొనుట.

సీ. చిరకాల మీగతి ♦ జరుగంగ నారాజు క్షీణభూయిష్ఠమై ♦ చెలఁగ రేయి
పలుచనై వెలవెలఁ♦బాఱంగఁ జుక్కలు ధూమ్రవర్ణంబయి ♦ తోఁప నభము
వృద్ధపారావత♦విధమున సితసౌధశిఖరతలంబునఁ ♦ జెలఁగుచుండు
దేవిముఖంబునఁ ♦ దేజరిల్లుచుఁ జొచ్చు సకలకళాసాంద్రుఁ ♦ జంద్రుఁ గాంచె

తే. స్వప్నమున నొక్కదినమున ♦ క్ష్మాతలేంద్ర!
గాంచి మేల్కాని హర్షంబుఁ ♦ గాంచి మించి

వికసితస్మితలోచన ♦ విలసనముల
వానభవనంబు తెల్లనై ♦ భాసిలంగ. 127

తే. పిలిచి యప్పుడా శుకనాసుఁ ♦ బేర్మిమీఱఁ
జెప్పి నాస్వప్నవృత్తంబు ♦ చెవులు తనియ
హర్ష ముప్పొంగ నాతండు ♦ నవనిపతికి
నిట్టు లనియెను సంభ్రమం ♦ బుట్టిపడఁగ. 128

చ. ఇనవర! యింతకాలమున ♦ కిప్రజకోర్కులు మాదుకోర్కులున్
గనెను ఫలంబు సందియము ♦ గల్ల దవశ్యము కొన్నినాళ్లకే
కనఁగల వాత్మజాతముఖ♦కంజవిలోకనసౌఖ్యభాగ్యమున్
గనితిని నేఁడె నేనుఁ గల ♦ ద్విజసురుఁ డొక్కఁడు దివ్యరూపుఁడై. 129

ఉ. ధౌతము లైనవస్త్రములఁ ♦ దాల్చినశాంతమనోజ్ఞమూర్తియై
వాత్మకపాళిపాండుశత♦పత్రము చంచలకేసరాళిసం
పీతగళన్మరందరస♦బిందుకణంబును నైనపాండుకం
జాతము నాదు దేవియొడి ♦ ద్విజవర! యుంచెను నేఁటి వేకువన్. 130

ఉ. వేకువఁ గాంచుస్వప్నములు ♦ వేడ్కలు నించెడుఁ గా యమోఘమై
వే కను లోకమోహనుని ♦ విశ్వధురంధరుఁ బుత్త్రు దేవి తా
నీకొడఁగూర్చు హర్షమును ♦ నిస్తులమున్ శరదబ్జిసంగతిన్
బ్రాకటనూత్నపద్మమున ♦ భద్రగజంబునకు న్నృపశేఖరా!. 131

ఉ. నీదుకులం బశేషధర♦ణీభరణోచితనిత్యసంతతిన్
బాదుకొనున్ ధరిత్రి దిశ♦భంబు మదావళిఁబోలె వానిచేన్
లే దనుమాన మింత ధర♦ణీవర! యంచు వచించుచుండ నా
భూదివిజేంద్రుఁ డాసచివ♦పుంగవుఁ దోడ్కొని పోయి లోనికిన్. 132

క. లలనను విలాసవతి నా, కలలను దోఁగించె హర్ష ♦ కల్లోలినిలో
పల నటఁ గొన్నాళ్లకు నా, లలనయు గర్భంబుఁ దాల్చె ♦ లాలితరుచితోన్.

విలాసవతి గర్భము ధరించుట, కులవర్ధన దానిని రాజుతోఁ జెప్పుట.

తే. కౌస్తుభముచేత విష్ణువ♦క్షంబుఁ బోలెఁ
బారిజాతంబుచే నింద్రు♦వనముఁ బోలెఁ
దనరె గర్భచ్ఛలంబున ♦ ధరణినాథు
బింబమునుఁ దాల్చి ముకురంబు♦భాతి నతివ. 134

సీ. దినదిన మభివృద్ధిఁ ♦ గనుచు నల్లల్లన పైకి వచ్చుచుగర్భ♦భారమునను
నిర్భరపరిపీత♦నీరధిజలభారమంథరం బగుమేఘ♦మాలవోలె
మందమంథరగతి ♦ నుల్లఁగంగ సాగెను నావలింపఁ దొడంగె ♦ నలసగతిని
గను మూసియొక్కింత♦గాత్రంబు విఱుచుచు సారెకూర్పులువుచ్చ♦సాగెమిగుల

తే. నువిద ధరియించె నీలప♦రోమధనముఁ
బ్రాప్రమముగతి బహువిధ♦పానభోజ
నముల వాంఛించెఁ గేళికి♦నయముఁ దాల్చె
గాత్ర మాపాండురంబయి ♦ గర్భకాంతి. 135

తే. ఈవిధం బంతఁ గనుఁగొని♦యింగితజ్ఞు, లైనపరిజను లామెచూ♦లగుటయెఱిఁగి
గుజగుజలువోవఁ దొడఁగిరి♦కుతుక మెసఁగ, నిర్భరానందవశులయి♦నేతృవర్య!.

తే. అంత నాయమ పరిజన ♦ మఖిలమునకుఁ
బెద్దయై రాజకులమునఁ ♦ బ్రిదుల కెపుడు
పార్థివుకుఱుంగట మెలంగు ♦ ప్రౌఢదాసి
సకల కులవర్ధన మహత్త♦రిక నరేంద్ర!. 137

వ. ఒకశుభదినంబున సాయంసమయంబున లోనియిరవునఁ జుట్టును గంధతైలావసిక్తంబులై ప్రజ్వలించుదీపికాసహస్రంబు వెలుంగఁ జుక్కలలోనిచందురునిమాడ్కి భుజగరాజఫణామణిసహస్రంబులనడుమ విరాజిల్లు నారాయణుని విధంబున మూర్ధాభిషిక్తు లగుకతిపయనరపతులు బలిసి కొలువఁ గొలువుతీరి బద్ధాంజలు లయి పరిజనంబు లొద్ద సేవింప ధౌతధవళాంబరముఁ దాల్చి యనుద్ధతవేషుండై మహోన్నతం బగువేత్రాసనంబున నుపవిష్టుండై యున్నశుకనాసునితో విశ్వాసనిర్భరంబు లగునిష్టకథల న్వినోదించురాజుం గాంచి డాయనేతెంచి చెవిలో రహస్యంబుగ దేవి విలాసవతి చూలా లగుట యెఱింగించిన నారాజచంద్రుండు. 138

సీ. అశ్రుతపూర్వంబు ♦ లవితర్కితంబులు నగుదానిపల్కుల ♦ కవనినేత
యమృతపూరంబున ♦ నభిషిక్తుఁడైనట్లు మేనెల్లఁ బులకలు♦మెండుకొనఁగ
నానందరసమున♦నవశుఁడై చిఱునవ్వు మొలకలు చెక్కిళ్ల ♦ ముద్దులాడ
నిండి పైకుప్పొంగి ♦ నివ్వటిల్లుముదంబు దంతకాంతులమిషఁ ♦ దెంతనున్న

తే సచివుశుకనాసుపై వెద♦చల్లు చతని
మోముపైఁ జూడ్కి నిల్పెఁ బ్ర♦మోదవారి

బిందువులు పక్ష్మపంక్తులఁ ♦ గ్రందుకొనఁగ
తరళతారకుఁడై వేడ్క ♦ దండడింప. 139

చ. అతఁడు నదృష్టపూర్వ మగు ♦ నాతనిహర్షము పెల్లిదంబునన్
స్మితవికచాననాబ్జ యయి ♦ చేరఁగ వచ్చెడు దాసిఁ గాంచి సం
తత మదె యుంటఁ జిత్తమున ♦ దండడి తత్సమయార్హ హేతు వా
యతిముద మంద లేకునికి ♦ నన్యము నూహ యొనర్చి వీతమున్. 140

చ. జరిపి కడుం గుటింగటకుఁ ♦ జయ్యన దాసి యొకింత మెల్లఁగా
ధరణిప! సత్య మింతకల ♦ దా కల నీకులవర్ధనం గనన్
గరము ప్రఫుల్లనేత్రయయి ♦ గ్రాలెడు; నీనయనద్వయంబునన్
దరళితతారకంబు నుది ♦ తప్రమదాశ్రుపరిప్లుతంబునై. 141

చ. పరఁగుచుఁ గర్ణమూలములఁ ♦ బర్వుచు నీలసరోజకర్ణపూ
రరుచి ప్రహర్ష కారణము ♦ రాజవరేణ్య! యొఱుంగఁ జేసెదన్
బరమమహోత్సవశ్రవణ ♦ భాసురకౌతుక ముబ్బి పారు దు
ర్భరమయి నాదుచిత్తమున ♦ రాయిడిఁ గొల్పుచు నేమి చెప్పుమా. 142

క. అన నాతఁడు నరపతి నగి, యనియెను నిది నుడివినట్టి ♦ యర్థము నిజమై
న నల కలయును నిజము న,మ్మను నే మన కట్టిభాగ్య ♦ మహాము దొరకునే.

తే. అవుదుమే యట్టిప్రియవచ ♦ శ్శ్రవణమునకు
భాజనము కులవర్ధన ♦ పల్కు లెపుడు
వితథములు గావు నిజమైన ♦ విశ్వసింప
సంభవముకామి మనకట్టి ♦ సౌఖ్య మంద. 144

తారాపీడుఁడు విలాసవతిగర్భవృత్తాంతము నరయ నంతఃపురమునకుఁ బోవుట.

తే. లెమ్ము స్వయముగ నేగి ని ♦ జమ్ము కంద
మడిగి దేవిని నచ్చట ♦ కనుచు లేచి
యనిపి రాజుల నెల్లను; ♦ దనదుమేని
తొడవుల నొసంగి యాదాసి ♦ పడఁతి కంత. 145

సీ. గాలికిఁ గదలెడు ♦ నీలోత్పలములీల వలకన్ను మాటికిఁ ♦ జలన మొందఁ
దళ్కులసేవకుఁ ♦ డగుపరివారంబు విరళవిరళమయి ♦ వెంట రాఁగ
ననిలలోలస్థూల ♦ కనదగ్రదీపముల్ కక్ష్యాంతరస్థాంధ ♦ కార మణఁప
నిర్భరహర్షంబు ♦ నిండి క్రేళ్లుఱుకుచు మునుముందు వేవేగఁ ♦ జనుచు నుండ

తే. మ్రొక్కి యాకులవర్ధన ♦ పుడమి నుదురు
సోఁక భక్తిని మార్గంబు ♦ చూపఁ; దోడ
రాఁగ శుకనాసుఁడును దాను ♦ రాజవరుఁడు
వరిగెను విలాసవతి యుంతి♦పురమునకును. 146

—గర్భవతియగు విలాసవతివర్ణనము.—

వ. అందు. 147

సీ. పూర్ణకుంభంబులు ♦ పొలుపొంద వాకిట మంగళదీపముల్♦మఱి వెలుంగఁ
గ్రొత్తగ గోడలఁ ♦ గోరి వ్రాయించిన శుభచిత్రములు మదిఁ♦జొక్కఁజేయ
ముత్యాలజాలరుల్ ♦ మొనయునంచుల నొప్పు తెల్లనిచందువా ♦ ల్దేజరిల్లఁ
గ్రందుగఁ గ్రాలెడు♦కనదురుమణిదీపములు చీఁకటులగుంపు♦మూల కణఁప
తే. నవసుధాలేపధవళిత♦ప్రవిమలంబు
సుకృతరతావిధానసం♦శోభితంబు
నగుచు వెలుఁగొందువాసగృ♦హంబునందు
లలితగర్భార్హశయనత♦లంబు వెలుఁగు. 148

చ. నిదురఁ గొనన్ సుఖమ్ముగను ♦ నిల్పి తలాఁపి వళక్షకుంభముల్
గదుర శుభంబు నోషధులఁ ♦ గట్టి శుభప్రదమాల యంత్రముల్
కుదు రగుశక్తికంకణముఁ ♦ గూడను నుంచియుఁ దెల్లసాసువల్
విదిలిచి నాల్గుమూలలను ♦ వేఁపదళంబులతోరణంబులన్. 149

ఉ. వ్రేలఁగ రావియాకులును ♦ వెంద్రుకత్రాటిని గూర్చి కట్టియున్
లీల చెలంగఁగాఁ బఱచి ♦ నీరజవైరిమయూఖసంతతిన్
బోలి వళక్ష మైనపట♦ముం బయి; నున్నతపాదపీఠిపైఁ
గ్రాలఁగఁ జేసినట్టిగిరి♦రాజశిలాభత నొప్పుదానిపై. 150

సీ. పసిఁడిపళ్లెరముల ♦ ససిమీఱ నుంచిన పిచ్ఛిలదధిఖండ♦పిండములను
గోరోచనముతోడి♦గౌరసర్షపముల దివ్యపటలశీత♦దీపములను
బువ్వులఁ బూజించి ♦ పుటికల నిడినట్టి మెఱయు తెల్లనివరి♦మెతుకుగముల
సలిలాంజలుల నామి♦షనవపిండకమిశ్ర సలిలధారాపత♦ర్ఘ్యవితతుల
తే. వృద్ధశుద్ధాంతకాంతలు ♦ వృద్ధిపొంటె
దృష్టిదోషంబు చన దిగఁ♦దీయుచుండఁ
బద్ధ ధవళాంశుకముఁ దాల్చి ♦ పరిజనంబు
మంగళప్రాయసల్లాప♦మగుచుఁ గొలువ. 151

తే. లలితగోరోచనాచిత్ర♦కలితదళము, ననుపహతమును ధవళంబు ♦ నైన తెల్ల
పట్టువలువలజంటను ♦ బరఁగఁ దాల్చి, కనదుపారూఢగర్భంబు ♦ తనరుచుండ.

సీ. కులశైలములు లోనఁ ♦ గలవసుంధర మూర్కిఁ గందరగతహరి♦గ్రావముక్రియ
మొగులు కప్పినరవి ♦ మొనయు ఘుస్రమునట్లు నుదయించు కలశజు♦నూనినట్టి
దక్షిణాశయుఁబోలెఁ; ♦ దగ నుర్వ గప్పినయమృతకుంభము గల♦యబ్ధితటము
మాద్రిని; నుదయాద్రి♦మఱుఁగున నున్నట్టి శశిగలయామిని♦చందమునను

తే. నీరజభవాంబుజాతవి♦నిర్గమంబు, దాపునఁ జెలంగుచుండెడు♦తమ్మికంటి
నాభిపోలికఁ గూర్చున్న♦నళిననేత్రఁ, బట్టమహిషినిఁ గాంచెను ♦ పార్థివుండు.

క. సరభసపారితపరిజన, కరతల మవలంబనంబుఁ ♦ గావించి కరాం
బురుహమున నూని జానువు, భరమున భూపారవంబు♦పరఁగుచు మ్రొయన్.

క. లేవఁ గడంగెడు దేవిని, దేవి! చాల్చాలుఁ బ్రేమ ♦ తెలిసెను లేవం
గా వలవ దనుచు నామెయు, భూవరుఁడును గూరుచుండెఁ♦బొదలుచు నందే.

క. శుకనాసుండును మఱియొక, ప్రకటోజ్జ్వలజాతరూప♦పాదనుపర్యం
కకమున ధవళోపచ్ఛం,దకలితమునఁ గూరుచుండె ♦ దగ్గఱ నృవరా!. 156

ఉ. మేలపుమైవడిన్ మదిని ♦ మేకొను హర్షము నాఁప లేక భూ
పాలకమాళి కాంచి యనుఁ ♦ బట్టపుదేవిఁ బ్రరూఢగర్భిణిన్
బాలరో! యేమొ చెప్పఁ గుల♦వర్ధన యయ్యది నిక్కమా! కదున్
లాలసచిత్తుఁ డైనశుక♦నాసుఁడు న న్నడుగున్ వచింపుమా. 157

చ. అనుటయు లేఁతన వ్వొలయ ♦ నక్షికపోలరదచ్ఛదంబులన్
జెనఁగొనుసిగ్గునన్ రదన♦విస్ఫురదంశువు లన్నపంబునన్
గనఁబడకుండ మూయుచు ము♦ఖంబును దెల్లనికొంగునన్ బలెన్
వినతముఖాంబుజాతయయి ♦ నీరజలోచన యూరకుండినన్. 158

ఉ. మాటికిమాటికిన్ దనను ♦ మానక కస్తియొనర్ప భూవరుం
డేటికి సిగ్గుపా టోదవ ♦ నేఁడెదు న న్నిటు లూరకుండుఁ దే
మాట యెఱుంగ నే ననుచు ♦ మార్గ్యోగమై కడకంటఁ జూచుచున్
బోటి శిరంబు వంచుకొని ♦ భూవరుఁ డల్లన నవ్వ చిట్లమున్. 159

ఉ. భామరో! నాదు మాటలకుఁ ♦ బంపిన సిగ్గిటు లూరకుండెదన్
గోమలభిద్యమానదల♦కోరకభాసురచంపకాభమై
కామిని! గంధబంధురతఁ ♦ గన్గొనసై యిటు తెల్లఁబారు నీ
కోమలతం జెలంగు నల ♦ కుంకుమచర్చకు నేమి సేసెదో. 160

సీ. చంచూపుటంబుల ♦ నుంచి నీలాబ్జంబుఁ గ్రాలెడుచక్ర వా♦కంబు లనఁగ
చీఁకటిమ్రాఁకుల♦చివురులు ముఖముల భాసిల్లుకనకకుం♦భంబు లనఁగ
గర్భసంభవసుధా♦క్రాంతి నారినచిత్తచింతాగ్ని పొగవమి ♦ చేయు ననఁగ
ముఖభాగమునఁ దగ ♦ ముసరినతేంట్లచేఁ గ్రాలునంబుజకోర♦కంబు లనఁగ

తే. నీలవంశకపంకవి♦నిర్మితోరు, మకరికాపత్త్రములను శ్యా♦మాయమాన
చూచుకమ్ముల నలరుచు♦సొబగునించు, గురుకుచంబుల నేగతి ♦ మఱుఁగుపఱతు.

క. బిగుతయి యొడ్డాణము కడు, నొగులుప నుడివోవ వళులు ♦ నొగి కార్శ్యంబుల్
దగ వీడుచు నతిగాఢం, బగునడుమున కేమి మాటు ♦ ననువు పఱచెదో. 162

క. అని చెప్పు చుండునరపతిఁ, గని ముసిముసినగవు లెసఁగఁ♦గా నీకథ చేఁ
గను సిగ్గు దేవి విడువుము, జనవర! యీసుద్ది యనుచు ♦ సచివుఁడు పలికెన్.

క. ఏవంవిధనర్మవచో, భావకథాకథనములను ♦ బచరించుచు నా
భూవరసచివుఁడు తడ వట, భావము రంజిల్ల నుండి ♦ వసతికి నేగెన్. 164

వ. నరపతియు నారాత్రి నందే గడపెను. 165

## చంద్రాపీడుఁడు పుట్టుట.

తే. అంతఁ గ్రమమున నాయింతి ♦ యడుగువాని
నెల్ల సమకూర్చి మనమున ♦ కింపొనర్చు
చుండ నవమాసములు నిండె ♦ నుగ్మలికిని
బ్రసవవేదన పొడసూపెఁ ♦ బార్థివేంద్ర!. 166

ఆ. గణకు లెల్ల నపుడు ♦ గడియారములు గొని
యడుగులెంచి లగ్న ♦ మరయుచుండ
సుదతి కనియె నొక్క♦శుభవాసరంబున
శుభముహూర్తమునను ♦ సుతుని నధిప!. 167

సీ. చరణాహతి ధరిత్రి ♦ చలనంబు నొందంగఁ బరిజను లిటునటు ♦ పరుగు లిడఁగఁ
బడుచులేచుచు ధరా♦పాలున కెదురుగాఁ గంచుకివికలాంగ♦గణము పరవ
సకలశుద్ధాంతభూ♦షణఝుంకృతులు దెసల్ సొంపునింపుచుఁ బర్వ♦శోభిలంగఁ
గుబ్జవామకిరాత♦కోటియెల్లను జన గుంపునఁ బడుచుఁ ద్రొ♦క్కుడులు పడఁగ

తే. పురజనం బెల్లఁ గావింపఁ ♦ బూర్ణపాత్ర,మఖలభూమణవసనాదు ♦ లపహరింప
దిష్టవృద్ధిసంభ్రమ మొప్పెఁ ♦ దేజరిలుచు, రాచనగరున నవ్వేళ♦రాజచంద్ర!.

ఉ. బాలురు వృద్ధులున్ యువలు ♦ బ్రాహ్మణులున్ నృపవైశ్యశూద్రులున్
స్త్రీలును బూరుషుల్ మొదలు ♦ చేసి సమస్తజనుల్ ప్రహర్షలీ
లాలహరిం జెలంగుచు వి♦లాసగతిన్ బహుతూర్యనాదముల్
గ్రాలఁగ నాట్య మాడిరి ప్ర♦గాఢమనంబునఁ జొక్కి సోలుచున్. 169

తే. మందరాచలసమ్మథ్య♦మానజలధి
ఘోషగంభీరదుందుభి♦ఘోషములను
మురజకాహళశంఖగో♦ముఖనినాద
ములు చెలంగెను జగములు ♦ మ్రోయ నపుడు. 170

తే. అనుదినంబును జంద్రోద♦యమున జలధి
చందమునఁ బొంగెఁ దత్పుత్ర♦జన్మమహము
కలకలారావముఖరిత♦కకుభ మగుచు
మంగళధ్వానసంగతి ♦ మహిత మగుచు. 171

తే. ఎందుఁ జూచినఁ బాటలు ♦ నెందుఁ గన్న
నాటలు చెలంగె బహుళమై ♦ హర్షవార్ధి
వెల్లివిరిసినచందమై ♦ యెల్లచోట్ల
నుత్సవంబుల రాజపు♦త్రోత్సవంబు. 172

ఆ. తనయు మోముఁ గాంచఁ♦దహతహ మనమున, నధికమగుచునున్న♦నవనిపతికి
దివసవళత గణక♦దిష్ట మైనప్రశస్త, సమయమునను గాంచ ♦ సమ్మతించె.

తే. వారితాశేషపరిజన♦వారుఁ డగుచు
తోడ శుకనాసుఁ డేతేరఁ ♦ దూర్ణగతిని
సూతికామందిరమునకు ♦ క్షోణివరుఁడు
చనెను సుతుఁ గాంచు హర్షంబు ♦ సందడింప. 174

వ. అట్లు చని. 175

### సూతికాగృహవర్ణనము.

సీ. బహువిధపుత్రికా♦భరితంబు మంగళమణికలశద్వయ♦మండితంబు
వివిధాభినవపల్ల♦వవితతినిచితంబు లంబమానదీప♦లాలితంబు
విరళగుంఫితసిత♦విస్ఫురత్సుమమిశ్రదూర్వాకిసలదామ♦ధూర్వహంబు
గాంగేయముసలలాం♦గలయుగలసితంబు వందనమాలికో♦ద్భాసితంబు

తే. ఘటితఘంటాగణంబునై ♦ క్రాలుచుండు
ద్వారదేశంబుగలదాని ♦ ద్వారమునకు

నుభయపార్శ్వంబులందును ♦ నుచితవేత్ర
లగుపురంధ్రులు పెక్కండ్రు ♦ నధివసించి. 176

తే. వికచపత్త్రపుటంబుల ♦ వెలయునెమలి, వారువముపైన లోహిత♦వస్త్రఘటిత
లోలకేతనములు క్రేవఁ ♦ గాలఁ గేల, శక్తిదండంబుఁ దాల్చిన♦స్కందదేవు

తే. తాల్చి హారిద్రవసనంబుఁ ♦ దనరుషష్ఠి
దేవి; నడుమను లత్తుక ♦ తేజ మెసగు
సూర్యుఁ జంద్రుని లిఖయింప ♦ శోభిలంగ
దిగధిపతులను లక్ష్మిని ♦ దేవదేవు 178

ఆ. వివిధవర్ణరాగ♦విస్ఫురత్కూర్పాస, కుసుమలేశములను ♦ గూర్చి నడుమ
వెల్లకిలను నిడిన♦వివిధవరాటికా, నికరములను జేర్చి ♦ నేర్పుమిగుల. 179

తే. లలితకౌసుంభకేసర♦లవము లుంచి
రోహితము లగురేఖల ♦ రుచిరభక్తి
స్వస్తికచయంబులను దీర్పఁ ♦ జందనాంబు
ధవళితము లగుకుడ్యాగ్ర♦తలములందు. 180

ఆ. పంచవర్ణచిత్ర♦భాసురచేలక,లాపచిహ్నితముల ♦ లలితపీత
పిష్టపంకకలిత♦పృథువర్ధమానాళి, మండనములఁ దీర్ప ♦ మంజుగతిని. 181

చ. పొలిచెడిదాని; నెల్లపుడు ♦ భూసురవర్యులు నైగమోక్తులన్
బలుకుచుఁ జల్లశాంతి భువ♦నంబులు; పాటలు పాడ వృద్ధభా
మలు; లిఖయించి నూత్నగతి ♦ మాతృగణంబులఁ బూజసేయ దా
దులు శిశురక్షవాంఛ బలిఁ ♦ దోరముగా నిడుచుండ భక్తిమై. 182

ఉ. బంగరుకంబముల్ దనర ♦ భాసిలుమంగళదీపముల్ మదిన్
బొంగుశుభంబులన్ దలఁచు♦పోల్కిని నిశ్చలతన్ శిఖల్ చెలం
గం గడు వెల్గుచుండ; భట♦కాండము గొల్వఁగ దూసి ఖడ్గముల్
రం గగుదాని నింబదళ♦రాజితధూమముదాని నెప్పుడున్. 183

చ. సతతవిదహ్యమానఘృత♦సంయుతమేషవిషాణచూర్ణమా
రుతభుజికంచుకం బయి పు♦రోభువిధాన్యపురాశిపై నధి
ష్ఠిత లగునార్యవృద్ధసర♦సీరుహనేత్రలు వొల్చు మంచమున్
సితసుమదామముల్ చెలఁగఁ ♦ జిత్రమునై తనరారుదానినిన్. 184

ఆ. వివిధగంధమాల్య♦విస్ఫురితం బగు, ఛాగవృద్ధ మొకటి ♦ సంయుతమయి
యులర ద్వారదేశ ♦ మజ్జాతుసాహస్ర, నామపఠనరావ♦నద్ధ మగుచు. 185

సీ. కర్బురమయమయవ♦కంటకచయమువై గ్రుచ్చి తెల్లావాల♦గుంపుఁ గూర్చి
కాంచనరసమున ♦ ఖచితంబులుగఁ జేసి కుంకుమపంకాన ♦ నంకితములఁ
గావించి పింజర♦కాంతులఁ గ్రాలంగఁ జేసినమృణ్మయ♦చిత్రగోటి
కకదంబమాలికా♦కాండమండితమయి మంగళతూర్యముల్ ♦ మలయుచాని
తే. సూతికామందిరముఁ గాంచి ♦ క్షోణివరుఁడు
హర్ష వారిధిలోఁ దోఁగి ♦ యాత్మ వీఁగి
తూళికాంఘ్రికరుం డయి ♦ జవ్వలను గొల్చి
కోరికలు మది నీరికెల్ ♦ గురియఁజొచ్చె. 186

వ. అట్లు సూతికాగృహంబుఁ జొచ్చి. 187

-- కుమారవర్ణనము. --

సీ. నిజకాంతిసముదయ♦నిష్కాసితావాసదీపప్రభాజాలు ♦ దివ్య తేజు
గతతతగర్భరా♦గత నుదయారుణ రవిమండలము నా వి♦రాజమాను
సాంధ్యారుణాపర♦చంద్రబింబం బన వికచరక్తాంభోజ♦వితతియనఁగ
నవనిదర్శనలీల ♦ నవతరించినలోహితాంగుఁడొ లేఁజిగు♦రాకొ యనఁగ
తే. వేల్పుసానులచేనుండి ♦ వీడి పడ్డ, యులజయంతుండు నా నొప్పు♦నాత్మజాతుఁ
గాంచెఁ బ్రసవపరిశ్రమ♦గాత్రయగుచు, నలరుఁ బట్టంపుదేవేరి♦యంకవీధి.

క. బాలాతపకళికలములఁ బ్ర,వాళకిసలయదళములను ♦ బ్రభవించెనో నా
మేలిమిపసిండికాంతుల, బాలునియంగంబు లలరె ♦ భవనము నిండన్. 189

క. తనరెను ననభివ్యక్తా, ననపంచకగుహానిమూఢ్కు ♦ నరపాలకల
శుణములసహజాతసుభూ,షణయుతుచంపమున నతఁడు ♦ త్స్వావరచంద్రా!.

తే. భావిపరిపాలనక్రియా♦ప్రముదితాత్మ, యైన శ్రీపరిరంభణ ♦ మాచరించె
ననఁగ నాహ్లాదహేతువై ♦ యులరునతని, సారె కనిమేవనిళ్ళల♦సారదృష్టి.

చ. పొరిఁబొరి హర్షబాష్పములు ♦ పొంగి చెలంగఁగ నెంత తుడ్చినన్
బరఁగుచు నక్షిగోళములఁ ♦ బారఁగ దూరవిసారితాత్ముఁడై
నరవర! త్రాగువానిగతి ♦ నర్మిలిఁ దాఁకెడివానిపోలికన్
సరసములాడువానిక్రియఁ ♦ జాలును నాకయుఁ గాంచె నాళశోన్. 192

చ. తలఁచెఁ దనున్ గృతార్థునిఁగఁ; ♦ దత్సచివుండును హృష్టచిత్తుఁడై
పలికెను రాజుతోడ నిటు ♦ బాలునియంగము లెల్లఁ జూవుచున్
జెలఁగుచు మెల్లమెల్లఁగ నృ♦శేఖర! చూడుము గర్భవీడచేఁ
గలఁగి పరిస్ఫుటంబగుచుఁ ♦ గాత్రరుచుల్ గనరాక యుండినన్. 193

చ. తెలిపెడి నీకుమారకుని ♦ దివ్యమహాత్మతఁ జక్రవర్తిచి
హ్నలె కను సాంధ్యకాంతి నరు♦ణీకృతబాలశశాంకరేఖతోఁ
దుల యగు ఫాలపట్టికను ♦ దోఁచెడిఁ దామరతూఁడువోలెఁ జొ
మ్మలఁతిగ నూర్ణ; మోవి యరు♦ణాంబుజకోరకమట్టు లొప్పెడిన్. 194

చ. వికచసితాంబుజంబుగతి ♦ వెల్లని యాతనినేత్రయుగ్మముల్
వికసితమై సమున్మిషిత♦విస్ఫురణంబుల వాసగేహముల్
బ్రకటసుధావలేపితము ♦ నాఁగ వళక్షితమై చెలంగ సా
రెకు నొనరించుఁ జూడు విహా♦రించుచుఁ గర్ణపుటాంతసీమలన్. 195

ఉ. బంగరురేఖవోలెఁ గడు ♦ భాసిలు నీతనిముక్కు చూడు రా
ట్పుంగవ! జృంభమాణనవ♦పుష్కరకోరకగంధబంధుతా
సంగతి నొప్పునాస్యసహ♦జాతసుగంధము మూర్కొనంగ నూ
ర్ధ్వంగతమైనయట్టులు వి♦రాజిలు నాయతమై చెలంగుచున్. 196

ఉ. చెందొవమొగ్గలం దెగడి ♦ చన్నగు నీతని పాణు లొప్పు గో
విందునిపంచశాఖతల♦విభ్రమముం దగఁ గూర్చు చెంతయున్
సుందరశంఖచక్రముఖ♦శోభనరేఖలఁ జిహ్నితంబులై;
స్యందనకేతనాశ్వకులి♦శాతపవారణముఖ్యచిహ్నముల్. 197

చ. పరఁగఁగ నూత్నకల్పతరు♦పల్లవకోమలమై యనేకభూ
వరచయమౌళిరత్నసమ♦వాయసమాదరచుంబనార్హమౌ
చరణయుగంబు; రోదనము ♦ సల్పెడు నీతనికంఠనిస్వనం
బరుదయి దుందుభిస్వనము♦నట్లు వినంబడెడున్ గభీరమై. 198

శుకనాసునికిఁ గొడుకు పుట్టుట.

చ. అని యిటు లాడుచుండునపుఁ ♦ డాతఁడు; వచ్చెను సత్వరంబునన్
మనుజవరేణ్యసంచయము ♦ మార్గ మొసంగఁగ సంభ్రమంబునన్
జని యొకప్రక్కకుం దనువు ♦ సమ్మదవృత్తి గగుర్ప నేత్రముల్
గన విరివిన్ ముఖంబును వి♦కాసము మంగళకాఖ్యభృత్యుఁడున్. 199

ఉ. వచ్చి నమస్కరించి నర♦పాలకుపాదసరోరుహంబులన్
హెచ్చినభక్తి నిట్లను న♦రేశ్వర! నీది యదృష్ట మేలుమా!
చొచ్చిరి నీదుశాత్రవులు ♦ సూర్యతనూజగృహంబు నింక నో
సచ్చరితాత్మ! గెల్వు మిల ♦ సర్వము నీవె కలంతకాలమున్. 200

ఉ. నీదనుగ్రహంబునను ♦ నేఁడె జనించె సుతుండు మంత్రికిన్
భూదివిజాగ్రభామిని మ♦నోరమయం దలరేణుకాఖ్య యం
దాదనుజాంతకాంశుఁ డగు ♦ నాభృగురాముని యట్లు భూవరా!
మీదయ యంచుఁ జెప్పఁగను ♦ మేదినిభర్త ప్రహృష్టచిత్తుఁడై. 201

తే. అమృతవర్షోపమం బైన ♦ యతనిమాట
లాలకించి ప్రీతిని స్ఫారి♦తాత్ముఁ డగుచుఁ
బలికె నిట్లని శుభపరం♦పర యయారె!
యిట్లుగా నుండవలె భాగ్య ♦ మిలను నహహా!. 202

తే. సంపదలు వచ్చునప్పుడు ♦ సంపదలును, నాపదలు వచ్చునప్పుడు ♦ నాపదలును
వచ్చు వెంబడివెంబడి ♦ వదల కట్టె, ననెను నానుడి నిజమాయె♦నౌర యిపుడు.

తే. సర్వవిధముల సుఖదుఃఖ♦సములమైన
మమ్ము దీనను సములుగ ♦ మనుప కేల
యసములుగఁ జేయు విధి యని ♦ హర్షమునను
గౌఁగిలించెను శుకనాసు ♦ గాఢముగను. 204

తే. అతనిపై యుత్తరీయంబు ♦ నపహరించెఁ
బూర్ణపాత్రంబు నప్పు డా♦పూరుషునకుఁ
బ్రియవచశ్శ్రుతి కర్హమై ♦ పెం పొసంగు
పారితోషిక మిప్పించె ♦ భూరిగాను. 205

సీ. చరణవికుట్టన♦శబ్దితనూపురసాహస్రముఖరది♦శాముఖంబు
సరభసోత్క్షేపసం♦చలితకంకణచయవాచాలితోజ్జ్వల♦బాహుకంబు
శ్రమవారిధౌతాంగ♦రాగరంజితనవవసన మర్దితమాల♦పత్రకంబు
నన్యోన్యసంఘట్టి♦తాంగదాగ్రార్ధవిపాటితోత్తరవస్త్ర♦భాసితంబుఁ
తే. బతితసంమృదితశ్రోత్ర♦పల్లవంబు, విలులితాలకపుంజంబు ♦ విప్రకీర్ణ
సురభిపటవాసపాంసుపిం♦జరితకేశ, పాళి మగు నవరోధన♦భామకంబు. 206

మ. కలమాధుర్య మెసంగఁ బాడుచుఁ గడున్ ♦ గాఢప్రహర్షంబు ను
జ్జ్వలమై పొంగ నుమాద మూనినగతిన్ ♦ భ్రాంతించినట్లున్ మదం
బలపై శాచవికార మంటినక్రియన్ ♦ హస్తంబు లుత్తానమై
చెలఁగం గాలికిఁ బద్ధవ్యోమనళినీ♦శ్రేణిన్ విడంబించుచున్. 207

ఉ. ఆడుచుఁ దూర్యనాదముల ♦ కర్హవిధంబునఁ దాలమానముల్
వీడక; పల్కుచున్ విడి వి♦వేకము వాచ్య మవాచ్య మూరకే

తోడన వచ్చుచుండఁ దమి♦తోడుత వేగఁ గపోలభిత్తులం
దాడఁగ రత్నకుండలము ♦ లౌదలిశేఖర ముర్వి వ్రాలఁగన్. 208

ఉ. ఉయ్యల లూఁగఁ గంఠముల ♦ నుజ్జ్వలకౌసుమదామకంబులున్
వ్రయ్యలు వారఁ బాదహతి ♦ వారిధిమేఖల నాట్యమాడుచున్
వియ్యములాడఁగాఁ బటహ♦వేణుమృదంగపటుస్వనంబులున్
జయ్యన రాఁగ రాపరిజ♦నంబులుఁ బాడుచు వెంబడించుచున్. 209

తే. అరిగి శుకనాసగృహమున ♦ కవనిపతియు
గాఢహర్షామృతము పొంగి ♦ గట్లు మీఱి
పార నినుమడిగా నుత్స♦వం బొనర్చె
నంతఁ గడచిననాఱునా ♦ ళ్లవనినాథ !.  210

తే. పదియవదినంబు ప్రాప్తింప ♦ భద్రవేళ, గోవులను స్వర్ణరాసులఁ ♦ గోటికోట్ల
నొసఁగె విప్రుల కెల్లను ♦ నుల్ల మలర, భూరిదక్షిణ లిచ్చె న♦పూర్వముగను.

శా. భూపాలాగ్రణి! స్వప్నమందుఁ గనితిన్ ♦ బూర్ణేందుబింబంబు నే
నీపాఃప్రసుమోముఁదమ్మిఁ జొరఁగా ♦ నేలా మఱోం దంచుఁ జం
ద్రాపీడుం డని పేరుపెట్టఁ గలకుం ♦ దార్కాణమై యుండ నా
భూపాలుండు నిజాత్మజన్మునకు నిం♦పుం బెంపు రాజిల్లఁగన్. 212

శా. భూదేవోచితసత్క్రియల్ నడపి యా♦భూపాలకాభీష్టమా
త్మాదేవోచితనామధేయ మిడె వై♦శంపాయనుం డంచు నో
భూదేవేంద్ర! నిజాత్మజన్మునకు నా♦భూపాలకామాత్యుఁడున్
వేదోక్తం బవశిష్టకర్మసమితిన్ ♦ బృథ్వీశుఁడున్ జేసెఁ దాన్. 213

చంద్రాపీడుని బడికిఁ బంపుట.

తే. శైశవము వీడి తనయుండు ♦ సఖులఁ గూడి
బహువిధక్రీడ లాడుచుఁ ♦ బరఁగుచుండఁ
దద్విఘాతార్థ మారాజు ♦ తత్పురంబు
వెలిని శిప్రానదీతీర♦పృథివియందు. 214

సీ. తుహినాద్రిశిఖరాళి♦తులితసుధాలిప్తప్రాకారమండల♦పరివృతంబుఁ
బ్రాకారమండల♦పరిగతాతివిశాలపరిఖావలయమువి♦భాసురంబు
భాసురోరుకపాట♦పటుబంధనసముద్ఘాటితైకద్వార♦కాశితంబుఁ
గాశితాధోభాగ♦కల్పితవ్యాయామమందిరామరగేహ♦మంజులంబు

తే. మంజులైకాంతనిర్మిత♦మహితవిశద
వాజివాహ్యాళిభూభాగ♦భాసితంబు
నగుచుఁ జెలువొందు విద్యాగృ♦హంబు బోకండు
కట్టెఁ గ్రోశార్ధపరిణా హ♦కలితముగను. 215

సీ. సకలవిద్యలు నేర్పఁ ♦ జాలినయొజ్జల రావించి దేశాంత♦రములనుండి
సవయస్కులైనయా♦చార్యకుమారుల సహపాఠపరివార♦జనులఁ జేసి
బాలకు లెవ్వ రా♦ప్రాంతమ్మునకు నాటలాడఁ బోవకయుండ ♦ నాజ్ఞఁజేసి
పంచాస్యపోతంబు ♦ పంజరంబున నుండుగతి వెలిరాకుండఁ ♦ గట్టడించి
తే. సర్వ మనుకూలముగ నుండ ♦ సంతరించి, యఖిలవిద్యల నేర్పంగ♦నాత్మజన్ము
నర్పణముచేసె నొజ్జల ♦ కవనినాథ !, సచివసుతుతోడ శుభదివ♦సంబునందు.

తే. తాను భార్యయు వలువాతఁ ♦ దరలి యటకె
యాత్మజన్మునిఁ గనుఁగొని ♦ యనుదినంబు
వచ్చుచుండును మితపరి♦వారుఁ డగుచు
వసుమతీనాథ! యారాజ♦వరుఁడు వేడ్క. 217

చంద్రాపీడుఁడు సకలవిద్యలు నేర్చుకొనుట.

ఉ. పోవఁగ నీక యొందు మది ♦ భూపతిచేత నియుక్తుఁడైన యా
భూవిభుసూనుఁడుఁ గొలఁది♦ప్రొద్దులలోన గ్రహించె నొజ్జలుఁ
భావము రంజిలఁ దగిన♦పాత్రము చిక్కుట నాత్మనైపుణిఁ
భూవిదితంబుఁ జేసికొన ♦ బోధ మొనర్చిరి సర్వవిద్యలఁ. 218

సీ. తర్కమీమాంసల ♦ ధర్మశాస్త్రంబున శబ్దశాస్త్రంబునఁ ♦ జాపవిద్య
వ్యాయామవిద్యల ♦ వాజివయోజ్ఞానమున రాజనీతి వా♦రణవినీతిఁ
జక్రచర్మకృపాణ♦శక్తితోమరగదాపరశుముఖాయుధ♦పద్ధతులను
వీణామృదంగాది♦వివిధవాద్యంబులఁ జిత్రలేఖనకళా♦చిత్రములను
తే. గావ్యనాటకాఖ్యాయికా♦ఖ్యానములను
నారదీయాదిగాంధర్వ♦భారతీయ
నృత్తశాస్త్రమ్ములందును ♦ నృపతిలక
ణములఁ గౌశల మందె క్ష్మా♦నాథసుతుఁడు. 219

చ. తరణమునం బరిప్లుతిని ♦ దారుట లంఘనమందు నెక్కుటఁ
గరితురగాదిరోహణము♦నందును గాథల నింద్రజాలమం

దు రతనవుంబరీషులను ♦ ద్యూతకలాకలనంబునందు నా
మరుకళలందుఁ గాంచె నస♦మానసమర్థత లోకమాన్యతన్. 220

ఉ. కాంచెను దారుకర్మమునఁ ♦ గౌశల మందెను వాస్తువిద్యలం
దంచితనైపుణిం గనెను ♦ యంత్రములందును బాటవంబు నా
ర్జించె సురంగభేదనవి♦శేషమునందును జాకచక్యముల్
మించెను వైద్యశాస్త్రమున ♦ మీఱె విషాపహృతిన్ జగంబునన్. 221

తే. సర్వశిల్పంబులందును ♦ సర్వదేశ, భాషలందును లిపులందు ♦ భారతేతి
హాసరామాయణములందు ♦ నన్యనిఖిల, కళలయందును గాంచెను♦గౌశలంబు.

తే. నిర్మలాదర్శమునఁ బోలె ♦ నిఖిలకళలు
సంక్రమించెను నారాజ♦చంద్రసుతుని
యందు జగ మెల్ల నద్భుతం ♦ బంద మిగుల
నతని ప్రతిభావిశేషంబు ♦ నేను వొగడ. 223

తే. విడువ కభ్యాస మొనరించు♦పుడమితేని, సుతున కావిర్భవించెను ♦ క్షోణి కెల్ల
విస్మయ మొనర్చు సహజాతి♦విక్రమంబు, పవనసుతునకుఁ బలెశై శ♦వంబునందె.

చ. అతఁడు యదృచ్ఛ నాడుచును ♦ హస్తమునం జెవిపట్టి లాగినన్
గతసకలాంగకమ్ము లయి ♦ నాగకిశోరము లట్టె నేలపైఁ
జతికిలఁబ్రాలెడిన్ నృపతి♦చంద్రమ! సింహకిశోరకావళ్ళ
ట్టతఁ గనినట్టు లించుకయుఁ ♦ జాలవుగా చలియింప భూవరా!. 225

తే. సకలరాజకులాటవీ♦జాతవేదుఁ, డైన యలజామదగ్నిశ♦రాళివోలె
నతనిశరపంక్తు లారార ♦ యద్రిశిలల, గులగులలుగాఁగ ఛేదించుఁ♦గువలయేశ!.

తే. బాలుఁ డయ్యును నానృప♦బాలుఁ డహహ
తాలతరువులఁ జెక్కంట ♦ ధరణిఁ ద్రెళ్లఁ
గొట్టు నొక్కొక వ్రేటున♦కుం గృపాణ
మునను బిసదండములమాడ్కి ♦ జనవరేణ్య !. 227

తే. పదుగురతిబలకాయులు ♦ పట్టలేని, యినుపదండంబుఁ గైకొని♦యినకుమారుఁ
డశ్రమంబున వ్యాయామ ♦ మాచరించుఁ, జెప్పనేటికి నాతని♦చేవ లావు.

తే. ఒక్క వీర్యాతిశయమునఁ ♦ దక్క నిఖిల
కళల నారాజసుతునితోఁ ♦ దుల యొనర్పఁ
దగు నమాత్యసుతుండును ♦ ధరణినాథ !
యతనిప్రతిబింబమే యితం ♦ డనఁగ నొప్పు. 229

సీ. సకలవిద్యలఁ దన♦సచ్ఛాత్రుఁడై యుండి చదివినబహుమాన♦సరణిచేత
శుకనాసుపైఁ గల♦యకలంకగౌరవమహిమచే సహవాస♦మహిమచేత
నీడుజోడై కూడి ♦ యాడియాడినచిన్నతనమునఁ గలిగిన♦చనవుచేత
నొకచోట భుజియించి ♦ యొకచోటనె పరుండి పెరిఁగిననెయ్యంపుఁ♦బెంపుచేత

తే. నయ్యె రెండవహృదయంబొ ♦ యనఁగఁ బరఁగి
సర్వవిస్రంభపాత్రమౌ ♦ సౌహృదుండు
రాజసుతునకు నామంత్రి♦రాజసుతుఁడు
చెప్పఁగా నేల యాచెల్మి♦చెలువు నృపతి!. 230

తే. ఒక్కనిముసంబు గనఁబడ ♦ కున్న నతఁడు
నిలువఁగాఁ జాల డొక్కండు ♦ కలవరించు
రాజసుతుఁ డాతఁడును వాని ♦ రవిని దినము
పగిదిఁ బాయక వర్తించుఁ ♦ బ్రతిదినంబు. 231

సీ. ముల్లోకముల కాశ♦మొనయఁ జేయుచు సుధారసముపోలెనుసాగ♦రంబునకును
సకలలోకాహ్లాద♦జనకమై చంద్రోదయమ్ముపోలెను బ్రదో♦షమ్మునకును
వివిధరాగవికార♦విలసితంబయి యింద్రధనువుపోలెను వాన♦తరుణమునకు
వివిధలాస్యవిలాస♦విశ్రుతంబయి కలాపంబుపోలెను మయూ♦రంబునకును

తే. మీనకేతనకేతన ♦ మైనచిగురు
పోలెఁ గల్పద్రుమనకు; నృప♦పుత్రునకును
యౌవనారంభ ముదయించి ♦ యతనిసొబగు
ద్విగుణితముచేసి భువనసం♦విదిత మయ్యె. 232

ఉ. చేరె ననంగుఁ డంత నవ♦సేవకుచాడ్పున నొద్ద నంతరం
బారసి లక్ష్మితో నురము ♦ నాతతమయ్యెను వేగ బంధుమా
నోరథపంక్తితోడన వి♦నూత్నగతిం బరిపూర్ణమయ్యెఁ జు
ష్మూరుయుగంబు మధ్యమము ♦ నూనెఁ గృశత్వ మరాతికోటితోన్. 233

ఉ. దానముతోడఁ గాంచెను ని♦తంబమునుం బ్రథిమంబు శౌర్యమున్
బూనెఁ జరిత్రతోఁ గనులు; ♦ పొందె గురుత్వము దోశ్శిరంబుఁ దా
నానతితోడ; శత్రువని♦తాలకజాలముతోడఁ దోర్యుగం
బూనెఁ బ్రలంబతన్; మనము ♦ నూనె గభీరతయున్ స్వరంబుతోన్. 234

చ. క్రమమున నిట్లు జవ్వనముఁ ♦ గాంచెను; నేర్చెను విద్య లన్ని పూ
ర్ణముగఁ; గళాకలాపవిప♦రంబుల నెల్ల ముగించె; నొజ్జలున్

దమిని నొసంగి రాజ్ఞ యని ♦ ధాత్రివరుండు నటింగి పుత్రు గే
హామునకుఁ దోడితేరఁగ బ♦లాధికృతుం బనిపెన్ బలాధికున్. 285

పాఠశాలయందున్న చంద్రాపీడునిఁ గొనిపోవ బలాధికుఁడు వచ్చుట.

ఉ. అతఁ డనేకవాజిపద♦గావళితో శుభవాసరంబునన్
భూతలనాథునాజ్ఞఁ గొని ♦ పోయి నృపాత్మజపాఠశాలకున్
వే తనరాకఁ దెల్పి చని ♦ పృథ్వి శిరంబును మోపి మ్రొక్కి యా
నేతృసుతాజ్ఞ చేఁ దనకు ♦ నిర్మితమా నుచితాసనంబునన్. 286

చ. వినయమునన్ వసించి పృథి♦వీపతిసూనుని గాంచి యిట్లనున్
వినుము నరేంద్రునాజ్ఞ విను♦పింతు కుమారక! మాదుకోర్కు లె
ల్లను బరిపూర్ణతం గనెఁ గ♦ళల్ సకలంబులు నేర్చినాఁడ వ
త్యనుపమప్రజ్ఞఁ గాంచితివి ♦ నాయుధవిద్యల నాగమంబులన్. 287

చ. అనుమతి నిచ్చినారును గృ♦హంబునకుం జన నొజ్జ లందఱున్
జను మిఁక నిన్నుఁ బూర్ణిమని♦శాకరు సర్వకళాభిరాము నూ
తనసముదంచితున్ బలె మ♦దద్విపమున్ గృతశిక్షణంబు బం
ధనతలనిర్గతంబు నటు ♦ తద్దఁ గనుంగొనుఁగాత నిచ్చలున్. 288

ఉ. ఎన్నఁడు వచ్చు మేము కను ♦ టెన్నఁ డటంచు దినంబు లెంచుకొం
చున్నజనాళిలోచనము ♦ లొందుత సత్ఫల ముత్సుకంబులై
యున్నవి నిన్నుఁ గాంచఁ గడు ♦ నుద్ధృతిసంతిపురంబు లన్నియున్
బన్నుగ నాఱవాబ్దమున ♦ వచ్చితి వీ విటకున్ నృపాత్మజా!. 289

క. పదివత్సరములు చదివితి, పదునాఱవవత్సరంబు ♦ ప్రాప్తించెను నీ
కిది మొదలు మాని చదువును, సదనమునకు రమ్ము పదము ♦ క్ష్మాపతితనయా!.

క. నినుఁ గాంచ నభిలషించెడు, జనయిత్రుల కెల్ల నొసఁగి ♦ సందర్శనమున్
వినతి యొనరించి గురువుల, కనియంత్రణవృత్తి నుండి ♦ యందు సుఖములన్.

క. నవయౌవనసౌఖ్యంబుల, నవిరతలలితముల నెల్ల ♦ నందుము జగతీ
దివిజులఁ గొల్వుము బాంధవ, నివహంబును ముంపు హర్ష ♦నీరధిలోనన్. 242

సీ. తావకసేవకై ♦ తండ్రి మహారాజు పంపినయశ్వంబు ♦ పవనజవము
త్రిభువనరత్నంబు ♦ త్రిభువనాశ్చర్యంబు నుదధిజలోత్థితా♦యోనిజంబు
నశ్వరత్నం బిది ♦ యాసాదితము మహారాజాధిరోహణా♦ర్థంబు ననుచుఁ
బారసీకాధిప♦ప్రహితంబు నృపసుత! యింద్రాయుధంబునా♦నెసఁగుహయము

తే. ద్వారమున నిల్చియున్నది ♦ ధాత్రిలోనఁ
బుట్టలే దింకఁ బుట్టంగఁ ♦ బోదు దీనిఁ
బోలునది శక్రహయమును ♦ బోలు ననుచు
లక్షణజ్ఞులు చెప్పిరి ♦ లలితచిత్త!. 243

ఉ. కైకొని దీని నెక్కి భువి ♦ గణ్యత నంద ననుగ్రహింపుమా
నీకయి సార్వభౌమకుల♦నీరధిసోములు శూరవర్యులున్
బ్రాకటసత్కళావిదులు ♦ పార్థివసూనులు నన్వయాగతా
నేకులు వచ్చి వాకిటను ♦ నిల్చినవా రదె వేచి మ్రొక్కఁగన్. 244

చ. అనుచు వలాహకుండు విన♦యమ్మునఁ జెప్పఁగ రాజపుత్త్రుఁడున్
జనకుని యాజ్ఞ మస్తమునఁ ♦ జయ్యనఁ దాల్చి నవీనమేఘుని
స్వనఘనవాక్కులన్ బలికె ♦ వాజిని దానిని దెమ్మటంచుఁ దాఁ
జనఁగ మదిం దలంచి నృప♦సత్తమ! యొజ్జలకున్ వినమ్రుఁడై. 245

ఇంద్రాయుధవర్ణనము.

సీ. ఇరుపార్శ్వములయందు ♦ నిరువురు కల్లెంబుబంగరుకడియముల్ ♦ పట్టి వంప
నన్నృతవేగవిదగ్ధ ♦ నలతార్క్ష్యు బెదరించుచున్నదో నాఁ గడు ♦ నూర్జితముగ
గర్భరంధ్రంబులు ♦ గదల సారెకుఁ జేయు సకిలింతల జగంబు♦సంచలింప
జవనిరోధామర్ష♦జనితఘుర్ఘురరవఘోరఘోణం బొప్పఁ ♦ గుతల మెల్ల
తే. దాఁట నుంకించుచందమ్ము ♦ దనర మెడను
దూరముగ వంచి యెత్తుచు ♦ సారెసారెఁ
బొలుచునింద్రాయుధం బను ♦ పురుషదఘ్న
వాజిరాజంబుఁ గైకొని ♦ వచ్చి రంత. 246

ఉ. ఆహయరత్నముం బొగడ ♦ నానొకొ మాకు నతిప్రమాణమున్
దేహముఁ గన్న వేగతతి; ♦ దేవనృపాలహయావతారమే
యాహయ మాకసంబు వడి ♦ నభ్యసనం బొనరించె నొక్కచో
నూహయొనర్పఁ; దార్క్ష్యునకు ♦ నుద్ది జవంబునఁ బార్థివోత్తమా!. 247

ఉ. గాలికిఁ దోడునూపుఁ ద్రిజ♦గంబుల సంచరణంబుచేయు; గో
పాలకపాదపంకజము♦భాతి జగంబుల మూఁట నొక్కటన్
జాలును దాఁట; గ్రీష్మదివ♦సంబువిధంబున నాయతంబు నా
భీలము; భోగిమాడ్కిఁ బృథి♦వీవర! కోరు సదాగతిన్ మదిన్. 248

సీ. అసితపాటలపీత♦హరితరేఖలచేతఁ గల్మాషితంబయి ♦ క్రాలుకతనఁ
జిత్రవర్ణితకుథా♦స్తీర్ణమై విలసిల్లు కరికలభంబునాఁ ♦ గ్రాలుచుండు
నసురశోణితపంకి♦లాలోహితసటాళిఁ బార్వతీసింహంబు♦పగిది నొప్పుఁ
గైలాసతటఘాత♦గైరికముఖధాతుపాటలవృషభంబు♦భాతి మెఱయుఁ
తే. జెలఁగు మానససంచార♦కలిత మగుచు, నప్పుతిమరాళముకరణి ♦ నతిశయిల్లు
నుదధిపులినంబుచందాన♦నురువరాట, మాలికాభూషితంబయి ♦ క్రాలు నధిప.

తే. అతిజవంబునఁ ద్రాగిన♦యాశుగంబు
వెడలఁ గ్రక్కెడి నా నొప్పు ♦ విడువ కదరు
ముకుపుటంబుల సీత్కార♦ములఁ జెలంగు
నాసికారంధ్రముల నది ♦ నరవరేణ్య!. 250

తే. నోర గలగలలాడెడు ♦ క్రూరకవిక
యొరపిడిని బుట్టులాలాంబు ♦ నురుగు చిగురు
లర్ణవనివాసపరిపీత ♦ మమృతరసము
నుమియునో నాఁగఁ బుక్కిళ్ల ♦ నుమియుచుండు. 251

తే. మానవాధిప! దానిని♦ర్మాంసమైన, వదనమండల మొప్పెడుఁ ♦ బరఁగ నులిని
మలిచితీర్చినవిధమున ♦ లలిత మగుచు, దీర్ఘమై శుభలక్ష్మము ♦ దేజరిలఁగ. 252

తే. వదనమండలనిక్షిప్త♦పద్మరాగ, మణిసముద్గతఘృణిరాజి ♦ మైకొనంగ
నరుణచామరకలిత మై♦నట్టు దాని, కర్ణయుగళంబునిశ్చలా♦గ్రంబు మెఱయు.

తే పసిఁడిగొలుసులవగ్గము♦లెసఁగ లక్క, వోలెనరుణంబులై ప్రేలు♦లోలనటలు
వార్ధిసంచారలగ్నప్ర♦వాళపల్ల, వంబు లన దాని మెడ నొప్పు ♦ వసుమతీశ!.

సీ. వక్రకాంత్తస్వర♦వత్రభంగంబులు వ్రాసి చాతుర్యంబు ♦ భాసిలంగ
పారెసారెకు రట♦త్సద్రత్నమాలికాపుంజంబు లమరించి ♦ పొలుపుదెలువ
న్థూలముక్తాఫల♦శుభదామకంబుల లాలితగతిని న♦లంకరించి
సన్మాలికలచేత ♦ సాంధ్యరాగమునట్లు నాశ్వికాలంకార ♦ మరుణమయము
తే క్రాలఁ గైసేసి యాయలం♦కారనిహిత, మరకతమణిప్రభాతతి♦మయిని బర్వ
శ్యామలంబయి దివినుండి♦జాఱిపడిన, రవిరథాశ్వంబు నా నొప్పు ♦ రాజవర్య!.

తే. అమితతేజస్విత రయంబు♦నాఁగఁ బుట్టు, స్వేదజలజాలకంబులు ♦ సింధువాస
సక్తముక్తాఫలంబుల♦చందమునను, దనరుచుండెను దద్వాజి♦తనువునందు.

చ. తనరును నంజనోపలకృ♦తంబులు నా నిల జర్జరీకమై
పొనరఁగ నత్తి దింపుటలఁ ♦ బుట్టెడుక్రూరముఖారవంబులన్
దనరెడుదానిగిట్టలు ని♦శాంతము పార్థివచంద్ర! జంభభే
దనమణిపాదపీఠులవి♦ధంబున మర్దల మభ్యసించునన్. 257

సీ. ఉల్లిఖితంబునా ♦ నొప్పుచుఁ బ్రక్కల మెడఁ బ్రసారితమన ♦ మేటి యగుచు
విస్తారితం బైన♦విధమున నురమున నలరుచు జంఘల ♦ నతిశయిలుచు
నుత్కీర్ణమో యన ♦ నురుజఘనంబున ద్విగుణీకృతంబునాఁ ♦ దేజరిలుచు
శ్లక్ష్ణీకృతంబు నాఁ ♦ జనుచు నాస్యంబునఁ గడుభీత మన స్తబ్ధ♦కర్ణమగుచు
తే. భస్మసితపుండ్రకాంకిత♦వదన మగుచు, వ్రతివిధంబున మధుపంక♦యుతపిశంగ
కేసరం బయి మధుమాస♦వాసరంబు, పగిదిని వికసితాశోక♦పాటలంబు.

చ. మనుజవరేణ్య! దానిని న♦మానుషలోకసమంజసాకృతిన్
దనరి యదృష్టపూర్వమగు♦దాని జగత్త్రయ మెల్ల నేలఁగా
ననువగుదాని సర్వశుభ♦దాంకసమన్వితమైనదానిఁ గాం
చి నరవరాత్మజుం డచల♦చిత్తుఁడు నిట్లను విస్మితాత్ముఁడై. 259

చ. సరభసవృత్తి నొక్కమొగి ♦ సర్వవిభుం దరిత్రాడు చేసి యు
ద్ధురగతిఁ ద్రిప్పి త్రిప్పి కడుఁ ♦ దోయధి మందరపర్వతంబుచే
సుర లసురుల్ మథించి మఱి ♦ సోలియు నీహయరత్న ముద్ధరిం
పరఁట యిఁకెట్టిరత్నముల ♦ వారు సముద్ధరణం బొనర్చిరో. 260

చ. సరిదధిపప్రతారితుఁడు ♦ స్వర్విభుఁ డంబుధి దీని నీయ కా
సురహయమిచ్చె నాతనికిఁ ♦ జొక్కె నతండును దాన; మేరుభూ
ధరశిలవోలె నాతతతఁ ♦ దాల్చిన యీహయపృష్ఠ మెక్కకే
సురపతి సౌఖ్యమేమి గనె ♦ క్షోణివిభుం డయి ముజ్జగంబులన్. 261

చ. గరుడుని నెక్కుకౌతుకము ♦ కంజదళాక్షుఁడు మానఁ డింక నీ
తురగముఁ గానఁ డంచు మదిఁ ♦ దోఁచెడిఁ గాంచిన మానకుండునే
యరెరె యతిక్రమించె విను♦తామరరాజసమృద్ధిఁ దాతరా
జ్యరమ త్రిలోకదుర్లభము ♦ లైనసురత్నము లిట్టి వందుటన్. 262

ఉ. దీనిపరాక్రమంబు నతి♦తేజముఁ గాంచిన దేవతాత్మగాఁ
గానఁబడున్ నిజంబు గడుఁ ♦ గాతరతం గను నెక్క నామనం

బూనదు; కేవలాశ్వముల ♦ కుండునె యిట్టి త్రిలోకవిస్మయా
ధానసముజ్జ్వలాకృతులు ♦ ధాత్రి నమానుషలోకపూజ్యముల్. 263

ఉ. దైవతముల్ ధరించెడిన ♦ తాపసశాపమునన్ స్వదేహమున్
బోవిడి యొందు దేహము న♦పూర్వము; రంభఁ ద్రిలోకరత్నమున్
దేవసుగాత్రిఁ దిట్టఁడె ము♦నీంద్రుఁడు స్థూలశిరుండు; దాన నా
దేవసుగాత్రి యశ్వమయి ♦ దివ్యపదంబుఁ దొఱంగి భూస్థలిన్. 264

క. జననము నందెను బడబా,ఖ్యను శతధన్వాభిధాను ♦ క్ష్మాతలనాథున్
మన మలరఁగఁ గొలుచుచు నుం,డెను జిరకాలంబునట్లు♦డిండ మహిమతోన్.

క. మునిశాపంబున నెందఱో, ఘను లుర్విని వివిధరూప♦కలితాత్మకులై
జననం బందిరి యిదియును, మునిశప్తం డగునొకముని♦ముఖ్యుఁడె తలఁపన్.

తే. దీనిదివ్యత్వమును నాదు♦మానసంబు
తెలుపు చున్నది నిజము సం♦దియము గలదె
యనుచుఁ దలపోయుచును లేచె ♦ నారురుతున్
వగుచు నాసనముననుండి ♦ యతఁడు వేగ. 267

ఉ. ఆతురగంబు డాసి మది ♦ నంజలిబంధ మొనర్చి యోమహా
త్మా! తురగంబ! యెవ్వఁడవొ ♦ యాతఁడవే నిను నెక్కునట్టి నా
యేతదతిక్రమంబు మది ♦ నెన్నక సైఁచి క్షమింపు నీకిదే
జోత యొనర్తు దేవతలు ♦ చూడ రెఱుంగక చేయుతప్పులన్. 268

చ. అన విని యాహయం బతని♦యాశయముం గనుఁగొన్న దానిరీ
తిని విదిలించి కేసరత♦తిన్ మఱి కేకరతారకంబుగాఁ
గను మరలించి దృష్టిని బ్ర♦గాఢముదంబున దుమ్ము రేఁగి పై
కొనఁ గుడిగిట్ట భూతలముఁ ♦ గొట్టుచు నెక్కఁగ రమ్మటంచుఁ దాన్. 269

చ. సారెకుఁ బిల్చుపోలికను ♦ సంచలతం గన ఘ్రాణరంధ్రముల్
తోరముగాఁగ హుంకృతుల♦తోడన ఘర్ఘరరావసంతతుల్
చేరి మనోజ్ఞమై చెలఁగఁ ♦ జేసెను హేషితరావ మంత నా
క్ష్మారమణాత్మజాతుఁడు నొ♦సంగె నటంచును నెక్క నానతిన్. 270

తే. తలఁచి యామధుహేషిత♦ధ్వానమునను
నెక్క దానిని త్రైలోక్య ♦ మెల్ల నొక్క

జా త్తిలిగ నాత్మ నెంచుచుఁ ♦ జోద్యమందు
చరుగుదెంచెను విద్యాగృ♦హంబునుండి. 271

వ. అట్లరుగుదెంచి ముందర. 272

సీ. ప్రళయజలదముక్త♦పాషాణవర్షంబువడువునఁ బరుషంబు ♦ బలిగృహంబు
సంశిథిలంబుగా ♦ సల్పు నా నతినిష్ఠురంబును నగుఖురా♦రావమునను
ఖురజరజోరుద్ధ♦ఘోరఘోణారవమున హేషితధ్వాన♦మునను మిగుల
బధిరీకృతంబులై ♦ పరఁగ లోకము లెల్ల నూర్ధ్వీకృతంబును ♦ నున్నతంబు
తే. హరితవాహకరావళి♦యంటివెలుఁగు, ఫలకముల నొప్పుచుండెడు♦ప్రాసజాల
మభ్రతలమును నున్మృణా♦ళాసితాబ్జ, జాలవనసంకులసరస్సు♦లీలఁ జేయ. 273

తే. అలరునుద్దండబర్హి బ♦ర్హాతపత్ర, శతసమాచ్ఛాదితాష్టాది♦శాముఖంబు
స్ఫురితశతమన్యుచాపకి♦ర్బురితమయిన, జలదపటలంబు నాఁ దగి ♦ లలితగతిని.

తే. ఉద్వమత్ఫేనపుంజస♦ముజ్జ్వలాప, దాతముఖముల వల్గన♦తారళతను
బ్రళయసాగరకల్లోల♦వార మన న,పార మయి పొల్చునాశ్వీక♦బలముఁ గాంచె.

క. ఆయాశ్వీకబలమెల్లను, దోయధినీరంబునట్లు ♦ తొగచెలిరాకన్
వే యాతనినిర్గతిచే, మాయురె క్రక్కదలె నొక్క♦మాఱుగ నపుడే. 276

క. నరపతు లహమహమికతో, సరభసగతిఁ దీసివైచి ♦ ఛత్రములఁ బర
స్పర మొరసిపారుహయములఁ, గరమునివారించుకొనుచుఁ♦గదిసిరి మ్రొక్కన్.

చ. తెలుప బలాధికుండు నొక♦దిక్కుననుండియు నోలి పేరులన్
దెలుపుచు నొక్కరొక్కరుని ♦ దేకువ మ్రొక్కిరి రాజపుత్రులున్
జలితకిరీటసంఘటిత♦సారసరాగమరీచిజాలసం
ఛలనమునన్ స్వరాగమును ♦ జల్లెడి నాఁ జను నమ్రమౌళులన్. 278

క. చంద్రాపీడుఁడు వారిని, సాంద్రాదరమతిని నుచిత♦సమ్మానన నీ
రంధ్రాత్ములఁ జేసెను దుర,గేంద్రమ్మును నెక్కి మిత్రుఁ ♦ దెలమిని బడి రాన్.

సీ. రాజ్యలక్ష్మీనివాస♦రాజితాంభోజమో స ప్తిసేనావగా♦స్సైకతంబో
క్షీరోదడిండీర♦గౌరవాసుకిఫణామండలమో మౌళి♦మణులరుచిరయో
యన స్థూలముక్తిక♦ఘనజాలకావృత మగుచు సింహాంకిత♦మగుచుఁ జైనిఁ
ద ప్తకా ర్తస్వర♦దండమండితమయి పరఁగెడు శ్వేతాత♦పత్ర మొప్పఁ
తే. జామరంబులు వీవంగ ♦ శ్రవణపల్ల
వంబు న ర్తింప నుభయపా♦ర్శ్వంబులందు

వందిమాగధబృందంబు ♦ గ్రందుగాఁగ
సలుపఁ గైవారములు వేడ్క ♦ సంచలింప. 280

తే. మ్రోలఁ బరుగులు వాఱుచు ♦ వేలు వేలు
తరుణవరవీరపౌరుష♦ధనులు ఘనులు
పదగజను లుద్దవిడి గొల్వఁ ♦ బత్తనాభి
ముఖుఁ డగుచు వెడలెను నృప♦ముఖ్యసుతుఁడు. 281

—చంద్రాపీడుని గనుజనుల చిత్తవృత్తివర్ణనము—

చ. నరవర! మేనుదాల్చిన య♦నంగుఁడొ నాఁ బురమార్గగామియై
యరిగెడునాతనిం గని జ♦నావళి కార్యము లెల్ల వీడి చం
దురుఁ డుదయింప మోదమునఁ ♦ దోఁగెడుకైరవకాననంబు నాఁ
బరఁగెను హర్ష వారినిధి♦భంగములం దగ నోలలాడుచున్. 282

తే. వదనకైరవనికురుంబ♦భయదరూపుఁ, డైనమన్మథుఁ డీఁక వీని ♦ నరసి తనకు
మారకబ్దమ్మునకు సిగ్గు♦కూరకున్న, సఫల మాయెను నేఁడు♦మాజన్మ మహహ.

తే. మారురూపంబుఁ దాల్చిన♦మధువిరోధి
కాని యీతఁ డస్మత్తమా♦కాంతసుతుఁడు
కాఁడు నిజము నిజము నమ♦స్కార మనుచు
నగరలోకంబు మ్రొక్కెను ♦ నగణితముగ. 284

తే. అరుగుదెంచెఁ జంద్రాపీడుఁ ♦ డనుచుఁ జూచు
హర్షమునఁ దలుపులను గ♦వాక్షశతము
లను సముద్ఘాటితములను ♦ గనిన నగర
మక్షినివహంబు తెఱచిన ♦ యట్టు లుండె. 285

ఉ. మే మతిపుణ్యవంతులము ♦ మీఱుచుఁ బ్రేమరసప్రవాహినీ
స్తోమము జాలువాఱఁగఁ గు♦తూహల మున్ముఖతన్ ఘటింపఁగా
నీమహనీయరూపమును ♦ నెట్టియుటంకము లేక చూచుచు
న్నాము విశాలదృగ్యుగము♦నన్ దమితీఱఁగ నీదినం బహో. 286

సీ. దాకేలమరకత♦దర్పణంబు ధరించి కొందఱు పూర్ణేందు♦మండలమున
రాజిల్లుపూర్ణిమా♦గాత్రులు నాఁ; గొంద ఱార్ద్రయావకపాట♦లాంఘ్రు లగుచుఁ
బంకజపరివీత♦బాలాతపాబ్జిను లనఁగఁ గొందఱు సంభ్ర♦మాగమమున
గళితకాంచీసమా♦కులితాంఘ్రులై శృంఖలాబంధనాలస♦యాధకరిణు

తే. లనఁగఁ గై సేత సగమున ♦ నాఁపికొంద, అమరపతిచాపరాగోజ్జ్వ ♦ లాంబరములఁ
గట్టి జలధరనముల ♦ కరణిఁ గొంద, అఱుగుదెంచిరి పురభామ ♦ లతని గాంచ.

చ. కరమునఁ దారహారములఁ ♦ గై కొని వచ్చిరి కొంద ఱింతు లా
స్మరుఁడు నశింప శోకమును ♦ సైఁపఁగ లేక విర క్తచి త్తయై
కరము తపం బొనర్పఁ గర ♦ కంజమునన్ స్ఫటికాక్షమాలికా
ధరణ మొనర్చినట్టి యుల ♦ దర్పకురాణిని గ్రేణి చేయుచున్. 288

చ. అలఁతిజలమ్ముచేఁ బొలుచు ♦ నాపగ మధ్యమునందుఁ బాఱఁగా
నలరెడుచక్రవాకయుగ ♦ మందు ప్రదోషపురాత్రులో యనన్
జెలఁగుచు నేగుదెంచి రట ♦ చేడెలుకొందఱు వానిఁ గాంచఁగా
గళితము లైనహారములు ♦ క్రాలఁ బయోధరమధ్యసీమలన్. 289

ఉ. కొందఱు కాంత లందియలఁ ♦ గూర్చినరత్నము లింద్రచాపముల్
గ్రందుగఁ గొల్పఁ జెంపుడుశి ♦ ఖండులు వెంబడి నేగుదెంచు నా
గొందఱు మద్య మర్ధమును ♦ గ్రోలి తదర్ధముఁ గ్రోల కట్టె చే
నందియు పానపాత్రముల ♦ హర్మ్యతలంబుల నెక్కి రారయున్. 290

ఉ. కొందఱు ఫుల్లతామరస ♦ కోశపుటాంబరచారిపద్మినీ
బృందముఁ గానుపించుగతి ♦ వే ముఖమండలముల్ హరిన్మణీ
సుందరజాలరంధ్రముల ♦ శోభిల నిర్గతముంగఁ జేసి యా
సుందమూర్తి రాజసుతుఁ ♦ జూచిరి కన్నులకర్వ తీఱఁగన్. 291

సీ. రసనానినాద మా ♦ రసి వచ్చుమందిరసారసరవములు ♦ సరస మాడ
స్ఖలదంఘ్రితాడిత ♦ సోపానరవహృష్టబర్హికేకులుగూడఁ ♦ బరుగువాఱ
మంజులగతి మీఁటు ♦ మధురవీణారావకోలాహలంబులు ♦ కేలొసంగ
నవమేఘరవభీత ♦ ధవళచ్ఛదారావకోలాహలంబు కై ♦ కో లొసంగ
తే. మదనజయఘోషణములకు ♦ మార్దవంబుఁ
గఱపు చనోన్యఘట్టన ♦ క్వణితతార
హారమణిరమణీభూష ♦ ణారవములు
శ్రవణసుభగంబులై మించె ♦ సౌధపంక్తి. 292

సీ. రమణీమయమ్ము నా ♦ రాజిల్లె సౌధాళి సతతాంగనాజన ♦ సక్తిఁ గాంచి
పల్లవమయము నా ♦ భాసిల్లె భువి స్త్రైణసాలక్తపాదవి ♦ న్యాస మంది
లావణ్యమయము నా ♦ లసితమయ్యెను బ్రోలు నంగప్రభాప్రవా ♦ హంబుఁ జెంది
శశిబింబమయము నా ♦ నెసఁగెను గగనంబు వదనమండలరాజి ♦ సదన మసుచు

తే. కమలవనమయి మనఁగను ♦ గ్రాలె దిశలు
నెండఁబొడ దాఁకకుండఁ జై♦కెత్తినట్టి
పాణితలముల; నింద్రచా♦పమయి మనఁగ
నడరె నాతప మాభర♦ణాంశువులను
నలరె నుత్పలమయము నా♦నమము దృశల. ౨౯౩

చ. సలిలమయంబులో స్ఫటిక♦సంఘటితంబులొ దర్పణంబులో
తెలియదు చెప్పఁ బెడలి ♦ తేటి గనుంగొనునాసరోజనే
త్రలహృదయంబు లందు నల ♦ రాజసుతాకృతి చొచ్చె నంత నా
చిలుకవహుమాయిరాతు నెడ♦సేయక చొచ్చెను దక్షిణంబునన్. 294

మ. సవిలాసంబులు సాభ్యసూయములు సే♦ర్ష్యంబుల్ సవిశ్రంభహృ
ద్భవముల్ సాధ్వససంభ్రమాకలితసో♦త్ప్రాసంబులున్ జాతురీ
భవనమ్ముల్ పరిహాసయుక్తములు నై ♦ భాసిల్లుసల్లాపముల్
దివిరెన్ రమ్యములై పరస్పరము నా♦దివ్యాంగనామండలిన్. 295

చంద్రాపీడుని గనుచున్న స్త్రీల పరస్పరసంభాషణము.

సీ. పరుగువారెదవేల ♦ త్వరితగామిని! నేను నరుదెంతు నిలునిలు♦మరుగకమ్ము[ము
మూఢురాల!యిదేటి♦ మోహంబు మోముపైఁ దూలుముంగురులను♦ద్రోసికొను
దర్శనోన్మాదిని!♦తాళుకొ మ్మొకయింత జాఱుపయ్యెదకొంగుఁ ♦ జక్కనేయు
ముడివీడి మెడలపైఁ ♦ బడుకేశపాశంబు ముడివేసికొను మద♦మూఢచిత్త!
తే. తెమ్ము మదనాంధ! చేర్చుక్క ♦ తీవ్రముగను
తగులుకొనిపాదములఁ బువ్వు♦దామకములు
పడెదు; దంతపత్త్రంబులు ♦ పట్టుకొనుము
శూన్యమానస! యెంతని ♦ చూచెదింక. 296

చ. అపగతలజ్జ! వీడి పడు♦నంశుకముం గను; కర్ణపల్లవం
బు పయికిఁ దోపు చెక్కిళులఁ ♦ బొల్పుగ నుయ్యెల లూఁగుఁ బాపినీ!
యపిహితముంగఁ జేయు మదె ♦ యందఱు చూతు రురోజభారమున్
జపలమనస్క! వచ్చుపరి♦చారకవర్గము నైనఁ జూడుమా. 297

ఉ. వేగిర మేగుదెమ్ము చను ♦ వేగిర మాతఁ డలీకముగ్ధరో!
రాగవినద్ధనేత్ర! గన♦రాదె సఖీజన మేగుదెంచు నీ

యాగడ మేమి యొక్క తెవె ♦ యోఁగెదు జాలము నెంతయాళి నీ
వే గను మంత యెవ్వరికి ♦ నీయకు ప్రొలకు రమ్ము కోపనా! 298

చ. కనుఁగొన దేల వ్యాజమునఁ ♦ గాంచు మసత్యవినీత! నమ్మదిన్
స్తనభర మొత్తి యేఁచెదవు ♦ జవ్వని! డెందము నిల్పుకొమ్మ యా
యనవరతానురాగమధు♦వానకు మోసి యిదేమి పెద్దలన్
గన కిటు పేరెమొత్తెదవు ♦ ఖండితధైర్య! పయంట జాఱఁగాన్. 299

తే. మదనపరవశ! యిది యేమి ♦ మదము నాదు
పయఁట చెఱఁగును బయఁటగా ♦ వైచికొనదు
మన్మథజ్వరపులకల ♦ మాటుపఱుపు
ముగుద! విరహాబ్ధి వానికై ♦ మునిఁగెదేల. 300

ఉ. ఊరక యేల డెందమును ♦ నూఱడ నీయ కనేకవిభ్రమా
సారములం గలంచెదవు ♦ సాహసినీ! వృథ యంగభంగశృం
గారములన్ వలగ్నమును ♦ గాఱియపెట్టుచు ఖేద మొందు దో
మారవికారిణీ! యిటుల ♦ మానక గాంచెద వాకులత్వమున్. 301

ఉ. ఊరుపుఁ బుచ్చునన్ మఱచి ♦ తుగ్గలి యేమి కుతూహలం బొకో
నేరవు గేహమున్ విడిచి ♦ నీ వరుదెంచినసంగతిన్ గనన్
జేరెను మానసం బెచటఁ ♦ జిత్తజబాణనిఘాతమూర్ఛితా!
నూరకతంబు లాదలను♦సోఁకక యుండఁ బయంట కప్పుమా. 302

చ. సురతసుఖంబుఁ గాంచి మదిఁ ♦ జొక్కుచుఁ గన్నులు మూయుదాన! యా
నరవరపుత్త్రుఁ డేగు నయ♦నంబులు తెరువుము; లోచనంబులన్
గరము విలోకనీయమును ♦ గాంచక మోస మొనర్చె దేల నెం
బరవు సతీవ్రతగ్రహము♦పట్టినదాన వధన్య వెంతయున్. 303

ఉ. కోపము వీడి లెమ్ము సఖి! ♦ కోమలి! చూడు రతీవియుక్తు న
ప్రాపితమీనకేతు నవ♦పంచశరున్ నృపపుత్త్రు నీతనిన్
బాపము పూరుషాంతరవి♦భావనయంచుఁ దలంకి జీవమున్
దాపము నొందఁ జేసెదు ని♦తాంతము మిన్నక మందభాగ్యవై. 304

చ. కనుఁగొను మాలతీకుసుమ♦కల్పితశేఖర ముత్తమాంగమం
దు నళికులాసితంబునను ♦ దోఁచుసితాతపవారణాంతరం

బునఁ దిమిరభ్రమన్ బడిన♦పుష్కరవైరిమయూఖజాలమో
యనఁగ నదే సరోజముఖి! ♦ హర్షముఁ గూర్చెడి మానసంబునన్. 305

చ. పొలఁతిరో! చూడు మీతనిక♦పోలతలంబు వెలుంగు శ్రోత్రభూ
షలవిలసిల్లు పచ్చలత్రి♦వల్ కలియం దగఁ జూడ నొప్పి శ్యా
మల మగుచున్ శిరీషకుసు♦మంబులఁ గట్టినకర్ణపూరముం
గలదియు నాఁగ; నేమి యిది ♦ గ్రాలెడి నీతనిహారమధ్యలోన్. 306

చ. అరుణమణిప్రభాళి యిది ♦ యంబుజలోచన! కాదు కాదు లోఁ
జొర గమకించుయావనపుఁ♦జొక్కపురాగము చూడు మింతిరో!
కరము వెలింగడిన్ వెలిఁ ♦ గాంతరో! యీతఁడు చూచుఁ జామరాం
తరములనుండి యీకడనె ♦ దంతగభస్తులు పర్వ నవ్వుచున్. 307

శా. వైశంపాయనుతోడుతన్ సరససం♦భాషావిశేషంబు లా
యాశాంతంబులు దంతకాంతివితతి♦వ్యాప్తిన్ వళక్షంబులై
కాశింపన్ హసితం బొనర్చు చిదిగో ♦ గావించు నీతండు సూ
రోశాతోదరి! యస్మదీయసుకృతం ♦ బూహింప సామాన్యమే. 308

చ. తురగఖురాహతిన్ బొడము♦ధూళిని ముంగురులందు లగ్నమై
పరఁగెడుదానిఁ బంచశర♦వాహనపక్షమునట్లు పచ్చనై
యరుదగు నుత్తరీయవస♦నాంతమునన్ దొలఁగించువాఁ డదే
పరిచరుఁ డౌ బలాధికుఁడు ♦ భామిని! గాంచుమ యీనృపాత్మజున్. 309

ఆ. లచ్చికేలుఁదమ్మి♦లాగున మృదుతల, మంఘ్రిపల్లవంబు ♦ నదిగొ యెత్తి
యడ్డముగను నుంచె♦నశ్వంబుపైఁ జూడు, మీతఁ డిగురుఁబోఁడి!♦యింపెలర్ప.

తే. గజము కై వాలకబళంబు ♦ గైకొనంగఁ
బొండమును జాఁపుక్రియ రక్త♦తోయజాభ
మైన దీర్ఘాంగుళికరంబు ♦ నందుకొనఁగఁ
దమ్మలంబును జాఁపెను ♦ దరుణి! యిదిగొ. 311

చ. ఎవతె పరిగ్రహించునొకొ ♦ యీతనిహస్తము నిర్జితాబ్జమున్
సవతి యగున్ మహీసతికి ♦ సారసగేహిని తోడికోడలై
యవనిఁ గృతార్థురా లదియు; ♦ యామెయ ధన్య యశేషభూమిభా
రవహనదక్షు వీని నుద♦రంబున నెవ్వతె దాల్చి మోచెనో. 312

చ. అను నివి యాదిగాఁ గలుగు ♦ నైకవిధోజ్జ్వలమంజుభాషలన్
మన మలరంగ నాడు నల♦మానిను లక్షులఁ గ్రోలుచుండ భూ

షణనినదంబులన్ బిలువ ♦ స్వాంతములన్ వెనువెంట రాఁగ భూ
షణమణిరశ్మిరజ్జువుల ♦ సంయుతుఁ జేయఁగఁ బూనినట్లుఁగన్. 313

మ. నవకారుణ్యబలిప్రదానములచే ♦ నర్ఘోజ్జ్వలాలావలై
పువ్వులం గూడిన లాజలన్ బలుమఱున్ ♦ భూరిశ్లథద్బాహువ
ల్లివిస్రంసివలత్కకంకణములన్ ♦ లీలామనోజ్ఞంబుగాఁ
గ వివాహాగ్నిని బోలెఁ జల్లఁ దనపైఁ ♦ గాంతుల్ మదిన్ మీఱఁగాన్.

వ. ఇట్లు చనిచని రాజకులంబుఁ దఱిసి. 315

— రాజకులవర్ణనము. —

సీ. జాముజామున సేవ ♦ సలుపంగ వచ్చిన యంజనాద్రులఁ బోలు♦హస్తిఘటలు
గండస్థలంబులఁ ♦ గ్రాలెడిమదవారిమసిపంకిలం బయి ♦ యొసఁగఁ జేయ
నాశాముఖంబుల ♦ నంధకారితముల సలుప జలదవేళ♦చందమునను
దనరుచు నుద్దండ♦ధవళాతపత్రసహస్రసంకులమయి ♦ యతిశయిలుచు
తే. నలరుదానిని ద్వీపాంత♦రాగతైక
దూతశతసంకటం బయి ♦ తోఁచుదాని
రాజమందిరద్వారమ్ము ♦ నోజ మెఱయఁ
జేరి దిగె గుఱ్ఱమును దాను ♦ క్షితిపసుతుఁడు 316

క. దిగి వైశంపాయనుకే, ల్దగఁ గైకొని తనదుహస్త♦తలమున వినయం
బు గదుర బలాహకుఁడు ముం, దుగ నరుగుచు దారిఁ జూపఁ♦దోతెంచి వడిన్.

ఉ. తెల్లనియంగరేకులును ♦ దెల్లనిచర్చయుఁ దెల్లపాగలున్
దెల్లనిపువ్వుదామములుఁ ♦ దేజరిలన్ ధరియించి పాణులం
దుల్లసిలంగ వేత్రలత ♦ లుద్ధృతముల్ దెలిదీవివారు నా
వెల్లనివేసమూనుటను ♦ వెల్గుచు నున్నతదేహధారులై. 318

చ. కృతయుగమర్త్యులన్ దెగడి ♦ కేరుచు నుండెడుద్వారపాలకుల్
సతతము చెక్కుఁబడ్డగతి ♦ సల్లిఖియించినమాడ్కి జాగరూ
కతఁ గొలువంగఁ దోరణపుఁ♦గంబమున న్నిలుచుండి రేవగల్
తత మగుద్వారదేశమును ♦ దాల్చినదానిని నొక్కచోటునన్. 319

చ. కలసిన ముజ్జగంబు లనఁ ♦ గ్రాలెడిదానిని నభ్ర మంటుచున్
సలలితచంద్రశాలలను ♦ సంజవనంబులు వేదికాతతుల్

కలిగిన యగ్రభాగములఁ ♦ గాంతములై రజతాద్రిఁ గేరి సొం
పలరు సుధావదాతనవ♦హర్మ్యములన్ సహిమాచలంబుగాఁ
జెలఁగెడుదాని నాటకము♦చెల్వున సాంకవతాకమై కడున్.  320

ఉ. ఆయుధసంతతుల్ గలిగి ♦ యాంతరసీమ మహాగభీరమై
వాయుభుగాశ్రితంబు లగు ♦ పన్నగలోకములట్లు పొల్చు నా
యాయుధశాలలం జెలఁగి ♦ యాయతమై తనరారుదాని గాం
గేయశిఖండియష్టికలఁ ♦ గేరెడిదాని సచంచలంబు నాన్.  321

సీ. చిత్రకంబళసమా♦స్తీర్ణంబులై మించు కనకపర్యాణముల్ ♦ గలుగునవియుఁ
జలకర్ణపల్లవ♦ముల వ్రేలుచామరతతులముద్దు లొసంగి ♦ తనుపునవియుఁ
గులయోషితలమాడ్కిఁ ♦ గొమరారి శిక్షలఁ గడువినీతములయి♦గ్రాలునవియు
నై నయామకరేణు♦కావళి వీడని కక్ష్యాంతరంబులఁ ♦ గ్రాలుదాని
తే. శిఖరగతకేకికారవ♦ముఖరితముల, సరసిజాక్షీపదాలక్త♦కరససిక్త
రత్నశకలంబులను మించు♦రమ్యకేళి, శైలముల నొప్పుచుండెడు ♦ శ్రీలదాని.

సీ. కట్టుకంబంబునఁ ♦ గదలక నిలుచుండి కనుమూసి యొక్కింత ♦ కర్ణములను
నిశ్చలంబులఁ జేసి ♦ నిర్భరానందంబు తనరారఁగా వామ♦దశనకోటిఁ
దొండంబు నిడికొని ♦ తూఁగుచు నభినవజలధరఘోషంబు♦చందమునను
గంభీరమై వేణు♦ఘుర్ఘురీవల్లకీనాదానుగత మయి ♦ నవక మెసఁగు
తే. సతతసంగీతమర్దళ♦స్వనము లీల, వినుచు నిరుతట్ల వ్రేలాడు♦కనకచిత్ర
కంబళముఁ దాల్చి గైరిక♦కర్బురోరు, పక్షపుటములు గల వింధ్య♦పర్వతంబొ.

తే. అనఁగ హస్తిపగీతంబు ♦ నాలకించి, హర్ష ముప్పొంగ నలుచుచు ♦ నతిగభీర
భంగి శ్రోత్రపుటంబులఁ ♦ బరఁగుచుండి, సంకుపేరులు మదజల♦శబలితములు.

తే. కాంచనమయాంకుశము వ్రేలఁ ♦ గర్ణములను
గర్ణపూరంబుగతి; నొండు♦కర్ణచామ
రమ్ము నా మదజలమలి♦నమ్ము మధుప
కులము గండస్థలంబులఁ ♦ గొమరు మిగుల.  325

తే. పూర్వకాయం బుదగ్రమై ♦ పొలుచుకతన
జఘనభాగంబు హ్రస్వమై ♦ జరుగుచుండ
బలిగృహంబుననుండి దాఁ ♦ బైకి లేచి
వచ్చుచున్నది నా నొప్పి ♦ వామనుగతి.  326

సీ. త్రిపదీవిలాసంబు ♦ దీపింప; నిశవోలె నక్షత్రమాలికా♦నద్ధ మగుచు
శారదారంభంబు♦తీరునఁ బ్రకటితారుణచారుపుష్కర♦రుచిర మగుచు
స్ఫాటికగుహతటి♦సొరున సంలగ్నహరిముఖప్రతిమాస♦మాక్త మగుచు
సమలంకృతునిమాడ్కి ♦ సంచలత్కర్ణపల్లవచుంబివదనస♦ల్లలిత మగుచుఁ

తే. గ్రాలుగంధమాదన మను ♦ గంధగజము
తనర నొక్కెడ నొప్పెడు♦దాని మిగులఁ
దారకాగణయుతము నాఁ ♦ దారతతుల
బొమ్మల సగృహాద్వైవమై ♦ పొలుచుదాని. 827

సీ. పట్టకంబలపట♦ప్రచ్ఛన్నపృష్ఠముల్ ఘంటికారవలస♦త్కంఠములును
మాంజిష్ఠలోహిత♦మంజు కేసరవాలపల్లవంబులు రాజ♦వల్లభములు
మంగళగీతికా♦మధురనిస్వనదత్తకర్ణంబు లున్నత♦గాత్రములును
నంతఃకపోలాత్త♦హారిమధురసాక్తలాజకబళముల ♦ లాలితములు

ఆ. నగ్రయవసరాశి♦యగ్రస్థలినివిష్ట, మందురాధిపములు ♦ మహితములును
నైన వారువములు ♦ నైకవిధమ్ములు, గలుగుసాహిణములు ♦ గలుగుదాని.

చ. సముచితవేషముల్ దొడిగి ♦ చారుమహోన్నతవేత్రపీఠులన్
సముపవిష్టులై చెలఁగు♦సారసభాభవనంబులందు ధ
ర్మమునవతారముల్ గతిని ♦ రాజులు న్యాయవిచారణాధిపుల్
దమి వ్యవహారముల్ నడుపఁ ♦ దద్దఁ జెలంగెడిదాని నంతయున్. 829

చ. జగ మఖిలంబు నొక్కయిలు♦చాడ్పునఁ జూచుచు నల్లపల్లియల్
నగరములున్ దదాఖ్యలు స♦నర్మముగాఁగ నెఱింగి చిత్రగు
ప్తుగతిని నేర్పున న్నిఖిల♦భూవ్యవహారము లెల్ల వ్రాయుచు
న్నగణకవర్యు లాజ్ఞలను ♦ నైకము వ్రాయఁగఁ బొల్చుదానినిన్. 830

చ. కనకమయార్ధచంద్రనిభ♦కాయములన్ శబలంబులై కడున్
దనరెడుతోలుకేడెములఁ ♦ దాల్చి నిశాసమయంబుచాడ్పునన్
గనఁబడుచున్ స్ఫురన్నిశిత♦ఖడ్గకరప్రకరాంకురంబులన్
బొనరుచుచున్ బ్రకాశమును ♦ భూరికరాళితమై చెలంగఁగన్. 831

ఉ. తెల్లనిదంతపత్రములు ♦ తేజరిలన్ జెవులందుఁ; జేతులం
దుల్లసిలంగ ఖడ్గములు ♦ నుజ్జ్వలధేనుకలున్ భుజంబులన్
దెల్లనిగంధచర్చికను ♦ నిగ్గులు దేరఁగ మాళిపాళి భా
సిల్లఁగ నెత్తి కట్టి విల♦సిల్లెదు ద్రావిడముఖ్యసేవకుల్. 832

చ. కొలువఁగ వారితోఁ గొలువు♦కూటమునం దుచితాసనంబులన్
నిలిచి విపంచి మీటుచును ♦ నేర్చుచు శారిఫలప్రచారమున్
సలుపుచు ద్యూతకేళి యటు ♦ త్త్వాపతిరూపము భిత్తిపాళికన్
తెలుపుగ వ్రాయుచున్ నృపతి ♦ చేసినకార్యములన్ బఠింపుచున్. 383

సీ. కావ్యవినోదంబుఁ ♦ గావించుచును దమిఁ బరిహాసకథలను ♦ జరపుకొనుచుఁ
గవిగుణంబులఁ గని ♦ గానంబుఁ జేయుచు ద్విపదిపాఠంబును ♦ దిద్దుకొనుచుఁ
బత్త్రభంగంబులఁ ♦ బచరించుకొనుచును బిందుమతీగోష్ఠి ♦ నందుకొనుచు
మదిని బ్రహేళికా♦మథనంబు చేయుచు మాగధగీతంబు♦బాగు వినుచు

తే. వెల్లతలపాగలను దాల్చి ♦ విభుఁడు వెలికి
నెపుడు వచ్చునో యనుచును ♦ నెలమి వేది
యుందు సామంతనరపాల♦యూథతతులు
గలుగుదానిని విరివిచేఁ ♦ గ్రాలుదాని. 384

చ. జనపతి లేవఁ జట్టె యొక♦చక్కని వైచిన రత్నపీఠికా
కనదురుచిత్రకంబళని♦కాయములన్ ససురేంద్రచాపమో
యనఁ దగు కొల్వుకూటముల ♦ యంతములన్ గడు నొప్పు చెంతయున్
దనరెడిదానిఁ గిన్నరులు ♦ తార్కొనఁ బొల్చెడుదాని నెప్పుడున్. 385

ఉ. అందెలు కాంచి నూడిగము ♦ లారవముల్ సలుపంగ ఘుల్లునన్
స్కంధములన్ సువర్ణమయ♦చామరముల్ ధరియించి యెప్పుడున్
గ్రందుగ ఫుల్లతామరస♦కాండములన్ వెదఁజల్లునట్టు లిం
పొంద నిజాస్యబింబములఁ ♦ బూతసురత్ననిబద్ధభూములన్. 386

ఉ. వచ్చుచుఁ బోవుచున్న వర♦వారవిలాసినులన్ జెలంగుచున్
మెచ్చగుదాని నొక్కయెడ ♦ మేలిమిబంగరుశృంఖలంబులన్
విచ్చక కట్టివేయఁబడి ♦ వీఁగెడుకుక్కలఁ బొల్చు చిట్టటున్
మచ్చిక సంచరించు మృగ♦నాభిమృగావళిసౌరభంబు బల్. 387

ఉ. క్రచ్చుకొనంగ నద్దెసలఁ ♦ గ్రాలెడుదానిని బంజరంబులన్
ముచ్చటలాడు శారిశుక♦ముల్ గలదానిఁ జకోరదంపతుల్
హెచ్చుగఁ గూయ వీనులకు ♦ నింపుగఁ గోయిల పాడఁ బంచమం
బచ్చుపడంగ నందముల ♦ కాలయమై యలరారుదానినిన్. 388

చ. కరిపతిదానసౌరభము ♦ ఘ్రాణపుటంబుల సోఁకినంతనే
నిరవధికప్రకోపమున ♦ నిల్వఁగ నేరక బొబ్బరించుచున్

శరభసవృత్తిఁ బైకొగిరి ♦ సారె శిలాధరకందరాంతరాం
తరములనుండి తెచ్చిన కు♦ధారణిజీవితవర్గమో యనన్. 339

ఉ. కోనులయందు నుండుహరి♦పోతములన్ గలదాని నిట్టటుల్
మానుగ వీడిలోన నను♦మానము సంచరియించుకుబ్జసం
తానసమాకులం బయిన♦దానిని నిత్యశుభాన్వితంబునై
జానగుదాని సౌరభముఁ ♦ జల్లెడుపూఁబొదరిండ్ల నొప్పుచున్. 340

చ. కనకపుసౌధకాంతులను ♦ గాంచి దవానలశంక డాయఁగా
జనక విలోలతారకతఁ ♦ జయ్యన భీతిని దవ్వుదవ్వులన్
జనుచును బర్వువారు మృగ♦సంతతిలోచనకాంతు లంతటన్
జనఁగ విచిత్రతాళ మయి ♦ సన్నుతి కెక్కినదాని నెంతయున్. 341

క. కేకానుమేయమరకత, భూకలితశిఖండిచయము ♦ పూతమలయజా
నోకహశీతచ్ఛాయల, జోక న్నిద్రించుహంస♦సుందరు లలరన్. 342

సీ. బాలికాక్రియమాణ♦పాంచాలికందుక కేళీవిలాసైక♦లాలితంబు
సతతసంచాలిత♦చారుడోలాగ్రశబ్దితఘంటికారావ♦దిఙ్ముఖంబు
సౌధావతీర్ణసం♦చరితపారావతస్థలపద్మినీస్థలీ♦సమ్మితంబు
శ్వసనభుఙ్నిర్మోక♦శంకితభుజగభుక్షిప్యమాణవరహార♦చయయుతంబు
తే. శారికాకీరభాషిత♦సతతసురత, సమయవిస్రంభసల్లాప♦సత్రపాన
రోధజనవిరాజితము సు♦రూపితంబు, చిత్రవస్తువిరాజితా♦శేషగృహము 343

వ. మఱియు. 344

క. నరపతిచరితవిడంబన, పరత వినోదించురాజ♦భామలచేతన్
బరఁగుచు సౌధంబులపై, కరుగుచుఁ బడి మ్రోయు స్త్రీల♦యందెలరవణిన్.

క. ఇనుమడిగ నఱచెదునికే, తనకలహంసముల ధవళి♦తం బగు ముంగి
ళ్లను గల్గి ప్రాంగణంబులఁ, దనరెడు మావులను బండ్ల♦దశనంబు నొగిన్.

క. సలుపుచు గృహదాడిమఫల,ములఁ గోయుచుఁ గుబ్జవామ♦ముఖజనములకున్
గలుగఁగఁ జేయుచు వెఱపును, దలఁగుచుఁదద్భూషణముల♦ధరణివయిచుచున్.

క. చపలక్రీడల మెలఁగెడి, కపికులముల శోభితంబుఁ ♦ గరతలములఁ బ
ట్టి పసిండిదండముం దా, ల్చి పవిత్రదుకూలములను ♦ క్షీణవయసునన్. 348

క. ముదుసలిసింహములట్టులు, వదలక సత్వంబుఁ బలిత♦పాండురశిరులై
పొదలుచు మంగళమయు లన, సదమలసౌశీల్యమయుల♦చందమునఁ గడున్.

క. తనరుచు స్వభావధీరతఁ, గనుచు గభీరాకృతు లగు♦కంచుకి జాల
మ్మనయము కావలిఁగాయఁగఁ, బొనరెడునవరోధమునను♦బొల్చుచుమఱియున్.

సీ. నీలాగరుసుధూమ♦జాలంబులను జలధరసనాథంబునాఁ ♦ దనరుదాని
యామకుంజరఘటా♦హస్తశీకరముల నీహారయుతము నా ♦ నెగడుదాని
ద్వారదేశస్థిత♦దండపాణిగణంబుచే శివుగుడివోలెఁ ♦ జెలఁగుదానిఁ
బద్మాకరోల్లస♦త్పద్మసౌరభమున సూర్యోదయముభంగి ♦ సొగియుదాని
తే. రత్నకంకేళికాతరు♦రాజివలన
సతరుణాతప మనఁగను ♦ జాలుదానిఁ
దలఁప ధారాగృహంబుల ♦ లలిత మగుచు
వర్షఋతుయుత మనఁగను ♦ వఱలుదాని. 351

సీ. ప్రకటమనోరమా♦రంభమై యొప్పుచు నప్సరస్తతివోలె ♦ నలరుదాని
వివిధవర్ణశ్రేణి♦వేద్యమాననవార్థమై కవిగద్యాభ ♦ మైనదాని
బాణయోగ్యావాస♦భరితమై యేప్రొద్దు శోణితపురివోలె ♦ సొగియుదాని
వరకరసాహస్ర♦వర్షితరత్నాలయమ్మయి శశివోలె ♦ నలరుదాని
తే. సతతబహుదానసంతాన♦సంయుతమయి, దిగ్గజముభంగి వెల్గొందు♦ తేజుదాని
సముచితస్థాపితావని♦సకలకోశ,మయి పురాణంబుపగిదిని ♦ నలరుదాని. 352

సీ. అఖిలలోకవ్యవ♦హారజాతహిరణ్యగర్భంబు బ్రహ్మాండ♦కంబువోలె
నైకగీతాకర్ణ♦నానందితనరంబు తనకుమహాభార♦తంబువోలె
వంశానుగతశూర♦బలపురుషోత్తమకలితంబు యదువంశ♦కంబువోలె
భోగిమండలశత♦భూషితసుప్రకోష్ఠం బీశభుజవన♦చయమువోలెఁ
తే. బ్రథమమధ్యమోత్తమపుర♦మధృతిసంప్ర
దానకారకాదేశయు♦తంబును నయి
సుక్రియావ్యయసువిభక్తి♦శోభితంబు
నగుచు వ్యాకరణమువోలె ♦ నలరుదాని. 353

తే. చిత్రరేఖాసుదర్శిత♦చిత్రసకల
భూతలాకారమై బాణ♦పుత్రికాని
రుద్ధుల సమాగమమువోలె ♦ రుచిర మగుచు
వెలయుదానిని విస్మయ♦కలిత మగుచు. 354

తే. ఉదధివోలెను నంతర్గ♦తోరుపక్ష,సహితభూభృత్సహస్రక♦సంకులంబు

శుక్లపక్షప్రదోషంబు♦సొబగునను సు,ధాకరసితాంబరవితాన♦ధారితంబు.

సీ. గాంధికభవనంబు♦కరణిని స్నానధూపవిలేపవర్ణక♦భాసితంబు
తాంబూలకగృహంబు♦దంబునఁ దక్కోలలవలీలవంగాది♦లాలితంబు
ప్రాభాతసమయంబు♦భాతిని బ్రాచీనరాగానుమితమిత్ర♦రాజితంబు
గణ్యవేశ్యాసమా♦గంబున ట్లవిదితహృదయవిచేష్టావి♦కృతియుతంబు
తే. లలితనక్షత్రమాలికా♦లంకృతంబు, గగనముంబలె; నుపచార♦కలిత మరయ
వేశ్యవిధమునఁ బరలోక♦విరహితంబు, దుర్జనునిమాడ్కి నై యొప్పు♦తోఁచుదాని.

సీ. కాముకజనతతి♦కరణిని బహుచాటునల్లాపకతతాల♦శబ్దితంబు
ధర్మకార్యమువోలె ♦ ధారుణీజనమనఃప్రహ్లాదనక్రియా♦ప్రస్తుతంబు
ధూర్తమండలివోలెఁ ♦ దుష్టిదదన్మణికతభూషణాలేఖ్య♦సంచయంబు
ప్రాగ్వంశముంబోలె ♦ భాసురనానాసరోల్లసత్పాత్రస♦ముజ్జ్వలంబు
తే. రఘుకులమువోలె భరతవి♦రాజితంబు
మాద్రికులమట్లు నకులస♦మంచితంబు
కరముఁ రామాయణమువోలె ♦ కపికథాకు
లంబు నయి యొప్పుదాని జ♦గంబునందు. 857

సీ. ధనమువోలెను సర్వ♦జనకాంక్షణీయంబు స్కందునిగతి శిఖి♦చంచలంబు
కులకాంతగతి సదా♦కలితశంకయుఁ గానయటువోలెను ద్విజగ♦ణాకులంబు
శ్రీపతివక్షంబు♦చెలువున శ్రీరత్నభాభాసమానది♦గ్భాగకంబు
బలభద్రువిధమున ♦ బహుళకాదంబరీరసవిశేషాస్వాద♦రభసితంబు
తే. మృదులకావ్యంబున టనన్య♦విదితభావ
నాశయావేదకము మఱి ♦ యంత్రముగతి
వివిధశబ్దరసాస్వాద♦విలసితంబు
నగుచుఁ జెలువొందుదానిని ♦ నభినవముగ 858

తే. అంత్యజునిమాడ్కి నప్రాప్య ♦ మైనవిషయ
మలర నొప్పెడుదానిని ♦ నంతకభట
తతియుఁ బోలెను సుకృతదు♦ష్కృతవిచార
మూరఁ జేసెడుదాని ను♦దారసరణి. 859

తే. ఆదిమధ్యావసానక♦ల్యాణకరము
సుకృతమునుబోలె; నైకకం♦చుకిసహస్ర

సమధివసితంబు పాతాళ♦జగమువోలె
జ్యోతిషమువోలె గ్రహమాతృ♦శోభితంబు. 360

తే. వాసరారంభమునుబోలెఁ ♦ బద్మరాగ, పాటలీకృష్ణ శాంతంబు♦బ్రాహ్మణుండు
వోలెఁ బద్మాసనోద్దిష్ట♦భూతలంబు, భారతమువోలెఁ గృతవర్మ♦భాసితంబు.

తే. జనవర! యుగమ్యవిషయాభి♦సక్తమయ్యు
శ్లాఘ్యమును స్ఫీతమయ్యును ♦ జరితనగ్న
లోకమును సన్మహాద్వార♦నైకమయ్యు
దుష్ప్రవేశంబు నై యొప్పు ♦ దోఁచుదాని. 362

తే. అరయఁగ నవంతివిషయంబు♦నందునుండి
మాగధజనాధివాసమై ♦ మహికి నెల్ల
నేత్రపర్వం బొనర్చుచు ♦ నెగడుదాని
రాజకులమును జొచ్చి నా♦రాజసుతుఁడు. 363

చ. సరభసవృత్తి వేగఁ జని ♦ సాఁగిలి మ్రొక్కెడి ద్వారపాలకుల్
కరము వినీతి మార్గమును ♦ గారవ మారఁగఁ జూప; రాజు లె
ల్లరు నిలుచుండి లేచి నతు♦లన్ సలుపంగ సుదూరవర్తులై
శిరములు వంచి మౌళిమణి♦శీర్ణమరీచులు భూమిఁ బర్వఁగన్. 364

చ. తెలుపఁగ ద్వారపాలకులు ♦ తేకువఁ జేతులు మోడ్చి పేరులన్
సలుపఁగ వృద్ధభామినులు ♦ సన్నుతితో నవతారమంగళం
బులు; భువనాంతరంబులటు ♦ భూరివిధాఖిలప్రాణివర్గసం
కులముల సప్తకక్ష్యలను ♦ గోర్కులు మీఱఁగ దాఁటి లోపలన్. 365

చంద్రాపీడుఁడు తండ్రియొద్దకుఁ బోవుట.

చ. సతతము శస్త్రధారణత ♦ శ్యామలహస్తులు నేత్రపాణిపా
దతలములన్ దొరంగి సము♦దాత్తవిధమ్మున లోహజాలసం
వృతముగఁ జేసి దేహమును ♦ వెల్గుచు; సామజదానసౌరభాం
చితములు లీనభృంగచయ♦సేవితముల్ కరికట్టుకంబముల్. 366

చ. అనఁగఁ గులక్రమాగతులు ♦ నచ్ఛకులప్రభవుల్ మహోన్నతుల్
దనుజులమాడ్కి రూపములఁ ♦ దర్కశపరాక్రములున్ శరీరర
క్షణకరణాధికారులును ♦ సన్మతి నొప్పెడివారునైన న స
న్మనుజులు చుట్టునుం గొలువ ♦ మంజుమరాళవళక్షశయ్యపై. 367

చ. అమలినసైకతోజ్జ్వలసు♦రాపగవారిని దేవతాకరిం
ద్రమువలె వారకాంత లిరు♦ప్రక్కల వీచుచు నుండ నెప్పుడున్
దమి శితచామరంబులను ♦ దద్దఁ జెలంగుచునున్న తండ్రిఁ గాం
చె మనుజనాథసూనుఁడును ♦ జెప్పఁగఁ జూడు మటంచు ద్వారవుల్. 368

చ. చలితములై శిరోమణులు ♦ చాల వెలుంగఁగ మౌళి వాంచి ద
వ్వులన కృతప్రణాముఁ డగు ♦ పుత్త్రునిఁ గన్గొని మేను పొంగఁగాఁ
బులకితుఁ డై ధరాధిపుఁడు ♦ భూరిముదశ్రులు జాలువాఱ బా
హులజత సాఁచి శయ్యపయి♦నుండియె నాయన! రమ్ము రమ్మిటన్. 369

చ. అనుచును గూర్చువానిగతి ♦ నానెడువాఁడును బోలె నైక్యమున్
బొనరుచువానిచందమునఁ ♦ బుత్త్రు వినీతునిఁ గౌఁగిలించెఁ దా
జనపతి బిగ్గ నెంతకు న♦శాంతముదంబున వీడ నాతఁడున్
జనకుని పాదపీఠసర♦సన్ వినయంబున వట్టి నేలపై. 370

క. తనయుడపకత్తె వేగమ, కొని తెచ్చినయొల్లె తీసి♦కొని పొమ్మని పొ
ల్లనఁ జెప్పుచుఁ బాదాగ్రమ్మునఁ జిమ్ముచుఁ గూరుచుండె; ♦ భూవరుఁ డంతన్.

క. తనయునికంటెను మిక్కిలి, గని గాఢాలింగనంబు ♦ గావింపఁ దనున్
మన మలర మంత్రిసుతుఁడును, ఘనపీఠముపైనఁ దనకుఁ ♦ గా నిడ నిలిచెన్.

వ. అంత. 373

ఉ. వారవిలాసినుల్ చమర♦వాలము వేయఁగ విస్మరించి యిం
పారఁగ వాయుసంచలిత♦పంకజదామసమాయతంబులన్
దారలఁ దారశారముల ♦ దర్శనపాతములన్ సమాదృతిన్
వారక చూచుచుండఁ దనుఁ ♦ బానము చేసెడుమాడ్కి నెంతయున్. 374

ఉ. ఇంచుక సేపు నిల్చి పిత ♦ యింపున వత్స! నినుం గనుంగొనన్
సంచలితాత్మ నీజనని ♦ చయ్యనఁ బోయి నమస్కరింపుమా
గాంచుము సర్వమాతలను ♦ గాఢముదం బొడఁగూర్చి పోయి ర
మ్మంచు వచింప లేచి విన♦యంబున నాపృథివీశసూనుఁడున్. 375

చంద్రాపీడుఁడు తల్లిని జూడఁబోవుట.

చ. పరిజనమున్ సమస్తమును ♦ బంపి వయస్యునితోడ నర్మలా
పరిజనముల్ బరాబరులు ♦ పాటిల మార్గముఁ జూప ముందుగా

నరుగుచు నేగుదెంచె వడి ♦ నంతిపురంబున కంత వేడుకల్
పరఁగ నిజప్రసూగృహము ♦ ప్రప్రథమంబునఁ జొచ్చె భూవరా!. 376

వ. అందు. 377

సీ. ధవళకంచుకముల ♦ ధరియించి పెక్కండ్రు సౌవిదల్లులు కొల్వు ♦ సలుపుచుండ
క్షీరోదవీచికా ♦ శ్రేణిచేఁ జెలువొందు వరమహాలక్ష్మి నా ♦ వఱలు చెవుడు
నతిశాంతమూర్తులు ♦ నలసంధ్యలట్టులు రక్తాంబరమ్ములఁ ♦ గ్రాలఁ గట్టి
నఖిలపురాణేతి ♦ హాసకథాభిజ్ఞలౌ జరత్ప్రవ్రజి ♦ తాళు లలరఁ

తే. బుణ్యకథలను జెప్పుచుఁ ♦ బుస్తకములఁ
జదివి ధర్మోపదేశముల్ ♦ జరుపుచుండ
వర్షధరు లంగనావేష ♦ వచనధరులు
వికటనైపథ్యములఁ దాల్చి ♦ వేడ్కఁ గొలువ. 378

చ. సతతము వీచుచుండ నవ ♦ చామరసంతతి వస్త్రపుష్పసం
తతులను నంగరాగమును ♦ దమ్ములమున్ బటవాసభూషలన్
వితతకలాచి గిండియును ♦ వీఁగనయున్ గ్రహియించి యంగనా
తతి వలయంబుగా నిలిచి ♦ తద్దయు నూడిగ మాచరింపఁగన్. 379

చ. అభిమతలీలలన్ గనుచు ♦ నద్దములన్ బ్రతిబింబితాస్యయై
ప్రభనిధిఁ జొచ్చినట్టి ద్విజ ♦ రాజును గన్నదినంబుచాడ్పునన్
శుభమతిఁ దల్లినిన్ గదిసి ♦ చొక్కపుభక్తి నమస్కరింపఁగా
విభుసతి గ్రుచ్చి యెత్తి సుతు ♦ వే యవతాగశుభంబు లిచ్చుచున్. 380

చ. ద్రవమయి లోపలం గలని ♦ తాంతపుఁబ్రేముడి బైటికేగుదెం
చువిధిఁ బయోధరంబులను ♦ జొబ్బిలి పాల్గురియంగ ధారలై
శివళతముల్ దలంచుచును ♦ జిత్తమునన్ బిగియారఁ గౌఁగిలిం
చె విరియ మోము బొమ్మములు ♦ చిప్పిల మూర్కొనుచున్ శిరంబునన్.

క. అటువలె వైశంపాయనుఁ, బటుగతిఁ బరిరంభణమును ♦ బాటించియుఁ దా
నటఁ గూరుచుండి ధరణీ, తటమునఁ దమిఁ గూరుచుండు ♦ తనయు వినయునిన్.

క. తిగిచి బలాత్కారమ్మునఁ, దగఁ బిలిచిన రాకయున్నఁ ♦ దనయంకమునన్
మొగిఁ గూరుచుండఁ బెట్టికొ,నె గగురుపొడువంగ మేను ♦ నీరంధ్రముగన్.

క. సరభసమునఁ బరిజనములు, సరగునఁ గొనివచ్చి యిడిన ♦ సత్పీఠిని మం
టిరినూనుఁడు గూర్చుండన్, గరము ముదశ్రువులు గురియఁ ♦ గౌఁగిటనిడుచున్.

క. సారెకు బాహాశిరంబులు, చారులలాటస్థలంబు ♦ సద్వత్సంబుల్
గూరిమి నిమురుచుఁ దల్లి కు, మారునితో ననియె నిట్లు ♦ మంజులఫణితిన్.

సీ. నాముద్దుపట్టి! నీ♦నాయన కఠినాత్ముఁ డెటు కష్టపెట్టె ని ♦ న్నిన్నినాళ్లు
ముల్లోకములమోహ♦మున మించు నీమేను కష్టంబులెటులోర్చెఁ♦గన్నతండ్రి!
యతిదీర్ఘమగు గురు♦యంత్రణం బేగతి సైఁచితి వౌర నీ♦సాహసంబు
పసివాఁడవయ్యు నీ♦పటుధైర్య మౌరౌర ప్రోడలకుంబలెఁ ♦ బోదలు నీకు
తే. బాలకులతోడి తగులంబు ♦ పరిహరించి
యాటపాటల విడనాడి ♦ యధికభక్తి
నర్భకుఁడ వయ్యు గురువుల ♦ కణఁగి మణఁగి
కొలుచు నీమది కేమందుఁ ♦ గొడుక! చెపుమ! 386

చ. జనకు ననుగ్రహంబునను ♦ జయ్యన నేగతి విద్య లన్ని నే
ర్చిన నినుఁ గాంచి హర్షమును ♦ జెందితి నాగతి నెవ్వ వేగమే
యనుగుణకాంతలం బరిణ♦యం బయి యెప్పుడె నిన్నుఁ గాంతునో
యని మది నువ్విళుల్ గొనుదు ♦ నన్న! యటంచును గ్రుచ్చి కౌఁగిటన్. 387
క. తనవదనప్రతిబింబముఁ, గని వికచసరోజరచిత♦కర్ణాభరణం
బున నొప్పు చెక్కు ముద్దిడెఁ, దనయునిఁ జిఱునవ్వ సిగ్గుఁ ♦ దనర నవనతున్.
క. ఈవగిది నటను నించుక, సేపుండి యతండు కదలి ♦ శీఘ్రం బోలిన్
దీపించు నంతిపురిఁ గన, నేపునఁ జని వారి కెల్ల ♦ నింపొదవించెన్. 389
ఆ. అచటు వాసి ద్వార♦మందుఁ జెలంగు నిం,ద్రాయుధంబునెక్కి ♦ తరలెనుశుక
నాసుఁ గాంచ నట్లె ♦ నానావనీపాల, పుత్రలోక మెల్లఁ ♦ బొలిచి గొలువ.
సీ. వివిధశాస్త్రాంజన♦విద్యోతితప్రతిభాత్ములు కార్యస♦మాగతులును
నాబద్ధచక్రవా♦ళైకదేశోపవిష్టులు శాక్యమునిశాస్త్రి♦శోధకులును
జీవరవ్యాజోరు♦చిత్రధర్మాంశుకచ్ఛాదితు లనురాగ♦చోదితులును
రక్తాంబరములవి♦భ్రాజితుల్ పశుపతివ్రతదీక్షితు లనేక♦బాడబులును
తే. వివిధయామకరీంద్రముల్ ♦ వివిధతురగ
శతములు నమేయజనయూథ♦సంచయములు
కలిగి సమ్మర్దసంబాధ♦కలిత మగుచుఁ
బగలు రాత్రియుఁ జెలఁగువై♦భవముదాని. 391

ఉ. లోనికిఁ బోయినట్టి నృప♦లోక మదెంతకు రామి వేసటన్
బూనుచు మావటీల్నిదురఁ ♦ బోవఁగ గంతల మచ్చి సత్ఫలం

దూని పీఠిందిప్రక్కలను ♦ నుండెడువారలు నట్టె యుండఁగాఁ
బూనియుఁ బూనకే గుథలఁ ♦ బొల్చుచుఁ బట్టున నిల్చి తూలుచున్. 392

చ. అలరెడు సామజంబులును ♦ నైకసహస్రములున్ జెలంగఁగాన్
గలకలలాడుదాని శుక♦నాసగృహాంగణభూమిఁ జేరి త
న్నిలు మని ద్వారపాలకులు ♦ నిల్పకయున్న నృపాలయమ్మునన్
వలె దిగి గుఱ్ఱమున్ వెలిన ♦ పార్థివసూనుఁడు దాని నచ్చటన్. 393

చ. ఉనిచి వయస్యకేలుఁ గొని ♦ యుజ్జ్వలభంగిని ముందుఁ బాఱుచున్
గనఁబఱపంగ ద్వారమును ♦ గాచెడివారలు త్రోవ నడ్డు వ
చ్చినపరివారముం దొలఁగఁ ♦ జేయుచుఁ గొల్వఁగ వచ్చినట్టి రా
జనికరముల్ నమస్కృతులు ♦ సల్పఁగ లేచి కరంబు మోడ్చుచున్. 394

చ. పలుకులు మానియుండఁ బరి♦వారజనంబులు ద్వాస్థనిహుంకృతిన్
జలితములైన వేత్రముల ♦ సాధ్వస మంది సమస్తభూధవుల్
సలుపక చప్పుడున్ నడువ ♦ క్ష్మాతలి నంఘ్రులు మెల్ల నూనుచున్
విలసితకక్ష్యముల్ గనుచు ♦ వేడుక రెండవరాజసద్మమౌ. 395

చ. అన విలసిల్లు నూతనసు♦ధాంచితహర్మ్యసహస్రసంకులం
బును శుకనాసమందిరము ♦ భూవిభుసూనుఁడు చొచ్చెఁ జొచ్చి నై
కనృపసహస్రమధ్యమున ♦ గద్దె వసించి ద్వితీయతాత నాఁ
జను నతనిం గనుంగొనుచుఁ ♦ జాలవినీతిని మ్రొక్కె దవ్వులన్. 396

మ. శుకనాసుండును నోలి తోన సకల♦క్షోణీధవుల్ లేవఁగా
నకలంకాదృతి లేచి సుంత యెదురై ♦ హర్షంబునం బోయి తా
వికచాత్ముండయి హర్షబాష్పకణముల్ ♦ వే నుబ్బఁగా రాసుతున్
బ్రకటప్రేమను బుత్రుతోడ బిగియా♦రన్ గాఁగిలించెం దమిన్. 397

ఆ. కౌఁగిలించి విడువఁ♦గా రాజసూనుండు, సాదరమున నిడిన ♦ చారురత్న
పీఠ మవల నుంచి ♦ ప్రీతిని భూమిపైఁ, గూరుచుండె మంత్రి♦కొడుకుతోడ.

తే. రాజపుత్త్రుండు గూర్చుండ ♦ రాజు లెల్లఁ
దిగిరి తమతమపీఠముల్ ♦ దిగ్గున నిలఁ
గూరుచుండిరి వినయంబు ♦ గూర మంత్రి
యొక్కరుఁడు దక్క నిశ్శబ్ద ♦ మలర నపుడు!. 399

క. క్షణ మూరకుండి సచివుఁడు, మనమునఁ గల హర్ష మెల్ల ♦ నుయినిండఁగ సం

జనితమ్ము లైన పులకలఁ, గనఁబఱచుచు నిట్టు లనియె ♦ క్ష్మాపతిసుతుతోన్.

సీ. తాత! చంద్రాపీడ!♦ధన్యుండ మీతండ్రి పూర్ణయౌవను నిన్నుఁ♦బూర్ణవిద్యుఁ
గనెఁ జాలనాళ్లకు ♦ క్ష్మారాజ్యలాభంబు కలిగెను నేఁడె గాఁ ♦ గనె సమృద్ధి
గురుజనాశీర్వాద♦కోటియెల్లను నేఁడె ఫలియించెఁ దొలిమేలి♦పను లవెల్ల
నేఁడె ప్రసన్నులై ♦ నెగడెరి యిలువేల్పు లబ్బెనే నీయట్టి♦యాత్మజుండు

తే. భ్రాత్రయాద్భుతహేతు వ♦పుణ్యులకును, నీయమానుషబలమేడ ♦ నీదుప్రాయ
మేడ విద్యాపరిగ్రహం ♦ బేడ సకల, విద్యలగ్రహించినాఁడవు ♦ వింత గదుర.

తే. ప్రజలభాగ్యంబు పండెను ♦ బాలకుఁడవు, నీవు భరతభగీరథ♦నిభుఁడ వైతి
వౌర భర్తవు నీవాట ♦ కవని తొల్లి, యెట్టిసుకృతంబు చేసెనో♦యెఱుఁగ నేను.

ఉ. మేను ధరించి లక్ష్మి విను ♦ మేకొన రాదటె యెట్టిమోహమో
మానఁగ నేర దింక నల♦మాయలమారి నిజేశువక్షమున్
బూనుము తండ్రితోడ నిజ♦భూభరముం గిటిరాజు దంష్ట్రపైఁ
బూనినమాడ్కి దోస్స్థలిని ♦ బొల్పుఁగఁ గల్పశతంబు లింపునన్. 403

వ. అని వచియించి పుష్పముల ♦ నాభరణాంబరగంధచర్చలన్
గొని యరుదెంచెఁ దాన గడుఁ ♦ గూరిమిఁ బూజ యొనర్చి వీడుకో
లొనరుప లేచి యంతిపురి ♦ నున్న మనోరచుయొద్ద కేగి తాఁ
గని నతుఁడై తదాజ్ఞఁ గొని ♦ గ్రక్కున నెక్కె నిజాశ్వరత్నమున్. 404

ఉ. తాను వసింపఁ దండ్రి మును ♦ దద్దయుఁ బ్రీతి నపూర్వపద్ధతిన్
మానుగఁ గట్టినట్టి భవ♦నంబును మారటరాజసద్మమో
నా నవపాండుకేతనము ♦ నాదితమంగళతూర్యరావసం
మ్మానితదిఙ్ముఖంబును వి♦మానము పాండురపూర్ణకుంభమున్. 405

చ. వికచసరోజపుష్పచయ♦విస్ఫురితంబుఁ గృతాగ్నికార్యమున్
బ్రకటగృహప్రవేశశుభ♦రాజివిరాజితపారివారమున్
సకలనృపాత్మజుల్ గొలువ ♦ క్ష్మాపతిపుత్త్రుఁడు చొచ్చి వేడ్క నిం
చుక వసియించి యుండి విధు♦సోదరిమండపమందు శయ్యపై. 406

క. ఆనృపతిపుత్త్రలోకముఁ, దానును స్నానాదిదివస♦ధర్మము నడపెన్
లోన తనశయనసద్మము,లో నింద్రాయుధ మునిచె న♦లోలప్రీతిన్.

నిశాముఖవర్ణనము

ఉ. అంత దినాంత మయ్యె గగ♦నాంతమునుండి దినాబ్జగేహినీ
కాంత దిగంగ జాతి పడు ♦ కంభవరాగనిజప్రభాపిన

ద్ధాంతరసీమనూపురము♦నట్టుల నొప్పుచు ముక్తపాదమై
యంతకుతండ్రిబింబ మప♦రాంబుధిలోఁ బడె రాజశేఖరా!. 408

తే. అతనిరథచక్రమార్గంబు♦ననుసరించి, చనియెను జలప్రవాహంబు♦సరణిఁ గాంతు
లప్పతికకుప్పునకు నంత♦నర్కబింబ,మున నధోముఖవ్యాపృత♦మునను నహము.

తే. కమలరాగంబ శేషంబు ♦ కడిగినట్టు, లభినవకిసాలయారుణ♦హస్తతలము
నవలె సమ్మార్జనముచేసె ♦ నరవరేణ్య!, పటు లెల్లను గూళ్ళకుఁ♦బాతె నంత.

తే. కమలపరిమళపరిచయా♦గతమిళింద
బృందసంగతగళమయి ♦ పెంపుమీఱు
జక్కవలజంట విడి పాఱె ♦ శమనుపాశ
ములను మెడ వైచి యీడ్చిన♦పోల్కి నృపతి!. 411

క. దిన మెల్లఁ గరపుటమ్ములఁ, దనివి సనం ద్రావినట్టి ♦ తమ్మిమధురసం
బును సంధ్యాతపకైతవ,మున సూర్యుఁడు గ్రక్కగగన♦మునఁబఱచుటనాఁ.

సీ. వరుణదిశారక్త♦వారిజశ్రుతిపూర మాదిత్యుఁ డరిగెలో ♦ కాంతరమున
కంబరకాసార♦మందుఁ బూచినరక్తకమలిని సంధ్య తాఁ ♦ గ్రాలుచుండఁ
గృష్ణవంశకపంక♦కృతపత్రలతలట్లు తిమిరపంక్తులు పూని ♦ దెసలఁ బ్రాఁకె
సాంధ్యరాగము సము♦త్సారితం బగుచుండఁ దిమిరసంహతిచేత ♦ దిఙ్ముఖముల

తే. నబ్జినీపీత మాతప ♦ మణఁపఁ జొచ్చె
తిమిరపల్లవములు నాఁగఁ ♦ దేంట్లగములు
నొయ్యనొయ్యన రక్తాంబు♦జోదరములఁ
దూఱుచుండంగ మదనుండు ♦ మీఱుచుండ. 413

తే. బలుల నిడుచుండ సాంధ్యదే♦వతకు దిక్కు
దిక్కులందును; శిఖరాత్త♦తిమిరములయి
కేకికులములు లేకున్నఁ ♦ గేకికులము
గలవిపోలెను దోఁప శి♦ఖండియుష్లు. 414

తే. భామ లెక్కమి నిశ్చల♦ధర్మపీఠ,ములును మ్రోయనిగంటలు ♦ పూని చెలఁగ
నంతిపురిఁ గలడోలికల్;♦హర్మ్యలక్ష్మి, శ్రవణనీలోత్పలములు పా♦రావతములు.

తే. జాలవివరంబులను డాఁగ; ♦ శారికీర,ములును సల్లాపములుమాని ♦ ముడ్చి మేను
భవనసహకారశాఖలఁ ♦ బరఁగుపంజ,రంబులను నిద్రపోవ సు♦ఖంబుగాను.

సీ. సంగీతములు మాని ♦ శ్రాంతరవంబులౌ వీణెల నొకచక్కఁ ♦ బెట్టుచుండ
యువతినూపురశబ్ద♦ముపశమింపఁగ గృహకలహంసములు తాము ♦ కదలకుండ

రాజవల్లభహయ♦రాజమందురముల దీపముల్ వెలిఁగింపఁ ♦ దివ్యుచుండఁ
దౌలిజాము సేవకై ♦ తోఁచెడుకుంజరసంచయంబులు చను♦దెంచుచుండ

తే. మధుపకులశూన్యకటభిత్తి♦మత్తహస్తి, కర్ణములఁ బొల్చుశంఖన♦క్షత్రమాలి
కాచమరవాలమండన♦కాండములను, దీసి వైచుచు నుండంగఁ♦దీవ్రగతిని.

మ. అరుగుచు నుండ రాజునకు ♦ నభ్యుదయార్థము స్వస్తిపాఠముల్
జరిపి పురోహితుల్; చనఁగ ♦ క్ష్మాపతు లెల్లను రాజునానతిన్
బరిజను లెల్లఁ బల్చనయి ♦ పార నృపాలయకక్ష్య లన్నియున్
విరివి ధరించినట్టులయి ♦ వెల్గుచు నుండఁగ నిస్స్వనంబులై. 418

తే. వికచచంపకదళములు ♦ విరివిగాఁగఁ
జల్లినట్టులు బింబిత♦జ్వలితదీప
శతములను నొప్పుచుండంగ ♦ సకలమణిని
బద్ధభూములు; సింహముల్ ♦ పండికొనఁగ. 419

చ. పతి నడఁబాసి ఖిన్నయగు♦పద్మిని నూఱడిలంగఁ జేయ నా
గత మగు శీతయాతపము♦కాంతిని మందిరదీర్ఘికాతతిన్
బతితము లై నదీపములు ♦ భాసిలె మారుఁ డధిజ్యధన్వుఁడై
ధృతశరుఁడై వరోధమును ♦ దిన్నఁగ యామికునట్లు చేరఁగాన్. 420

క. అవతంసపల్లవంబుల, పవిదిని రతిదూతివచన♦పంక్తుల నునుపన్
దవిలి సరాగంబులఁ జెవి;, నవియఁగ విరహోత్ర లైన♦యతివలమనముల్. 421

ఉ. అంతఁ బ్రదోష మయ్యెను నృ♦పాత్మజుఁ డుజ్జ్వలదీపికాసమా
క్రాంతుఁడు నగ్రయాయిజన♦కాండుఁడునై చని కాలినడ్కఁ శు
ద్ధాంతముఁ జొచ్చి తండ్రికడఁ ♦ దల్లికడన్ క్షణముండి వేడ్కఁ ద
త్స్వాంతములు ల్లసిల్లఁ దన♦సద్మము చేరెను క్ష్మాతలేశ్వరా!. 422

ఉ. చేరి యనేకరత్నరుచి♦సేవితశయ్యను భోగిరాట్ఫణా
హారముపైన శౌరిగతిఁ ♦ బండి సుఖంబున నిద్రఁ గాంచె ను
ర్వీరమణాత్మజాతుఁ డట ♦ వేకువ మేల్కొని కాల్యకృత్యముల్
తీరిచి క్రొత్తవేఁటతమి ♦ తీవర పెట్టఁగఁ దండ్రి యానతిన్. 423

సీ. ప్రొద్దు పొడ్వక మున్న ♦ పోయెను వేఁటకు నింద్రాయుధం బెక్కి♦యింపెలర్ప
భాలేయకము లంత♦ధర్మశృంఖలబద్ధకౌలేయకంబులు ♦ గ్రాల మ్రోల

ముదుసలిపులిచర్మ♦మును వసనంబుగాఁ గంచుకంబును గాఁగఁ♦గడఁగి తాల్చి
పలురంగులఁ దనర్చు♦పట్టుచీరములఁ దలపెండ్రుకలు పైకి ♦ మలచి కట్టి
తే. రౌంటిచవిజంపు భుజముపై ♦ నోసరిలఁగ
బుఱ్ఱమీసాలు ముఖ మెల్ల ♦ ముసరుకొనఁగఁ
బట్టుదట్టీలఁ గట్టి చే♦పట్టి విండ్లు
ముందు వేఁటరు లఱచుచు ♦ మొనసి పాఱ. 424

క. పెక్కుగజంబులు హయములు, నుక్కు దలిర్పంగఁ బదగు♦లొలసి కొలువఁగా
నక్కుపఁ జొచ్చి మహాటవి, చిక్కుపడం జేసెఁ బెక్కు♦సింహంబులఁ దాన్.

క. చెవిఁ దాఁక నీడ్చి వికసిత, కువలయపాలాశకాంతి♦కుంతౌఘములన్
బవినిభనారాచంబుల, గవియంగా నేసి కూల్చెఁ ♦ గరిశరభములన్. 426

క. బాణాసనటంకార, స్వానభయాక్రాంతచిత్త♦వనదేవతలున్
గానఁగఁ గ్రీఁగంటను దను, బూని వధించెను ననేక♦భూదారములన్. 427

క పరిమార్చి చమరమృగముల, హరిణంబులఁ గూల్చి వేల ♦ నన్యమృగములన్
హరియించెఁ బ్రాణములతో, నరుదెంచెను మింటినడిమి ♦ కర్కుం డంతన్.

సీ. స్నానం బొనర్చిన♦చందాన మే నెల్లఁ దడిసి చెమ్మటబొట్లు ♦ పడుచునుండ
దంతవిఘట్టనఁ ♦ దనరంగ మాటికి గలగలలాడంగఁ ♦ గళ్లె మొవుడు
శ్రమముచే ముఖమున ♦ స్రవియింప ఫేనంబు గంతవట్టిక నంటి ♦ గ్రాలనుర్వ
చవి వనగమనంబుఁ ♦ జెప్పుచుఁ బువ్వుల పల్లవస్తబకంబు♦బాగు నింపఁ
తే. బొలుచు నింద్రాయుధము నెక్కి ♦ మొలచుచెమటఁ
దడిసి మృగరక్తబిందుసం♦తతుల నొప్పు
వారవాణంబు మయి కొక్క♦వన్నె పెట్ట
వివిధపుష్పపరాగసం♦వీతుఁ డగుచు. 429

ఉ. చెమ్మటబిందువుల్ మిగులఁ ♦ జెన్నువహింప హయాంఘ్రిరేణువుల్
గ్రమ్మినఫాలభాగమునఁ; ♦ గాల్బల మెల్లను వెన్కఁ జిక్క తూ
న్యమ్మయి యగ్రభాగ మల♦రారఁగ; శిష్టనృపాలసూను ల
క్ష్మమ్ముల నెక్కి వేగమునఁ ♦ బాఱఁగ గూడనుఁ గొంద ఱర్మిలిన్. 430

క. ఈగతి మృగపతి వనకిటి, యీగతి వనమహిష మిట్లు ♦ లీగతి శరభం
బీగతి హరిణం బని మృగ, యాగతవృత్తాంతములను ♦ యనుకొంచుఁ దమిన్.

క. అరుదెంచెను దనయింటికి, ధరణీపతిసుతుఁడు దిగెను ♦ దనయశ్వంబున్

బరువిడి వే పరిజనములు, వరపీఠ మ్మునవ దాని♦పైఁ గూర్చుండెన్. 432

క. తురగాధిరోహణోచిత, పరిధృతవేషంబు నెల్లఁ ♦ బాపి కవచముం
ద్వరఁ దీసివైచి తోడిన్న, వరనూనులతోడి సరస♦భాషణ మొప్పన్. 433

చ. మలయఁగఁ జేసి వీవనల ♦ మందసమీరము చెన్ను టార్పఁగా
నలసతఁ దీర్పఁ గొంతవడి ♦ నట్టె కనుంగవ మూసి హాయి యిం
పెలయఁగ నేద దీర్చి కొని ♦ యేగను రాజితరత్నభర్మస
త్కలశశతాంతరస్థమణి♦కాంచనపీఠికి మజ్జనోర్వికిన్. 434

ఉ. స్నాన మొనర్చి శుభ్రవస♦నంబున నృష్టశిరోరుఁడై తలం
బూని దుకూలపల్లవము ♦ పూతసితాంశుకముం ధరించి పూ
జానతు లిచ్చి దేవతల ♦ సన్నుతులం బరితుష్టచిత్తులం
గా నొనరించి వచ్చెను సు♦గంధవిలేపనభూమి కత్తటిన్. 435

చ. నరపతి పంప మాల్యముల ♦ నవ్యబహూజ్జ్వలభూషణంబులన్
వరవసనాంగరాగములఁ ♦ బార్థివమందిరపారిచారికల్
ధరణిప! తల్లిదాసులును ♦ దక్కటివారల దాసవర్గముం
గర మనురక్తిఁ దెచ్చి యొసఁ♦గన్ దగ వానిని నోలిఁ గైకొనెన్. 436

క. కొని తొల్తను వైశంపా, యనునకుఁ దా నలఁది పిదప ♦ నలఁదికొని యతం
డనుపద మంతికవర్తుల, కును నలమైపూఁత యొసఁగెఁ ♦ గుతుకం బెసఁగన్.

క. కుసుమాంబరభూషణముల, నొసఁగియు నాగతిని వారి ♦ కుచితవిధి సము
ల్లసితవివిధమణిభాజన, విసరమున సతారశరద♦విష్ణుపదము నాన్. 438

క. తనరెడు భోజనశాలకుఁ, జని యెత్తగు కుథమునందు ♦ సంవిష్టుం డై
తనకుఱఁగటఁ దద్వర్ణన, మును జేయుచుఁ గూరుచున్న ♦ ముఖ్యసఖునితోన్.

క. తమ కర్హంబగు భూభా, గములను నుపవిష్టులైన ♦ క్ష్మాపసుతులతోన్
దమి నిమ్ము వీని కిడి యొసఁ, గుము దీనిని వీని కంచుఁ ♦ గూర్మి దలిర్పన్.

క. సరసము లాడుచుఁ గేరుచుఁ, బరిహాసము లాడుకొంచు ♦ బహుభంగుల క్ష్మా
వరసుతుఁ డాహారవిధిన్, జరిపె నట ననుగ్రహాతి♦శయము నుతింపన్. 441

సీ. అంతఁ బ్రక్షాళిత♦హస్తుఁడై తాంబూలమును గొని క్షణముండి♦ముదముతోడ
నింద్రాయుధముకడ ♦ కేగి నిల్చెను దాని గుణగణంబులనెల్లఁ ♦ గొసరికొసరి
కొండాడి తత్కథల్ ♦ మెండుగఁ జెప్పుచు నాజ్ఞాప్రతీక్షకు ♦ లైనవారు
పార్శ్వవర్తులు తన♦పరిచారకు లనేకు లున్నను దాని ముం♦దుంచి తృణము

తే. తాను తద్ధృతహృదయుఁడై ♦ తరలి రాజ
మందిరంబున కేతెంచి ♦ మనుజవరుని
మాతను విలాసవతిఁ గని ♦ మరలి శయన
సదనమును జేరి యారాత్రి ♦ సలిపె నోలి. 442

తే. అంత మరునాఁడు పఱువాత ♦ నరుగుదెంచె
నంతిపురమున కెల్లను ♦ నధికృతుండు
నరపతిసఖుండు కైలాస♦నామకుండు
సౌవిదల్లుఁడు నృపపుత్త్రు♦సవిధమునకు. 443

ఉ. ఆతని వెంబడించి యొక♦యంగన రాజకులైకవాసనం
జాతప్రగల్భతాగరిమఁ ♦ జాలిన దయ్యు వినీతురాలు బా
లాతపయుక్తపూర్వహరి♦దంతము నా నరుణాంశుకోరుసం
వీతశరీర వచ్చెను న♦వీనవయఃపరిభూషితాంగి యై. 444

వ. ఆయింతి. 445

సీ. కించిదుపగతమై ♦ యంచితతరుణిమ పెట్టనితొడవయి ♦ పెంపెలర్ప
నమృతనదీపూర ♦ మన నొప్పు లావణ్య మాలయం బెల్లను ♦ నాక్రమింప
మంథరప్రేంఖిత♦మంజులభుజలత గోరులజిగిమిమఁ ♦ గురియఁ బ్రభలఁ
గ్వణితపాదాంగదా♦కలితాంఘ్రులలచునంచలనుబొల్చెడుసరో♦జములగెలువ
తే. నిర్భరోద్భిన్నములు కాని ♦ నెఱికుచములు, క్రొత్తచెలువంబు మేనికి♦గుత్తకీయ
మేలిబంగరుమేఖల ♦ గ్రాలఁ గటిని, రాజకులదేవత యనంగ ♦ రాజిలెడిని.

చ. దెసలను బర్వుహారముల ♦ దీధితులందు నిమగ్నదేహయై
యొసఁగు పయోబ్ధిమగ్నవద♦నేందిర నా సమవృత్తతుంగనా
స సితకుశేశయాక్షి మఖ♦శాల తెఱంగున వేదిమధ్య వే
దసమితివోలె సుస్థితప♦దంబుల నొప్పుచు నుండె భూవరా!. 447

తే. రత్నకుండలమకరప♦త్త్రములకాంతు
లలమి శ్రుతిపల్లవంబుల ♦ నలరుమాడ్కి
నలరుఁ దద్గండతలములు ♦ నధర మెపుడు
తమ్మలరసంబునను దోఁగి ♦ తనరుచుండు. 448

క. నిన్నటిచందనతిలకము, చెన్నుదలిర్పంగ ఫాల♦సీమఁ జెలఁగుచుఁగా
సన్నుతనవవనరేఖకు, సన్నని మైతీఁగ నొప్పి ♦ సరి యన నొప్పుఁగా. 449

తే. మేరువనలతవోలెను ♦ సారకనక
పత్త్రలతలను జెలువొంది ♦ వరఁగుఁ; గర్ణ
రాజ్యరమవోలెఁ గలితాంగ♦రాగ యగుచు
నలరు నాయింతి చెలువంబు ♦ నాన పొగడ. 450

క. ఆవిధి వచ్చినకంచుకి, భూవిభుసూనునికి మ్రొక్కి ♦ భువి నిడి కుడిచే
వే వినమితగాత్రుండై, దా విన్నప మాచరించెఁ ♦ దగ ని ట్లనుచున్. 451

క. విను మిటు లాజ్ఞాపించెదు, జనని విలాసవతి దేవి ♦ జనవరసుత! యీ
వనిత కులూతధరాధిప, తనయ సు తజ్జనకు గెలిచి ♦ త్వజ్జనకుఁడు తాన్. 452

సీ. వసితనంబున మును ♦ బందీజనంబుతోఁ బట్టి తెచ్చెను దీని ♦ భద్రముగను
నంతిపురంబున ♦ కనిపెను బరిచారికను గాఁగఁ జేర్చుకొ ♦ మ్మంచుఁ దనయ
యనద యీముగుద తా♦నవనిపాలకసుత యనిపత్త్రలేఖయం♦చాహ్వయ మిడి
తనయకంచెను దీనిఁ ♦ దద్దయుఁ బెంచితి నిరవధికప్రేమ ♦ నిచ్చ లేను

తే. నడపగా నుండ నర్హురా ♦ లనుచుఁ దలఁచి
పంపితిని నీదుపజ్జకుఁ ♦ బట్టి! దీనిఁ
గనకు సామాన్యపరిజన♦కాంత గాఁగఁ
జాపలంబున కెడ మీకు ♦ స్వాంతమునను. 453

క. లాలింపుము బాలికగతిఁ, బాలింపుము శిష్యఁబోలెఁ ♦ బాటింపు చెలిం
బోలెను విస్రంభంబులఁ, జాలఁగలదు దీనియెడల ♦ సౌహార్దంబున్. 454

తే. నాదుడెందంబు దీనిపై ♦ నాదుతనయ, యందుఁబోలెనులగ్నమై♦యలరు దీర్ఘ
కాలసంవర్ధితస్నేహ♦కారణమున, నెట్లు కనుఁగొందువో దీని♦నెఱుఁగఁదనయ!.

క. తగు నీసన్మానంబున, కగణితగుణరాజవంశ్య ♦ యగుటను నీకే
యగవదు నేతత్సుజనత, వగవగ నేఁ జెప్పనేల ♦ పట్టి! యెఱుఁగుమా!. 456

క. అతిచిరకాలోపార్జిత, తతసౌహార్దప్రవృత్తి ♦ దద్దఁ జెలఁగు నీ
యతివయెడ నాకు నీ కవి, దిత మేతచ్ఛీల మనుచుఁ ♦ దెలియఁ బలికితిన్.

క. పలుపల్కు లేల నీ కీ, నెలఁతుక చిరకాలదాసి ♦ నెయ్యరియును నై
చెలఁగునొ యెట్టుల యట్టుల, మెలఁగఁగవలె నెల్లపట్ల ♦ మిహిరసుతేజా!.

క. అని చెప్పి యతఁడు విరతవ, చనుఁ డగుటయుఁ బత్త్రలేఖ ♦ సలిపి కులీన
ప్రణతిని నొదుగుచు నిలిచినఁ, గని చంద్రాపీడుఁ డట్టె ♦ గతనిమిషుం డై.

తే. జననిసెలవును దలఁ దాల్చి ♦ సలువువాఁడఁ
బొమ్ము నీ వని కంచుకిఁ ♦ బుచ్చి; నాఁడు

మొదలుకొని పత్త్రలేఖయు ♦ నుదితభక్తిఁ
గొలువ సాగెను విదువక ♦ కుతుక మెసఁగ. 460

తే. పగలు రాత్రియు సంజను ♦ బండుకొన్నఁ, గూరుచుండిన లేచిన ♦ సవారిచనిన
రాజకులమున కరిగిన ♦ రాజసూను, బ్రక్కఁ బాయక కొలిచె నా ♦ పడఁతిమిన్న.

తే. కన్నదాదిగ దానిపైఁ ♦ గడలుకొనియె
నిముసనిముసంబునకుఁ బ్రేమ ♦ నిస్తులంబు
మనుజపతిసూనునకుఁ బ్రతి ♦ దినమునందు
నధికమయ్యె ననుగ్రహం ♦ బవనినాథ!. 462

ఆ. పెక్కుమాట లేల ♦ యొక్కక్షణంబైన
దానిఁ బాయఁ డాయెఁ; ♦ దలఁచె దాని
నాత్మహృదయమునకు ♦ నవ్యతిరిక్తఁగా
సర్వకార్యములను ♦ క్ష్మాతలేశ!. 463

మాలిని. గరళమలినకంఠా! ♦ కాందిశీకోరుశుంఠా!
స్మరమదధనలుంఠా! ♦ స్మారితోద్యద్వికుంఠా!
సురకులసుఖదాయీ! ♦ సూక్ష్మమార్గానుయాయీ!
పరమపదవిధాయీ! ♦ భక్తచిత్తానపాయీ!. 464

గద్య. ఇది శ్రీమేధావతీనామూర్తిమంత్రోపాసనాలబ్ధకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియతనూభవ సుజనవిధేయ నరసింహనామధేయ ప్రణీతంబైన శృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధావతీనామూర్త్యర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీః.

శ్రీరామ స్సహాయోఽస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగార కాదంబరి

## పూర్వభాగము.

### చతుర్థాశ్వాసము.



నిగమాంతవిహారీ!
ధ్యానసమాసక్తమాని♦ధర్మోద్ధారీ!
దీనజనావనధారీ!
మానసజన్మాపహారి! ♦ మహితపురారీ!. 1

వ. దేవా! దయాయత్తమతి నవధరింపుము. అవ్వలికథావృత్తాంతము చెప్పెద. ఇట్లు కతిపయదినంబులు చన నొక్కనాఁడు ధరారమణుండు నిజతనయునకుఁ జంద్రాపీడునకు యౌవరాజ్యాభిషేకంబు సేయ సమకట్టి తదుపకరణసంభారమ్ముల సమకూర్పఁ బ్రతీహారుల కాజ్ఞాపింప వారును దదాజ్ఞానిర్వహణపరాయణులై మెలంగుచుండిరి. అంత నొకనాఁ డుబుసుపోకకై నిజదర్శనార్థంబు తనగృహంబునకు నరుగుదెంచిన సన్నిహితయౌవరాజ్యాభిషేకుం డగు నాచంద్రాపీడునిం గాంచి సమాసాదితవినయుం డయినను నింకను మిగుల వినీతుం జేయుతలంపున సవిస్తరంబుగ శుకనాసుం డిట్లనియె. 2

శుకనాసోపదేశము.

క. తెలియఁ దగువాని నెల్లను, దెలియుదువు సమస్తశాస్త్ర♦తీరగుఁడవు నేఁ
దెలుపం దగినది సుంతయుఁ, గలుగదు నీ కయిన వినుము ♦ క్ష్మాపతితనయా!.

చ. అతిగహనంబు కేవలము ♦ యౌవనజాతతమంబు; దీని దీ
పతతి హరింపఁ జాలదటె ♦ భానుఁడు నార్పఁగ లేఁడు రత్నదీ
ధితు లణఁగింపఁ జాలవును; ♦ దీవ్రము లక్ష్మిమదంబు ప్రాణ మే
గుతఱిని బాయ; దంజనము ♦ గూర్చిన నీశ్వరతాంధ్య మేగదుఁ. 4

సీ. శిశిరోపచారముల్ ♦ చేసినఁ బోవదు దర్పజ్వరోష్మంబు ♦ దారుణంబు
మూలమంత్రంబులఁ ♦ దూలదు విషయవిషాస్వాదమోహంబు ♦ నవిరతంబు

సంతతస్నానశౌ♦చంబునఁ బాయదు ప్రబలరాగమలలే♦పంబు నెపుడు
తెలవారుజామున ♦ మేలుకువ గనదు రాజ్యసుఖజస్వాప మ♦జస్ర మరయ
తే. నవుట విస్తారముగ దీని ♦ ననువదింతు, మనుజులకు లేనిశక్తియు ♦ జనన మాది
కలిమి యసమానరూపంబు ♦ నల నవీన, తరుణిమము ననర్ఘావళి ♦ ధాత్రిలోన.

తే. అవినయంబుల కెల్లను ♦ నాలయంబు
వీనిలో నొక్కఁ డొక్కఁడు ♦ వేఱఁ జెప్ప
వలయునే యన్ని యొక్కచోఁ ♦ బరఁగు నేని
చెడును సర్వవిధంబుల ♦ క్షితిని జనుఁడు. 6

క. తలఁ జూపఁగఁ దారుణ్యము, కలుషం బగు బుద్ధి; శాస్త్ర♦కాండంబుల ని
ర్మలముగఁ గడిగిన రాగముఁ, దలఁగవు ధవళంబు లయ్యుఁ♦దరుణులదృష్టుల్.

చ. కొని చను పూనవుం బ్రకృతి ♦ కోరినయట్టులు వాత్య యొండుటా
కునువలె దవ్వులన్ రజముఁ ♦ గూడఁగఁ జేయుచు భ్రాంతిఁ గొల్పి యౌ
వనసమయంబునం గరణ♦వాతమృగంబులఁ గొంచుఁ బోవుఁ బా
యనియుపభోగనామకమ♦హామృగతృష్ణ దురంత మెప్పుడున్. 8

చ. అల విషయస్వరూపములె ♦ యంబువులట్టులఁ గ్రోలఁ దీవులై
చెలఁగును గ్రొత్తజవ్వనము♦చేతఁ గషాయితుఁ డైనవానికిన్
దలఁపక మీఁదుఁ దన్మయత ♦ తద్విషయంబులయందు మానవున్
గలఁచి యడంచు సత్పథముఁ ♦ గాంచినదిగ్భ్రమయట్లు భూవరా !. 9

క. నినుఁ బోలుజనులె గాభా, జను లుపదేశంబునకును ♦ స్ఫాటికమణి యా
మినివరకరములగతిఁ జొచ్చును నమలస్వాంతమునను ♦ సుఖముగ నదియున్.

క. అమలం బయ్యును గురువచనము కర్ణము సోఁక వేచు ♦ నాగాచం బై
యమతికి సలిలము వోలెను, సుమతికి శ్రుతిభూష యగుచు♦శోభిల్లుఁ గడున్.

చ. అతిమలినాఘజాలము ల♦యంబు నొనర్చు గురూపదేశ మం
ధతమసముం బ్రదోషశశి ♦ నాశ మొనర్చెడురీతిఁ; గేశసం
తతి నరయింపఁ జేయక ని♦తాంతగుణంబుగ మారు కాంతికిన్
గతమయి వార్ధకంబు క్రియ ♦ క్ష్మాపతిపుత్ర! గురూపదేశమే. 12

క. ఇదె తఱి యుపదేశింపను, సదమలమతి! విషయరసము♦చవి యెఱుఁగ వీఁకన్
మదనాశుగశిథిలం బగు, మది నుపదేశంబు గళిత♦మగు నిల్వదు పో. 13

క. శ్రుతమును వంశంబును దు, ర్మతి కణఁకువఁ గూర్చ లేవు ♦ చులయజభవమా

హుతభుక్కు కాల్పఁడె ప్రచం, డతరము బడబాగ్ని కాదె ♦ నానిన నీటఁగ.14

సీ. సకలమలాపహా♦తమజలస్నానంబు నపలితాజర మగు♦నట్టిముదిమి
యనువర్ణవిరచిత ♦ మగ్రాగ్ర్యగణ్యభూషణ మనుద్వేగప్ర♦జాగరంబు
మొదటిదోషము లేని♦మేటిగురుత్వమ్ము జ్యోతిని మీఱిన♦ద్యోత మరయ
నరవిచుంబితసాల ♦ మగు వప్రవలయంబు నసిఁదోఁడు గొననట్టి ♦ యాత్మరక్ష

తే. గురువునుపదేశ మన ధాత్రిఁ ♦ బురుషులకును
ధరణిపులకు విశేషించి ♦ విరళు లట్టి
వారి కుపదేశికులు వారి♦వచన మంద
అనువదింతురు ప్రతిశబ్ద♦మట్లు భీతి. 15

తే. గరువ మనువాపు చెవులను ♦ గప్ప వారు
వినరు నుపదేశమును విన్న ♦ వెగటు పుట్టఁ
జేయుదురు కరి నిద్రించు ♦ చెలువు మెఱయ
నిదురపోవుచుఁ గురువుల ♦ గదురుకొనుచు. 16

తే. అరయఁగను నహంకారదా♦హజ్వరంపు
మూర్ఛ కన్నులఁ గప్పంగ ♦ ముగ్ధ మగుచు
నవశమగును తేని ప్రకృతి; ♦ యనృతగర్వ
మును నుమాదంబుఁ గల్పించు ♦ ధనము లహహ. 17

తే. తెలిపెదను లక్ష్మిఁగూర్చియె ♦ తొలుత వినుము
సుభటకరవాలమండల♦శోభితోత్ప
లవనవిశ్రమభ్రమరి యీ♦లక్ష్మి గనుమ
యీాయసాధ్వని బోలిన♦యింతి గలదె. 18

సీ. మద్యంబువలనను ♦ మదము; కల్పకభూరుహంబునల్లను రాగ; ♦ మబ్జువలన
నేకాంతవక్రత ♦ నాకాధిపుహయంబువలనఁ జలత, కౌస్తు♦భంబువలన
నతినిష్ఠురతహాల♦హలమువల్లను మోహాశక్తియు నప్సర♦స్సతులవలన
బహువిధపూరుష♦వరణంబు దేవతామణివల్లఁ జింతల ♦ మజ్జనంబు

తే. కూడ నుండినచనువున ♦ వీడి వారి
సాగరమునుండి చనుదెంచు ♦ సమయమునను
వారి విరహోపనోదార్థ ♦ మారఁ గొంచు
వచ్చెనో యన మించునీ ♦ లచ్చి మిగుల. 19

చ. దొరకినఁ జెక్కుటద్దములఁ ♦ దోఁగఁగఁ జేయును బాలనంబునన్
వరగుణపాళిసంతతులఁ ♦ బట్టి చలింపకయుండఁ గట్టినన్
బరువిడుఁ గన్నెలంగి యెటొ ♦ భద్రమదాంధకరీంద్రయూథముల్
కరధృతశాతఖడ్గదృఢ ♦ కాయులు యోధులు గాచుచుండినన్. 20

సీ. కాంచదుపరిచితిఁ ♦ గానదు కులమును గణియింపదును గుల ♦ క్రమము మఱియు
రూప మీక్షింపదు ♦ రూఢమౌ శీలంబుఁ జూడదు ధర్మంబుఁ ♦ జూడ దీవి
శ్రుతము నాలింపదు ♦ శుచినిఁ బాలింపదు సత్యానువృత్తిని ♦ సల్ప దెపుడు
నైపుణ్య మరయదు ♦ నయము పాటింపదు సకలజ్ఞతవిచార ♦ సరణిఁ జనద
తే. యరయ గంధర్వనగరంబు ♦ నట్లు చూచు
చుండఁగనె మాయమైపోవు ♦ నుండ దెచటఁ
దిరుగు మందరపరివృత్తిఁ ♦ దిరుగుసుడులఁ
గరము దిరిగిన యభ్యాస ♦ కలన నాఁగ. 21

చ. జలజవనీవిహారమును ♦ సల్పెడువేళను వానికాడలన్
తెలఁగెడుముండ్లు గ్రుచ్చుకొన ♦ నిల్వఁగ నేరక నాఁగ భూమిపై
నిలువదు పాద మొక్కెడను ♦ నిర్భరవృత్తిని నెత్తి వైచుచి
ల్లిలుఁ జరియించు చుండు భువి ♦ నిట్టియపాధ్వి నెఱుంగ మెచ్చుటన్. 22

సీ. పరుషత నేర్పంగ ♦ వసియించునో యన నసిధారలం దెప్డు ♦ నధివసించు
విశ్వరూపతఁ గాను ♦ వేడ్కనో యన శౌరిదేహాశ్రయంబును ♦ దెగడకుండు
మత్తవారణగండ ♦ మధువానియో యనఁ బరమేశగృహములఁ ♦ బడుచునుండు
దివసాంతకమలంబు ♦ పగిదిని నుపచితకోశనందుని నైన ♦ నీసు విడుచు
తే. విటపకకులంబ వల్లరీ ♦ విధిని నెక్కు
వసుజనని యయ్యుఁ ద్రిపథగ ♦ భాతి నీటి
బుగ్గగతి నస్థిర యగుచుఁ ♦ బొదలుచుండుఁ
జెప్పుదును నేమి యాలక్ష్మి ♦ చేష్టితములు. 23

క. రవిగతివోలెను బ్రకటిత, వివిధసమాక్రాంతి; వర్ష ♦ వేళయుఁ బోలెన్
నవరుచిరద్యుతికారిణి, పవనాశనజగమునట్లు ♦ బహుళితమంబున్. 24

క. తలఁపఁగ హిడింబవోలెను, జెలఁగును భీమైకహార్య ♦ చిత్తయగుచుఁ దా
నిల దుష్టపిశాచీగతి, నలరు ననేకపురుషౌఘక్ష ♦ యంబు తెలుపుచున్. 25

ఆ. అలఁతిలావుగల్గు ♦ నాతని నున్మత్తుఁ, జేయు సుగుణవంతుఁ ♦ జేరఁ బోధు

భారతీగృహీతుఁ ♦ బరిరంభణముచేయు, దీసుచే ననంగ ♦ నింపుతోడ. 26

తే. కనదు సుజనుని ననిమిత్తుఁ ♦ గాఁ గులీను
సర్పమునుబోలెఁ జను దాఁటి ♦ సరసఁ జేర్ప
దు వినయుని బాతకినిబోలె ♦ నవలఁ బోవుఁ
గంటకంబులకుం బలెఁ ♦ గాంచి తూఱు. 27

తే. తలఁప దీవరి మదిఁ జెడు♦కలనుబోలెఁ, బరిహసించుచు నున్మత్తు♦పగిది మంచి
మనసుగలవానిఁ గాంచి యు♦నుంగళుకతి, నధికసత్త్వునిగణియింప♦దట్టి లచ్చి.

తే. ఏమి చెప్పుదు నీలక్ష్మి ♦ యిలను నింద్ర,జాలమును జూపు నాఁ బర♦స్పరవిరుద్ధ
నిజచరిత్రంబుఁ బ్రకటించు ♦ నిచ్చలౌర, విను మదెల్లను జెప్పెద♦విరివిగాఁగ.

చ. అనవరతోష్మ మంధతను ♦ నంగఁగఁ జేయుచు జాడ్య మందఁ జే
యును నభివృద్ధి చేయుచున ♦ యొప్పుగ నీచతఁ గల్గఁ జేసెడిన్
వననిధిఁ బుట్టి తృష్ణ నభి♦వర్ధన మంగఁగఁ జేయు నెప్డు చు
ల్కన ఘటియించుచున్ బలముఁ ♦ గల్గఁగఁ జేయును మిక్కుటంబుగన్. 30

చ. అమృతముతోడఁ బుట్టువయి ♦ యాఁ గటుపాక; యమృత్యు నాలు దే
హము గలదయ్యె; నీచజను♦లందుఁ బ్రియం బొనరించుఁ బూఁకుటో
త్తమరత యయ్యె; నావిలతఁ ♦ దార్కొనఁ జేయుచు స్వచ్ఛఁ గూరి రే
ణుమయి యనంగ; చంచలవి♦నోదిని లక్ష్మి నృపాలపుత్రకా! 31

చ. ఇది యభివృద్ధియౌ కొలఁది ♦ నెందును గజ్జలకృష్ణకర్మమే
కుదుకుకొనంగఁ జేసెడిని ♦ గుంభిని దీపశిఖాంకురంబు భా
తి; దళకొనంగ నెట్టు లనఁ♦దెల్పెద రాజకుమార! చూడు మి
య్యది సుచరిత్రచిత్రముల ♦ నారఁగఁ దుడ్చెడు ధూమరేఖయౌ. 32

వ. మఱియును. 33

సీ. మోహదీర్ఘప్రవా♦హములకు విభ్రమశిఖ య్య కదళిక మన్మథ♦గజమునకును
ధనమదోగ్రపిశాచ♦తతికి జీర్ణగృహంబు పథ్యాలయము సాధు♦భావమునకు
నాశాలతాళికి ♦ నభివర్షనోదకధార రాహువు ధర్మ♦తారపతికి
కోపవేగగ్రాహ♦కోటి కుద్భవనది యావాసదరి కల్మ♦షాహితతికి

తే. విషయమధువుల కాపాన♦విశ్వ; సుగుణ,హంసలక కాలప్రావృష;♦ సురయభూమి
కారనాట్యంబులకు గీతి♦కాగృహంబు, చెప్పఁగా నేల యీలక్ష్మి♦శిథిలపశనయ!

తే. శాస్త్రదృష్టికిఁ జీఁకటి ♦ సర్వదుర్న
యములకుఁ బురఃపతాక యీ♦యతివ; లేఁడు

దీనిచే వంచితుఁడు గాని ♦ మానవుండు
కౌఁగిలింపంగఁబడనట్టి ♦ కానరుండు. 35

తే. కాన దీనినిఁబోలిన ♦ కాంత నెందుఁ
బిలువకయ వచ్చి పైఁబడు ♦ వలచి వలచి
చిత్రగత యయ్యుఁ జలియించుఁ ♦ జింతనంబు
చేయుచున్నను వంచించుఁ ♦ జిత్రగతుల. 36

తే. పాత్రములరూపుతో నున్నఁ ♦ బొనరఁ జేయు
నింద్రజాలంబు; శ్రుత యగు ♦ నింతి యయ్యు
మోసపుచ్చును; నీదృశ ♦ ముదితచేత
దైవగతిఁ జిక్కి రాజులు ♦ దల్లడింత్రు. 37

సీ. అభిషేకవేళన ♦ యరుగు దాక్షిణ్యంబు తజ్జలప్రక్షాళి ♦ తం బనంగఁ
దాల్మి యంతయుఁ దూలి ♦ తలఁగుఁ బురోహితదర్భాగ్రమార్జనుల్ ♦ తలఁగొననఁగ
హృదయంబు మలినమై ♦ పొదలుఁ దద్ధోమాగ్నిఘనధూమసంతతి ♦ గప్పెననఁగ
వార్ధకాగమచింత ♦ వదలును నుష్ణీషపట్టబంధము వెళ్లఁ ♦ గొట్టెననఁగ

తే. నాతపత్రంబు లడ్డమై ♦ నట్టు లూర్ధ్వ, లోక మగపడ కుండును ♦ లోలమతుల
కవనిపతులకుఁ జామర ♦ పవనహృతము, నాఁగ సత్యంబు పాయును ♦ నరవరేణ్య!.

చ. సుగుణము వేత్రదండములఁ ♦ జోదితమైనవిధానఁ బోవు ద
వ్వగ; జయశబ్దనాదములఁ ♦ బోలెఁ దిరస్కృతిఁ బొందు సూక్తులుం
దగ యశమెల్లఁ గేతువస ♦ నంబుల మృష్టమె నాఁగ మాయుఁ; జో
టగుదురు సర్వదోషముల ♦ కక్కట దీనికిఁ జిక్కి క్ష్మాపతుల్. 39

తే. క్రమవశంబున శిథిలిత ♦ శకునికంఠ
పుటముపోలెను జపలతఁ ♦ బొలుచునవియు
మెఱపుగతిని ముహూర్తంబు ♦ మెఱయునవియు
నార్యజనగర్హితంబులై ♦ యలరునవియు. 40

తే. నైనసిరులకు లోనయి ♦ యవశు లగుచు, విత్తలవలాభగర్విత ♦ విస్మృతాత్మ
జన్ము లయి నైకదోషోప ♦ జాతదుష్ట, రక్తమునుబోలు ననురాగ ♦ సిక్తు లగుచు.

తే. పెతలఁ గుడుచుచు బహువిధ ♦ విషయలాల
సములు నైదయ్యు శతసహ ♦ స్రము లనంగఁ
దోఁచునింద్రియములను దుం ♦ దుడుకుఁ గనుచు
నడలుదురు కొంద ఱీభువి ♦ నవనిపతులు. 42

తే. ఒక్కఁ డయ్యును జగమెల్లఁ ♦ బెక్కుఁగతుల
సహజచాంచల్యమునఁ బర్వ ♦ సల్పుఁ గేళి
మనము; వానికి లోనయి ♦ మనుజపతులు
పోవుదురు కొంద ఱది పోవు♦పోకలంద. 43

సీ. మదనశరంబుల ♦ మర్మాభిహతులు నా ముఖభంగశతముల♦మొనయుచుండ్రు
గాఢప్రహారాభి♦ఘాతులఁ బోలెను నంగముల్ ధరియింప ♦ నలసు లవుచు
వరధనోష్మంబుచే ♦ వండఁబడెదరు నా బహువిధచేష్టలఁ ♦ బరఁగుచుందు
రెంద్రకాయలఁ బోలె ♦ నెప్పు డడ్డముగాఁగ సంచరింతురు వాని ♦ సత్వ ముడిగి
తే. యరయ సప్తచ్ఛదమురీతి ♦ నంతికమున
నుండువారికిఁ దలనొప్పి ♦ మెండుగాఁగఁ
గలుగఁ జేయుదురు రజోవి♦కారములను
బంగువులఁ బోలె నడపింపఁ♦బడుదు రకట!. 44

తే. అంతికాగతమృత్యువు♦లట్లు కనరు, బంధువులనైన జాతుషా♦భరణములటు
సోష్మదర్శన మెంతయు ♦ నోర్వ లేరు, కనరు తేజస్వి దృగ్రోగ♦కలితులట్లు.

సీ. కాలదష్టులువోలెఁ ♦ గనరు ప్రబోధంబు మంత్రించినను మహా♦మంత్రములను
మదగజమ్ములువోలె ♦ మానమహాస్తంభనిశ్చలులై మాట♦నేరరు విన
బాణంబు లట్టులు ♦ పానవర్ధితతైక్ష్ణ్యులయి పరప్రేరితు ♦ లగుచు నుండ్రు
దూరస్థితంబుల ♦ దుల్పుదుర్ కులములఁ బండ్లనువలె దండ♦పాతములను
తే. సురుచిరాకృతు లయ్యును ♦ ధరణినాశ,కారకు లకాలసుమముల♦కరణి నెప్డు
తైమిరికులగతి నదూర♦దర్శనులును, నయ్యెదరు కొందఱు నృపాలు♦రవనిసిరిని.

చ. అద లొదవింత్రు ప్రేతపట♦హంబులమాడ్కి ని విన్నయంతనే;
యొదను దలంచిన న్నగులు ♦ నెక్కొనఁగా నొనరింతు రెన్న ఘో
రదురిత మాచరింపఁగఁ గ♦రంబు గడంగినవారుఁ బోలె; నె
ప్డు దురితపూర్ణులో యనఁగఁ ♦ బొల్తురు తుందిలులై నృపాలకుల్. 47

వ. మఱియు. 48

క. వ్యసనశతంబుల కిరవయి, కసిమసఁగుచుఁ బుట్టపైని♦కసవుతుదను దా
వసియించు నీటిబిందువు, వసఁ బడుత మ్మెఱుఁగ రెపుడు ♦ పార్థివసూనుల్. 49

తే. ఇంకఁ గొందఱు సంస్థాన♦పంకజాత, బకము లాత్మార్థసాధన♦పరులు విత్త
పిశితగృధ్రంబు లనుసగు♦ణశీలమతుల, చేత వంచితు లగుదురు♦క్షితిని నృపులు.

వ. అదెట్లనినఁ గొందఱు ధూర్తులు వీరిని. 51

సీ. పరదారగమనంబు ♦ వరవిదగ్ధత వేఁటశ్రమము పానము విలా♦సం బటంచు
మత్తత శౌర్యంబు ♦ మఱిద్యూతమువినోదముజితభృత్యతసౌఖ్య♦మందుటనుచు
నిజదార వీడుట ♦ నిర్వ్యసనిత్వంబు స్వచ్ఛందతయు ప్రభు♦త్వం బటంచు
సంగీతనృత్యవే♦శ్యాసక్తి రకసిత తరలత యుత్సాహ♦కర మటంచు
తే. దేవతల ధిక్కరించుట ♦ ధీరసరణి, పరిభవసహత్వ మోరిమి ♦ గురువుమాట
యుతకరించుట యొరుమాట♦యుతకరింత, తప్పులెన్నమివిక్రమం♦బొప్పుననుచు.

తే. కీర్తి మాగధజనముల♦కీర్తనంబు, హెచ్చుతక్కువ లరయమి ♦ నెఱుఁగకుంట
పక్షపాతంబుననుచును ♦ బలికిదోష,ములనుగుణములుగా మోస♦పుచ్చుచుంద్రు.

తే. విత్తమదమత్తచిత్తులై ♦ వెలయునృపులు
తెలివిలేమినిఁ దద్ధూర్త♦దివ్యవచన
ములను నచ్చిక యిడి మోస♦పోయి తమ్ము
దేవతాంశులఁగా నెంత్రు ♦ భావములను. 54

తే. మనుజు లయ్యును దివ్యాంశ♦మున జనించి
నార మనుకొని దేవతా♦వారమునకు
సముచితము లైనకార్యముల్ ♦ సలిపి సర్వ
జనము లపహాస మొనరింపఁ ♦ దనరుచుంద్రు. 55

తే. సేవకులు తమ్ము మేలముల్ ♦ చేయుచున్న
నాత్మవేషంబులను దాల్చి ♦ యడరుచున్న
నెఱుఁగ కభినందన మొనర్తు ♦ రేమి చెపుదు
వారియవివేక మింక నృ♦పాలతనయ !. 56

సీ. తమరెండుభుజముల♦దలఁతురు లోరెండుభుజములు గలవంచుఁ♦బొలుపుమీఱ
భావించెదరు తమ♦ఫాలమ్మును ద్వగంతరితతృతీయాక్ష మం♦చతులముగను
నెంతురు దర్శనం♦బిచ్చుటయును మహానుగ్రహం బంచును ♦ వ్యగ్రు లగుచు
వినుతించెద రపాంగ♦వీక్షణపాతంబు నుపకారదాన మం ♦ చూర్జితముగ
తే. మాటలాడుట గడు బహు♦మానముగను
దాఁక నిచ్చుట పావన♦తమముగాఁగఁ
బం పొసంగుట వరదాన♦పరముగాఁగఁ
దలఁచెదరు తమ్ము దేవతా♦త్ములుగఁ దలఁచి. 57

చ. అనృతమహత్త్వగర్వమున ♦ నంజలి సేయరు దేవతాళికిన్
జన రెదు రొజ్జ లాత్మభవ♦నంబులకున్ జనుదేర; విప్రులన్
మనుపరు పూజలన్; సుజన♦మాన్యులఁ జూడరు మాన్యతన్ దమిన్
దనుపరు నర్చనీయులను ♦ దద్దయు నర్చనలన్ నృపాలకుల్. 58

చ. పరిహాసనం బొనర్చెదరు ♦ పండితులన్ విషయోపభోగముల్
దొరఁగి నిరర్థకశ్రమలఁ ♦ దోఁగెద రంచును నెంచి; యాలకిం
పరును జరాప్రలాప మను♦భావన వృద్ధహితోపదేశముల్
పరిభవ మం చమాత్యహిత♦భాషితమున్ విన రెప్డు గర్వులై. 59

సీ. వానిని మన్నింత్రు ♦ వానిని బ్రక్కనఁ జేర్తురు వానికిఁ ♦ గూర్తు రెల్ల
వానిని మిత్రుఁగా ♦ భావింత్రు వానిని నాప్తుఁగాఁ దలఁతురు ♦ నాదరింత్రు
వానితో సుఖముంద్రు♦వానిమాటలుగొంద్రు వానికిత్తురుబహు♦మానములను
వానితో సరససం♦భాషణం బొనరింత్రు వానిని శ్లాఘింత్రు ♦ వానిఁ గాంతు
ఆ. రెవఁ డహర్నిశంబు ♦ నెప్పుడుఁ బాయక
దైవతంబునట్లు ♦ తలఁచి తనను
గేలు మోడ్చి మ్రొక్కుఁ ♦ గీర్తించు మహిమంబు
స్తుతి యొనర్చు నొండు♦జోలిఁ గొనక. 60

ఉ. వంపులమారు లొజ్జలును; ♦ పార్థివభుక్తసముజ్ఝితేందిరన్
బొంపిరిఁబోవునాశ; బరు♦పోఁడిమి చేడ్వడఁ జేయు మంత్రముల్
కొంపలు దీయుశాస్త్రములఁ ♦ గోరిక; ప్రేమరసార్ద్రసోదరుల్
చంపఁగ నర్హు లేరి కల♦శత్రవరాకుల కేది యుక్తమా. 61

ఉ. ఈగతిఁ గష్టచేష్టలను ♦ నైకసహస్రవిలోభనంబులన్
వ్రేఁ గగు రాజ్యతంత్రముల ♦ వెండియు మోహదయావనంబునం
దేగతి సంచరించెదవొ ♦ యెట్లు జనుల్ హసియింపకుందురో
యాగతి సంచరించి గను ♦ మారవితారకకీర్తి పుత్రకా!. 62

సీ. నిందసేయకయుండ ♦ సిచ్చలు సాధువుల్ గురుజనుల్ ధిక్కృతిఁ ♦ జరుపకుండఁ
జెలులు తిట్టక యుండఁ ♦ జింతసేయకయుండ విద్వాంసులును వెలి♦వేయకుండ
విటులు దోపిడిని గా♦వింపక యుండంగ సేవకుల్ వంచన ♦ సేయకుండ
ధూర్తులు లోఁగొని♦తులువఁ జేయక యుండఁ బడఁతులలక్ష్మి చేఁ♦బడకయుండఁ
తే. నాట లాడింపఁబడకుండ ♦ నాముచేత
మత్తుగాఁ జేయఁబడకుండ ♦ మదనుచేతఁ

దివిఁ బడకుండ విషయాదిరిపులచేత
నేల వలయును జూడుమా నృపకుమార!. 63

తే. సహజముగ ధీరుఁడవు నీవు జనకుచేత
సంస్కృతుండవు విత్తముల్ చంచలాత్ము
బుద్ధిహీనుఁ బ్రమత్తుఁగాఁ బూని చేయు
నైన నను నీగుణంబు లిట్లాడఁ జేసె. 64

చ. కులముగలానినైన నయకోవిదునైనను ధీరుఁ బ్రాజ్ఞునిన్
బలముగలానినైన జతనంబుగలానిని నైకమర్త్యు నీ
కలుములచాన దుర్ణయునిఁగాఁగ నొనర్చు నటంచు నంచునే
పలుమఱు నొక్కి చెప్పెదను బాలక! దీనిని బుద్ధి నుంచుమా. 65

సీ. జనకుం డొనర్చు నాతనయయౌవరాజ్యాభిషేకమంగళమును జేసికొమ్ము
పూర్వరాజోత్థమై పొలుపొందువంశానుగతరాజ్యభారంబు గరిమఁ దాల్పు
పగతురశిరసులఁ బయికెత్తనీకుము బంధువుల్ తలలెత్తి పరఁగ నిమ్ము
యభిషేచనం బైన యనుపదంబునఁ బోయి యిల నెల్లకడల జయించి రమ్ము

తే. త్వత్ప్రతాపంబు గనిపింపఁ దరుణ మిదియె
విక్రమంబును జూపిన విభుఁడె జగతి
నప్రతిహతాజ్ఞుఁడై మీఱు నవనినాథు
లాదరింపంగ మేటియై యఖిలదిశల. 66

ఆ. అనుచు నూరకుండ నాశుకనాసుండు, రాజసూనుఁ డంత రాజమాన
తదుపదేశవాక్సుధాధారలను బవిత్రీకృతుం డనంగ దివ్యుఁ డనఁగ. 67

ఆ. నిర్మలుం డనంగ నిర్మృష్టుఁడో యన
భూషితుండు నాఁగఁ బూతుఁ డనఁగఁ
బ్రీతహృదయుఁ డగుచుఁ బెంపుతోఁ గొండొక
సేపు కూరుచుండి చేరె గృహము. 68

చంద్రాపీడునియౌవరాజ్యాభిషేకము.

సీ. అంతఁ గొన్నాళ్లకు నారాజచంద్రుండు శుకనాసుఁడునునొక్క శుభదినమున
రాజ్యాభిషేచనరమ్యమంగళకార్యములఁ బురోధ యొనర్ప ముదముతోడ
సర్వసరస్తీర్థసాగరనదనదీజలములతోడను సంభ్రమమున
నరపాలకసహస్రపరివృతుండయి సర్వరత్నౌషధీఫలరసముతోడ

తే. హర్ష బాష్పాంబుమిశ్రితం ♦ బైనమంత్ర, జలముతోడను మృత్తికా ♦ సమితితోడఁ
గొడుకునభిషిక్తుఁ జేసెను ♦ గౌరి కలర, సర్వమంగళ వాద్యముల్ ♦ పర్వదిశల.

ఆ. పాదపాంతరంబు ♦ పై నల్లుకొనుతీవ, యట్టు రాజ్యలక్ష్మి ♦ యధిపు విడక
యతని రాజపుత్రు ♦ నభిషేకసలిలార్ద్ర, దేహుఁ జేరె నపుడు ♦ తేజరిలుచు. 70

వ. అంత రాజపుత్రుండు. 71

క. సకలాంతఃపురపరివృత, యకలంకప్రేమహృదయ ♦ యైన జనని తా
సకలాంగకముల నామో, దకలితసితగంధ మలఁదఁ ♦ దా నలఁదుకొనెన్. 72

క. నవవికసితకుసుమంబుల, నవరించిన శేఖరంబు ♦ నవరించి సిగన్
జెవి గతికకర్ణపూరము, తవిలిచి గోరోచనాక్త ♦ తనుఁడై మిగులన్. 73

క. ఉడుపతిధవళము నవ మగు, నిడుబద్దెదుకూలయుగము ♦ నెఱిఁ గట్టి దమిన్
గుడిచేత నొజ్జగట్టిన, కడునొప్పగు కంకణంబు ♦ గ్రాలుచు నుండన్. 74

ఉ. నూతనరాజ్యమాంబుజమ ♦ నోజ్ఞమృణాళమునాఁ దదుత్సవా
యాతమహర్షిసప్తకమ ♦ హావలయం బనఁ బొల్చుహారముం
బ్రీతి ధరించి; వక్షమున ♦ వ్రేలుచు జానువులన్ శశిప్రభా
ప్రా[illegible]శోహారం బగుచు ♦ రాజితశుక్లసుమాళిదృబ్ధమా. 75

క. [స్తుతి] [illegible]లావళి, ప్రాకటముగ మైని నిండి ♦ భాసిల్లఁగ శో
భ[వంపు] [illegible]రపాండురవేషస, మాకలితుండయి నృసింహు ♦ మాడ్కిఁ జెలఁగుచున్.

క. దిగ్గజాతెడుసెలయేరుల, నగణిత మగు వెండికొండ ♦ యనువున; గంగా
పగబిసజాలముగప్పిన, నగభేదిగజంబుమాడ్కి ♦ నయ మొప్పంగన్. 77

క. ఫేనలవాకలితం బయి, జానగుక్షీరాబ్ధిమాడ్కిఁ ♦ జాలఁ వెలుఁగుచున్
బూని జనకుండు వేత్రము, నూన సముత్సారణంబు ♦ నుత్సాహమునన్. 78

క. చనుదెంచి సభాభవన, మ్మున కటు చంద్రుండు మేరు ♦ భూధరశృంగం
బును నెక్కుమాడ్కి నెక్కెను, గనకమయం బైనయొక్క ♦ గద్దియ నతఁడున్.

వ. అంత. 80

దిగ్విజయయాత్రాప్రయాణసంరంభము.

చ. సముచితభంగిఁ గానుకలు ♦ క్ష్మాపతు లంద ఆసంగ నంతటన్
నిముసము తాళి మ్రోఁగెఁ గడు ♦ నీరధిహోలెను మందరాద్రిపా
తమున రసాతలంబుగతి ♦ దంష్ట్రివిషాణవిఘట్టనన్ సువ
ర్ణమయము లైనకోణముల ♦ నాదితమై జయభేరి యెల్లచోన్. 81

చ. భువనము లెల్ల గర్భములు ♦ పూనినవో యన బూరటిల్లె నా
జెవుడు ధరించెనో యనఁగ ♦ స్ఫీతము లాయె ననన్ విశాలతన్
దవిలె ననంగఁ దద్ధ్వనిని ♦ దద్ద చెలంగెను నిండి యంతటన్;
బవిలెను సంధిబంధములు ♦ బ్రద్దలుగాఁ గకుభాళి కెంతయున్.   82

సీ. భయవలితో త్రాన♦ఫణముల శేషుండు కవుఁగిలింపఁగ బలి♦భవనమందు
సారెకు నెదురుగాఁ ♦ జని దంతముల నొత్తి దిగ్గజంబులు పిల్వ♦దిక్కులందు
భయముచే నడ్డంబు♦వడి భ్రమియించుచు వలగొన రవిహరుల్ ♦ కలఁగి చదల
నరుదగు శంకరు ♦ నట్టహాసం బని భాషింప శివునెద్దు భవునికొండ

తే. గట్టిగా ఘీంకరించుచుఁ ♦ గడఁగి యెదురు
చనఁగ నైరావతము సుర♦సద్మమందు
నన్నుఁ డశ్శత్రురవ మని ♦ యెంచి కొమ్ము
లడ్డముగ వంచి మ్రొక్కంగ ♦ యమునిపోతు.   83

తే. లోకపాలురు భీతి వి♦లోలు రగుచు
నాలకింపంగఁ దిరిగెను ♦ నభులలోక
ములను నాదుందుభిధ్వాన ♦ మలనృపేంద్రు
దిగ్విజయయాత్రఁ దెల్పుచు ♦ దీర్ఘ మగుచు.   84

తే. అంత నాదుందుభిధ్వాన ♦ మాలకించి, యెల్లయెడలను జయశబ్ద ♦ ముల్లసిల్ల
లేచె సింహాసనమునుండి ♦ లేవ సకల, శాత్రవక్ష్మీలు తనతోడ♦ త్క్షాపసుతుఁడు.

చ. ఒరసి యొకళ్లొకళ్లఁ దెగి ♦ యుర్విపయిం బడు తారహారముల్
పరఁగఁగ దిగ్జయార్థగమ♦పావనలాజలు నాఁగ లేచి సం
బరమున వెంబడింప నర♦పాలకకోటి విముక్తహస్తశీ
కరదిగిభాళి వెంట నరు♦గంగఁ జెలంగు సురేభముం బలెన్.   86

వ. మఱియు.   87

చ. సితసుమజాలపాతమునఁ ♦ జెన్నువహించెడు కల్పవృక్షసం
యుత మగుపారిజాతతరు♦నోజను; దారకవర్షయుక్తది
క్తతిని వెలుంగువ్యోమగతి; ♦ గాఢపయఃకణవర్షి మేఘసం
గత మగువానకాఁడుగతిఁ, ♦ గ్రాలుచు నేగెను గొల్వు వీడి తాన్.   88

వ. ఇట్లు వీడి తనకున్న యాసనాంతరమునఁ బత్త్రరేఖచే సమధ్యాసితంబయి
ప్రయాణసముచితమంగళాలంకారంబులన్ ధరించి చెలంగు నాగగంధగజం

బును మావటీఁడు ససంభ్రమంబునం గొనితేర దానిపై నధిష్ఠించి మందర పర్వతంబునఁ బరిభ్రమితం బయినపాల్కడలిసుడులవడువునం బరిభ్రమించుచు, రావణాసురబాహాదండంబులపైఁ జెలంగు కైలాసపర్వతంబువిధంబున విరాజిల్లుచుఁ, జుట్టును ముత్తెపుజాలరుల నొప్పుచు శతశలాకానిర్మితంబయిన శ్వేతాతపత్త్రంబు తనపై నెండపొడ సోఁకకుండఁ బట్ట, గంధగజంబుపై నుండియె ప్రాకారంబున కవలిద్వారంబుననిలచి తనరాక ప్రతీక్షించునరపతులయున్నయూఖంబులగు చూడామణుల, యిఁకమీఁద నివ్వటిల్లు స్వప్రతాపాగ్నినాఁబొల్చు లత్తుకజిగిఁ హరించునాలోకబాలాతపమ్మునఁ బింజరీక్రియమాణంబు లయిన దశదిశలను, యౌవరాజ్యాభిషేకజం బయినతనయనురాగంబుచేతనో యన నెఱ్ఱవాఱినభూతలంబును, శాత్రవవినాశసూచకంబగుదిగ్దాహంబుననో నాఁగఁ బాటలీక్రియమాణం బయినయంబరతలంబును, నెదుర్కొన వచ్చినభువనతల లక్ష్మీచరణలాక్షారసంబుచే నాఁగ లోహితాయమానం బగు నాతపంబును గనుచు. 89

సీ. సంభ్రమప్రచలిత♦సామజసాహస్రు లన్యోన్యసంఘట్టి♦తాతపత్రు
లాదరావనతోత్త♦మాంగసంశిథిలితమణిమకుటావళీ♦మండితులును
గండస్థలస్రస్త♦ఘనమణికుండలు లానతకర్ణపూ♦రావళులును
నిఖిలసేనాధిప♦నిర్దిశ్యమానాభిధానులు సంకోచి♦తప్రతీకు
తే. లు నయి రాజాధిరాజులు ♦ వినతు లగుచు
నొక్క రొక్కరుగా వచ్చి ♦ మ్రొక్కి ప్రక్క
కొదిగి నిలుచుండ గుంపులై ♦ యోరగంట
నాదరించుచుఁ గని వారి ♦ నల్లనల్ల. 90

చ. సితసుమబద్ధదామచయ♦చిత్రితమస్తము రక్తచూర్ణలే
పితతనువుం జెలంగ; క్షితి ♦ వ్రేలెడుమౌక్తికజాలసంఘసం
గత మవచూలకంబు గడుఁ ♦ గ్రాలఁగ సాంధ్యపుటెండతిర్యగా
పతదమరాపగాఝరియు♦భవ్రజసాంద్రశిలాతలాగ్రముల్. 91

చ. తగఁ గలమేరుశైల మనఁ ♦ దద్దయు నొప్పెడుగంధమాదనా
ఖ్యగజము వెంట రాఁగఁ గన♦కాభరణాంశువు లెల్ల మేనఁ బ
ర్విఁ గరము చిత్రితమ్మగుచు ♦ వేడ్కలు నించెడు రాజవాజి యిం
పుగఁ జనుచుండ మందగతి♦ మ్రోలను దూర్పున కేగెఁ దొల్తఁ దాన్. 92

ఉ. అంతఁ జలింప నేనుఁగులు ♦ నాతపవారణపంక్తు లాడ న
త్యంతతరంగజాలపతి♦తాంబుజతాత్రవబింబబింబకో
ట్యంతపయోధినీరము క్రి♦యన్ మహి నెల్లను ముంచి వైచు చా
తాంతములం బ్రతిస్వనము ♦ లందఁగఁ జేయుచు నార్భటింపుచున్. 93

క. కదలెను సైన్యము లెల్లను, బొదలుచుఁ బ్రస్థానశుభము ♦ పొంపిరి పోవన్
వదలక క్ష్మాపతులెల్లను, ముదమునఁ గొలువన్; దుకూల♦ములను దొడిగి తాన్.

ఆ. సితసుమాంగరాగ♦సేవితగాత్రుఁడై, వెల్లగొడుగుఁ దాల్చి ♦ వేగచలిత
కరిని నెక్కి యపర♦ధరణీశుపుత్రుని, పగిది వచ్చె సచివు♦పట్టి యటకు. 95

తే. వచ్చి రవిప్రక్క నిలుచున్న♦వనజవైరి
గతిని యువరాజు ప్రక్కను ♦ గదిసి నిలిచె
నంత యువరాజు వెడలెను ♦ నదిగొ యిదిగొ
యనుచు బలములు పఱువెత్తె ♦ నవని యద్రువ. 96

సీ. ఎదురుగాఁ జనుదెంచి ♦ యెఱఁగుభూపాలుర మణిముకుటావళీ♦మహములవలన
నుల్లసద్బహురోచి♦కన్మిష త్కయూరమణిమండలీప్రభా♦మహములవలన
నంశులతాజాల♦కాంచితచూలికాపత్త్రభంగీప్రభా♦పాళివలన
బహువిధభూషణ♦పంక్తిసముజ్జ్వలమణిమయూఖావళీ♦మహములవలన
తే. దెసలు పది యొక్కచోటను ♦ దేవదారు,పల్లవంబులు పఱచిన♦భాతి నొకచొ
శీతయాతప మంటిన♦లీల నొకచొ, ననమయుతటిత్తు లలమిన♦యట్టులొప్పె.

వ. మఱియు. 98

తే. కేకిఖగపత్త్రచూర్ణంబు ♦ కీర్ణమయిన
చందమున, బర్హిచంద్రక♦శతము పడిన
చందమున నొక్కచో నింద్ర♦చాపయుతము
లనఁగ నొప్పెను పదిదిక్కు ♦ లవనినాథ! 99

తే. వివిధమణిజాలశబలిత♦విస్ఫురన్మ
యూఖచూడామణిమరీచి♦రేఖవలన
ధారుణీశులగొడుగులు ♦ ధవళతమము
లయ్యె మాయూరము లనంగ ♦ నలరె నపుడు. 100

సీ. క్షణమున కంత నా♦క్ష్మాతలం బంతయుఁ దురగమయం బయి ♦ తోఁచె నధిప
దిక్చక్రవాళంబు ♦ ద్విరదమయంబయ్యె ధ్వజపనమయమయి♦తనరెఁ జదలు

మదగంధమయమయి♦పొదలెను గాడ్పులు భూపాలమయమయ్యె♦భువనసృష్టి
యంతరిక్షం బెల్ల ♦ నాతపవారణమయమయి కనుపట్టె ♦ సుహిత మగుచు
తే. నలరెఁ గోటీరమయమయి♦యహ నఖిలము
భూషణాంశుమయంబయి ♦ పొలిచె దృష్టి
యలరె జయశబ్దమయమయి ♦ యఖిలజగము
లడుగఁగా నేల తజ్జైత్ర♦యాత్ర సొబగు. 101

సీ. కులపర్వతాకృతిఁ ♦ జెలఁగుచు గుంపులై కదలెడుమదగజ♦కాండములను
నుత్పాతశశిమండ♦లోపములై యాడునాతపవారణ♦వ్రాతములను
సంవర్తకాంబుద♦సమగభీరస్వనదాళిలజయభేరి♦కావళులను
ధారకావర్ష ప్ర♦కారవిసర్పద్ద్విరదశీకరాసార♦రాజివలన
తే. నశనిపాతంబులకు నెన♦యైనపరుష,బృంహితంబుల క్షుభితాబ్ధి♦పృథులభంగ
చంచలాశ్వచయంబుల ♦ క్షతజబిందు, వర్షగజకుంభసిందూర♦పాంసువులను.

తే. దిశలు చీఁకట్లు గ్రమ్మంగఁ ♦ దెఱపి లేక
కాఱుసామజమదవారి♦ధారసమితి
దుర్దినంబున జగము దుం♦దుడుకుఁ జెందఁ
బ్రబలకోలాహలధ్వని♦ప్రకరములను
బ్రళయకాలంబు నా నెల్ల♦పట్లఁ జెలఁగె. 103

తే. ధవళకేతనచయసంవృ♦తంబు లగుచు
బలబహుళకలకలరవం♦బులకు నులికి
పారెనో యన దిక్కులు ♦ పదియు నెటకొ
పాఱెఁ గనఁబడకుండ నో♦పార్థివేంద్ర!. 104

తే. వేత్రహస్తులు తమఘన♦వేత్రములను, వెడలనడుచుటనో నాఁగ ♦ వేగపాఱు
తురగఖురఘట్టనోత్థిత♦ధూళితతికి, వెఱచి నాముందుఁ జనఁడయ్యె♦ వేవెలుంగు.

తే. ఆతపత్రావృతంబైన♦యాతపంబు, దంతికరశీకరాసార♦తతికి నోడి
పఱచె నన నిరాతపమయి♦పరఁగి దినము, దుర్దినం బన నొప్పెను♦దోషితాత్మ.

క. బలభరశిథిలితమదకరి, కులపదశతతాడితోర్వి ♦ ఘోరతరముగన్
జెలఁగెను రెండవదుందుభి, చెలువున జగ మెల్ల వడఁక ♦ క్షితిపతిచంద్రా!.

క. కరిమదజలముల హయముఖ, పరిగళదవదాతఫేన♦పంక్తులయందున్
బరిపరి తొట్రిలఁ బదములు, నరిగెను గాల్బలము లెల్ల ♦ నవనీనాథా!. 108

క. హరితాలపరిమళాభము, కరిమదజలసౌరభంబుఁ ♦ గనుఁగొని గంధాం
తరమును గొనుసామర్థ్యం, బరిగెను ద్విపమునకుఁ బోలె ♦ నలనాసికకున్. 109

సీ. మును చనుబలముల ♦ జనకదంబకముల కోలాహలస్వన♦కోటివలనఁ
దారతరారావ♦దారుణకాహళపటహాదితూర్యని♦స్వనమువలన
సంతతశ్రుతితాల♦శబ్దసంయుత మగు నామజాడంబర♦స్వనమువలన
గ్రైవేయకింకిణీ♦క్వణితానుగతములయి శబ్దించుఘంటికా♦స్వనమువలన
తే. ఖురపుటారావమిశ్రిత♦ఘోటకార
వంబువలనను సారెకు ♦ వాద్యమాన
డిండిమంబులయులివున ♦ నిండి కర్ణ
పుటము లగలంగ మూర్ఛను ♦ మునిఁగె జగము. 110

మ. పలువన్నెల్ గలభూమినుండి యెగిరెం ♦ బాంసువ్రజం బొక్కచో
బలసంక్షోభమునన్ బ్రవృద్ధశపరీ♦క్షుస్థలీధూమ్రమై
మలినంబై గడు వృద్ధకంబళకరో♦మస్తోమముం బోలెఁ; బిం
గళమై జీర్ణకపీంద్రకైశికము పేఁ♦కం దమ్మితూడుం బలెన్. 111

మ. ధవళంబై యొకతావునన్; మయుసటా♦తౌల్యంబునన్ మించుచున్
శివుగుట్టంబు నెమర్చుచోఁ బడినడిం♦డీరంపురాశిం బలెన్
అవదాతంబయి యొక్కచోఁ దనరె ది♦వ్యస్రోదినీవేణిభా
తి వడిన్ శ్రీహరిపాదజాత మగుచున్; ♦ దీవ్రోరుకోపంబు నాన్. 112

మ. క్షమఁ బోనాడి, తృషార్థితంబుక్రియ నా♦గవ్యూహహస్తాంబువుల్
దమిఁ బానం బొనరించుచున్, మధుపజా♦తం బట్లు దానాళిఁ గా
మము చుంబించుచుఁ, బాద మూని గజకుం♦భశ్రేణి సింహంబు చం
దమునన్, బట్టుచుఁ డెక్కెముల్ విజయుచం♦దానన్ విజృంభించుచున్. 113

వ. మఱియు. 114

సీ. పటువంతముమాడ్కిఁ ♦ బైకి నేగుచు వార్ధకముగతి శిరమును ♦ గారవించు
చాఘూర్ణ మొనరించు♦నట్లు కర్ణోత్పలమధుబిందులగ్నమై ♦ మలపుగొనుచుఁ
గనుముద్రయిడుచున్న♦కరణిఁ బక్ష్మాంచలముల నివసించుచు ♦ ముసరుకొనుచు
దంతావళశ్రుతి♦తాలతాడనభీతిమనఁ గర్ణవివరంబు♦లందుఁ జనుచు
తే. నున్నతోర్వీశమకుటర♦త్నోరుపత్ర, భంగమకరికావళిని ద్రా♦వంగఁబడుచు
హరిముఖోత్క్షేపవిక్షుత♦హారిఫేన, పల్లవగుళుచ్ఛములచే న♦పర్యఁ గనుచు. 115

ఉ. సామజకుంభసంజనిత♦చారుతరోజ్జ్వలధాతుధూళి వే
ప్రేముడి వెంట నంటఁ బృథి♦వీపతి శేఖరపాళినిస్సర
ద్భూమిపతత్ప్రసూనరజ♦ముల్ దను రేపఁగఁ గాఁగిలింపఁగాఁ
జామరజాలసంచలన♦జాతము లౌపటవాస రేణువుల్. 116

చ. దివసకరుఁ గ్రసించుచును ♦ దీవ్రత నున్నటు లుండి ధాత్ర్యుప
ప్లవకరరాహువుం బలె; నృ♦పాలకమంగళపుష్పమాలలన్
గవియుచు రోచనారజము♦గా నయి చందనధూళిధూసరం
బవుచును రోదసీకుహర ♦ మంతయుఁ బర్వెను దద్రజం బహా.! 117

ఆ. అపరిమేయసైన్య♦హతిఁ జేసి పెంపొంది, మెల్లమెల్ల సకల♦మేదినియును
సంహరించునట్లు ♦ సమయసంభూతమౌ, కాలమేఘమనఁగఁ♦గ్రమ్మెఁ దొడఁగె.

వ. ఆక్రమంబున నతిప్రవృద్ధం బైనయారజంబు. 119

సీ. శాత్రవకులజల♦జాతనీహారంబు దినకరకిరణపద్మ♦వనగజంబు
రాజ్యేందిరాదేవి♦రమణీయపటవాసచూర్ణంబు నదనదీ♦శోషణోష్మ
మహితాతపత్రసి♦తాబ్జమండహిమంబు కువలయశ్రీశిరః♦కుంఠనంబు
గగనమహీతలా♦క్రాంతలయాంభోధిపూరంబు జయలక్ష్మీ♦భూషణంబు
తే. ప్రళయకాలాగ్నిధూమసం♦భాసురంబు
సాంద్ర మాదివరాహకే♦సరవిచిత్ర
మనపహృతచేతనంబు ని♦ద్రాగమంబు
నగణితార్కాంధకారంబు ♦ నగుచు మఱియు. 120

మ. అతపఃకాలసులబ్ధభూగృహములై ♦ యభ్రాంతసర్వాహిరా
ష్ట్రితియై ఋతువిహీనకృష్ణనిశయై ♦ కీలాలహీనాంబువా
ధృతువై చూడఁగఁ గేళవాంఘ్రిగతి దాఁ♦టెన్ మూఁడులోకంబులన్
దతవృద్ధిం గని తద్రజంబు దనరెన్ ♦ బాతాళజాతంబు నాన్. 121

చ. పదములనుండి వచ్చె నన ♦ భాస్కరునుండి జనించెనో వియ
త్పదముననుండి వ్రాలె నన ♦ వాయువునుండి వినిర్గమించె నా
నుదయముఁ గాంచె నో దెసల ♦ నూహ యొనర్పఁగ రాక యంతటన్
దుదమొదలేర్పరింపఁగను ♦ దోఁపక పర్వెను దద్రజంబు తాన్. 122

ఆ. పాలకడలినుర్వి♦ఖ్యాతిఁ బాండురమైన, తద్రజంబు గ్రమ్మి ♦ దైవవర్త్మ
మభినవోదకంబు ♦ లాక్రమించినఁ దోఁచు, వికచకువలవనము♦విధిని వెలిఁగె.

క. అవనీశ! ధూళిధూసర, రవిబింబం బొప్పె విగత♦రశ్మి యగుచుం దా
నవచూలచామరము క్రియ, దివిజాపగకలువ మయ్యెఁ ♦ దెలిపటముగతిన్. 124

క. నరపతిబలభారంబును, గురుతరమును నోర్వ లేక ♦ కుంభిని మరలన్
సురలోకంబున కేగెను, వరధూళిచయంబుకైత♦వంబున నృపతీ!. 125

తే. క్రోలి యాతప మెల్లను ♦ గొంతుబంటి
యాఁపుకోన లేక తత్తాప♦ మబ్ధినీటఁ
బడెనో యన భూరజం బెల్లఁ ♦ బడెను జలధి
మృణ్మయంబయ్యె దివసంబు ♦ మేదినీశ!. 126

ఉ. ఇంచుకసేపులోఁ బృథివి ♦ యెల్లను గర్భగృహంబుఁ జొచ్చె నా
మించులయాబ్ధి డాఁగెనన ♦ నీరజబాంధవము దూరె నాఁ బ్రవే
శించె నరన్ ఘనూననముఁ ♦ జేరె నరన్ విలయోగ్రగర్భమున్
మించె నగోచరం బగుచు ♦ మీఁటినతద్రజ మెల్లఁ గ్రమ్మఁగన్. 127

తే. పుస్తమయ్యంబు లన దెసల్ ♦ పొదలె నధిప!
పాంసురూపంబుఁ దాల్చె న♦భస్థలంబు
నేకభూతమయం బయ్యె ♦ లోకమెల్లఁ
దద్రజము గ్రమ్మి యేమందు ♦ ధారుణీశ!. 128

ఉ. అంతఁ బ్రశాంత మయ్యె రజ ♦ మంతయు నాత్మమదోన్మత్తదు
ర్దాంతమతంగహస్తవివ♦గతురదచ్ఛపయఃకణాళి, న
శ్రాంతకటస్రవన్మదకు♦శంబుల, హేషితకీర్ణవాజిలా
లాంతజలంబులన్, గని య♦నంతబలంబును విస్మయంబుతోన్. 129

వ. చంద్రాపీడునిం గని వైశంపాయనుం డిట్లనియె. 130

సీ. రాజాధిరాజు తా♦రాపీడనరపతి గెలువఁడే దేనిని ♦ గెలుతు వింక
సాధింపఁడే దుర్గ♦జాలంబులను భువి వేనిని సాధింపఁ ♦ బూను దింకఁ
గా వాత్మవశములు ♦ గనఁగ నేద్వీపమ్ము లాత్మనశము లేని ♦ నాచరింతు
లోఁగొనఁ డేదెసల్ ♦ లోఁగొందు వేనిని గడియింపఁడే రత్న♦కాండములను

తే. వేని గడియింతు వింక నే♦పృథ్వీపతులు
మ్రొక్క రెవ్వార లౌనల ♦ మోడ్పు కేలు
సంఘటింపరు; విసరగు ♦ చామరంబుఁ
బూని యెవ్వరు; యువరాజ♦భువనతిలక!. 131

ఉ. బంగరుపట్టెచే వెలుఁగు♦ఫాలతలంబుల నోలగమ్ము న
న్నంగ నొనర్ప రేరు క్షితి♦నాథులు; బెత్తము లేక దాల్ప రు
ప్పొంగుచుఁ; బాదపీఠిని స♦ముజ్జ్వలమస్తకరత్నరాశి రా
ట్పుంగవు లే రొనర్పరు న♦పూర్వగతిన్ బొడిగాఁగ రాపిడిన్. 182

తే. ఏరు జయశబ్దములఁ జేయ ♦ రెవరిమకుట, పత్త్రమకరంబు లవదాత♦పాదనఖర
కిరణజాలమ్ముఁ ద్రాగవు ♦ కీర్తనీయ!, యసదె నీతంత్రి విభవంబు ♦ నమలచరిత!.

చ. భరతదిలీపముఖ్యనర♦పాలకతుల్యులు పావనాన్వయుల్
గరము చతుస్సముద్రజల♦గాహనసత్త్వమదావలిప్తులున్
ధరణిపు లెవ్వ సోనుపులు ♦ తావకపాదరజంబు మౌళిఁ దా
ల్తురు శుభరత్నభూతిగను ♦ దోషితులై కను వీరపార్థివా!. 184

చ అపరకులాచలంబు లన ♦ నౌ నరవర్యులు వీర దాల్చి రి
ద్ధరణిని వీరి సైన్యములు ♦ ధాత్రివరాత్మజ! నిన్నుఁ గొల్చు నం
తరితదిగంతరంబు లయి ♦ ధారుణి యీనెనొ యాకసంబు దాఁ
గురియునొ క్రక్కునో దిశలు ♦ కోరి సృజించెనొ వాసరంబునన్. 185

చ. కనఁబడు; నేదిశం గనినఁ ♦ గాండములై బలియిల్లు క్రక్కునన్
మనమున నెంచు నిత్తఱి న♦మానబలంబులభార మోర్వ కా
ఘన మగుభారతాహవము ♦ క్ష్మాతలి యుంచుఁ దలంతు; భూవరా!
యినుఁ డిదె మౌళి దేశముల ♦ నెంచుసిడంబులు నా ధ్వజాళులన్. 186

చ. తిరుగుచుఁ గౌతుకంబునను ♦ దేజరిలున్; మదసామజస్ఫుర
త్సురభిలదానవారిఝుర♦తోయధిమగ్నధరిత్రి క్రాంతబం
భరకులఝుంకృతిధ్వనుల ♦ భాస్కరజాసుతరంగమాలికా
భరకలితం బనంగ నర♦పాలక! యొప్పెడిఁ జూడు మెల్లెడన్. 137

మ. బలసంక్షోభభయంబునన్ దివికి వే ♦ పార్తెంచి వాసించునై
వలినీసంఘములో యనన్ జెలఁగు నీ♦ప్రాంచద్ధ్వజవ్రాతముల్
కలయం గప్పె దిగంతరంబు లివిగో ♦ కంజారిశుభ్రంబులై
పలుకుల్ చాలును జెక్కులేల కనుమా ♦ భాస్వత్ప్రకారంబులన్. 138

చ. సకలకులాచలంబు లను♦సంధులబంధము లెల్ల నూడియున్
వికలము గాదు సైనికుల♦వ్రేఁగున ధాత్రి విచిత్ర మయ్యెడిన్
బ్రకటవసుంధరాభరణ♦భారము సైఁపఁగ లేక యుల్లవా
సుకిఫణకుడ్యముల్ వణఁకి ♦ సోలవు పార్థివ! యేమి వింతయో. 189

చ. అని యిటు పల్కుచుండ నతఁ ♦ డాయువరాజు మనోజ్ఞతోరణా
వనకలితంబు ధూపమయ ♦ భాసురసాలసహస్రసద్మవే
ష్టనసితశుభ్రమండపవి ♦ శాలము నైన నివాసభూమిఁ జొ
చ్చెను దిగి సర్వకార్యములు ♦ చేసె మహీశుఁడు వేళ నచ్చటన్. 140

క. అలసకలనృపులు మంత్రులు, గొలువఁగఁ బితఁ బాసినట్టి ♦ క్రొత్తవగవు దగ్
గలఁపఁగ వివిధకథాగో, ష్ఠులఁ గడపెను దివస మెల్ల ♦ క్షోణీనాథా!. 141

క. తనకయ్యె కనతిదూరం, బున నిహితం బైనమంచ ♦ మున వైశంపా
యనుఁడును గుఱఁగటఁ జిత్రా, సనమున భువిఁ బత్త్రలేఖ ♦ శయనించి దమిన్.

క. వినుచుండ వారితోడను, జననీజనకులప్రసక్తి ♦ సచివుప్రసక్తిన్
దనరంగ నడుమనడుమను, ఘనతరసల్లాపములను ♦ గావించుచుఁ దాన్. 143

క. కన కతిగాఢస్వాప, మ్మును దఱుచుగ మేలుకొనియెఁ ♦ బుచ్చి నిశ నుష
స్సున లేచి తద్విధమ్మునఁ, జనె ననవరతప్రయాణ ♦ సన్నాహములన్. 144

చ. కొలువఁ బ్రతిప్రయాణమునఁ ♦ గోటులు కోటులు గాఁగ వృద్ధియౌ
బలములు; భూమి వ్రయ్యలుగఁ ♦ బర్వతముల్ వణఁకంగఁ; గాననం
బులు పొడి గా; సరస్సులును ♦ బూడఁగ; నేరులు వట్టి పోవఁగా
సలువుచు మిట్టపల్లముల ♦ సామ్యమునం దనరారఁ జేయుచున్. 145

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరి ♦ యించుచు భీతుల నూఱడించుచున్
మచ్చిక మీఱ; నుద్ధతుల ♦ మానవిహీనులఁ జేసి వంచుకొం
చుచ్చపదాన నున్నతుల ♦ నుంచుచుఁ బ్రోచుచుఁ ద్రాహియంచుఁ దన్
జొచ్చినవారిఁ గంటకుల ♦ శోషిలఁ జేయుచు విక్రమంబునన్. 146

చ. తులువల వ్రేళ్లతోఁ బెరికి ♦ తున్ముచు లొంగినరాజపుత్త్రులన్
నిలువుచు వారితావులనె, ♦ నిర్భరవృత్తిని గొంచుఁ గానుకల్
సలువుచుఁ గీర్తనంబులను ♦ శాసనముల్ లిఖయించు చంతటన్
జెలఁగుచు నిల్పుచున్ దనదు ♦ చిహ్నములన్ జరియించె నెల్లెడన్. 147

తే. తోయధుల నెల్ల బలరేణు ♦ ధూసరములఁ, జేసె వేలావనంబులఁ ♦ జేసె నుగ్గు
తనదుచారిత్రమంతటఁ ♦ దనరఁ జేసె, నిజయశం బెల్ల జగముల ♦ నిండఁ జేసె.

తే. అగ్రజన్ములఁ బూజల ♦ నలరఁ జేసె
మునుల నెల్లను బాలించె ♦ మోద మెసఁగఁ

దనప్రతాపంబు చవిచూపె ♦ ధాత్రి కెల్ల
నతనివిక్రమ మే మని ♦ యభినుతింతు. 149

మ. తొలుతం బ్రాచిని నావలన్ జముదెసన్ ♦ దోయాధినాథాశ నా
వల నీశానునిదిక్కుఁ గెల్చె నట న♦పార్థాత్మజుం డార భూ
తల మెల్లన్ జతురబ్ధిఖాతపరిఖా♦ధానంబు మూఁడేండ్లలో
వల స్వాయత్త మొనర్చె ద్వీపములతోఁ ♦ బట్టించె శంఖంబులన్. 150

చ. పిదప సమస్తలోకములఁ ♦ జే ర్వలయంగ జయించి యోలిన్
వదలక భూప్రదక్షిణ మ♦వారితవృత్తి నొనర్చి రాజతా
ద్రిదరిని హేమకూటమునఁ ♦ ద్రిమ్మరువ్యాధుల కెల్ల వాసమై
పొదలు సువర్ణపత్తనముఁ ♦ బూర్వసముద్రసమీపవర్తినిన్. 151

ఉ. ముట్టడివేసి పట్టుకొని ♦ భూతల మెల్లఁ జరించి శ్రాంతమై
నట్టి సమస్తసైనికచ♦యంబును నేదగొనంగ డింపి య
ప్పట్టునఁ గొన్నినాళ్ళట ని♦వాసము చేయుచు నుండి యొక్కనాఁ
డుట్టిపడంగ వేఁటతమి ♦ యుల్లమునం జన గుఱ్ఱ మెక్కి తాన్. 152

—చంద్రాపీడుఁడు కిన్నరమిథునమును జూచుట.—

క. చని యడవి సంచరించుచుఁ, గనియెను నలవోక నచట ♦ గ్రావాగ్రతలం
బుననుండి భువికి దిగుచుం, డినకిన్నరమిథునమున్ వి♦నిశ్చలదృష్టిన్. 153

క. కని దానిసొబగు మునుఁ దాఁ, గనినట్టిది గాక మదికిఁ ♦ గౌతుకమును గూ
ర్చిన దానిఁ బట్టు వేడుకఁ, జననిచ్చెను దత్సమీప♦సరణికి హయమున్. 154

ఆ. దానిఁ గని యపూర్వ♦మానవదర్శన, జాతభీతిఁ బఱవ♦ సాగె నదియు
దానివెంటఁ బార్ష్ణి♦తాడనద్విగుణిత, జవహయంబుఁ బఱపి ♦ చనియె నతఁడు

ఆ. తనబలంబు నెల్లఁ ♦ దక్క యొక్కఁడె తాను
నరిగె దానివెంట ♦ ననుసరించి
యిచటఁ జిక్కుఁ జిక్కు ♦ నిటఁ జిక్కు ననునాశ
యీడ్చికొనుచుఁ బోవ ♦ నినసుతుండు. 156

ఆ. అతిజవాశ్వుఁ డగుట ♦ నరిగెను బదియేను
యోజనముల నొకము♦హూర్తమునను
నేకపదమునట్టు ♦ లెక్కెఁ దన్మిథునంబు
సమ్ముఖాగతోరు♦శైలకోటి. 157

తే. కనుఁగొనుచునుండ నదియు నా♦త్మాధరాగ్ర
మెక్కుటయు రాకుమారుండు ♦ మెల్లమెల్లఁ
దదనుగత మైనదృష్టిని ♦ దప్పఁ జేసి
పోవఁగా లేక తద్దుర్గ♦భూమియందు. 158

తే. సముపజాత శ్రమస్వేద♦జలకణాంచి
తంబు నింద్రాయుధంబును ♦ దన్నుఁ గాంచి
తనకుఁ దా నవ్వుకొని కొంత♦తడవు తాళి
యిట్టు చింతింపఁ దొడఁగె నా♦యినసుతుండు. 159

—చంద్రాపీడుఁడు కిన్నరమిథునముఁ బట్టుకొన లేక తనమనమునఁ జింతించుట.—

ఉ. ఊరక కష్టపెట్టితిని ♦ నుల్లము బాలునిమాడ్కి నేమి చే
కూరును దీనిఁ బట్టుకొనఁ ♦ గుంభిని నుండున నిట్టిబాలిశుం
డూర నిరర్థకక్రియల ♦ నాదట యేమొ యొనర్చితిన్ వృథా
యార మదీయమూఢ్య మక♦టా! యెడఁ బ్రస్తుతకార్యకార్యముల్. 160

ఉ. పట్టినఁ గిన్నరద్వయముఁ ♦ బాటిలు నేమి మహాఫలంబు నేఁ
బట్టక యున్న నే మగును ♦ బాడరె సత్ఫలకార్యజాలముల్
గట్ట! ముగింప నైతి గురు♦కార్యము నింకను మిత్రకార్యమున్
బెట్టితి నట్టె రాజవిధిఁ ♦ బెట్టితి వెన్కను నేమి చేసితిన్. 161

సీ. కా దింక వచ్చిన♦కార్యంబు నావిష్టగతి వీడి పరివార♦గణము లెల్ల
నేల యే తెంచితి ♦ నింతదూరము వృథ యనుసరించితి నేల ♦ యశ్వముఖులఁ
దలఁచుకొన్నను నాకె ♦ గలుగును హాసంబు కరము సత్యంబుగాఁ♦బరుల కట్టు
లెఱుఁగ వెన్నంటి న♦న్నే తెంచునాపరివారంబు నెట వీడి ♦ వచ్చినదియు

తే. నతిజవేంద్రాయుధము తెచ్చి ♦ నొర నిమిష
మాత్రమున వచ్చునప్పుడు ♦ మామకాశ్వ
వేగమునఁ గిన్నరయుగని♦విష్టదృష్టి
నగుట నేమార్గమున వచ్చి ♦ నదియు నెఱుఁగ. 162

చ. అవిరళవృక్షశాఖలను ♦ నల్లినతీవలగుంపుచే ననే
కవిధనికుంజపుంజములఁ ♦ గాఱడవిన్ నిపతజ్ఝరచ్ఛద
ప్రవికటమందు మార్గమును ♦ భావన చేయఁగరాదు నింక నే
పవిదినిఁ బోవువాఁడఁ బరి♦వారమునొద్దకు నక్కటక్కటా!. 163

ఉ. మానిసిపుర్వు యత్నమున ♦ మానక యెంత పరిభ్రమించినన్
గానఁగ రా దెవం డిఁకను ♦ గన్పడఁ జేయు సువర్ణపత్త్రనం
జేను దదుత్తరాశఁ గల ♦ దీయిలసీమయు దాని దాఁట ని
ర్మానుషకాననం బవల ♦ రాజతశైలము నంచు వింటిఁ గా. 164

చ. ఇది రజతాద్రి యొక్కరుఁడ ♦ యేఁ జనఁగావలె నివ్వు డూహచేఁ
బదిలముగాఁ గృతాంతుదెసఁ ♦ బట్టి కటా! తనతప్పిదంబుఁ దా
వదలక పొందఁగావలయు ♦ వందురితిన్ వృథ యంచు గుత్తుమున్
బద మనుచున్ మరల్చెఁ దన♦వామకరంబునఁ బట్టి కళ్లెమున్. 165

వ. త్రిప్పి మగుడ నిట్లని చింతింపఁ దొడంగె. 166

క. దినలక్ష్మీరశనామణి, యనువున భాస్కరుఁడు భాసు♦రాప్రోగ్రుండై
కనఁబడు నంబరమధ్య, మ్మున నిదె యింద్రాయుధమును♦బూనెను శ్రమమున్.

ఉ. కావున దీని నించు కిట ♦ ఘాసము మేయఁగ నిచ్చి నీళులన్
ద్రావఁగ నిచ్చి యేటనో ప్రా♦దంబుననో సెలయేటనో యిఁ కే
కావుననైన స్నానమును ♦ దద్ద నొనర్పఁగఁ జేసియున్ శ్రమన్
బోవఁగఁ జేసి నేను జల♦మున్ గొని యొక్కెడఁ జెట్టునీడలోన్. 168

ఉ. ఇంచుక విశ్రమించి యట ♦ నేగెద నంచు జలంబులన్ గవే
షించుచు సారె కిట్టటులఁ ♦ జేరుచుఁ జూచుచుఁ జూడ్కులం బ్రసా
రించి యిసుంత ముందరఁ గ♦రిప్రకరంబులు నీరు గ్రోలి యే
తెంచినమార్గముం గని సు♦దీర్ఘపదోత్థితపంకసక్తమున్. 169

సీ. సమృణాలనాళాంబు♦జాతకల్మాషిత మార్ద్రశైవలపల్ల♦వాంచితంబు
కువలయకైరవ♦కోరకచ్ఛురితంబు ఖండితసుమగుచ్ఛ♦కర్బురంబు
సుత్థాతపంకాంకి♦తోల్లసచ్ఛాలూరకందరాకీర్ణప్ర♦కాశితంబు
నభినవసుమసౌర♦భాంచితశ్యామలమదజలసేచన♦మండితంబు
తే. దళితకుసుమోపవిష్టాళి♦కులవిలసిత, వనలతాక్తంబు నయినత♦ద్వర్త్మ మంటి
యటజలాశయ మొందుండు♦నంచునరిగె, రజతగిరి క్రిందిత్రోవనా♦రాజసుతుఁడు.

తే. అధిప! తన్మార్గవిభవంబు ♦ నభినుతింపఁ, దరమె బహుళశిలాతల♦భరిత మాట
విరళతరతృణోలుపరాజి♦విస్తృతంబు, గంధపాషాణపరిమళ♦బంధురంబు. 171

తే. తలలు పైకెత్తి చూడంగఁ ♦ దనరి మిగుల
నభిరళము లయ్యెఁ గొమ్మల ♦ నలర కుంట

విరళములువోలెఁ జూపట్టు ♦ సరళసాల
సల్లకీవృక్షవాటులఁ ♦ జారుతరము. 172

తే. వనమతంగజపాటిత♦వరమనశ్శి, లారజఃపింగళంబును ♦ లలితకపిల
సైకతస్థలరమ్యంబుఁ ♦ జారుచమర, మృగమదమృగీఖురావళి♦మిశ్రితంబు.

తే. పత్త్రభంగమ్ములటువోలె ♦ వక్రములయి
ఖచితము లనంగ నొప్పెడు ♦ గ్రావభేద
కస్తబకములు నడుమను ♦ గ్రాలుశిలలఁ
బుష్పరసవాహినులఁ గడు ♦ భూషితంబు. 174

చ. సతతము కాఱు గుగ్గులుర♦సంబున నగ్రతలచ్ఛురచ్ఛిలా
జతురసవాహినిన్ దడిసి ♦ సౌరభముల్ వెదజల్లు తాళ్ల సం
గత మయి టంకనాశ్వఖుర♦ఖండితతాళరజఃప్రకీర్ణమై
తతగిరికాళిఖాతబిల♦దండవికీర్ణసువర్ణచూర్ణమై. 175

చ. తనరి యరణ్యపంచజన♦దంపతు లెప్పుడు నాడుకందరా
ననములఁ బ్రస్తరాగ్రముల ♦ నర్తిలి నుండుచకోరదంపతీ
వనముల నొప్పుతత్సరణి ♦ వారక యించుక దూర మేగి తాఁ
గనియెఁ దదుత్తరాశఁ దరు♦ఖండము నొక్కటి సాంద్రదీర్ఘముల్. 176

చ. కుసుమరజఃకషాయమయి ♦ కూడి జలంబుల శీతలంబునై
యొసఁగుచు శీకరంబులను ♦ నింపుగ వీయుచు మెల్లమెల్లనన్
మసలుచు వచ్చు చందనస♦మం బగువారితరంగమాలికా
శ్వసనము గాఁగిలింపఁ దను ♦ సమ్ముఖ మై చనుదెంచి యాదటన్. 177

తే. కమలమధురస మాని యా♦కంఠముగను
మదముచే సొక్కి సోలుచుఁ ♦ బొదలుచున్న
రాజహంసలు శ్రుతిహారి♦రావములను
బిలువఁగాఁ జొచ్చెఁ దత్తరు♦వీథి నతఁడు. 178

తే. చొచ్చి యాతరుఖండంబుఁ ♦ జోద్య మగుచుఁ
దనరుతన్మధ్యసీమను ♦ ధరణిదేవి
స్ఫటికమణిభూమిగృహము నాఁ ♦ బరఁగు నొక్క
రమ్యకాసారమును గాంచె ♦ రాజసుతుఁడు. 179

అచ్ఛోదసరోవరవర్ణనము.

తే. తనరు నచ్ఛోద మనుపేర ♦ వనధు లెల్ల, నిర్గమించెడు త్రోవనా ♦ నెగడి లీన
తుహినశైలంబునా నది♦తోఁచుచుండు, జలవిహంగమసంరావ♦కలితమగుచు.

మ. జల మైనట్టిహరాట్టహాసకమొ కా♦సారాకృతిం గన్నని
ర్మలలోకత్రయపుణ్యసంచయమొ యా♦ప్రాచేతసాదర్శమో
సలిలాకారవిదూరశైలకులమో ♦ చంద్రాతపస్యందమో
సలిలీభూతహిరణ్యపర్వతమొ యా♦శాచక్రనిష్యందమో. 181

చ. తెలియదు తత్సరోవరము ♦ తేజరిలున్ శరదభ్రబృందముల్
జలములుగాఁ గరంగి యొక♦చక్కినిఁ జేరెనొ మానిమానసం
బుల మృగలోచనప్రభల ♦ ముత్తెపుఁగాంతుల సద్గుణంబులన్
సలిపిరొ నాఁగ స్వచ్ఛతను ♦ జాల వెలుంగుచు నుండు భూవరా!. 182

మ. కలయ న్నిండియు లోన స్పష్టమయి తాఁ ♦ గాన్పించుటన్ సర్వమున్
జెలఁగున్ నిర్జల మైనమాడ్కిఁ జలవీ♦చీశీకరాసారపాం
సుల జన్మించిన యింద్రచాపలత మె♦చ్చో దాని రక్షించు నాన్
వెలయున్; గాననశైలఖుత్మహిజా♦నీకంబుతో లోకముల్. 183

మ. ప్రతిమావ్యాజమునన్ నిజోదరమునం ♦ బద్మాక్షుమాడ్కిన్ సదా
యతులశ్రీ భరియించుఁ; బ్రత్యహము న♦య్యంభోజగర్భుండు త
న్నుతనీరంబులఁ ద్రావఁ గొంచుఁ జను సం♦తోషంబునన్ గుండికన్
సతతంబున్ గొలువంగ వత్తు రటకున్ ♦ సంధ్యన్ మహర్షుల్ దమిన్. 184

ఉ. చేరువ నున్నరౌప్యగిరి♦శృంగమునుండి దిగంగఁబారి వే
సారులు స్నాన మాడఁగను ♦ శంభుఁడు వచ్చుచునుండుఁ దచ్ఛిర
స్తారకనాథనిస్రుతసు♦ధారస మర్ధకపోలసత్ప్రభా
పూరనిభంబు చేసి యిటఁ ♦ బూతజలంబులఁ జేయుచుండెడిన్. 185

చ. దరికిఁ గుఱంగటం బొలిచి ♦ దట్టములై ప్రతిబింబితంబులై
పరఁగుతమాలవృక్షవన♦పంక్తులు గ్రమ్మఁగ నంధకారబం
ధురజలభాగముల్ చను న♦ధోభువిద్వారములో యనంగ భూ
వర! పగలున్ నిశాభ్రమను ♦ వందురు నందు విరాళి జక్కవల్, 186

వ. మఱియును 187

సీ. తఱుచుగా సావిత్రి ♦ తాన మాడి దినంబుఁ గొనిపోవునుసహస్ర♦వనజములను
గుంపులుగుంపులై ♦ గూడి యిచ్చును వచ్చి స్నానంబుగావింత్రు♦సప్తఋషులు

కల్పలతావల్కా♦కాండంబు లనిశంబు నుతుకుచుందురు సిద్ధ♦సతులు గ్రుంకి
ధనదునంతఃపుర♦వనితలు సతతంబు సఖులతోఁ గావింత్రు ♦ సలిలకేళి
తే. వరుణహంసంబు లొకచోట ♦ వనజపుష్ప
రసముఁ దమిఁ గ్రోలుచుండు జ♦రన్మృణాళ
దండముల నెల్లఁ బెకలించి ♦ తాఱుమాఱు
చేయుచుండును దిక్కరుల్ ♦ చెలఁగు చోకట. 188

క. హారవృషభం బొకపట్టున, దరిఁ గోరాడుచుఁ జెలంగుఁ ♦ దనశృంగములన్
విరియఁగఁ గొమ్ములఁ జిమ్ముచుఁ, బరఁగునునురు వెల్లజముని♦వారువ మొకచోన్.

ఆ. పాండుధార్తరాష్ట్ర♦పక్షవిక్షోభితం, బగుచు భారతంబు♦పగిది నొప్పు
మదనుధ్వజమువోలె♦మకరాంచితంబయి, పరఁగుచుండుఁ గనుల♦పండువగుచు.

ఆ. అమృతమథనవేళ♦యట్టులు శితికంఠ, పీయమానవిషము ♦ ప్రీతిమీఱ
ననిమిషాక్షరుచిర♦మమరలోకంబు నాఁ, బుండరీకయుక్తిఁ ♦ బోలు నటవి.

సీ. కద్రువచనుదోయి♦కరణి నాగసహస్ర వీతపయోరాశిఁ ♦ బెంపుమీఱు
మలయాచలముమాడ్కి ♦ మంజులచందనశిశిరవనంబునై ♦ చెలఁగుచుండుఁ
గంసబలముమాడ్కిఁ ♦ గమనీయమధుకరకువలయాపీడమై♦కొమరుఁ గాంచు
బాలకృష్ణచరిత్ర♦పగిదిఁ దీరద్రుమహారికృతజలపాత ♦ మగుచుఁ దనరు

ఆ. నురగకులమునోజ ♦ నుజ్జ్వలశతపత్ర, పద్మభాసురమయి ♦ పరఁగుచుండుఁ
గడునసాధుహేతు♦గతి నదృష్టాంతమై, యలరు నాసరస్సు ♦ నవనినాథ !.

క. కనినంతనె యాకొలనును, జనియెను శ్రమ మెల్ల నంత ♦ క్ష్మాపతిపుత్రుం
డనుకొనఁ దొడఁగెను నిట్లని, మనమునఁ గడు నద్భుతంబు ♦ మల్లడికొనఁగన్.

క. హయముఖయుగానుగమన, మ్మయినను నిష్ఫలము నాకు ♦ నయ్యె సఫలమా
రయ నీసరస్సుఁ గాంచుట, నయితిఁ గృతార్థుండఁ గంటి ♦ హర్షావధినే. 194

ఉ. చూచితిఁ జూడఁగాఁ దగిన♦చోటులయంతము వీక్షణీయముల్
చూచుటఁ గాంచు సత్ఫలము ♦ చూడ్కులకున్ సమకూరెఁ బూర్ణమై
చూచితిఁ బ్రీతిసంజనన♦శోభితపారముఁ గన్నులారఁగాఁ
జూచితిఁ గా మనోజ్ఞముల ♦ చొక్కపుటొడ్డును నేఁడు పో భళీ. 195

ఉ. ఈసరసీజలంబు స్పృశి♦యించి సుధారసమున్ స్పృశించె న
ట్లాసనుఁ డేల వ్యర్థముగఁ ♦ జాలశ్రమంపడి యిన్మడించెఁ దాఁ
జేసినచేత నియ్యదియుఁ ♦ జేయఁగఁ జాలుఁ బ్రమోద మెంతయున్
భాసిలఁగా సమస్తకర♦ణంబులకున్ సుధవోలె నద్దిరా. 196

చ. కనులకుఁ బ్రీతిఁ గొల్పుఁ గడుఁ ♦ గ్రాలుచు నిర్మలతన్ మనోజ్ఞమై
తనరఁగఁ జేయు సౌఖ్యమును ♦ దాఁకినఁ జల్లఁదనాన మేనికిన్
దనుపును ఘ్రాణమున్ వికచ♦తామరసోజ్జ్వలగంధసంగతిన్
జెనుచు మరాళరావముల ♦ వీనులకుం బ్రమదంబు పెల్లుఁగన్. 197

ఉ. స్వాదుత నాలుకం దనుపు; ♦ శంకరుఁ డీరజతాచలంబుపైఁ
బాదుకొనంగ నేల యెడఁ♦బాయక యెవ్వడు నీసరస్సునం
దాదట మిక్కుటం బగుట ♦ హా తెలిసెన్ లవణాబ్ధిశాయితన్
శ్రీదయితుండు గోరఁ డిఁక ♦ జేరఁడు దీనిఁ బరిత్యజించి తాన్. 198

చ. కలుగదు తొల్లి యీసరసి ♦ కల్గిన నాతొలివందిముట్టెచేఁ
గలఁగినధాత్రి తా నలయ♦గస్త్యనిపీతసమస్తతోయమున్
జలనిధిఁ జొచ్చు నేల బలి♦సద్మము నంటి యగాధవారిచే
నలరెడుదీన డాఁగినస♦హస్రవరాహము లైన నేఁచునే. 199

చ. కమలజుసృష్టికిం దొలుతఁ ♦ గంజభవాండము లమ్మయంబులం
చు మదిఁ దలంతు నవ్వి యొక♦చోటను జేరెను నీసరస్స్వరూ
పమున; యుగాంతవేళ జల♦వాహము లిందలినీటిబొట్లనే
క్షమ మునుఁగంగఁ జేసెడిని ♦ సంతతదుర్దినబంధురంబులై. 200

వ. అని తలపోయుచు నతండు. 201

సీ. విద్యాధరోద్ధృత♦వికచకైరవసుమార్చితవాలుకాలింగ♦చిహ్నితంబు
నుపకూలగతద్రుమ♦దుపవిష్టజలనరసేవ్యమానాతప♦శ్రీయుతంబు
వరవసిష్ఠమహర్షి ♦వరవర్ణినీదత్తదినకరార్ఘ్యారుణ♦వనజలసిత
మవకీర్ణభసితస♦మభ్యాహ్యమగోష్ఠగణచరయోద్ధూళన♦కణకలితము
తే. కఠినపాషాణశకలసై♦కతమయంబు, దీర్ఘపాదానుమితతృషా♦ర్దితగిరీంద్ర
కన్యకాకావతారమా♦ర్గంబు నైన, తత్సరోవరదక్షిణ♦తారమునకు. 202

ఉ. పోయి తురంగమమ్ము డిగి ♦ పుచ్చఁగఁ బల్లము నేలఁ బొర్లి వే
పాయ శ్రమంబు లేచి గొని ♦ వచ్చిక డిగ్గి సరోవరంబులోఁ
దోయము లిచ్చఁ గ్రోలియునుఁ ♦ దోఁగియు వచ్చినదాని నొక్క ద్రు
చ్ఛాయను దీసి కళ్లెమును ♦ స్వర్ణమయంబగుత్రాటఁ గాలికిన్. 203

ఉ. బందము వైచి కోసి కర♦వాలమున న్నవఘాసజాలమున్
ముందర వైచి యుంచి దిగి ♦ పూతకరుం డయి తత్సరోవరం

బందు జలంబు లాని కడు♦పారఁగఁ జాతకముంబలెం దమిం
జెంది రథాంగకంబు క్రియఁ ♦ జెన్నుఁ దలిర్చుమృణాళఖండముల్. 204

ఉ. చేరి నవీనభగ్నముల ♦ శీతలవారికణాంచితంబులన్
జారుమృణాళకంబులను ♦ సారసపత్త్రములన్ శిలాస్థలిన్
భూరిలతాగృహంబునను ♦ బొందిక ప్రస్తర మేర్పరించి భూ
దారసుతుండు పండె నుప♦ధానముచేసి నిజోత్తరీయమున్. 205

చంద్రాపీడుఁ డమానుషగీతధ్వనిని వినుట.

ఉ. అంత నొకింతసేపునకు ♦ నాసరసీధనదాళినుండి య
త్యంతమనోజ్ఞగాననిన♦దం బొకఁ డద్భుతమై విపంచికా
తంత్త్రులఝంకృతిం గలసి ♦ తద్దయు వీనుల కింపుపెంపుచున్
సంతసిలంగ మానసము ♦ చయ్యన వచ్చె నమానుషక్రియన్. 206

ఉ. ఆనినదంబుఁ దొల్తఁ దన♦యశ్వము కంధర మెత్తి గ్రాసమున్
మాని వినిశ్చలం బగుచు ♦ మ్రాన్పడినట్టుల యాలకింపఁగా
వీనుల నాదెసం బఱపి ♦ వీనులవిందుగ నాలకించి భూ
జానికుమారకుండు గడు♦సంభ్రమ మొప్పఁగ నబ్బురంబునన్. 207

చ. విగతజనాటవీస్థలిని ♦ విస్మయ మయ్యెడి నిట్టిగీత మే
పగిది జనించె నంచు మదిఁ ♦ బొడమిన వేడుక లేచి చూడ్కులం
దగఁ బరఁగించె నద్దెసకె ♦ తార్కొన నద్దెస గీతికారవం
బగపడ దయ్యె నేమియును ♦ నద్దెన దూరము గాన నెంతయున్. 208

చ. వినఁబడ సాగె కేవలము ♦ వీనులవిం దయి యాసుగీతమే
మనసునఁ బొంగుహర్షమును ♦ మానఁగఁ జాలక యాసుగీతికా
జనన మెఱుంగువేడుకను ♦ జయ్యనఁ బల్లముఁ బెట్టి యశ్వ మె
క్కి నరవరాత్మజుండు చనెఁ ♦ గ్రేళ్లురకన్ మునుముందు కోరికల్. 209

క. అలగీతముపైఁ బ్రీతిని, మొలఁగుచు మునుచనెడు కాన♦మొకములు త్రోవం
దెలుపఁగఁ బ్రార్థింపక యే, కొలనికిఁ బడమరగ నుండు ♦ కుసుమవనమునన్.

క. ఏడాకులనఁటితరువులఁ, గూడిన యేలాలవంగ♦కోమలలతలం
జూడ నయి వకుళవాటిక, పోఁడిమి లవలీనికుంజ♦పుంజంబులలోన్. 211

క. అళికులనినాదముఖరిత, సలలితదిఙ్నాగదాన♦సరణి యనంగాఁ
బొలిచెడుతమాలవీథుల, మలఁగుచు గీతంబు గుఱిచి ♦ మఱియతఁడు చనెన్.

సీ. స్వచ్ఛనిర్ఝరజల♦శీకరజాలంబులఁ గని జడత్వము; భంగ♦కాండములను
సంక్షుభితంబుల ♦ సలిపి మణ్ముఖశిఖిశిఖలఁ జుంబనములఁ ♦ జెలఁగఁ జేసి
యుత్తరకురుసీమ ♦ నొప్పెడు నువిదల కర్ణోత్పలము లంటి ♦ గారవించి
యంబికచికురమ్ము ♦ నలరెడు చిగురులఁ బట్టి చక్కఁగ దిద్ది ♦ భవుని తేజి
తే. వేయురోమంథడిండీర♦బిందుచయముఁ
దలను ధరియించి పుష్పాడిఁ ♦ దాన మాడి
మందగతి వీచుకైలాస♦మారుతమ్ము
లెదురుగా వచ్చి స్వాగత ♦ మీయఁ దనకు. 213

వ. సమ్ముదితస్వాంతుఁడయి యాచంద్రాపీడుండు కొంతదవ్వరిగి యాగీతం బేతెంచినస్థలంబుం జేరి యందుఁ జంద్రప్రభ నామకసరోవరంబునకుఁ బశ్చిమతీరంబునఁ గైలాసపాదంబునకుం గుఱంగట. 214

శూలపాణి సిద్ధాయతనవర్ణనము.

సీ. మరకతమణులట్లు ♦ హారితంబులై హారిహారీతరుతిమనో♦హరము లగుచు
సంభ్రమద్భ్రమర♦జాలనఖంబుల విదళితకుట్మల♦వితతు లగుచు
మదపికకబళిత♦మంజులసహకారకోమలపల్లవ♦కోటు లగుచు
మత్తషట్పదకోక♦మధురవవాచాలితరసాలకలికాయ♦తంబు లగుచు
తే. సచకితచకోరచుంబిత♦చారుమరిచ, పల్లవోల్లసితంబులై ♦ పరఁగు చెవుడు
శుకశతముఖనఖాగ్రవి♦శకలితఫల, భాసురములయి సాంద్రతఁ♦బరిఢవిలుచు.

వ. మఱియు. 216

క. ఫలభారవినమ్రములై, చెలఁగెడు దాడిమకులాయ♦సీమలయందుం
బొలుపుగ నీనిన చటకా, కులములు రమ్యంబు లగుచుఁ ♦ గుతుకం బెసఁగన్.

క. సంపెగపుష్పాడిరాసుల, సొంపుగఁ బింజరము లయిన ♦ సుకపింజలముల్
నింపుగ మెసఁగెడు పిప్పలి, గుంపుల నొప్పారిసొగసుఁ♦గురియుచు మఱియున్.

క. కుసుమరజోరాసులచే, నెస చిత్రపువర్ణములను ♦ నెనసినఘనసా
రసముల కావాసములై, యొసఁగుచు నాకాశమంటి♦యొలమి నలరుచున్.

క. జలధరజలలుబ్ధములయి, కళవళపడి మోసపోయి ♦ కడుదైన్యమునన్
విలపించుముగ్ధచాతక, ముల నాదకలితతమాల♦పుంజము లగుచున్. 220

క. కరికలభలూనపల్లవ, పరిగతలవలీలవంగ♦వలయము లగుచుం
బరఁగుచు నవిరళఫలచయ, భరనమ్రసునారికేళ♦వనతతు లగుచున్. 221

క. అకఠోరపర్ణపుటపూ, గకుజాతస్ఫుటంబు లగుచుఁ ♦ గనులకు విందై
ప్రకటితము లైన కలికా, నికరంబుల నెల్లయెడల ♦ నిండి చెలఁగుచున్. 222

క. మదముఖరకేకిమధురని, నదములు సతతంబు నడుమ♦నడుమఁ జెలఁగఁగాఁ
బొదలుచు; గాలికిఁ గదలెడు, మృదుకదళీదళము లెపుడు ♦ మెల్లఁగ వీవన్.

క. నూతనయౌవనమత్తక, పోతచ్ఛదపాదభగ్న♦పుష్పగుళుచ్ఛో
ద్ద్యోతితము లగుచు; విహంగమ, శాతముఖోద్దళితచూత♦చారుఫలము లై.

క. తనరుచుఁ; గైలాసతరం, గిణుల తరంగములు పాఱి ♦ గీల్కొన్న విశా
లనుతపులినస్థలమ్ములు, పౌనరాగఁగ నడుమ నడుమఁ ♦ బొదలుచు మిగులన్.

క. వనదేవతాకరతలము, లనఁగ నలక్తాంబులవస♦మాక్తంబులు నాఁ
దనరెడు కోమలకిసలయ, వనముల ధరియించి సొంపు ♦ భాసిల్లఁ గడున్.

క. తిని గ్రంథిపర్ణకబలముఁ, గని నిర్భరహర్ష మెదల ♦ గాఢస్వాపం
బును మూలంబులఁ దవిలిన, ఘనచమరీమృగకులంబు♦ కాంతఁ గొలువఁగన్.

క. చెలఁగెడి బహువిధపాదప, ములు కర్పూరాగరుప్ర♦ముఖములు క్రందై
యలరెడిఁ గడు; నింద్రాయుధ, ములు నాఁగ ఘనావళులకు♦ముఖ్యవసతులై.

సీ. చొరనీక దినకర♦కరముల శీతలాంతరములై చనుఁగుము♦దంబులట్లు
తతసుసన్నిహితవే♦త్రాసనంబుల నొప్పి పరఁగును భవనతా♦పసులమాడ్కి
లాలితోద్యత్ప్రవా♦లలతాంకురము లయి తనరు నంబుధిసైక♦తములపగిది
సకలామధీపుష్ప♦సత్ఫలయుతములై యలరును నభిషేక♦జలములట్లు
తే. తనరుఁ బ్రాసాదములమాడ్కి ♦ ఘనకపోత
యుతము లయి యొప్పు రుద్రుల ♦ యొప్పిదమున
నాగలతికానిబద్ధత ♦ నవ్యభంగిఁ
బొదలు రాజేంద్ర! మఱియు నా♦భూరుహములు. 229

క. ఆతరువుల మధ్యంబున, నాతత మయి జ్యోత్స్నవోలె ♦ నవదాతం బై
చేతోమోద మొనర్చెడు, భూతేశ్వరునాలయంబుఁ ♦ బొడగనె నతఁడున్.

క. కని పవనోద్ధూతమ్మయి, చను దెంచెడు కేతకీర♦జంబున సితమై
తనువెల్లఁ దనర శివద, ర్శనహేతువిభూతినోము ♦ సల్పఁ గడఁగె నాన్. 231

క. దేవాలయప్రవేశన, పావనపుణ్యములు తన్నుఁ ♦ బైకొనియెనొ నా
భూవిభుపుత్త్రుఁడు చొచ్చెను, నావిధుశేఖరుగృహంబు ♦ నడరెడుభక్తిన్.

ఉ. స్తంభచతుష్టయంబుగల ♦ స్ఫాటికమండపికం బ్రతిష్ఠితున్
శంభుఁ జతుర్ముఖుం గనియె ♦ సర్వజగత్ప్రణతాంఘ్రిపంకజున్
శుంభదశేషలోకగురు♦శోభితమూర్తికలింగుఁ బ్రాపితా
రంభుని స్వర్ధునీవికచ♦రమ్యసితాంబురుహార్చనాంచితున్. 233

ఉ. అప్పుడె కోసి తెచ్చిన త♦దబ్జము లూర్ధ్వవిపాటితంబులై
యొప్పెడుఁ జంద్రఖండముల ♦ యోజను శేషఫణాళిచుట్టుల
ట్లొప్పుచుఁ బాంచజన్యమున ♦ కుద్దియకారులు నాఁ దనర్చుచుం
జొప్పడు క్షీరవార్ధిహృది♦చొప్పున నార్ద్రపయఃపృషత్తులై. 234

వ. అందు. 235

## మహాశ్వేతావర్ణనము.

క. అలశివు దక్షిణవదనముఁ, గొలుచుచు బ్రహ్మాసనమునఁ ♦ గూర్చుండి మదిం
దలఁచుచు శివు నెదురై భూ, తలమున నిలుచున్నయొక్క♦తన్విం గాంచెన్.

సీ. ప్రళయవేళను బొంగి ♦ పాఱుక్షీరాంబుధివారిపూరముమాడ్కిఁ♦బాండురంబు
పాదపాంతరములఁ ♦ బ్రవహించుస్వర్ణదీస్రోతంబు వేణినా ♦ శోభితంబు
చిరకాలసంచిత♦వరతపోరాశి నా నాశాంతరాళసం♦వ్యాపృతంబు
ప్రోవయి భూస్థలిఁ ♦ బొందినరజతాద్రిరమ్యదీధితులు నా ♦ రాజితంబు

తే. దానిదేహప్రభాపూర ♦ మోనరేంద్ర!
సగిరికాననతత్ప్రదే♦శంబు నెల్ల
దంతమయముగ నొనరించెఁ ♦ దత్ప్రభాళి
ద్విగుణిత మొనర్చె రజతాద్రి♦తేజ మెల్ల. 237

తే. చూచువారలమనమును ♦ జొచ్చి నేత్ర
పథమునను లోనఁ దత్ప్రభా♦పంక్తి నామె
ధవళముగఁ జేయుఁ; దత్ప్రభా♦స్థగితదేహ
యగుచు స్ఫాటికగృహగత♦యట్లు మఱియు. 238

తే. విమలచీనాంబరములోన ♦ నిమిడినట్టు, లద్దమున సంక్రమించిన♦యట్లు దుగ్ధ
జలధిజలమగ్న యైనట్లు ♦ శారదాభ్ర, పటలి గప్పినపగిది న♦స్ఫుటశరీర. 239

తే. పంచభూతమయంబులై ♦ పరఁగు ద్రవ్య, ములను బోవిడి కేవల♦లలితధవళ
వస్తుసమితిని ధాత యా♦వనితఁ జేసెఁ, గాక యుండిన వెల్లనై♦గ్రాలు నెట్లు.

చ. ప్రియుఁ బ్రతికింప నీశ్వరుని ♦ ప్రీతిగడించుటపొంటె సేవకై
ప్రియపడి వచ్చినట్టి మరు♦ప్రేయసి నా నలరాహుదాడికిన్

భయపడి చంద్రశేఖరుని ♦ పజ్జ వసించెడి చంద్రరేఖ నా
మయిని ధరించినట్టిదదు♦మాసతిమానసశుద్ధితామో యనన్. 241

వ. మఱియు. 242

చ. హరునిగళాంధకారమును ♦ నట్టె యడంపఁగఁ బుట్టినట్టి జ్యో
త్స్నరహి శరీర మెత్తిన వృ♦షధ్వజుధూళనభూతిరేఖ నా
హరునికృతాంతదిగ్వసన♦హాసము బాహ్యధరాస్థితంబు నాఁ
బరఁగు నమానుషాకృతినిఁ ♦ బార్థివ! యాసతి నిర్మమాత్మయై. 243

వ. వెండియు. 244

సీ. పుడమికిదిగినట్టి ♦ బ్రహ్మతపస్సిద్ధి, మేనుఁ దాల్చినముని ♦ ధ్యానగరిమ,
సప్తలోకభ్రమ♦సంజనితశ్రమశ్రాంతాదియుగవిధి♦చాగుకీర్తి,
కలినష్టధర్మశో♦కగృహీతవనవాస మగు త్రయి, ధవళిమ♦యవధిసీమ,
యతివరూపముఁ దాల్చి ♦ యలరెడునాగామికృతయుగోజ్జ్వలబీజ♦కేవలంబు,
తే. దశముఖోన్మూలనక్షోభ♦ధరణిపతిత, రజతగిరిలక్ష్మి ద్వీపాంత♦రములఁ జూడ
నరుగుదెంచిన తెలిదీవి♦యబ్ధికన్య, తలఁప నాబోటి పెక్కేల ♦ ధారణీశ!.

చ. బలిసదనంబుఁ బాసి భువి♦పై కగుదెంచిన శేషుమేనిచా
య; లలిని బుంజితం బయిన ♦ యాసితపక్షపు వీథిగాని యా
వెలఁది వెలంది గాదు; పృథి♦వీవర! ధర్మన్యాదబ్జజాత గా
కల నరజాతయే తెలివి ♦ హంసల కామె యొసంగు వడ్డికిన్. 246

ఉ. పారదధారలం గడిగి ♦ పంకజవైరిగభస్తికూర్చలన్
దోరముగాఁగఁ దుడ్చి సుధ♦తోడుత వర్ణము వేసినట్లు లా
పారసగంధిమేను ఘన♦సారనిభం బయి ధాళధళ్యముల్
మీఱఁ జెలంగు వెల్ల నయి ♦ మేదినిభర్త! నుతింప శక్యమే. 247

చ. అమృతపునుర్వుముద్దలను ♦ హస్తిరదచ్ఛదసంచయంబులం
గమలజుఁ డానెలంతుకను ♦ గారవ మంద సృజించి వెండినీ
రమున మెఱుంగు పెట్టి యల♦రారఁగఁ జేసెను నివ్వసుంధరన్
విమలచరిత్ర! యానలువ♦నేర్పున కేమన వచ్చుఁ జెప్పుమా!. 248

చ. మనుజవరేణ్య! తజ్జటలు ♦ మల్లట గుల్ఫములందు వ్రేలుచున్
దనరుచు నుద్యదర్కకిర♦ణంబులఁ జేసినయట్లు లెత్తనై
కనదురుచంచలాలతల♦కాంతిని నప్పుడె స్నాత గాన వాః
కణములు పొల్చు నందు నతి♦కాలసులగ్నశివాంఘ్రిభూతి నాన్. 249

మ. శివనామాంకితరత్నపాదయుగళిన్ ♦ శీర్షంబునం దాల్చి యా
రవిరథ్యంబుల గిట్టల న్నలిగి చూ♦ర్ణంబైన నక్షత్రపాం
సువిధిన్ నిర్మలమైన బూది నొసటన్ ♦ శోభిల్ల శృంగోపల
ప్రవిలగ్నేందుకళాద్రిరాజసునితం♦బంబో యనం బొల్చెడిన్. 250

చ. అతులితభక్తి రెండవసి♦తాంబుజమాలిక నాఁగ నొప్పు నా
యతతతదృష్టి నొక్కమెయి ♦ నాశివలింగమునందుఁ గూర్చి స
న్మతి నియతాత్మ యై శివుని ♦ మానసవీథమునందు నుంచి సం
తత మవికంపితాంగి యయి ♦ ధ్యాన మొనర్చుచు నుండె నంతయున్. 251

చ. తనువు ధరించినట్టి విశ♦దస్తుతివర్ణములో విశుద్ధహ్ర
ద్వనజగభస్తులో స్వరవి♦తానమొ గీతగుణంబులో యనం
దనరును గానవేళ స్ఫురి♦తం బగునోష్ఠపుటంబుగల్గు న
వ్వనితముఖంబునుండి వెలి♦వచ్చెడుదంతమయూఖజాలముల్. 252

చ. అతివిమలంబు లైన నిగ♦మార్థములట్లు విరించివక్త్రని
ర్గతవరమంత్రవర్ణముల♦కాంతిని బంకజనాభనాభికా
సితజలజాతబీజముల ♦ చెన్నున నామలకీఫలప్రమా
ణతను దదీయహస్తనళి♦నంబు స్పృశించి పవిత్రులం దమున్. 253

ఉ. చేసికొనంగఁ దార లయి ♦ చేరినసప్తఋషీంద్రులో యనన్
భాసిలు నక్షమాల మెడ ♦ భాసురమై చెలువొంద నొప్పు నా
వాసితగాత్రి, గాలిగుడి ♦ పర్వఁగఁ బొల్చెడు చంద్రమండలిన్
జేసి వెలుఁగు పూర్ణిమని♦శిం బురుడించుచు నుండె భూవరా!. 254

చ. తనగునధోముఖం బయిన ♦ తచ్ఛివమస్తకపాలమండలం
బనఁగను ముక్తిద్వారమున♦యందలి కర్పురకుంభయుగ్మకం
బనఁగను దత్కుచద్వయము; ♦ హంసయుగంబునఁ బొల్చు శ్వేతగం
గనయమునం తనర్చు నల♦కామిని యాచనుదోయిచేఁ గడున్. 255

ఉ. చామరసన్నిభం బగుచు ♦ శంభుసతీమణిసింహికాసటా
స్తోమమయంబు నాఁ బొలిచి ♦ శోభిలుకల్పకభూజవల్కమున్
నేమమునిూఱఁ జన్నుగవ ♦ నెన్నడుమన్ ముడివైచి కప్పి యా
సోమగభస్తిజాల మన ♦ సొంపగు జందెముఁ దాల్చి భక్తిమై. 256

ఉ. శాసికసట్టునన్ బయికిఁ ♦ బర్వెడుపాదతలారుణద్యుతిన్
వాసిగ నెఱ్ఱనైన తెలి♦వల్కల మాప్రపదీనమై తగన్

భాసురలీలఁ గట్టి తటి ♦ వచ్చి విధేయత నిర్వికారుఁడై
భాసిలు శిష్యుమాడ్కి నెల ♦ ప్రాయము గొల్వఁగ భీతిభక్తులన్. 257

ఉ. చాపల మెల్లఁ బోవిడిచి ♦ చారువిలోచనమైన రూపమున్
బాపురె పెంచుకొన్న మృగ ♦ పాకము పోలెను సేవసేయఁగా
నేపునఁ గాంతిపూరమును ♦ నేమితపం బొనరించెనో యనన్
దాఁపక మేను గొల్వ కయి ♦ దండ నొసంగుచుఁ బూతచిత్తయై. 258

చ. అలరుచు నుండె నాయతిన; ♦ యంకతలంబున నుంచి వీణియన్
వలకయి భూతిపుండ్రముల ♦ భాసిలుదానిని నన్నివ్రేళులన్
జెలఁగెడి సంకుటుంగ్రములఁ ♦ జెన్నగుదానిని శంఖకంకణం
బలరెడుదాని ముంగరము ♦ నందు నఖద్యుతి పర్వ మీటుచున్. 259

సీ. ధ్రువబద్ధమై గ్రహా ♦ తోరణంబువిధాన నాబద్ధకంఠమై ♦ హారమువలె
రాగసంరక్తవ ♦ ర్ణం బయి కుపిత నా సుంద్రతారం బయి ♦ మత్తమాడ్కి
వివిధోరుభావాను ♦ విద్ధయై మీమాంసగతిఁ గృతాఖిలతాళ ♦ గతుల నొప్పి
యున్మత్తవిధమున ♦ నొప్పుచు శ్రావ్యమై సజ్జనసల్లాప ♦ సరణి మిగుల

తే. నొప్పు గీతముఁ బాడు చ ♦ యుగ్మనేత్రు
దేవదేవుని నంబికా ♦ దేవిధవుని
వేడ్కఁ బ్రత్యక్షగాంధర్వ ♦ విద్య నాఁగ
స్తోత్ర మొనరించుచుండె నా ♦ శోభనాంగి. 260

క. అలమణిమండపకంభం, బులఁ దత్ప్రతిబింబకములు ♦ పొల్చెఁ దదనురూ
పలు వీణె మీటు నాచెలి, చెలికత్తె లనంగ మిగుల ♦ క్షితిపతివర్యా!. 261

క. స్నానార్ద్రలింగబింబిత, యానలినదళాక్షి, భక్తి ♦ నారాధితుఁడౌ
స్థాణునిహృదయముఁ జొచ్చెనొ, నా నొప్పెను నరవరేణ్య ♦ నవలావణ్యా!.

క. ఆగానాకృష్టములై, యాగహనమునందుఁ జెలఁగు ♦ హర్యక్షవరా
హాగచరశరభకరిమృగ, గోగణముఖజంతుకోటి ♦ కుతుకం బొప్పన్. 263

క. ఆబద్ధమండలములై, యాబాలిక చుట్టుముట్టి ♦ యాలించుచు వీ
ణాబహువిధనినదము గా, రాబం బలరంగ నుండె ♦ రావడ వీనుల్. 264

సీ. శివుశిరశ్శశికల ♦ చెలువున నప్రాప్తరాగయై శివుశరీ ♦ రంబుమాడ్కిఁ
దేజోవిరాజిత ♦ దేహయై దీక్షితవచనంబురీతి న ♦ ప్రాకృతమయి
యమథితోదధివారి ♦ యట్టులు లోపల విమలయై వైదేహి ♦ విధము చెలఁగ
జ్యోతిఃప్రవిష్టయై ♦ శోభిల్లి యసమస్తపదవృత్తిఁ గలిని న ♦ ద్వంద్వ యగుచు

ఆ. బౌద్ధబుద్ధిగతిని ♦ బరఁగ నిరాలంబ, యగుచుభూమిమాడ్కి ♦ నలరి వారి
భృతశరీరయగుచుఁ ♦ బీతామృతయనంగ, విగతతృష్ణయగుచు ♦ వెలుఁగుచుండ.

క. హిమసమయోమశ్రీసచం, దమునను బరివీతనలిన ♦ నాథాతపయై
యమితాత్మవ్యాపయ యగుచు న, సమపణవిద్యావిశిష్ట ♦ సౌరునఁ జెలఁగెన్.

క. ఆలిఖిత మైనపోలిక, నాలలనారత్న మొప్పె ♦ నచలస్థితయై
గ్రాలుచు యతిగణసముచిత, లీలం చేఁ జెలఁగి యార్య ♦ లీలను నృపవరా!. 267

క. పదునెనిమి దేండ్లప్రాయపు, సుదతి తెలెం దోఁచుఁ జూడ ♦ సురసతి యౌటన్
విదితము గా దెవ్వరి కా, మదవతిప్రాయంబుకొలఁది ♦ మనుజాధీశా!. 268

క. ఐన నహంకృతి మనుతయుఁ, బూనదు మది మత్సరంబుఁ ♦ బూనదు గరువం
బూనదు పాశుపతవ్రత, మూని శివధ్యానపరత ♦ నొప్పుచు నుండెన్. 269

క కని యాకన్యారత్నం, బును డిగి గుఱ్ఱంబు నొక్క ♦ భూమిజవిటపం
బునకుం గట్టి సమీప, మ్మునకుం జని భక్తి మ్రొక్కి ♦ ముక్కంటి కటన్.

క. ఆనిర్జరవనితను పృథ్వీనాథసుతుండు రెప్ప ♦ వేయక యటు తా
మ్రానువడి బద్ధలత్యుం, డై నిశ్చలుఁ డగుచు మరల ♦ నాలోకించెన్. 271

క. ఆవనితరూపసంపద, పావనతయు శాంతి గాంతి ♦ పరమాశ్చర్యం
బావహిలఁ జేయఁ దనచే, తోవీథిఁ దలంచె నిట్లు ♦ తోడ్తో నతఁడున్. 272

చ. అనుకొననట్టివార్త లిఁ ♦ నావహిలుం గద జంతుకోటి కె
ట్లన నలవోక వేఁటకయి ♦ యాగమనం బొనరించి యూర కే
ననుగమనం బొనర్చితిని ♦ నశ్వముఖద్వయిఁ గంటి మానవుల్
జనఁగ నగమ్యమై దివిజ ♦ సంచరణోచిత మైన దేశమున్. 273

చ. కనులకు విందొనర్చు నటఁ ♦ గంటి జలంబుల రోయు చప్పలో
జనములు స్నాన మాడఁ జను ♦ చాగుసరస్సుఁ; దదీయతీరలే
ఖను బవళించి యుండఁగను ♦ గర్ణములం బడె నీయమర్త్యగా
ననినదముం దదానుగమ ♦ నం బొనరించి యమానవాప్యనున్. 274

ఉ ఈదివిజాంగనం గనితి ♦ నీసతి దివ్యయె యేల సంశయం
బీదయితోజ్జ్వలాకృతియె ♦ యేర్పడఁ జెప్పక చెప్పు దివ్యతన్
ఈదృశదివ్యగాన మిల ♦ నేగతిఁ బుట్టును నివ్వధూటి వే
నాదుదృగధ్వమున్ గడచి ♦ నాకతలంబున కేగ దేనియున్. 275

ఉ ఎక్కక యున్న రాజతగ ♦ రీంద్రము నే నట కేగి యెవ్వ రీ
విక్కడి కేగుదేరఁ గత ♦ మెయ్యది నూతనయౌవనంబునం

దిక్కరణిఁ బ్రతంబు ధరి♦యింపఁగ నేటికి నామధేయ మే
మెక్కడ నీనివాస మని ♦ యేర్పడ నడ్గద నల్లసంగతుల్. 276

క. అద నిది యచ్చెరువుల కని, వదలక తత్స్ఫటికమండ♦పంబున నొకచోఁ
బొదలు చొకకంబమును దాఁ, గదిసి ప్రతీక్షించుచుండె ♦ గానసమాప్తిన్.

తే. అంత నాకాంత గీతాంత♦మందు లేచి
యనినదం బైనవీణియ ♦ నవలఁ బెట్టి
శాంతమధుకరమధురుతి♦శాలిని యగు
కుముదినియుఁ బోలె శివు వల♦గొనియు మ్రొక్కి. 278

తే. సహజధావళ్యయుతము దు♦స్సహతపఃప్ర
భావగంభీరమును నయి ♦ వరఁగుదృష్టి
నతని నూఱడఁ జేసి పు♦ణ్యముల చేతఁ
దాఁకి తీర్థజలంబులఁ ♦ దాన మార్చి. 279

తే. చిర తపమ్ములఁ బరిశుద్ధి ♦ చేసి వరము
నొసఁగెడినొ నాఁ బవిత్రత ♦ నొసఁగునాఁగఁ
దిరిగి చూచి యానృపసూతి♦వరునితోడ
మాట లాడంగఁ దివిరె నా♦మగువ యిట్లు. 280

మహాశ్వేత చంద్రాపీడుని కతిథిసపర్య చేయుట.

క. స్వాగత మతిథికి నెట్లీ, భాగమునకు వచ్చి తీవు? ♦ పావనచరితా!
యేగుదము రమ్మికక మహా, భాగా! కొను మతిథిపూజ ♦ వాత్సల్యమునన్. 281

క. అనుటయుఁ జంద్రాపీడుఁడు, మనమునఁ దను ననుగృహీతు♦మాన్యుఁగ సంభా
షణములచేత నె యనుకొని, వినయమ్మున లేచి మ్రొక్కి♦వినతుం డగుచున్.

క. చిత్తము సెల వనుచును నా, బిత్తరిబడిఁ బోవసాగెఁ ♦ బ్రియశిష్యుఁడు నాఁ
బత్తిని బోవుచు నిట్లని, చిత్తమున సమర్థనంబు ♦ చేయఁగ సాగెన్. 283

క. ననుఁ గని యంతర్ధానం, బును గన దీమగువ నాదు ♦ బుద్ధినిఁ బ్రశ్నిం
పను గౌతూహల మగు నడి, గినఁ దప్పక తనచరిత మ♦ఖిలమును జెప్పున్.

క. మునిజనదుర్లభ మగునీ, యనుపమరూపంబు గల్గు♦నామెకు నెట్లీ
ఘనదాక్షిణ్యాతిశయం, బును బ్రతిపత్తియును గల్గెఁ ♦ బోల్పఁగఁ జాలన్.

వ. అని తనమనంబున నిశ్చయించి కొంతదవ్వు చని. 286

సీ. పగలును రాత్రిగా ♦ నగపర్చు నిబిడతమాలపంక్తులు మ్రోలఁ ♦ గ్రాలుచుండ
నిరుతట్లఁ బడుసిత♦ఝరజాలములు ద్వారముల ప్రేలుచామరం♦బులయి నెగడ

వికసితసుమలతా♦వేశ్మకూజన్మత్తబంభరరుతి చేరు♦వను జెలంగ
నారికేళీఫల♦చారువల్కలమయధౌతపాదుక లొంకెఁ ♦ దనరుచుండ
తే. ధవళపాషాణతలముల♦దవ్వునుండి, పడుచుఁ బైకెగిరిపడుచుఁ ♦ బ్రస్తరాగ్ర
దళనజాతాంబుకణములై ♦తనరునీటి, ప్రస్రవణములనీహార♦బద్ధ మనఁగ. 287

చ. తనరుచు యోగపట్ట మొక♦తావున వ్రేలఁగ రత్నకుండి గ్రా
ల నడుమ మేనిభస్మమున ♦ లాలితమై తగువల్కశయ్య యొ
ప్పు నొకకడం జెలంగ నులి ♦ బాగుగ మల్చినరీతిఁ జంద్రబిం
బనిభము నైనబిచ్చపుఁ గ♦పాలము శంఖమయంబు నొప్పఁగాన్. 288

చ. ఘన మగుచుండు నొక్కగుహఁ ♦ గాంచెను నాతఁడు దానివాకిటం
దనరు శిలాతలంబుపయిఁ ♦ దా వసియించెను; వీణ నంత నా
వనరుహనేత్ర యుంచి తన♦వల్కలశయ్యతలాఁపియుండు దొ
ప్పను గొనివచ్చె నర్ఘ్యమును ♦ బాద్యము నాసెలయేటినుండి తాన్. 289

ఉ. వచ్చిన నాతఁ డిట్లనియె ♦ వ ల్దతియంత్రణ చాలుఁ జాలు నీ
విచ్చెడునాదరంబు గడు;♦నిట్టియనుగ్రహ మేల చాలు వే
వచ్చెఁ ద్వదీయదర్శనమె ♦ పాపచయం బఘమర్షణంబున
ట్లచ్చ మడంపఁజాలును బ్ర♦యాసము మానుము గూరుచుండుమా. 290

చ. అనుటయు నెంతకున్ విడువ ♦ కామె గడుంగడుఁ గక్కసింప వ
ల్దను టుచితంబు గా దనుచుఁ ♦ దద్దయు నానతమౌళి యాచుఁ గై
కొనె సకలాతిథేయమును ♦ గూరునణంకువ తోఁప నెంతయున్
మనుజవరాత్మజాతుఁ డను♦మానము వీడి యనూనభక్తిమై. 291

ఉ. ఈగతి నాతిథేయము న♦యించి ద్వితీయశిలాతలంబుపై
బాగుగఁ గూరుచుండి యల♦భామిని యించుక యూరకుండి యా
భోగసురేంద్రు నడ్గఁ దన♦భూరిహరిజ్జయ మాది కిన్నరా
యోగమునం జరించు చట ♦ కోలిని వచ్చుట చెప్పె సర్వమున్. 292

చ. విని సకలంబు లేచి తన♦భిక్షుకపాలము చేతఁ బూని యా
వనిత తదాశ్రమావనిజ♦పంక్తులక్రిందికిఁ బోవఁగా స్వయం
వినిపతితంబు లయ్యె నల♦భిక్షుకపాలమునిండఁ బండ్లు; వా
నిని గొనితెచ్చి యాపృథివీ♦నేత భుజింపఁగఁ గోరె నప్పుడే. 293

చ. మనమున నాతఁ డిట్లనుచు ♦ మంతనముం దగఁ జేయసాగె ధా
త్రిని గలదే యసాధ్యవిధి ♦ తీవ్రతపంబుల కెందు నింతక

న్నను బరమాద్భుతంబు భువ♦నంబులఁ గల్గ దచేతనావనీ
జననములున్ ఫలంబుల నొ♦సంగుచు నీము కనుగ్రహార్థమై. 294

సేవ యొనర్చు చుండెడినిఁ ♦ జిత్రము గంటి నదృష్టపూర్వమం
చావిభుసూనుఁ డచ్చెరువు ♦ నందుచు లేచి హయంబుఁ దెచ్చి యా
తావున కంత గంత విడి ♦ దగ్గఱఁ గట్టి ఝరోదకంబులన్
దా వడి స్నాన మాడి యమృ♦తంబున కీడగుతత్ఫలంబులన్. 296

ఆరగించి నిర్ఝ♦రామలహిమశీత, వారిఁ గ్రోలి వార్చి ♦ వచ్చి యేక
తమునఁ గూరుచుండె♦ధాత్రీశతనయుఁ డా, యంగనయును దాను♦నంతలోన.

చెలఁగెడుఫలమూలంబుల, జలముల నాహారవిధిని ♦ సవరించి గడున్
సలిపి దినాంతాచారం, బుల వచ్చి శిలాతలంబుఁ ♦ బొంది వసించెన్. 297

అంత. 298

నరవరాత్మజుండు ♦ నల్లన చేరువ, కరిగి కూరుచుండి ♦ యనతిదూర
మున నొకింతసేపు♦మొనసి యూరకయుండి, వినయమలరనామె♦కనియె నిట్లు.

అమ్మ! భవత్ప్రసాదసమ♦వాప్తిని బృంహితమైనవేడ్కఁ దా
ముమ్మరమై కలంపఁ గడు ♦ ముగ్ధమనుష్యుల కెల్ల సాజమై
యిమ్మహిఁ బొల్చులాఘవ మ ♦ దెంతయు నిష్టము లేక యున్నఁ బ్ర
శ్న మ్మొనరింప మంచు నను ♦ జాల బలాత్కరణం బొనర్చెడిన్. 300

కలుగఁగఁ జేయు ధైర్యమును ♦ గాతరచిత్తులకున్ బ్రభుప్రసా
దలవము నొక్కచో నునికిఁ ♦ దద్దయు నల్పుడు నైనఁ గూర్చు నీ
యిలఁ జనవున్ మహత్తరము; ♦ నించుకయైన సపర్య గొంటయున్
గలుగఁగఁ జేయు స్నేహమును ♦ గావున నే నడుగం గడంగితిన్. 301

మిముఁ గనుఁగొన్న దాదిగను ♦ మేదుర మా కుతుకంబు దీన నా
కమితము; నాతిఖేదకర♦మైన వచించి యనుగ్రహింపుమా
యమలచరిత్ర! నీదునుద♦యంబునఁ బావన మయ్యె నేకులం
బమరఋషీశ్వరాన్వయమొ ♦ యచ్చరవంశమొ యక్షవంశమో. 302

నవసుమకోమలం బయిన♦నవ్యవయస్సున నేల పూని తీ
యవిదితకారణవ్రతము ♦ నచ్చెరు వయ్యెడి; నేడ యీవయ
స్సు? వినుతరూప మేడ? గడు ♦ శోభిలు నిత్తనుకాంతి యేడ? నీ
యవినమనేంద్రియంబులను ♦ నాఁగుట యెక్కడ? పుణ్యరాశిరో!. 303

ఉ. పెక్కులు సిద్ధసాధ్యపరి♦వేష్టితనిర్జరలోకసాధ్యముల్
చిక్కుచు నుండ దివ్యముని♦సేవితపర్ణగృహంబు లెల్లచో
నిక్కడ నిర్మనుష్యవని ♦ నేల వసించెద వొక్కదానవే
యక్కట యుల్లభూతముల ♦ నైదిటఁ జేసిన దేహ మీఁగతిన్. 804

ఉ. తెల్లగ నుండునీవిధ మ♦దృష్టము నశ్రుత మమ్మ! మున్ను మా
కుల్లముతత్తరం బణఁపు ♦ మొప్పుగ సర్వము చెప్పుమా యటం
చల్లన వేఁడ నానరవ♦రాత్మజుఁ డంతట నామె యేమి తా
నుల్లమునం దలంచుకొను ♦ చూరక యుండి యొకింత సేపటే. 805

సీ. అంతర్గతం బగు♦నాత్మశుద్ధిని గొంచువచ్చుచున్నవో యన ♦ నచ్ఛపడఁగఁ
బరఁగునింద్రియముల♦పావనత్వం బెల్లఁగురియుచున్నవో యనఁ♦గొమరుమిగులఁ
బరమతపోరాశి♦వరరసనిష్యందమును గార్చుచున్నవో ♦ యనఁగ నెదుట
నగపడుధవళిమ ♦ నంతయుఁ గరఁగించి పారించుచున్నవో ♦ ధారుణి ననఁ

తే. గడు వళితుంబులై మించి ♦ గండపాళిఁ
దొట్రిలఁగ విశీర్ణములయి ♦ దొరఁగు చున్న
ముత్తియంబుల కెనయయి ♦ మొనసి వల్క
లావృతకుచాగ్రసీమల♦యందుఁ బడుచు. 806

తే. చింది తుంపరలై బద్ధ♦బిందువులయి, కాల్వలై పారనశ్రువుల్♦గన్నుఁగవను
మూసి తలవాంచి నిశ్శబ్ద♦ముగను నేడ్వ, సాగె నచ్చెరువందంగ ♦ క్ష్మాతలేశ!

ఉ. ఆగతి నేడ్చు చున్ననళి♦నాక్షిఁ గనుంగొని రాసుతుండు వే
వేగఁ దలంచె నిట్లు పృథి♦వీవర! దుఃఖము లాఁపరాదు గా
లోఁగొనె నప్రధృష్యము న♦లోలమునై తగు నీదృగాకృతిన్
ఆఁగఁగ రాదు ప్రాణులకు ♦ నాపదలన్ బయివచ్చు నేగతిన్. 808

ఉ. నామది నొందుకౌతుకము ♦ నాటుకొనెన్ గని దీనిబాష్పముల్
భూమిని నిట్టియాకృతు ల♦భూములు గాఁ గొన నల్పదుఃఖముల్
భూమి యిసుంతసిద్ధునకుఁ ♦ బోలఁ జలించునె యెందు వేడ్కలో
నాముకొనెన్ బ్రవృద్ధమయి; ♦ యామెకు శోకములన్ దలంపునన్. 809

ఉ. పారఁగఁ జేసి యూరకయె ♦ పాపముఁ గంటి నటంచు దోషిగా
నారసి తన్ను లేచి చని ♦ యంజలిఁ బ్రస్రవణోదకంబులన్
దా రయ మారఁ దెచ్చి ముఖ♦ధావనమున్ దయసేయు మంచు భూ
దారసుతుండు నామెను సు♦దారవినీతిని వేఁడ వేఁడినన్. 810

ఉ. ఆమెయుఁ దన్నిరోధమున♦నశ్రుజలంబులు ధారలై సదా
యామునొనంగ నించుక క♦షాయితమధ్యములై చెలంగుకం
దామరసమ్ములం గడిగి ♦ దాఁ దడియొత్తియుఁ జీరచెంగుచే
నామనుజేశసూనునకు ♦ నల్లన నిట్లని వెచ్చ నూర్చుచున్. 311

చ. *నృపసుత! మందభాగ్య నటు ♦ నిర్ఘృణచిత్తను బాప నేఁ గదున్
వ్యపగతపుణ్య నాదు జన♦నంబు మొదల్కొని యాలకింపఁగా
నువమ యొనర్పఁగాఁ గనఁగ ♦ నోఁపఁగఁ జాలనిమద్విరాగతా
లవనము వింటచేఁ గలుగు♦లాభ మదేమి వచింతు నైననున్. 312

క. కనులాభ మేమి యైనను, వినుము మహాకౌతుకంబు ♦ వెలసిన నీకున్
వినుపింతు ననుచుఁ జెప్పం, గనుదోణఁగెను నామె యతఁడు♦ కాంతుఁ వినంగన్.

మాలిని. శ్రితజనసురభూజా! ♦ చిన్మయానంతతేజా!
నుతదివిజబిడౌజా! ♦ నూతనోద్యన్మహౌజా!
గతదురితవితానా! ♦ ఖండితారాతిమానా!
ధృతవృషభవిమానా! ♦ ద్వీపిచర్మావధానా!. 314

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవితావైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్రియంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైనశృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

* పాఠాంతరము. క. ఇనసుత! యతినిర్దయచి
త్తను బాపిని మందభాగ్యఁ ♦ దద్దయు నష్ట
జ్జనసం బాది విరాగత
గనిన యుదంతంబు వినను ♦ గర్హ్యము వినినన్.

శ్రీః.

శ్రీరామ స్సహాయోఽస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగారకాదంబరి

## పూర్వభాగము.

### పంచమాశ్వాసము.



రమణవినుతమహిమో
దార! నిరాహారమాని♦ధారితగరిమా!
దారితమాయామహిమా!
దూరీకృతభక్తలఘిమ! ♦ దూషితకామా!. 1

వ. దేవా! యవ్వలికథావృత్తాంతంబు చెప్పెద దయాయత్తమతి నవధరింపుము. అట్లా మహాశ్వేత స్వవృత్తాంతము నివేదింపఁ దొడంగి యాచంద్రాపీడుం గాంచి యిట్లనియె. 2

చంద్రాపీడునకు మహాశ్వేత తనవృత్తాంతముఁ జెప్పుట.

ఆ. అవనినాథతనయ! ♦ యమరలోకంబున, నప్సరస లనంగ ♦ నలరుస్త్రీలు
కల రటంచు శుభముఁ♦గాంక్షించునీచెవిఁ, బడియెయుండుఁ దలఁచుఁ♦బల్కనేల.
తే. వారికులములుపదునాల్గు;♦వనజయోని, మనసువలననునొక్కటి♦జననమొందె
సంభవించెను నొక్కటి♦శ్వసనువలన;, నందెనొక్కటియుదయంబు♦నగ్నివలన.
ఆ. ఆగమంబువలన ♦ నావిర్భవించెను, నొకటి; యుద్భవించె ♦ నుదకములను
నింక నొకటి; పుట్టె ♦ నినకిరణంబుల, మఱియు నొకటి;మథ్య♦మానసుధను.
తే. కలిగె నొక్కటి; శశిమయూ♦ఖములవలనఁ
బుట్టె నింకను నొక్కటి; ♦ భూమివలనఁ
బ్రభవ మందెను నొకటి, శం♦పాలతలను
మఱియు నొక్కటి జనియించె ♦ మాన్యచరిత!. 6

సీ. కలిగించె మిత్తి యొ♦క్కండు మన్మథుఁ డొండువంశంబు గలిగించె♦వసుధలోన
దక్షప్రజాపతి♦తనుజాత లిద్దఱు ముని యరిష్టయు నన ♦ ముద్దుసుతలు

గలరు వారికి మఱి ♦ గల్గె గంధర్వులయందుఁ గులద్వయ ♦ మలరె నిట్లు
పదునాల్గు కులములు ♦ పరఁగె నాగంధర్వకులములు రెండయి ♦ కువలయమున

తే. నందు మునిసుతు లావదు♦నార్వురందుఁ
జిత్త్రరథుఁ డొక్కరుఁడు; వాఁడు ♦ మిత్త్రతేజుఁ
డఖిలభువనత్రయఖ్యాతి♦యశుఁడు మఱియు
సకలగంధర్వులకుఁ బతి ♦ శౌర్యవసతి. 7

చ. దివిజులు సర్వులున్ దనదు♦దివ్యపదాబ్జములన్ శిరంబులన్
దవిలిచి మ్రొక్కుచుం గొలువఁ ♦ దద్దయు నాకము నేలుచుండు వా
సవుఁడు తదీయమిత్త్రుఁ డఁట ♦ చాలదె తన్మహిమంబు నెన్న శై
శవముననే గడించెను ని♦శాతశరానఁ గులాధిపత్యమున్. 8

చ. ఇచటికి సుంతదూరమున ♦ నింపెసలారెడు భారతాఖ్యస
ద్రుచిరసువర్ష మావలను ♦ దోఁచును దద్దిశయందుఁ జూడు భూ
శచివరపుత్త్ర! కింపురుష♦శబ్దితవర్షమునందుఁ బొల్చు నొం
డచలము హేమకూట మను ♦ నాఖ్యను వర్షగిరీంద్ర ముర్వరన్. 9

తే. అదె నివాసంబు నతనికి; నందె పెక్కు, వేలగంధర్వులువసింత్రు ♦ వేడ్కఁ దద్భు
జాభిరక్షితులగువార ♦ లతఁడె దీనిఁ, జైత్త్రరథమనువనమును ♦ సలిపెఁగనుమ.

తే. అతఁడె త్రవ్వించె నచ్ఛోద ♦ మను సరస్సు
నతఁడె కట్టించె నీశివు♦నాలయమును
నలయరిష్టకు నాత్మజు ♦ లార్వురందు
హంసుఁ డనునాతఁ డగ్రజుఁ ♦ డతులయశుఁడు. 11

తే. వాని రెండవగంధర్వ♦వంశమునకుఁ, జిన్ననాటనె నధిపతిఁ ♦ జేసెఁ జిత్త్ర
రథుఁడు గంధర్వనాథుఁడు♦రహిని నతని, శతనివారల కాగిరి ♦ యాలయంబు.

సీ. చంద్రగభస్తుల♦సంజాత మైనయాయప్సరఃకులమున ♦ నవతరించి
యఖిలలోకంబుల ♦ కభిరామయై మించి కరజలానుసరణ♦గళితమైన
చంద్రకళాజాల♦సకలలావణ్యంబుచే నిర్మిత యనంగఁ ♦ జెలువుఁ గాంచి
గౌరిసమాఖ్యను ♦ గాంచి రెండవగౌరి యనఁ దగు శశికర♦ణావదాత

తే. కన్యను ద్వితీయగంధర్వ♦గణవిభుండు
హంసుఁ డనువాఁడు పరిణయ♦మాడె దుగ్ధ
వార్ధి మందాకినిని బోలెఁ ♦ బార్థివసుత!
యనుగుణసమాగమంబున ♦ నలరె నదియు. 13

తే. మదనుతోడి రతీదేవి • మాడ్కి శరద
తోడి కమలిని బోలె నా • తోయజాక్షి
యతనితోఁ గూడి యలరుచు • నధికముదము
గాంచి యతనికిఁ బట్టంపుఁ • గాంత యయ్యె. 14

క. అట్టిమహాత్ముల కడుపునఁ, బుట్టితి నిటువంటిపుణ్య • మూర్తిని వ్యథకే
పట్టయి పలుదుఃఖములకుఁ, గట్టా! యొక్కతెన నేను • గతలక్షణనై. 15

క. జనకుం డనపత్యుఁడు గా, ఘన నాజన్మమును సుతుని • పుట్టువుకంటెన్
గొనియాడు చధికవిభవం, బున మిక్కిలి యుత్సవములఁ • బోల నొనర్చెన్.

క. పదవదినం బరుదెంచుడుఁ, బొదలి యథావిధిని సమయ • పున్సద్విధులన్
వదలక యొనర్చె నర్థము, గదుర మహాశ్వేతనామ • కరణ మొనర్చెన్. 17

క. *ఆనేను జనకునింటను, వీణగతిన్ మధురఫణితి • వెలయఁగ గంధ
ర్వానీకము లంకంబుల, నూనఁ దమిన్ మార్చి మార్చి • యుంటిఁ జెలుతనై.

క. శోకము నాయాసంబును, నా కెట్టివొ తెలియకుండ • నాన్న పెనుప న
స్తోకస్నేహరసంబున, జోకటు శైశవము గడచె • సుఖముగ నంతన్. 19

క. ఆమని మధుమాసముక్రియ, నామధువునఁ జిగురువోలె • నం దళివోలెన్
ఆమధుపమందు మదమటు, నామేనను నడుగుపెట్టె • నవయౌవనమున్. 20

వసంతఋతువర్ణనము.

సీ. కోమలసహకార • కోరకచయకృత కాముకోత్కలికావి • కాసితములు
మదకల కామినీ • వదనసీధునిషేక పులకితవకుళద్రు • భూషితములు
కంకేళితాడన • క్వణితమనోహరమణినూపురారావ • నినదితములు
మధుపకులకళంక • మలినీకృతోజ్జ్వలకాలేయకసుమోరు • జాలకములు

ఆ. జృంభమాణనూత • నాంభోజవనములు, మలయపవనచలిత • మదనకేత
నాంశుకములు నిర్భ • రానందమధుమాస, దినము లలరె నంతఁ • దేజరిలుచు.

క. రతిరసజలనిధిపూరము, వితతంబయి పొంగి పొరలి • విశ్వంబును బ్లా
వితముగఁ జేసెను క్ష్మాపతి, సుత! యమ్మధుమాసమందుఁ • జొక్కఁగ జనముల్.

సీ. అవనీతలం బెల్ల • నవిరళసుమధూళిసికతావదాతమై • చెలువుఁ గాంచె
దిక్కు లెప్పుడు పడు • తీవ్రకామేషునూత్కృతులచేత బధిరీ • కృతము లయ్యెఁ

---

* పాఠాంతరము. క. నే నుంటి జనకునింటను, వీణగతిన్ మధురఫణితి వెలయఁగ గంధ
ర్వానీకము లంకంబుల, నూనఁగ నొక్కర్తు మార్చి యొకతె చెలులై.

బగలె వీథులు పంచ♦బాణరాగాంధాభిసారికాసంబాధ♦శాల లయ్యె
వల్లరుల్ మధుమదా♦వశము లై నద్విరేఫపాళిక లూఁగ నూ♦య్యాల లయ్యె

తే. దారులెల్లఁ బ్రోషిత♦దారజీవ
హారణసంప్రాప్తమదనస♦మాస్ఫుటితశ
రాసనారావభయవిదీ♦ర్ణపథికజన
హృదయరుధిరార్ద్రితము లయ్యె ♦ నెలమి నందు. 23

క. విరిసిన మొగ్గలవాసన, కరుదెంచిన మధుపకులము ♦ లన్నియు నొకచోఁ
బరఁగుచుగుములై వ్రాయఁగఁ, గరముమనోహరము లగుచుఁ♦గ్రాలెను పూవుల్.

క. విచికిలపల్లవలవలీ, ప్రచయములను డాఁగి మత్త♦పరభృతములు త్రా
గి చిలుకరించిన సుమరస, రుచిరాసారములు గప్పె ♦ రోదోంతరముల్. 25

క. అల మధుమాసదినంబుల, జలకమునకు నేను జనని♦చనుదెంచితి మీ
లలితాచ్ఛోదం బనియెడు, కొలనికి నుత్ఫుల్లనళిన♦కుముదంబునకున్. 26

తే. అచట స్నానార్థ మరుదెంచి♦నట్టి గౌరి
వ్రాసిన తటశిలాతల♦భాసమాన
సగణశివచిత్రములఁ బాంసు♦సన్నిమగ్న
కృశపదాభ్యాహ్యమునిజన♦కృతవినతుల. 27

వ. కని నమస్కరింపుచు. 28

సీ. మధుకరభరనమ్ర♦మంజులసుమగుచ్ఛరమ్యకుంజం బిది ♦ రమణి! గనుము
మదశిఖిధ్వనిభీత♦మారుతాశనముక్తచందనావళి యిది ♦ చాన! చూడు
పికవిదారితకోర♦కకులస్రవన్మధుసిక్తచూతం బిది ♦ చెలియ! యిదిగొ
సుమపరాగనిమగ్న♦సుమరాళపదరమ్య తీరతలం బిది ♦ తెరవ! యిదిగొ

తే. వికచసుమపుంజపాతని♦వేదితవన
దేవతాందోళనాంచిత♦దివ్యలతిక
డోల యిది చూడు మని సఖు ♦ లోలిఁ దెలుపఁ
గనుచు మలఁగుచు నిటు నటుఁ ♦ గాంచనుండ. 29

చ. వికసితమై వనంబు గడు ♦ వెల్గుచు నున్నను సౌరభాంతర
మ్ము కదియనీక తుమ్మెదలు ♦ మొత్తములై మును నే నటంచుఁ బా
యక చనుదేర వెంటఁ; దని♦ ముంగను నిండఁగఁ జేయుచున్ వినూ
ణిక; నరుదెంచెఁ బో పవన♦నీతము పుష్పసుగంధ మొక్కెడన్. 30

క. మనుజేశతనయ! తద్వా, సన నే మని పొగడుదాన ♦ సన్నుతమును దా
నవరభువనోచితంబును, ననుసమమును మఱియు ము న్న♦నాఘ్రాతంబుల్. 31

తే. దాని మూర్కొని యొక్కింత♦తడవు కనులు
మూసికొని హాయి గని యీయ♦పూర్వగంధ
మెక్కడి దటంచుఁ గౌతుకం ♦ బక్కజింపఁ
బోయితి నొకింతదవ్వుఁ గొం♦పోవ నదియ. 32

— మునికుమారవర్ణనము. —

చ. చని కనుఁగొంటి నొక్కముని♦చంద్రసుతున్ హరనేత్రవహ్ని కిం
ధన మయినన్ సుమాయుధుఁడు ♦ తద్వ్యసనంబున మానివృత్తి చే
కొనినవసంతుఁడో యనఁగఁ ♦ గోర్కులు నించెడు నాని నీశ్వరున్
దనవశుఁ జేయ నేమమును ♦ దాల్చినకాముని బోలువానినిన్. 33

తే. ఏమి చెప్పుదు నాతఁ డా♦యిందుమౌళి
యాదల వసించు శశి తాను ♦ నఖిలమండ
లంబు గొనువేడ్కఁ దాపస♦లక్షణమును
దాల్చి చరియించు నిల ననఁ ♦ దనరుచుండు. 34

చ. ప్రచలతటిల్లతారచిత♦పంజరమధ్యగతుండొ; యగ్నికీ
లచయవలగ్నగుండొ; యవి♦లక్ష్యతపార్కుని మధ్యగుండొ నా
రుచిరమహౌజసుం డగుట ♦ గూఢిగఁ దోఁచును నాతఁ డున్మిష
త్ప్రచురకడారదేహరుచి ♦ భర్మమయంబుగఁ జేయు చవ్వనిన్. 35

ఆ. తత్పిశంగజటయుఁ ♦ దనకు గోరోచనా
రసవిలులితమైన ♦ రమ్యహస్త
సూత్రసన్నిభ మయి ♦ చూడ్కులఁ దనుపుచుఁ
గోమలంబు నగుచుఁ ♦ గొమరు మిగిలి. 36

తే. అతనిలలాటపట్టిక♦యందు మెఱయు, భస్మరేఖలు భారతీ♦భామఁ బొందఁ
గోరి యుత్కంఠ నిడినట్టి ♦ సారగంధ, సార రేఖలు నానొప్పెఁ♦జారుమూర్తి!.

తే. పెక్కుశాపంబు లొసఁగెడు♦వేళఁ బుట్టు
బొమ్మముడియింటివాకిటఁ ♦ బొల్చుచుండు
తోరణం బనఁ గనుబొమ♦దోయి తోఁచు
నలరువిల్తునివిండ్లు నా ♦ నతని కధిప!. 38

తే. పాదవగుచుఁ గడుమించునా♦మునికుమారు,ప్రేక్షణావళి నంగ్రథి♦తాబ్జమాల
యనఁగ నొప్పును; జంకెల♦కతఁడె తనదు, నేత్రశోభను బంచిచ్చె♦నృపకుమార!.

తే. అలరు నాతనిఘ్రాణంబు ♦ నాయతంబు, నెత్తునై వంశదండంబు♦ నెనసి మోవి
లేఁతజవ్వన మరుగంగ♦లేక లోని, కచటనిలిచెనొయనఁగడు♦నరుణ మగుచు.

తే. మీసములు రానియాతని ♦ మించు మోము
భ్రమరపంక్తులు గ్రమ్మని♦బాలకమల
మునకు నెన యయి పొలుచుచు ♦ ముద్దులొలుకు
చుండె లావణ్యపూరంబు ♦ నిండి చెలఁగ. 41

క. మరువింటి యల్లెత్రా డన, నరుదయి తప మనెడు చెర్వ♦నందలి నళినీ
వరబిసతంతు వనఁగ భా,సుర మగుఁ గుండలితబ్రహ్మ♦సూత్ర మతనికిన్. 42

తే. అఖిలవిద్యాపగలు చేరు♦నట్టిచోటఁ
బొలుచు నావర్త మనఁగను ♦ బొలుచు నతని
నాభిముద్రిక; రోమాళి ♦ నవ్య మగుచు
మోహాతమ మేగుపదవి నాఁ ♦ బొల్చు బొజ్జ. 43

సీ. ఒకకేలఁ దొడిమతో ♦ నుండెడుపొగడకాయకు జోడునీడయై ♦ యలరుకుండి
యొకకేలఁ బ్రియనాళ♦వికలితరతిబాష్పజలబిందుతతిఁ బోలు♦స్ఫటికమాల
మొలఁదుండు నిజతేజ♦మునను సూర్యుని గెల్చి కొన్న గాలిగుడుఁ నా♦నున్న మౌంజి
జరఠచకోరలో♦చనపుటపాటలభాసురకల్కక♦వల్కలంబు

తే. తనర,ధర్మంబు తారుణ్య♦మనఁగఁ,బల్కు,,సతివిలాసంబు నాఁ;బ్రహ్మ♦చర్యభూష
ణంబు నాఁ;సర్వవిద్యల♦నాథుఁ డనఁగ, నలరు నాతపస్వితనయుఁ ♦ డమలచరిత!.

వ. వెండియు. 45

తే. చనును సాహాధుఁడై గ్రీష్మ♦సమయముగతి
వికసితప్రియంగుమంజరీ♦విశదుఁ డగుచు
హిమసమయకాననం బన ♦ నెలమిఁ బొల్చు
సకలశాస్త్రసంకేతిత♦స్థల మతండు. 46

క. తనయీడువాఁడు తనకను, గుణుఁడును నగుమునికుమార♦కుం డొక్కఁడు తోఁ
జనుదేర దేవతార్చన,మునకుం గావలయు పుష్ప ♦ ములను జిదుముచున్. 47

క. స్నానార్థం బాసరసికి, మానిత మగు నొక్కకుసుమ♦మంజరి చెవిచుం
డూని చనుదెంచె నాతఁడు, భూనాథతనూజ! యపర♦పుష్పశరుఁడు నాన్. 48

సీ. ఆమునిఁ గనుఁగొని ♦ యలరుకాననలక్ష్మి మందహాసప్రభా♦బృంద మనఁగ
మధుమాస మభినవ♦ములయుసమీరుష్టిఁ జల్లఁ గడఁగుసుమాం♦జలియనంగ
రతిపరిశ్రమఖిన్న♦రతిదేవిఘర్మాంబుకణజాలకానళీ♦గణ మనంగఁ
బంచబాణమదేభ♦వైజయంతికచిహ్నవికచచామరము పిం♦ఛ్ఛిక యనంగ
తే. సుమరమాదేవియా వన♦శోభ యనఁగఁ
బొలుచు నాసుమమంజరి ♦ చిలుకు చమృత
బిందువులఁ గృత్తికాకార♦కందుకమును
బోలి పూర్వ మదృష్ట మై ♦ భూపతనయ!. 49

తే. అన్యసుమసౌరభం బెల్ల ♦ నణఁచివైచి,యలరునీసౌరభముదీని♦ననుచుమదిని
నిశ్చయము చేసి తన్మునినేత్ర యువను,జూచుచటెనేను దలపోయఁ♦జొచ్చితినిటు.

తే. పద్మయోనిసురూపని♦ష్పాదనోప, కరణభాండార మది యెంత♦కలదొ యపుర
తముఁగ దెంత వెచ్చించినఁ ♦ దలిరువిల్తుఁ, ద్రిభువనాద్భుతరూపుసు♦ తేజుఁ జేసి.

తే. అతనికంటెను మిన్నయై ♦ యందములకు, నాకరంబయి చెలువొందు♦నట్టి వీని
నవరమన్మథు మానిమా♦యాసుయాత్ముఁ, జేసెఁ బద్మజుఁ డాతని♦సృష్టి యార.

మ. జగదానందకరుం సుశీతలకరుం ♦ జంద్రుం మహాలక్ష్మికే
ళిగృహాంభోజములం సృజింపఁ దొలి హా♦లిం నీనివక్త్రాబ్జముం
దగ నిర్మించియె కౌశలాభ్యసనముం ♦ దా నట్లు నిర్మింప ధా
త గడుం జేసెను దుల్యవస్తువుల సం♦దర్భించునే యారకే?. 53

ఉ. శ్యామలపక్షశీతకరు ♦ సర్వకళల్ నవి తా సుషుమ్ననా
మామలరశ్మిఁ ద్రాగు నని ♦ యాడు టబద్ధమ యవ్వి యన్నియుం
ఈమహనీయు దేహమును ♦ నిమ్ముగఁ జొచ్చెను గాక యీమహో
గ్రామతపః ప్రవిష్టమునిఁ ♦ దార్కొను నేగతి నిట్టికాంతి పో. 54

మహాశ్వేతామదనావస్థావర్ణనము.

చ అని తలపోయు చుండఁగ న ♦ యాత్మను బుష్పశరుండు నూత్నయౌ
వనసులభుండుఁ బుణ్యమును ♦ బాపముఁ జూడనిరూపపక్షపా
తి నను వశంబుఁ జేసికొనెఁ ♦ దేకువ నూడ్చి మధువ్రతిం బలెం
ననమద, మేమి చెప్పుదును ♦ నాగతి పిమ్మట రెప్పవేయకే. 55

సీ. వశనైతి నీ కని ♦ వచియించుదాని చందమునఁ బ్రాణముచేయు♦దానివగిది
నెదురుగా హృదయంబు♦నిచ్చెడుదానిచందమునలోఁజొఱఁబడు♦దానిమాడ్కిఁ

దన్మయత్వముఁ జెందఁ ♦ దలఁచెడిదానిచందమున నేమో యుద్గు♦దానిభంగి
మరుఁడు నన్ బాధించు♦మనుచు మటంచు నుత్తరణుఁజొచ్చెడిదాని♦చందమునను

తే. ముడిచి పక్ష్మంబులించుక♦మొనసియూర్పు, రెప్పవాల్పంగ మఱచి నేఁ♦దప్పకట్టె
వక్రచంచలతారకళ♦బలితగర్భ, మైనవలకంటఁ జిరకాల ♦ మతనిఁ గంటి. 56

ఆ. కులకుమారికలకుఁ ♦ గూడని పని యిది, సిగ్గు పోవుఁ గన్న ♦ నెగ్గు గదురు
నెట్టిపని యొనర్ప♦ నేఁ దొడంగితి నని, తెలిసి యుండియు మదిఁ ♦ ద్రిప్పలేక.

ఆ. నిలువఁబడితి నకట ♦ నిశ్చలాంవయున నై, మ్రానుపడినదాని♦మాడ్కిఁ జిత్ర
గతనుబోలె ఖచిత♦గతిని సంయుతమూడ్కిఁ, బట్టుకొన్నయట్లు♦పరఁగ నెవరొ.

క. అప్పటినావ్యామోహము, చెప్పఁగ రా దకథితము న♦శిక్షితమును దా
నొప్పు స్వసంవేద్యం బై, ద్రిప్పఁగ రా దయ్యె మనసు ♦ దివ్యచరిత్రా!. 59

ఉ. ఆతనిరూపసంపద యొ ♦ యాతనిపైఁ గలనాదుకూర్మి యో
నూతనయౌవనం బొ మద♦నుం డొ మ తేది యొ నామనం బొ న
న్నాతతి న ట్లొనర్చినది ♦ యక్కట నేను నెఱుంగ నూరకే
యాతనిఁ గాంచుచుంటి మది ♦ నన్య మెఱుంగక యేమి యాయెనో. 60

వ. అంత. 61

సీ. మది నెడ మొనఁగ నా♦మదనుండు గల్పింప వెడలె నిట్టూర్పులు♦నిడుద లగుచు
నెద సాభిలాషమం ♦ చెఱఁగింపఁ దలఁచె నాఁజలితముఖంబయ్యెఁ♦జన్నుదోయి
ఘర్మాంబులవరేఖఁ♦గడిగినపగిదిని జాఱెను లజ్జయు ♦ సకల మెటకొ
స్మరుఁ డేసెడునిశాత ♦ శరపరంపరలకు భయపడె నా మేను ♦ వణఁక సాగె

తే. నతనిరూపంబు గనువేడ్క ♦ ననఁగ నడరెఁ
బులక లాలింగన మొనర్పఁ ♦ జెలఁగు నంగ
ములను; రాగం బశేషంబుఁ ♦ బొందె నెదను
స్వేదధాత మై యంఘ్రిల ♦ వీడి నాఁగ. 62

తే. అంత ననుగాంటి నిట్లని ♦ యాత్మయందు
సురతవృత్తాంత మెఱుఁగని ♦ పరమశాంతుఁ
డితని వలపించి నన్నెంత ♦ వెతలఁ గుడిపె
స్మరుఁ డనార్యుండు ననుచితా♦చారుఁ డకట. 63

తే. పడఁతు లతిమూఢహృదయులు ♦ వలపు నిలుపఁ
దగినచోటు లెఱుంగరు ♦ తపములకును

దేజములకును ధామ మై ♦ తేజరిల్లు
నీకుఁ డెక్కడ మరుచేష్ట ♦ లేడ తలఁప 64

తే. పామరులు వాని శ్లాఘింత్రు ♦ పాపమతులు
తలిరువిల్తుని త్రిప్పులఁ ♦ దవిలి నలఁగు
నన్నుఁ గనుఁగొని మదిలోన ♦ నవ్వుకొనును
దప్పు కీతండు కార్యంబు ♦ తప్పఁ దప్పు. 65

తే. చిత్ర మయ్యెడి నెఱిఁగియుఁ ♦ జిత్తజన్ముఁ
చెయ్వులను నేను వానికిఁ ♦ జిక్కి పెక్కు
వికృతులకు నెల్ల గుఱినైతి ♦ వీని మాన్పఁ
జాలకున్నాను నీగతిఁ ♦ జాలిఁ గనుచు. 66

ఉ.* ఏ నొక దానఁ గాను భువి ♦ నీగతి నైనది యన్యకన్యలుం
బోనిడి సిగ్గు భర్తలను ♦ బొందిరి కొందఱు తాము; యన్య లీ
నూనశరుండు దుర్జనుఁడు ♦ నూనరి పెట్టెడు పెక్కు బాధలం
బూని సహించి; రీగతిని ♦ బొక్కరు నెవ్వరు గాంచినంత నే? 67

చ. అరనిముసంబు గాంచితిని ♦ నంతనె మానస మస్వతంత్ర మై
పరఁగె; గుణంబు వేళయును ♦ బంచశిలీముఖు దుర్నివారితుం
గర మొనరించు; మత్కుసుమ♦కాండవిచేష్టితలాఘవంబు వీఁ
దరయుకమున్న పోవుటయు ♦ యర్హము శ్రేయము వీడి యిచ్చుటుం. 68

క. అనభిమతానంగజవికృతిని, గని కుపితుం డయి యితండు ♦ గాంచక శాపం
బునకు న్నను గుఱిసేయును, మునిప్రకృతి యదూరకోప♦ము గద తలంపం.

క. అని నిశ్చయించి యుపస,ర్పణకుతుకిని నగుచు జగతి ♦ బాడబులు మహా
జనవంద్యులు; వీరలద,ర్శన మఘహారణము; నిరాద♦రము తగ దంచుం. 70

సీ. తద్వదనంబుపైఁ ♦ దనరుచూడ్కుల లాగి కనుదోయిపత్త్రముల్ ♦ గదలనీక
జాతి చెక్కిళ్లపై ♦ జీరాడు శ్రుతిసుమమంజరు లొక్కింత ♦ మలఁచి పైకిఁ
జపలకుంతలలతా♦జాలంబుపై నొప్పు కుసుమావతంసంబు ♦ కొమరు మిగుల
మణికుండలంబులు ♦ మఱియు నంసంబుల డోలాయితంబులై ♦ గ్రాలుచుండ

---

*పాఠాంతరము. చ. కల రితరాంగనల్ భువిన్ని♦జగాంతులఁ బొందినవారు సిగ్గుఁబోఁ
దొలఁచి, వెలందు లన్యులను ♦ దుర్జనమారనిశాతహేతులం
గలఁగినవారలుం గలరు; ♦ గల్గరు మాదృశ లెందు నైన పో
తలఁపఁగ నిట్టు లైతి నల♦తాపసిఁ గంటినొ లేదొ యక్కటా!.

తే. ననభివీక్షితభూతల • నగుచు సంకు
చితశరీర నగుచు సము•చితవినీతిఁ
జకితచకిత నగుచు మది • సంచలింప
మ్రొక్కితిని నేను నామును•పుత్రునకును. 71

వ. మ్రొక్కుటయు. 72

సీ. అవిలంఘ్యశాసనుం • డప్పుడను నంగజుం డతిరమ్య మగుటను•నాప్రదేశ
మవినయబహుళమై • యలరుట నెలప్రాయ మతిచంచలం బౌట•నాత్మవృత్తి
దుర్నివారము లౌట•దుర్విషయాభిలాషలు నింద్రియములుచం•చలములౌట
నయ్యయివస్తువు • లట్టులౌఁదగియుంటమదదమై యామని • పొదలుచుంటఁ

ఆ. బెక్కు లేల యిట్టి•యిక్కట్టులను వాని,ఫాలమందు బ్రహ్మ • వ్రాసియుంట
నాయదృష్ట మిటు ల•నాథమై యుంటను, వాఁడుగూడ మదను•వలలఁబడియె.

తే. పవనహతమైనదీపంబు•పగిది వాని, ధైర్య మెల్ల మద్వీక్షితిని•దర్శనమునఁ
దరళితం బయ్యె నంతనా•తపసిమేను, కంచుకితమాయె రోమాంచ•కంటకముల.

తే. మత్సమీపంబునకు వచ్చు•మనసునకును
దారిఁ జూపంగ నా ముందుఁ • దరలె నూర్పు
లతమాలయుఁ గరగత • మదరె బతిము
చెదుట భీతిల్లి నా మేనుఁ • జేరె వణఁకు. 75

క. స్వేదాంబుశీకరావళి, ప్రాదుర్భవ మందె గండ•పాళిని శ్రవణా
పాదితసుమగుచ్ఛం బౌరఁ, దాదృతమయ్యెనొ యనంగ • నలర నృపసుతా!.

క. ననుఁ గాంచు వేడ్కఁ దెఱచిన, కనుఁగవ యుత్తానతార•కం బాదేశ
మ్మును బుండరీకమయముగఁ, గనఁబఱచుచుఁ జెలఁగె మిగుల•క్ష్మాపతిపుత్రా!.

క. ప్రసరత్తదక్షికాంతుల, విసరం బచ్ఛోదజలము • విడిచియు వడి నా
కసమున కుత్పతితం బై, వెస వచ్చెడుకువలవనము•విధిని యదృచ్ఛన్. 78

క. పదిదెసల నాక్రమించెను, బొదలుచుఁ దత్ప్రకటవిక్రుతిఁ • బొడగని ద్విగుణ
స్మదనావేశను నై నేఁ, గుదు రై తిని ని ట్లవర్ణ్య•ఘోరదశలకున్. 79

క. సురతసమాగమనర్తన, వరలీలల నేర్ప నొజ్జ • పంచశరుండే
నరులకు నుపదేశించును, ధర నైకవిలాసములను • దద్దయుఁ బ్రీతిన్. 80

క. ఎన్నఁడు బహువిధరసయుత, సన్నుతముల నిట్టి విషయ•సంగతుల మదిన్
దిన్నఁగఁ బొనపనియితనికి, నెన్నఁగఁ నీదృగ్విలాస • మె ట్లలవడెనో. 81

చ. రతిరసమున్ స్రవించెడి నొ • రాల్చెడి నో సుధ నాఁ దనర్చె య
త్యతిమదమీలితం బనఁగ • నాగతి స్వాపజడంబు నాఁగ నీ
యతిసుతుదృష్టి యొప్పెడిని • హర్ష భరంబున మందతారకా
గతి యయి త్యక్తచంచలతఁ • గ్రాలెడి భ్రూలత గల్గి యెంతయున్. 82

క. కనులే చెప్పక చెప్పెడి, మనమునఁ గలకౌతుకంబు • మఱి మంజుగతిన్
గనఁ జాల నెచట నేర్చెనొ, ఘనన్నై పుణ్యంబు దీనిఁ • గమనీయంబున్. 83

క. అని నే ననుకొనుచు మదిన్, గని సమయము నొద్దకరిగి • గడు వినయమునన్
బ్రణుతి యొనరించి రెండవ, మునిబాలకుఁ దత్సహచరు • మొనసి యడిగితిన్.

క. ఎవఁ డీతాపసయువకుం, డెవనితనూజుండు నామ • మెయ్యది యే పే
రివిటపిసుమగుచ్ఛం బీ, యువకునిచెవి నుంచునది మ•హోజ్జ్వలకాంతిన్. 85

క. మనమున కమితానందము, నొనగూర్చెడి నాకు నిద్ది • యుర్వి నెపుడు మూ
ర్కొన నిట్టిసౌరభంబును, దనరు నసాధారణ మయి • తద్దపరువుచున్. 86

క. అన నాతం డించుక నగి, వనితా! యి ట్లడుగ నేమి • వచ్చును నీకై
నను గౌతుకమాయె నాకో, వినిపింతును విను మటంచు • వివరించెఁ దమిన్.

కపింజలుఁడు పుండరీకోత్పత్తిని జెప్పుట.

చ. కలఁడు త్రిలోకపూజితుఁడు • గాఢతపుండు నుదారకీర్తి ని
ర్మలమతి సిద్ధసాధ్యసుర•మానితపాదసరోరుహుండునున్
దులితసరోజయోనియు న•దోషుఁడు నిర్జరలోకవాసి ని
స్తులముని శ్వేతకేతుఁ డన • శోభిలుచుండు మనోజ్ఞరూపుఁ డై. 88

క. ఆమునిరూపు సురాసుర, భామలకుం మరలుగొల్పు • వజ్రిసుతునకున్
గామునకు నీసుఁ గొల్పును, భామిని! లోకాతిశాయి • భావింపంగన్. 89

మ. ఒకనాఁ డాతఁడు దేవతార్చనకుఁ దో • యోద్భవముల్ దేర దే
వకరీంద్రోరుమదోదబిందుచయసం•బద్ధోజ్జ్వలచ్చంద్రకో
దక మై సాంబశివాట్టహాససిత మై • దైవారు నాకాశగం
గకు నేతెంచి జలంబులందు దిగి తాఁ • గంజాతముల్ గోయుచోన్. 90

చ. కమలవనంబులం దెపుడు • గాఁపురముండెడు లక్ష్మి యొక్కస
ద్విమలసహస్రపత్త్రసిత•విస్ఫుటపంకజసింహపీఠికన్
బ్రమదమునన్ వసించి గనెఁ • బంకరుహంబులఁ గోయునాతనిన్
సుమశరుఁ డంత నామె మదిఁ • జొచ్చెను నేసెను బువ్వుటమ్ములన్. 91

చ. కనుఁగవఁ బ్రేమభారమునఁ ♦ గాఱు ముదశ్రులు వీచు లై యొకిం
త నమన మొందఁ జేసి యటు ♦ తారక లార్చుచుఁ జూడసాగె నా
మునివరునంద మే తమిని ♦ మున్నును మీఱెడునావులింతలఁ
గనఁబడనీక కేలునను ♦ గప్పుచుఁ జిత్తము తత్తరింపఁగాఁ. 92

తే. చూచినంతనె సౌరత♦సుఖముఁ గాంచి
యాసనీకృతతద్విశ♦దాబ్జముం దె
ధన్యురా లయి గని నొక్క♦తనయు నంత
శ్వేతకేతున గాంచెను ♦ బ్రీతి నతని. 93

తే. అతఁడు గొనిపోయి బాలుర ♦ కర్హమైన, క్రియల నెల్లసలిపిపుండ♦రీకమందుఁ
బొడముటను జేసి యతనికిఁ ♦ బుండరీకుఁ, డనుచుఁ బేరిడి పెంచెను ♦ నధికరక్తి.

తే. సకలవిద్యల నుత్తీర్ణ ♦ సలిపి మిగుల
బ్రహ్మచర్యాదివ్రతములఁ ♦ బరిణతునిఁగఁ
జేసె నాతఁడె యీతఁడు ♦ చెప్పెదు నీకఁ
గుసుమమంజరివృత్తంబు ♦ నెసఁగ వినుము. 95

క. సుర లసురులు క్షీరాబ్ధిని, తరువఁగ నటఁ బారిజాత♦తరువు వొడమె నా
తరుమంజరి యిది యీముని, వరుచెవి నెట్లెక్క నదియు♦వచియింతు నీకఁ

క. ఈదినము చతుర్దశి యని, యాదేవుని గౌప్యభూధ♦రావాసు నుమా
నాథునిఁ గొల్వఁగఁ బారం, బేదినభక్తిని నితండు ♦ నేనును రాఁగఁ. 97

వ. నందనవనోపమార్గంబున వచ్చుచుండ. 98

సీ. మధుమాసలక్ష్మి దా♦మమతఁ బ్రత్యక్షమై కై దండయొసఁగంగఁ♦గౌతుకమునఁ
గుసుమపల్లవములఁ♦గ్రుప్పంగఁబడి జానువుల వ్రేలుకంఠమా♦లలను దాల్చి
వకుళమాలికలచేఁ ♦ బచరింపఁబడినట్టి మొలనూలు కటిసీమఁ♦బొనరఁదొడిగి
క్రొమ్మావిచిగురాకు♦గుత్తిని జెవిగమ్మ చేసి పుష్పాసవం ♦ బానఁ ద్రావి

తే. మదముచే దూఁగియాడుచు ♦ మంజుగతిని
వచ్చె నీసుమమంజరిఁ ♦ బాణిఁ బూని
నందనోద్యానదేవత; ♦ వందనంబుఁ
జేసి యితనికిఁ గేల్మోడ్చి ♦ చెప్పె నిట్లు. 99

చ. మునివర! ముజ్జగంబులను ♦ మోహసముద్రమునందు ముంచునీ
యనుపమరూపసంపదకు ♦ నర్హతమం బగునీయలంకృతిఁ

గొనుమ యనుగ్రహింపు శ్రుతి♦కోటిని నుంచుము దీని నిట్టిభూ
షణ మిల దుర్లభంబు గదు♦సార్థము యీతెలిమ్రానిపుట్టువున్. 100

చ. అనుటయు నాత్మరూపమును ♦ నాగతి సంస్తుతి చేయుటన్ ద్రపా
వనమితవక్త్రుఁడై యతఁడు ♦ పాటన సేయక దాని వల్కలన్
జనఁగఁ దొణంగె; నామెయును ♦ జయ్యన మాబడి యేగు దేర నేఁ
గనుఁగొని దోష మేమి యిట ♦ గైకొను ప్రీతి నొసంగుదీవనిన్. 101

క. అని నేను దానిఁ గైకొని, కొన కున్నను గస్తి శ్రవణ♦కోటి నిడితి నీ
నన యెయ్యదేఁ డితఁ డో వ, చ్చను నేగతి వీనిచవికిఁ ♦ జెప్పితి నల్లన్. 102

క. అని చెప్పుచుండ నతఁ డా, మునియువకుం డించుక నగి ♦ ముదమున నాతో
ననె నిట్టు లేల యడిగెదు, గనె దేల ప్రయాస మంత♦కన్నసురభియేన్.

క. కొను మిదె యని తా డగ్గఱి, యునిచెను నాచెవిని దాని ♦ నుజ్జ్వలకలని
స్వనముల సురతసమాగమ, మునకుం బ్రార్థించునట్లు ♦ పొలిచెడిదానిన్.

ఉ. ఆతనికే లొకించుకయ ♦ యంటినయంతన తత్సుఖంబుచే
నాతతమై జనించెఁ బుల♦కాంకుర మప్పుడె నాకుఁ గల్పభూ
జాతసుమం బొకం డిడిన♦చాడ్పున నాయవతంసదేశ ముం
దాతఁడు మత్కపోలతల♦మంటుట నైన సుఖాతిరేకతన్. 105

తే. కంపితాంగుళిజాలక♦కరతలంబు
నుండి జపమాల సిగ్గుతో ♦ నుర్విఁ బడియె
నదియు నెఱుఁగం డతం డంత ♦ నవనిఁ బడక
మున్న గొని నేను మెడలోనఁ ♦ బూని దాని. 106

తే. తద్భుజాశ్లేషసౌఖ్యంబు ♦ దద్దఁ గాంచి, న ట్లనిర్వాచ్యమోదజ♦లార్ణవమున
నోలలాడితి నాజప♦మాల యవుడు, మౌక్తికాపూర్వదామ మై♦మదికిఁ దోఁచె.

తే. మునుక లిడుచుండ మేమట్టి♦మోహవార్ధి, గొడుగు పట్టెడుదాసి నా♦కడకువచ్చి
యమ్మ యీతల్లి జలకంబు♦లాడెనింటి, కరుగుతఱియయ్యె స్నానంబు♦గరుణ సేయు.

చ. అనుటయు దానిమాట ప్రథ♦మాంకుశపాతము నవ్యసామజం
బునువలెఁ దీవ్రమై మిగులఁ ♦ బొక్కఁగఁ జేయఁగ నన్ను మానకే
తనశరజాలకీలితము ♦ తన్ముఖకాంతిసుధాబ్ధిమగ్నమో
ఘనపులకోరుకంటకని♦గాఢవిలగ్నము నాఁగ లగ్నమై. 109

కపింజలుఁడు మదనపరవశుఁడగు పుండరీకుని కుపదేశించుట.

ఉ. లాగఁగరాని దృష్టిని బ♦లాత్కరణంబున లాగి యెట్లొ నే
నేగితి స్నాన మాడ నట ♦ నించుక రెండవమానివృత్తుఁ డా
యోగిస్థలన్ననంబుఁ గని ♦ యోర్వక కోపమునట్లు నిట్లనున్
బాగు సఖా! భవాదృశుల♦పద్ధతి కియ్యది సాధువృత్తి యే?. 110

క. ఇది క్షుద్రజనులు త్రొక్కన, పదవి; తపోధనులు దీనఁ ♦ బద మూనరు నీ
హృదయము విహ్వల మయినను, బదిలింపవు ప్రాకృతునటు ♦ పరికింతు విఁకన్.

క. ధైర్యధనులు సాధులు నీ, ధైర్యం బెం దేగె మరుని♦దాడికి లో నై
యార్యవిగర్హణ కిట్లై,కార్యమె యింద్రియజయంబు ♦ గడుఁ గోల్పోవన్. 112

ఉ. ఎక్కడ నామనోవశిత ♦ యెక్కడ నాగురుశాంతి నాదమం
బెక్కడ నల్ల వేదములు ♦ నేడఁ గులాగతబ్రహ్మచర్యమ
ద్దెక్కడ సర్వభోగములు ♦ వేడ న దేడ గురూపదేశ మిం
కెక్కడ నత్తపోభిరుచి ♦ యేడనొ సౌఖ్యపరాఙ్ముఖత్వముల్. 113

క. ఎక్కడ విషయనిరీహత, యెక్కడ వైరాగ్యబుద్ధు ♦ లెల్లను మఱి నీ
వెక్కడ యౌవనమదమును, జక్కడఁ జెడునింద్రియములఁ♦జక్కడఁచుటయున్.

సీ. నిరుపకారక మాయె ♦ నిరతగురూపదేశము నిరర్థక మయ్యె ♦ సంస్కృతియును
నిర్గుణం బాయెను ♦ నిరుపమధర్మశాస్త్రాభ్యాస మది తెల్వి ♦ వ్యర్థ మాయె
నిష్ప్రయోజన మాయె ♦ నెఱిప్రబుద్ధత యెల్ల నిష్ఫలం బయ్యెను♦నిందుప్రజ్ఞ
నిష్కారణం బయ్యె ♦ నిర్నిద్రతప మెల్ల నిర్బీజ మయ్యెను ♦ నిరశనత్వ
తే. మకట! మిముబోంట్లై యిట్లు రా♦గాంధు లగుచుఁ
గలుషతను గాంచ నజ్ఞుల♦గతి యిఁ కేమి
హస్తమందుండి జపమాల ♦ యవని జాఱి
పడుట యెఱుఁగవె యహహా! నీ♦పారవశత. 115

తే. అదిగొ చూడుము జపమాల ♦ నామె గొనుచుఁ
బోవుచున్నది యదె గొని♦పోవుచున్న
హృదయమును దీని వారింపు ♦ కదలనీకు
కీర్తనీయసుగుణ! శ్వేత♦కేతుపుత్ర!. 116

క. అని వచియింపఁగ నాతఁడు, విని వేరుగఁ దలఁచెదే క♦పింజల! నన్నున్
గొనిపో నిత్తునె యాదు,ర్వనితను నోర్తునె మహాప♦రాధము దీనిన్. 117

క. కను మిదె యంచును నించుక, కనలినగతిఁ గనులు కోప♦కాంతంబులుగాఁ
బెనవైచి బొమలు జతనం, బునఁ బెదవులు ముద్దుఁ గొనఁగఁ♦బోలె నదరఁగన్.

క. కనుఁగొని ననుఁ బలికెను నో, వనితా! నిలునిలుము నాదు♦వరజపమాలన్
గొని యెట కేగెద వీయక, చన కావల నడుగుదాఁటి ♦ చనకుమ టంచున్.

చ. అది విని నేను గొమ్మనుచు ♦ నాత్మగళంబుననుండి తీసి నా
వదనముఱిచ్చఁ గంచు నిలు♦వంబడి చాఁచినతత్కరంబునన్
మనసునినర్తనాదిని స♦మర్పితసత్కుసుమాంజలిన్ వలెన్
బొదలుమదేకయష్టి నిడి ♦ పొల్చెడుతజ్జపమాల యంచు నే. 120

శా. స్నానం బాడినదాననయ్యుఁ జెమటన్ ♦ స్నానంబు గావించితిన్
భూనాథాత్మజ! మళ్లి నెచ్చెలులు గొం♦పోవన్ బ్రయత్నంబునన్
మానీశాత్మజు నాతనిం దలఁచుచున్ ♦ మన్నాతితో నింటికిన్
నే నట్లో చని యుండితిన్ నగరునన్ ♦ నిర్నిద్రనై రేవగల్. 121

అనంగవిధురయగు మహాశ్వేతయవస్థావర్ణనము.

చ. అది మొద లేను వచ్చితినొ ♦ యచ్చట నుంటినొ యింట నుంటినో
నిదుర వహించుచుండెదనొ ♦ నెట్టన మేల్కని యున్నదాననో
పొదిగొనఁ జుట్టు నెచ్చెలులు ♦ పొల్చెడుదాననొ యొంటిదాననో
యిది పగలో విభావరియొ ♦ యేడ్చుచు నుంటినొ మిన్నకుంటినో. 122

ఉ. ఊరక యుందునో సకియ ♦ లూఁకొన ముచ్చటలాడుచుందునో
సారము లెవ్వియో యటు ల♦సారము లెవ్వియొ యేది రమ్యమో
యారయ నేది కాదో సుఖ♦మా యిది దుఃఖమొ యంచు నేదియున్
నేరను వ్యాధిబాధితనొ ♦ నీరుజనో యెఱుఁగ న్నృపాత్మజా!. 123

చ. తెలియక మారవృత్తమును ♦ దీనత నెయ్యెడ కేగుదాననో
పలికెద నేమి కాంచెదనొ ♦ పాటన సేయుదు వేని మాటలన్
సలుపుదు దీని కేమి ప్రతి ♦ చాలిన దంచు నెఱుంగ కేమి కే
వలము కుమారికాజనము ♦ వాస మొనర్చెడు సౌధ మెక్కితిన్. 124

చ సకియల నెల్ల వీడి పరి♦చారికలన్ జొరనీయ కెవ్వరిన్
సకలము మాని యెక్కితెను ♦ సన్మణిజాలగవాక్షమందె ని
ల్పుకొని ముఖంబు నద్దెసనె ♦ పుల్కనఁ జూచుచు నుంటి నూర్పు పు
చ్చుక యచలస్థితిన్ మనసు♦సాగఁగనీయక యెందు నే గతిన్. 125

ఉ. ఆదెస పూర్ణిమాశశిస • ముంచితమో యనఁ బుష్పితంబు నా
హ్లాదక మయ్యె నామదికి • నామృతపూరసమాప్లుతంబొ నా
వాదము లేల రత్ననిధి • వాసితమో యనఁ దత్సనాథతన్
బోదు మనంబు దృష్టియును • బోవిడి యాదెస నొందుచోటికిన్. 126

చ. అనిలుఁడు నేగుదెంచినను • నాదెసనుండి శకుంతరావముల్
వనసుమసౌరభంబులును • వచ్చినఁ దన్మునిపుత్త్రువార్తలన్
మన మలరంగ నడ్గుచును • మాటికిఁ గోరిక లూర మీఱుచున్
గొనఁగఁ దలంచుచున్ దవము • ఘోరము నాతని కింపుఁ బెంపఁగన్. 127

చ. అతఁడు పరిగ్రహించుటను • నామునివేషమె రమ్య మంచుఁ దా
నతఁ డుచితాస్పదం బగుట • యౌవన మొప్పిద మంచుఁ బారిజా
తతరుసుమంబు తచ్ఛ్రితినిఁ • దార్కొనుటన్ గడు రమ్యమంచు స
న్నుతి కిరవయ్యెఁ దన్మునిసు • తుండు వసించుట నాక మంచునున్. 128

వ. మఱియు. 129

ఉ. ఆతనిరూపసంపదనె • యంగజుఁ డంతటి దుర్జయుండు నం
చాతలిరాకుబాకు గల • యాతఁడు చెప్పినయట్టు లెల్ల నా
చేతమునం దలంచుచును • జేష్టలు తక్క తదేకచిత్తనై
యాతనివైపె చూచుచును • నట్టె చలింపక యుంటిఁ బెద్దయున్. 130

ఉ. దూరగుఁ డయ్యె నామునిసు • తుండు కనంబడసాగె ముందలన్
హారితదేకయష్టి యుప • హారిత మయ్యెను వానిచేత నా
ధారిత మయ్యెఁ గంఠమునఁ • దాల్చితిఁ గర్ణమునందు నల్ల మం
దారసుమోరుగుచ్ఛమును • దత్కర మంటినహాయిఁ బుల్కలన్. 131

మహాశ్వేత తనవృత్తాంతమును మరలఁ జెప్పుట.

తే. అంతఁ దాంబూలపేటిక • నావహించు
నాదుసహచరి తరళిక • నామధేయ
నాబడిన నేగుదెంచెను • స్నాన మాడ
నది యొకించుక యాలస్య • మాచరించి
యవలఁ జనుదెంచి ననుఁ గాంచి • యనియె నిట్లు. 132

సీ. భర్తృదారిక! ముని • బాలుర నిరువుర దివ్యరూపుల సుత • దివిజనిభులఁ
గనుఁగొంటి మచ్ఛోద • కాసారతటమున వారిలో నొక్కం డు • దారచిత్తుఁ

డవతంసముగఁ జేసె ♦ నతివ! యెవ్వఁడు నీకుఁ దెలిమ్రానిపువుఁగుత్తిఁ ♦ దెచ్చిరిల్ల
నతఁడు రెండవవాని ♦ కగపడకుండఁ దా నవని నల్లల్లన ♦ నడుగు లిడుచుఁ
తే. బువ్వఁదీవెలమాటునఁ ♦ బొంచి పొంచి, యింటికేతెంచునావెంట ♦ నంటివచ్చి
భర్తృదారిక నినుగూర్చి ♦ పలికె నిట్లు, మంకమందమృదూక్తులఁ ♦ జిందరసము.
క. బాలిక! యెవ రీకన్యక, పోలఁగ నెవ్వనికుమార్తె ♦ పోవు నెటకు నీ
బాలికపే రెయ్యదియో, వాలాయం బెచట నుండు ♦ వచియింపు మనన్.
క. వినవా శశికిరణంబుల, జనియించిన యప్సరసను ♦ సన్మతి గౌరిన్
జనియించె నామె కీయమ, ఘనయశుఁ డగుహంసుఁ డనెడు ♦ గంధర్వునికిన్.
తే. అతఁడె గంధర్వులకు నెల్ల ♦ నధిపుఁ డతుల, సకలగంధర్వకోటీర ♦ చారురత్న
కోటిఘట్టనమసృణిత ♦ కోమలాంఘ్రి, నఖరచక్రుండు దమితారి ♦ నరవరుండు.
వ. మఱియు. 187
తే. పాదపీఠీకృతేందిరా ♦ పాణిపంక
భవుఁడు విశ్రుతసితకీర్తి ♦ ప్రణయసుప్త
మధురగంధర్వకామినీ ♦ మంజుగండ
పత్రలతికావిరాజిత ♦ బాహువిటపి
శిఖుఁడు నాతనిదుహిత యీ ♦ చెలియ వినుము. 138
తే. ఈమె పేరు మహాశ్వేత ♦ హేమకూట
మునకుఁ బోవుచు నున్నది ♦ మునికుమార!
యనుచు నేఁ జెప్ప నంత నా ♦ మునిసుతుండు
మిన్న కొక్కముహూర్తంబు ♦ మెదలకుండ. 139
తే. మనములో నేమొ తలఁచుచు ♦ మాటిమాటి
కపగతనిమేషలోచనుం ♦ డగుచు నన్ను
గాంచి వేఁడుకొనెడువాని ♦ గతిని దమిని
ననునయపురస్సరంబుగా ♦ ననియె నిట్లు. 140
తే. బాల! కల్యాణి! బాలికా ♦ భావమూని, యున్న నీరూపుసుగుణము ♦ లుంటఁ దెల్పు
నొక్కయర్థంబు నర్థింతు ♦ నొనరిచెదవె, యనఁగ సాంజలిబంధనై ♦ యతివినీతి.
చ. మునివర! పల్కనేల యిటు ♦ పూజ్యులు మీరు జగత్త్రయంబునన్
ఘనతరపుణ్యజాలములు ♦ గల్గక యూరక సర్వపాపముల్
దునుమఁగఁ జాలు తావ్రదృశుల ♦ తోరవుఁజూడ్కులు మమ్ముబోంట్లపై
బనుపడు నొక్కయాజ్ఞ యిడఁ ♦ బల్కఁగ నేల మునీంద్రనందనా. 142

చ. ఏమి యొనర్పఁగా వలయు♦నేను వచింపుము శంక దక్కి నే
మేమియు నూన కుల్లమున ♦ నీజనముల్ గొను దాసి గాఁగ నా
నాముని సూనుఁ డంత నను ♦ నారసి నెచ్చెలిఁ బ్రాణదాత్రిగాఁ
గామితకామధేనువుగ ♦ గాఢముగాఁ గొనియాడి యప్పుడే. 143

ఉ. చేరువ నున్నయొక్క చిఱు♦చీఁకటి మ్రానికి సాలయంబులన్
దా రయమారఁ దెచ్చి ద్రుమ♦దంబున నూరి రసంబుఁ దీసి స
చ్చారుసుదేభదానజల♦సౌరభ వాసితత ద్రసంబునన్
జీరి స్వవల్కలంబు నొక♦చీరికయందుఁ గనిష్ఠికం దగన్. 144

శా. ఈపత్రంబు లిఖించి దీనిఁ గొని యా♦యేణాక్షికిం జేర్పుమా
చూపంగాఁ దగ దేరికంచు నొసఁగెన్ ♦ జూ మ్మంచు నాపత్రముల్
జూపెన్ నాకదపంబునుండి గొని తాఁ ♦ జూడ్కుల్ ప్రమోదింపఁగా
నాపంకేరుహనేత్ర తద్విషయ మా ♦ యాలాపశబ్దంబులున్. 145

ఉ. ఆతనిస్పర్శసౌఖ్యమును ♦ నాంతరసీమ జనింపఁ జేసె నా
నాతతభంగిఁ గర్ణముల ♦ నంటినయంతన రోమహర్ష సం
జాత మొనర్చె నంగముల ♦ సర్వములన్ గడు నాకు నామనో
జాతుని నావహించు మను♦చందమునన్ సివ మెత్తఁ జేసె నాన్. 146

వ. అంత మనసు నిలుపంజాలక తత్కరతలంబుననుండు తద్వల్కలపట్టికం గైకొని యం దభిలిఖితం బయిన యీపద్యంబుం గంటి. 147

క. బిసనితమార్తికలతచే, నెస మోసము చేసి యాశ ♦ లెసఁగఁగ హంసన్
వెస దూరము గొనిపోయిన, ససి; నామానసభవుఁ గొని ♦ చని తీవు కటా!.

సీ. దిక్కు తెలియమి వోలెఁ ♦ తెరు వెఱుంగనివాని కంధున కమవస♦యామినిగతి
దుష్టనిద్రయుఁ బోలె ♦ దుర్విషవిహ్వలునకును మూకకు జిహ్వ ♦ నఱికి నట్లు
లోకాయతి కవిద్య ♦ వీఁకను బాపికిఁ బ్లవగంబునకు మద్య♦పాన మట్లు
పరఁగ జ్వరప్రలా♦పప్రసృత్తియుఁ బోలె వఱలునసంబద్ధ♦భాషి కకట

తే. మత్తునకుఁ గల్లు వోలిక ♦ మఱి పిశాచ, యుతున కావేశవిధివోలె♦నుగ్రదోష
వికృతివృద్ధికి హేతు వై ♦ వెలిఁగె మన్మథార్త నగునాకు నా లేఖ♦యధికగతిని.

తే. దాన వెల్లువ నది వోలె ♦ ధరణినాథ, తనయ! వ్యాకులచిత్త నై ♦ తనువునిల్పఁ
జాల నైతిని మేను వ♦శంబు గాక, సొటసొటలు వోవఁగాఁ జొచ్చె♦శుభచరిత్ర!.

ఉ. ఆతనిఁ గాంచుటన్ మరల ♦ నాయడపన్ గృతపుణ్యఁ గాఁ గదున్
బీతసుధన్న వాసవుని ♦ పీట వసించెడుదానిగాను సం

జాతసమస్తదేవవర♦జాలను గాఁగఁ ద్రిలోకరాజ్యసం
వీతనుగాఁగ దైవతని♦వేశనుగా మది నెంచుచున్ దమిన్. 151

చ. పరిచితయైనఁ గ్రొత్తదిగఁ ♦ బజ్జ వసించెడిదైన నెప్పుడో
యరుదుగఁ బ్రాప్తదర్శనఁగ ♦ నాత్మకుఁ దోఁపఁ బ్రియంబు మీఱఁగా
నరయుక స్వామిభృత్యతను ♦ నంటుచు ముంగురులున్ గపోలముల్
సరస వసింపఁ జేసి సుర♦సద్మమునన్ వసియించుదానిఁగాన్. 152

చ. మనమున నెన్నుచున్ మిగుల ♦ మన్ననసేయుచుఁ బల్కరించుచున్
వనిత! వచింపు మల్లముని♦బాలకు నేగతిఁ గాంచి తాతఁ డే
మనియెను నెంతదవ్వు వెను♦నంటుచు వచ్చెను మమ్ము నెంతసే
పు నిలిచి తీవటంచు మదిఁ ♦ బొంగుచు నడ్గితి దాని మాటికిన్. 153

తే. దానితోడ నాప్రాసాద♦తలమునందె, తత్కథాలాపరసవార్ధి♦తరఁగలందు
మునిఁగి తేలుచుఁ బరిజన♦ములను నేరిఁ,జొరఁగనీయకగడపితిఁ♦బొరయువగలు.

వ. అంత. 155

క. గగనోపాంతస్థలికిని, దిగె రవిబింబంబు నామ♦దియును నదియున్
నగముగఁ గైకొనెనో యన, వగవగ రాగంబు మిగుల ♦ భాసుర మగుచున్.

క. ఆతపలక్ష్మి సరాగ, ద్యోతన విరహంబు సైఁప ♦ నొల్ల మినో యనం
గాతర నాఁగను బంకే,జాతముల శయించుచుండెఁ ♦ జని పాండురతన్. 157

క. కైరికగిరిజలసేచన, కారణపాటలితవస్త్ర♦గజఘటలో యనన్
సూరగభస్తులు గుంపై, సారసవనములను బాసి ♦ చనుచుండె వడిన్. 158

తే. గగనసంచార మొనరించి ♦ గ్లానిఁ గాంచి
విశ్రమింపంగ నేగెడి ♦ వేఁడివెలుఁగు
వాహహేషారవప్రతి♦ధ్వనులతోడ
మేరుగిరిగహ్వర మహంబు ♦ చేరుచుండె. 159

తే. సూర్యవిరహంబునను గల్గు♦సొమ్మచేత
నంధకారితహృదయంబు ♦ లైనమాడ్కిఁ
బద్మినులు మీలనం బందె ♦ బంభరములు
ముకుళదంభోజవనముల ♦ మొనసి చొరఁగ. 160

క. మెసవెడితామరతూఁడుల, వెస వీడి పరస్పరంబు ♦ విడివడి యొదలం
దెసఁగెడువిరహానలమునఁ, గసుగుచుఁ జక్రాంగకములు ♦ కదలుచు నుండెన్.

కపింజలుఁడు మహాశ్వేతయొద్దకు వచ్చుట.

వ. అప్పుడు. 161

క. ఛత్రగ్రాహిణి నాకడ, కాత్రంబున నేగుదెంచి ♦ యాతాపసరా
ట్పుత్త్రుఁ డయం దొక్కఁడు నృప, పుత్త్రీ! యిట వచ్చె ద్వార♦మున నుండు నిదే.

క. చనుదెంచితి జపమాలికఁ, గొనిపోవఁగ ననుచుఁ జెప్పెఁ ♦ గోమలి! యనఁగన్
బనివినియెద నే నని యా, వనిత వచించి యరిగె నటఁ ♦ బార్థివతనయా!. 163

క. మునిసుతుఁ డన్నంతన యా, మునిపుత్త్రుఁడె వచ్చె ననుచు ♦ ముదమందిమదిన్
బనిచితి నొకకంచుకిఁ దో, కొని రమ్మని యతని నేను ♦ గుతుకం బెసఁగన్. 164

క. చెలువునకు యౌవనముగతి, నలయౌవనమునకు మరుని♦యట్లు మరున కా
యలయామనిగతి నామని, కలదక్షిణపవను నట్టు ♦ లనురూపుం డై. 165

క. తన రెండు నాతనిమిత్త్రుఁడు, చనుదెంచెను గొంతవడికిఁ ♦ జంద్రికవెంటన్
జనుదెంచెడుబాలాతప, మనఁగ జరాధవళదేహుఁ ♦ డగుకంచుకితోన్. 166

క. తనరుఁ గపింజలనామం,బున నాతఁడు వ్యాకులుండుఁ♦బోలె విషణ్ణుం
డును శూన్యుండునుబోలెను, గనఁబడె మది నేమొ తలఁపు♦గలవానిగతిన్.

తే. ఏగుదెంచెడునాతని ♦ కెదురు నడచి, భక్తిఁ బ్రణమిల్లి కొనివచ్చి ♦ పనుప కెవరి
నేన పీఠంబుఁ గొనివచ్చి ♦ యిడితి నిష్ట,పడకయున్నబలాత్కార♦పఱచియతని.

క. చరణములఁ గడిగి పయ్యెద, చెఱఁగునఁ దడియొత్తి యతని♦చేరువభూమిన్
గరము వినీతిని నిలిచితిఁ, దరువాత నతం డిసుంత ♦ తాళుచు నేమో. 169

క. పలుకం దలఁచిన యాతని, చెలువున నాచెంత నున్న♦చెలి తరళికపైఁ
బొలయించెఁ జూడ్కు లాతఁడు, తెలిసి తదీయాశయంబు♦దృష్టిన నేనున్.

క. మునివర! దీనికి నాకును, గనఁబడ దించుకయు భేద♦గతి యిది నేనే
యనుకొని నిర్భయముగ వ,చ్చిన కార్యముఁ జెప్పుమనుచుఁ♦జెప్పఁగ నతఁడున్.

కపింజలుఁడు మహాశ్వేతకుఁ బుండరీకవృత్తాంతముఁ జెప్పుట.

చ. నృపసుత! యేమి చెప్పుదును ♦ నెట్టుకొనుం ద్రప నోరు నాడదున్
విపినములన్ వసించుచును ♦ వేడ్కఁ భుజించుచుఁ గందమూలముల్
వ్యపగతదోషులై మనెడు♦పావనమౌనిజనంబు లెక్కడన్
జపలజనోచితంబు సుమ♦చాపవిలాసవిశేషకర్ణమున్. 172

చ. ఘనవిమలోపభోగరుచి♦కల్మషముల్ గదురాగదూషితం
బును నయి మోహవారినిధి ♦ మున్గుచు నుండెడు నీప్రపంచ మే

డ ననుపపన్న మింతయుఁ గ♦డంగెను నేమి యొనర్తు దైవముల్
జనులను హాస్యభాజనుల ♦ సల్పుఁ గదా విధి యప్రయత్నతన్. 173

చ. ఇది యుచితంబొ వల్కలముల ♦ కెన్నఁ దపంబున కర్హమో జటా
విదలసదృత్తమో మతియుఁ ♦ బెద్దయు ధర్మసుబోధనాంకమో
విదితము గా దపూర్వమగు♦వేడబ మియ్యది మాకుఁ బాటిలెఁ
మదవతి! చెప్పఁగావలయు ♦ మానఁగ రా దని యెన్నిభంగులన్. 174

చ. కనఁబడ దొండుపాయ మిటఁ ♦ గల్గదు దీనికి మారు సేఁతయుఁ
గనఁబడ దన్యరక్షణము ♦ గానము దిక్కును వేరు; సంభవిం
చును వచియింప కున్నఁ గడు ♦ శోకముఁ గూర్చు ననర్థకంబు నూ
మనువును మిత్రుఁ, బ్రాణమును ♦ మానియు నైన నటంచుఁ జెప్పెదన్.

ఉ. నీవు గనుంగొనంగఁ గడు ♦ నిష్ఠుర మాగతి నాడి యాతనిఁ
బోవిడి పూలు గోయఁగను ♦ బోయితి నొం డెడ కేను వేగ యా
తావును వీడి కోపమునఁ ♦ దత్క్షణ మింటికి నీవు నేగి నా
వావల మళ్ళి వచ్చితిని ♦ నచ్చట నించుక యాలసించి యేన్. 176

ఉ. ఏమి యొనర్తు నొంటి నితఁ ♦ డిప్పు డటం చెద సంశయించుచుఁ
భూమిరుహాళిమాటుగొని ♦ పొంచుచుఁ జూచితి నా ప్రదేశముఁ
భామిని! లేఁ డతం డచట ♦ భావమునందు జనింపసాగె నే
మేమియొ శంక లంత వినుమీ యిఁక నేమి వచింతుఁ జెప్పుమా. 177

సీ. మదనపరాయత్త♦మానసుం డయి దాని ననుసరించుచుఁ దాను♦నరిగె నొక్కొ
యది పోవఁగాఁ దెల్వి♦నంది సిగ్గున నాదు మోములకు రావెఱఁ♦బూని నొక్కొ
కినుకతో నను బాసి♦చనియె వీఁడని నన్ను విసుగుచు నెందెందు♦వెతకు నొక్కొ
యుం డందు వెతకిన♦న్నగ యుక యెందును దిరిగి యిచ్చటికరు♦దెంచు నొక్కొ

తే. యని వికల్పించుకొను చు ♦ నందె యుంటిఁ
గొంతసే పంత పుట్టువు ♦ గోలె నన్ను
వీడి చనినాఁడు గాఁ డని ♦ వీడి వాని
నుండఁగా లేక వెన్వెఁగ ♦ నిందుకొనఁగ. 178

చ. ఇతఁ డొకవేళ ధైర్య మిటు ♦ లేదుటకుం గడు సిగ్గు నంది మే
ను తోఁడగినం దొఱంగుఁ ద్రప ♦ నూల్కొనఁ జేయదు దేని, నొంటి గా
నితనిని వీడఁగాఁ దగదు ♦ నెన్నఁగ నంచు మదిం దలంచి పో
యితి వెదకంగ నెందుఁ దిలకించినఁ గన్పడఁ డయ్యె వాఁ డహో!. 179

క. కనఁబడకుండుకొలందిని, మనమునఁ గడుఁ జెలిమి బలిమి ♦ మల్లడికొనఁ బా
  గెను దత్తవశోభనములు, వనజానన! మరల నొక్క ♦ పరి కలయంగన్. 180

క. తరులతికాగహనంబుల, నురుచందనవీథికలను ♦ నుజ్జ్వలలతికా
  వరమండపములఁ గమలా, కరతటముల వెదకితిఁ జిర ♦ కాలము మిగులన్.

వ. అంత. 182

చ. ఒకసరసీసమీపమున ♦ నుజ్జ్వలపుష్పమధువ్రతావళీ
  పికమయమో యనంగ శిఖి ♦ వేష్టితమో యన సాంద్రతన్ మహో
  త్సుకమధుజన్మభూమి యన ♦ శోభిలునొక్కలతాగృహంబునన్
  వికలితచిత్తుఁడై మదన ♦ వేదనఁ దూలెడివానిఁ గాంచితిన్. 183

చ. సకలము మాని స్తంభితుని ♦ చాడ్పున లేఖితునట్లు సుప్తుమా
  డికి మృతునట్లు యోగిక్రియ ♦ డింది సరాగత నొప్పి పాండుతా
  ప్రకలితుఁడై యొకం డగుచుఁ ♦ బంచశిలీముఖుఁ గూడి యూరకే
  యకట! తపించుచుండె నట ♦ నంగజకీలిమహోగ్రకీలలన్. 184

చ. తలఁప స్వవృత్తచంచలుఁడు ♦ దద్దయు నిశ్చలుఁ డయ్యెనుర్ శిలా
  తలసమవిష్టుఁ డయ్యెను ని ♦ తాంతము పంచత నుండువాఁడునుర్
  బలుకక యుండియుర్ గథిత ♦ పంచశిలీముఖువేదనుండునై
  కలఁపఁగ శాపభీతి నన ♦ గన్పడకుండ స్మరుం డజస్రమున్. 185

చ. హృదయగతర్ బ్రియుర్ గనను ♦ నేగెనొ లోనికి నా; ననహ్యతా
  పదరముచేత డాఁగె ననఁ, ♦ బాసెనొ నా మదిఁ గందఁ గిన్కతోర్
  గదలక యుండ నింద్రియగ ♦ ణంబులు దేహమునందు నెంతయుర్
  గదలక మూఁగవానిగతిఁ ♦ గామవశుం డయి పొల్చె నత్తఱిన్. 186

చ. మదనహుతాశనుం డెదను ♦ మండుచు నుండఁ దదీయధూమముల్
  పొదువుట నా నిమీలనముఁ ♦ బొందినకన్గవసందులందు బల్
  గుదు లయి బాష్పముల్ గురియఁ ♦ గూర్చుచు దుర్దిన మాస్థలమ్మునర్
  బొదలుచుఁ గ్రిందు గన్గొనుచుఁ ♦ బొక్కుచు నంధునిమాడ్కి నొప్పుచున్.

చ. అల హృదినుండి పై కెగయు ♦ నంగభవానలకీల నాఁ గడుర్
  జెలఁగెడు లోహితాధరరు ♦ చిం గొనివచ్చెడునూర్పుగాడ్పులర్
  దోలఁచుచుఁ జేరువర్ బొలుచు ♦ తోరపుఁ దీవెలఁ బువ్వుకేసరం
  బులను మరందబిందువుల; ♦ మోదము దక్కి కలంగుచుర్ మదిన్. 188

క. అలరెడువామకపోల, స్థలమునకుఁ గయన మైన♦కయతలనఖకాం
తులు పర్వ నొనటఁ జందన, తిలకము తీర్చినవిధంబుఁ ♦ దేట పఱుచుచున్.

సీ. తెలిమ్రానిచెవిగమ్మఁ ♦ దీసివైచిన నింక నవశిష్టవాసన ♦ కరుగుదెంచి
కలరుతినెపమునఁ ♦ గామసంమోహనమంత్రంబుజపియించు♦మాడ్కి మూఁగి
రొద సేయుతుమ్మెద♦కొదమల శ్రవణంబు నీలాబ్జయుతము నా ♦ నగడుచుండ
లలితతమాలప♦ల్లవసంయుతమ్ము నా నభిరామ మై మఱి ♦ నలరుచుండ

తే. రోమకూపంబులం దెల్ల ♦ నాముకొనిన
శంబరారాతిసుమశర♦శల్యశకల
నికరమో యన మే నెల్ల ♦ నిండుకొన్న
యుత్సుకతఁ బుట్టురోమాంచ ♦ మొప్పుచుండ. 190

తే. కరతలస్పర్శనాసుఖ♦కంటకితమొ
యనఁగ నఖరాంశుజాలక ♦ మలమి యలరు
నవినయపతాక మగు మౌక్తి♦కావళి నదఁ
దాల్చె దక్షిణకరమునఁ ♦ దనరుచుండె. 191

చ. సుమశరు లోఁగొనం దగిన ♦ చూర్ణము నాఁ దగుపుప్పొడిఁ మహీ
జములు నిజాంగకంబులను ♦ జల్లుచు నుండఁగ నాత్మరాగసం
క్రమణ మొనర్చునో యనఁగఁ ♦ గ్రాలునశోకకిసాలయమ్ములుఁ
జమురుచునుండ దేహమును ♦ జల్లఁగ గాలికి వీచు చెప్పుడున్. 192

చ. స్మరుఁడు సధూమతప్తశర♦శల్యములో యన గంధ మానఁగాఁ
బరివినగందుతుమ్మెదల ♦ భాసిలుచంపకకుట్మలంబులఁ
బరవుచునుండ నచ్చి చనఁ ♦ బై వయి దక్షిణమారుతుండు బం
భరకులఝుంకృతిధ్వనుల ♦ మాటి కదల్పఁగ హుంకృతిఁ బలెన్. 193

తే. అలరెడువసంతజయశబ్ద♦కలకలములఁ
బొదలుమదకలకోకిల♦ములకలకల
ములను మధుమాస మెంతయు ♦ ముమ్మరముగ
నాకులంపడఁ జేయంగ ♦ నడరుచుండె. 194

తే. ప్రొద్దుపొడుపునఁ జంద్రుండు ♦ పొల్చునట్లు
పాండురాంగతఁ బొల్చుచు ♦ నెండకారు
నేఱుగతి నెండిపోవుశ♦రీర మొప్ప
మన్మథావేశవశుఁ డయి ♦ మఱఁగుచుండె. 195

తే. వేరుజన్మంబు గాంచినతీరుదోఁప, రూపుమారెనొయనఁదొలిరూపు నెఱుఁగ
రాక మునుగన్నవాఁడుగా నాకళింప, రాక పరిచితుగతిఁదోఁపరాకయుండె.
ఆ. లోన పీతిహోత్రుఁ బూనినచందన, విటపి వోలె వాడి వెలయ కంగ
జాతమయుఁ డనంగ ఫలితుం డనంగను, బధిరుఁ డనఁగ నెవరి పలుకు వినక.
తే. మదనపరవశుఁ డయి వేఁగు మద్వయస్య
గతనిమేషుండ నై యట్టె గాంచి మదిని
గదుర ఖేదంబు తలపోయఁ గడఁగితి నిటు
పలువిధంబులఁ బయి పయిఁ బరువ్వగను. 198
ఉ. ఇంచుకసేపులో నితని నేగతిఁ జేసెను దుస్సహుండు పో
నెంచఁగ మన్మథుం డకట! యెందునకుఁ గొఱఁగాక పోయె నే
సంచిత మైనజ్ఞాన మది సర్వము చిత్రము నొక్కమాటునఁ
మించినవాఁడు నన్నుఁ గడు మేలిగుణంబులప్రోక యారయన్. 199
ఉ. శైశవ మాదిగా నితఁడు శౌర్య మెఱుంగఁడు రూఢి ధీరుఁ డై
వాసికి నెక్కినాఁడు ముని బాలకు లందఱలోన నెంతయుఁ
జేశలుఁ డంచు నస్ఖలిత నిర్భరసద్వ్రతుఁ డంచు మించె స
ర్వాశల, నీతఁడుఁ మదను సంపఱకుఁ గుఱి యయ్యె నక్కటా!. 200
చ. పరఁగఁ దపఃప్రభావమును బాటన సేయక జ్ఞాన మెల్లనుఁ
బరిభవ మందఁ జేసి యటు పాదు గదల్చి గభీరతఁ గడుఁ
స్మరుఁ డవివేకిఁ జేసె మునిమాన్యుని నీతని నొక్కపెట్టునఁ
దరుణిమ దుర్లభంబు గద భాగుణి నస్ఖలితంబు చూడఁగఁ. 201
చ. అనుకొను చేగి దగ్గఱకు నాతనిప్రక్కన నాశిలాతల
మ్మునను వసించి యంసమునఁ బోలఁగ హస్తము నుంచి తట్టుచుఁ
గను మిటు పుండరీక! సఖ! కారణ మేమి యి టుంటకుఁ వచిం
పు నను నెఱుంగవే గనుల మూఁతల విప్పుము చూడుమా ననున్. 202
వ. అనుటయు నతండు. 203
ఉ. సంతతరోదనారుణము సంస్రవదశ్రుజలాకులంబు న
త్యంతసితాంబరాంతరిత తామరసారుణసన్నిభంబు రు
ట్కాంతము నా సబాధ మన గాఢనిమీలనలగ్న మో యనఁ
గ్లాంతము నైనయక్షియుగళంబును విప్పి కడుఁ గడంకతోన్. 204

చ. అలసతఁ జాలసేవు నను ♦ నట్టె గనుంగొని యూర్పుచున్ గడున్
గలఁచఁగ సిగ్గు గద్గదికఁ ♦ గంఠము రాపడ మిత్త్రమా! కపిం
జల! నను నడ్గె దేల యిటు ♦ సర్వ మెఱింగియు నంచు మెల్లనన్
బలికెను నట్టకేని కల ♦ భామిని! యే మనువాఁడ నే నికన్. 205

క. విని యాపలుకులఁ దనవ,స్థను మాన్పఁగ రాని వికృతి ♦ తథ్య మ్మిది యై
నను నెచ్చెలి దుష్పథవ,ర్తిని మిత్త్రుని శక్తికొలఁదిఁ ♦ దేర్పఁగ వలయున్.

చ. అని మది నిశ్చయించికొని ♦ యాతనితోడుత నిట్టు లంటి మె
ల్లన సఖ! పుండరీక! సక♦లంబు నెఱుంగుదు నీదువృత్తమున్
గను మిటు లొక్కఁ డడ్డెదను ♦ గార్యమె నీ కిది చెప్పి రేరు దు
ర్జనములు నేర్పిరో గురులు ♦ శాస్త్రములన్ గనినావొ చెప్పుమా 207

సీ. ధర్మార్జనమునకుఁ♦దగినయుపాయంబొ స్వర్గమనార్హసో♦పానపథమొ
మోక్షసంప్రాప్తికి ♦ మొదలిటియుక్తియొ సద్వ్రతానుష్ఠాన♦చాతురహమొ
యనన్యప్రకారమై ♦ యడరెడునియమమొ యన్యాదృశంబయి♦నాలరుతపమొ
చిత్తనిరోధంబు ♦ సిద్ధింపఁజేసెడు సాధనమొ యోగ♦సాధనంబొ

ఆ. యిది యెఱుంగ నీకు ♦ నెదను దలంపను, దగున చెప్పఁజూడఁ♦నగదటంచుఁ
జెప్ప నేల యజ్ఞు ♦ నొప్పున మన్మథ, హతకుత్రిప్పటలను ♦ హతుఁడ వైతి

ఉ. పామరుఁ డమ్మచెల్ల స్మరు♦బారికిఁ జిక్కి గలంగుగాక యీ
కామసుఖంబు లార్యజన♦గర్హితముల్ జడసమ్మతంబు లా
నేమి సుఖాశ పీనికయి♦యి ట్లకటా! పరిహాసపాత్రునిన్
గాముఁ డొనర్చుచున్న నిను ♦ గానవు గా నిసుమంత యేనియున్. 209

సీ. ఫీమలతావనముల ♦ విడువక యేప్రొద్దు ధర్మబుద్ధిని బెంచు ♦ దంటవాఁడు
నిస్త్రింశలతికను ♦ నిర్మలకువలయదామకం బని యెదఁ ♦ దాల్చువాఁడు
కృష్ణసర్పంబును ♦ గృష్ణాగరుధూమరాజియంచును గొను♦రమణవాఁడు
జ్వలదగ్నిహోత్రుని♦ర్మలరత్న మనియెంచి చేఁ డాఁకఁ దివిరెడు♦చెనఁటివాఁడు

తే. దుష్టగజదంతమును దమ్మి♦తూఁ డటంచుఁ
బెల్లగించెడువాఁ; డెవం ♦ డుల్లమునను
దలఁచు సుఖదంబు లని హాని♦దాయకముల
విషయభోగంబులను వాఁడు ♦ విశ్వమందు. 210

ఆ. ఎఱిఁగి విషయతత్త్వ ♦ మెల్లను మిణుఁగురు
పురువు వీతిహోత్రుఁ ♦ బొందు మాడ్కిఁ

బొందె దేల వానిఁ ♦ బొల్లయ్యె నీ తెల్వి
తివియు లేవు మనసు ♦ తిరుగుచున్న. 211

చ. ప్రబలరజః ప్రసారమునఁ ♦ బ్రాప్తకళంకములై యథేష్టము
బ్బి బహుముఖంబులన్ దెసలఁ ♦ బేరెమువాఱెడు నేర్లపోలికన్
బ్రబలెడు నింద్రియంబులను ♦ వారణ చేయఁగఁ జాల వౌర యీ
శబరసపత్నుఁ డేమి నిను ♦ సల్పెనొ చూతము ధైర్యమానుమా. 212

క. అని యేను బల్కుచుండఁగఁ, గనురెప్పలసందు నుండి ♦ గాల్వ లగుచుఁ బో
గున జడిగొంచు దొరంగెడు, ఘనబాష్పఝరంబు దుడిచి ♦ కరతలమునఁ దాన్.

క. తన కేల నాదు కేలును, గొని మద్వచనమ్ము నాఁపి ♦ కూర్మిని నతఁ డి
ట్లనెఁ బెక్కుమాట లేటికి, విను సఖ! స్వస్థుండ వీవు ♦ వెత లెఱుఁగుదువే

చ. ఫణివిష వేగదుర్విషహ ♦ పంచశిలీముఖబాణపాతమున్
గన విసుమంత యేనియు సు ♦ ఖం బుపదేశ మొనర్తు వాడ్లకె
వ్వనికి మనంబు గల్గునొ యొ ♦ వండు గనున్ విను విన్నదాని ని
ల్పునొ మది మేలుకీళ్లరయు ♦ బుద్ధియు నుండునొ నింద్రియంబులున్
దనరునొ యేని కర్షుఁడ యు ♦ తం డుపదేశ మొనర్ప నెంచఁగన్. 216

క. కలుగవు నాకేమియు నివి, తెలివిఁ గు ధైర్యంబు మనసు ♦ స్థిర మై యుంటన్
జనెఁ గడు దూరం బెట్లో, తనువునఁ బ్రాణములఁ దాల్తుఁ ♦ దరలక యుండన్.

చ. చనె నుపదేశవేళ ప్రతి ♦ సంఖ్యకుఁ గాలము మీఱె ధైర్యమున్
జొనిపెడు వేళ దప్పె మది ♦ సొక్కుడఁగింపను లేదు వేళయున్
నిను విడి యెవ్వఁ డింక నను ♦ నెవ్వఁగ మాన్చి హితంబు తెల్పఁగా
ననువగువాఁడు వేవిపలు ♦ కాద్భృతి గొందును బంధు వేఁ డిలన్. 217

ఉ. ఏమి యొనర్తు నింకఁ దను ♦ వేగతి నిల్పుదుఁ గాంచి తిప్పు డే
మామకదుస్థితిన్ గనుల; ♦ మాటలకున్ దటి గాదు; చూడుమా
భూమిని దేహముండఁగనె ♦ భూరిలయాదిశభాస్కరోగ్రుఁ డీ
కాముఁడు వీనిఁ గూల్చి నను ♦ గావుము చేయుము, తత్ప్రియత్నమున్. 218

ఆ. పుటము వెట్టినట్లు ♦ పొంగెడు నంగముల్
మండునట్లు మేను ♦ మసలుచుండు
చూఁడునట్టు లొప్పుఁ ♦ జూడ్కులు హృదయంబు
క్వథిత మైనమాడ్కిఁ ♦ గ్రాలుచుండు. 219

తే. ఏమి యొనరింపఁ దగు నిట ♦ నీవ యెఱిఁగి
సల్పు దానిని శీఘ్రంబ ♦ జాగు మాని
యనుచుఁ జెప్పి మ తేమియు ♦ ననక యతఁడు
మిన్న కుండెను ననుగను♦చున్న ! యంత. 220

ఉ. సారెకు సారెకున్ విమల♦శాస్త్రములన్ సనిదర్శనంబులన్
సారతరేతిహాసములఁ♦జారుమృదూక్తులఁ జాటువాక్యలన్
కూరిమి మీఱఁగా ననువు ♦ కూరఁగ నూఱడ బోధ చేసితిన్
మీరక హాని కేఁ గనఁగ ♦ మీఁదు చెవిం బడదయ్యె నొక్కఁడున్. 221

చ. ఇతఁ డతిభూమిఁ జెందె నని ♦ యేమి యొనర్చినఁ బాయు నీవెతల్
వితథము లయ్యెఁ గాన కట♦వేదపురాణహితోపదేశముల్
జతన మొనర్తుఁ బ్రాణములఁ ♦ జయ్యన రక్షణ సేయ నంచు నేఁ
గృతమతినై సమీపగత♦కేళిసరస్సున కేగితిన్ వడిన్. 222

వ. ఏగి. 223

చ. జలకణికాంచితంబు లగు♦సారసినీచ్ఛదనంబులన్ రజో
విలసితసౌరభాంచితన♦వీనమనోహరకైరవాంబుజం
బులఁ గమలంబులన్ సరస♦భూరిబిసంబులఁ దెచ్చి యాలతా
నిలయమునన్ రచించితిని ♦ నిర్మలశయ్యను వానికిన్ దగన్. 224

ఉ. అందుఁ బరుండఁ బెట్టితిని ♦ హాయిగ నచ్చటికిన్ గుఱంగటన్
గ్రం దగుగంధసారతరు♦రాజమృదూజ్జ్వలపల్లవంబులం
బొందికఁ దెచ్చి నూరి రస♦ముం గొని నైజసుగంధిలంబు ని
ష్యందతుషారశీతమును ♦ నారసమున్ మెయినిండఁ బూసితిన్. 225

వ. మఱియు. 226

చ. విదళితవల్కలంబు లయి ♦ వెల్గుచు నచ్చట నుండుకప్రపున్
గదళులసందులన్ దొరఁగు♦కప్పురమున్ గొనిదెచ్చి చేతితో
మెదిపి తదీయపాంసువుల ♦ మెత్తితి మాటికి మాటి కెక్కుఁడై
పొదలెడుచెమ్మటల్ దొలఁగఁ ♦ బువ్వశరుం డణఁగంగ నంతయున్. 227

ఉ. సారెకుఁ దామరాకులను ♦ శయ్యలఁ గ్రొత్తగఁ జేసి కూర్చుచున్
సారెకుఁ గప్పురంపుఁబొడి ♦ చల్లు చడంచుచు ఘర్మవారులన్
సారె కనంటిపీవనలఁ ♦ జందనగంధములంది వీచు చా
యారని వానితాపమును ♦ నట్టె కనుంగొని యిట్టు లెంచితిన్. 228

ఉ. కాముని కెందసాధ్య మిలఁ ♦ గల్గదుగా హరిణంబు చాడ్పునన్
నీమమునన్ వనంబునను ♦ నిత్యము నున్కి నిసర్గముగ్ధమా
నీమునిలోక మెక్కడ న♦హీనవిలాసరసాబ్ధిలోఁ గడున్
భామలమిన్నయైన యల♦భామిని యెక్కడఁ జిత్రమౌఁ గటా!. 229

చ. జగమున లేదు వీనికి న♦సాధ్య మకార్యము దుర్ఘటంబునన్
వగవ వశంబు గానిదియుఁ ♦ బొల్పడఁ డెవ్వఁడు వీని మార్గణన్
విగళితచేతనంబులను ♦ వీఁడు దలంచినఁ గల్ప నోపు నా
క్కగణనయే సచేతనులఁ ♦ గల్పుట యక్కట! యెక్క వింతయే. 230

సీ. కైరవంబులకును ♦ గల్పించు దినకరఖరకరరాగంబు ♦ గాఢముగను
జలజాతములకునుఁ ♦ దొలఁగించు హిమకరకరగతవైరంబు ♦ కానఁబడఁగ
రాత్రిని బగలుతో ♦ రహిని గూడఁగఁ జేయుఁ జీఁకటి వెన్నలఁ ♦ జేరఁ జేయు
నీడయు నెండయుఁ ♦ గూడ నొక్కటఁ జేయు మెఱపును మొగిలున ♦ స్థిరముఁ జేయు

తే. జరను దరుణిమతోఁ గూడ ♦ దిరుగఁ జేయు
నొర యెంతకుఁ జాలఁ డీ♦మారహతకుఁ
డవని దుస్సాధ్య మే దింక ♦ నకట యితని
కీదృశాగాధగాంభీర్య ♦ నిట్లు చేసె. 231

ఉ. ఎక్కడఁ దత్తపోవ్రత మ ♦ దెక్కడ నీదశ యప్రతిక్రియం
బక్కట యీయుపద్రవము ♦ హా యిపు డేమి యొనర్చువాఁడ నే
దిక్కున కేగువాఁడ నిఁక ♦ దీనత నెవ్వరి నాశ్రయించెదన్
దక్కవు ప్రాణముల్ దడవు ♦ తాళిన నేమి యుపాయ మిచ్చటన్. 232

ఉ. ఎవ్వఁడు దోడ్పడున్ శరణ ♦ మెవ్వనిఁ జొత్తును; నేమి యుక్తి నా
కెవ్విధ మాచరింపఁ దగు ♦ నేసిపుణత్వము నెట్టి యుక్తి పెం
పెవ్విధి నేసమాశ్వసన ♦ మేప్రతిభన్ గనుపించినన్ గటా
నెవ్వగ మాని జీవమును ♦ నిల్పఁగఁ జాలును నీతఁ డంచు నే. 233

తే. పలువిధంబులఁ దలఁచుచుఁ ♦ బలవరించు
నతనిఁ గన్గొని యుల్కుచు ♦ నాత్మయందు
మరల నిట్లని యనుకొంటి ♦ మగువ! యేన
పట్టితలఁపులు నే మగుఁ ♦ బట్టువలయు. 234

క. నిలుపఁగ వలయును నసువులు, నలిపి శుభంబో యశుభమొ ♦ సత్వరవృత్తిన్
సలుపఁగఁ దగ దాలస్యము, సలుపం దగు నేమి యిపుడు ♦ సంరక్షింపన్.

సీ. తత్సమాగమ మెందు ♦ దక్కంగ నొం డుపాయంబు లేదీతని♦యసువునిలుప
నప్రగల్భుఁడు బాలుఁ♦డోటను నీతండు దర్పకుచెయ్వులు ♦ తాపసులకు
నపహాసనీయంబు ♦ లనుచితంబు లటంచు మది నెంచితా నయా♦మగువఁగదిసి
కొనయూపిరిని యున్న♦తనకోర్కి లీడేర్చుకొనఁ జాలఁ డవ్వల♦మనఁగ లేఁడు
తే. అతివిగర్హితకృత్యంబు ♦ నైనఁ జేసి
మనుపవలె మిత్రు నని పెద్ద ♦ లనుదు రిలను
గడుఁ ద్రపాకరమైన న♦కార్య మైన
వలయు సలుపంగ నేమే న♦వశ్య మకట. 236

ఉ. ఏమి యొనర్తు నొండుగతి ♦ యెయ్యది? యేగెద దానియొద్దకే
యీమరుబారి నెల్ల వచి♦యించెదఁ దేటపడంగ నామెకుఁ;
ఆమెయు వీని కింక గతి ♦ యంచు మనంబున నెంచి వేగమే
యే మనునో యెఱింగి నను ♦ నిట్టి యనర్హవిధిప్రవర్తకున్. 237

చ. వల దను నేమొ లజ్జ నని ♦ వానికిఁ దెల్పక యే నెపంబునన్
వలనున లేచి వచ్చితిని ♦ వారిజలోచన! పాసి యచ్చటుల్
దెలిపితి నమ్మ సర్వమును ♦ దెల్లముగా నిటులుండ నీకతన్
సలుపఁగఁ బోలు నేమి యది ♦ సల్పుము ధన్యులఁ జేయు మమ్ములన్. 238

ఉ. ఏ నరుదెంచినందులకు ♦ నీదృగపూర్వమహానురక్తికిన్
జానగు నేది నీకు నిట ♦ జానగు నెయ్యది దానిఁ జేయఁగాఁ
జాన! వలంతి వీవ యిఁకఁ ♦ జాలు నటంచును మిన్నకుండె నా
యాననముం గనుంగొనుచు ♦ నట్టె వచింతునొ యేమి యంచు నే. 239

క. విని నే నావచనంబుల, ఘనసౌఖ్యసుధాబ్ధిమగ్నఁ ♦ గన్నురసాంభో
ధినిమగ్న నాఁగఁ గోర్కుల, కొన సర్వానందములయుఁ ♦ గొనను నిలిచితిన్.

సీ. తత్కాలజాత మై ♦ తనరెడు సిగ్గున నించుక తలవాంచి ♦ యిలను గనుచుఁ
బడకుండఁ జెక్కిళ్ల ♦ నెడ లేక గూర్చినముత్యాలసరముని ♦ మోహ మొదవఁ
గనురెప్ప లడ్డంబు♦గామిని విడి విడి పయిపయి నెడ లేక ♦ పడుచు నదరి
తొరఁగు నానందాశ్రు♦తోయకణంబులఁ దెలుపుచు హర్షంబు♦తేటపడఁగ
తే. దలఁచితిని నిట్లు మనమున♦దైవవశత,నీయనంగుండు ననుఁ బోలె♦నితనిఁ దవిలె
నిక్కమే నిది విరహాగ్ని♦స్రుక్కి నన్నుఁ, జేసిననుఁ జేయుఁగా కేమి♦చేసెవలను.

ఉ. నిక్కము గాఁగ నిట్టిదశ ♦ నెక్కొను నేనియు వానికిన్ మరిం
దక్కి మహోపకారమును ♦ నస్మరణీయ మొనర్చె నాఁడె పెం

పెక్కుఁగ నాదుకోర్కులను ♦ నెల్లను గూర్చినవాఁడె వీనికిన్
మిక్కిలిచుట్ట మెవ్వ రిఁక ♦ మేదిని నాకుఁ దలంచి చూడఁగన్. 242

చ. తలఁపఁ గపింజలుం డితఁడు ♦ తాపసచంద్రుఁ డబద్ధ మెన్నఁడేన్
బలుకుని స్వప్నమం దయినఁ ♦ బాల్పడఁ డంతటిక్రూరవృత్తికిన్
సలుపుదు నేమి నే నిపుడు ♦ సన్ముని కీతని కేమి చెప్పుదున్
దెలియఁగ రా దటంచు మదిఁ ♦ దీవ్రత నేఁ దలపోయుచుండఁగన్. 243

చ. కనుకని నొక్కయంతిపురి♦కావలికత్తియ వచ్చి యమ్మ! మీ
జనని గనంగ వచ్చె నిను ♦ స్వాస్థ్యము చాలమి నీకు నేవకీ
జనములు చెప్పఁగా ననుచుఁ ♦ జయ్యనఁ జెప్పఁగ నంత నామహా
జనములసందడిన్ వెఱచి ♦ సన్ముని యాతఁడు లేచి వేగమే. 244

చ. ఇనసుత! పోయివత్తు నిట ♦ నేఁ దడ వయ్యెను వచ్చి పోవలెన్
ఇనుఁ డదె యస్తమించెడిని ♦ నింక వచించెడి దేమి మిత్రునిన్
మనుపు మటంచుఁ గేల్మోగిచి ♦ మానిని! మ్రొక్కెదఁ జాలు నా కిదే
ఘనమగుపారితోషికము ♦ గాఁగఁ దలంచెద నేమి చేసెదో. 245

మ. అని ప్రత్యుత్తర మే మొసంగుదునొ నే ♦ నం చైన నీక్షింపకే
చన నాతండు మదంబ ముందరను వే ♦ చం దెంచు దౌవారికా
జనమూకాంగవిహీనవర్షధరకు♦బ్జవ్యాధవామాంగస
న్నినదవ్యాకుల మైనద్వారసరణిన్ ♦ వే త్రోసికొంచున్ గటా!. 246

చ. జననియు మత్సమీపమునఁ ♦ జాల వసించి తదీయవేశ్మకున్
జనియెను; నామె వచ్చి యట ♦ సల్పెను నేమి వచించె నేమి యం
చు నెఱుఁగ నేను నేమియును ♦ శూన్యమనస్కను నంత భానుఁడున్
జనియెను బశ్చిమాశకును ♦ క్ష్మాతల మెల్లను గ్రమ్మెఁ జీఁకటుల్. 247

మహాశ్వేత తరళికతోఁ గర్తవ్య మాలోచించుట.

తే. ఏమి యొనరింప నెటకును ♦ నేగ మనసు
పొలుప కాతరళికఁ బిల్చి ♦ కూర్మి యొసఁగ
నడిగితిని నిట్లు నెచ్చెలి! ♦ యువగతంబు
కాదొ నాయున్కి కన్నులఁ ♦ గనిన నీకు. 248

క. హృదయము గడు నాకులమై, యదరెడుఁ గరణంబు లెల్ల ♦ నవశములగుచున్
బదరెదు నేమి యొనర్పను, గదలవు నా కేమి చేయఁ ♦ గలుగదు మనసున్.

ఉ. ఏమి యొనర్పఁగా వలెనొ ♦ యించు కెఱుంగను నేను జెప్పుమా
యేమి యొనర్పఁగాఁ దగును ♦ నిప్పుడు నా కిట నీవు చూడఁగా
నాముని యట్లు చెప్పి చనె ♦ నన్యవరోరులఁ బోలె నేనునుఁ
దీమస మేద సిగ్గు విడి ♦ తేకువ మానియు శీల మెంచకన్. 250

చ. వినయము వీటిఁబోవఁగ వి ♦ వేకము వీడి జనాపవాదముఁ
గనక యశం బడంగుటను ♦ గాంచక వంశము నెంచ కెంతయుఁ
గనులను గప్ప రాగ మటు ♦ గాంచక తల్లియుతండ్రిసమ్మతిఁ
గొనినఁ బదీయహాస్తమును ♦ గూరును వారినిమీఱుదోషమున్. 251

ఉ. వీనిఁ దలంచి ధర్మమును ♦ వీడక యొండొకపక్ష మూని నేఁ
బ్రాణముఁ బాయనుం దెగినఁ ♦ బాయుఁ గపింజలుచెల్మి తోల్త నేఁ
బూనితి వానితోఁ జెలమి ♦ పూజ్యుఁడు నాతఁడు తాన వచ్చెఁగాఁ
గానఁగ నన్ను నక్కట వ ♦ గఁ దగ దాతనిమాట మీఱఁగన్. 252

చ. ఇది యటు లుండ దీనికిని ♦ నెక్కుడుపాతక మొండు కల్గెడిఁ
బొదలఁగ నాశపెట్టితిఁ ద ♦ పోధనుఁ డాతని కేను దాని కే
నొదవిన భంగ మాతఁ డిఁక ♦ నూరక ప్రాణము వాయకుండునే
పదలునె నన్ను మానివధ ♦ పాతక మక్కట కొన్నయట్టు లౌ. 253

చ. అని వచియింపు చుండ నుద ♦ యాద్రిపయిఁ బొడసూపె జంద్రుఁ డా
తనివిరళావలోకనము ♦ తాఁ గ్కొని వాసవదిక్కు తెల్ల నై
తనరె వసంతకాననము ♦ దద్దయుఁ బుప్పొడినొప్పు నొప్పునఁ
ఘనపథ మెక్కె నంత శశి ♦ గౌరమయూఖము లుల్లసిల్లఁగన్. 254

వ. అంత. 255

సీ. చంద్రకేసరికర ♦ సంవిదారితతమః కరికుంభ మౌక్తిక ♦ ఘనరజంబొ
యుదయాద్రిగతసిద్ధ ♦ మదవతీకుచగళ చ్చందనసంచూర్ణ ♦ సంచయంబొ
ప్రచలితజలనిధి ♦ భంగానిలోద్ధూతతటసికతాతల ♦ పటురజంబొ
యుద్వేలమై పొంగు ♦ నుత్తుంగజలనిధి చంగత్తరంగాంబు ♦ శకలచయమొ

తే. చంద్రదర్శనసమ్మోద ♦ సస్మితోజ్జ్వ
లన్నిశాకాంతదశనప ♦ లత్ప్రిభాళి
యనఁగఁ జెలువొందుధవళచం ♦ ద్రాతపమునఁ
దూర్పు మణు లారపోసిన ♦ నేర్పు చెలఁగ. 256

తే అంతఁ బాతాళముననుండి ♦ యవనితలము
చీల్చుకొని పైకి వచ్చెడు ♦ శేషుసుఫణ

మండలము నాఁగఁ జంద్రుండు ♦ నిండుపండు
వెన్నెలలు గాయఁ జదలున ♦ వెలుఁగఁ దొడఁగె. 257

సీ. సకలలోకంబులు ♦ సంతోషజలనిధివీచుల జలకేళి ♦ వేడ్క సలుప
వలరాజు చెలరేఁగి ♦ యలికులవేణులఁ దలఁకక యవలీల ♦ వలకుఁ దార్పఁ
గామినీకాముకుల్ ♦ కలహంబులను మాని లీలల రతిరాజు♦మేలుకొలుప
నిల నెల్లయెడలను ♦ నేపునఁ బ్రేఁబులు సురతమహోత్సవ♦పరతఁ దేల
తే. బాలభావంబు నించుక ♦ పాసి పోవ
సముపజాతానురాగుఁడై ♦ జవ్వనంబు
పగిది నొలిని దివి కెగఁ♦బ్రాఁకె విధుఁడు
యామినీకాంతకోర్కులు ♦ నడరె మిగుల. 258

ఉ. చేరువ నీరు సంభ్రమునఁ ♦ జెన్నలరారుప్రవాళదీధితుల్
గూరెనొ, స్నేహకోపమునఁ ♦ గోమలి రోహిణి తాఁచఁగాఁ దదీ
యారుణపాదలాక్షరస ♦ మంటెనొ; ప్రాగ్గిరిసింహపాణిసం
దారితరంకుశోణితము ♦ దార్కొనెనో యన లోహితాంగుఁడై. 259

మహాశ్వేతాకామపీడాభివృద్ధి.

చ. మలయుహిమాంశుఁ గాంచి మది ♦ మండుచు నున్నను మారవహ్నికిన్
గలఁగి తమోంధచిత్త నయి ♦ గాసిలి మత్స్యభయంకవీతమున్
దలగడగాఁ బరుండియును ♦ దర్పకు చేతికిఁ జిక్కి స్రుక్కుచున్
దలఁచితి మిత్తి గన్గొనుచుఁ ♦ దామరసారిని గాంచు చీకటిన్. 260

చ. మలయసమీరుఁడున్ మధుఁడు ♦ మారుఁడు నాదిగఁ గల్గునెల్లరున్
దలఁపఁగ నొక్కయెత్తు హిమ♦ధాముఁ డితం డొకరుం డొకెత్తు దాఁ
గలఁచెడి దోషకారి నను ♦ గాటముగా నిఁక నైఁపఁ జాల నేఁ
గలఁగెడి మారవేదనకు ♦ గాసిలి నాహృదయం బి దక్కటా!. 261

తే. ఈచలివెలుంగురాకడ ♦ యెంచ శీత, లార్తునకు హిమపాతంబు♦నట్ల నార
తజ్వరార్తున కంగార♦ధారవృష్టి, గరళమూర్ఛితునకుఁ బాము♦కాటు గాదె.

తే. అనుచు నీగతిఁ దలఁచుచు ♦ నడరుచుండ
హిమకరోదయనీత మై ♦ యొసఁగు కమల
వనములను వాడ్చు నిద్రనాఁ♦గను దనర్చు
మూర్ఛ నను గప్పఁ గనుఁగవ ♦ మూఁతపడియె. 263

చ. తరళికసంభ్రమంబునను ♦ దక్షిణమే వ్యజనానిలంబులన్
సురుచిరగంధచర్చలను ♦ సొమ్మను దెల్ప నొకింత దేరితిన్;
దరళిక చంద్రకాంతిమణి ♦ తారిచి మన్నిటలంబు ధారలై
దొరఁగెడుబాష్పవారులను ♦ దోఁగఁగ నానన మేద్చుచున్ గడున్. 264

చ. కనుఁగవ విచ్చి గాంచునను ♦ గాంచి వినీతిఁ గృతప్రణామయై
ఘనహారిచందనార్ద్రకర♦కంజయుగంబును మోడ్చి పల్కెనో
యినసుత! యేల సిగ్గుపడు ♦ దేటికిఁ దల్లియుఁ దండ్రి నుండ నేఁ
బనుపుము నన్ను నీదువలి♦ప్రాణము జీవితనాథుఁ దెచ్చెదన్. 265

చ. చను మట యింత యేటికిఁక ♦ జాగు నొనర్పఁగ నేల నీవె తె
మ్మనఘమతీ! హిమాంశునుద♦యంబున నేవునఁ బొంగి పొర్లుతో
యనిధిగతిన్ జెలంగెడున♦నంగుని నోర్వ వలంతి వప్పు డీ
వని వచియించుదాని గని ♦ యంటిని నే నిటు వెచ్చ నూర్చుచున్. 266

సీ. *సందియంబుల నెల్ల ♦ సన్నగిల్లఁగఁ జేసి యఖిలవిఘ్నంబుల ♦ నణఁచి వైచి
శంకల నెల్లను ♦ సంహార మొనరించి సర్వవికల్పముల్ ♦ చనఁగఁ జేసి
కాలాతిపాతంబు ♦ చాల దూలఁగఁ జేసి వలకుల నెల్లను ♦ బిలుకుమార్చి
సిగ్గునెగ్గుల నెల్ల ♦ నుగ్గునూఁచఁగఁ జేసి యాత్మాభిగమనైచ్య ♦ మణఁగఁ జేసి
తే. యతనియొద్దకొ మృత్యుదై ♦ వతముకడకొ
కుముదినీకాంతుఁ డీతండు ♦ భ్రమను బాపి
తీసికొని పోవు నీతుంట ♦ తీయవిల్తు
తోడఁ బని యేమి యింక నోఁ♦తోయజాక్షి!. 267

—మహాశ్వేత పుండరీకునియొద్దకు రాఁ బ్రయాణ మగుట.—

ఉ. తామస మేల లెమ్ము నను ♦ దద్దయు గాసిలఁ జేయు నామన
స్స్వామినిఁ జేరి యాడిగము ♦ సల్పుచుఁ బ్రాణము నిల్పుకొందు నిం
కేమియు నేల యీక్షణమ ♦ యేగుద మేగతి నైననున్ సఖి
యేమి ఘటించునో విధి; మఱి♦తేమి యటంకము లేగుదెంచునో. 268

చ. అని మరుతాపఖేదమున ♦ సంగము లెల్లను డిల్లవోవ నా
యనుఁగువయస్య నూఁతఁగొని ♦ యంతట లేచితి లేవ నాదుద

* పాఠాంతరము. చ. మదనునితోడ నేమి పని ♦ మానిని సిగ్గును సందియంబులన్
వదలఁగఁ జేసి విఘ్నములఁ ♦ వారణచేసి వికల్పకోటులన్
గదిమి సమస్తతర్కములఁ ♦ గండడఁగించి సుధాంశుఁ డీతఁడే
గదియఁగఁ జేయు మృత్యువునొ ♦ కాంతుని నాతనినో తలంపఁగన్.

క్షీణనయనంబు కంపమును ♦ జెందెను దుశ్శకునంబు దెల్పుచుం
గనుఁగొని దాని భీతి విధి ♦ గల్గఁగఁ జేసె మఱొండు దేవినో. 269

చ. అనుచుఁ దలంచు చుండ నట ♦ నాకసవీథిని గొంతవడ్వనం
గనఁబడెఁ జంద్రమండలము ♦ గాయఁగ వెన్నెల గంధసారవా
రినిఁ దొలికించు నా సుధస♦రిత్పతివూరముఁ గ్రుమ్మరించు నాఁ
బెనుమినువాఁకవెల్లువలఁ ♦ బెల్లుగఁ గ్రక్కెడు నా వెలుంగుచున్. 270

వ. ఇట్లు త్రిభువనప్రాసాదమహాప్రణాలాయమానుం డై చంద్రుండు తనపండు వెన్నెల లెల్లయెడల నిండి బ్రహ్మాండ మెల్లఁ క్షీరసాగరంబువడువునఁ గడు నడర సకలజనంబులు తెలిదీవిఁ మెలంగునంగునఁ జంద్రలోకంబుం బొందిన చందమున నమందానందమ్మునఁ దొప్పదోఁగ నింటింట మచ్చుకంటులు కుముద గంధంబులఁ జందనోదకంబున నాకుముదబాంధవునకు నర్ఘ్యంబు లొసంగ; రాజమార్గంబులు రాజీవనేత్రలు తమ జీవితేశ్వరులఁ గొని తేర నింపున నంపిన దూతికలగుంపులసంకులంబు లై యింపు పెంప; వికసిల్లునల్లకలువలజిగులు మొల్లంబు లై గప్పునొప్పుకమలవనలక్ష్ములు నా నొప్పఁ గొల్పునభిసారికాసారసాక్షులు సారసారాతిఖరకరంబులకును వెఱచి యొడలెల్ల నల్లనిజిలుగువలువల ముసుంగు లెసంగం ధరియించి యిటునటుఁ జటులగతిం బఱవ; భ్రమరంబులు కుముదవనంబులఁ దండంబులయి మూఁగి భువనదీర్ఘికలం గలకుముదినుల ఝుంకారమధురగానంబుల మేలుకొలుప; వికసితకుముదవనబహుళధూళిధూసరితం బయి యంతరిక్షంబు నిశానదీపులినాయమానం బగుచు వెలుంగ; జీవలోకంబు రతిరసమయంబు నా నుత్సవమయంబు నా విలాసమయంబు నాఁ బ్రీతిమయంబు నా మహార్ణవంబుచందంబునఁ జంద్రోదయానందనిర్భరం బై చెలంగఁ, జంద్రకాంతశిలాప్రణాలంబు లతివేలంబు లయి ప్రవహింప, నెత్తమ్ములు మొత్తమ్ము లయి ప్రమోదముఖరమ్ము లగుచు నృత్తమ్ము సలుప, నట్టియెడవివిధకుసుమదామకంబులను, దాంబూలాంగరాగపటవాసచూర్ణంబులం గొని తరళిక వెంట నంటి చనుదేర స్వీయజనంబులకేనియు నెఱుకపడకుండఁ బద్మరాగప్రభానిర్మితంబు నాఁ దనరురక్తాంబరంబున నవకుంఠితసర్వాంగ నై యామందారమంజరీస్ఫటికాక్షమాలలఁ గర్ణావతంసకంఠాభరణంబులం జేసి కొని మూర్ధ్నసమయనిక్షిప్తంబు లగుచందనచర్చాంగరాగంబులును గించి దాశ్యానచందనలలాటికాలగ్నధూసరాలకలంబు లట్టె యుండ నాప్రాసాద శిఖరంబు మెల్లఁగ డిగి తత్పారిజాతకుసుమవాసనాసమాకృష్టంబు లగుచు

శూన్యీకృతోద్యానంబు లయి కుముదామోదంబునుదిగనాడి పరుగులిడుసుధ
కరనికరంబులు నీలపటావకుంఠనం బై దోఁప ప్రమదవనంబు దిడ్డివాకిటం
బడి పరిజనంబుల నేరినిం జీరక తరళికాద్వితీయనై వానిచెంతకు నేగుచు నన్నుం
గాంచి మనంబున నిట్లని వితర్కించితి. 271

చ. ప్రియతము లుండు చోటులకుఁ ♦ బ్రేముడి నేగెడు వారి కేల యీ
బయట మెలంగు నూడిగపు♦వారలు; వీరె యొనర్తు రా పనుల్
నయమున; నెక్కుపెట్టి విలు ♦ నారసముం గదియించి శంబరా
రి యనుసరించుఁ; గొంచుఁ జను ♦ రేదొర చేతు లొసంగియూఁతగాన్. 272

చ. పడఁదునొ జాతి కా లనుచుఁ ♦ బట్టుకొనుం బ్రతిపాదమందు న
న్నడరెడురాగ మార; హృద♦యంబును సిగ్గును ద్రొక్కి వెన్కకున్
వడిఁ బరువెత్తు; ముందు కర♦ణంబులతోడుత నన్ను వీఁపుపై
నిడికొని పోవునుత్కలిక ♦ యెక్కుడు భక్తిని నిక్కువంబుగన్. 273

క అని మనమునఁ దలపోయుచుఁ, గని తరళిక నితఁడు శీత♦కరహతకుఁడు న
న్గొనిపోవుపగిది వేగమ, గొనివచ్చెనొ యతని నీడ్చు♦కొని యిచ్చటికిన్.

వ. అనుచున్న నన్నుం గాంచి తరళిక యి ట్లనియె. 275

చ. ముగుద వెఱుంగ వేమి నృప♦పుత్త్రిరొ! యీశశి కేమి వానితో
నగునది? యీతఁడే సుమశ♦రార్తుఁడు నా నిను గాంచి సల్పెడున్
వగవగ వెఱ్ఱిచెయ్వుల న♦పారములం గనరావె నీ కివే
మగువ! యెఱుంగవే యితని ♦ మాయలు తెల్పెద నాలకింపుమా. 276

సీ. చెమ్మటబొట్లచేఁ ♦ జెలఁగు నీచెక్కిళ్లఁ దమిమీఱ ముద్దాడుఁ ♦ దరచి తరచి
లావణ్యనిధులు నా ♦ లలితంబు లగుపయోధరముల నంటును ♦ గరము లదర
నిర్మలనఖలగ్న♦నిస్తులమూర్తియై నడుగులఁ బడి నిన్ను ♦ నడిగి కొనఁగ
రశనామణుల మృదు♦రాజితకరములఁ బొరిఁ బుడ్కుచునుమదిఁ♦గరఁగఁ జేయుఁ

తే. దరుణి! యీతఁడు ప్రతిబింబ♦దంభమునను
శుష్కపాటీరలేపన♦శోభితావ
దాతతనుఁ డాయె మదనసం♦తాపముననొ
బిసవలయసితకరుఁ డయ్యెఁ ♦ బెల్లు గనుమ !. 277

క. ప్రతిబింబవ్యాజంబునఁ, బతితుండగు స్ఫటికమణిని♦బద్ధస్థలులన్
సితకరమణులను సలిల, స్రుతితతముల నంటుఁ జూడు ♦ సొగయఁ గరములన్.

తే. కేతకీగర్భకేసర♦కీర్ణపాండు, పాదుఁ దై కైరవప్రాద♦పంక్తులందుఁ
గ్రుంకునంభోజవనములఁ♦గూడ వెలిచు, వానితాపంబువర్ణింప♦వశము గాదు.

వ. ఇట్లు తత్కాలోచితంబు లగునితరాలాపంబుల నాడుకొంచు నాప్రదేశంబుఁ జేరి 280

తే. త్రోవఁ గలవువ్వుఁదీవెల♦ధూళి గ్రమ్మి, ధూసరము లైనపదములఁ♦దోయజారి
కిరణములుసోఁకి గరఁగిన♦గిరిశశైల, చంద్రకాంతశిలాఝరీ♦జలములందు.

తే. కడిగికొనుచుండ నామునిఁ♦గాంతుఁ డున్న
కొలఁకుపడమటిదెసనుండి ♦ కలఁగి మనము
వీనులం బడె రోదన♦ధ్వాన మొండు
మగయెలుఁగువోలె నవ్యక్త♦ మగుచు నాకు. 282

తే. ముందె కుడికన్ను నదరున ♦ సందియంబుఁ
గన్న నాగుండె గలగుండు ♦ గాంచె మిగుల
దాన నిన్నడి; నే మందుఁ ♦ దలఁపునందుఁ
జెకుతలంపు ల వేవేలొ ♦ కడలుకొనియె. 283

తే చిత్తము విషణ్ణ మై యేమి ♦ పోత్తుపోక
తరళికా! యే మిఁకంచును ♦ దద్దఱిలుచు
నడుగుచును వేపమానాంగి ♦ నగుచు వేగ
పోయితిని దాని కెదురుగ ♦ భూపతనయ!. 284

వ. అంత. 285

కపింజలుని శోకము.

సీ. నొచ్చితిఁ గాలితిఁ ♦ జచ్చితిఁ గటకట మోసపోయితిఁ గదు ♦ మూర్ఖ నైతి
నేమి చేసితిఁ దుర ♦ కేమాయెఁ జెడితిని పాప! నిర్ఘృణ! పంచ♦బాణ! మదన!
యేల చేసితి విట్టి♦మాలయకృత్యంబు దుష్కృతకారిణి!♦దుర్వినీత!
పాపిని! నీ కేమి ♦ పాపంబు కటకట చేసెఁ జెప్పుము మహా♦శ్వేత! యయయొ
యకట దుశ్చరిత్ర! ♦ యంభోజశాత్రవ! ధన్యుండ వైతి సు♦ధానిధాన!

తే. దక్షిణానిల! యుపగత♦దక్షిణత్వ!, నిండె నీకోర్కు లెల్లను ♦ బండెఁ బంట
చేయుఁ దగువాని నెల్లనుఁ ♦ జేసి తింక, మనసువచ్చినగతి వీచి ♦ మలగుచుండు.

ఉ. అక్కట శ్వేతకేతు గన ♦ వాత్మను దొంగిలినట్టి యముండు నీ
మక్కువపుత్త్రు; నిన్నుఁ గను♦మానిసి యెవ్వఁడు ధర్మమా! యిఁకెట్టి

నిక్కువ మోతపంబ! యింక ♦ నీవు నిరాశ్రయ వైతి! భారతీ!
యక్కట నీవును౯ విధవ ♦ వైతివి; నీగతి యేమి సత్యమా!. 287

చ. అమరపురంబ! పాడుపడి ♦ తక్కట మిత్రుఁడ! నేను వత్తు నుం
దుము నినుఁ బాసి యొక్కరుఁడ ♦ డొంకక యుండ వలంతినే గటా
నిముసము చూడకున్న నిను ♦ నెవ్వగఁ గూరెదు నన్ను నొక్కని౯
దమమునఁ ద్రోచి పోయెదవు ♦ ధర్మువె యన్యునియట్టు లొక్కట౯. 288

ఉ. ఎక్కడనుండి వచ్చె వచి ♦ యింపుమ యాకశివత్వ మక్కటా
యెక్కడి కేగువాఁడ విడి ♦ యే నిను నెవ్వరి నాశ్రయింతునో
యక్కట చీఁకునైతి దెస ♦ లన్నియు శూన్యము లయ్యె నాకు నిం
కెక్కడిజీవితంబు తప ♦ మెక్కడ సర్వము వ్యర్థ మయ్యెఁ బో. 289

ఉ. ఎవ్వనితోడఁ గూడి యిఁక ♦ నేకత ముండుదు మేలమాడుదు౯
ఇవ్వసుధాస్థలంబు సుఖ ♦ హీనముగా సఖ! యుత్తరంబు ని
మ్మెవ్వరి కొప్పగింతు నను ♦ నెక్కడఁ బోయెను నాదుపైన నీ
కవ్వరసౌహృదంబు కట! ♦ యక్కట నీచిఱునవ్వుమాటలు౯. 290

చ. అను నివి యాదిగాఁ గలుగు ♦ నన్యములు౯ గడుఁ బేరుకొంచు నిం
కను నెలుఁ గెత్తి దీనముగ ♦ గట్టిగ నేడ్చు కపింజలు౯ గటా
వినితిని దవ్వుల౯ జెవులు ♦ ప్రీల నిశీథముగాన వ్యక్తమై
వినఁబడఁ బ్రాణముల్ తనువు ♦ వీడినవో యనఁ బెద్దపెట్టున౯. 291

ఉ. అక్కడనుండియే దెసలు ♦ హా యన నార్తిని గూరి యేడ్చుచు౯
స్రుక్కుచు మిట్టపల్లములఁ ♦ జూడక పాదము జాఱి దొర్లుచు౯
చిక్కి సరస్తటీలతలఁ ♦ జిన్గఁగఁ జీరచెఱంగు చూడకే
యక్కట పోయితి౯ గలుగు ♦ నంతరయంబునఁ దత్ప్రదేశమున్. 292

మహాశ్వేత మృతుఁడయిన పుండరీకుని గాంచుట

ఉ ఆసరసీతటంబునకు ♦ నంతికసీమను శీకరస్రవో
ద్భాసిత మైనయొక్క హిమ ♦ ధావశిలాతల వేదిపైన సం
వాసితకైరవాంబురుహ ♦ వన్యబహూజ్జ్వలపుష్పమాలికా
భాసుర మై ప్రసూనశర ♦ బాణచయం బన నొప్పుశయ్యపై. 293

సీ. మత్పాదశబ్దంబు ♦ మమత నాలించు నా స్పందనరహితుఁడై ♦ పరఁగువాని
మది గలంగిన కొల ♦ గుదియింప నాఁ బ్రాణయమము నొనర్చు నా ♦ నడరువాని

నపుడే సుఖస్వాప ♦ మందె నో యన లోనికినుక నారినమరు♦కేలివాని
నీకతంబున నిట్టి♦వెగు లాయె నా కని వివరించునెత్తిని♦పెదవివాని
తే. గలిగెఁ గా నీకు నాకంటెఁ ♦ గడుఁ బ్రియంబు
గూర్చుజన మొం డటంచును ♦ గోపమునను
జీవితము వీడె నా గత♦జీవుఁడైన
వాని మనసుతోఁ గంటి భూ♦జాసితనయ!. 294

చ. ఎదురుగ నుండ లేక శశి ♦ కించుక నొత్తిలి పండియున్న యా
చదువరివీఁపుపైఁ బడిన♦చంద్రగభస్తులు మన్మథాగ్నికిన్
జెదరెడుఱొమ్ముపై నిడిన♦చేయినఖద్యుతికై తవంబునన్
విదళితపృష్ఠసీమ లయి ♦ వెల్కని వెల్వడె నాఁ జెలంగెడిన్. 295

ఉ. తాను వినాశ మొంద జని♦తం బగుదర్పకచంద్రరేఖ నాఁ
గాను దనర్చుశుభ్రసిత♦గంధిలచందనరేఖ ఫాలమం
దూని మృణాళసూత్రము స♦ముజ్జ్వలముల్ సరసంబు జందెముం
గాను ధరించి వల్కముగఁ ♦ గప్పి యనంటులగర్భపత్రముల్. 296

ఉ. తాలిచి తారహారమును ♦ దజ్జపమాలగఁ బచ్చకప్ర ము
ద్ధూళితభూతి గాఁగఁ దెలి♦తోరము గాఁగ మృణాలతంతులన్
దాలిచి మన్మథవ్రతముఁ ♦ దద్దయు మత్సహవాసమంత్రముల్
జాల జపించు నా నలరె ♦ క్ష్మాపతిపుత్ర! యతండు మౌని యై. 297

తే. పంచశరబాధతోఁ గూడఁ ♦ బ్రాణములను, దాన వీడి నిశ్చేతన♦తానుఖంబుఁ
గాంచుచున్నాఁడొ నాఁగను♦సించువిల్తు, యోగవిద్యనుధ్యానించు♦నో జనలరె.

తే. అతనికడ కేను వచ్చున ♦ ట్లూఁపరించి
యులరి మదనుండు తత్ప్రాణ♦ములను దీసి
పూర్ణపాత్రం బొసంగిన♦పోల్కి నూత్న
ప్రాణయమ మభ్యసించు నాఁ ♦ బరఁగె నతఁడు. 299

ఉ. ప్రాణము లేగుచోఁ గలుగు♦బాష్పములన్ సతతోరురోదనో
చ్చూనత నెత్తివాటి గడు ♦ శోషిలినట్టితదీయనేత్రముల్
గానఁగ నయ్యె రక్తమును ♦ గార్చెడి నాఁ గఠినాత్మ! దర్శనం
బీనియు నీయవైతి వని ♦ యెన్నెడి నాఁ నతఁ డొప్పె వానిచేన్. 300

చ. అర వివృతాధరమ్ము గల♦యాతనివక్త్రమునుండి నిర్గమిం
చు రదనకాంతు లొప్పెను న♦సుల్ గొన లోఁ జొరఁ బడ్డ చంద్రముః

కిరణము లో యనన్ హృదయ♦కీలితవామకరంబు ప్రాణముల్
వరుఁగుడు వేళఁ దస్థ ననుఁ♦వానిబడిన్ జనకుండఁ బట్టు నాన్. 301

చ. వెలికిల నై నఖద్యుతుల♦వెల్లెదుతత్కర మొండు పోల్చె స
న్మలయజమున్ స్రవించు నన♦మంజుల మై; ద్విజరాజపాదముల్
పోలయక యుండ నడ్డ మిడు♦పొంకమునన్; మెడ నెత్తి యప్పుడే
తొలఁగినప్రాణముల్ జనెదు♦త్రోవ కనుంగొను నాఁ దదంతిక
స్థలినిఁ దపోవయస్యుఁడగు♦చారుకమండులు వొప్పె నక్కటా. 302

చ గళము మృణాళవేష్టితము♦కంజవిరోధి తదీయప్రాణముల్
తలఁగఁగఁ జేయఁ దత్కరణ♦దారుణపాశములన్ బిగించె నా
నలరుచు నుండె; నన్నుఁ గని♦యక్కట చంపకు చంప కావలెన్
దొలఁగు తొలంగు మంచుఁ గడు♦దూరము నుండియెయూర్ధ్వబాహుఁ డై.

చ. ఇనుఁడుడి పెద్దపెట్టునను♦నేడ్చుచుఁ గంఠము గాఁగిలించి పె
న్మనుక లిడం గపింజలుఁడు♦పొంగుచుఁ బొర్లుచు నుండు బాష్పవా
రినిధితరంగపంక్తులను♦రేఁగువగన్ వసియించియుండఁ బ్ర
క్కనుబడి; గాంచితిన్ విగత♦కాయుని నాతని మందభాగ్య నై. 304

వ. అట్లు విగతజీవింతు డై పడియుండినయామునిపుత్రుం గాంచి విదీర్ణహృదయ నై తత్క్షణంబ సొమ్మవోయి రసాతలంబు చొచ్చినవిధంబున నంధీభూత నై యెక్కడి కేగుదెంచినదియు నే మొనర్చినదియును దుఃఖించితి నా యనియు నేమియు నెఱుంగనేరక శూన్యహృదయ నై. 305

చ. అతికఠినంబు నాహృదయ♦మాటనొ, దుఃఖము లెన్నియేని యీ
హతకశరీర మోర్వఁగల♦దాటనొ, బ్రహ్మ లిఖించి యుంటనో
వెతలు మదీయఫాలమునఁ♦బెల్లుగ, దేవుఁడు గణ్గుఁ డౌటనో
వెతలు నొసంగువేళ; నన♦విల్తుఁడు మిక్కిలి పాముఁ డౌటనో. 306

చ. ఏమిట నో యెఱుంగ నవు♦డేగఁగ లేదు మదీయప్రాణముల్
భూమిపపుత్త్ర! నే నెఱుఁగఁ♦బో నదియున్ గట మూర్ఛదేటి నే
భూమిని నగ్నిఁ బడ్డగతిఁ♦బొక్కుచు శోకవిదహ్యమాన నై
తామస నై గనుంగొనితిఁ♦దల్లడ మందెదు నన్నుఁ బొర్లుచున్. 307

క. తనర నసంభావ్యం బై, చనుతన్మరణంబు నాదు♦చాకుండుటచే
మనమున నమ్మక యిట్లని, పనరితి వావిడిచి యేమి♦వచ్చె నటంచున్. 308

## మహాశ్వేతావిలాపము.

సీ. జీవితకారణ! ♦ పోవిడి నను నొంటి యెట కేగెదవు నాకు ♦ నెవరు దిక్కు
నిర్ఘృణ! నీకయి ♦ నే నందినయవస్థఁ దరళిక నడుగుము ♦ వరగుణాఢ్య!
యొక్కదినంబును ♦ నక్కట పుచ్చితి యుగసహస్రమ్ముగ ♦ నోర్చి యెట్లొ
కనుఁగొను మీదెసఁ ♦ గరుణించు నాపయి మాటాడు మొకసారి♦మమతదీఱ
తే. భక్తవాత్సల్య మించుక ♦ పారఁ జేయు, నామనోరథ మొసఁగు మ♦నాథ నార్త
బాల ననురక్తనగతిక ♦ భాగ్యహీన, దీనురాలను మదనవి♦దీర్ణగాల. 309

ఉ. చేసితి నేమితప్పిదము ♦ చెప్పుమ యేపనిఁ జేయ నీకు నేఁ
జేసితి నెం దనాదరము ♦ చెల్లరె పల్కను మారు దేననున్
దాసజనంబు వీడి చన ♦ దారుణవృత్తి న టన్న నిందకున్
గాసిల నేల నిర్దయతఁ ♦ గాంచితి వేల యకారణంబుగన్. 310

ఉ. ఇంకను దాల్తుఁ బ్రాణముల ♦ నిస్సిరో నాయనురాగ మంతయున్
బొంకు; ప్రతారణైకమతిఁ ♦ బో కట పాపినిఁ గూళ నేఁ గటా
మంకును; మందభాగినిని ♦ మద్వినయంబును బంధు లెల్ల నీ
వింకితి రెట్లు కాలగతి ♦ కేమనుదున్ బరలోకముం జెడెన్. 311

ఉ. ఈగతి నిన్నుఁ గష్టముల ♦ నీఁదగఁ జేసిననాకుఁ బాపికిన్
బాగగు నేల పుణ్యగతి ♦ పాటెలు నేల ధరిత్రి నుండు నే
నాగతి క్రూరచిత్తయల♦నాఁడు నినున్ విడి యీదృశున్ గటా
యేగితి నింటి కింక గృహ ♦ మేల సఖుల్ దలిదండ్రు లేటికిన్. 312

ఉ. పరిజన మేల నాకు మఱి ♦ బాంధవు లేటికిఁ జొత్తు నెవ్వనిన్
శరణము; నాలకింపు కృప ♦ నామనవిన్ బతిభిక్ష పెట్టుమా
నిరుమతేజ! దేవ! భవ! ♦ నీదయ నాపయిఁ జూపవే వసుం
ధర! యసుదాన మిమ్మితని ♦ నర్మిలిఁ బ్రోవుఁడు మీరు దేవతల్!. 313

మ. సకలానుగ్రహకారిణీ! రజని! నా♦చాయన్ విలోకింప వే
ల కృపన్ జూపవు చొచ్చితిన్ శరణు కై♦లాసంబ తండ్రీ! నినున్
అకలంకం బగునీదయాళుతను నా♦యందున్ బ్రసారింప రా
దె కటా యేమి యఘం బొనర్చితిని న♦న్నవ్వారలున్ గావరే. 314

చ. అనునివి యాదిగాఁ గలుగు♦నన్యము లెన్నియొ యెన్ని జ్ఞప్తియం
దునుతును బేరుకొంచుఁ గడు ♦ నుమ్మలికించితి వెఱ్ఱిపోలికన్

బెనఁగొనినట్లు భ్రాంతములు ♦ బిట్టు గ్రహంబులు పట్టుకొన్నభం
గిని బ్రవహింప బాష్పములు ♦ కీలితధారలు నేలు లై పడిన్. 315

తే. పయిఁ బయిఁ దొరంగుబాష్పంబు♦పాళికలను
శంబరాకారమునుగొన్న♦చందమునను
గరఁగి ద్రవమయి యందులోఁ ♦ గలసినట్లు
తోఁచితిని జూపరులకే న♦దూషితాత్మ. 316

చ. రదనమయూఖసంగతిని ♦ రాజిలునాప్రవిలాపవర్ణముల్
పొదలెను సాశ్రుధారలనఁ ♦ బొల్చె గళత్కుసుమాలకంబులన్
వదలెడిబాష్పబిందువులు ♦ నాఁగను బ్రస్రుతరత్నభాస్రముల్
సదములభూషణంబులును ♦ సంరుదితంబులు నాఁగఁ దోఁచెఁ బో. 317

చ. అతఁ డుపలబ్ధజీవుఁడుగ ♦ నాత్మఁ దలంచితిఁ జావనుం గటా
మృతుఁ డయినన్ జొరంబడఁగ ♦ మేకొనితిన్ దమి వానిచిత్తమున్
సితశతశుమ్మచందనని♦షిక్తజలం బగుఫాలభాగమున్
వృతరసనాళసంగతిని ♦ వెల్గెడిస్కంధములన్ స్పృశింపుచున్. 318

చ. మలయజవారిబిందులవ♦మంజులకోమలపద్మినీదళం
బుల నవకుంఠితం బగుచుఁ ♦ బొల్చెడుతద్ధృదయంబు గండముల్
దలమున నంటుచున్ మిగుల ♦ దారుణచిత్తుఁడ వార్తను న్నను
దలఁప వటంచు దూఱుచును ♦ దద్దయు మాటికి నూఱడించుచున్. 319

ఉ. సారెకుఁ గౌఁగిలించుకొని ♦ చాలఁగ నేడ్చితి ము ద్దొసంగితిన్
గ్రూరమనస్క నే మరలఁ ♦ గూడెదునంతకు వీనిప్రాణముల్
గూరిమిఁ బ్రోవ వైతి వని ♦ గోపమునన్ గడుఁ దారహారమున్
మీఱఁగఁ దూల నాడితి న♦మేయశుగంబుధి పొంగి పొర్లఁగాన్. 320

చ. దయఁ గను మీతనిం దనువుఁ ♦ దాల్పఁగఁ జేయుము నన్నుఁ బ్రోవు మా
యయయొ కపింజలా! యనుచు ♦ నంఘ్రులపైఁ బడి మాటిమాటికిన్
దయ గలుగంగ వందురితిఁ ♦ దాలిమి దూలఁగ సారెసారెకుం
బయిఁ బడి నాదుదానిమెడ ♦ బాహువులం బెనవైచి యేడ్చితిన్. 321

చ. తలఁచిన నెంతరావిపుడు ♦ తత్సమయంబున నెట్లువచ్చెనో
కలమృదుచాటు సూక్తు లవి ♦ గాంచను నెప్పుడుఁ జెప్పరెవ్వరున్
దలఁపను వాని దీనములు ♦ తత్సరసోక్తులు తత్ప్రలాపముల్
దలఁప నపూర్వముల్ నృపసు♦తా యవి యెల్లను నన్యపద్ధతుల్. 322

చ. ప్రళయతరంగసంతతుల♦భాతిని నాత్మను బొంగుబాష్పముల్
వెలుఁగుచు వారియంత్రముల♦చేఁ బరిముక్తములట్లు ధారలై
యిలఁ దొరఁగెన్ బ్రలాపములు ♦ నేపున మొల్కలువోలె లేచె మూ
ర్ఛలు ప్రసవించు నా వెతలు ♦ క్ష్మాధరకూటములట్లు వర్ధిలెన్. 322

క. అని తనవృత్తాంతంబును, వినుచును నే యామె కడిఁది ♦ వెతను నతీతం
బును మగుడ ననుభవించెనొ, యనమూర్ఛను బ్రజ్ఞదప్పి ♦ యవనిపయిఁబడెన్.

చ. అవని శిలాతలంబుపయి ♦ నాపగిదిం బడునామె వేగ భూ
ధవతనయుండు పట్టుకొనెఁ ♦ దత్పరిచారకునట్లు కన్య నిర్
దవులఁ గరంబు చాఁచి వగ ♦ దార్కొన నామె పయుంటకొంగుచే
నవిరతబాష్పసిక్తమున ♦ నల్లన వీచి ప్రబుద్ధఁ జేసెఁ దాన్ 324

తే. తుడిచి యుద్వేల మై కడుఁ ♦ దొరఁగు బాష్ప
ములను జెక్కిళ్లఁ గడిగె నా♦ముదిత మూర్ఛఁ
దేఱి కనువిచ్చి చూడంగఁ ♦ దివిరె నంత
నామె కిట్లనె నృపసూనుఁ ♦ డడరుకృపను. 325

ఉ. పాపుఁడ నేఁ గడున్ దలఁప ♦ భామిని! నీవగఁ గ్రొత్త రేఁపితిన్
బ్రాపిత మయ్యె నీకు నిటు♦వంటియవస్థయు దీన నక్కటా
యోప వినంగ నీకథను ♦ సుజ్జన సేయుము చాలుఁ జాలు నీ
పాపముఁ బాపుకొందు నెటు ♦ బాపురె యేమి యొనర్చినాఁడ నో. 326

చ. అనుభవసన్నిభం బయిన ♦ యారటముం గలిగించుదుఃఖముల్
చనినను నెన్నఁడో యిపుడు ♦ సంస్మరియించినయంత నే సుహృ
జ్జనుల; కొనర్ప కమ్మ యెటొ ♦ సాగక నిల్చిన యాయసువ్రజం
బు నసులభంబు సంస్మరణ♦భూరిశుగగ్నికి నింధనంబుగాన్. 327

## మహాశ్వేత మరలఁ దనవృత్తాంతంబుఁ జెప్పుట.

క. అని చెప్ప నామె యాతని, కనియెను నిర్వేద మెసఁగ ♦ నశ్రులు గ్రమ్మం
గని వేఁడిగ నిట్టూరిచి, పెనఁగొనుగద్గదిక నిట్లు♦బిట్టువగచుచున్. 328

క. జననాథతనయ! యతిదా, రుణ మగునాహాతకనిశ నరుగ వఁట గడుని
ర్ఘృణములయిన యాయసువులు, చను నేననుఁ బాసియిపుడు ♦ చను నసులువుగన్.

క. కనుఁగొనఁ డపుణ్యహాతకను, ననుఁ బాపిని యంతకుఁడును ♦ నా కేగతి వ
చ్చును శోకము క్రూరాత్మకుఁ, గనఁగ నలీకం బిదెల్ల ♦ క్ష్మాపతితనయా. 330

తే. అన్నివిధముల నిస్త్రప ♦ మైనపాడు, మనసు నను నిస్త్రపల కెల్ల ♦ మునుగణింపఁ

జేసె నావిష్కృతాంగజ♦చేష్ట నగుచు, ననుభవించితి నఁట చెప్ప♦నడుగనేల.

చ. కలుగున దీనికన్నఁ గడుఁ ♦ గష్టతమం బిల నొందు నూఁకొనం
బలుక ననర్హ మీయశని♦పాతము పిమ్మట నేమి యాయెనో
తెలిపెద నావిచిత్రమును ♦ దీనము లీయసువుల్ ధరింప హే
తులవము వోలె వ్యక్తమయి ♦ దోఁపక తోఁచెను నొండు; దానికిన్. 332

చ. తెలిపెద నే దురాశ నృగ♦తృష్ణిక నీతనువున్ నిరర్థమున్
దలఁప కృతఘ్నమున్ మఱియు ♦ ధాత్రికి భారము నన్యదీయమున్
వలె వహియించితిన్ వినుము ♦ పార్థివపుత్రిక! యంత నాస్థితిన్
బలవి బహుప్రకారములఁ ♦ బాయఁగ దేహము నిశ్చయాత్మనై. 333

చ. తరళికఁ జూచి లెమ్మిఁకను ♦ దారువులం గొనితెచ్చి పేర్చు ని
ష్ఠురహృదయా! చితిన్ గళము ♦ శోషిల నేడ్చెద వేల జీవితే
శ్వరువెనువెంటఁ బోయెదను ♦ సత్వర మే ననునంతలోన నం
బరమునుండి వచ్చె నొక ♦ మానవుఁ డద్భుతదివ్యదేహుఁడై. 334

సీ. స్థూలముక్తాఫల♦శోభితం బయి యొప్పు నతితార మగుహార ♦ మఱుత వ్రేల
నుభయకర్ణాందోళ♦నోల్లసత్కుండలమణిగభస్తులు గండ♦మహిని గ్రాల
పరవళితదుకూల♦పల్లవకల్పితోష్ణీషంబు మస్తక♦సీమఁ దనర
నళికులశ్యామల♦లలితకుంతలజాల మవతంసమయి మౌళి ♦ నలరుచుండ

తే. రమ్యకైరవకర్ణపూ♦రంబు వెలయఁ, గామినీకుట్మల స్తన♦కలితపత్ర
భంగలాంఛితవక్షుఁడై ♦భాసమాన,కుముదధవళాంగుఁడై గడుఁ♦గొమరుమిగుల.

చ. విమలజలావదాతమయి ♦ వెల్గెడు దేహగభస్తిజాలముల్
తమను సమస్తదిక్కులను ♦ ధౌళనమున్ సలుపన్ సుగంధిలాం
గములు తుషారవృష్టి యనఁ ♦ గ్రాలుసుధాంబుకణంబు లొల్కఁగా
సుమలయజోదకచ్ఛటం♦శోభను జల్లు చతిప్రమాణుఁడై. 386

చంద్రాపీడుని మృతశరీరమును దివ్యపురుషుఁ డెత్తుకొనిపోవుట

ఉ. నీరజవైరిమండలవి♦నిర్గతుఁడై చనుదెంచి యుద్దస్తం
బేరమహస్తపీవరసు♦పేశలబాహులశీతలంబులం
జారుమృణాళగౌరకర♦శాఖల నాతని నెత్తికొంచు గం
భీరరవంబునం బలికెఁ ♦ బ్రేముడి యుచ్చపదంగ నీగతిన్. 387

తే. పాయకమ్మ మహాశ్వేత! ♦ ప్రాణములను
మరలఁ గలుగును నేతనిస♦మాగమంబు

నీకు నని తండ్రిపోలిక ♦ నగులు వాయుఁ
బలికి వానిని గొని చనెఁ ♦ బవనవీథి. 338

క. అది గని వెఱ విస్మయమును, గదురఁగ మదిఁ గౌతుకంబు ♦ గడలుకొనంగా
నిది యే మనుచుఁ గపింజలుఁ, బదరుచు నడిగితిని మోము ♦ పైకెత్తి కటా.

క. తత్తరమున నాతండును, నుత్తర మొసఁగకయె లేచి ♦ యున్మత్తుఁడ! నీ
వెత్తుకొని యెటకుఁ బోయెదు, సత్త్వము నామిత్త్రు ననుచు ♦ సత్వరుఁడగుచున్.

క. తనయుత్తరీయవల్కముఁ, దనరఁగ నడుమునకుఁ జుట్టి ♦ దద్దయుఁ గినుకం
జనియెను గగనంబున కా,తనివెంబడిఁ దాను నెగిరి ♦ ధాత్రీశసుతా!. 341

క. తారాగణమధ్యంబును, జేరిరి వారిల్లరేను ♦ జింతఁ గనంగాఁ
గూరెను వగ ద్విగుణితమై, యీయెడఁ గపింజలునిపోక ♦ మిహిరసుతేజా!. 342

తే. ఏమి చేయుదు దోఁపక ♦ యేను దాసిఁ
దరళికను గాంచి యేమిది ♦ సరగఁ జెపుమ
యెఱుఁగ నేనన నాయింతి ♦ యింతి కిలను
సహజ మావెఱ కోకంబు ♦ సన్నగిల్ల. 343

తే. మేను వణఁకంగ భయమునఁ ♦ బూని యేను
బత్తు ననుశంకచేత వి♦షాద మంది
ఏమి చేయుదు దోఁచక ♦ యెఱుఁగ కెదియు
ననియె నిట్లని కృపదోఁప ♦ నవ్వరాకి 344

చ. తెలియఁగఁ జాల నేను నిది ♦ తెల్పుదు నేగతి భర్తృదారికా!
గలిగెడి నద్భుతంబు గదుఁ ♦ గానఁగ నీవురుషుం డమానుషుం
డలరఁగ నిన్నుఁ దండ్రిగతి ♦ నాశ్వసనం బొనరించెఁ జూడుమా
పలుకవ యిట్టియాకృతు ల♦బద్ధములన్ గలలందునున్ భువిన్. 345

చ. కలుగ దబద్ధమున్ బలుకఁ ♦ గారణ మీతఁ డొకింత యేనియున్
దలఁచిన నెంత; ప్రాణములఁ ♦ దాల్పుము పీడు గడంకఁ జావఁగాఁ
గలిగెను గాదె యిట్టితఱి ♦ గాఢసమాశ్వసనస్థలంబు నా
కలికి! కపింజలుండు చనెఁ ♦ గాదన కాతనివెంట వెండియున్. 346

ఉ. ఎక్కడనుండి వచ్చె నితఁ; ♦ డెవ్వఁ డితండు గతాసుపీని వాఁ
డెక్కడ కేగెఁ దీసికొని♦యేటికి నేగెను; భర్తృదార! ని
న్నిక్కరణి న్సమాశ్వసన ♦ మేల యొనర్చెను నక్కజంబుగా
నెక్కడ లేనియాశ జని♦యింపఁగఁ జేసి పునస్సమాగతిన్. 347

చ కనుఁగొని వీని నెల్ల నటఁ ♦ గాంచెదు పంచత జీవితంబునో
గన వగు దీనిఁ బిమ్మటను ♦ గాదె యదుర్లభ మెందుఁ జావు చూ
కనక కపింజలుండు నిను ♦ గల్గినఁ బ్రాణము లుండు నేకటా
తనువు ధరింపు మాతఁ డిట ♦ దార్కొను దాఁకను నైనఁ గోమలీ. 348

చ. అనుచు వచింపుచుం బడె మ♦హాంశుపులు; జీవితతృష్ణ యేరికిం
జనఁగను రామి నీరాఁజీ; యటు ♦ చానస్వభావము క్షుద్ర మౌట; వ
చ్చును మగుడం గపింజలుఁడు ♦ చూడఁగ నన్ను నాళి; నద్ధియే
యును వగు నంచు నప్పటికి ♦ నాత్మఁ దలంచి త్యజింపఁ బ్రాణముల్. 349

సీ. కాలరాత్రికి నీడు ♦ గడుపాపకారిణి యాతనామయమయి ♦ యడరునదియు
దుఃఖమయంబునాఁ ♦ దోఁచుచు నారకమయ మనంగను గడు♦మలపునదియు
యుగసహస్రాయిత♦మగు చపారంబయి పావకమయమునాఁ ♦ బరఁగునదియు
యమముఖగహ్వర♦మనభయదంబయి పాతాళగృహమునా ♦ వఱలునదియు

తే. నైనయాఘోరరాత్రిని ♦ నవనిపైని
ధూళిధూసరితాంగినై ♦ దోరముగను
దొరఁగుకన్నీటఁ జెక్కిళ్లు ♦ దోఁగుచుండ
వీడి కొప్పెల్ల మోమునం ♦ దాడుచుండ. 350

తే. తరళికయు నేను నాసర♦స్తటమునందు
గొంతుపగులంగ నేడ్చుచుఁ ♦ గుసిలికుసిలి
గడపితిని నెట్లొ యారాత్రిఁ ♦ గాళరాత్రిఁ
దెల్లవాఱెను నంతలో ♦ ధీరవర్య!. 351

తే. అంతఁ బ్రత్యూషమున లేచి ♦ యాసరసిని
గ్రుంకి తత్ప్రీతికై యుల♦కుండికయును
నల్లజపమాల వల్కము ♦ లల్లవియు నె
త్తిసికొని నిశ్చితాత్మనై ♦ రోసి జగము. 352

సీ. సంసార మెల్ల న♦సారమంచు నెఱింగి
నామందభాగ్యత ♦ నాకలించి
వ్యసనోపపాతంబు ♦ లతిదారుణము లని
యతినిష్ఠురుఁడు దేవు ♦ డనుచుఁ దెలిసి
యనివార్యములు లెక్క ♦ లనుచు నెంచియు మైత్రి
యతిదుఃఖబహుళంబ ♦ టంచు నెంచి

సర్వభావము లశా♦శ్వతము లంచుఁ దలంచి
క్షణభంగురము సుఖం♦బనుచుఁ జూచి

తే. తల్లిదండ్రుల గణియింప♦ కెల్లబాంధ
వులను బరిజనులను వీడి♦ తొలఁచి మనము
విషయసుఖములవలనను♦ వివిధగతుల
నాశ లెల్లను దిగనాడి♦ యరయ కేదియు. 353

వ. మఱియు. 354

తే. ఇంద్రియంబులఁ గుదియించి♦ యలమి బ్రహ్మ
చర్యమును దాల్చి త్రైలోక్య♦శరణు నార్త
శరణు దేవుని శంకరు♦ శరణుఁ జొచ్చి
యితనిసేవ యొనర్చుచు♦ నిచట నుందు. 355

ఉ. అమ్మెఱునాఁడు తాతయును♦ నంబయు బాంధవవర్గమెల్ల నిం
కేమనుజుండొ చెప్ప విని♦ యెల్లయుదంతము వచ్చి రేడ్చుచున్
నామదిఁ ద్రిప్ప నెన్నియునొ♦ నవ్యహితోక్తుల సాంత్వనంబులన్
సామమునన్ బ్రయత్నమును♦ జాల నొనర్చిరి రాఁగ నింటికిన్. 356

చ. మలప నసాధ్య మీకడఁక♦ మానిచి యీమె నటం చెఱింగి వా
రలు విగతాశులయ్యు నను♦రాగము వీడఁగ లేక నాపయిన్
వల దని యెంత చెప్పినను♦ వారక సారెకుఁ బోక యింటికిన్
గలఁగుచు నిల్చి రెన్నియొ ది♦నమ్ములు నచ్చట నే నృపాత్మజా!. 357

వ. ఎన్నిదినంబు లున్నను ఫలంబు గానక మిక్కిలి వగచి మదీయచిత్తదార్ఢ్యం బెఱింగి యింకఁ బ్రయోజనంబు లే దని దలంచి వచ్చినవార లెల్లరున్ మగిడి గృహంబుల కేగిరి. 358

చ. అదిమొదలేఁ గృతజ్ఞతను♦ నశ్రువిమోక్షణమాత్ర వానికిన్
విదితము సేయు చాతనిని♦ వీడుట నైన దురంతవేదనన్
గదిరి కృశించి నట్టిహత♦కాయ మలజ్జ యమంగళం బనే
కదురితబాహుళంబు నటు♦ కష్టసహస్రనివాసభూతమున్. 359

చ. పలునియమంబులన్ దఱుఁగ♦ వన్యఫలంబులఁ గాయగూరలన్
సలుపుచు దేహయాత్రను ద్రి♦సంధ్యల స్నానము నీసరస్సునన్
దలఁచుచు నాతనిన్ జపము♦ దద్దయుఁ జేయు నెపంబునన్ దమిన్
సలుపుచుఁ దద్గుణౌఘగణ♦నంబును బ్రత్యహ మిందుశేఖరున్. 360

చ. కొలుచుచు నుందు నీగుహనె ♦ గూరుచు ఘోరదురంతదుఃఖమా
యలపనికత్తె నేనును న♦హాంబులు పెక్కులు నిట్టి నేను ని
ష్ఫలభరజీవితన్ గడునృ♦శంసను నిస్సుఖ నిత్రపాత్మ ని
ష్ఫలజననన్ గిరాతికనుఁ ♦ బాపి విలక్షణ గర్హణీయునున్. 361

చ. అగునది యేమి బ్రాహ్మణవ♦ధూఘను నావలనన్ బుమర్థ మే
మి గనెదు నన్నుఁ గాంచినను ♦ మిన్నక ప్రశ్న మొనర్చినన్ శ్రమం
బె గద యటంచు వావిడిచి ♦ యేడ్చెను గట్టిగ పాండువల్కలా
గ్రగము నొనర్చి మోమును ని♦రంతరబాష్పము లాఁగ కెంతయున్. 362

చ. తొలుతనె యామెరూపమును ♦ దోరపుఁ దియ్యనిపల్కులన్ గడున్
విలసదతిప్రశాంతిని వి♦నిర్మలదక్షిణతన్ వినీతి న
త్యలఘుతపోమహత్త్వ మన♦హంకృతి సౌఖ్యపరాఙ్ముఖత్వమున్
దళితమమత్వమున్ హృదయ♦దార్ఢ్యముఁ జూచి జనించె నామె పై. 363

చ. సమధికభక్తి గౌరవము ♦ త్క్ష్మాపతిసూనున కిన్మడించె నా
యమ యిపుడాత్మ వృత్తమును ♦ నంతను నడ్గినయంత సాధుభా
వమును వహించి చెప్పుట న♦పారముగా నవి; యంత వాఁడు చి
త్తము ద్రవ మొంద మెల్లఁగను ♦ దామరసాక్షికి నామె కిట్లనున్. 364

చంద్రాపీడుఁడు మహాశ్వేత నూఱడించుట.

చ. జనములు క్లేశభీరువులు ♦ సౌఖ్యపరాయణు లై కృతఘ్ను లై
యొనరుప లేక స్నేహమున ♦ కుద్ది యనం దగుకార్యమున్ బ్రయో
జనరహితాశ్రుపాతమును ♦ సల్పుచుఁ దెల్పుచు స్నేహ మమ్మ రో
దన మొనరింతు రింతె గద ♦ ధాత్రిని నీయటు లెల్ల నేర్తురే. 365

చ. ఒనరుప వేమి స్నేహమున ♦ కుద్దిగఁ గార్యమునన్ సమస్తమున్
దనర నొనర్చు చీ వకట ♦ దారుణరోదన మాచరింతు వె
వ్వనికయి వానికై సకల♦బాంధవులన్ జననంబుదొట్టి ప్రో
చినప్రియులన్ ద్యజించితివి ♦ చెల్ల యసంస్తుతులన్ బలెన్ భళీ. 366

ఉ. చేరువ నున్ననున్ విషయ♦సీమల ఘాసమంబుగాఁ దిర
స్కార మొనర్చినావు దివి♦జప్రభువైభవ మెల్లనుం దృణీ
కార మొనర్చు వైభవసు♦ఖంబుల వీడి యనర్హ బాధలన్
పారసినీగతిన్ మిగుల ♦ సన్నని మేనును సన్నగించితే. 367

ఉ. తాలిచి బ్రహ్మచర్యమును ♦ దద్ద మహాతప మాచరించె దే
స్త్రీలకు దుష్కరంబు వన♦సీమల వాసము దాని గంటి వో
బాల! పరిత్యజించెదవు ♦ బాధలవా లొనరించి దేహమున్
లీల మహత్తరం బయిన♦క్లేశమునన్ బడఁద్రోసి పూనికన్. 368

చ. అనుమరణంబు నిష్ఫలము ♦ నార్యవిగర్హితమార్గమున్ గటా
తనువుఁ ద్యజించినన్ సఖులు ♦ దల్లియుఁ దండ్రియు నన్నదమ్ములున్
దనయులు భర్తయున్ దనువు ♦ దాఁ ద్యజియించుట చూడ మోహజృం
భణ మవివేకపద్ధతియుఁ ♦ బాలిశకార్యము తుచ్ఛదృష్టియున్. 369

ఉ. తానుగ వీడ దే నసురు ♦ దాఁ ద్యజియింపఁగ రాదు; చూడఁగాఁ
బ్రాణమునన్ ద్యజించు టిది ♦ స్వార్థము, దుర్భరశోకదుఃఖముల్
మానుప మం దిదొండు, భువి ♦ మారణ మొందినవాని కేగుణా
ధానము చేయఁ జాల దసు♦దానమునన్ బ్రతికింప నేర్చునే 370

సీ. ధర్మాభివృద్ధికిఁ ♦ దాఁ గారణము గాదు శుభలోక మొదవింపఁ ♦ జొప్పుగాదు
నిరయపాతము మాన్ప ♦ నేరదు తనప్రియుఁ జూడ నుపాయంబుఁ ♦ జూపలేదు
నిరువురఁ గూర్పంగ ♦ నురుసాధనము గాదు సాంత్వనోపాయంబు♦సరణి గాదు
తనప్రేమ యతనికిఁ♦దార్ప హేతువు గాదు సుఖజన్మ మొదవించు♦శుభముగాదు
తే. నేదియును గాదు మృతునికై ♦ యేడ్చి యేడ్చి
ప్రాణములఁ బాయు టది గడు♦పాపహేతు
వాత్మఘాతంబు నిజకర్మ ♦ మవశుఁ జేసి
తత్తదనుకూలగతులను ♦ దార్చు జనుని. 371

క. బ్రతికి జలాంజలిదానము, మృతునకు దనకును నొసంగు♦మేటిశుభములన్
మృతిఁ జెందినఁనుభయులకును, గతు లొదవింపంగ గతము♦గాదు దలంపన్.

*సీ. అబలామనోహరుఁ ♦ డైనమారుఁడుభర్తృ హరహుతాశనదగ్ధుఁ♦డైనయపుడు
బాలమృగాంకుని♦పగిది నేత్రానందకరుఁ డర్జునునిసుతుఁ ♦ డరిగినపుడు

పాఠాంతరములు.

*చ. తొరఁగెనె ప్రాణముల్ మగఁడు ♦ తోయజసాయకుఁ డంగనామనో
హరుఁడు హరాగ్నిదగ్ధుఁడయి♦నప్పుడు తద్రతిదేవి పత్ని యు
త్తరయును లోచనోత్సవవి♦ధాయకుఁ డాహరిసూనుసూనుఁ డు
ద్ధురుఁ డతివిక్రముండు పటు♦దోర్బలుఁ జేగినయప్పు డక్కటా. 1

ఉ. ఊరువులందు నుంచికొని ♦ యుజ్జ్వలలాలనపాలనంబులన్
నూఱుగురన్నలున్ దనను♦నోరథముల్ సమకూర్చు చెప్పుడున్

పారద త్రివరదాన♦భరగర్వుఁ డగుసింధు రా జర్జునునిచేత ♦ వ్రాలినపుడు
సకలారిపూజిత♦చరణుఁడు పాండువు మునిశాపవహ్నిచే ♦ మగిసినపుడు
తే. చచ్చిరే వారిభార్యలు ♦ సచ్చరితలు
రతియు నుత్తర ధృతరాష్ట్ర♦రాజదుహిత
కుంతియును నింక నెందఱో ♦ కోమలాంగు
లసువులను బాయ రాత్రేశ ♦ లరిగినపుడు. 373

తే. మఱియు నెందఱొ రాక్షస♦మానినులును, దేవగంధర్వమునినర♦దేవసుతలు
భర్తృవిరహితలై ధృతి♦ప్రాణులగుచు, నుండు రనివిందునుమ్మరో♦కుందవలదు.

చ. వదలుము జీవితం బతఁడు ♦ వచ్చుట సందియ మేని; వింటి వే
గదుర సమాగమోక్తి దివిఁ♦గర్ణములారఁగ నీవె యిప్డు డే
పొదవ వికల్ప మేల యిఁకఁ ♦ బొందెద వట్టిమహాత్ము లెన్నఁడున్
బదరరు వ్యర్థవాక్యములఁ ♦ బల్క రబద్ధము వేయివచ్చినన్. 375

చ. బ్రతికినవారు ప్రాణములఁ ♦ బాసినవారలతోడిసంగతిన్
బొదలెద రన్న నెట్టి దల♦పొందు దలంపఁగ నిక్కువంబుగా
గదుర మనంబునం గరుణ ♦ గాఢముగాఁ బ్రతికింప నీతనిన్
గదిసెను నత్తికొం చతఁడు ♦ కారుణికుండు సుపర్వలోకమున్. 376

తే. క్షితి మహాత్ములమహిమ ల♦చింత్యములుగ, కర్మశక్తులుబహువిధ♦కఠినగతులు
బహువిధంబులు సంసార♦పద్ధతులును, జిత్రములు దైవమును దప♦స్సిద్ధులరయ.

తే అరసినను నెంత నిపుణత ♦ నతనిప్రాణ
దానమునకంటె నొండు ని♦దానమతనిఁ
గొంచుఁ బోవుట నూహ క♦గోచరంబు
తలఁపకు మసంభవమిదని ♦ తరుణి! నీవు. 378

సీ. విశ్వావసుం డని ♦ వెలసినగంధర్వరాజుచే మేనకా♦రమణియందుఁ
బ్రభవ మందిన ప్రమ♦ద్వరయనుకన్యక యహిదష్టయై మృతి ♦ నందినపుడు

---

గూరిమిఁ బెంపఁగాఁ బెరిఁగి ♦ కోమలి నా మతిఁ గన్న దుస్సలా
పారసగంధి చచ్చె నొకో ♦ సైంధవుఁ డర్జునుచేతఁ జచ్చినన్. 2

చ. సకలధరేశమౌళిమణి♦జాలమువాసితపాదపీఠుఁడున్
వికలితశత్రుభూధవుఁడు ♦ విశ్వధరాబలి భాగభోగస
న్నికరుఁడు నైనపాండునర♦నేతయుఁ గిందమమౌనిశాపవ
హ్నికి నురుదారు వైనఁ బృథ ♦ యేగని తానును వానితోడుతన్. 3

భార్గవచ్యవనుని◆పౌత్రుఁడు రురు వను ప్రమతిసూనుఁడు ముని◆బాలకుండు
తనయాయు వందర్ధ◆మును నిచ్చి బ్రతికించె స్థూలకేశాశ్రమ◆క్షోణి నామె

తే. యశ్వమేధతురంగాను◆యాయి నగుఁడు
తనసుతుండైన బభ్రువా◆హనునిచేత
బాణహతుఁ డయి యాజినిఁ◆బడ నులూపి
నాగకన్యక బ్రతికించె◆నరుని వినవె. 379

వ. మఱియు 380

సీ. అర్జునపౌత్రుండు◆నభిమన్యుసుతుఁడును నగుపరీక్షితుఁడు దా◆నస్త్రగురుని
తనయుఁ డశ్వత్థామ◆దారుణాస్త్రాగ్నిని దల్లిగర్భమునంద◆దగ్ధుఁ డగుచు
మృతి నొందియే నిర్గ◆మించిన నుత్తర గడు దీనముగ నేడ్వఁ◆గరుణ పుట్టి
భగవానుఁ డగునల◆వాసుదేవుఁడు వాని బ్రతికించె దుర్లభ◆ప్రాణ మొసఁగి

తే. నిక్క ముజ్జని సాందీపి◆ని ద్విజసుతుఁడు
యమపురమునుండి గైకొని◆యరుగుదెంచి
యిచ్చె నావాసుదేవుఁడె◆యిటను నట్టి
దేది యైనను నొదవదే◆యేల యడల. 381

తే. బ్రతుకఁ డను చేయునది యేమి◆బాల! నీవు
దూఱు దెవ్వనిఁ గడు విధి◆దుస్తరంబు
నియతి బలవతి యాత్మేచ్ఛ◆నేర దూర్ప
దైవవిలసిత మతిఘోర◆దారుణంబు. 382

తే. నైఁపఁ డవ్యాజ మగుప్రేమఁ◆జాలకాల, మల్లదుర్విధి;సుఖముల◆నాయతస్వ
భావభంగురములు;దుఃఖ◆భారములును,నాయతస్వభావములగు◆నవనిఁదలుచు.

చ. కలయిక యొక్కజన్మమునఁ◆గల్గును నట్లొ మహాప్రయత్నతన్
గలుగు సహస్రజన్మములఁ◆గాదె వియోగము ప్రాణికోట్లకున్
దలఁపకు మన్ము నిందన్యనుగఁ◆దల్లి! యనింద్యను నిన్ను నూరకే
తెలియు మివన్ని సంసృతిని◆దేలుచు మున్గుచు నుండువారికిన్. 384

తే. ధీరు లగువార లావదు◆త్తీర్ణు లగుదు
రనుచు నీదృగ్విధంబుల◆నన్యములను
మధురమృదులోపసాంత్వన◆కథనములను
నూఱడిలఁ జేసి యింత యా◆యువిద మరల. 385

తే. దోయిటను దెచ్చి నిర్ఝర◆తోయములను
వలదు వల దన్న విడక ని◆ర్బంధమునను

గడిగి కొనఁజేసె మోము నృ♦కాంతసుతుఁడు
ప్రొద్దు వ్రాలెను నింతలో ♦ భూపవర్య!. 386

## సాయంకాలవర్ణనము.

తే. విని మహాశ్వేతవృత్తాంత♦మును సశోకుఁ, డైనగతి వీడి దివసకృ♦త్యంబులెల్ల
రవియు నధోముఖుం డయ్యె♦దివసమంత, దఱిగె రవిబింబ మెఱ్ఱనై♦తనరె వ్రాలి.
తే. విరళకౌసుంభరసరక్త♦వరదుకూల, కోమలాస్తాతపం బెల్లఁ ♦ గొంచెకొంచె
మరిగె దిఙ్ముఖముల వీడి♦యాకసంబు, పింగళిత మయ్యెఁ గాళిమ♦వీడి మిగుల
తే. కోకిలవిలోచనచ్ఛవిఁ ♦ గొమరుమిగులు
సాంధ్యరాగంబున జగంబు ♦ సాంద్ర మగుచు
నరుణితం బయ్యె నొకఁడొకం ♦ డలరెఁ జదల
గ్రహములు యథాప్రధానతఁ ♦ గలిగి యంత. 389
ఆ. కారుదున్నపోతు♦కరణి మలీమస, మయిన శార్వరతమ ♦ మాకసంబు
విరివి నపహరించి ♦ పగువుచు దిక్కులఁ, గాలిమంబు గాంచి♦గ్రాలఁ దొడఁగె.
సీ. పచ్ఛదనం బెల్లఁ ♦ బాయుచు గహనంబు లగుచుండె వృక్షోరు♦హాళి మిగుల
హిమవారిబిందువు ♦ లెనసి మాంద్యము గని వనసుమసౌరభం ♦ బనుగమించి
విటపలతాజాల♦వీథుల కెల్లను నానందవర్తనం ♦ బావహించి
పాంథశ్రమము వాసి ♦ బడలినగతి మెల్ల మలయుచుండగఁ బవ♦మానుఁడంతఁ
తే. బక్షులెల్లను గూళ్లను♦బందుచుండ, నలసగతి లేచి ప్రక్షాళి♦తాంఘ్రియగుచుఁ
గుండికోదకమున సంధ్యఁ ♦ గొలిచి భక్తి, నచ్చి వల్కలశయ్యపై ♦ వగపుతోడ.
తే. వేఁడినిట్టూర్పు నిగిడించి ♦ విసుగుతోడఁ
గూరుచుండె మహాశ్వేత; ♦ ధారుణీశ!
తనయుఁడును సంధ్య వారిచి ♦ వినయమునను
గుసుమసహితార్ఘ్య మిడి లేచి ♦ యొసక మెసఁగ. 392
తే. వచ్చి రెండవపాషాణ♦ఫలకమునను
మృదులపల్లవముల సెజ్జ ♦ నొదవఁ జేసి
యందుఁ గూర్చుండి సారెకు ♦ నాత్మయందుఁ
దన్మహాశ్వేతవార్త నే ♦ తలఁచుకొనుచు. 393
ఉ. ఈకుసుమాయుధుం డకట ♦ యెంతటిక్రూరుఁడు నప్రతిక్రియో
త్సేకుఁడు దుస్సహుండును న♦శీలుఁడు వీనిశరాభిఘాతమున్

సోఁక మహాత్ములుఁ మిగుల • శోషిలి ధైర్యము వాసి యప్పుడే
సోకడపెట్టుకొం ద్రసుఱు•పోలఁగఁ గాలము డాయకుండిరా. 394

తే. త్రిభువనాభ్యర్చితోజ్జ్వల•దివ్యతేజ!
మకరకేతన! వేయిన•మస్కృతు లివి
యనుచు మనమున నెన్నుచు • నామె నతఁడు
మగుడ నిల్లని ప్రశ్నించె • మనుజనాథ!. 395

తే. అమ్మ! వనవాసమిత్రంబు • నఖిలదుఃఖ
సద్విభాగిని నీపరి•చారిక యెటఁ
జనియెఁ దరళిక చెప్పుమ • యనఁగ నంతఁ
జెప్పఁ దొడఁగెను నిటుమహా•శ్వేత యపుడు. 396

కాదంబరీజన్మకథనము.

సీ. విను మహాభాగ! నే • మును వచించినసుధాసంభవం బైనయ•ప్సరకులాన
జనియించె మదిర నా • జనుమదిరేక్షణ దానిఁ జేపట్టె గం•ధర్వవిభుఁడు
చిత్రరథుండు త•చ్చిత్రగుణాకృష్టచిత్తుఁ డై తక్కిన• చేడియలకుఁ
బడయంగ రానట్టి•వరవేత్రచామరచ్ఛత్రకర్బురపట్ట•చారుచిహ్న
తే. దీపితం బగుతన్మహా•దేవిపదము, నిచ్చి యంతఃపురస్త్రీల • కెల్ల రాణిఁ
జేసి ప్రాణపదంబుగాఁ • జేసి మిగుల, నేలుచుండెను గంధర్వ•జాల మెల్ల. 397

తే. అంత యౌవనసౌఖ్యంబు • ననుభవించు
నమ్మహాదంపతుల కొక్క •యాత్మజాసు
రత్న ముదయించె నాశ్చర్య•రాశి యగుచు
నేకజీవిత మై వారి • కెల్లరకును. 398

తే. తనయఁ గాదంబరి యటంచు • దానిపేరు
పుట్టినదిగోలె నేను నా•పువ్వుఁబోఁడి
యేకశయ్యాన్నపానాద్య•నేకవిధులఁ
బెరిఁగితిమి యొక్కటన యొం ద•భేదబుద్ధి. 399

తే. వరఁగ రెండవహృదయ మా•బాల నాకు
బాలమిత్రంబు విస్రంభ•భాజనంబు
ప్రేమ కాస్థానభూమిః యా•బిడయు నేను
నృత్తగీతాదు లొక్కట • నేర్చినాము. 400

తే. పుచ్చితిమి బాలభావంబు ♦ నొచ్చె మేము
యెఱుఁగ కేమిట నిర్బంధ ♦ మేమి లేక
శైశవక్రీడలం దెప్డు ♦ చాలముదము
గనుచు నిర్భరచిత్తంబు ♦ గనుచు నెలమి. 401

చ. అది విని నాదువృత్తమును ♦ నంతయు శోకపరీతచిత్తయై
గుదిగొనుశోకవేగమునఁ ♦ గుందుచు నుండఁగ నేను దాను మా
నెనను వివాహ మంచుఁ దన♦నెచ్చెలులెల్ల వినంగ నాడినన్
వదలక తండ్రి యొక్కనికిఁ ♦ బాణిగృహీతిని జేయ నెంచినన్ 402

చ. వదలెద జీవితంబు విష♦వహ్నుల నేని యుపాస ముంటనేన్
బెదయురిత్రాటనేనియును ♦ వేవురు వచ్చిన మాన నిక్కువం
బిది యనుచున్ బ్రతిజ్ఞ యొన♦రించె; నిదంతయుఁ దండ్రి సేవకుల్
విదితము సేయఁ దా విని యె ♦ విన్కిపరంపరనున్ నృపాత్మజా!. 403

చ. చనఁగ నాకింతకాల మిటు ♦ చారుమహోజ్జ్వలయౌవనంబునన్
దనరెడికూఁతు నామెఁ గని ♦ తాళఁగఁ జాలక తాప మందుచున్
దన కది యొక్కబిడ్డగుటఁ ♦ దద్దయుఁ బ్రేమనిధాన మౌటఁ జె
ప్పను నిసుమంత చాలక యు♦పాయము గానక యొండు తోఁచకన్. 404

సీ. తనసతి మదిరతోఁ ♦ దద్ద విచారించి యర్హ మిప్పటి కది ♦ యనుచు నెంచి
క్షీరోదుఁ డనుపేరి ♦ సేవకుఁ బిలిపించి వత్స! మహాశ్వేత ♦ వచ్చి నీవు
త్వద్వియోగంబున ♦ దగ్ధహృదయుల మా మాకుఁ గల్గిన దీని ♦ మాన్పవమ్మ
కాదంబరీదేవి♦కలఁక మాన్పఁగ నీవు ద క్కొండుశరణంబు ♦ చిక్క దిప్పు

ఆ. డనుచుఁ జెప్పి వాని ♦ నంపించె నిచటికి, మత్సమీపమునకు ♦ మమతఁ జిత్ర
రథుఁడు వాఁడు నేఁటి♦ప్రత్యూషమున వచ్చె, నంత నేను సర్వ ♦ మాకలించి.

చ. గురుజనగౌరవంబునను ♦ గూరిమికత్తియపై నిప్రీతినిన్
వరసఖి! యేల చేసెదవు ♦ వందురఁగన్ గడు వందువారినిన్
గురువచనంబు మీఱ కని ♦ గోరెదవే నను మన్నఁ జెప్పి యా
తరళిక నంపితిన్ నృపసుతా! యట కిప్పుడె వానితోడుతన్. 405

ఆ. వార లేగి రిపుడె ♦ వచ్చితి విచటికి
నీవు నింతె ధరణి♦నేతృతనయ!
యనుచుఁ జెప్పి యామె ♦ యట్టె యూరక యుండఁ
దూర్పు కొండపైనఁ ♦ దోఁచె విధుఁడు. 407

సీ. మునికుమారకుప్రాణ♦మును గొని గైకొన్న ఘోరపాతకమును♦గూరె నొక్కొ
దక్షశాపానల♦దాహచిహ్నము చిరకాలలగ్నమ్మును ♦ గ్రాల్చె నొక్కొ
శోకాగ్నిదగ్ధవి♦క్షోభితాంతరమహాశ్వేతాత్మ యనుకృతిఁ ♦ జేయు నొక్కొ
కోకీవియోగాగ్ని♦ఘోరకీలాభీల ధూమజాలము లంటి ♦ దోఁచు నొక్కొ
తే. యనఁ గళంకంబు మధ్యంబు♦నందుఁ దోఁపఁ
గలితభస్మాంగరాగోరు♦గౌర మగుచుఁ
గృష్ణమృగచర్మసంవీత♦కేవలార్ధ
మయినయంబిక డాపన్నొ ♦ యనఁగ విధుఁడు. 408

తే. దెసలు ధవళంబు లయి గడుఁ ♦ దేజరిల్లఁ
గుముదవనములు స్ఫుటము లై ♦ కొమరుమిగుల
మానినీమానసంబు ల♦నూనభయము
నూన నోలిని గగనముం ♦ దూనె పదము. 409

వ. అంత. 410

సీ. కైలాసశశిమణి♦గ్రావంబు లంతటఁ గరఁగి నిర్ఝరము లై ♦ గాఱఁ దొడఁగె
సితకరకరజాల♦యుతము లై తారకాదీధితు లందంద ♦ తీయఁ దొడఁగెఁ
గమలవనంబులు ♦ కమలారికరములు చూఱకొన్నట్టులు ♦ శోభ వెడలె
ద్రాఘిష్ఠవీచికా♦తతిచాలితంబు లై విరహిచక్రాంగముల్ ♦ విరుతి చేసె
తే. హర్షబాష్పంబు లురుల వి♦ద్యాధరాభి
సారికలు గగనచర లై ♦ సాగు చుండఁ
మింటినడుమను జంద్రుండు ♦ మెలఁగు చుండఁ
బంపుకొనెఁ రాజసుతుఁ డంద ♦ పార్థివేశ!. 411

తే. అతఁడు పండుటఁ గని చిగు♦రాకుపాన్పు
నందె మెల్లఁగ శయనించె ♦ నామె యపుడు;
పత్రలేఖయు నరపాల♦పుత్రచయము
ప్రాణమిత్రము ననుఁ బాసి ♦ పవర కున్నె. 412

తే. అనుచు మదిలోన నందంద ♦ నరనిధవుని
తనయుఁ దనుకొంచు నే నిద్రఁ ♦ దవిలె; నంత
మేలుకొని వేకువనె సంధ్య ♦ మిహిరుఁ గొల్చి
వచ్చి కూర్చుండి రాతిన్నె♦పైని భక్తి. 418

తరళికయుఁ గేయూరకుఁడును వచ్చుట.

తే. సదఘమర్షణజపమును ♦ సల్పుచుండె, నలమహాశ్వేత; రాసుతుం ♦ డంత లేచి
ప్రత్యుషఃకృత్యముల నెల్లఁ ♦ బరఁగ జేసి, వచ్చె; నచటికిఁ దరళిక ♦ వచ్చె నపుడు.

ఉ. వచ్చెను ఘోషశాబ్దముల ♦ వాఁడు మహోజ్జ్వలమూర్తి యొక్కరుం
డచ్చెరు వొంద వానిబడి ♦ నల్లన గంధగజంబు పోలికన్
మెచ్చఁ బదంబు లూనుచును ♦ మేదిని లీల విశాలవక్షుఁ డై
యొచ్చెము లేనియాకృతి ని ♦ రూదరతన్ బ్రవిభక్తమధ్యుఁ డై. 415

ఉ. బంగరుసంకెలన్ నడుము ♦ బల్మి బిగించి ధరించి చల్ల ద
మ్మంగము నిండఁ బూసి మల ♦ యాచలజాతసుగంధ మిమ్ముగాఁ
బొంగెడు దీర్ఘవృత్తపృథు ♦ భూరిబలాఢ్యభుజాభిరాముఁ డై
చంగదురుప్రకోష్ఠమణి ♦ సద్వలయంబులు నూఁగ నుయ్యెలల్. 416

మ. శ్రుతిభూషామణి తల్లక్రిందుగ రుచుల్ ♦ శోభిల్లఁగాఁ జల్లుస
ర్వతిచాపావళి యేకదోశ్శిరమునన్ ♦ వర్ణోత్తరీయంబు నాఁ
దతమై యొప్పఁగఁ జాతపల్లవము నాఁ ♦ దర్క్యంబు తాంబూలరా
గతిరోభావితదంతవాసమును దాఁ ♦ గ్రాలన్ మహోద్యచ్ఛవిన్. 417

మ. శ్రుతిపారంగత మై స్వభావసిత మై ♦ శోభిల్లు నేత్రద్వయీ
సితిమన్ దిక్కుల నెల్ల నూతనసుధా ♦ శ్రీమంతముల్ చేయుచున్
సితనీరేజమయంబు నా దివసమున్ ♦ జెన్నొందఁ గావించుచున్
సితపాథోజవనంబులన్ గురియు నాఁ ♦ జెల్వొందు వాఁ డంతయున్. 418

తే. కనకపట్టవిశాల మై ♦ తనరువాని
ఫాల; మలికులనీల మై ♦ పరఁగుఁ గేశ
జాల; మాతండు గంధర్వ ♦ జాతివాఁడు
నలరుఁ గేయూరకుం డను ♦ నాహ్వయమున. 419

వ. అట్లేతెంచి తరళిక, చంద్రాపీడుం గాంచి యితం డెవండొకో యపూర్వుం డని సముపజాతకుతూహల యై చిరం బాలోకించి మహాశ్వేతకుం గడుంగుఱుం గటకుం జని యత్యంతవినీతిన్ గృతప్రణామ యై కూర్చుండుటయుఁ గేయూరకుండును నంతంతన నమితోత్తమాంగుఁ డై నమస్కరించి మహాశ్వేతాదృష్టినిర్దిష్టం బైన నాతిసమీపగతం బగు నొక్కశిలాఫలకం బధిష్ఠించి యదృష్టపూర్వం బయి కుసుమాయుధుం దిరస్కరించి సకలసురాసురగంధర్వవిద్యాధర

రూపంబుల నధఃకరించు నాచంద్రాపీడునిరూపాతిశయరూపంబుఁ గాంచి విస్మ
యావిష్టచిత్తుఁడై నిర్నిమేషదృష్టిని విలోకించుచుండె నంత. 420

తే. అల మహాశ్వేత జపమాల ♦ నవలఁ బెట్టి
జపముఁ జాలించి చిత్తంబు ♦ జగము నంకఁ
ద్రిప్పి కనువిచ్చి గనుఁగొని ♦ తిన్నఁదనము
మెఱయఁ దరళిక నడిగెను ♦ మాఱ నిట్లు. 421

కాదంబరీ ప్రతిసందేశము.

తే. కంటె కాదంబరిని నీవు ♦ కట్టనుంగు
చెలినిఁ గుశలమె మనమాట ♦ చేయు నొక్కొ-
యనుచు నడుగంగఁ దరళిక ♦ యతివినీతి
నింత జాఱంగఁ జెవిగమ్మ ♦ నెఱఁగి మాళి. 422

శా. కంటిన్ ద్వత్సఖి భర్తృదారికను నేఁ ♦ గాదంబరిన్ భద్ర మే
యంటి న్నీ వనుమన్న దంతయును నే ♦ నావంతయు న్విడకే
కంటన్ బాష్పము లేఱు లై దొరఁగ నా♦కంజాక్షి రోదించుఁ గ్రేఁ
గంటన్ జూచుచుఁ జెప్పి పంపిన మహా♦కారుణ్యవాక్యంబులన్. 423

చ. మనవి యొనర్చు వీఁ డిదిగొ ♦ మానిని! వీనిని నంపె నామె వీ
ణను వహియించువాని నని ♦ నంటు జనింపఁగఁ జెప్పి మిన్నకుం
డెను నతఁ డిట్లు చెప్పెను వి♦నీతిని ద్వత్సఖి చెప్పినట్టిదా
నిని వినుపింతు నిట్లనియె ♦ నీసఖి గాఁగిటఁ గ్రుచ్చి ప్రేముడిన్. 424

క. చెలి! యాతరళిక చెప్పిన, పలుకులు నామనసుఁ దెలియఁ ♦ బలికితొ జనకుల్
పలుకు మని కక్కసించిరొ ,యిలు విడువనితప్పిదంబు ♦ నెత్తి పొడిచెదో. 425

క. చెలిమిని వదలఁగఁ గోరెదొ, దలఁగఁగ ననుఁ జేయుకుట్రొ♦తరుణి! కినుకతో
లలిసహజప్రేమాంచిత, సలలితమగునామనంబు ♦ సఖి! యెఱుఁగుదువే. 426

క. ఈగతి నతినిష్ఠురముగ, వేగ తెగం జెప్పి పుచ్చు ♦ వెరవే సఖి! నీ
కేగతి సిగ్గు జనింపదొ, యీగతి వచియింపఁ బెద్ద లెవ్వరు లేరో. 427

క. ఎప్పుడు ప్రియభాషణములు, చెప్పఁగ వచించునీకుఁ ♦ జెప్పిరి యెవ రీ
యొప్పనిపలుకులు చెప్పఁగ, నెప్పుడొ యిటు లాడుకొంట♦యిల నెవ్వరికేన్.

ఉ. నెమ్మది నుండువాఁడయిన ♦ నెక్కొనఁ జేయు నె యిట్టివేళలం
దిమ్మది నిట్టికార్యముల ♦ నించుక పండితుఁడైనవాఁడు నూ

యమ్మకచెల్ల! దుఃఖముల ♦ నాహతచిత్తుల మమ్ముబోంట్లనుఁ
కీ మ్మన నేల? మానసము ♦ ఖిన్నత నంద సుహృద్వ్యథఁ గదున్. 429

ఉ. ఏటిసుఖాశ నిర్వృతియు ♦ నెట్టిది భోగము లెట్టివో సుమా
యేటివి మందహాసములు ♦ నిట్టివశఁ సఖ యుండు నేను నే
పాట విషంబుమాడ్కిఁ దగఁ ♦ బాటిలఁ జేయుదు నప్రియంబులఁ
బోటిరొ! దారుణుం డయిన♦పూవిలుఁ గాము సకాముఁ జేయుదున్. 430

చ. కమలిను లస్తమింప రవి ♦ కాటియఁ గూరఁగఁ జూచి కోకముల్
తమపతియుంగసౌఖ్యములఁ ♦ దాముసు వీడునుఁ గూడ నున్న దో
సమునకుఁ జెప్ప నేటి కిఁక ♦ సారసగంధులఁ జూడ నాదుకూ
రిమిసఖి యన్యపూరుషుని ♦ రేవగలుఁ గన కాత్మఁ గుందుచున్. 431

చ. పతివిరహార్తి నామదిని ♦ బాయక యుండఁగ మర్త్యుఁ డన్యుఁ డే
గతి నివసించు వెండి సఖి ♦ కాంతవియోగము దుర్భరంబుగా
వ్రతములఁ దీవ్రముల్ సలిపి ♦ వందురు చుండఁగఁ గర్శితాంగి నై
కుతిలపడఁ! వివాహమును ♦ గోరుదు నేమని యాత్మసౌఖ్యమున్. 432

చ. కలుగును నాకుసౌఖ్య మెటు ♦ కాంతలకుఁ సరిగానిధార్ష్ట్యముఁ
దలఁగొని యీపనిఁ సడిని ♦ దాల్చితి నీపయిఁ జేసిను స్త్రీజనం
బుల కురుభూమమైనత్రపఁ ♦ బోవిడితిఁ గురుమాట మీఱితిఁ
దలఁపక లోకనింద; నెటు ♦ తారొ్కనుదుఁ మఱి నేనె యీపనిన్. 433

చ. చరణము లంటి కేల్మొగిచి♦సల్పి నమస్సు ననుగ్రహింపుమా
యరిగితి వీవు కానకు మ♦దాయువుతో నని యంటి నంచు నీ
వరిగి వచింపుమా యనుచు ♦ నాయమ చెప్పె నటంచుఁ జెప్పి యో
నరవర! యాతఁ డూరక వి♦స్మృత నుండెను నంత నామె తాన్. 434

క. విని తద్వచనంబులఁ దా, మనమునఁ దలపోసి మఱియు ♦ మథియించిగదుఁ
జను మేన వచ్చి స్వయముగఁ, గని సల్పెద నర్హ్మమనుచుఁ ♦ గఱపి యతనికిన్.

క. పనిపెను నా కేయూరకుఁ, బనివిని యాతండు చనఁగ, ♦ బార్థివసూనుఁ
గనుఁగొని చంద్రాపీడుని, మన మలరఁగ నిట్టు లనియె ♦ మంజులఫణితిన్. 436

### చంద్రాపీడుఁడు హేమకూటమునకుఁ బోవుట.

తే. రాకుమారక! విను గదు♦రమ్య మిలను
హేమకూటంబు చిత్రమ్ము ♦ నేమి చెపుదు

చిత్రరథరాజధానియుఁ ♦ జిత్రతరము
కింపురుషవిషయంబును ♦ నింపుఁ గూర్చు. 437

తే. అల్ల గంధర్వలోకంబు ♦ నడుగ నేల, యఖిలకౌతుకపేశలం♦బగుచు నెగడు
భర్తృదారిక నాబహిః♦ప్రాణపదము, సరసహృదయకాదంబరి ♦ చారుచరిత.

సీ. అతిఖేదకర మని ♦ గతి నెంచ వేనియు గురుకార్యభంగంబు ♦ గొలుప దేని
మద్వచనం బీవు ♦ మన్నింతు వేనియు నంతచనవు న కే ♦ నర్హ నేని
మన సద్వృష్టచరంబు ♦ లనువిషయంబుల కని వినోదింపంగఁ ♦ గడఁగు నేని
యాశ్చర్యదర్శనం ♦ బానందదం బేని పరిచయులవ మింక ♦ పరఁగు నేని

తే. తగ నిరాకృతి కే నని ♦ తలఁతు వేని, యే ననుగ్రాహ్య నని మది♦నెంతు వేని
యొక్కయర్థంబు నర్థింతు♦మ్రొక్కి నిన్ను, వ్యర్థపుచ్చకుమా మదా♦భ్యర్థనంబు.

మ. చని నాతో నల హేమకూటమునకున్ ♦ సద్రవ్యతాభూమికిన్
గని కాదంబరి మత్సఖిన్ దలఁగి త♦త్కాలబుద్ధి మోహాంధ్యమున్
దిన మొక్కం డట నిల్చి వత్తు విటకున్ ♦ దీవ్రంబు మర్నాడు ర
మ్ము నినున్ గాంచి యహేతుబాంధవుని లోఁ♦బొంగారుదుఃఖంబునన్. 440

చ. పరిస్ఫుత మైననామనసు ♦ ప్రాణితము య్యెను; సహ్యమై కదున్
బరఁగెను నాదుశోకము నృ♦పాలకుమారక! నీకు విన్పుటన్
గర మరలించు సాధువులఁ ♦ గాంచుట దుఃఖితు లైనవారికిన్
పరసుఖముల్ ఘటింపను భ♦వాదృశసాధుగణోదయంబులున్. 441

క. అనఁ జంద్రాపీడుండను, న నెను మహాశ్వేత కిట్లు ♦ లమ్మరో నిన్నున్
గనినది గోలె వశుఁడ నీ, కనుపును నీమనసు వచ్చి♦నట్టులఁ బనులన్. 442

క. నను నడుగ నేల వచ్చెద, నని కదలెను నామెతోడ ♦ నంతఁ గ్రమమునన్
జని హేమకూటమునకును, గనె గంధర్వాధిపతియ♦గారం బతఁడున్. 443

వ. కాంచి తోరణాంచితంబు లగుసప్తకక్ష్యాంతరములం గడచి కన్యాంతఃపుర ద్వారంబుఁ జేరె 444

మాలిని. సకలవిబుధవంద్యా! ♦ చారువృత్తాఢ్యనింద్యా!
ప్రకటనటనసంధ్యా! ♦ భాసురోద్యత్ప్రవింధ్యా!
నికటధనదమిత్రా! ♦ నిర్మలాంతఃపవిత్రా!
వికలితభగనేత్రా! ♦ విశ్వలోకైకమిత్రా! 445

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైన శృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీః.

శ్రీరామ సహాయోఽస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగారకాదంబరి

## పూర్వభాగము.

### షష్ఠాశ్వాసము.



మద్వృషభతురంగా
హైమవతీచిత్తభృంగ ♦ యరిమదభంగా!
సోమోజ్జ్వలోత్తమాంగా!
భామాశృంగారితాంగ! ♦ భాస్వదపాంగా! 1

వ. దేవా! దయాయుత్తమతి నవధరింపుము. అవ్వలికథావృత్తాంతంబు చెప్పెద. అట్లు చంద్రాపీడుండు మహాశ్వేతం గూడి హేమకూటంబునకుం జని గంధర్వరాజకులంబుఁ బ్రాపించి కాంచనతోరణాంచితంబు లగుసప్తకక్ష్యాంతరంబులం గడచి కన్యాంతఃపురద్వారంబు సమీపించుటయు. 2

తే. కని మహాశ్వేత నల్లంతఁ ♦ గదురయమునఁ
బరువులెత్తుచుఁ జనుదెంచి ♦ భక్తి మ్రొక్కి-
ద్వారపాలురు కనకవే♦త్రములఁ దాల్చి
దారి చూప మహీనాథ♦తనయుఁ డతఁడు. 3

తే. కన్యకాంతఃపురద్వార♦కంబుఁ జొచ్చి, స్త్రీమయం బైన మఱియొక♦జీవలోక
మన నసంఖ్యేయవనితాస♦హస్రమధుర,రవకుమారీపురాభ్యంత♦రంబుఁ గనియె.

కుమారీపురాభ్యంతరవృత్తాంతము.

ఆ. పురుషరహిత మగుమఁ ♦ బోలుచు సర్గాంతర, మన నపూర్వమైన♦యతివ దీవి
యనఁగఁ బురుషవైరి ♦ యబ్జభవాపర, సృష్టి యనఁగ వెలయు♦ శ్రీలఁ జెలఁగి.

క. పెదమైదవస్త్రీయుగ మనఁ, బొదలుచు బహుకల్పములను ♦ బొలఁతుల సల్పెఁ
బదిలమ్ముగ స్థాపించిన, మదగజగమనోరుకోశ ♦ మనఁగఁ దలిర్పన్. 6

మ. అతివిస్తారముఁ బ్లావితాశమును నై ♦ యార్ద్రీకృతానంత మై
తతపీయూషరసంబున౯ దివసము౯ ♦ దా నేకముం జేయుసం
గతి గారుత్మతభూషణద్యుతులతోఁ ♦ గాశించుసీమంతినీ
తతిలావణ్యఝరంబున౯ దదవరో♦ధం బొప్పు విస్మేర మై. 7

సీ. చంద్రబింబసహస్ర♦సంఘటితంబు నాఁ జంద్రికారచితసం♦స్థాన మనఁగ
విభ్రమనిర్మిత♦వివిధసామగ్రి నా రతివిలాసరచిత♦రాజి యనఁగఁ
దారుణ్యవిలసన♦దర్శితాశం బనఁ గంతుచరిత్రావ♦కాశ మనఁగ
భూషణద్యుతికృత♦భూరిదిగంతర మనఁగ మన్మథమయ ♦ మనఁగఁ దనరి

ఆ. రాగలిప్తసకల♦రమ్యదేశం బన
సురతదైవమయము ♦ సుందరత్వ
మయ మనంగఁ గుతుక♦మయమో యనంగను
నలరుఁ దదవరోధ ♦ మధిపతనయ!. 8

చ. అతిబహుళాంగనాజనము ♦ లాస్యగభస్తులఁ జంద్రబింబవ్య
ప్తితతిని గుర్యనట్టులునుఁ ♦ జేసెడి నాఁగ నపాంగదృష్టుల౯
క్షితితల ముత్పలప్రచుర♦సిక్తముగ౯; జికురాంధకారసం
తతి నసితప్రదోషసము♦దాయముల౯ ఘటియించునట్లుగ౯. 9

క. అతినిభృతభ్రూలతికా, తతవిభ్రమనిచయములను ♦ దర్పకచాప
ప్రతతుల జళిపించెదు నా, స్మితకాంతులఁ బుష్పమయము♦క్షితిఁ జేసెడినా౯.

తే. భూషణాస్త్రేంద్రచాపాళిఁ ♦ బోల సదన
కేకిబృందంబు లెగిరెను♦వీఁక దోఁప
యౌవనవికారముల మన్మ♦థాయుతములఁ
బ్రభవ మందంగఁ జేసెడి♦భాతిఁ దనర. 11

చ. పొలయఁగఁ జేయునట్టులను ♦ బొంపిరి నూరుపుగాడ్పువాసన౯
మలయసమీరబాలకుల; ♦ మంజుకపోలతలావలోకనం
బుల మణిదర్పణంబులను ♦ భూరిగ నంతట నిల్పినట్టులా
యలరునఖద్యుతిస్ఫురణ ♦ నంగజుతూపుల నష్టదిక్కుల౯. 12

తే. కప్పినట్టులఁ; గరతల♦కమ్రరాగ
మునను రక్తాబ్జవనవర్ష♦మును దొరంగు
జీవలోకంబు నా నందుఁ ♦ జెలఁగుచుంటఁ
గాంచె భూనాథతనయుండు ♦ కన్ను లలర. 13

వ. మఱియు నాతం డాకుమారీ పురాభ్యంతరమున. 14

సీ. పాణిగ్రహం బాళి♦పాణిగ్రహంబున నఖరక్షతము వీణ ♦ నంటుటలను
గరతలాఘాతంబు ♦ కందుకక్రీడల ముద్దులు వంశంబు ♦ ముట్టుటలను
జరణాభిఘాతంబు ♦ చారుకంకేళుల దంతక్షతంబులు ♦ తమ్మలముల
జఘనకంపంబులు ♦ సారడోలల మధుచులుకంబు కేసర♦క్షోణిజముల

తే. హారసుమపాతములను స♦త్కారములను
బుప్పలతలకు జలములఁ ♦ బోయుకలశ
కంఠములఁ గౌఁగిలింతలఁ ♦ గనె నపూర్వ
సురతమును నేర్చు నా నొప్పు♦సుదతులందు 15

సీ. కర్ణోత్పలంబులు ♦ కన్నులే; మైపూఁత లుజ్జ్వలహసితవి♦ద్యోతనములె
యాననతూళన ♦ మమలగండస్థలాలోకమే; యద్దము ♦ వీకుచనులె
లీలాంబుజంబులు ♦ లోలకరంబులె; వల్లకీధ్వనులు సం♦భాషణములె
యధివాసగంధంబు ♦ లమలనిశ్వసితంబు; లధరద్యుతులె కుంకు♦మానులేప

ఆ. మంబరావకుంఠ♦నంబు దేహప్రభ;, కుట్టిమోపహార♦కుసుమతతులు
నఖరరత్నరుచులె; ♦ నారుల కాయంతి, పురమునందుఁ జూడఁ♦బురుషవర్య!. 16

సీ. లాక్షారసంబును ♦ లలితాంఘ్రిభారంబు; వస్త్రభారంబును ♦ వాఁడఁగతము
కేసరమాలికా♦భాసురమేఖలాకలనమ్ము గతివిఘ్న♦కరణహేతు
వంగరాగభరంబు ♦ నధికోచ్ఛ్వసితహేతు వవతంసధృతియును♦నధికశ్రమము
మంగళప్రతిసర♦సంగంబు కరతలకంజాతకంపన♦కారణంబు

ఆ. కర్ణపూరకము♦కలితబంధరకుల, పక్షమారుతమున ♦ బాధ కలుగు
నచటిస్త్రీల కౌర ♦ యతిసుకుమారత, పొగడఁ దరమె వారి ♦ సుగుణధుర్య!.

వ. మఱియు. 18

తే. చెలులఁ దర్శింపఁ జేయూఁత ♦ చేసికొనక
లేచి యెదురేగుటయుఁ గడు ♦ లెస్స తెగువ;
యలరుఁ బ్రతికర్మములయందు ♦ హారభార
సహనశీలత కుచగర్వ♦శత్వమహిమ. 19

తే. పూలు గోయుట రెండవ♦పువ్వుఁ గొనుట
యంగనానర్హకృత్యమై ♦ యలగు నచటఁ
గన్యకార్హంబులై నట్టి♦కేళులయందుఁ
బూలు కట్టుట కోమల♦స్త్రీలవిధము. 20

వ. మఱియు 21

తే. దేవతలకు నమస్కృతుల్ ♦ దీర్చునపుడు
మధ్యభంగంబు గలుగుట ♦ మాన్యచరిత!
కన్యకల కందు నాశ్చర్య♦కరము గాద
యెంత వర్ణింతు నారయ♦యంతిపురము. 22

వ. ఇట్లతిమనోహరం బయి మహానందసంధాయకం బయి యొప్పునక్కుమారీపురాభ్యంతరంబు నాచంద్రాపీడుండు సొచ్చి యించుకదవ్వుఁ జని కతిపయ కక్ష్యాంతరములుగడచి యటునిటునటు సంచరించుకాదంబరీసమాసన్నపరిజనంబునానావిధమనోహరాలాపంబుల నాలించె నెట్లన. 23

సీ. లవలీలతాళికి ♦ లవలిక! పాదుల రచియింపు కేతకీ♦రజముతోడ
రత్నవాలుకఁ జల్లు ♦ రమణీయగంధోదకనకదీర్ఘికల సా♦గరిక! నీవు
గంధపాత్రిఁ దావి ♦ ఘటియింపు మకరిక! కర్పూరవల్లవ♦ఘనరజమున
రజనిక! పెట్టుము ♦ రత్నదీపంబులఁ దాపింఛవాటికా♦తమములందుఁ

తే. కృత్రిమాంభోరుహాంబులఁ ♦ గ్రీడ సల్పు
జంత్రపుంజక్కవలపైనఁ ♦ జల్లు కుంకు
మరజము మృణాళికా! నీవు ♦ మంజుగతిని
మధురికా! పుష్పభూమలు ♦ మఱి ఘటింపు. 24

వ. మఱియు. 25

చ. కుముదిక! మౌక్తికావళులఁ ♦ గూర్పుము దాడిమిపండ్ల కల్లవే
గుము లయి వచ్చెడిన్ శకున♦కోటులు; రత్నపుఁబుత్రికాకుచా
గ్రముల లిఖింపుమా నిపుణి♦కా! తగఁ గుంగుమపత్రరేఖలన్
గమలినికా! రథాంగపృథు♦కంబుల కీయవె తూండ్లచీరముల్. 26

తే కదళికా! గేహమరకత♦ఖచితవేది, నూడ్చు కనకసమ్మార్జని ♦ నుత్పలాక్షి!
వకుళసుమమాలికాగేహ♦వాటికలను, కేసరిక! చల్లు ముఖశీధు♦కిరణములను.

తే. భవనకలహంసములఁ ద్రావు ♦ పంకజాత, మధురసంబును నళినిక! ♦ మదనదేవ
భవనదంతవలభికను ♦ బాటలమును, జేయు సిందూరరజమున ♦ శ్రీ లెసంగ.

క. కదళిక! ధారాగృహములఁ, గదియింపుము గృహమయూర♦గణముల వీనిన్
గదళిక! వెన్నెలవులుఁగుల, కొదమల నెక్కించు కేళి♦కుధరశిఖరమున్. 29

చ. భవనహరీతపోతములఁ ♦ బల్లవికా! భుజియింపఁ జేయుమా
నవమరిచాగ్రపల్లవగ♦ణంబులఁ బంపుము గానశాలకున్

గవకవలాడు కిన్నరయు♦గంబు మయూరిక! పంజరంబులన్
రవితచకోరకంబులకు ♦ రావియిగు ల్లిడుమా లవంగికా!. 30

తే. పద్యములఁ జెప్పు హారిణిక! ♦ పంజరస్థ
శారికాకీరముల కని ♦ చాతుఫణితిఁ
జెప్పుకొనుచుండి రొండొరుల్ ♦ క్షితిపవర్య!
తత్సమాసన్నపరిజన♦తతులు వేడ్క. 31

వ. మఱియుఁ గొందఱు పరిచారికాసుందరులు. 32

చ. తెలుపుచు లేనిముగ్ధతను ♦ దిన్నఁగ నవ్వనిఁ గూడ సారికా!
దలఁచెద వోసి; జవ్వనపుఁ♦దళ్కులఁ జెల్కెడుమత్తకాశినీ!
తెలిసె నురోజకుంభభర♦తీవ్రత వ్రాలఁగ మేను పట్టెదే
విలసితరత్నజాలముల ♦ వెల్గెడుకంబపుఁగేకిజాలమున్. 33

చ. రతనపుగోడలం బడిన♦రమ్యనిజప్రతిబింబకంబుతో
సతి పరిహాసకాంక్షిణిరో! ♦ సల్లపనం బొనరించె దేమి; మా
రుతహృతపైర! హారలత♦రోచులఁ గప్పుచు సారెసారె హ
స్తతలము నొవ్వఁ జేసెదవు ♦ చాలును బయ్యెదఁ జక్క నొత్తుమా. 34

క. మణికుట్టిమోపహారక, వనజాతస్థలనభీత! ♦ వర్జించితె నీ
కనదానవాబ్జబింబము,లను నీమార్గ్యంబు గడు వి♦లక్షణ మరయన్. 35

చ. సుమబిసకోమలత్వమును ♦ జూచిగొనన్ నిజకోమలత్వ మం
చమితమదంబుఁ గన్నసతి! ♦ వౌదువె పోరణగంబ్లఁ జొచ్చున
ట్టిమహితపద్మరాగరుచి♦తీవిని లేఁతప్రకాశమంచుఁ జి
త్తమున భ్రమించి హస్తతల♦తామరసంబును గొడ్డు చేయుదే. 36

చ. శ్రమమునఁ బాణిసంకలిత♦చామర మిర్విని జాఱిపడ్డనన్
విమలనఖప్రభావళుల ♦ వీచెద వింకఁ బ్రమత్తచిత్త! ని
ల్పు మను ని వాదిగాఁ గలుగు ♦ పొల్పగు నన్యములన్ రసోక్తులన్
దమి విను చాన్నపాత్మజుఁడు ♦ తన్నప్రపుత్రిగృహంబు చెంతకున్. 37

చ. చని యట సైకతం బనఁగ ♦ సత్ప్రియదావనవల్లరీగళ
ద్ఘనసుమరేణుజాలములఁ ♦ గర్పురపుంబెనుదీవి నాఁగఁ గాం
చనకుసుమోపహారములఁ ♦ జంచలకీరనఖక్షతాంగనా
వనిసహకారసస్యరస♦వర్షమునన్ బెనుదుర్దినంబు నాన్. 38

చ. గళితసుమంబులం దిరుగు♦గంధమధువ్రతబృందతామసిన్
సలలితవంజులద్రుమవ♦నం బన; మారుతకర్ణకేసరో

జ్జ్వలమధుధారధూళులను ♦ సాంద్రహిమం బన నొప్పు నొక్కని
ర్మలసువిశాలమార్గమును ♦ మంజులరత్నమయంబుఁ గాంచెఁ దాన్. 39

వ. మఱియు నామార్గంబు. 40

సీ. సంచరచ్ఛ్రీజన♦చరణలాక్షారసస్ఫురముల రాగసా♦గర మనంగ
నంగరాగామోద♦సంగతిఁ బీయూషసంభవవాసర♦చయ మనంగఁ
గర్ణపూరాశోక♦కమ్రపల్లవజాలకములఁ గోకనదో రు♦గహన మనఁగ
దంతపత్రప్రభా♦సంతతప్రతతులఁ ♦ గంధఫలీద్రుమ♦గహన మనఁగ
తే. లలితలావణ్యమయసాల♦లక్ష్మిఁ బొల్చి, సేవకై వచ్చి యిరుతట్ల ♦ శ్రేణి గాఁగ
నిలిచియున్నట్టి స్త్రీజన♦నివహమునను, దీర్ఘరథ్యాముఖాకృతిఁ ♦ దేజరిల్లె. 41

క. ఆదారినడుమ నొరయుచు, వ్రాదినిగతిఁ బాలుభూష♦ణాంశుద్యుతులం
దీఁడుచు నెదురుగ నేగెను, భూదారసుతుండు హంస♦పుత్రియుఁ దానున్. 42

క. చని గాంచెను బ్రతిహారీ, జనమండలసంశ్రితాగ్ర♦సద్భాగం బై
తనరెడుశ్రీమండపమును, మణిమయమును వివిధశిల్ప♦మయమంజులమున్.

క. ఆమండపమధ్యంబున, శ్యామలచేలావృతంబు ♦ శయనతలమునన్
గోమలసితోపధానము, శ్రీమలయఁగ నానుకొనుచుఁ♦జే యూఁది లలిన్. 44

చ. సురుచిరభూషణావళుల ♦ శోభిలి కల్పలతాచయంబు నాఁ
బరఁగెడుకన్యకాజనము ♦ భాసిలఁ జుట్టు సహస్రసంఖ్య మై
ధర నుపవిష్ట మై ప్రథమ♦దంష్ట్రిరదస్థితధారుణీగతిన్
స్థిరమతిఁ గూరుచున్నయుల♦చిత్రరథాత్మజఁ గాంచె నాతఁడున్. 45

కాదంబరీవర్ణనము.

ఉ. చేరువ రత్నకుడ్యముల ♦ శ్రీమణికుట్టిమమండపమ్ములన్
మీఱుచు బింబితాంగి యగు♦నీరజలోచన యష్టదిక్పతుల్
మారుతభోజనుల్ సురలు ♦ మానుగఁ బ్రక్కను గ్రిందుమీఁదులన్
గూరిమి మీఱఁ గొంచుఁ జను♦కోమలతన్ గనుపట్టె భూవరా!. 46

తే. సంచలింపంగ భుజలతల్ ♦ చామరముల, వీచుదాసీజనంబు లా♦వెలఁదివిస్త
రాంగలావణ్యపూరంబు♦నందు నీఁదు,లాట లాడుచునున్నట్టు ♦ లలరి రెలమి.

క. ఆతరుణిఁ గాంచువేడుక, చేతను నరుదెంచి యొకటఁ ♦ జేరినలోక
వ్రాతం బన బహుచిత్ర, వ్రాతము వెలుఁగొందెఁ జుట్టు ♦ రాజాననకున్. 48

తే. భూషణారావనర్తక♦భుజగభోజి, వితతచంద్రకచిత్రిత♦వేశ్మకంబు
వేయుగన్నులవిప్పియా♦వెలఁదివేడ్కఁ, గాంచుచున్నదొ యన నొప్పు♦త్స్మారలేశ!.

తే. ఆత్మపరిజనమును నామె ♦ నాశఁ జూడ
దివ్యచక్షుష్కతను గాంచి ♦ తేజరిలెనొ
యనఁగ ననిమేషనయనమై ♦ యలరు చెప్పు
డావెలందిసె గాంచుచు ♦ నడరుచుండె. 50

తే. సర్వలక్షణములు నల ♦ సారసాక్షి
దేహ మెల్లను నిండారి ♦ తేజరిల్లుఁ
బ్రబలరాగాంధము లనంగఁ ♦ బార్థివేంద్ర
యెంత వర్ణింతు నాయింతి ♦ వింతసొంపు. 51

తే. అకృతపుణ్యం బటంచు నా♦యతివ వీడె, బాలభావంబు; నప్పుడే ♦ పంచబాణ
పరవశత నాఁగ నాబాల ♦ పలుక కున్నఁ, జేరె నెలప్రాయ మల్లన ♦ సిగ్గు వీడి.

సీ. నిశ్చలపదరాగ♦నిర్నిద్రదీధితుల్ ప్రత్యుద్గతంబు లై ♦ పరఁగు నొక్కొ
యావకరసపాట♦లాయితలావణ్యవారిధారలు జాలు♦వారు నొక్కొ
పరిధానితారుణ్య♦బరదళకాంతులు విరళంబు లై ముందు♦ వ్రేలు నొక్కొ
పాదభూషణరత్న♦భాసురకాంతిరేఖలు పురోగాము లై ♦ గ్రాలు నొక్కొ
తే. మృదులనఖవివరంబుల ♦ రుధిరధార
లొలుకు నొకొ యన నంగుళీ♦దళము లెసఁగ
నవనితారాగణం బన ♦ నలరునఖర
పంక్తిఁ జెలువొందు నబ్జాల♦పదయుగంబు. 53

ఆ. గురునితంబభరణ♦ఘోరపరిశ్రమ, ఖిన్నసక్థియుగికిఁ ♦ గే లొసంగి
తోడ్పడంగఁ బైకిఁ ♦ దోతెంచు నాఁగఁద,త్కటినినూపురమణి♦ కాంతులొప్పు.

తే. నలువ గట్టిగ నొత్తిన ♦ నడుమునుండి
గాఱి జఘనోపలప్రతి♦ఘాతమునను
రెండుపాయలుగాఁ బాఱు ♦ నిండుకాంతి
వారిపూరంబె యానారి♦యూరుయుగము. 55

చ. పరపురుషావలోకనముఁ ♦ బాపెడి నాఁ; గుతుకంబు పేర్మి నిగ్
విరివిని గాంచె నాఁ; దనువు ♦ వెండి స్పృశించుటఁ బుల్కరించె నాఁ
బరఁగి; ప్రసారితాయతగ♦భస్తిచయంబున నొప్పుకాంచి యా
సరసిజనేత్రమధ్యమునఁ ♦ జాల వెలుంగుచు నుండె భూవరా!. 56

తే. అలరు నాతన్విజఘనంబు ♦ నఖిలలోక
హృదయభరపాతమున నాఁగఁ ♦ బొదలి గురుత
గురుతరకుచంబు లడ్డమై ♦ కూరకున్న

నాననాలోక మావేళ ♦ నంది కుంది
చిక్క నన సన్నమై యొప్పు ♦ చిన్నినడుము. 57

తే. సౌకుమార్యంబు శోధింప ♦ జలజభవుఁడు, తాఁకి యొత్తిన యప్పుడు♦తవిలినట్టి
యంగుళీముద్ర యనఁగ నా♦యతివనాభి, తనరు గంభీరమై సుళ్లఁ♦దనరిమిగుల.

ఆ. గెలిచి ముజ్జగములు ♦ నలరాజు వ్రాసిన, విజయగీతవర్ణ♦వీథి యనఁగఁ
జెలఁగు నావెలంది♦చీమలబారు నాఁ, దనరు రోమరాజి ♦ ధారుణీశ!. 59

చ. అతిభరఖిద్యమానహృద♦యంబు తదంతరసీమబింబిత
శ్రుతికిసలాఖ్యహస్తమున ♦ క్షోణికిఁ ద్రోయఁగఁ బద్ధయిందిరా
సుతుపదవీరమో యనఁగ ♦ శోభిలు నాసతిచన్నుదోయి బా
హుతటకషాయితంబు నయి ♦ యున్నతి దాల్చి నిరంతరంబునై. 60

తే. అమలలావణ్యజలములు♦యందుఁ దేలు, మృదులబిసకాండములనంగ♦మేదినీశ!
దిగువఁ బ్రసరించుతత్కర్ణ♦దివ్యభూష, దీధితులు నాఁగ బాహువుల్♦తేజరిల్లు.

క. మణివలయగౌరవశ్రమ, జనితస్వేదాంబువేణి♦జాలము లాలికిం
చు ననఁగ నఖరమయూఖము, లనుఁ దొరఁగెడు దానికరత♦లం బొప్పు నృపా!.

క. స్తనభరమున వంగెడుముఖ,మును బై కెత్తంగ నాఁగ ♦ మునుకొని చుబుకం
బును నుచ్చైఃకరములచే, తను నంటుచు దానితార♦దామక మొప్పుఁ. 63

క. నూతనయౌవనపవనో, ద్ధూతం బగు రాగజలధిఁ ♦ దోఁచునలలు నా
నాతన్వి పెదవు లొప్పును, లేఁతప్రవాళంపులతల♦లీలఁ దొగరులై. 64

తే. పాటలస్వచ్ఛకాంతిని ♦ బరఁగి మిగుల
నిండి మదిరారసంబున ♦ మెండుకొనుచుఁ
బొలుచుమాణిక్యశుక్తిసం♦పుట మనంగఁ
దనరుఁ దత్కపోలయుగళి ♦ ధారుణీశ!. 65

క. గతి కడ్డం బొనరించిన, శ్రుతియుగళముపైనఁ గినుక ♦ చూపెనొ యన లో
హితనయనాంతం బై తగు, సతికనుఁగవ, నేత్రమయము ♦ సల్పుచు జగతిఁ.

తే. మత్తయౌవనకుంజర♦మదజలంబు, రేఖ లన మించు భ్రూవల్లి♦రీయుగంబు;
నాసికావంశ ములరారు ♦ నలినశరుని, చాపపరివాదినీతత్న♦కోణ మనఁగ. 67

తే. రాగపరవశమదనాంత♦రంగ మెల్ల, వదనసంలగ్న మయ్యె నా ♦ ననితనొసటఁ
బరఁగుచుండు మనశ్శిలా♦పంకలిఖిత, తిలకబిందువు; నృపవంశ♦తిలక! వినుము.

తే. కేశవీథిని ముద్దాడి ♦ కెరలుమౌళి, మణిమయూఖనికాయంబు♦మదిరభంగిఁ
బాటలీకృతఫాలమై♦ భామదీర్ఘ, కేశపాశంబు గప్పుచుఁ ♦ గెరలుచుండు. 69

చ. పతి తనయర్ధదేహమున ♦ భాసిలునంచు సగర్వ యైనయా
క్షితిధరరాజపుత్రి గడు ♦ సిగ్గును జెందఁగ దేహ మెల్లెడన్
రతిపతి భాసిలంగఁ దన ♦ రాదుచు యౌవనరూపసంపదన్
క్షితి కెఱుఁగంగఁ జేయు చల ♦ చిత్రరథాత్మజ యొప్పు భూవరా!. 70

వ. మఱియు. 71

చ. ఉరమున నొక్కలచ్చి వన♦జోదరుఁ డూని ప్రమోదమంది తా
గరువముఁ జెంద దానిఁ దలఁ♦గంగను నా నిజబింబకమ్ములన్
సిరిశతముల్ సృజించు; శశి♦శేఖరుఁ డూరక యొక్కమన్మథున్
హరణ మొనర్ప నీసున న♦నంగజకోట్ల సృజించు నాత్మలన్. 72

తే. శిరసుపై నుంచికొని యొక్క ♦ శీతకరుని
హరుఁడు గడు విస్మితుఁడు గాఁగ ♦ నతనిగర్వ
మడఁప నాఁగను సవిలాస♦హసితములను
గోటిచంద్రుల నుంచు నా♦బోటి దెసలు. 73

ఉ. రాతిరి యెల్ల మేల్కొనిన♦రాయిడిఁ గూరుకుపాట్లు గాంచు నా
బ్రాఁతిరథాంగయుగ్మములు ♦ పండుకొనంగ విలాసనిమ్నగా
వ్రాతములన్ విశాలమృదు♦పద్మరజస్సికతాతలంబులన్
శ్రీ తనరన్ ఘటింపు మని♦సేవకులన్ బనిగొంచు నెంతయున్. 74

చ. పరిజననూపురధ్వనులఁ ♦ బర్వులు వాఱెడు హంసయుగ్మముల్
సరసమృణాలశృంఖలను ♦ సంయమనం బొనరించి తెమ్ము నా
సరసకు నంచు హంసముల ♦ సాఁకెడుదాసికి నాజ్ఞ యిచ్చి పం
జరగతకీరశారికల ♦ చక్కికి నేగుచుఁ బల్కరించుచున్. 75

తే. పచ్చికస వని తోడవుల ♦ పచ్చతాల, జిగుల మెసవెడు సాఁకుడు♦జింకపిల్ల
కల్లచెలిచెవి నుండెడు♦యవసకిసల,యమ్ముఁ గొని నోటి కందిచ్చు ♦ చధికరక్తి.

తే. తాను బెంచినతీఁగెలు ♦ తాల్చెఁ దొలుతఁ
బువ్వు లని చెప్పవచ్చిన♦పూలతోఁట
కాఁపరి కనర్ఘరత్నసం♦ఖచిత మైన
భూషణవ్రాత మొసఁగుచుఁ ♦ బొలుపు మీఱ. 77

ఉ. ఆననసౌరభంబునకు ♦ నంధము లై చనుదెంచి మూఁగుచున్
దోన కరాభిఘాతమున ♦ దూరముగాఁ బయికేగి మూఁగుచున్

దో నరుదెంచి చిత్రముగఁ ♦ దోఁచెడు శ్యామలకందుకంబులో
నా నలరారు బంభరగ♦ణంబులతో విహరించుచున్ గడున్. 78

తే. పంజరనివాసహారీత♦భాషితముల, నాలకించి సాభిప్రాయ♦హాసవదనఁ
జామరగ్రాహిణిని గాంచి♦సస్మితాస్య, యగుచు లీలాబ్జమున దాని♦నడఁచు చట్టె.

క. చనుఁగవఁ బ్రతిబింబించిన, తనముత్తెపుఁ జంద్రరేఖఁ ♦ దా స్వేదపృష
ద్గణచితనఖపదం బను, కొని పటవాసమున నచటఁ ♦ గొట్టుచు నడపన్. 80

క తనవాలవ్యజనగ్రా, హిణి చెక్కిలియందుఁ బ్రతిఫ♦లించిన మణిక
మ్మనునఖపద మని సాకత, మనుమిమఁ దనశ్రీవణికిసల♦యము మూఁటిడుచున్.

వ మఱియు నిట్లు చెలులుం దానును బహువిధంగుల వినోదించుచుఁ బృథివియుం బోలె మహాకులభూభృద్వరవ్యతికరంబుల నెల్లఁ బాసి శేషభోగంబులఁ గనుచు మధుమాసలక్ష్మివడువున షట్పదపటలావహ్రియమాణపుష్పరజోధూసరపరాగయు, శరత్సమయంబుభంగి మానసభవపతంగరవంబుల నీలకంఠమదంబు నపనయించుచు, గౌరీవిధంబున శ్వేతాంశుకరచితోత్తమాంగాభరణయు, జలధివేలావనలేఖయుం బోలె మధుకరాకులనీలతమాలకాననయుఁ, జంద్రశరీరంబు పగిది నుద్దామమన్మథవిలాసంబుల గురుకళత్రంబుఁ బరిగ్రహించి మించుచు, వనరాజిమాడ్కిఁ బాండుశ్యామలవలీలతాలంకృతమధ్యయుఁ, బ్రాతఃకాలలక్ష్మిగతి భాస్వన్ముక్తాంశుభిన్నపద్మరాగప్రసాధనయు, నాకాశకమలినిచందదంబున నిర్మలాంబరపరిదృశ్యమానమృణాలకోమలోరుమూలయును, మయూరావళిమాడ్కి నితంబచుంబిశిఖండభారవిస్ఫురచ్చంద్రకాంతయుఁ, గల్పతరులతయుంబోలెఁ గామప్రదయు నై. 82

సీ. అతఁ డెవ్వఁ డెవ్వని♦యాత్మజుం డాతనిఁ బిలుతు రేమనుచు నీ♦యిలను జనము
లాతనియందంబు ♦ నాతనిచందంబు నెట్టి దాతనివయ ♦ సెంత చెపుమ
యేమన నాతండు ♦ నేమంటి వీవును నెంతసే పాతని♦వింతఁ గనితి
వలమహాశ్వేతకు♦నాతని కెబ్భంగిఁ బరిచయం బొదవెను, ♦ బార్థివుండొ

తే. యాతఁ డేటికి నరుదెంచె ♦ నటకు, నిటకు
వచ్చునో యాతఁ డనుచు న♦ప్పార్థివేంద్ర
తనయుఁ గూరిచి కేయూర♦కునిని సారె
కడుగు కాదంబరిని గాంచె♦నధిపసుతుఁడు. 83

తే. చందురుని గన్నసంద్రంబు♦చందమునను
హర్ష మొప్పంగ నుద్వేల ♦ మగుచు రాజ

తనయుఁ డిట్లని మనమునఁ ♦ దలఁచ సాగె
వర్ణనాతీత మాహర్ష♦వార్ధి నృపతి!. 84

ఉ. నాసకలేంద్రియంబులను ♦ నారజసంభవుఁ డేల కన్నులన్
గా సలుపండొ; నేత్రములు ♦ గాంచఁగ నీమెను నేమి నోములన్
జేసెనొ పూర్వజన్మమునఁ ♦ జెప్పఁగఁ జాలను నిర్నిరోధతం
జేసి కనుంగొనున్ నలువ ♦ చేసె నిదొండు వినోదసీమ పో. 85

చ. అతిశయచారురూపపర♦మాణువు లీయువి యేడఁ జిక్కె నా
శతధృతి; కాతఁ డీసతిని ♦ సల్పెడుచోఁ జెయిత్రాఁకుగాసికిన్
యతివ సహింప కేడ్వ గళి♦తాశ్రుచయంబులఁ బుట్టె నుత్పల
ప్రతతులు కైరవాంబురుహ♦భాసురహల్లకకాననంబులున్. 86

చ. అని తలపోయుచుండఁగను ♦ యాన్నృపపుత్త్రునిచూడ్కు లామె లో
చనయుగళంబుపైఁ బొలసెఁ ♦ జారుగతిన్ దనవల్లకీవహం
దనిన యతండు వీఁడె యవు ♦ నంచు మనంబున నెంచి లోకమో
హనరమణీయరూపమును ♦ నట్టె కనుంగొని విస్మితాత్మయై. 87

చ. సరసిజనేత్రయుం బఱపె ♦ తన్మాధవుమానునిపైనఁ జూడ్కులన్
సురుచిరమందహాసరుచి ♦ శోభిల నిశ్చలబద్ధలక్ష్యయై
నరవరసూనుఁ డద్రిగతి ♦ నాతినిఁ గాంచుటచేత స్తబ్ధుఁడై
గరము వెలింగెఁ దన్నయన♦కాంతి వశీకృశరీరుఁడై కడున్. 88

చంద్రాపీడునిం గనినకాదంబరి శృంగారభావోదయవర్ణనము

క. కనుఁగొనినంతనె యాతని, మును రోమోద్గమము పిదప ♦ భూపారవ మా
వెనుకను గాదంబరి ది,గ్గున లేచెను సంభ్రమమునఁ ♦ గుతుకం బొప్పన్. 89

సీ. కలిగించె నామెకు ♦ వలరాజె చెమ్మట రభసోత్థతిశ్రమ♦రట్టు గాంచె
గతి నడ్డగించెను ♦ కంపంబె పాదాంగదాకృష్టహంసాళి♦యుండె మాఱు
చలియింపఁ జేసె ని♦శ్శ్వాసమే పయ్యెదఁ జామరవ్యాజనంబు ♦ నడిని గాంచె
నాలింకించె హర్షంబె♦యురుబాష్పములు చలత్కర్ణపుష్పరజంబు♦గాంచెమిషను
ఆ. నాత్మసంప్రవిష్టుఁ♦డైనచంద్రాపీడు, స్పర్శనాభిలాష ♦ శయతలంబు
గదిసె నెదను నదియె♦ఘనకుచావృతి హేతు,వయ్యె నామె కపుడు ♦ నవనినాథ!.
వ. మఱియు. 91
చ. పలుకక యుండఁ జేసెఁ గడుఁ ♦ బావపులజ్జయె ద్వార మయ్యెఁ బో
సలలితవక్త్రసారసము ♦ సౌరభ మానఁగ వచ్చు బంభరా

వలి; ప్రథమాంగజాతశర♦పాతమొ సీత్కృతిహేతు వయ్యె నా
కలికికిఁ గేతకీకుసుమ♦కంటకవేదన మందెఁ దిట్టులన్. 92

వ. మఱియు. 93

క. వణఁకించెఁ గరతలంబును, ఘనవేపథువే; తలంపఁ ♦ గలికికి నేమో
మనవి యొనర్పంగా లేఁచినహెగ్గడికత్తెయాఁపు♦చెందె నెపంబున్. 94

తే. అపుడ కాదంబరిని జేరె ♦ నంగజన్ముఁ, డామెతోఁ గూడ రెండవ♦యంగజన్ముఁ
డనఁగ నారాజపుత్త్రుని♦యంతరంగ, మందుఁ జొచ్చెను నంగజుం♦డవనినాథ! 95

చ. జనపతిసూనుఁ డుర్వి దలఁచెఁ ♦ జానకలాపగభస్తులెల్లఁ ద
త్క్షణమ మఱుంగుపాటుగను ♦ దద్హృదయస్థితినిఁ బరిగ్రహం
బునుగను; భూషణారవముఁ ♦ బొల్పుగఁ దత్ప్రతిభాషణంబు గాఁ
గను; సకలేంద్రియాహరణ♦కార్య మనుగ్రహణంబుగా మదిన్. 96

తే. అంతఁ గాదంబరియు నతి♦యత్నమునను
సంభ్రమోత్థిత యై యింత ♦ చని యెదురుగ
నలమహాశ్వేతఁ బరిరంభ ♦ మాచరించెఁ
నిర్భరస్నేహ మేపార ♦ నిండు భక్తి. 97

వ. చిరదర్శనజాతోత్కంఠ యగుమహాశ్వేతయు సోత్కంఠంబున దృఢతరదత్త
కంఠగ్రహ యై చంద్రాపీడుం జూపుచుఁ గాదంబరి కిట్లనియె. 98

మహాశ్వేత చంద్రాపీడుని వర్ణించి కాదంబరికిఁ జెప్పుట.

సీ. చెలియ! కాదంబరి! ♦ క్షితి భారతాహ్వయవర్షంబునం దొక్క♦పార్థివుండు
బహుతురంగమఖుర♦వదనసముల్లేఖఖచితసాగరముద్రి♦కాయుతుండు
నలరుఁ దారాపీడుఁ ♦ డనుపేర; నాతని సూనుఁ డీతఁడు మహా♦క్షోణి నెల్లఁ
దనభుజప్రస్తర♦స్తంభపీఠంబున విశ్రమింపఁగఁ జేసి ♦ వినుతిఁ గాంచె

తే. నలరు నిలను జంద్రాపీడుఁ ♦ డన్నపేరఁ
గన్న దాదిగ నితఁడు ని♦ష్కారణాత్మ
బాంధవుం డయ్యె నాకు స్వ♦భావసరళ
గుణములను నాదుమనము లోఁ♦గొనియె నితఁడు. 99

సీ. కమలజనిర్మాణ♦కౌశలంబును రూపనిస్సపత్నత ♦ భాగ్య♦నిస్తులతయు
మానవాగ్రామ్యత ♦ మర్త్యలోకపుసురలోకాతిశాయిసు♦శ్లోకితయును
మానుషలోచన♦మంజుసాఫల్యంబు ధారుణీసద్వృత్త♦తాసుఖంబు
సుభగతైశ్వర్యంబు ♦ శుభదేవతాంచితస్థానాభినివసన♦చారిమంబు

తే. సకలవిద్యల కొక్కచో ♦ సంగమంబు
కాంతు నీతని నావలెఁ ♦ గాంచి నీవు
ననుచుఁ గొని తెచ్చితిని వీని ♦ నళిననయన
యరుదహేతుకమిత్త్రుఁ డీ♦యవనిలోన. 100

తే. ఇతఁడు దాక్షిణ్యపరవశుం ♦ డతులహృదయుఁ
డనుపమానవిదగ్ధుండు ♦ నమలచరితుఁ
డతివ! వీనిని గూరిచి ♦ యతిశయముగఁ
జెప్పఁ బనిలేదు సర్వంబు ♦ చెప్పితి సఖి!. 101

చ. తలఁగి త్రపన్ నవీనుఁ డని ♦ తాల్పకవిశ్వసనీయతన్ మదిన్
దెలియనివాఁ డటంచు మఱి ♦ తెల్లము గా వసి శీలవంశముల్
తొలఁగి భయంబు వీనియెడఁ ♦ దోయజనేత్ర! మెలంగు మట్టులన్
మెలఁగుదు వెట్లు నాయెడల ♦ మిత్త్రుఁడు బంధుఁడు వీఁడు నీకిఁకన్. 102

చ. అని తెలుపంగ నామె తను;♦నాధరణీధరసూనుఁ డంత మ్రొ
క్కను మదిరాతనూభవకుఁ ♦ గేవలభక్తిని నోరగంట నా
తనిఁ గనుచున్ ముదశ్రుప్రమ♦తంబు లపాంగగతాగతభ్రమా
జనితకనీనికాంబువుల ♦ జాల మనం గురిపించె నామెయున్. 103

చ. సరభసవృత్తి వచ్చుతన♦స్వాంతరజం బనఁగా సుధావళి
త్సురుచిరవాసకాముదివి♦కాసముఁ బర్వఁగఁ జేసె నల్దెసల్
గరము ప్రణామనంతతులఁ ♦ గాంతుని నీతని గారవింపుమా
శిరమ! యటంచు దానికి వ♦చింపఁగ నా బామ యెత్తె నొక్కఁడున్. 104

ఉ. వ్రేలులసందులన్ దొరఁగు♦పేశలగారుడరత్నముద్రికా
వేలమయూఖలేఖలను ♦ విభ్రమసంగ్రహవీటికంబు నాఁ
బోలుకరంబునన్ మిగులఁ ♦ బొంగుచు వచ్చెదునావులింతలన్
లీల నణంచుచుండె సతి ♦ నిస్రుతఘర్మకణాంచితాంగి యై. 105

ఉ. స్వేదజలంబులన్ గడుగఁ ♦ జెన్నలరారెడుకాంతిఁ బొల్చు నా
పైదలియొల్లయంగముల ♦ భాసిలుచున్ బ్రతిబింబితాంగుఁడై
భూదయితాత్మజుం డతఁడు ♦ పొల్చెను రెండవమన్మథుండు నా
వాదము లేల యావిధము ♦ వర్ణన చేసెద నాలకింపుమా. 106

క. నినదన్మణినూపురపుటిఁ, దనరుచు మణిభువిని రాయు♦తన్మదవతిబో
ట్టనవ్రేలిఁ బిల్వఁ బడెనో, యనఁ జరణనఖంబులందు ♦ నాతఁడు వ్రాలెన్. 107

క. కనుఁగొన నతిరభసంబునఁ, జనుదెంచి తదీయహృదయ♦సఖుఁడు దనను దాఁ
గొనిపోవు ననఁగఁ గనఁబడె, స్తనమధ్యమునం దతండు క్ష్మాపతివర్యా!. 108

తే. వికచకువలయదామక♦విధిని మిగుల, దీర్ఘమై యొప్పునాతని♦దృష్టిపంక్తి
పాన మొనరించు నా గండ♦పాళియందుఁ, గానుపించెను సకలభూ♦జానితిలక!.

చ. అతని నపాంగదృష్టులను ♦ హర్షమునం దిలకించుకన్యకా
ప్రతతిచలత్కనీనికలు ♦ భాసురకర్ణకలాపభృంగసం
తతులను దూఱి నిర్గమన♦తత్పరచిత్తము లైనయట్లనా
రతము పరిభ్రమించె రుచి♦రంబుగ నప్పు డిఁకేమి చెప్పుదున్. 110

తే. అంత గంధర్వపతిసుత ♦ యధికరభసమున సముత్థితయై వేగ ♦ మ్రొక్కి యతని
కలమహాశ్వేతతోఁ గూడ ♦ నధివసించె, శయనతలమున సవిలాస♦సరణి దోఁప.

తే. పరిజనంబులు పరువెత్తి ♦ భర్మపాద
ధవళవసనావృతం బయి ♦ తనరుగద్దె
నొకఁడు గొనివచ్చి యునుప నా♦యుర్వరేశ
సుతుఁడు గూర్చుండె నందుపై ♦ శూరవర్య!. 112

తే. ద్వారపాలిక లాభర్తృ♦దారికాళ, యమును గనుఁగొని సంపిహి♦తాధరాత్త
పాణిసంజ్ఞను వేణువి♦పంచికాది, వాద్యఘోషంబు లాఁపిరి♦పార్థివేంద్ర!. 113

## చంద్రాపీడసపర్య.

క. చని వేగ పరిజనంబులు, గొని తెచ్చినసలిలములను ♦ గొని తమి మదిరా
తనయ మహాశ్వేతాంఘ్రుల, వినయంబునఁ గడిగి తుడిచి♦ వేడ్కఁ బయింటన్.

క. తిరుగఁ దనమంచ మెక్కెను, ధరణీశలనాథసుతుప♦దంబులఁ గాదం
బరిసఖి మదలేఖయనన్, బరఁగిన విస్రంభపాత్ర♦బలిమిని గడిగెన్. 115

మ. శ్రుతిభూషాంశువు లొల్కనంసమున సం♦శుంభత్కరం బుంచి, యా
యతప్రేమంబునఁ జక్క నొత్తుచు ద్విరే♦ఫాళీభరానమ్రక
ర్ణతటాంభోజముఁ జామరవ్యసనప♦ర్యస్తాలకాళిన్ సఖిన్
నతవక్త్రాంబుజ మెత్తి భద్ర మడిగెన్ ♦ హాళిన్ మహాశ్వేత దాన్. 116

మ. సతి కాదంబరియున్ దొరంగియు వయ♦స్యన్ నెమ్మదిన్ గీమునన్
సతతం బుంటకు సిగ్గు నూను చడిగెన్ ♦ స్వశ్రేయసంబున్ సఖిన్;
వితతార్తిం గనుచున్న నప్పుడు మహా♦శ్వేతాననోద్వీక్షణా
మతియై యున్న నపాంగవీక్షణములన్ ♦ మాటుండు రానూనుపై. 117

చ. కుడుసు వడంకఁ గార్ముకము ♦ కుప్పెడువాని, మరల్పలేక తా
నడలుచు నుండె; రాతనయుఁ ♦ డంతికవర్తివయస్యచెక్కిలిన్
గడుఁ బ్రతిబింబితుం డయినఁ ♦ గాంచెను నీర్ష్య గుకుప్ప గప్పఁగ
న్పడమిఁ దదీయబింబము ♦ స్తనస్థలియందు వియోగవేదనన్. 118

వ. మఱియు. 119

ఉ. స్వేదముచేత నార్ద్రమగు ♦ చిన్నియురస్థలిఁ దోఁచుపుత్త్రికన్
సాదరబింబితుం డయిన♦యంత నతండు సపత్నిరోషమున్
బాదుకొనంగఁ జేసెను, గనం♦బడకున్నముదశ్రుధారలన్
వేదనఁ గాంచె నంధ యయి ♦ పీనపయోధర యామె భూవరా!. 120

తే. అంత నొక్కింత తడ వుండి ♦ యావెలంది
తనకుఁ దాంబూల మీయంగఁ ♦ దలఁచి లేవఁ
గడఁగుటయు మహాశ్వేత యా♦కాంతఁ జూచి
యనియె నిట్లని యల్లన ♦ నవనినాథ!. 121

ఉ. ప్రాఁతల మేము నీకు మముఁ ♦ బాటన యింతగఁ జేయ నేల యీ
భూతలనాథసూనుఁ డె సు♦పూజ్యుఁడు నూతనుఁ డౌట నచ్చెలీ!
యీతమలం బొసంగు మిదె ♦ యీతని కంచు వచింప నామె, యా
నాతి యిసుంత ద్రిప్పి పద♦నంబును వంచి శిరంబు మెల్లనన్. 122

చ. పరిచితి లేని నే నిటులఁ ♦ బ్రాభవ మందఁగ సిగ్గు గూరెదన్
వరసఖి! నీవె గైకొని నృ♦పాలకసూనున కీయవే యనన్
మఱిమఱి చెప్ప హంససుత♦మానస మీవికి నున్ముఖంబుగాఁ
బరఁగఁగఁ జేసెఁ జిత్రరథు♦ప్రాణతనూభవ యెట్టకేలకున్. 123

కాదంబరి చంద్రాపీడునకుఁ దాంబూల మొసంగుట.

సీ. వ్యాకులదృష్టిమై ♦ వడఁక నంగములెల్లఁ బైపయి నూర్పులు ♦ పరఁగు నట్లు
కందర్పసాయక♦ఘాతమూర్ఛను ఘర్మజలముల స్నానంబు ♦ సలిపినట్లు
ఘర్మవారినిపాత♦ఘనభయంబున నిమ్ము చేయుఁడీ యనుచు యా♦చించునట్లు
సాధ్వసాధీన యై ♦ జాఱిపడుదు నంచుఁ బట్టుకొనఁ బ్రయత్న♦పడినయట్లు
తే. లలమహాశ్వేతముఖముపై ♦ నిలిపి దృష్టి, వీటికాగర్భమై గడు♦వెలుఁగుహస్త
పల్లవము సాఁచె గంధర్వ♦పతితనూజ, రాజసూనునిదెసకు నో♦రాజచంద్ర.

చ. జనపతిసూనుఁడున్ దనదు♦చారుతరంబు స్వభావపాటలం

బును జయకుంభికుంభములఁ ♦ బుణ్కుటఁ జెందిర మంచెనో యనం
గను; గచపాళి మీఁదు్బ నెడ ♦ గాసిలి యేడ్చెదుశత్రులక్ష్మిలో
చనసలిలంబు దుష్కు నెడ ♦ సంగతకజ్జలబిందువో యనన్. 125

ఉ. చాపగుణాంకకర్కశము♦జాతకిణాంకిత మౌచుఁ, దాఁకఁగా
నేపున నింద్రియుక్రియు లు♦వేనును నొక్కట గాఁగవంత మై
ప్రాపును గాంచెనో యనఁగ ♦ భాసిలునంగుళులన్ వహించుచున్
దీపితమై నఖప్రభలు; ♦ దీర్ఘమునై దగు పాణిఁ జాఁచెఁ దాన్. 126

తే. అపుడు సుఖువృన జనియించు♦నధికవిభ్ర
మనికరముఁ జూచు కౌతుక♦మునను నాఁగ
నఖలరసములు చను దెంచి ♦ యావరించెఁ
జిత్రరథుకూఁతు, నటనుండి ♦ చేరె నొక్క. 127

చ. జనపతిసూనుహస్తజల♦జాతగవేషణపొంచెనో యనం
గను నఖరాంశుజాలములు ♦ గ్రక్కునఁ బర్వెలువాఱ ముందుఁ, గం
పనమున సంచలించి మృదు♦భాషణముల్ పచరించునో యనన్
మణివలయాంగళుల్ మృదుల♦మంజురవంబు లొనర్ప; హస్తమున్. 128

ఉ. చాఁపి యొకింత ఘర్మజల♦సంస్మృతిపూర్వము గాఁగ నింక నీ
ప్రాపున నుండుఁ బాయ దని ♦ ప్రాణము నుంచెదు నాఁగఁ, దమ్మిపూఁ
దూపులవాఁడె యీజనముఁ ♦ దోరపుఁ బ్రేమను నిచ్చుఁ గొమ్మటం
చేపునఁ ద న్నొసంగు నన ♦ నిచ్చెను దమ్మల మూసితాక్షి తాన్. 129

క. కరకిసల మీఁదుకొనుతఱి, స్మరచాపవిభిన్నహృదయ♦సంపుట మనఁగా
ధరఁ బడ్డరత్నవలయముఁ, బరికింపఁగ నేర దాయెఁ ♦ బరవళత నృపా!. 130

వ. మఱియొండు తాంబూలంబుఁ గొని మహాశ్వేతకున్ సమర్పించి యొకింతయిష్ట
కథాగోష్ఠిం దవిలి యుండ నప్పుడు. 131

తే. కుముద కేసరపింజర♦కోమలాంఘ్రి, యుగము చంపకకలి కాభ ♦ మైనముఖము
కువలయదళాసితంబు లై♦కులుకు రెక్క, లలర నొకశారి వచ్చె నా♦యతివకడకు.

ఆ. గుఘుసువడినయింద్రు♦కోదండ మనఁ గంఠ,మునఁ ద్రివర్ణరాగ♦మున మరకత
పతుతులఁ బ్రవాళ♦పల్లవచంచులఁ, నలరు నొక్కచిలుక ♦ యనుగమింప 133

చ. పరువిడి వచ్చి రోషమునఁ ♦ బల్కెను నిట్లని భర్తృదారికా!
యురుసుభగాభిమానుని స♦ముద్ధతు వీని విహంగము బ్రుర్

గర మిటు లూరిపై విడిచి ♦ గాంచుచు వారణ సేయ వేలకో
నిరతము నాదు వెంటఁ బడి ♦ నెవ్వగఁ గూర్చెదు దీనిఁ జూడుమా. 134

ఉ. ఊరక యుందు వేని యిఁక ♦ యుగ్మలి దేహము వాసెదన్ నిజం
బారయు నమ్మ నీదు చర♦ణాబ్జములంటి వచింతు నే నిదే
క్రూరత కోర్వఁ జాల నని ♦ కూయిడఁ జిత్రరథాత్మజాతయున్
స్మేరముఖాంబుజాత యయి ♦ మిన్నక పల్కక యుండె భూవరా!. 135

తే. అలమహాశ్వేత కది యేమి ♦ యుపగతంబు
కాక మదలేఖ నడిగెను ♦ గాంత! యేమి
పల్కు నిది యని; యాకాంత ♦ పలికె నిట్లు
వినయ మలరారఁ దన దేవి ♦ వినుచు నుండ. 136

క. ఇది కాళిందిసమాఖ్యను, బొదలెడుగోరువంక మదిర♦పుత్త్రికిఁ జెలి యా
యది పరిహాసాఖ్యశుకము, చదురుగ నొనరించెఁ బెండ్లి ♦ సఖ యిద్దరకున్. 137

తే ఈదిన మహర్ముఖంబున ♦ నీశుకంబు
చిత్రరథపుత్త్రియుడపయుఁ ♦ జేరి యొకట
మంతనం బుండి యేమేమొ ♦ మాటలాడఁ
గాంచె నీశారి యదిమొదల్ ♦ గాంతు నితని. 138

తే. కనదు తాఁకదు పలుకదు ♦ కడకుఁ బోదు
కినుకఁ జుఱచుఱఁ జూచుచుఁ ♦ గేవలేర్ష్యఁ
బూని మే మెంత చెప్పినఁ ♦ బులిమిపుచ్చి
కినుక మానక యూరక ♦ వనరుచుండు. 139

చ. అని వచియింప రాతనయుఁ ♦ డల్లన నవ్వు స్ఫురింపఁ జెక్కులన్
వినఁబడెడు న్నగల్ల నిది ♦ విన్కిపరంపరదిక్కులందునున్
వినఁ గొఱగాని యీకథయ ♦ వింటిమి మేమును దీని వెల్పటన్
జనములు చెప్పుకొందు రిటె ♦ సత్యము సేవకులున్ వచించెదర్. 140

క. మరగి తమాలికఁ గాదం,బరియడపను బంచబాణ♦పరవశ మగుచున్
బరిహాసాహ్వయకీరం, బరిగినదినములను గూడ ♦ నరయ దటంచున్. 141

క జగ మెఱుఁగును బోనిం డిఁక, నగ పేటికి వీడి భార్య♦వామాచారం
బగునీచిలుకకు నిస్త్రప, యగునీసతికోడితగుఁ ♦ మర్హంబె యగున్. 142

క. తగునా కాదంబరి కిది, వగవగ నీదుష్టదాసి ♦ వారింపమి హా
యుగపఱచె నామె యప్రియ, మగు నే యీచిలుక కీయ ♦ నాకాళిందిన్. 143

ఉ. ఏమి యొనర్చు నిప్పు డిది ♦ యింతులకున్ సవతిన్ ఘటించుటల్
భూమిని రోషకారణము ♦ ముఖ్య మపారవిరాగహేతు వా
యామపరాభవస్థలము ♦ నమ్మరొ కేవల మప్రగల్భ యీ
వామ తలంప మిక్కిలి య♦భాగ్యుఁడు వీనికిఁ బ్రీతిగాఁ గదున్. 144

ఉ. ఆశల నెల్లఁ గోసి విష♦మైన భుజింపదు నీట వహ్నినేన్
వాసికి నెక్కఁగాఁ బడ దు♦పాసము నేనియుఁ జేయదున్ గటా
గాసిలు నూరకే లఘిమ♦కారణ మింతుల కింతకంటె నే
దేశమునందు లేదు గదుఁ ♦ దీవ్రమ యియ్యది యిట్టిపట్టునన్. 145

చ. కలసెదు నేని దీని నిది ♦ కమ్రమృదూక్తులు పల్కునంతనే
తలఁగఁగఁ జేయఁగా వలయు ♦ దవ్వుల దీనిఁ బరాభవించి చీ!
పలుకు నెపం డెవండు గనుఁ ♦ బాపిని దీనిని బిల్చు నేఁ డనన్
గిలకిల నవ్వ గందఱును ♦ గేళివచస్సు లటంచు నంగనల్. 146

మ. పరిహాసుండును రాసుతుం డనిన యా♦పర్యాయనర్మోక్తులన్
గర మాలించి వచించె నిట్లనుచు నో♦క్ష్మానాథపుత్త్రుండ! నే
ర్పరి దీనిం బ్రతరింప నీతరమె యే♦వ్వారల్ సమర్థుల్ భువిన్
బరికింపంగ నెఱుంగు నిట్టివి గదున్ ♦ వక్రోక్తు లెన్నేనియున్. 147

ఉ. ఈపరిహాసజల్పముల ♦ నిద్ది యెఱుంగును దీనిబుద్ధియున్
భూపనివాససంగతిని ♦ నూత్నవికాసము గాంచె నాఁగుమా
చూపకుమీ భుజంగజన♦నూక్తులఁ జోటిది కాదు వానికిన్
గోపప్రసాదచిహ్నముల ♦ గుర్తెఱుఁగున్ సమయంబు వానికిన్. 148

క. ఇది యిటులుండఁగఁ గంచుకి, గదిసి మహాశ్వేత వినతిఁ ♦ గాంచెదు వేడ్కన్
మదిరయుఁ జిత్రరథుండును, బొదలుచు నినుఁ బిల్తురనుచుఁ♦బోలఁగఁజెప్పెన్.

వ. అంత. 150

తే. అల మహాశ్వేత యటఁ బోవ ♦ నభిలషించి
కాంచి కాదంబరిని సఖి! ♦ క్ష్మాతలేంద్ర
తనయుఁ డితఁడు చంద్రాపీడ♦ధరణినాథుఁ
డెందు వసియించు ననఁగ నా♦యిందువదన. 151

తే. చాల దేమొకొ పెక్కండ్ర♦సతులహృదయ
సదనశతనివాసం బని ♦ స్వాంతమునన

నవ్వుకొని చెలి కిట్టు లా♦యతాక్షిఁ గాంచి
పలికె సఖి! యేల యీలాగు ♦ పలికె దీవు. 152

చ. కనినదిగోలె నీయువని♦కాంతసుతుండె ప్రభుండు మేనికిన్
గనుఁగొన నింటికిన్ బరిజ♦నంబునకున్; సిరి కెల్లనున్ బ్రభుం
డని వచియింప నేల మఱి♦ యమ్మరొ వీనికి నీకునున్ రుచిం
చును నెట నుండ నీతఁ డటఁ ♦ జొక్కుచు నుండెడువాఁడు నెచ్చెలీ!. 153

తే. అల మహాశ్వేత యీపలు ♦ కాలకించి
నీదుసౌధంబుచెంతను ♦ నివ్వటిల్లు
ప్రమదవనమునఁ గ్రీడాద్రి♦పైన రత్న
సదనమున నుండువాఁ డని ♦ చనియె నామె. 154

వ. తదనంతరంబ చంద్రాపీడుండును నామహాశ్వేతతోడ బయలువెడలి తనయు
బుసుపోకకుం గాదంబరీప్రేషితు లగువీణావాదనచతురులును, వేణువాద్యనిపు
ణులును, చిత్రలేఖనాప్రవీణులును నగుకన్యకాజనంబు లనుగమింప వృష్ట
పూర్వుం డగుకేయూరకుండు ముందు నడచుచున్ దారిఁ జూపఁ గ్రీడాపర్వ
తమణిమందిరంబున కేగుటయు గంధర్వరాజపుత్త్రియు సమస్తపరిజనంబును
సఖీజనంబును వీడి పరిమితపరిచారిక యయి నిజప్రాసాదం బధిరోహించి. 155

కాదంబరీ కామవికారజచింత.

తే. సెజ్జపై మేనుఁ బడఁజేసి ♦ చెంతఁ జేరి
యొదిగి నిలుచుండి పరవుదు♦టువిద లెల్లఁ
గొలువ, నెటనుండియో వచ్చి ♦ కుదురుకొనఁగఁ
జేతనం; బొంటిగా నుండి ♦ చిత్తమునను. 156

సీ. చపల! యీగతి నేల ♦ సలిపితి వని లజ్జచే నిగృహీతయై ♦ చెలఁగునట్లు
మదిరాతనూభవ! ♦ మంచిదే నీ కిది యని వినీతిని దిట్ట ♦ నందినట్టు
లరిగె నవ్యుత్పన్న ♦ మైనబాల్యం బెందు నని ముగ్ధతాపరి♦హాసితభంగి
స్వైర! యథేచ్ఛను ♦ సంచరింపకు మని యలకుమారతబోధ ♦ మందినట్లు

తే. తగదు కులకన్యలకు నిది ♦ తగ దటంచు
మహిమ చేతను నుపదిష్ట♦మాడ్కి మఱియుఁ
గాచుకొను మవినయ మని ♦ కడలుకొనుక
భర్త్సితయుఁ బోలె స్వాచార♦పదము సేత. 157

వ. మఱియు. 158

తే. అలరువిల్తుఁడు నిన్నంత ♦ యగడుపఱచె
ననుచు శిక్షిత మైనట్టు ♦ లాభిజాత్య
మనను, జంచలచిత్తతఁ ♦ బూని తెట్టు
లనుచు ధైర్యంబుధిక్కృతి ♦ నందినట్లు
తనదు నేఁతకు గడు సిగ్గు ♦ దాల్చె నతివ. 159

ఉ. శంకల నెల్ల వీడి మది ♦ సంచలితంబుంచుటఁ జూపుచున్ మహా
శాంకిత నై విమోహమున ♦ నంధిత నై యిపు డేమి చేసితిన్
గొంకును జెందనైతిఁ గట ♦ నూతనుఁ డంచును; నాదు నెల్లిదం
బింక నెఱింగినన్ జన మ♦దేమనునో యని యెంచనైతిఁ బో. 160

సీ. ఇతనిమనోవృత్తి ♦ యెటులుండు నని మూఢచిత్తనై కడుఁ బరీ♦క్షింపనైతిఁ
దరళనై యితనికిఁ ♦ దగుదునో తగనో యని విచారము మది ♦ నరదనైతిఁ
గైకొనునో నన్నుఁ ♦ గైకోఁడో యనుపరితాపంబునను భీతిఁ ♦ దాల్పనైతి
గురుజనంబులు విన్నఁ ♦ గోపింపరా యని భయ మింతయేనియుఁ♦బడయనైతి;

తే. దలఁప లోకాపవాదంబుఁ♦దలఁపనైతి, నల మహాశ్వేత దుఃఖితఁ♦యనుచుఁజూడ
నైతి మోమోట లేమని ♦ నరయనైతి, నెట్టిపనిఁ జేయ నెంచితి ♦ నిప్పుడకట. 161

ఉ. అంతికవర్తినుల్ సకియ ♦ లారయరా యని చూడనైతి న
త్యంతము ప్రక్కఁ బాయక య♦హర్నిశ ముండెడు పారివార మె
క్కింతయుఁ జూడదా యనుచు ♦ నెంచఁగ నైతిని నష్టచిత్తనై
యింత వివేకహీన ధర ♦ నెందును నుండదు నక్క టక్కటా!. 162

మ. తెలియ న్నేర్తురు స్థూలబుద్ధులును దా♦నృజ్యద్వినీతిచ్యుతిన్
జలజాతాయుధువృత్తమున్ సకలమున్ ♦ గన్నామహాశ్వేత రా
ట్కులసంవాసవిదగ్ధపారిజన మా♦కూతజ్ఞ మున్ సర్వస
త్కులలం దేరిననెయ్యురాండ్రు తెలియం♦గా నేరరే యక్కటా 163

ఉ. అంతిపురంబుబానిసలు ♦ నందఱికన్నను నేర్పుకత్తె ల
త్యంతము నిట్టిపట్టులను; ♦ హా చెడిపోయితి నెల్లభంగులం
దింతయు మీఁదు నేను గణి♦యింపఁగ నైతిని నే మొనర్తు,నా
కెంతయు మేలు చావు; హసి♦యింపఁగ జీవిత మూనుకంటెనున్. 164

చ. ఇది విని దల్లిదండ్రులును ♦ నే మనువారలు చుట్టలున్ గటా
యెది ప్రతికార మింక నిట, ♦ నీయవినీతదురింద్రియాళిచే

ర్మదము వచింతు నెవ్వరికి, ♦ మాఁటఁగ నీస్థలనం బుపాయ మె
య్యది? యొనరించితిఁ బ్రతిన ♦ నాప్తవయస్యలమ్రోల నాగతిన్. 166

తే. అలమహాశ్వేతకై యిట్టు ♦ లాచరించి, చెప్పి పంపితిఁ గేయూరు♦చేత నట్టు
లేమి గతియింక నతఁ డిట ♦ కేల వచ్చె, నేల తెచ్చె మహాశ్వేత♦యితని నిటకు.

ఉ. ఎవ్వఁడు తెచ్చెనో యెఱుఁగ ♦ నీ తని నాహతపుష్పధన్వుఁడో
యవ్విధివంచకుండొ కట ♦ యాహతమృత్యువొ పూర్వజన్మమం
దెవ్వగ లేక మూఢనయి ♦ యే నొనరించినపాపరాశియో
యెవ్వరొ యింతవా రితని ♦ నీయెడకుం గొని తెచ్చి రక్కటా!. 167

ఉ. ఎవ్వఁడొ యీతఁ డే నెఱుఁగ, నెన్నఁడు చూడను, నాలకింప లే
దెవ్విధ మూహయుం గనను, ♦ నేయనుభావము లేదు, మోసకే
యివ్వసుధాతలంబునకు ♦ నీతఁడు వచ్చెను, జూచినంత నే
యివ్విధ మైతి నింక మఱి ♦ నేవిధ మాదునొ చెప్పఁజాలఁ బో. 168

చ. కరణము లెల్ల గట్టిగను ♦ గట్టి యొసంగెనొ, మారుఁ డంపపం
జరమున నుంచి యిచ్చెనొకొ ♦ చారుగుణోరుధనం బొసంగ నీ
వరవుమనంబె యమ్మెనొ, య♦పారపురాగ మొసంగెనో నను౯
వరవుడ నైతి నీతని క♦పాంగవిలోకనమాత్ర నక్కటా!. 169

ఆ. కలుగుఁ నేమి నాకుఁ ♦ గార్యంబు వీనితోఁ, జపలుతోడ ననుచు♦క్షణము మదిని
దలఁచెఁ గాని మదిర♦తనయ యంతటిధైర్య, మూన సాహసంబు ♦ నూనదయ్యె.

సీ. కార్యంబు నాతోడఁ ♦ గలుగ దే నిదె పోదు ననుచు హృద్గతుఁ డగు♦నవనినాథ
తనయుఁడు హృత్కంప♦తరళితుం డయి వేగఁ జను చపహాసంబు♦సల్ప ననఁగ
నతని వీడఁ దలంచి♦నప్పుడ వెడలిన యాలింగితప్రాణ ♦ మడుగ ననఁగఁ
గడిగి కన్నులు మల్లి♦కను విడ నితఁ డర్హుఁడొఁ గాఁడొ యని యశ్రు♦లనఁగ ననఁగఁ

తే. బాపెదను నీదుధైర్యంబుఁ ♦ బ్రాణములను
ననుచు మదనుండు బెదరింప ♦ ననఁగ మగుడఁ
జిత్రరథపుత్రి యాతనిఁ ♦ జిత్తమునను
నిలుపుకొని వీడ ధైర్యంబు ♦ గలుగ కకట. 171

తే. ప్రతిసమాధాన మెల్లను ♦ బాయ బలిమి
నతిశయప్రేమఁ బరవశ ♦ యగుచు లేచి
జాలవాతాయనముఁ జేరి ♦ చారుకేళి
పర్వతమువంకఁ జూచు చా♦పడఁతి యుండె. 172

చ. కనుఁగొనదాయెఁ గన్నులను • గాంచెఁ దలంపుల నానృపాత్మజా
వనజదళాక్షి హర్షజల•వాహిను లడ్డము వచ్చు నంచు నాఁ
గను, గరశాఖలం దొరఁగు•ఘర్మజలంబులు తుడ్చువేయు నాఁ
గను లిఖియించెఁ జింతను జొ•కాటపుఁదూలికవ్రాయుదాయెఁ బో. 173

చ. గగురువు లడ్డపెట్టు నను•కాతరచిత్రక నాఁగ నక్కునన్
దగఁ బరిరంభముల్ గొనక • దద్ద ముననంబునఁ గౌఁగిలించె నా
మగువ నృపాత్మజుల్ గనఁగ • మానసముల్ బనిచెల్ విలంబితం
బగుటకు నైఁపకో యనఁగ • నంపక తత్పరిచారికావళిన్. 174

పర్యుత్సుకుఁడగు చంద్రాపీడునిస్వగతచింత.

వ. అటఁ జంద్రాపీడుండును రెండవకాదంబరీహృదయుంబు నాఁ గడుస్వచ్ఛం బయి
నయామణిగృహంబుఁ జొచ్చి యుందిరుకెలంకుల మిగుల నునువు లగున నేక
పట్టోపధానంబులం బొలుచు శిలాతలసమాస్తీర్ణం బయినకుథాసనం బధిష్ఠించి
కేయూరకుండు నిజాంకంబునం దిడికొని పాదసంవాహనంబు సేయ యథా
దిష్టంబు లగుభూమిభాగంబులం దుపవిష్టలై కన్యకాజనంబులు పరివేష్టించి
కొలువ దోలాయమానమానసుం డై తనమనంబున. 175

చ. సకలజగన్మనోహృతియు•తంబును గాంచిన యీవిలాసముల్
ప్రకటితకీర్తి చిత్రరథు•పట్టికి దీనికిఁ దోడఁబుట్టులో
శుకరథుఁ డాస్మరుండు ననుఁ • జొక్కఁగఁ జేయఁగ నేర్చునో యహే
తుకకరుణుం డతండు మదిఁ • దోఁచెడుదేవుఁడు వేఁడకుండినన్. 176

చ. హృదయములోపలం బడెడు•నిక్షుధనుశ్శరపుష్పరేణువుల్
గదిసెనొ నాఁ ద్రిభాగమును • గమ్రముగా నొకయింత వంచి చూ
చెను నను నోరగంటఁ దమి • చిందఁగ సాంద్రసరాగ మై త్రపన్
దనుఁ గన నే వళత్మహసి•తద్యుతిఁ గప్పు దుకూలముంబలెన్. 177

చ. కనుఁగొని నన్ను సిగ్గున ము•ఖం బిటు ద్రిప్పి కపోలదర్పణం
బును బ్రతిబింబకస్పృశిని • భూరితరాళను నా నొసంగు, నా
కు నెడ మొసంగినందులకుఁ • గోపమునన్ బ్రథమాపరాధ లే
ఖను లిఖియించు నా నెవకు • ఖట్వ లిఖించును గోటికోటితోన్. 178

చ. తమలము నా కొసంగుతఱిఁ • దార్కొనినట్టి పరిశ్రమాతిరే
కమునఁ జెమర్చినట్టి ముఖ•కంజముఁ గోకనదభ్రమభ్రమ

ద్భుతసురచయంబు మూఁగ విధు♦తం బగుహస్తతలంబుచే నాయా
రసు గమరంగ వీచుకొను ♦ రమ్యతమాలికిసంబునకా బలెన్. 179

క. మనుజులకుఁ దఱచు సులువయి, తన రెదు లఘిమంబు నట్టి♦తలఁపుల నను వం
చన సేయునొ మనసుఁడొ యీ, వనసుదమో తెలివినూడ్చి♦ భ్రమదుని జేయున్.

సీ. తిమిరోపహతమైన♦తీరున యువదృష్టి కను నల్పకలుషత♦ ఘనము గాఁగ
స్నేహాలనంబును ♦ జెందించు విస్మృతి వారిచందమునయా♦ననమదంబు
కవివలె నేమేమి ♦ కల్పింపఁ జాలదు తరళత బహువిధ♦తర్కకలిత
తరుణమనోవృత్తి♦ తానేమి వ్రాయదు స్వచిత్రపత్రిక♦చందమునను

ఆ. ననుభూత మయిన♦ యర్థంబుఁ జూపించు, కలయుఁబోలెఁ గోర్కి;♦ గడుదురాశ
యింద్రజాలపింఛ♦ మెలమి నసంభావ్యమును జెలంగ నిలువు♦ మ్రోల నహహా.

క. ఈమానసఖేదంబున, నేమగు; నాయింతిమనసు ♦ నిట్టిద యోఁ ద
త్కాముఁడె యుప్రార్థితుఁడై, యీమానినిభావములను ♦ నేర్పడఁ దెలుపున్.

తే. అతఁడె యీసందియముఁ దీర్చు ♦ ననుచు లేచి
కూరుచుండి యాకన్యలఁ ♦ గూడి వేడ్క
సారెలను గేయముల నిష్ట♦సంగతులను
గొంత యిష్టకథాగోష్ఠిఁ ♦ గూర్చి నెఱపి. 183

తే. ఉపవనాలోకకౌతూహ♦లోజ్జ్వలాత్ముఁ
డగుచు నారాజచంద్రుండు ♦ నట్టె వెడలి
కేళికాశైలశిఖరంబు ♦ కెరలు చక్క
తత్తదుద్యానశోభలఁ ♦ దనియు చుండె. 184

క. మదిరాతనయయు నాతని, ముద మొదవఁగఁ గాంచఁ జాల♦ప్రొద్దయ్యె నిఁకన్
గదియ దని మహాశ్వేతా, పదవిం గనఁ గిటికిఁ బాసి ♦ ప్రాసాదశిఖన్. 185

క. గిరిజాసతి కైలాసశి, ఖరమును బలె నెక్కెఁ గుసుమ♦కాండాతుర యై
విరళములై పరిజనములు, పరఁగఁ గొలువంగఁ దన్ను ♦ వసియించి యటన్.

తే. సకలశశిమండలమువోలె ♦ స్వచ్ఛమైన
హేమదండాతపత్రంబు ♦ నెలమిఁ బట్ట
నెండపొడ పైనఁ బడకుండ ♦ నించుకయును
వీవ వింజామరల ఫేన♦విశదములను. 187

కాదంబరీ పర్యాకులీభావము

చ. శిరమునఁ బుష్పవాసనకుఁ ♦ జేరి భ్రమించెడు బంభరాళి భా
సురముగ శ్యామలాంశుకము ♦ శోభ వహింపఁ బగంటివేళ నే

ధరణిపసూనుదగ్గఱకుఁ • దర్లెనొ నా నభిసారికాగతిన్
బరఁగుచు నుండె రాసుతుని • బాయక చూచుచుఁ గోర్కు లుబ్బఁగన్. 188

సీ. చామరాగ్రంబును • సారెకుఁ బట్టుచు ఛత్రదండంబును • సారె గొనుచుఁ
గరము తమాలికా•స్కంధంబుపై నూఁది సారెకు మదలేఖ•సరసఁ జేరి
పరిరంభ మొసఁగుచుఁ • బరిజనాంతరితాఖిలాంగయై మాటికిఁ•దొంగి తొంగి
క్రేఁగంటఁ గనుచు సా•రెకుఁ బరివర్తితత్రివళీవలయ యయి • తిరిగి తిరిగి

తే. గండఫలకంబు ప్రతిహారి•కరతలస్థ
వేత్రలతికాగ్రమున నూఁది • వీటఁ గేలఁ
గొనుచు నల్లన మోవిపై • నునిచి యూరక
గనుచు నుండెను నెంతయుఁ • దనివి గనక. 189

తే. సారెసారెకుఁ గర్ణాంబు•జాతమునను
బరిజనంబును బ్రహరించి • పరుగు వాఱ
వారు; తానును బరుగెత్తి • వారివెంటఁ
గనుచు నవ్వుచు నాతనిఁ • గాంచు లూర 190

తే. అతఁడు తనుఁ గన వినతాన•నాంబుజాత
యగుచు ముసిముసినగవులు • నలుగ వేఁడ్కఁ
గనుచు సఖులకు విదితంబు • గాక యుండఁ
గాల మెంతేగినది యామె • గాంచ కుండె. 191

వ. అంత. 192

తే. పైకి నరుదెంచి ప్రతిహారి, భర్తృదుహిత!
యరుగుదెంచె మహాశ్వేత • యనుచు మ్రొక్కి
తెలుప సౌధోపరితలంబు • దిగ్గ వచ్చెఁ
బరిజనంబులు తాను నా•భర్తృదుహిత. 193

తే. స్నానపానాది సత్క్రియా•సమితి యందు
మంథరాదర యయ్యు నా•మగువ మిగులఁ
దన్మహాశ్వేతమాటను • దాఁటలేక
దివసకృత్యంబు లెట్టెటో • తీర్చె నగను. 194

క. అల చంద్రాపీడుండును, సలలితగతి దిగ్గ వచ్చి • స్నానాదివిధుల్
సలుపఁగఁ దత్పరిజనులు, సలిపి శిలాఫలకమునను • శంభునిఁ గొల్చెన్. 195

క. ఆ కేళిశైలముననే, యాకంతుసముండు నరవ•రాత్మజుఁ డంతన్

జోక సహాకృత్యంబుల, వీఁకను నాహారవిధుల • వెలయఁగఁ జేసెన్. 196

వ. ఇట్లు చంద్రాపీడుండు క్రమంబుగఁ బరిసమాప్తితాహారుండై యేతెంచి. 197

సీ. అతిమనోహరమగు • హారీతహారితంబు పృషతరోమంథాంబు•బిందుయుతము
తాలాంకహాలభయ• స్తంభితరవిసుతా పానీయవేణికా•భాసురంబు
తరుణీగణోజ్జ్వల• చ్చరణలాక్షారసశోణమయూఖాళి•శోభితంబు
కుసుమరజస్సాంద్ర•కోమలసికతిలవరల తామండప•పరివృతంబు
తే. కేకికానాట్యసంగీత• కేళిగృహము, నగుచుఁ జెలువొందు క్రీడాచ•లాగ్రభాగ
భాజి యగుమరకతశిలా•ఫలకమందుఁ, గూరుచుండెను నృపసుత•కుంజరుండు.

మదలేఖ తారహారముఁ గొని చంద్రాపీడునియొద్దకు వచ్చుట.

చ. జలముగలిగి దినంబుఁ గడు • సౌళనముగ సవరించుచున్ మహిన్
కలశపయోధియట్లు ప్లవ•నంబు నొనర్చుచుఁ దూఁడుపోలికన్
దళతళలాడునాకసముఁ • ద్రావుచు దిక్కుల నెల్లఁ జల్లుచున్
మలయజవర్ష మట్లు సుధ•మాడ్కి వియత్తల మెల్లఁ బూయుచున్. 199

చ. ధవళము భూరిధామ మయి • దగ్గయి వెల్గెడు నొక్క వెల్గుఁ గాం
చె వసుమతీవరాత్మజుఁడు • చింతన చేయఁగ సాగె నిట్లు జ
క్కవగమినూడు చందురుఁ డ•కాండమునం దుదయించె నేమొకో
పవనవికీర్ణవారికణ•భాసురదేవధునీప్రవాహమో. 200

వ. అని తనమనంబున నెన్నుచు నెక్కడినుండి వచ్చెనో యీయతిలోకాలోకం
బని విస్మయపరీతచిత్తుండై యుత్కుతుకంబున నాయాలోకంబు వచ్చినచాయ
కుం జూడ్కులం బఱపుటయు. 201

సీ. ఇరువంకలను బెక్కు•తరుణులు గొలువంగ వింజామరలు రెండు•వీచుచుండఁ
ధవళాతపత్రంబు • ధరియించి నిశ్వాసహార్యంబు లగుకల్ప•కాంశుకములఁ
బరిధాతనిర్మోక•పరిశుద్ధములఁ గొని కేయూరకుఁడు దారిఁ • గెలనఁ జూప
మాలతీసుమధామ•మండితహస్తయై యల తమాలిక తన్ను • ననుగమింప
తే. నార్ద్రవస్త్రావృత నసం • బగుచుఁ జంద,నానులేపనకలితమా • నారికేళ
సంపుటం బుంచి డా కేల•సవ్యకరము, దేవిప్రతిహారి యూఁతగాఁ • దీర్చినదుమ.

తే. అరుగుదెంచెను మదలేఖ; • యామెపజ్జ
ధవళవసనావృతంబయి • తనరుచిఱుత
పెట్టె నొకతారహారంబు • పెట్టికొనుచు
వచ్చుతరళికఁ గాంచె భూ•పాలసుతుఁడు. 203

తే. నళిననాభునినాభికా♦నళిననాళ, మనఁగఁ జందురుతోఁబుట్టు ♦ వనఁగ; మథన
సమయజశ్రమపరిము క్త♦సర్పరాజ, కంచుకం బన హారంబు ♦ గ్రాలుచుండె.

వ. మఱియు. 204

ఉ. కవ్వపుఁగొండ త్రిప్పుటల ♦ ఖండము లై యొకచోటఁ బడ్డయా
మవ్వపుఁజందు వెల్గుగమి♦ మండలమో యన శ్రీనగో యనన్
బువ్వులుకాని పేరిగజ♦మూర్ధ్నమునందలి తారమాల నా
నవ్వరతారహారము మ♦హాద్యుతిపుంజము నా వెలింగెడిన్. 205

ఉ. శారదమేఘఖండముల ♦ సన్నుతచిత్రరథాత్మజామనో
హారిసురూపనిఘ్నముని♦హ స్తిమనఃప్రకరంబులన్ దగన్
సారససంభవుండు తన♦చాతురిఁ జూపఁగ సల్పెనో యనన్
మీఱి సమస్తరత్నముల ♦ మేటిగురుం డన క్షీరసాగర
స్ఫారయశస్సమూహ మన ♦ భాసిలు నానవహార మెంతయున్. 206

ఉ. వెన్నెలజీవితం బనఁగ ♦ వెన్నెలతేనిసపత్నుఁడో యనన్
వెన్నునిచానచి త్త మన ♦ విస్ఫురదంబుజినీదళస్రవ
త్సన్నుతవారిబిందువిల♦స త్తగళం బయి శారదేందుభా
తి న్నవమా క్తికాంశువిత♦తి న్విశదీకృతదిఙ్ముఖంబు నై. 207

తే. అతులగంగాప్రవాహంబు♦నట్లు త్రిదశ
భామినీకుచపరిమళ♦వాహి యగుచు
సంతతప్రభావర్షి యౌ♦చారుతార
హారమును గాంచి నృపతికు♦మారుఁ డంత. 208

క. కత మియ్యది యాజ్యోత్స్న,ద్యుతిహారధవళిమ కటంచు ♦ రోజించి సము
త్థితుఁ డయి దవ్వుల సముచిత, వితతాచారక్రమంబు ♦ విధి నడిపి తమిన్.

క. చనుదెంచుచున్న మదలే,ఖను నెదురుగఁ బోయి తెచ్చి♦కౌతుక మొప్పన్
ఘనమరకతమణిశిలపైఁ, దనరఁగఁ గూర్చుండఁ బెట్టె ♦ ధాత్రీనాథా!. 210

క. మదలేఖయుఁ గొండొకవడిఁ, బొదలుచుఁ గూర్చుండి లేచి ♦ భూపసుతునకున్
బదిలముగఁ జూపి యాస్పృగ, మదకుంకుమచంద్రకలిత♦మలయజచర్చన్.

తే. ఆదుకూలద్వయంబు స♦మర్పితంబుఁ
జేసి కట్టించి యాజాజి♦చిన్నిపూల
దామకంబును సిగఁ జుట్టి ♦ తారహార
మును గయిధరించి యిట్లను ♦ నినసుతునకు. 212

మదలేఖ చాటూక్తిపూర్వకముగఁ జంద్రాపీడునకుఁ దారహారమొసంగుట.

చ. అరయఁ గుమార! నీదునిర♦హంకృతి కాంతసువేశలత్వ మె
వ్వరి నొనరింపలేదు వశ♦వర్తులఁ బ్రేమకు; నట్టివారి కే
వరవినయంబె తా నొసఁగుఁ; బ్రాణదపుండవు కావె యేరికే
నిరుపమరూపసంపదను♦నీవు వచింపఁగ నేల యూరకే. 213

ఉ. కారణ మేమి లేక యిటు ♦ గాటపువత్సలభావ మేర్పడన్
గూరిమిఁ జూపునీచరిత ♦ కూర్పదు చుట్టఱికంబు నేరికిన్?
నీరమణీయవర్తనము ♦ నచ్చెలిఁ జేయదు నీకు నేని? నీ
సారనిసర్గకోమలవి♦శాలగుణంబులు కూర్ప వేరికిన్?. 214

మ. తగు నీమూర్తియె నిందకున్; మొదటిసం♦దర్శంబె విశ్వాసమున్
దగులం జేసెను; లేకయున్నఁ దగునే ♦ ధాత్రీసమాఖ్యాత స
త్సుగుణాఢ్యుం డగునీయెడన్ సలుపు నీ♦తుంతుర్వ మెల్లన్; భళా
యగు సంభాషణమున్ లఘూకృతిగ నా♦హా మాయనృష్టం బకే 215

సీ. ఆదరంబును బ్రభు♦త్వాభిమానముఁ జూపు స్తుతియునాత్మో♦త్సేక♦విశతిఁ దెల్పు
నుపచారమును మాదు♦చపలతఁ దెల్పును నీవియు మాపరీ♦భావ మగును
మనవియుఁ బ్రాగల్భ్య♦మును గానుపించును సేవయుఁ జంచల♦భావ మగును
బ్రీతియు నాత్మజ్ఞ♦తాతిశయం బవుఁ బ్రణతియు మామనః♦ప్రకృతిఁ దెల్పు
తే. నే మొసంగఁగఁ జాలుదు ♦ మేము మాదు
హృదయముల నెల్లఁ గొన్న నీ ♦ కింక; జీవి
తమునకును నీశ్వరుండవు ♦ ధారుణీశ
తనయ! యే మున్నది యొసంగ ♦ దానికంటె. 216

చ. తొలుతన యేగుదెంచి యిటఁ ♦ దోరపుఁబ్రేమ మహోపకారమున్
సలిపిననీకు నేమి ప్రతి♦సత్క్రియ? ప్రాణఫలంబు నిచ్చి నా
వలరెడుదర్శనంబునఁ; ద్వ♦దాగమనం బెటు సేయువార మో
ఫలసహితంబు; రాతనయ! ♦ పల్కఁగ నేరమిఁ కేమి యొక్కుడున్. 217

చ. తనప్రణయంబుఁ జూపెడిని ♦ దన్మదిరాసుత యీనెపంబునన్;
దనవిభవంబుఁ జూపదు; క♦నంగ ననర్హము గాదె యీయ స
జ్జనవిభవాన్యనిఘ్నత; ని♦జంబుగ నావిభవం బటుండ నీ
తను నినుఁబోఁటివాని కిఁక ♦ దాసిని గా నొసఁగన్ దలంచి తాన్. 218

చ. తలఁప దకార్యమంచు నిది; ♦ తన్ను నొసంగిన విప్రలబ్ధగాఁ

దలఁపదు; జీవితం బొసఁగి ♦ తాపము సెందదు వెన్క నెన్నఁడున్;
దలఁపదు సన్మహాత్త్వ మిలఁ ♦ దాను దిరస్కృతుఁ జేయఁ బ్రేయసున్;
గలుగదు దాత కెట్టిత్రప ♦ గల్గునొ యట్టిది వేఁడువానికిన్. 219

చ. తలఁచుఁ గృతాపరాధనుగఁ ♦ దన్మదిరాసుత యిచ్చి దేని నీ
కులుపగ; నద్ది పాల్కడలి ♦ నుద్ధురభంగి మథించునప్పుడున్
గలిగినరత్నరాసుల నొ♦కం డవశిష్టము శేషనామకం
బు లలితహార; మంబుధి య♦పూర్వ మటంచు నొసంగె దీని నా
జలపతికిన్ గృహంబునకు ♦ సన్మతి వచ్చిన వానికిన్ నృపా!. 220

తే. అతఁడు గంధర్వరాజున ♦ కతఁడు తనదు
కూఁతు కాదంబరి కొసంగెఁ ♦ గుతుకమునను
నామె యీభూషణమునకు ♦ నర్హ మగును
నీదు మే నని పంపెను ♦ నిశ్చయముగ. 221

తే. ఆకసము గాక చంద్రున ♦ కవనితలము
నర్హ మగు నొక్కొ యైనను ♦ నాత్మసుగుణ
భూషణాలంకృతాంగు లై ♦ పొలుచు మీకు
నన్యభూషలు బరువు లౌ ♦ నవనినాథ!. 222

తే. అయినఁ గాదంబరీప్రీతి ♦ నాత్మఁ దలఁవు
కౌస్తుభాహ్వయపాషాణ♦ఖండ మిదను
దాల్పుఁడే శౌరి సిరివెన్నుఁ ♦ దన్నిపుట్టె
నన్నయభిమానమున నీవు ♦ నట్లె దాల్పు. 223

ఉ. ఇంచుక యేని కౌస్తుభము ♦ నీమణిహారముఁ బోల నేర్చునే
యించు మనోజతంత్రి నిను ♦ నెన్నఁగ మీరఁగఁ జాలునే యిఁ కా
చంచలచిత్త లక్ష్మియును ♦ జాలదు పోలఁగఁ గొంచెమైన మా
యంచితగాత్రి చిత్రరథు♦నాత్మజ నిక్కువ మెన్ని భంగులన్. 224

ఉ. కావున నర్హురాలు గనఁ♦గా మదిరాత్మజ యీబహూకృతిన్
నీవలనన్ నరేంద్రసుత! ♦ నీవును నీప్రణయంబు కావుమా
వేవిధిఁ దిట్టి హంససుత ♦ వేసరిలంగ నొనర్చి కాయమున్
నీవు గనుంగొనంగ విడు ♦ నిక్కువ మెన్నఁ దిరస్కరించినన్. 225

తే. ఆమహాశ్వేత తానుగ ♦ నంపె దీనిఁ
జరలికను నీదువజ్ఞకుఁ ♦ దారహార

మొసఁగి దీనిని సందేశ ♦ మొసక మొసఁగ
మనమునం దైన నిరసింపఁ ♦ గనఁగఁ దగదు 226

క. తొలి ప్రణయప్రసరం బిది, తలఁపఁగ మత్సఖికి దీనిఁ ♦ దలఁపకు చెలువా
దలఁపున నంచును నా చెలి, నిలిపెను నాహార మతని ♦ నెఱివటు మునన్.

వ. అంత. 227

ఉ. ఆనరనాథసూనుఁడును ♦ నచ్చెరు వందుచుఁ బల్కె నీగతిన్
జాణవు చెప్పఁగా వలెన ♦ సందు నొసంగక మాఱువల్కఁగన్
గానఁబడంగఁ జేసితివి ♦ కౌశల మంతయు వాక్చమత్కృతిన్
బూనఁగఁ జేయ ముగ్ధ! మముఁ ♦ బోల స్వతంత్రులఁ జేసి పల్కెదో. 228

చ. చెలి! మదలేఖ! యెవ్వరము ♦ చేకొనఁ జేకొనకుండ దీని మే
మల మదిరాతనూభవయె ♦ యన్నిటి కీశ్వరి పోయె నాకథల్
సలిపెను మీదు సజ్జనత ♦ సాధనముంగ నను న్సపర్యకున్
బలుకఁగ నేల మీమనసు ♦ వచ్చినయట్టులు సల్పుఁ డంతయున్. 229

క. అతిదక్షిణకాదంబరి, గతదాక్షిణ్యంబు లామె ♦ కన్నగుణంబుల్
కుతలమున నేరిదాసుల, సతతము గావింప లేవు ♦ సన్మతి! చెవుమా. 230

తే. అనుచు మదిరాసుతాలాప ♦ మునను సారె
కాదు చటఁ బెద్దయుం బ్రొద్దు ♦ నధివసించి
యనిపె మదలేఖ నంత నా ♦ యినతనూజుఁ
డనతిదూరంబు మదలేఖ ♦ యరుగుటయును. 231

తే. దేవి చిత్రరథాత్మజ ♦ దివ్యగంధ, హారసుదుకూలధవళుఁ డై ♦ యలరు కేళి
శైలగతుని జంద్రాపీడ ♦ జనవరేణ్య, సుతుని నుదయాద్రితటగత ♦ సోమనిభుని.

తే. కాంచువేడుక నెక్కెను ♦ గనకసౌధ, శిఖరమును ఛత్రచామర ♦ చిహ్నములను
దీసివైచి పరిజనంబుఁ ♦ ద్రోసివైచి, కొని తమాలిక నొక్క తెఁ ♦ గూర్మియొసఁగ.

తే. అచటఁ గూర్చుండి మగుడను ♦ నల్లె వివిధ
విభ్రమతరంగితంబు లై ♦ వెలయువికృతి
విలసితాలోకనంబుల ♦ వేడ్కఁ గనుచు
నాతనిమనంబు లోఁగొనె ♦ నతివ తాను. 234

—ద్వితీయావస్థ యగు కాదంబరిచేష్టావర్ణనము.—

సీ. కటిసీమ డాకేలు ♦ ఘటియించి వలకేలు ప్రావృతాంబర మంటి ♦ పరఁగ త్రేల
నిలిచి త్రాసినమాడ్కి ♦ నిశ్చలతారయై యూవులింతల నాఁప ♦ హస్తతలము

తప్పి తన్నామంబు ♦ తరలుఁగీలిని నాఁగ మాటికి వదనంబు ♦ మాటుకొనుచు
నూర్పువాసనకయి ♦ యుఱికెత్తి చనుదెంచి రొదసేయుతుమ్మెద ♦ కొదమగములఁ

తే. పైఁటచెఱఁగునఁ బిలువ నా ♦ పార్థివేంద్ర
సుతునిఁ బంపెడి నా సారెఁ ♦ జోవు చెలిమి
చికురసుమముల దోయిటఁ ♦ జీరి చేర్చి
మ్రొక్కువిధమున మూర్కొంచు ♦ ముదము మెఱయ. 235

వ. మఱియును. 236

ఉ. పైఁట తొలంగఁ దెమ్మెరకు ♦ బాహుయుగంబున సంభ్రమంబునన్
మాటుచుఁ జన్నుదోయిఁ బలు ♦ మారు నొనర్చును నాఁగ నైఁగఁ దా
గాటపుఁగౌఁగిలింతలకుఁ; ♦ గామశరవ్యథఁ దెల్పు చొప్పునన్
మాటికిఁ గేల్విదిర్చుచును ♦ మానుగఁ జల్లినపూలఁ దొట్రిలన్. 237

వ. వెండియు. 238

క. హృదయోత్కంఠతఁ దెల్పెడు, చదురునఁ దర్జనుల రెంట ♦ సారెకు లీలన్
బొదలుచుఁ ద్రిప్పుచు మౌక్తిక, సదమలహారంబుఁ జారు ♦ సరణి దలిర్పన్. 239

క. మొలనూలు జాఱిపడ పద, ములగతి నాఁపంగఁ దమ్మి ♦ పూవిల్తుఁడు దా
నెలమిని గట్టి యొసంగిన, చెలువున నిలఁబడుచు సారెఁ ♦ జేష్టలు దక్కన్. 240

ఉ. సారెకు నున్నొడల్ గదలి ♦ జాఱుదుకూలముఁ జక్క నొత్తుచున్
ధారుణిఁ జీరియాడువస ♦ నంబు చెఱంగును గొంచు మాటుచున్
జారుపయోధరంబులను; ♦ సన్నగిలం ద్రివళుల్ భయంబు లోఁ
గూరఁగఁ గాంచుచున్ మరలి ♦ కోరిక లూరఁగ మాటిమాటికిన్. 241

చ. చికురము లంసభాగమునఁ ♦ జిందులు ద్రొక్కుచు నుండ వీడి సా
రెకుఁ గరసారసం బద్రువ ♦ రేఁగుటఁ బాయఁగఁ జేసి ముద్దుచున్
వికటకటాక్షపంక్తులను ♦ వే ధవళశ్రవణాసితాబ్జమై
ప్రకటవిలక్షహాససుధ ♦ పాంసులు గ్రమ్మఁగ ధూసరంబు నై. 242

చ. వెలుఁగుముఖంబు నైకరస ♦ విస్ఫురితంబును ద్రిప్పి మాటికిన్
జెలఁగుచుఁ జూచుచుండె; నటఁ ♦ జేవురిలెన్ దివసంబు; చల్లనై
జలజమనోహరుండు రవి ♦ సర్వజగత్పరిపాలకుండు లో
పలిజలజానురాగమున ♦ భాసిలె రంజితుఁ డైనచాడ్పునన్. 243

తే. ప్రొద్దు గ్రుంకెను జీఁకటుల్ ♦ పొలయ సాగె
నింక రాఁ డయ్యెఁ బ్రియతముఁ ♦ డేల యనుచుఁ

గినుక గదిరినకామినీజనులదృష్టి
రాగ మంటెనో యనఁ బదల్ రక్త మయ్యె. 244

ఆ. రవివియోగమునను రాజీవచయములు
మీలితంబు లయ్యె మిగులఁ; గమల
వనము లెల్లఁ బచ్చఁదనము వహించెను;
గుముదవనము లెల్లఁ గూరెఁ దెలివి. 245

సీ. ఎఱ్ఱఁబాఱెను దిక్కు లెల్లను శర్వరీముఖ మెల్ల నల్లనై మొలయు సాగెఁ
గాదంబరీచిత్తగాఢానురాగాబ్ధి పొంగి పొర్లెనో యన భూతకోటి
సంప్లావితం బయ్యె సాంధ్యరాగంబునఁ దత్కాలసంజాతదర్పమునను;
దిగిభకరాకీర్ణదివ్యశీకరబిందుతతి నాఁగ దివి ఋక్షతతులు చెలఁగె
తే. దర్పకాశుగవహ్నివిదహ్యమాన, చక్రవాకమనశ్శతజాతధూమ
మనఁగఁ దిమిరంబు మానినీజనులకనుల, వారిపూరం బపారమై పాఱసాగె.

తే. మరలఁ గల్గు దినశ్రీసమాగమం బ
టనుచుఁ బేరాశ నో యన నధికరక్త
దీధితులతోడ మెల్లనఁ దిగ్మకరుఁడు
పశ్చిమాంబుధిఁ గ్రుంకెను పార్థివేంద్ర!. 247

తే. అంతఁ గాదంబరీదేవి యవతరించె
సౌధశిఖరంబునందుండి శ్వేతకేంద్ర
తనయుఁడును దిగ్గెఁ గ్రీడాద్రితటమునుండి
కానఁబడమిని నొండొరుల్ గనుట మాని. 248

సీ. ప్రణయకుపితలు నా వాడినమోములఁ దనరుదిఙ్ముఖములు దాల్పఁ దెల్వి
కైరవిణీతతుల్ గాల్వైపైఁ బడి తమ్ము మన్నింపుమని బతిమాలు చుండ
మేల్కొను ననుశంకమెలపున వర్జించి నిద్రఁ గూరుసరోజనీచయంబు
లాంఛనచ్ఛలమున లాలించి తమి రేయి, నీలాంబరముఁ దాల్చి నెగడుదివిని
తే. జేరి యభిసారికనువలె శ్రీచెలంగ
బహుళవల్లభుఁ డాట సౌభాగ్య మెల్లఁ
జల్లు చుదయించె నట్లనై చంద్రుఁ డతివ
శాదనాలక్షకాంకితతనుఁడు వోలె. 249

చ. జగముల నెల్ల నేలుసుమసాయకునాతపవారణంబు రే
మగువవిలాసవజ్రమణిమండితకర్ణకలాప మిందుఁ డా

తోఁగ చలికాఁడు వ్యోమమునఁ ♦ దోఁచెను నెత్తున దవ్వనందుఁ దా;
నగపడె నెల్లనై భువన ♦ మంతయు దంతమయంబ నన్ గడున్. 250

వ. అంత. 251

సీ. తతతరంగావళీ♦ధౌతసుధార్జునసోపానపాళికా♦సన్నుతంబు
విరహానలజ్వాల♦విప్లుష్టవాచాలచక్రాంగయుగ్మక♦సంగతంబు
తనుసముత్తుంగోర్మి♦తాలవృంతానిలవీజితంబు మనోజ్ఞ♦వీరుధంబు
సాంద్రచంద్రాతప♦సతతమై కైరవసుమమయమో యన ♦ శోభితంబు
ఆ. సుప్తహంసమిథున♦శోభితంబును నయి, నెగడుభవనకుముది♦నీప్రతీర
భూమిఁ బొల్చునొక్క♦భూరిమౌక్తికశిలా, పట్ట మధివసించెఁ ♦ బార్థసుతుఁడు.

ఉ. నాలుగుమూలలన్ గుముద♦నవ్యదళంబులఁ బత్త్రికాలతల్
గ్రాల లిఖించి తెల్ల నయి ♦ రాజిలువావిలిపూలదండలన్
వ్రేల నలంకృతం బయి వి♦నిర్మలవీతపటీరవారిసం
క్షాళిత మై తనర్చునల♦చారుశిలాఫలకంబు భూవరా!. 253

క. మదిరాతనూజవరవుడు, సుదతులు గనుపింప నందు ♦ క్షోణీశసుతుం
డొదఁ బొదలు చుండ నంతటఁ, బదరుచుఁ గేయూరకుండు ♦ వచ్చె నచటికిన్.

కాదంబరి చంద్రాపీడుని జూడవచ్చుట.

తే. వచ్చి కాదంబరీదేవి ♦ వచ్చె మిమ్ముఁ
గాంచ నని చెప్పె; నంత భూ♦కాంతసుతుఁడు
సంభ్రమసముత్థితుం డయి ♦ చని యెదురుగఁ
గాంచెఁ గాదంబరీదేవిఁ ♦ గాంతు లూర. 255

సీ. పరిజనంబుల నెల్లఁ ♦ బాసి కొందఱు సఖుల్ బలసికొలువఁ దన్నుఁ,♦బరిహరించి
రాజచిహ్నములెల్ల,♦రాజిత్తైకావళీమాత్రభూషణ యయి ♦ మందగతిని
నమలామలపటీర ♦ మలఁది ధవళతనూలతిక యై శశికళా♦లలితమృదుల
కైరవదళములఁ ♦ గర్ణపూరముఁ జేసి కల్పద్రుమదుకూల♦కమును గట్టి
తే. యేకకర్ణావసక్తమై ♦ యొసఁగుదంత
పత్త్రమును దాల్చి మదలేఖ ♦ పట్టఁ గేలు
తత్సమయరమ్యవేషంబుఁ ♦ దాల్చి యెవరో
యన విధూదయదేవత ♦ యనఁగ వచ్చె. 256

ఉ. వచ్చియుఁ బ్రీతిపేశలత ♦ భాసిలఁ బారిజనోచితావనిన్
మచ్చికఁ బ్రాకృతక్రియ స♦మంచితమై తగఁ గూరుచుండెఁ బెం

పచ్చుపడంగఁ జిత్రరథు♦నాత్మజ; రాసుతుఁడున్ గుమార! యా
యచ్ఛపుఁ బ్రస్తరస్థలము♦నందు వసింపు మటంచు నెంతయున్. 257

చ. అల మదలేఖ కస్తితను ♦ నాదట మాటికిఁ జేసినన్ ధరా
తలమున నే వసించె; నట ♦ ధారుణినాథసుతుండు సర్వులున్
జెలఁగుచుఁ గూరుచుండఁగ వ♦చింపఁ దొడంగె నిసుంత సేపు కాఁ
బలుకక యూరకుండి యటు ♦ పద్మదళాయతనేత్రతోడ మతన్. 258

చంద్రాపీడుఁడు కాదంబరితో సంభాషించుట.

ఉ. దేవి! కటాక్షపాతమునఁ ♦ దియ్యము నందెడుదాసులందు సం
భావిత మౌనె పల్గడల ♦ భాషణ మాదిగ సుప్రసాదమున్?
భావనమై చెలంగునిటు♦వంటి యనుగ్రహ మేల చెప్పఁగా?
భావన చేసిన న్మిగులఁ ♦ బాటిల దిట్టియనుగ్రహోక్త మా. 259

చ. గుణాలవ మెందు నాయెడలఁ; గోమలి! నీసుజనత్వ మద్దిరా
ఘనసరళత్వ మౌర యెటు ♦ గల్గెను నీ కివి; గార మంతయున్
జనఁగ వినూత్నసేవకజ♦నంబును నీగతి నాదరించె దే;
యనుకొన నూడిగంబులను ♦ హార్యనిదక్షిణుఁ గాఁగ దేవి! నన్. 260

చ. కలుగును దేవి! యేనిపయి ♦ గాటవునీదు నియంత్రణంబు వాఁ
డిలను గృతార్థుఁ డౌను గద; ♦ యేటికి నింత సమాదరంబు నా
దలను ద్వదీయశాసనము ♦ దాల్చి యొనర్పఁగఁ జాలుభృత్యుపైఁ
గలిగెడి సిగ్గు నాకు నిను ♦ గాంచినయప్పటినుండి యగ్గమై. 261

చ. తలఁపఁ బరోపకారపర♦తంత్రము దేహము; జీవితంబునున్
జులకన గడ్డిపోఁచకును; ♦ జూడఁగ న న్నరుదెంచి నట్టినీ
కులుపఁగ దేని నిత్తు! నిఁక ♦ నుగ్మలి! యీకృగనుగ్రహోర్హ మౌ
యులుప ధరిత్రి లేదు గద ♦ యూరకకంటి ప్రయాస మీయెడన్. 262

మ. కల దీజీవిత మేమునుం గలమ యీ♦గాత్రమ్మునుం గల్గెడిన్
గల వీయింద్రియముల్ ధరాధిపసుతా!♦గైకొమ్ము శ్రేష్ఠంబుగాఁ
దలఁతో దేనిని వీనిలోపల మదిన్ ♦ దానిన్; విచారింపఁగా
వల దంచున్ వచియింపుచుండఁగను ద♦ద్వాక్యంబు వారించుచున్. 263

తే. పలికె నిట్లని మదలేఖ ♦ మొలకనవ్వు
పొలయ నతియంత్రణం బిట్లు ♦ భూపతనయ!

యుండనిమ్ము; విషాదంబు ♦ నొందు సకియ
చిత్రరథసుత యే లిట్లు ♦ చెప్పు దీవు. 264

చ. ఇది సకలంబు చెప్పకయె ♦ యీమె గ్రహించెను; మళ్లి సందియం
బొదవఁగఁ జేసె దేల యిటు ♦ లుత్తరపర్యనిరర్థకోక్తులన్
వదలుము యెందుయోజనముఁ ♦ బార్థివపుత్ర! యటంచుఁ జెప్పె; నా
మదిరతనూజ కొంతవడి ♦ మానముఁ దాల్చి ప్రసంగ మేర్పడన్. 265

సీ. రాజశేఖరుఁడు తా♦రాపీడనరవరుం డెట్టివాఁ డాతని♦యింతి యెట్టి
దల విలాసవతియు; ♦ నాతనిసచివుండు శుకనాసుఁ డెట్టిఁడు♦చూడ నెట్టి
దుజ్జయినీపురి? ♦ యుండు నెంతటిదవ్వ భారతవర్షంబు ♦ వరఁగ నెట్టి
దల మర్త్యలోకంబు ♦ నగు నె మంజులములఁగనఁగమనీయముల్♦గలవెయందు

తే. ననుచు సకలంబు నడుగుచు ♦ నడర నిట్టి
కథలచేఁ జాలసే పుండి ♦ కదలి యతని
యొద్దఁ గేయూరకుఁ బనుప ♦ నొసఁగి యాజ్ఞ
శయనసౌధాగ్ర మెక్కె నా♦చాన యంత. 266

ఆ. అచటసితదుకూల ♦ మమరవితాన మై, యలరుశయనతలము ♦ నధివసించె
నాశిలాతలమ్ము♦నందె చంద్రాపీడ, పార్థివేంద్రసుతుఁడు ♦ పండుకొనియె. 267

మ. అల కేయూరకుఁ డంఘ్రిలన్ దొడలపై ♦ నంకించి యొయ్యొయ్య నా
త్తలలిన్ జిత్రరథాత్మజాసరసతా♦దాక్షిణ్యగంభీరతా
గళితాహంకృతితాభిరూపతల నా♦గంధర్వలోకోత్తరం
బు హంసాత్మజవత్సలత్వమును భృ♦త్యాళీమహత్త్వ మ్మనన్. 268

క. మదలేఖాసౌజన్యము, సదమలకింపురుషవర్ష♦చారుత్వంబున్
మదిఁ దలపోయుచుఁ గడపెను, విదిశాధిప! క్షణమునట్లు♦వే క్షణదను దాన్.

తే. అంతఁ జంద్రుండు చిత్రర♦థాత్మజాత
మరలి వచ్చును గనుఁగొంద ♦ మంచు రేయి
మేలుకొనియుండి శ్రాంతుఁడై ♦ మేదినీశ!
పండుకొనఁ బోయె నా ప్రాలెఁ ♦ బక్షిమాళ. 270

చ. కలుగును వే వియోగ మని ♦ కందులతాంగులవేఁడియూర్పులన్
మలినము లయ్యె నా నపుడు ♦ మ్లానము లయ్యెను జంద్రికల్ నృపా!
సలిపి నిశన్ విలాసవతి♦సత్సుతదర్శనగాఢకామ నా
సలలితకైరవంబులను; ♦ సారసపంక్తులఁ బండె లక్ష్మి తాన్. 271

చ. వెలవెలఁ బాఱె దీపములు ♦ వేగ విభావరి కామినీజనం
బులశ్రవణోత్పలప్రహార♦ముల్ దగ జ్ఞప్తికి రాఁగఁ గుందె నాన్;
మలసెఁ బ్రభాతవాయువులు ♦ మారుఁడు బాణము లేసి యేసి తా
నలసి నిగుడ్చునూర్పులను ♦ నంది లతాసుమసౌరభంబులన్;. 272

చ. అరుణునిదాడి కోడి విబు♦ధాద్రిలతాగృహసీమ డాఁగ నా
నరుగుచు నుండెఁ దారక; ల♦హస్కరుఁ డుద్గతుఁ డయ్యె నంతలో
నరుణిమఁ జక్రవాకహృద♦యస్థితిమిశ్రితరాగమో యనన్
బరఁగ ధరించి; రాసుతుఁడు ♦ ప్రస్తరపట్టమునుండి లేచి తాన్. 273

క. కడిగికొని మోముఁదమ్మిని, వడి సంధ్యావందనంబు ♦ పచరించి కరం
బడరుచుఁ దమ్మలముం గొని, యడిగెను గేయూరకునిని ♦ నతఁ డీపగిదిన్. 274

తే. ఓయి కేయూరకా! దేవి ♦ యుండు నెచట
మేలుకొనియెనో లేదో యీ ♦ వేళ నరయు
మనుచు నడుగుటయును హాసా ♦ దంచు వాఁడు
నరిగి చనుదెంచి మగుడ హా♦స్తాబ్జములను 275

తే. మొగిచి మందరప్రాసాద♦మునకుఁ గ్రింద
యజిరసౌధవితర్దిక ♦ నధివసించి
యల మహాశ్వేతతో ముచ్చ ♦ టాడుచున్న
దనుచుఁ జెప్పంగ నచ్చటికి ♦ నరుగుదెంచె. 276

### చంద్రాపీడుఁడు కాదంబరినిఁ జూడఁబోవుట.

వ అందు. 277

సీ. పరిపక్వవరతాళ♦ఫలవల్కలోహితపల్లవాంశుకములఁ ♦ బరఁగఁ దొడిగి
రక్తపటవ్రత♦రాజితలై మించి సితపటమ్ములఁ జన్ను♦లతుకఁ గట్టి
వర్ణిచిహ్నము లైన♦వల్కలాజినజటాదండమౌంజీబంధ♦ధారు లగుచు
మహనీయప్రత్యక్ష♦మంత్రదేవత లన శ్వేతాంబరోజ్జ్వల♦చిహ్నములను

తే. నలరుచుండు తాపసులును; ♦ నలికభాగ
ములను వెలిబూది నొప్పు రే♦ఖలను దాల్చి
యక్షమాలికఁ ద్రిప్పుచు ♦ హస్తములను
ధాతురాగారుణాంశుక♦ధరణు లగుచు. 278

ఆ. పశుపతివ్రతంబు ♦ పట్టినభిక్షుకీ, గణము లొలిసి కొలిచి ♦ స్కంధగిరిశ
శక్రజినవిరంచి♦శాంకర స్తవములఁ, బాడుచుండ నొక్క♦భద్రపీఠి. 279

ఆ. కనఁగ వచ్చినట్టి ♦ గంధర్వనరపతి, బంధువృద్ధజనుల ♦ భాషణముల
నదురుచనుట లేచి ♦ యెలమి నాసన్నాసనములఁ బెట్టుటలను ♦ నతులతతుల.

తే. గారవించుచుఁ గూర్చున్న ♦ కగుణమతిని
నల మహాశ్వేత; నామెకు ♦ నవలఁ గొంత
దూరమునఁ గొల్చి నారద ♦ దుహిత మధుర
వంశములచేతఁ గిన్నరుల్ ♦ భాసురముగ. 281

తే. తానములఁ బాడఁగను భార ♦ తంబు చదువ
వినుచు నవధానమున ముందు ♦ నునిచినట్టి
మణిముకురమందుఁ దాంబూల ♦ మధురరాగ
కృష్ణికాంధకారితమధ్య ♦ కీలితంబు. 282

తే. రదనచంద్రాతపద్యుతి ♦ రాజితంబు, గతమధూచ్ఛిష్టపట్టంబు ♦ గతిని శ్వేత
రక్తమగునోష్ఠబింబంబు ♦ రమణఁగనుచు, సగముచెదిరినతిలకంబు ♦ సరిపఱచుచు.

తే. కర్ణపూరశిరీషంబుఁ ♦ గాంచి దానిఁ, బాఁచితీఁగెలగుం పని ♦ పైకి దృష్టిఁ
బఱపి చుట్టును దిరిగెడు ♦ భవనహంస, గమనహేలను వలగొన ♦ గ్లావిధంబు.

తే. తనరఁ గొలువున్నగంధర్వ ♦ మనుజనాథ
తనయఁ గాదంబరినిఁ గని ♦ దగ్గఱిల్లి
కృతనమస్కారుఁ డై యుండె ♦ వితతమైన
యాసనంబునఁ గూర్చుండి ♦ హర్షమునను. 285

తే అల మహాశ్వేత ముఖమును ♦ నట్టె గాంచి
కదలఁగఁ గపోలమధ్యంబు ♦ గడలుకొనఁగ
మందహాసంబు నొనరించె ♦ మనుజనాథ
తనయుఁ డంత మహాశ్వేత ♦ దాని నెఱిఁగి. 286

తే. చిత్రరథసుతతో నిట్లు ♦ చెప్పె నితఁడు
నీదుగుణములఁ గరఁగెను ♦ నీరజారి
భానువులఁ జంద్రకాంతంబు ♦ పగిది; సకియ!
పలుకఁ జాలక యున్నాఁడు ♦ పడఁతి! కనుము. 287

తే. ఇతని వృత్తాంతమేమియు ♦ నెఱుకపడక
రాజచక్రంబు కుందుచు ♦ రాజవదన!
వెనుక నున్నది యూరికెఁ ♦ జనఁగఁ దలఁచు
నాసఁగు మానతి ప్రేముడి ♦ యొసఁగ మెసఁగ. 288

తే. దూరమున నున్న మీ ప్రేమ ♦ తోయజాత
తోయజాతాప్తులకుఁ బోలెఁ ♦ దొగలఱేని
తొగలకును బోలె సతతంబు ♦ తొలఁగ కెపుడు
ప్రళయమందును వర్ధిల్లి ♦ ప్రబలుఁ గాత. 289

చ. అనుచు వచింపఁ జిత్రరథు♦నాత్మజ నెచ్చెలి! యింత యేల యీ
జనము సపారివారముగ ♦ క్ష్మాపతిసూను నఘన మీ యెడన్
దనదుమనంబుభంగిని గొ♦నందగు నర్హము గల్గ దమ్మరో!
యని పరివారముం బిలిచి ♦ యాజ్ఞ నొసంగెను; నీకుమారకున్. 290

చంద్రాపీడుఁడు మరల స్వదేశమునకుఁ బ్రయాణమగుట.

చ. కొనిచని యాత్మదేశమును ♦ గూర్పుఁ డటంచును; నంత లేచి రా
తనయుఁడు హంసపుత్రికకుఁ ♦ దద్దయు భక్తిని మ్రొక్కి దొల్త; నా
వెనుక నెఱింగి చిత్రరథు♦ప్రేముడికూఁతునకుం బ్రియంబునన్
గనుఁగొన నామె చిత్తమున ♦ గాఢపుఁగూర్మి వహించి యిట్లనెన్. 291

చ. పలుకుదు నేమి దేవి! బహు♦భాషుల నెవ్వరు నమ్మ రిద్ధరన్
దలఁపున నిల్ప వేఁడెదను ♦ త్వత్సఖివారముఁ గూడియాడుచోన్
జలజదళాయతాక్షి! యని ♦ చయ్యనఁ దర్లెను బాసి యచ్చటన్
జెలఁగుచుఁ గన్యకాజన మ♦శేషము తత్సుగుణావకృష్ట మై. 292

చ. పరవశ మైనయట్లతని♦పజ్జ హజారముదాఁక వచ్చి మం
థరగతి నేగఁ గా మరలి; ♦ తన్మదిరాసుతపల్లకీవహుం
దరముగఁ దెచ్చినట్టి యొక♦యశ్వము నెక్కి ప్రయాణ మయ్యె నా
నరపతిసూతి తత్పరిజ♦నంబులు వెంబడిఁ గొల్చి రాఁ దమిన్. 293

క. చనుదెంచునతని కవలం,బన మాగంధర్వరాజ♦భామిని వెలి లో
నన కా దఖిలాశాలం, బన మయి కనఁబడఁగ సాగెఁ ♦ బరఁగుచు నెచటన్.

చ. సయిఁపఁగరానితద్విరహ♦సంతపనంబున వెన్క లగ్న నా;
రయమునఁ ద్రోవకడ్డ మగు♦రాణను ముందు; వియోగవేదనన్
బయిపయి మీరుసుత్కలిక ♦ పై కెగవైచినభంగిఁ బైనఁ; ద
న్మయదృఢచిత్తుఁ డౌట నల ♦ మానిని గన్పడె వాని కెల్లచోన్. 295

వ. అట్లోలిన్ మహాశ్వేతాశ్రమంబుఁ జొచ్చి యింద్రాయుధఖురపుటంబులజాడం
జనుదెంచి యచ్ఛోదసరస్తీరంబునఁ గూర్చుండి యున్నతనస్కంధావారంబుం

గాంచి ప్రహృష్టమానసుం డయి తద్గంధర్వకుమారవర్గంబు నెల్ల సెలవొసంగి
యనిపి స్కంధావారజనంబులు సానందులును సకుతూహలులును సవిస్మ
యులు నై మ్రొక్కుచుండ స్వభవనంబుం జొచ్చి సమ్మానితాశేషలోకుం డై
యాచంద్రాపీడుండు. 296

ఆ. పరమమిత్రుఁ డగుచుఁ ♦ బరఁగు వైశంపాయ
నుండు పత్రలేఖ ♦ యెందుకొనెడు
తమిని నడుగ హంస♦తనయ యీదృశి యంచు
మదిరతనయ యిట్టి♦మగువ యనుచు. 297

తే. అల్ల కేయూరకుం డిట్టిఁ ♦ డంచు మఱియు
నల్ల మదలేఖ యిట్టిది ♦ యల తమాలి
కయును నీదృశి యం చిట్టి♦కథలఁ జెవుచుఁ
గడపె నాదిన మెల్ల నా♦త్మావనుతుఁడు. 298

చంద్రాపీడునియొద్దకుఁ గేయూరకుండు వచ్చుట.

ఉ. ఆమరునాఁడు సూర్యుఁ డుద♦యాద్రిపయిం బొడసూప లేచి తా
నామదిరాసుతం దలఁచు ♦ చాంతరసీమను గొల్వుకూటమం
దామను జేశనందనుఁడు ♦ హర్షమునన్ వసియించి యుండఁగా
నా మె విపంచి కావహకుఁ ♦ డచ్చటికిన్ జనుదెంచె ద్వాస్థుతోన్. 299

క. చనుదెంచి నమితశిరుఁ డై, వినయంబున మ్రొక్కు నతని ♦ వే రారార
మ్మని తోల్తఁ గటాక్షవిలో,కనముల నట నెదను నంతఁ ♦ గడుఁ బుల్కలతోన్.

క. తరువాత బాహువులతోఁ, బరువిడి యాలింగనంబుఁ ♦ బచరించి గడున్
ద్వరపెట్టఁగ వేడ్క సమా, దరమునఁ గూర్చుండఁ జేసి ♦ తనపార్శ్వమునన్.

తే. చెలిమి యెల్లను ద్రవమయి ♦ యొలుకు ననఁగ
హసితపీయూషధవళీకృ♦తాక్షరముల
మధురవాక్కుల ని ట్లని ♦ మనుజనాథ
సుతుఁడు కేయూరకుని మదిఁ ♦ జొక్క చడిగె. 302

చంద్రాపీడుఁడు కేయూరకునితో సంభాషించుట.

క. మదిరాసుత కాదంబరి, పొదలునె సౌఖ్యమునఁ; జెలులు ♦ పొదలుదు రెశమిన్
బొదలుదురె పరిజనంబులు,ముదమున; హంసాత్మజాత ♦ ముదితయె యెలమిన్.

క. అన వాఁడు ప్రీతి పెంపున, జనితం బగు రాజసూను ♦ సత్కృతమున మ

జ్జనమును ననులేపంబును, గనినట్లు పత్త్రసుంబు ♦ గత మగుడుఁ దమిన్. 304

క. నతుఁ డయి వినయం బొప్పఁగఁ, గుతుకంబున ననియె నిట్లు ♦ క్షోణీశసుతా!
తతకుశల యిపుడు మదిరా, సుత నీవి ట్లడుగుచుంటఁ ♦ బొక్కఁపుఁ జేర్మిన్. 305

చ. అని బిసమాత్రబద్ధముఖ ♦ మార్ద్రపటాంతరితంబు నార్ద్రచం
దనఘనపంకసంఘటిత ♦ నవ్యమృణాళకకంకణాంకితం
బును నగుకంజినీదళస ♦ ముద్గకమున్ వడిఁ దీసి యందుఁ జూ
పెను మదిరాతనూజ కడుఁ ♦ బ్రీతిని నంపినప్రేమగుర్తులన్. 306

చ. మరకతపీతసద్రుచిర ♦ మంజరులై వ్యతనీతచర్మతన్
సురుచిపయస్సులై వెలుఁగు ♦ శోభితపూగఫలంబులన్; మనో
హరశుకిగండపాండురము ♦ లై తగు లేఁదెలియాకులన్; మహే
శ్వరశశిఖండఖండఘన ♦ సారముఁ గస్తురితోడి గంధమున్. 307

ఆ. కానుపించి యతఁడు ♦ కడుభక్తి నిట్లని
చెప్పఁ దొణఁగె ముదము ♦ చిప్పిలంగ
రాజపుత్ర! చిత్ర ♦ రథసుత కేల్దోయిఁ
గీలుకొలిపి మాళి ♦ లీలఁ దనర. 308

తే. మృదులకరశాఖ కారంధ్ర ♦ విదలరక్త
కిరణజాలము లెల్లెడఁ ♦ బరఁగ నిన్ను
గొలుచు చున్నది సతతంబు ♦ కూర్మి యెసఁగ
నలమహాశ్వేతయును నిన్ను ♦ నడిగె శుభము. 309

తే. హాళిమాణిక్యకౌముదీ ♦ పాళి జాఱి, యాననం బెల్ల నభిషేక ♦ మాచరింప
వినతిశతముల మదలేఖ ♦ వినుతిసేయు, మకరికాకోటికోణంబు ♦ మహిని సోఁక.

తే. కన్యకాలోక మెల్లను ♦ గాల్ల కెఱఁగి
పూజ లొనరించుఁ బదరజః ♦ పూత మగుచుఁ
జెప్పఁగా నేల యందలి ♦ సేవకాళి
గొలుచు సతతంబు భక్తి చి ♦ గుర్కొనంగ. 311

చ. మనుజవరేణ్య! హంససుత ♦ మానని ప్రీతిని నీకుఁ జెప్పిపం
పినవచనంబులన్ వినుతుఁ ♦ బెంపు దలిర్పఁగ నాలకింపుమా
యని పలుకం దొడంగె నతఁ ♦ డాయమ చెప్పినవాని నెల్ల ని
ట్లని జననాథపుత్త్రునకు ♦ హర్షసుధానిధి పొంగిపొర్లఁగన్. 312

—ఈఈ చంద్రాపీడునకుఁ గేయూరకుండు కాదంబరియవస్థను వర్ణించిచెప్పుట. ఈఈ—

ఉ. ఎవ్వరికన్నులం బడవొ ♦ యీవు కృతార్థులు వారు చూడఁగా
నివ్వసుధన్; నరేంద్రసుత! ♦ యే మనుదున్ హిమశీతలంబు లై
యువ్విధి నీసమక్షమున ♦ నబ్జమయూంబులు నాఁగఁ దోఁచె నీ
యువ్విమలోరుసద్గుణము ♦ లంబుజనాథమయూంబు లిత్తఱిన్. 313

మ. అమృతోత్పత్తిదినంబువోలె మదికిన్ ♦ హర్షప్రదంబై గడున్
విమలంబై విధిలబ్ధమై యొసఁగుచున్ ♦ వెల్గొందుతద్యాతఘు
స్రము వాంఛించెన రెట్టులైన మగుడన్ ♦ రా నెల్లరున్; దద్వియో
గమునన్ వృత్తమహోత్సవాలసమునాఁ ♦ గాన్పించు మాప్రోల్ నృపా!. 314

ఉ. త్యాగము చేసితిన్ సకల ♦ మంచు నెఱుంగుదు నన్నునైననున్
వేగ మకారణాప్తు నిను ♦ వేఁడకయున్నను నాదుమానసం
బాఁగినఁ గోరెడున్ గనఁగ; ♦ నామదిరాసుతయున్ నితాంతము
ద్వేగిని మారకల్పు స్మిత♦విస్ఫురితాననుని న్దలంచెడున్. 315

ఉ. కావున నొక్కమార్ధరల ♦ గారవ మారఁగ వచ్చి మమ్ములన్
నీవు గుణోన్నతుండ వని ♦ నెమ్మి దలంచెడునట్లుచేయఁగా
భూవరపుత్ర! వేఁడఁగను ♦ బోలదె మాకు నుదారమానమో
ద్దాపనచేయ దెవ్వరి క♦పారబహూకృతిఁ జెప్పనేటికిన్. 316

తే. చను నవశ్యంబు మాదృశ♦జనుఁ బనుచనవు, నలజడిని దీని నైఁపంగ ♦ నవనినాథ
తనయ! నీదగుసుజనత ♦ తగకయున్నఁ, జెప్పఁపంపఁ బ్రగల్భత♦చేయు మాకు.

తే. పంపితిని దీని మీ రిటఁ ♦ బాన్పునందు
మఱచి పోయినశేషాఖ్య♦మంజుహార
మనుచుఁ గేయూరకుం డెల్ల ♦ మనవి చేసి
బయిరవాసంబుకొంగున ♦ బద్ధ మయ్యె. 318

తే. సూక్ష్మసూత్రాంతరస్ఫురత♦సుషమసమితిఁ
దెల్లముగఁ దోఁచుదానిని ♦ దీసి యొసఁగెఁ
జానురగ్రాహిణీహస్త♦జలజమునకు
నంత నారాజపుత్రుండు ♦ హర్ష మొప్ప. 319

చ. పరిజను నన్ను నీగతిని ♦ భావన సేసి మహాప్రసాదమున్
బరఁగఁగఁ జేసెఁ జిత్రరథు♦పట్టి; యి దంతయు హంసపుత్త్రికా
చరణసమార్చనాఫలము ♦ సత్య మటంచును దాని నంతయున్
శిరమునఁ దాల్చి తానె గొనెఁ ♦ జిందమునదశ్రులు నిర్ఝరంబులై. 320

మ. అల కాదంబరిగండపాళికగతం♦బై నట్టి లావణ్యమో
జలతిం గన్నతదీయహాసరుచియో ♦ చర్చింప నిష్యందితో
జ్జ్వలతచ్చాగుగుణౌఘమో ద్రవమయ♦స్వాంతంబొ నాహ్లాది యై
లలితస్పర్శము సౌరభాంచితముసై ♦ లాలించుతద్గంధముల్. 321

తే. అలఁదికొని ప్రీతి నాహార ♦ మఱుతఁ దాల్చి
తమ్ములంబునుఁ గైకొని ♦ దడసి క్షణము
లేచి నిలఁబడి డాకేల ♦ లీల నూఁది
యల్ల కేయూరకునియంస♦మందు నగుచు. 322

తే. అర్హ్యభంగిని సమ్మాన ♦ మాచరించి
ముదితచిత్తులఁ గావించి ♦ మొనసి యనిపి
ముఖ్యనృపలోకముల నెల్ల; ♦ భూపసుతుఁడు
గంధమాదనహస్తిని ♦ గనఁగఁ జనియె. 323

చ. క్షణ మటనుండి దాని కిడి ♦ చారునఖద్యుతిజాలసాంద్రముల్
ఘనసమ్మృణాల మో యనఁగఁ ♦ గ్రాలెడుగడ్డికడిల్ స్వయంబుగాఁ;
జనియెను వల్లభాశ్వముల ♦ సాహిణముం గన; నంత నేగుచుల్
గనెఁ బరివాసముల్ పదన♦కంజము నడ్డము ద్రిప్పి ప్రక్కలల్. 324

ఉ. ఆతనిమానసం బెఱిఁగి♦నట్టివినీతులు ద్వారపాలకుల్
ఆతతపానివారమును ♦ నంతయు నాఁగుచు వెళ్ల నంపఁగా
భూతలనాథుపుత్త్రుఁ డటఁ ♦ బోయెఁ గెయూరకుతోడ నొక్కఁడే
జాతభయంబుచే నొదిగి ♦ సంభ్రమియింపుచు మందురాధిపుల్. 325

తే. ప్రణతు లొనరించి చనుచుండ ♦ వినయమునను
జక్క నొనరించి యొకప్రక్క ♦ జాఱి సుంత
యలగునింద్రాయుధాశ్వపు♦స్థానగుంత
నాంతికమ్మును నాసగ♦నాథసుతుఁడు. 326

వ. మఱియు 327

తే. కనులకడ్డము పడుదాని♦కపిలకేస
రముల నెగఁ ద్రోసి; ఖురభూమి ♦ రమ్యముగను
జరణముల నుంచి మెల్లన ♦ సాహిణంబు
దారువున, దేహభారంబు దద్ద ♦ నిలిపి. 328

తే. మదిని హర్షంబు క్రేళ్లుబ్బ ♦ మమత దోఁప
ననియె నిట్లని కేయూర♦కా! వచింపు

మేను వచ్చినవదపడి • యేమి జరిగె
నచట గంధర్వనృపతిగృ•హంబునందుఁ
బుచ్చె నుబుసును గంధర్వ•పుత్త్రి యెట్లు. 329

తే. ఏమి చెప్పెను మదలేఖ• యేమి చేసె, నల మహాశ్వేత పరివార•మూడు కొనియె
నేమి సల్లాపములు; చేసి • తేమి నీవు, గలవె? యస్మత్కథాప్రసం•గంబులచట.

తే. అనినఁ గేయూరకుం డిట్టు•లనియె దేవ!, వినుమ చెప్పెద సర్వంబు•వీను లలరఁ
దరలి రా నీవు కన్యకాంతఃపురంబు, సర్వమును లేచె నీవెగు•సరణిఁ గనఁగ.

తే. హృదయములు వేయి నీవెంటఁ • గదలె నపుడు
మ్రోఁగుపటహధ్వను లనంగఁ • బుఱ్ఱుఁబోండ్ల
కాలియందెలరవములు • ఘల్లు మనుచు
నొక్క పెట్టున మ్రోఁగెను • నుడుగ కట్టె. 332

చ. తురగరజఃప్రసారమున • ధూసరితం బగునీదుత్రోవఁ దా
నరయుఁగ నెక్కెఁ జిత్త్రరథు•నాత్మజ సౌధతలంబుఁ గొల్వఁగాఁ
బరిజన మెల్లఁ దన్నుఁ; నర•పాలకుమార! మఱుంగుదాఁక నిన్
గరమనురక్తిఁ గాంచె సఖి•స్కంధమునన్ ముఖ ముంచి యెంతయున్. 333

ఉ. ముంచుచు నా దిగంతమును • భూరిపయోధి వళీతదృష్టులన్
మించుసితాతపత్త్రమిప • నీరజవైరి దినేంద్రదృష్టులన్
వంచుచు నుండ నచ్చటనె • వారిజలోచన చాలసేపు నిన్
గాంచుచు నుండె నీ వటఁ గ•నంబడకుండిన విన్ననౌ మదిన్. 334

క. దిగి యాసౌధాగ్రంబును, వగఁ గూరుచు నెట్లొ యొక్క • వగను క్షణం బా
మగువ వసియించి యాస్థా•నగతం బగుమండపమున • నట లేచి నడిన్. 335

చ. స్ఖలనభయంబుచే ననఁగ • షట్పదముల్ గలనిస్వనంబులన్
దెలుప సుమోపహారముల; • దివ్యనఖాంశుల వారిధారలన్
తలఁపునఁ గ్రేంకృతుల్ సలుపు•నాగభుగావళిభీతిఁ ద్రస్తమై
గళదురుకంకణంబులను • గంతనిరోధము చేయునో యనన్. 336

వ. మఱియు. 337

చ. ప్రసవసితంబులై నగృహా•వల్లులఁ బల్లవకోరకంబులన్
బొసఁగఁ గరంబునన్ మదిని • భూవరపుత్త్రక! నీగుణంబులన్
వెసఁ గడునూఁతఁ గాఁ గొనుచు • నీవు వసించిన కేళికాద్రి, కా
బిసరుహనేత్త్ర వచ్చెఁ దమి•పెల్లున నెందును బ్రొద్దు పోవమిన్. 338

వ. వచ్చి. 339

సీ. గంధోదసౌరభా•గతలీనబంభరజటిల మీశిల యిందు ♦ స్నానమాడె
సుమధూళిసికతిల♦విమల మీగిరినదీతట మిందు నిటలాక్షుఁ • దమిని గొలిచె
ధిక్కృతశశధర•దీధితి యీస్ఫటికోపలస్థల మిందు • నోరె మందె
సంక్రాంతచందన•సలిల మీమార్త్తికప్రస్తరస్థల మిందుఁ ♦ బవ్వళించె

తే. మరకతగ్రావమకరికా•మంజులోత్స
సిచ్యమానలతాగృహా•సీమఁ బొల్చు
శీకరశిలాతలంబు వ•సించె నిందు
క్షితివసుతుఁ డని నీస్థాన•చిహ్నములను
దెలుప సారెకుఁ గాంచు చా•దినముఁ గడపె. 340

ఉ. అంత దినాంత మయ్యె మను♦జాధిపపుత్రక! హంసపుత్రికా
త్యంతమహాప్రయత్నమున ♦ నభ్యవహార మొనర్చి నిష్ట మొ
క్కింతయు లేక యుండినను ♦ నెట్టటొ నాస్ఫటికంపురత్నవే
శ్మాంతమునందె; క్రుంకె రవి ♦ యందెను నభ్యుదయంబు చంద్రుఁడున్. 341

చ. అచటనె యుండి కొంతతడ ♦ వబ్జశిలామయి నాఁగ వెన్నలన్
విచికిలగంధి యార్ద్రమయి ♦ వే తను వొప్పఁగఁ; జొచ్చుఁ జంద్రుఁ డన్
ప్రచురభయంబుచే ననఁ గ•రంబులఁ జెక్కిళులందుఁ జేర్చి యెం
చుచు మది నేమియో కనులఁ • జూడక దేనిని మూసి ఊచ్చ్రయై. 342

చ. ఒకక్షణ ముండి లేచి యట • నుగ్మలి గోళ్లను బద్ధచంద్రబిం
బకములబర్వుచే జడిమ ♦ వంచెనొ నా సవిలాసమంథర
ప్రకటగతిన్ బదంబుల స♦బాధముగాఁ బయి కెత్తి యానుచున్
వికసితపద్మనేత్ర చన ప్రేఁగునఁ • దాఁ దనపాన్పుటింటికిన్. 343

చ. చని పడవైచి దేహమును • శయ్యపయిం దలయేరుచేఁ గదున్
దనుకుచు దాహరూప మగు•దారుణ మైనజ్వరంబుచే వగన్
గనుచుఁ దదాది యేదొ యొక•గాఢమనోవ్యథ మూయకే కనుల్
దనరుచుఁ జక్రదీపకుము•దంబులతోడను బుచ్చె నానిశన్. 344

తే. ప్రత్యుషస్సునఁ బిలిచి యా♦భామ నన్నుఁ
బంపె నీవార్తల నెఱుంగు•భావమునను
బలికి సోత్ప్రాసముగ నిట ♦ పార్థివేంద్ర
తనయ! యెఱుఁగుదు వెల్లను; ♦ నన్నఁగ నేల. 345

చంద్రాపీడుఁడు మరలఁ గాదంబరిని జూడఁబోవుట.

క. అనుటయుఁ జంద్రాపీడుఁడు, విని తద్వచనంబు నరుగు♦వేడుక మదిలోఁ
బెనఁగొన గుఱ్ఱము గుఱ్ఱం, బనుచును నిలువెడలె; నంత ♦ హాయపరిజనముల్.
క. కొని వచ్చిరి యింద్రాయుధ,మును బల్లముఁ బెట్టి వేగ♦మున నెక్కి కుభృ
త్తనయుఁడు మదలేఖను వెం,న్కను నధిరోహితను జేసి ♦ కడు రభసమునన్.
క. మొనగానిని వైశంపా,యను నానతిచి సేన కెల్ల ♦ ననశ్వతురంగం
బును గేయూరకుఁ డధిరో,హణమును గావించి వెంట ♦ నరుదేరంగాన్. 348
క. పరిజనము నెల్ల మరలిచి, చనియెను వడి హేమకూట♦శైలంబునకున్
జని కాదంబరిభవనాం, గణముసమీపమున డిగ్గి ♦ గంధర్వంబున్. 349
క. దిగి ద్వారపాలుచేతికిఁ, దగఁ దురగము నిచ్చి మదిర♦తనయను గనఁగా
నగిచెడుచిత్తముగల యా,యగణితమతి పత్త్రలేఖ ♦ యరుదేర బడిన్. 350
క. చొచ్చి మదిరాతనూభవ, యెచ్చట నున్నది యటంచు ♦ నెదురుగఁ దనకున్
వచ్చుడుహెగ్గడి నడిగెను, హెచ్చినతమకంబుతోడ ♦ నింపు దలిర్పన్. 351
తే. మ్రొక్కి యాతండు వినయంబు ♦ నెక్కొనంగ
మదశిఖావలకేకికా♦మహీధరంబు
క్రింద జలజాతవనవాపి♦క్రేవ నున్న
హిమగృహంబున నున్నది ♦ యినవరేణ్య!. 352
తే. అనుచుఁ దెలుపంగఁ బ్రమదావ♦నాంతరమునఁ
జనియె నొక్కింత దూరంబు ♦ సరణిఁ దెలుప
ముందుఁ గేయూరకుఁడు చన ♦ భూపసుతుఁడు
మదిని హర్షంబు పొంగార ♦ మనుజనాథ!. 353
తే. బాలతృణములఁ గావించి ♦ పంకజాప్తు
కిరణములనెల్ల; దినమును ♦ హరితముగను
జేయుదీప్తుల మరకత♦శ్రీవహించు
కదళికారామమును దాని♦గర్భమునను. 354
తే. తామరాకులపై కప్పు ♦ తనర నెపుడు
నలరుహిమగేహమును గాంచె ♦ నధిపసుతుఁడు
గాంచె నటనుండి వచ్చు నా♦కమలగంధి
పరిజనంబుల శిశిరస♦పర్యవతుల. 355
సీ. అర్ద్రవాసఃకైత♦వాచోఛదజలముల సంవృతోజ్జ్వలదేహ♦చారులతలు

నాభరణంబుల♦యట్లు భుజాధృతబిసవలయావళుల♦విసరితాంగు
లాపాండురైకక♦ర్ణార్తకైతకదళ తాటంకహాసితో రు♦దంతపత్ర
లాలిఖితపటీర♦జాలలలాటికాభాసురాననపద్మ♦భాసమాన

తే. లగుచుఁ బగలును స్ఫురియింప ♦ నాశఁజేసి
బింబితములై నశశధర♦బింబము లన
నొప్పుచందనబిందుల ♦ నుద్వహించు
గండఫలకంబులను జారు♦గాత్రు లగుచు. 356

వ. మఱియు. 357

చ. సకలశిరీషపుష్పముల ♦ చారిమ మంతయుఁ గొల్లగొన్నయా
ప్రకటితశైవల స్తబక♦పాళికలన్ గృతకర్ణపూర లై
వకుళసుమావళీవలయ♦వాసితగంధరసాప్లుతంబులన్
లికుచకుచంబులన్ జలజి♦నీదళముల్ ఘటియించి కప్పుగన్. 358

చ. అవిరళగంధసారరుచి♦రాప్రవిలేపనపాండురంబులన్
అవిరతతాపకోపమృది♦తాబ్జకరంబుల నాఁ గరంబులన్
ధవళమృణాళదండములఁ ♦ దామరతూఁడులచామరంబులన్
దవిలిచి; పుష్పమంజరులఁ ♦ దామరసంబులఁ గైరవంబులన్. 359

ఉ. తామరసచ్ఛదంబులను ♦ దాలిచి యుద్గతనాళకంబులన్
గోమున ఛత్రముల్గ రవి♦గోవుల నాఁగుచు; వారిదేవతా
స్తోమము నాఁగనున్ వరుణ♦సోమసహోదరిగుంపు నా శర
త్సాముదయంబు నాఁ దటిని♦సంఘము నాఁగను బొల్చుచున్ గడున్. 360

తే. అరుగు దెంచెదుతన్మది♦రాత్మజాత, పరిజనంబు తదీయాంగ♦ప్రాణమయము
దేహపరిచారకము మ్రొక్కి♦తెరు వొసంగఁ, బాదనఖపాతభీతినాఁ♦బఱచి వేగ.

కాదంబరీతాపనివృత్త్యర్థము శిశిరోపచారకల్పనాప్రకారము.

సీ. చందనకర్దమ♦సత్కృతవేదులు ఘంటికాయితసిత♦కమలతతులు
వికసితసిందుక♦విస్ఫురత్సుమగుచ్ఛచామరంబులు మణి♦చారిమములు
లంబమానస్థూల♦లలితసద్వల్లికాముకుళహారావళీ♦భూషితములు
నాబంధితలవంగ♦హారిపల్లవగంధసారమాలాజాల♦భారకములు

తే. డోలికాయితకైరవ♦మాలికోరు, వైజయంతులు బిసవేత్ర♦పాణిరుచిర
కుసుమభూషణదర్శకా♦గుప్తములును, నగుకదళితోరణంబుల♦యుడుగుత్రోవ.

చ. చని కలయంగ నంతటను ♦ జూచి కనుంగవఁ గాంచె నొక్క తా
వున నిరుతట్లఁ బాఁతినప్ర♦భూతతమాలకిసాలబద్ధ కా
ననఘనపంక్తులన్ గుముద♦నవ్యరజఃపులినాళులన్ బటీ
రనిరతగంధసారజల♦రాజితగేహనదీనదంబులన్. 363

చ. నిచుళగుళుచ్ఛసంఘటిత♦నిస్తులశోణితచామరవ్రజ
ప్రచురజలాభిషిక్తమృదు♦రమ్యవితానతలంబులన్ లస
ద్రుచిరము లైనచెందిరపుఁ♦దోరపుఁగుట్టిమసీమలందు స
న్నిచితము లైనశోణతర♦నీరజశయ్యల నొక్కపట్టునన్. 364

ఉ. ఏలకినీటఁ జల్లఁబడు ♦ చెప్పుడు నంటి కనుంగొనంగఁగాఁ
జాలిన గోడలం దనరు ♦ స్ఫాటికగేహము లొక్కచోటునన్
గ్రాలు శిరీషపక్ష్మములఁ ♦ గట్టిన శాద్వలభూములన్ మృణా
లాళికవారియంత్రభవ♦నాగ్రములం దిడుయంత్రకేకులన్. 365

మ. ఒకచాయన్ సహకారసస్యరసవా♦రుత్సిక్తజంబూకిసా
లకసంబాధితమధ్యపర్ణగృహజా♦లం బొక్కచోఁ గాంచె వే
రొకచక్కిన్ విహరించుకృత్రిమగజ♦వ్యూహాకులత్కాంచనా
బ్జకులంబున్ దిలకించె రాజసుతుఁ డా♦చక్కిన్ మహోద్యద్ద్యుతిన్. 366

సీ. తోరంబు లగుతమ్మి♦తూండ్లఁ గాలుగఁ జేసి మొగలిరేకులదోనె♦లుగ ఘటించి
కలువపంక్తుల నెల్లఁ ♦ గావించి చేఁద్రాళ్లు పత్రపుటము చేదు♦బాన చేసి
స్ఫటికంపుటిటికల ♦ బావుల గట్టించి క్రిందు సుధాపంక ♦ మందఁజేసి
యనఁటికంబంబుల ♦ నమరించి కంబముల్ వట్టివేరుల నడ్డ♦పట్టెఁ జేసి
తే. చందనోదక మెల్లప్డు ♦ చంద్రకాంత, కుట్టిమంబులఁ బాఁతింపఁ♦గువలయాక్షు
లచటనొకచోటఁగప్రంపు♦టనఁటిచెట్లు,తోఁటలకు వేసరక మోటఁ♦దోలఁగాంచె.

చ. స్ఫటికబలాకపంక్తికృత♦శంబరధారలఁ గల్పితాంబుము
గ్పటలములన్ వినిర్మితది♦వస్పతిచాపములన్ మఱొండుచోఁ
బటుమధుపాళికింకిణుల ♦ వాఁగెడుపుష్పసుదామడోలలన్
జిటిచిటి మంచుఁజిన్కులను ♦ జిల్కెడుయంత్రపలాశపత్రులన్. 368

ఉ. చేరువ మొల్చి యింపెసఁగు♦శ్వేతయవాంకురశోభితంబులన్
జారునవీనజాతిసుమ♦జాలకదంతురితోర్మిపంక్తులన్
మీఱెడుచందనద్రవవి♦నిర్మితదీర్ఘికలందు ముంచుచున్
సారెకు శీతలంబులను ♦ సల్పెడుహారము లొక్కచోఁ గనెన్. 369

చ. సతతము ముత్తియంపుఁబొడి ♦ సల్పినపాదుల స్థూలవారిబిం
దుతతిని దుర్దినంబు మదిఁ ♦ దోఁపఁగ నించెడుయంత్రవృతిసం
తతులను నొక్కచోట; నొక ♦ తావునఁ జంద్రకిసాలయుద్రవ
ప్రతతినివాసితంబు లయి ♦ భాసిలుతామరతూండ్లవస్త్రముల్. 370

మ. ఉదరారూఢము లై బహిర్గతము లై ♦ యున్నాళయుక్తంబు లై
ముదమారం గనుపట్టుచుండునళినీ♦పూతచ్ఛదంబుల్ గడున్
వదనంబుల్ గయిసేయఁగాఁ బొలుచు పూ♦ర్ణస్వర్ణకుంభంబులన్
బొదలంగా నొకచోఁ దమాలవనిలో ♦ నూత్నప్రకారంబులన్. 371

తే. కదళికాంతర్గత స్తంభ♦కమ్రదండ
చారువంశానుకృతిసుమ♦ స్తబకములను
జేయఁబడుచున్నగొడుగులఁ ♦ జెలఁగు చొక్క
చాయఁ గనుఁగొనె మఱియు నా♦త్మాపసుతుఁడు. 372

తే. రాతిపలకలయం దుంచి ♦ రమ్యసరణిఁ,దామరాకులసురఁటులఁ♦దవిలి యెపుడు
వీవఁబడునౌషధీరస♦విసరములను, శీతలంబుల నొకచోట♦క్షితిపవర్య!. 373

తే. లలితలవలీఫలద్రవ♦కలితములను, మంజుతృణశూన్యమంజరీ♦రంజితములఁ
గర్ణపూరంబులనునవ్య♦కల్పనములఁ,గాంచె నొకచోటనాక్షితి♦కాంతసుతుఁడు.

వ. ఇట్లు పరిజనంబులచేఁ గృతంబులును క్రియమాణంబులును నగుబహువిధ
శిశిరోపచారోపకరణకల్పనావ్యాపారంబులఁ గనుచుఁ జని చని. 375

## హిమగృహవర్ణనము.

సీ. హిమనగరాధిపు♦నెదయొ ప్రచేతసుసలిలకేళీసద్మ♦సౌధ మొక్కొ
సకలచందనవన♦స్వామి పుట్టినచోటొ సకలేందుమణిజని♦స్థల మి దొక్కొ
మాఘమాసక్షపా♦మంజునివాసంబొ వర్షర్తుసంకేత♦వాస మొక్కొ
సర్వాపగాగ్రీష్మ♦సంతాపవారణక్షమమనోహరమహా♦సదన మొక్కొ

తే. సర్వజలధరవైద్యుత♦జ్వలనదహన
తాపమార్పంగఁ జాలిన♦స్థాన మొక్కొ
యన నలరునొక్కహిమగృహా♦భ్యంతరంబుఁ
జొచ్చె నారాజపుత్రుండు ♦ క్షోణినాథ!. 376

వ. మఱియు. 377

సీ. అఖిలాంబుధులు బడ♦బానలతాపంబు నపనోదమును సేయు♦నాలయంబొ

చంద్రవియోగంబు ♦ సైఁపక కుముదినుల్ ప్రొద్దు పుచ్చఁగ వచ్చు♦భూతలంబొ
హారహుతాశనతప్తుఁ ♦ డై నకందర్పుండు తాప మార్చుకొనెడు♦దీపతలమొ
ప్రియవిరహాగ్ని చేఁ♦బెట్టి చక్రాంగముల్ తాప మార్పఁగ వచ్చు♦ధరణితలమొ
తే. యనఁగ నాహిమగృహ మొప్పు ♦ నవనినాథ
యంబుయంత్రకధారాస♦హస్రములను
దఱుమఁ బడినట్టిరవికర♦తతులు శీత
మునకు భయపడి నా నందుఁ ♦ జనఁగ వెఱచు. 378

వ. మఱియు. 379

ఆ. కుసుమసౌరభంబుఁ ♦ గుత్తుకబంటిగా, నాని యాము నంది ♦ యఱచుతేంట్లు
దంతమయవిపంచి♦వింత నాగృహమును, శబ్దితంబు చేయుఁ ♦ జారుఫణితి. 380

తే. సతతమధుకరసంచయ♦జటలుగల్గు, పువ్వుఁదీవెల నల్లని♦పుట్టమునను
గప్పికొన్నవిధంబునఁ ♦ గ్రాలుచుండు,నల్ల హిమగృహ మే మందు♦నవనినాథ!.

తే. చొచ్చి యాహిమగృహ మోలిఁ ♦ జూచు చతఁడు
వెలిని లోపల మిక్కిలి ♦ పిండహార్య
మో యనంగను నొప్పారు ♦ చున్నశిశిర
శీతలస్పర్శమున లిప్త♦చిత్తుఁ డగుచు. 382

సీ. తనమానసంబును ♦ దామరసారాతిమయమంచుఁ; గైరవ♦మయము లంచు
నఖిలేంద్రియంబుల;♦నంగంబులెల్లనుజ్యోత్స్నామయములంచుఁ;♦జొక్కు బుద్ధి
బిసమయం బని; విభా♦వసుగభస్తులనెల్ల హారమయము లంచు;♦నావనమును
జందనమయ మని; ♦ శ్వాసనునిఁగర్పూరమయుఁ డని; జలమయ ♦ మనుచు వేళఁ
తే. ద్రిభువనంబుల నీహార♦విభవమయము
లనుచుఁ దలపోయ సాగెను ♦ మనుజనాథ
తనయుఁ; డేవంవిధ మ్మయి ♦ తనరుచున్న
యల హిమగృహంబునం దొక్క ♦యమునసీమ. 383

—అనంగసంతప్తయగు కాదంబరిని వర్ణించుట.—

చ. సకియలు చుట్టునుం గొలిచి ♦ సల్పఁగ సేవలు సర్వనిమ్నగా
ప్రకరపరీత యైనహిమ♦వద్గిరిగహ్వరమధ్యదేవదీ
ర్ఘికయొ యనంగఁ; జంద్రరస♦కీలితనిర్ఝర మొప్పఁ జుట్టు కు
ల్యకరణిఁ; దూండ్లకంబముల♦యచ్చపుమంటపికాతలంబునన్. 384

చ. కుసుమశయంబునన్ మరుఁడు ♦ కుందఁగ జేయఁగ శృంఖలంబులన్
గసుగబిగించెనో యనఁగఁ ♦ గాంచికనూపురహారకంకణా
ద్యసమవిభూషణంబులను ♦ నబ్జమయంబులఁ దాల్చి; చందురుం
డెసఁగెసిప్రీతిఁ దాఁకె నన ♦ నింపున గందము మోమునం దగన్. 385

చ. ఘనమగు బాష్పపూరములు ♦ గ్రమ్మిననేత్రయుగంబు పాళి చుం
బనము నొనర్చు నాఁ దనర; ♦ వర్ధితనిశ్వసనానిలాననం
బనయము వాయుదష్ట మన ♦ నాకులతం దగ; నెల్లయంగముల్
దినకరుఁ డధ్యసించె ననఁ ♦ దీవ్రతనొందఁ బ్రతాపతప్తమై. 386

ఉ. చెమ్మటఁ దోఁగి మే నలర ♦ జీవన మెల్లను గౌఁగిలించె నా;
నిమ్ముగ మారదాహమున ♦ నేవున దీపితమై హృదంబుజా
త మ్మనలాగృహీత మనఁ ♦ దావము నొందఁగ; మన్మథార్తిచేఁ
గ్రమ్ముకొనంగఁబడ్డ మది ♦ రాసుతఁ గాంచె నృపాత్మజుం డటన్. 387

వ. మఱియు. 388

ఉ. ఏ మని చెప్పువాఁడ నిఁక ♦ నిక్షుధనుఃకఠినాంతరంగ మా
భామమనంబుతోడఁ బ్రియు ♦ పాలికి నేగెనొ నాఁ దదంగముల్
సోమగు లయ్యె దుర్బలత; ♦ శోషిలె నాసుభగత్వ మంతయున్
భూమివరా! సుపర్వలును ♦ మ్రుచ్చిలిరో యన నద్భుతంబుగాన్. 389

చ. వదలక తారహారములు ♦ వైచికొనంగఁ దదస్రజాలక
మ్మదికెనొ నాఁగ నెండి మయి ♦ యందలిగందము పాండురత్వమున్
గదిరినపుల్క లాయువతి ♦ గాత్రమునం జెలువొందెఁ బెల్లుగన్;
గుదికొని గండపాళికలఁ ♦ గూరెదు చెమ్మటనీటితుంపఱల్. 390

ఉ. రెక్కల గాలి వీచుచు హ ♦ రించును నాయమ నూఱడించు నా
నక్కట కర్ణపూరముల ♦ యందలిభృంగము లల్లనన్ నృపా!;
చొక్కి వతంసభృంగరవ ♦ శుమ్మమునన్ బరితప్త నా శ్రుతిన్
మిక్కిలి కొల్కులం దొరఁగు ♦ మేదురబాష్పఝరంబు తడ్పెడున్;. 391

చ. పైపయిఁ గాఱునశ్రువులు ♦ పాఱుప్రణాళిక నాఁగఁ దచ్ఛ్రితిన్
దోఁపిన కేతకీకలిక ♦ దోఁపఁగ; దీర్ఘము లైనయూర్పులన్
వేపితమై పయంట కదు ♦ వేదన నైఁపఁగ లేక భీతిచే
వే పరువెత్తు దేహరుచి ♦ వేణిక నాఁ దొలఁగన్ గుచంబులన్;. 392

ఆ. ప్రచలచామరములు ♦ ప్రతిబింబితము లయి, ప్రియునిసరస కేగఁ ♦ బెట్టికొన్న

రెక్క లనఁగఁ దనర♦నిక్కు డుకుచకుంభ, యుగముఁ గేలఁగప్పు♦చుస్సురనుచు.

సీ. సారెకు హిమశిలా♦సాలభంజికలను బిగియారఁ గౌఁగిటఁ ♦ బెట్టికొనుచుఁ
బలుమారు మృదుగండ♦ఫలకమ్ముచేఁ జంద్రపుత్రికాశ్లేషంబు♦భూరిగొనుచు
సారెసారెకుఁ బాద♦జలజాతమున గంధసారపంకప్రతి♦చ్ఛాయఁ గనుచు
సారెకుఁ గుతుకి నా ♦ స్తనబింబితం బైనతనముఖంబును మళ్లి ♦ తనను గనఁగ

తే. నాత్మప్రతిబింబవల్లవ♦యందు నున్న
కర్ణపూరకిసాలయ♦కంబుచేతఁ
జుంబితకపోలఫలకయై ♦ సొగయు మిగులఁ
దద్వియోగాగ్నిదాహంబుఁ ♦ దవిలి యబల. 394

వ. మఱియు. 395

తే. ఇంక నుదయింప వల దని ♦ యిందుఁ బట్టి
ప్రాణముల నంటి చేసెడి♦బాస చేయు
మనుచు నుంచెనో యనఁగను ♦ దనరుచుండ
రత్నదర్పణ మురమున ♦ రాజచంద్ర!. 396

తే. కరిణిపోలిక సమ్ముఖా♦గతిని నొప్పు, ప్రమదవనగంధవారణ♦పరతచేతఁ
గరముఁ జాఁపుచుఁబ్రస్థిత♦కరణిఁదోఁప, నదరుచును యామ్యవాతమ్ము♦గాగతికిని.

తే. మదనునభిషేకవేదిక♦చదు రెసంగఁ, గరముకమలావృతములయి ♦ గంధసార
ధవళములునయి తగుపయో♦ధరకలశము, లేకపార్శ్వావలంబత♦నెసక మెసఁగ.

తే. అలరుస్వచ్ఛాంబరతలంబు♦నందుఁ దోఁచు
నుజ్జ్వలమృణాళికాకోమ♦లోరుమూల
యగుచు నాకాశకమలిని♦యందమునను
జూడ నొప్పెను గంధర్వ♦సుదతి యధిప!. 399

తే. శిశిర మెల్లను హరియించి ♦ చెలఁగు చుండె
నల్ల మధుమాసదేవత ♦ యనఁగ మిగులఁ
గుసుమచాపంబువిధమునఁ ♦ గుసుమసాయ
కాధిరోపితగుణకోటి ♦ యగుచు మఱియు. 400

తే. అళివిధంబున సుమమార్గ♦ణాకుల యయి
యలరుచు ననంగరాగయై ♦ మలయజాంగ
రాగకలితాంగి యయ్యు నా♦రాజదుహిత
పరఁగు మన్మథజననియై ♦ బాల యగుచు, 401

తే. మృదుమృణాళినియయ్యె నా♦ముదిత దలఁప
ఘనహిమస్పర్శనంబును ♦ గాంచునేయు
నతివిచిత్రితచరితయై ♦ యలరుచిత్ర
రథసుతనుఁ గాంచె నచట నా♦రాజసుతుఁడు. 402

తే. అంత నాకాంత రాసుతు♦నాగమంబు
పరిజనంబులు రయమునఁ ♦ బఱచి వచ్చి
తెల్ప రెప్పల నార్చుచుఁ ♦ దెఱచి కనుల
నందఱను గాంచి మెల్లఁగ ♦ ననియె నిట్లు. 403

తే. అరుగుదెంచెన నిజముగ ♦ నధిపసుతుఁడు
చూచితే యెంతదవ్వునఁ ♦ జూచి తేఁడి
యనుచు నడుగుచు నెదురుగ ♦ నరుగుదెంచు
నతని నల్లంతఁ గనుఁగొని ♦ యబ్రపడుచు. 404

చంద్రాపీడునిఁ గని కాదంబరి సంభ్రమమున లేచుట.

సీ. నూతనసంగ్రహా♦నూతంగివిధమున ఘనతరోరుస్తంభ♦ఘటిత యగుచుఁ
గనకని జాఱంగఁ ♦ గనకోత్తరీయంబు హారాంశువుల నద ♦ నలమికొనుచుఁ
దనపాపఁ గ్రైదండఁ ♦ గొనఁగోరినా వామపాణిని మణిభూమిఁ ♦ బట్టిగొనుచుఁ
బూఁబాన్పుతావికిఁ ♦ బొలయు తేఁటులు లేవనెత్తె నా నవళత ♦ నట్లా లేచి
తే. విడినతుఱుమును ముడివేయఁ ♦ బోడమునలఁతఁ
జెమ్మట దొరంగువలకేల ♦ నిమ్ముగాఁగఁ
బ్రోక్షణ మొనర్చి తన్నిమ్ము ♦ పోల్కిఁ దెలుపఁ
గదల నూగారు త్రివళులు ♦ పొదల మిగుల. 405

సీ. సర్వరసంబులు ♦ స్మరుఁడు పిండునొ యనఁ ద్రిప్పి త్రికంబును ♦ నొప్పు మెఱయ
సుందరఫాలభా♦క్చందనభరమున నన ముఖం బించుక ♦ యవనతముగ
లీల లోఁజొచ్చిన♦ఫాలచందనరస మనఁగ హర్షాశ్రులు ♦ గనులఁ దొరఁగి
గదలి వతంసంబు ♦ పొదివినధూళిధూసరితకపోల దే♦శంబుఁ గడుగ
తే. జాలువాఱఁగ నానంద♦జలము మిగులఁ, దక్షిణ సుపాంగపుంజిత♦తారకంబు
తద్వదనలగ్నమో యనఁ ♦ దనరి దీర్ఘ, మైనదృష్టిని నాకృష్ట ♦ మైనభంగి.
తే. లేచెఁ బూఁబాన్పుపైనుండి ♦ లేమ యంత
రాజసుతుఁడును ముందటి♦యోజ డాసి

మొదల నల మహాశ్వేతకు ♦ మ్రొక్కి పిదప
సవినయంబుగ మ్రొక్కె నా♦చాన కతఁడు. 407

తే. ప్రతినమస్కారమును జేసి ♦ ప్రీతి మరల,నల్ల పూసెజ్జపైననే ♦ యధివసించెఁ
జిత్రరథపుత్రి; హెగ్గడి ♦ శీఘ్రముగను, నొక్కబంగరుగద్దియ ♦ నునిచె నంత.

తే. దాని నవరత్నఖచితమై ♦ తనరుదాని, నంఘ్రి నవలకు నెట్టి దా ♦ నననిపైనఁ
గూరుచుండె నతండు; కే♦యూరకుండు, పత్త్రలేఖను గనుపించి ♦ పలికె నిట్లు.

తే. దేవి! యీసతి నరపతి♦దేవసుతుని, యడప పత్త్రలేఖాఖ్యను ♦ నలరు చుండుఁ
ద్వత్ప్రసాదోర్వి యీసతి♦తరచి తరచి, చెప్పఁగా నేల యనఁగ నా♦క్షితిపపుత్రి

తే. కాంచి యాకన్య మానవ♦కాంతలందుఁ
దామరసజన్మపక్షపా♦తం బయారె
యనుచు మదిలోన నెంచు చా♦యతివ మ్రొక్క
రమ్ము రమ్మని సరసకు ♦ నిమ్ముగాఁగ. 411

తే. చేరి పరిజను లెల్లరు ♦ గోరి చూడఁ
గుతుక మెసఁగంగఁ దనపజ్జఁ ♦ గూరుచుండఁ
బెట్టెఁ గనుఁగొనినంతనె ♦ ప్రీతి పుట్టి
సారెఁ దడవుచుఁ గేల్దమ్మి ♦ మీరఁ జెలిమి. 412

వ. అంతఁ జంద్రాపీడుండును గృతసకలాగమనోచితాచారుం డయి తదవస్థ యగు చిత్రరథతనయం గాంచి యిట్లని చింతించె. 413

### చంద్రాపీడుఁడు కాందబరితో సరసాలాపము లాడుట

ఉ. ఇంకను నమ్మకున్నయది ♦ యెంతటిమూఢము నామనం బహో
పొంకముమీర నీసతిని ♦ భూరిచమత్కృతిఁ బల్కరించెదన్
శంక యిఁ కేల యంచు మదిఁ ♦ జయ్యన నెంచుచు పల్కె నిట్లనెన్
పంకజనేత్ర! నా కెఱుక ♦ భావజరాగము కారణంబుగాన్. 414

చ. కలిగెను నీకు నీరుజ ప్ర♦గాఢముగా ఘనతాపహేతువై
కలఁచెను నిన్ననారతము ♦ కామిని! నిక్కువ; మైననున్ మమున్
వలె నిను గాసిపెట్టదుగ ♦ వారిజలోచన! మే నొసంగి యేన్
దలఁచెద నిన్నుఁ గావఁగను; ♦ దన్వి! రో! యీకుసుమేషు గాసిచేన్. 415

చ. కలఁగెదు నిన్ననుంగొనినఁ ♦ గారుణికం బగు నామనంబు తాఁ
గలఁగినభాతిఁ; గంపిలెదుఁ ♦ గంపిలుచుండెదు నీకుఁగాఁ గదన్

వెలఁదిరో; నీభుజాలతలు ♦ వేదన నెంత కృశించెఁ జూచితే
చెలఁగ ననంగదంబు లయి, ♦ చెప్పెడి దే మిఁక నీదుదృష్టియుఁన్. 416

మ. అతిగాఢం బగుతాపత ప్తమయి తా ♦ నందెన్ స్థలాంభోజినీ
గతి ర క్తత్వ మపార మోయువతి! దుః♦ఖం బొందఁగా నీ వనా
రతబాష్పోదకబిందుపాతమున నా♦రంగూ రె ముక్తాకలా
పత త్వాత్పారిజనంబునందు నకటా ♦ భావింప శాతోదరీ!. 417

చ. కొనుము స్వయంవరార్థ్థములఁ ♦ గోమలమంగళభూషణంబులన్
వినుము వెలుంగు నూత్నలత ♦ నిర్భరపుష్పశిలీముఖాళిచే;
నన మదిరాత్మజాత కుసు♦మాయుధుచే నుపదిష్టయో యనన్
గ నతనిభంగివాక్యములఁ ♦ గల్గునిగూఢమహార్థసైపుణిన్. 418

చ. తెలిసికొనన్ సమస్తమును ♦ దేటపడ న్మది బాల యాట నా
కలికి స్వభావమౌగ్ధ్యమును ♦ గల్గిన దయ్యు మనోరథంబులన్
దలఁపక యట్టిభాగ్యమును ♦ దాల్పఁగ నర్హము లంచు సిగ్గుచేఁ
బలుకక యూర కుండెఁ దల♦వంచి పయంటను జక్క నొత్తుచున్. 419

ఉ. ఆననసౌరభంబునకు ♦ నల్లన మూఁగెడు తేంట్లగుంపులన్
బూనినయంధకారమున ♦ బ్రుంగినయాతనిఁ గాంచనో యనన్
గా నొనరించె నన్యమిషఁ ♦ గల్పన చేసి స్మితావలోకమున్
మానుగ; నంత ని ట్లనియె ♦ మాధవ! యామదలేఖ తోడనే. 420

తే. ఏమి వచియించెదఁ గుమార ♦ యీదురంత
తాప మతిదారుణము చెప్పఁ ♦ దరము కాదు
వెండియుఁ గుమారభావంబు ♦ విడువ కున్న
యీమెసంతాప మది చెప్ప ♦ నేల! యింక. 421

చ. చలువలు గ్రమ్ముతామరకి♦సాలయమున్ శిఖ యయ్యెఁ; జూడ వె
న్నెలయును నెండ యయ్యెఁ; గడు ♦ నెట్టనఁ బల్లవతాళవృంతసం
చలనజవాతపోతముల ♦ సాంతమునన్ జనియించుఖేదమున్
దెలియవొ; ప్రాణముల్ నిలుప ♦ ధీరతయే కత మామెకుం చనన్. 422

తే. చిత్రరథపుత్రియును దన♦చిత్తమందు
నల్ల మదలేఖ చెప్పిన♦యాలపంబె
రాజసుతునకుఁ బ్రత్యుత్త♦రంబుఁ జేసె
రాజసుతుఁడును సుభయార్థ♦రాజితముల. 423

తే. చతురతద్వ్యాపితంబుల♦సంశయంబుఁ, జెంది మనమున నలమహా♦శ్వేతతోడఁ
బెద్దయుంబ్రొద్దు స్నేహాభి♦వృద్ధిచతుర, కథలచేఁ బుచ్చి మిక్కిలి♦కష్టముననను.

తే. వీడికొని వారి బలములు ♦ విడిసి యున్న
తావునకుఁ బోవ సమకట్టి ♦ తరలి చిత్ర
రథసుతామందిరమునుండి ♦ రాజచంద్ర!
వారువం బెక్కి నుంకించు ♦ పార్థసుతుని. 425

తే. డాసి వెనుకను నంజలి ♦ చేసి వినయ
మలరఁ గేయూరకుం డిట్టు ♦ లనియె దేవ!
మనవి యొనరించు మదలేఖ ♦ మదిరతనయ
ప్రథమదర్శనజప్రీతి ♦ ప్రబల మైన. 426

తే. పత్రలేఖను నిట డించి ♦ పదఁడు మీరు
వెనుకఁ జనుదెంచు నని వేఁడు♦కొన్నదు ననుచుఁ
జిత్త మని చెప్పఁగా నల ♦ క్షితిపతనయుఁ
డతనిమాటల నాలించి ♦ కుతుకమునను 427

తే. తలఁపఁగాఁ బత్రలేఖయ♦ధన్యరాలు, నెంత స్పృహణీయయయ్యెను♦నింతలోనఁ
జిత్రరథపుత్రికకుఁ? గడుఁ ♦ జిత్ర మరరె, దుర్లభం బగు తత్ప్రీతి♦దొరకె లీల.

తే. పిలుచుకొని పొ మ్మటంచును ♦ బలికి ప్రీతి
మగుడ వేలమ్మునకు వచ్చి ♦ మనుజనాథ
సుతుఁడు గనుఁగొనె మును దాను ♦ జూచినట్టి
జనకుకడనుండి కమ్మను ♦ గొనుచు నవుడె
యరుగుదెంచినలెంకను ♦ నవనినాథ!. 429

తే. గుఱ్ఱమును బట్టుకొని యట్టె ♦ కుతుకమునను
బ్రీతివిస్ఫారితాక్షుఁడై ♦ పిలిచి వాని
దూరముననుండి యడిగెను ♦ నోరి! తల్లి
దండ్రులకు క్షేమమే? వారు ♦ తనరు చుండ్రె?. 430

తే. పారిజనులకు శుద్ధాంత♦భామినులకు
భద్రమే? యంచు నడుగ నా♦పార్థసుతుఁడు;
భద్ర మెల్లర కని డాయ ♦ వచ్చి యతఁడు
వినయమున మ్రొక్కి లేఖికా♦ద్వితయ మొసఁగె. 431

తే. అందుకొని వానిఁ గన్నుల ♦ నద్దుకొనుచు
శిరమున ధరించి యువరాజు ♦ చించి తాన
యోలి నిట్లని చదివెను ♦ నుర్వరేశ!
భక్తితాత్పర్యములు మదిఁ ♦ బరిఢవిల్ల. 432

సీ. స్వస్తి సర్వోర్వీశ♦జాలశిఖావతంసీకృతపదసర♦సీరుహుండు
వీరమాహేశ్వర♦బిరుదాంచితుఁడు మహారాజాధిరాజాళి♦పూజితుండు
ప్రీతిఁ దారాపీడ♦పృథ్వీశచంద్రుండు సర్వసంపదలకు ♦ స్థానమైన
తనయుఁ జంద్రాపీడుఁ ♦ దద్దయు దీవించి చూడామణిమరీచి♦చుంబిశిరసు

తే. ముద్దుఁగొంచుఁ బ్రహర్షంబు♦ముప్పిరికొన,నుజ్జయినినుండి పంపెడు♦నుత్తరంబు
కుశలినులు సర్వప్రజలును♦గూర్మిపట్టి!,యెన్ని నాళ్లాయె నినుఁ గని♦చిన్నికూన!.

తే. నిన్నుఁ గానక దేవియు ♦ నిఖిలమైన,యంతిపురమును నిచ్చలు ♦ వింతవంత
నెంతచిక్కెనో యెఱుఁగవ♦యెదలుమాని,బలవదుత్కంఠితములయి♦బడలుచుండు.

తే. కాన నీకమ్మ చదివిన♦కడనె గమన,భేరి మ్రోయించి పయనమై ♦ వేగ రమ్ము
యనుచు శుకనాసప్రేషితం ♦ బైనయపర,లేఖ నీయర్థమే యుంట ♦ లీలఁ జదివె.

తే. ఇట్టి సమయంబుననె వచ్చి ♦ యినతనూజు
డాసి శుకనాసపుత్త్రుండు ♦ తీసి తనకుఁ
బ్రేషితం బైన లేఖికా♦ద్వితయకంబుఁ
జూపె; నీయర్థమే యందుఁ ♦ జూపఁబడియె. 436

చంద్రాపీడుఁ డుజ్జయినికిఁ బోవుట.

తే. అంత భూకాంతసుతుఁడు తా♦నాత్మజనకు
నాజ్ఞ నౌదల ధరియించి ♦ యట్లె యశ్వ
మెక్కి ప్రస్థానభేరి మ్రో♦యించెఁ జెంతఁ
బెద్దయాశ్వికసైన్యంబు ♦ పెంపెలర్ప. 437

తే. నిలిచియున్నట్టిసైన్యాధి♦నేత మేఘ,నాధుని బలాహకాత్మజు ♦ నయవినీతుఁ
గాంచి నీవును బత్త్రలే♦ఖయును నొక్క,సారి రమ్మని యాజ్ఞను♦సలిపి మఱియు.

చంద్రాపీడుఁడు కాదంబరికి సందేశమంపుట.

ఉ. ఉన్నటు లుండి తప్పిచను; ♦ నొప్పవహేతుకవత్సలత్వముం
బన్నుగ నేరి ప్రేమములు ♦ పాయక; తన్మనుజస్వభావ మి

ద్దిన్నఁగ దుర్గ్రహంబు చన ♦ విన్నది; చూడదు నిర్నిరోధముల్
దిన్నఁగఁ జెప్ప నేల గదుఁ ♦ దీవ్రము నింద్యము ముజ్జగంబులన్. 439

సీ. కపటజాలికతను ♦ గదియించితిని బ్రేమ నన్మృతకాకుప్రాఢి ♦ నదిమి భక్తి;
నధికోపచారమా♦త్రామలాత్మార్పణమును ధూర్తతను ద్రోసి♦తిని గడంగి;
వాఙ్మానసములకుఁ ♦ బ్రకటించితిని గదు భిన్నార్థకత్వంబు; ♦ చన్న యిట్లు
దివ్యయోగ్యం బైన♦దేవికి సయిత మస్థానప్రసాదయున్ ♦ సడిని గలుగఁ
తే. జేసితినిఁ జెప్పుకొన నాకు ♦ సిగ్గు గదుఁగఁ,గలుగఁ జేయును గద సిగ్గు♦కడకభూమి
పాతిసదనుగ్రహామృతా♦పాంగదృష్టి;,యేమి చేసితి నీగతి ♦ నేగుదెంచి. 440

తే. అల మహాశ్వేతఁ గన్న నా♦యంతరంగ
మెట్లు హీభరజడ మాను ♦ నట్లు కాదు
దేవిఁ గనుఁగొన్నఁ; దెలిపెను ♦ దేవి కామె
నన్ను నగుణుని నొకగొప్ప ♦ నరుని జేసి. 441

ఉ. నాకడ లేనియట్టిసుగు♦ణంబుల నెల్లను మోపి నాపయిన్
జోక స్తుతించె నంచు ననుఁ ♦ జూచి యయోగ్యునిపైనఁ బక్షముల్
దాఁకె నటంచు హంససుతఁ ♦ దప్పక తిట్టును దేవి యక్కటా!
వీకున; నేమి సేయుదును ♦ వెంగలినై యిటు వచ్చినాఁడ పో. 442

ఉ. ఎక్కుడు దేహమాత్రమున ♦ కెల్లను నీభువిఁ దండ్రియాజ్ఞ నా
మిక్కలి హేమకూటగిరి♦మీఁద వసింపఁగఁ గోరుచిత్తమే
నిక్కముగా లిఖించితిని ♦ నీరజనేత్రకు దాస్యపత్రముల్
దక్కలి వేయిజన్మముల♦దాఁక నటంచును నక్కజంబుగాన్. 443

ఉ. ఈమది కేగఁగా సెలవు ♦ నీయదు గొల్లికునట్లు బోయ కీ
కామినిసత్ప్రసాద మటె ♦ గ్రన్నన; నేగెదఁ దండ్రియాజ్ఞ చే
మామకపత్తనంబునకు ♦ మానస మొప్పక యున్న సర్వదా
యీమనుజప్రభుండు స్మరి♦యింపఁ దగున్ జనకీర్తనంబులన్. 444

తే. జీవ ముండిన మరల నీ♦చిగురుఁబోఁడి
చరణజలజాతవందన♦సౌఖ్యముదము
ననుభవించక యుండఁ డీ♦మనుజుఁ డనుచుఁ
దలఁపునను నిల్పు మని చెప్పు ♦ తరుణితోడ. 445

సీ. అల మహాశ్వేతకు ♦ వలఁగొని శిరసుతోఁ జరణంబులకు మ్రొక్కు♦సలుపవలయు
నశిథిలాశ్లేషంబు ♦ నామదలేఖకు వినతులతో విన్న♦వింపవలయు

గాటంపుఁ గాఁగిటఁ • గదియఁగా నొనరించి యాతమాలికఁ జేమ • మడుగవలయుఁ
జిత్రరథాత్మజా • శేష సేవకులకుఁ గుశలానుయోగంబుఁ • గూర్పవలయుఁ

తే. గూర్పు మామంత్రణము హేమ • కూటమునకుఁ
గేలు మోడిచి మ్రొక్కుఁగాఁ • జాలసారు
లనుచు నీగతి వానికి • నాజ్ఞ యొసఁగి
సాగిపోవంగ సెలవిచ్చి • సౌహృదాది
సాధనముల కనాయాస • సరణి ముందు. 446

వ. స్కంధావారంబునకెల్ల వైశంపాయను నధిపతిం గావించి తా నింద్రాయుధం బధిరోహించి ఖురతాండవంబుల ధరణీఁ ఖండఖండంబులం గావించుచు, గమనహేలాహర్షహేషారవంబులఁ గైలాసగిరి గ్రక్కదలించుచుఁ గాంతకుంత లతావనంబుల వహించుతరుణతురగప్రాయం బైనయశ్వసైన్యం బనుగమింపఁ బల్లంబుం బట్టికొని వెంటం బరుగిడివచ్చునాలేఖహారకుని యుజ్జయినీమార్గం బడుగుచుఁ గాదంబరీవియోగంబున నత్యంతశూన్యం బయినహృదయంబు తోడం గ్రమంబునం జని చని. 447

—శూన్యకాననవర్ణనము—

సీ. అత్యున్నతప్రకాం • డాయతపాదపప్రాయంబు గాఢాంధ • బాహుళంబు
గజపతిపాతిత • క్ష్మాజాతపరిహారవక్రీకృతాభీల • వర్త్మకంబు
మాలతీవల్లరీ • మంటపప్రావృతమంజులతరుఖండ • మండితంబు
జనజనితపలాశ • శష్పేంధనసమాస్రప్రకటితనరఘాత • భాక్షస్థలంబు

తే. తృషితపాంథవిఖండితో • దీర్ణధాత్రి
ఫలచయంబును ద్రుమమూల • భాగలిఖిత
విపినదుర్గంబునై గడు • వెఱపు గొల్పు
శూన్యకాననమాన్నృప • సూతి కాంచె. 448

సీ. వికసితతాపింఛ • విస్ఫురత్సుమగుచ్ఛధూళిధూసరతటీ • పాళికలును
దటపాళితరుబద్ధ • పటుపటచ్చరపటశకల కేతనచిహ్న • సన్నుతములు
నిష్టకాస్థితరస • హీనపల్లవసమాస్తరణోహ్యపథికవి • శ్రామములును
విశ్రాంతకార్పట • విధుతాంఘ్రిధూళిధూసరపల్లవాంకిత • స్థలయుతములు

తే. పత్రసంకరపంకిలా • స్వాదువర్ణ, విరహితాశిశిరాసుర • భీకృతాంబు
విలసితమ్ము లయినమహా • వృద్ధవిపిన, కూపములఁబొల్చు నాశూన్య • ఘోరవనము.

వ. మఱియు. 450

చ. సుమరసబిందువుల్ దొరుఁగ ♦ శోభిలువావిలికానపుప్పొడుల్
గమిసినతీరభూములను ♦ గ్రాలుచుఁ గుబ్జమనోజ్ఞవల్లరీ
సముదయభాసురంబు లగు ♦ సైకతభూములఁ బాంథజాలఖా
తము లగుకూపకంబులను ♦ దాల్చినశుష్కనదుల్ చెలంగఁగా౯. 451

తే. శ్వానచరణాయుధావళీ ♦ స్వనము చేతఁ, గానఁబడుచుండు నాశూన్య ♦ కాననమున
నాటవికమానవులగుంపు ♦ బలమి యుండు, గహనగుల్మలతా ప్రాంత ♦ గ్రామటికలు.

క. ఈవిధమగు నడవిని బడి, పోవంబోవంగఁ బండి ♦ పోయెను రవి తాఁ
జేవులు బెండను వాసర, మావృత్తమై యొసఁగె గగన ♦ మంతయును నృపా!.

సీ. శాఖాగ్రశ్లేషైక ♦ చారుపల్లవముల సాతపత్రము లట్టు ♦ లలరు చుండు
విగతశాఖీకృత ♦ వితతశాల్మలిపర్ణబహుళంబులై యొప్పు ♦ పాదపములు
నూర్ధ్వస్థితనవాంకు ♦ రోజ్జ్వలోరుస్థాణుమూలశిఖాసాంద్ర ♦ భూమితములు
హరితాళపింగళ ♦ వరపక్వవేణుద్రుపటలరచితవృతి ♦ భ్రాజితములు

తే. గురుమృగత్రాసకృతతృణ ♦ పురుషకములు
పాకపాండుప్రియంగుక ♦ ప్రాయములును
నగువనక్షేత్రములుఁ బల్చ ♦ నగుచు నలరఁ
దేజరిల్లు నల వనప్ర ♦ దేశమునను. 454

## రక్తధ్వజవర్ణనము.

క. చిరహూఢరక్తచందన, తరువుపయి౯ బద్ధమగుచుఁ ♦ దరుణ మయిన నె
త్తురుగతి నరుణం బయి గడుఁ, బరఁగెడు రక్తధ్వజంబు ♦ బహుదూరమున౯.

క. కనఁబడె క్ష్మాధవసుతునకు, ఘనజిహ్వాలతలు వోలెఁ ♦ గడురక్తములై
తనరుపతాకల భాసిలు, చును మేచకచామరావ ♦ చూలం బలర౯. 456

క. నూతనవిశసితమానవ, జాతాంగకరచితదండ ♦ సవలంకృతి నా
భీతిదమై యవచూలక, కేతనముల స్వాయితనిఖిల ♦ ఖేచర మగుచు౯. 457

సీ. సరసపిశితపిండ ♦ సంకాశయావకపంకార్ద్రితం బయి ♦ వాసి గనుచుఁ
బక్వవరాటక ♦ బద్ధబుద్బుదసార్ధ చంద్రఖండోత్తమై ♦ చలిత మగుచు
డోలికాయితశృంగ ♦ గోహాశృంఖలలంబమానఘంటా రావ ♦ మహిత మగుచు
ఘటితకేసరిసటా ♦ క్రమ్రచామర మయి కనకత్రిశూలికా ♦ కలిత మగుచు

తే. నాకసం బంటి యిటునటు ♦ నగుగు దెంచు
పథికపురుషోపహారక ♦ పథము వెదకు

వనఁగ నలరు నల మహాధ్వ♦జాభిముఖము
గాఁగ నించుకదూరంబు ♦ కదలి యతఁడు. 458

— చండికాగృహవర్ణనము. —

చ. కనుఁగొనెఁ గేతకీకుసుమ♦కంటకజాలకపాండువన్యవా
రణదళనారరంబును; గి♦రాతముఖాళివితర్కలోహద
ర్పణవనరాజిశోభితము ♦ రక్తప్రకీర్ణకభాసితంబునై
తనరెడుచండికాలయము ♦ దారుణలోహమయోరుతోరణన్. 459

చ. కలిగినద్వారదేశమును ♦ గల్గియు లోహితగంధహస్తకం
బుల రుధిరారుణార్కసుత♦భూరికరాస్ఫుటితంబొ నాఁగ ను
జ్జ్వల మయి శోణితాణుమతి♦సక్తశివావళిలిహ్యమానర
క్తిలభయదాకృతియై వెలుఁగు♦కేవలలోహలులాయ మొక్కఁడున్. 460

తే. అంజనాశ్మవితర్దిక ♦ నభిముఖముగ, సుప్రతిష్ఠితమై తగఁ, ♦ జూచువారి
కతిభయద మగు నాచండి♦కాలయమ్ము, శాకినీఢాకినీభూత♦సద్మకమ్ము. 461

సీ. వనచరపాతిత♦వనమహిషాళులు నాఁగ నొక్కెడఁ గోక♦నదము లొప్ప
సింహనఖములనఁ♦జెలువొందెడునగ స్త్యసుమకుట్మలము లొక♦చోట మెఱయ
వ్యాఘ్రసాసృజ్నఖ♦రావళు లన నొక్కకడను గింశుకజాల♦కములు తనరఁ
దరుణపిశితఖండ♦తతు లనఁగా నొక్కచోట బంధూకముల్ ♦ సొబగు నింప

ఆ. వివిధపుష్పనిహిత♦వివిధోపచారమై, యింక నొక్కయెడను ♦ నంకురితమొ
యనఁగఁ గుటిలహరిణ ♦ ఘనశృంగకోటుల, నలరు నల్ల చండి♦కాలయంబు.

చ. ఫలిత మనంగ ముండతతిఁ; ♦ బల్లవితం బన నార్ద్రజిహ్వికా
కులశకలాయుతంబునను; ♦ ఘోరతరారుణలోచనంబులన్
జెలఁగుచుఁ బుష్పితం బనఁగ ♦ జీవసహస్రసుపర్వణంబులన్
దెలుపుచు నొప్పెఁ దద్గృహము ♦ తీవ్రభయానకజన్మభూమియై. 463

క. శ్వానభయంబునఁ గొమ్మల, లీనారుణతామ్రచూడ♦లేఖలను సదా
పూనుచు నకాలదగ్నిత, సూనగుళుచ్ఛంబు లనఁగ ♦ శోభిలుచుఁ గడున్. 464

క. అరుణాశోకద్రుమములు, పరఁగును దత్ప్రాంగణమున ♦ బలిశోణితపా
నరతిని జనుదెంచినభీ,కరబేతాళంబు లనఁగ ♦ ఘనతాళంబుల్. 465

సీ. శంకాజ్వరంబుచేఁ ♦ జలితంబు లో యనఁ గంపించుకదళికా♦కాననములఁ
దతభయోత్కంటకి♦తములు నాఁ గంటకిశ్రీఫలద్రుమఖండ♦శ్రేణికలను

త్రాసోర్ధ్వసంయుత♦కేశంబు లో యన ఖర్జూరతరువన♦కాండములను
నుచ్చాటితము లన ♦ నూఁగుమహోన్నతనారికేళీపూగ♦వారములను
తే. జుట్టు గహనీకృతం బయి ♦ బెట్టిదంబు
నగుచు బగలును గాఢాంధ ♦ మాక్రమించి
భీతి నా సూర్యునకు నప్ర♦వేశ్య మగుచు
నలరు నాచండికాలయ ♦ మవనినాథ!. 466

చ. దళితవనేభకుంభగళి♦తంబుల శోణితమౌక్తికంబులన్
బలినవశోణితారుణిత♦భక్తకణమ్ము లటంచుఁ గుక్కుట
మ్ములు గొని ముగ్ధతన్ విడిచి ♦ పోవఁగఁ జల్లుచు దుర్గ పెంప దు
ర్లలితము లైనసింహశిశు♦రాజము లాడుఁ దదంగణంబునన్. 467

చ. కనుఁగొని భూరిరక్తమును ♦ గాంచినమూర్ఛనిపాతితుండు నాఁ
గను బ్రతిబింబితుం డయిన ♦ కంజమనోహరుఁ డస్తతామ్రుఁడై
ఘనతరతామ్రవర్ణములు ♦ గాఁగ నొనర్చినశోణితాంబువా
హినులు తదంగణంబున న♦హీనములై దగుఁ జేరి గట్టిగన్. 468

సీ. వెలుఁగుదివ్వెలపోగ ♦ మలసి మాసినరక్తయవనిక ప్రేలాడ ♦ నడ్డ మగుచు
మంత్రపూతములై న♦మహితకంకణములు భుజగభుగ్గళములఁ♦బొలుపు మీఱ
దంతార్గళంబులఁ ♦ దనరి లసత్పీతనీలారుణాదర్శ♦జాలకముల
స్ఫురితబుద్బుదపంక్తి ♦ శోభిల్లి త్రపుసింహవదనగహ్వరమధ్య♦బంధితముల
తే. స్థూలలోహితకంటక♦జాలకముల
నలరునరరదద్వయంబుచే ♦ నడరి; పిష్ట
పాండుఘనఘంటికాపంక్తి♦ భారి యగుచుఁ
బొలుచు గర్భాలయద్వార♦భూమి యచట. 469

తే. సర్వపశుజీవితంబులు ♦ శరణు చొచ్చె, ననఁగ యావకవస్త్రంబు ♦ లాత్మచరణ
జలజములపొంతఁ బిండికా♦సనమునందుఁ,బొనరఁ జండిక భీకర♦మూర్తి తనరు,

ఉ. ప్రాణులమస్తముల్ నఱుకు♦పట్టున లగ్నము లైన కేశసం
తానములో యనన్ జెలఁగఁ ♦ దద్దయు బింబితనీలచామరల్;
పూని భయానకం బెసఁగ ♦ భూరివరశ్వథపట్టిసాదిక
ప్రాణివధార్హశస్త్రచయ♦భాస్వరకాంతులు పర్వె చీఁకటుల్. 471

చ. పొలయఁగ; వానిమధ్యమునఁ ♦ బొల్చురసాతలవాసినీగతిన్
సలిపి ప్రసాధనం బరుణ♦చందనలేపనభాసమానస

త్ఫలకీససంగబిల్వదళ♦దామములన్ శిశుముండదామకం
బు లనఁగఁ దోఁచువానిఁ దల♦పున్కలఁ దాలిచి చండి యచ్చటన్. 472

తే. క్షతజతామ్రకదంబక♦స్తబకజాల
కార్చితాంగంబులను దేవి ♦ యలరె భయద
పశుసమర్పణనాదిత♦పటహరటిత
రససముద్భూతరోమాంచ♦రాజి యనఁగ. 473

సీ. ఫాలభాగంబున ♦ భర్మపట్టము గట్టి సిందూరతిలకంబుఁ ♦ బొందు పఱచి
కరము దాడిమకుసుమ♦కర్ణపూరము వెట్టి తత్ప్రభఁ జెక్కిళ్లఁ ♦ దనరఁ దొగరు
నధరపుటంబులు ♦ నరుణంబులై మీఱ రుధిరతాంబూలంబు ♦ రుచియొసంగఁ
గనుబొమల్ బొమముడి♦గదిరి తొగరొక్కనుకనులమోమున నల్క♦గానుపింప

తే. శబరయువతులు గైసేయఁ ♦ జండి యచట
మేలికౌసుంభ పాటల♦మృదుదుకూల
మును ధరించి మహాకాలుఁ ♦ గనుఁగొన నభి
సారికావేషమూనిన♦సరణి దెల్పు. 474

ఉ. నల్లనిగుగ్గిలంపుఁబొగ ♦ నాలుగుమూలలు గ్రమ్మి మెల్లఁగా
నల్లుకొనంగ; నెత్తినయి ♦ యాడెడుగర్భనిశాంతదీపికా
వల్లికలన్ లులాయనర♦భక్షకు నెత్తురు సోఁకి యెఱ్ఱనౌ
వ్రేళ్లను స్కంధపీఠమును ♦ వేమగు నద్ది త్రిశూలదండమున్. 475

చ. కదలిచి తప్పుచేయువన♦కాసరమున్ బెదరించునో యనన్
బొదలుచు నుండు దుర్గ యట ♦ భూరిభయంకరమూర్తియై గడున్;
గుదురయి ఛాగముల్ వ్రతము ♦ కూరినభంగిఁ బ్రలంబకూర్చముల్
గదురఁగఁ గట్టివేయఁబడి ♦ కంబములన్ వెలుఁగొందు; భూవరా!. 476

సీ. జపపరంబులు నాఁగఁ ♦ జపలాధరంబులై చెంతనిలిచియుండు♦చిట్టెలుకలు
ప్రతిశయితములు నా ♦ వఱలి కృష్ణాజినప్రావృతాంగంబులై ♦పరఁగు తేళ్లు
మస్తకోపరిధృత♦మణిదీపము లనంగ ఫణరత్నదీధితిఁ ♦ బరఁగుఫణులు
స్తవపరంబులు నాఁగ♦దారుణవాక్కుల నఱచెడు కాకులు ♦ నహరహరంబు

తే. గొలువ నాయాయివిధముల ♦ ఘోరమూర్తి
శాకినీఢాకినీభూత♦సహిత యగుచు
వాసమొనరించు నాకృత్తి♦వాసుపత్ని
మనుజపశ్వాదిజంతులఁ ♦ గొనుచు నచట. 477

వ. ఇట్లతిభయంకరంబైన యాచండికాలయంబున విడిసి గుఱ్ఱము డిగి తదాలయంబుఁ బ్రవేశించి యభంగురభక్తిం బ్రణమిల్లి ప్రదక్షిణం బొనర్చుచు నిరుపరోధం బైననిర్మలప్రదేశంబు నారయువేడుకఁ బరిభ్రమించుచుండ నొక్కయెడ. 478

జరద్ద్రవిడధార్మికవర్ణనము.

క. కాలినమ్రోడనుశంకను, వ్రాలినకృకలాసగోధ ♦ వార మనఁగఁ గ్రాల్
స్థూలస్థూలప్రశిరా,జాలముల గవాక్షితుండుఁ ♦ జాలఁ గృశుఁడునై. 479

క తనరఁగ నలక్ష్మి త్రవ్విన, ఘనలక్షణభూములనఁగ ♦ గ్రాలెడుపిటక
వ్రణబిందువులను జిత్రిత, తనుఁ డగునొకవృద్ధద్రవిడ♦ధార్మికుఁ గనియెన్. 480

క. రుదురక్కపేరు పోలికఁ, గుదు రయి చెవికమ్మ గాఁగఁ ♦ గూర్చినసిగయున్
బొదలెడు కంఠియు నంబా,పదపతనశ్యామఫాల♦భాగమునఁ దగన్. 481

క. కారపుటలాబుబంకను, గూరిచి దంతురతఁ బోవఁ ♦ గొట్టుకొనఁ బ్రతీ
కారము చేయుచుఁ బ్రత్యహ, మూరఁగఁ గంబళిపుటోపి ♦ యాదలఁ గ్రాలన్.

ఆ. ఎప్పుడును గువాది ♦ యిచ్చినసిద్ధాంజ,నమున నొక్కకన్ను ♦ నలఁగిపోవ
నిచ్చి యిచ్చి కాటు ♦ కితరనేత్రమునకు, నతిగినట్టిపుడక ♦ యలరఁ గేల. 483

సీ. సతతంబు పయిపయి ♦ సల్పెడుకటువర్తిసేవఁ దిమిరవృద్ధి ♦ సిద్ధపఱచి
పాషాణభేదన♦పటుపటిష్ఠం బైనపందికోరను గేలఁ ♦ బాదుకొల్పి
యింగుదీఫలముల♦సంగతం బగునట్టు లౌషధాంజనముల ♦ నలవరించి
కౌశేయకోజ్జ్వల♦కోశావృతిక్షతివ్రణితపాదాంగుష్ఠ♦మును ధరించి

ఆ. చెడురసాయనంబు ♦ సేవించి సేవించి, యసమయజ్వరమును ♦ నావహించి
ధాతువాదపరతఁ ♦ దార్కొనఁగాఁ జేసి, తనరు వృద్ధద్రవిడ♦ధార్మికుండు. 484

ఆ. దక్షిణాపథంబుఁ ♦ దనకుఁ బట్టముఁ గట్టి
వర మొసంగు మనుచు ♦ వామమార్గ
మునను దుర్గఁ గొలుచు ♦ ముసలివాఁ డయ్యును
నతఁడు రాజవర్య ♦ యహరహంబు. 485

తే. దుష్టశిక్షితబిక్షుకా♦దిష్టతిలక
బద్ధవిభవాశుఁడై యొప్పు ♦ పరఁగుచుండు
హారితపత్రరసాంగార♦సురుచిరమషి
మలినశంబూకములఁ దాల్చి ♦ మనుజుఁ డతఁడు. 486

తే. దివ్యదుర్గాస్తవంబులఁ ♦ దేజరిల్లఁ
బట్టికల వ్రాసి పొగచూరి ♦ నట్టిరక్త
యావకాత్సురకూహక ♦ యంత్రమంత్ర
తంత్రతాలపత్రకృతపు ♦ స్తములఁ దాల్చి. 487

తే. వృద్ధశైవోపదిష్టుఁడై ♦ యిద్ధశైవ
మతము నెల్లను లిఖియించి ♦ మహిని వెలయఁ
జేయుచును నిధివాదంబు ♦ చేయుఁ దెగులు
తగులు కొని దానిబాధను ♦ బొగులు చెవుడు. 488

తే అసురవివరప్రవేశమ ♦ హాపిశాచి
వట్టి తనుఁ ద్రిప్పఁగా యక్ష ♦ పంకజాక్షి
కాముకత్వమనోహరా ♦ గాధమోహ
మగ్నమానసుం డయి సము ♦ ద్విగ్నుఁ డగుచు. 489

సీ. సలుపు చంతర్ధాన ♦ సన్మంత్రసాధన మెఱఁగి శ్రీగిరివార్త ♦ లెల్లఁ గరము
సారెకు మంత్రించి ♦ చల్లుతెల్లావాలు బాలుభూతావిష్ట ♦ వార మెల్లఁ
జిందులు త్రొక్కుచుఁ ♦ జేసెడుకరతాడనములను నగలఁ గ ♦ ర్ణములు పెలుచ
దుర్గృహీతం బైన ♦ తుంబీవిపంచికాధ్వనిఁ బధికులు వెఱఁ ♦ దలఁగి పాఱఁ

తే. జీఁకటీఁగలు గీపెట్టు ♦ చెన్ను దోఁప
నుత్తమాంగంబు కంపింప ♦ నుగ్ర నుతులఁ
బాడి సేవించుచును భక్తి ♦ పారవశ్య
మూను చపుశప్పు డూరక ♦ యూఁగు చట్టె. 490

తే. అఱవపాటలఁ బాడుచు ♦ నమలదేవ
నిమ్నగాస్తోత్రముల భక్తి ♦ నృత్య మెలమి
సలుపుచును సైంధవబ్రహ్మ ♦ చర్యమునను
జరుపు దినముల నాతఁ డా ♦ చండిచండ. 491

తే. అన్యదేశాగతోషిత ♦ మాన్యవృద్ధ
మస్కరిణులను లోఁగొన ♦ మానినీవ
శీకరణచూర్ణమును సారె ♦ సిద్ధపఱచి
సంప్రయోగించు వారిపైఁ ♦ జతురమతిని. 492

సీ. ముఖభంగవికృతిని ♦ మొనసి చండిని గూడఁ బరిహాసింపఁగ భయ ♦ పడనివాఁడు
నష్టపుష్పంబులు ♦ వ్యత్యస్తముగ వైవఁ గోపాగ్ని నొకతఱిఁ ♦ గురియువాఁడు

నొకతఱిఁ జోటుకై ♦ యొండొండు కలహించి బాహుయుద్ధముచేయు ♦ బాటసార్ల
నడ్డపెట్టఁగఁ బోయి ♦ యట్టె యవనిఁ ద్రెళ్ళి సంభగ్నపృష్ఠవం ♦ శంబువాఁడు

తే. నొక్కయప్పుడు నపరాధ ♦ మొనరఁ జేసి
పాఱుబాలకులను బట్టఁ ♦ బరుగువాఱి
జాఱి తలక్రిందు లై పడి ♦ సంస్ఫుటితశి
రఃకపాలవికటకంధ ♦ రంబువాఁడు. 493

తే. సంస్కృతుఁడు గామి నేమేని ♦ సల్పువాఁడు
కుంటివాఁ డౌట నల్లల్ల ♦ గునియువాఁడు
చెవిటి యౌటను సంజ్ఞలఁ ♦ జేయువాఁడు
రేయిచీఁకటి దినమున ♦ ద్రిమ్మరీఁడు. 494

సీ. ప్రసవముల్ చిదుముచోఁ ♦ బైకి లేచిన తేంట్లు కఱవ శీర్ణీకృతాం ♦ గంబువాఁడు
పాడుగుళ్లను నేలఁ ♦ బవళించి కాలసర్పములచేఁ గఱవంగఁ ♦ బడ్డవాఁడు
దూరపాతము లైన ♦ మారేడుకాయల దళితోత్తమాంగంబుఁ ♦ దాల్చువాఁడు
ఫలపాతనామర్ష ♦ వలిముఖనఖహతిచ్ఛిద్రితోత్తాననా ♦ సికమువాఁడు

ఆ. జీర్ణదేవమాతృ ♦ సిద్ధాశ్రమావాసి, భల్లనఖరదళిత ♦ పాండుగండ
తలమువాఁడు నన్ని ♦ తడవలో యాతండు, చెప్ప నేల వాని ♦ క్షితిపవర్య! 495

చ. జనములు మీఁదఁ జల్లుచు వ ♦ సంతము; కుక్కని వృద్ధదాసితో
నునిచి వివాహముల్ సలిపి ♦ యూర్వేషలించుమహోత్సవంబుచే
సిన నవుటాలకుల్ మదిని ♦ జెందెడువాఁడు ముదంబు నెప్పుడుల్
జనవర! పెక్కుకోవెలల ♦ స్వాపముఁ జెందియు నిమ్మళుండు నా. 496

చ. తనదుకుటుంబముం బలెను ♦ దాస్థన్యమునుం బహురోగవేష్టితం
బును వహించు మూర్ఖతను ♦ భూరితిరవ్యసనానుసంగతిం
బును బలుబిడ్డలం గలది ♦ వోలెను జూపు; ననేకదండపా
తనిచితగాత్రగండముఁ గ్రు ♦ ధల్ ఫలితంబును బోలెఁ జూపెడిన్. 497

మ. సకలాంగంబుల దీపదాహముగతిన్ ♦ సంతాపముల్ గూర్చుగం
డకసంభావిత మైన క్లేశమును నిం ♦ డారంగ వే మోముల్
బ్రకటించుల్ సఘురంబునాఁ దగుపరీ ♦ భావంబు నిర్హేతుక
ప్రకటాక్షిప్తజనాంఘ్రిఘాతశతసం ♦ భారం బతం డొప్పుఁ బో. 498

తే. ఎండుతీఁగల నల్లిన ♦ బెండుపెద్ద
పూలపుట్టను బూజకుఁ ♦ బూలు గోయు

నెదురుదోఁటిని ధరియించి ♦ పదము లంటి
వ్రేలునంగిని దొడిగి తా ♦ వెలుఁగు నతఁడు 499

తే. కాంచి యాతండు తనసైన్య♦కారణమున
నఱచు చేద్పుచుఁ గుపితుఁడై ♦ నడరుచుండ
నవ్వుకొని పెద్దయుం బ్రొద్దు ♦ నరవరాత్మ
జాతుఁ డదలించి కలహించు ♦ సైనికులను. 500

సీ. సరసభాషణశత♦సాంత్వనంబుల నెట్లొ శాంతునిఁ గావించి ♦ చతురసరణి
జన్మభూమియు విద్య ♦ జాతిని వయసును నాలుబిడ్డల నోలి ♦ నరసి విభవ
మడిగి హేతువతండు♦యతియాటకును దానె యెఱఁగి యాతఁడు చెప్ప♦నెల్లగతులఁ
దనపూర్వశౌర్యంబు♦ఘనతను రూపంబు విభవంబు నతఁడు వే♦విధులఁ బొగడఁ

తే. దనరఁ జిత్తవినోదమై ♦ తనకు విరహ
తప్తహృదయున కది యింత ♦ తాప మణఁప
జాతపరిచయుఁడై యుల ♦ త్క్ష్మాపతీంద్రు
తనయుఁ డాతని కిప్పించెఁ ♦ దమ్ములంబు 501

వ. అంత భగవంతుం డగు సప్తసప్తి యస్తంగతుం డగుటయుఁ దోడిరాజపుత్రులు యథాసంపన్నంబు లగుపాదపతలంబు లావాసంబులుగఁ బరుండ, గుఱ్ఱంబు లపనీతశాఖావస్థితతపనీయపర్యాణంబులయి క్షితితలలుఠితగాత్రంబులయి పాంసులసటాఝాటంబు విదిలించికొని యమితోత్సాహంబునఁ గతిపయఘాసకబళంబులఁ గ్రహించి సలిలంబులఁ గ్రోలి స్నానార్ద్రపృష్ఠంబు లగుట విగతశ్రమంబులై పురోభాగనిఖాతకుంతయష్టులఁ సంయుతంబులుగా సైనికజనంబు దినగమనపరిశ్రాంతనియమితయామికంబయి శయనింప సేనానివేశంబు బహుపావకప్రభలఁ బరివీతతమం బగుదివసంబుచందంబునం బ్రకాశించుచుండఁ జంద్రాపీడుం డొక్కయెడఁ సంయతేంద్రాయుధంబు మ్రోలం బరిజనకల్పితంబయి ప్రతిహారీనివేదితం బయినశయనంబునకుం జనియె. 502

చ. శయననిషణ్ణుఁడైన యుల ♦ త్క్షాధపుపుత్రుని మానసంబునన్
రయమున దుఃఖఖడ్గము కఠోరంబు నిమగ్నముగాఁగఁ వ్రాఁకె తత్
త్రియపరివర్గమున్ విడిచె ♦ దేనను జిత్తము హత్తమిన్ గడున్
బ్రియులను బాశ్వవర్తులను ♦ బిల్వక పల్కక యుండె మానియై 503

సీ. మూసి నేత్రములు కెం♦పురుషవిషయము వే చనియెను మనసుతో♦సారెసారె
మాటిమాటికి హేమ♦కూటంబు స్మరియించెఁ జిత్త మొండొకచోటఁ♦జేరనీక

చింతించె నల మహా♦శ్వేతాప్రసాదంబు నిర్హేతుబంధుత ♦ నెమ్మి సారె
మాటిమాటికిఁ గోరె ♦ మదిరాతనూజాతవరదర్శనము జీవ♦ఫలము గాఁగ
ఆ. నవగతాభిమాన♦మై వేళలంబైన, ప్రవిమలమదలేఖ♦పరిచయంబుఁ
గోర సాగె సారెఁ ♦ గోరెను దరళికఁ, గాంచ మదిని మనుజ♦కాంతసుతుఁడు.

క. వచ్చెనొ కేయూరకుఁ డని, హెచ్చినతమి నూహ లెల్ల ♦ నెడఁ దివిరెను నా
యచ్చపుహిమగేహంబును, మచ్చికఁ గనెఁ జిత్రచిత్ర♦మండితముఁ దగన్. 505

తే. వేఁడినిట్టూర్పు లిబ్బడి ♦ విడువ సాగె, నిలిపె నెక్కుడు ప్రేముడి ♦ లలితశేవ
హారమునఁ బత్రలేఖను ♦ నధికపుణ్య, రాలుగఁ దలంచె నట నుంట ♦ రాజవర్య!

ఉ. ఈగతి నిద్రలేక నిశ ♦ నెల్లను బుచ్చి తలంచుకొంచునే
వేగఁగ లేచి యాతనియ♦భీష్టము నిండఁగ విత్తరాసులన్
బాగుగ నిచ్చి రమ్యవన♦భాగములన్ నివసించుచున్ దమిన్
వేగ కొలందిప్రొద్దులన ♦ వీటికి నుజ్జని కేగె భూవరా!. 507

చంద్రాపీడుఁ డుజ్జయినిఁ జేరుట.

ఉ. ఉన్నటులుండి వచ్చుట స♦ముత్సుకతన్ గని సంభ్రమంబుచే
నున్నతసౌధవీథికల ♦ నుండెడుపౌరనమస్కృతాంజలుల్
గన్నుల నర్ఘ్యకంజములఁ ♦ గైకొనురీతిగఁ గొంచుఁ జొచ్చె నా
సన్నుతమూర్తి రాసుతుఁడు ♦ చయ్యనఁ దెల్పక యేరికిన్ బురిన్. 508

ఉ. ఏమును నేము నంచు మది ♦ నెక్కుడుహర్షరసంబు పొంగ ను
ద్దామత వచ్చుకింకరులు ♦ ద్వారమునందుఁ ద్వదీయసూనుఁ డో
భూమిప! యున్నవాఁ డనుచుఁ ♦ బొల్పుగఁ దెల్పఁగ లేచి నిర్భర
ప్రేమను మందగిల్ల నడ ♦ వే పృథివీపతి సంభ్రమించుచున్. 509

సీ. కంధిజలంబును ♦ మందరాద్రియుఁ బోలె జాతినపైవల్లెఁ ♦ జక్కఁ గొనుచు
ముత్తియంబుల రాల్చు♦బుధపాదపమువోలెఁ గనులహర్షాశ్రువుల్ ♦ గార్చుకొనుచుఁ
బజ్జ నుండెడుజరా♦పాండురమౌళులు వృతనవక్షౌమసం♦వీతదేహు
లుష్ణీషమకుటకే♦యూరులు శేఖరుల్ చందనచర్చిత♦చారుతనులు
తే. ఛత్రతామరకేతన♦చారువేత్ర
ఖడ్గధారులు నయి రాజ్య♦గ్రావబహుళి
బహుళికలశాబ్ధియును భూమిఁ ♦ బరఁగఁ జూపు
వసుమతీనాథశతముల ♦ బడిని గొంచు, 510

తే. కాలినడకను నెదురుగఁ ♦ గదలి వచ్చు;
వచ్చుజనకుని దవ్వున ♦ భక్తిఁ గాంచి
వారువంబును దిగి మౌళి ♦ భాసమాన
రత్నదీధితు లొలయంగ ♦ రాజసుతుఁడు. 511

తే. మ్రొక్కెఁ దండ్రికి నంత నా♦భూవరుండు
చేతులను జాఁపి రారమ్ము ♦ చిన్నితనయ!
యనుచుఁ జీరుచుఁ బరిరంభ ♦ మాచరించె
విడువ కెంతకుఁ గట్టిగ ♦ వేడ్క సుతుని. 512

తే అప్పు డట నుండువారికి ♦ నర్హ్యులకును
నెఱఁగి నిలిచినవారికు ♦ నెలమిఁ గేలు
పట్టికొని పోయెను విలాస♦వతి గృహంబు
నకును నామెయు నాగతి ♦ నతిముదమున. 513

సీ. సకలశుద్ధాంతంబు ♦ చనుదేర వెంబడి నెదురేగి స్వాగతం ♦ బిచ్చి యతనిఁ
గొనివచ్చి కూర్చుండు ♦ మని చెప్పి యాగమనుంగళాచారముల్ ♦ మమత నడపి
దిగ్జయసంబంధ♦దివ్యకథలఁ గొంత యిష్టకథాగోష్ఠి ♦ నెలమి నెరపి
శుకనాసుఁ గన నేగి ♦ సుచిర మచ్చట నిట్టిక్రమమున నే యుండి♦గదురముదము
తే. తెలిపి సేనానివేశాన♦నిలిపి నీదు, తనయు సనయు వైశంపాయ♦ను నరుదెంచి
నాఁడఁ గుశలియె యని చెప్పి♦వేడుకలర, నలమనోరమకడ కేగి♦యధిపసుతుఁడు.

క. కని యామెను వినయంబునఁ, జనుదెంచి విలాసవతిని♦శాంతమునందే
జనవర! యువకుండయి మజ్జనముఖసత్క్రియల నెల్ల ♦ సలిపె నొకమొయిఁగా.

తే. ప్రొద్దు పడమర కేగంగఁ ♦ బోయెఁ దనదు
గృహమునకు; నందుఁ దహతహ ♦ కెరలి మదినిఁ
గలఁపఁ గాదంబరిని విడి, ♦ కాదు తనను
నొక్కనిని యిల్లు నగరంబు ♦ నుర్వి యెల్ల. 516

తే. శూన్యము లటంచుఁ దలఁచెను ♦ క్షోణినాథ!
యంతఁ గాదంబరీవార్త ♦ లాలకింప
నుత్సుకుండయి మనమున ♦ నూట లూర
నరయు చుండెను బత్రలే♦ఖాగమంబు. 516

కాదంబరియొద్దనుండి పత్రలేఖ వచ్చుట.

వ. ఇట్లు మహోత్సవంబునుంబోలె నీప్సితవరప్రాప్తికాలంబునట్లు లమృతోత్పత్తిస
మయంబునుంబలెఁ దత్పత్రలేఖాగమంబున నెదురుచూచుచుండఁ గొన్నాళ్లకు
మేఘనాదుండు పత్రలేఖం గొనివచ్చి సమర్పింప నది కృతనమస్కారయై
నిలుచుటయుఁ జంద్రాపీడుండు దూరంబునన యెలనవ్వునం బ్రేమం బచ్చుపడ
లేచి సహజవల్లభ యయ్యుఁ గాదంబరీప్రసాదప్రాప్తిసంలబ్ధాపరసౌభాగ్య
నా వల్లభతరతఁ గాంచినదాని గాఢాలింగనంబు గావించి ప్రణతుఁ డగుమేఘ
నాథుఁ గరకిసలయంబున నంటుచు సముపవిష్టుండయి యిట్లనియె. 518

సీ. అల మహాశ్వేతకు ♦ నడరునే క్షేమంబు తనరునా శివము కాం♦దంబరికిని
బరఁగునా భద్రంబు ♦ పరిజనంబునకెల్ల నొదవునే శుభము కే♦యూరకునకు
మన తమాలిక లెస్స♦మనునొకో మదలేఖ భర్తృదారికయొద్దఁ♦బరఁగునొక్కొ
సకలశుద్ధాంతముల్ ♦ సౌఖ్యంబులే కద హేమకూటమునకు ♦ నెలమి కలదె

ఆ. చెప్పుమ పత్రలేఖ! ♦ చిప్పిల మోదంబు
ననుచు నడుగుటయును ♦ నవనినాథ
సుతుఁడు; పత్రలేఖ ♦ వితత మాభక్తిని
జెప్పఁదొడఁగె మోడ్చి ♦ చేతు లిట్లు. 519

చ. మనుజవరేణ్యపుత్ర! విను ♦ మానిని దేవి యొనర్చి కేలుదో
యిని సిగదండ గాఁగ నిను ♦ నెంతయుఁ గూరిమిఁ బూజ సల్పెడిఁ
దనపరివారముఁ సఖులు ♦ దండఁ జెలంగఁగ నంచుఁ జెప్పఁ దా
నిని గొనిపోయె వీడి క్షితి♦నేతల నెల్ల గృహంబులోనికిఁ. 520

ఉ. అందును నుత్తలంపడెడు ♦ నాత్మను గౌతుక మూఁపలేక రా
జేందుసుతుండు దూరముగ ♦ నెల్లబలంగము నవ్వి యప్డె పెం
పొంది సమున్నతం బయిన♦యుద్గతనాళపలాశవంక్తిచేఁ
బొందినయట్లు ఛత్రమును ♦ బొల్చునలాంబుజినీవనాంతరిఁ. 521

చ. మరకతకేతనాయితస♦మంచితపర్ణసుమండపంబుక్రిం
ధరణిని జొక్కు పండినసి♦తచ్ఛదదంపతులఁ బదంబునఁ
జరిపి వసించి తా నడిగె ♦ సత్వర మారఁగఁ బత్రలేఖ! నీ
వరిగి యె టుంటి వచ్చుట స♦హాంబులు నెన్ని మతేమి సంగతుల్. 522

ఉ. దేవియనుగ్రహం బెటుల ♦ తేజరిలుఁ; మము నేఁడు హెచ్చుగా
భావనసేయు; నెవ్వనికి ♦ భాసిలు నెక్కుడుప్రీతి మాయెడఁ

ఏవిధమైన ముచ్చటలు ♦ నెట్టికథల్ జరిగెన్ వచింపుమా
పోవిడనాడ కొక్కఁడును ♦ బోల్పుగ నం చడుగన్ సరాగుఁడై. 523

వ. పత్రలేఖ కరంబులు మోడ్చి వినయంబుతో ని ట్లనియె. 524

పత్రలేఖ కాదంబరీవృత్తాంతమును జెప్పుట.

క. మీ రిట వచ్చిన నేఁ గే,యూరకుతో మగిడి వచ్చి ♦ యువిదకడకు నా
చారుతరకుసుమశయనము, చేరువఁ గూర్చుంటి నంత ♦ క్షితిపతితనయా!. 525

క. కాంచుచు నవనవ దేవీ, ప్రాంచితసదనుగ్రహాళి♦పరవశ నగుచున్
మించుచు నుండితి సుఖముగ, నెంచక మీవిరహ మంత ♦ నినసుతవర్యా!. 526

ఉ. ఆదిన మంత నాకనుల ♦ నామెకనుల్ మఱి మేను మేనునన్
వాదము లేల పాదుకొన ♦ వాణి మదాహ్వయవర్ణపం క్తిలోఁ
బాదుకొనెన్ దదీయ మగు♦స్వాంతము నప్పుడు మత్ప్రియంబునన్
భూధవపుత్ర! ప్రొద్దు దిగఁ♦బో యెడునంతకు నుండి యచ్చటన్. 527

క. కొని నన్నూఁతగ హిమగృహ,మును విడిచి యథేచ్ఛమీరఁ♦బూని తిరుగుచున్
జనె వల్లభ బాలాఖ్యను, దనరెడు నుద్యానమునకుఁ ♦ దరుణీమణి దాన్. 528

చ. అచట సుధావళీమయి ♦ యామునవారితరంగమాలికా
ప్రచయమయంబులో యనెడు♦పచ్చలమెట్టులఁ నొప్పుభామినీ
రుచిరవనోరువేది నధి♦రోహిత యై మణికంబ మూఁది నీ
లచికుర కూరుచుండెను వి♦లక్షిత యై యిసుమంత సేపటన్. 529

చ. హృదయముతోడఁ జాలతడ ♦ వేమొ విచారము చేసి నిశ్చయం
బిది యని తేల్చి యేమొ యను♦నిచ్చను నిశ్చలతారపక్ష్మముల్
గదురఁగ నాముఖంబుఁ గనెఁ ♦ గాంత చిరం బిటు గాంచు చప్పుడే.
మదనధనంజయుం జొరఁగ ♦ మానసమున్ దృఢనిశ్చయంబుగాన్. 530

చ. ఒనరిచి ఘర్మవారిఝరి ♦ నుగ్మలి స్నానము చేసె; దానఁ గం
పనమును గాంచె; దాన భువిఁ ♦ బాతము నొందును నన్నభీతిచేఁ
గొనెను విషాద; మంతఁ గనుఁ♦గొంటిని దద్హృదయాశయంబు నే
జనవరపుత్ర! తన్ముఖము♦చాయను నిశ్చలదృష్టిఁ జూచితిన్. 531

వ. అట్లు నిశ్చలనిబద్ధదృష్టినై సావధానమునన్ గనుంగొని దేవి! యిట్లేలచూచెదవు.
భవదీయాశయం బానతి మ్మని నివేదించుటయు. 532

చ. వినుఁ దనమంతనం బనుచు ♦ వెగ్గలపుంద్రప నాత్మబింబమున్
బనుపఁగ నాఁగ నవ్వలకు ♦ వ్రాయుచు బొట్టనవ్రేల నొయ్యనా

య్యున మణికుట్టిమస్థలిని; ♦ నాలయహంసలఁ బాఱఁదోలుచున్
ఘనమణికుట్టిమస్థలిని♦ఘుర్ఘణశబ్దితనూపురధ్వనిన్. 533

ఉ. చెమ్మటబిందువుల్ గురియ♦చిన్నిమొగంబును వీడఁ దాళవృం
తమ్మగుపైఁటచెంగునను ♦ దచ్ఛశివణోత్పలవిభ్రమద్విరే
ఫమ్ములఁ దోలుచున్ భవన♦బర్హికి లంచ మొసంగునో యనన్
దమ్ముల మర్ధముం గొటికి ♦ దంతములన్ సగ మిచ్చుచున్ దమిన్. 534

ఉ. సారెకుసారెకుం దెసలు ♦ సంశయ మందుచుఁ జూచు చిట్టటున్
గూర వెలుఁగు గద్గదిక ♦ ఘోరవుసిగ్గున నేమి చెప్పఁగన్
నేరక యూరకుండె ధర♦ణీవరపుత్రక! చెప్ప నెంచియున్
సారసగంధి వక్త్రజల♦జాతము వంచి యొకించు కేనియున్. 535

సీ. కడఁగి భగ్నమందు♦కామాగ్ని దహియించి శేషంబు లేకుండఁ♦జేసె ననఁగ
సంతతధారఁగా ♦ సతతంబు ప్రవహించునేత్రోదకముల ము♦నింగె ననఁగఁ
బయిపయిఁ జొరఁబడు ♦ బహుళదుఃఖంబులు ప్రసరింపఁగానీక ♦ పట్టె ననఁగ
నెడలేక పైఁబడు ♦ నించువిల్తుశరంబు లడరంగఁ దుత్తుము ♦ రాయె ననఁగ
తే. మదినిఁ గలపెక్కు తలఁపులు ♦ నదిమె ననఁగ
వెడలు నూర్పులు వెడలంగ ♦ నడఁచె ననఁగ
నూర్పులను గ్రోలు తేఁటులు ♦ నూఁకె ననఁగ
బయట రా దయ్యెఁ దద్వాణి ♦ పార్థతనయ!. 536

ఉ. ఊరక గండపాళికల ♦ నూనక కాఱెడుబాష్పవారి లోఁ
గూరినదుఃఖకోటులను ♦ గోరి గణింపఁగ నక్షమాలికన్
గూరుచు నాఁగ ముత్తెములఁ ♦ గూర్చుచు దుర్దిన మాస్థలంబునన్
వారిజనేత్ర యుండెఁ దల♦వాంచి కనుంగొన కేరినిన్ నృపా!. 537

సీ. లజ్జావిలాసంబు ♦ లజ్జయు, వినయాతిశయమును వినయంబు,♦భయముభయము
ముగ్ధత ముగ్ధత, ♦ మురిపంబు మురిపమున్, విభ్రమంబును గడు♦విభ్రమంబు
వరవిలాసంబును ♦ వరవిలాసంబును, నిపుణతయును మహా♦నిపుణతయును,
దుస్సహాఖేదంబు ♦ దుస్సహాఖేదంబు, వేపథువును దీవ్ర♦వేపథువును,
తే. నేర్చుకొన నామెకడ నష్ట♦ నేతృవర్య!
యంతఁ దాదృశయైనయా♦యతివఁ గాంచి
మనవి యొనరించితి నిదేమి ♦ మగువ! యనుచు
నంత నాకాంత లోఁ గాంతి ♦ యలమికొనఁగ. 538

తే. రోహితోదరనేత్రస♦రోజములను
దుడిచికొని దుఃఖభరమునఁ ♦ దూఁడుపోల్కి
మృదుతరం బగుభుజలత ♦ మేదినీశ!
కుంజసుమపాళికాకృత♦కుసుమమాల 539

తే. పట్టుకొని యొక్కబొమ యెత్తి ♦ పైకి మిత్తి
దారిఁ గనుఁగొనుగతిఁ గని ♦ తరుణి నన్ను
వేఁడినిట్టూర్పు నిగిడించె ♦ వెతకుఁ గతము
చెప్పు మని యెంత వేఁడినఁ ♦ జెప్పదాయె. 540

ఉ. వ్రాయునో తెల్పఁగావలయు♦వార్తల నాఁగను గోటికోటితో
వ్రాయుచుఁ గేతకీదళము♦పైనఁ; గదల్చుచు మోవిఁ దెల్పఁగాఁ
బాయనిసిగ్గునన్ శ్వసిత♦బంధరజాలముతోడ మంతనం
బాయమ సల్పుచున్న దన ♦ నట్టె వినిశ్చలదృష్టి భూస్థలిన్. 541

చ. కనుఁగొను చూరకుండెఁ జిర♦కాలము దృష్టిని మన్ముఖంబుపై
నునిచి క్రమంబునన్ మరల ♦ నుగ్మలి సారెకు సారెఁ గన్నులన్
ఘనతరబాష్పపూరములు ♦ కాలువలై దిగజాఱఁ దత్పయః
కణముల మన్మథజ్వలన♦గాఢతమాసితధూమధూసరం
బను వచనంబుఁ దాఁ గడుగు♦పోలికఁ దోఁపగఁ జేయుచున్ నృపా!. 542

ఉ. భీతిని విస్మృతంబు లగు♦పేరునఁ బొల్చునపూర్వవర్ణముల్
ఆతతబాష్పబిందువుల♦వ్యాజమునన్ ద్రపతోడి స్వైరసం
ఘాతమునన్ వెలుంగురద♦కాంతులఁ గూర్చెడి నాఁ దనర్చు నా
భీతకురంగనేత్ర మదిఁ ♦ బేర్కొనఁ జేసెను నున్ముఖంబుగాన్. 543

ఉ. ఏమికతంబొ నే నెఱుఁగ ♦ నేర్పడ నాహృదయంబు నమ్ము నిన్
భామరో! పత్రలేఖ! విడి ♦ ప్రాణవయస్యల నెల్ల; నెవ్వరిన్
వేమఱు తిట్టుదున్; జెపుదు ♦ నెవ్వరి కన్యల కీతిరస్కృతిన్
నామదినుండుదుఃఖమును; ♦ నాతిరో! యెవ్వరితోడఁ బుచ్చెదన్. 544

శా. నీ కీదుస్సహదుఃఖభారమును బూ♦న్కిం దెల్పి యీప్రాణముం
బోకార్పం గలదాన నిక్కువముగాఁ ♦ బూఁబోఁడి! జీవంబుతో
వీఁకం జేయుదు సత్యమున్; వినుమ యీ♦వృత్తాంతమున్ నే మదిన్
జీకొన్నం గడుసిగ్గుఁ గాంతుఁ; బెఱలన్ ♦ జెప్పంగ నిం కేటికిన్. 545

చ. రజనికరావదాత మయి ♦ రాజిలువంశము నన్నుఁ బోలు నే
గజగమ చేయు నిందలను ♦ గందఁ గులక్రమసంగతత్రపన్
బ్రజఁ గనకుండ పీడు? కుల♦భామలకుం దగనట్టి యీపనిన్
నిజహృదయంబుఁ జొన్పెడిని ♦ నిందలకున్ గుఱి యౌచుఁ గుందెడున్. 546

చ. తలఁపదు తల్లి నన్నొసఁగఁ ♦ దండ్రి యొసంగఁడు పెద్ద లొప్పరున్
బిలువఁగ లేదు నేను బలి♦పింపఁగ లే దటు నాదునాకృతిన్
దెలుపఁగలే దనాథగతిఁ ♦ దేకువఁ జెందనిదానిఁబోలె నన్
దలఁచి నృపాత్మజుం డకట ♦ దార్చె ననున్ గురుగర్హణీయతన్. 547

క. సదమలనవబిసకిసలయ, మృదు వగుమద్ధృదయ మిట్లు ♦ మెదుపఁగ నగునే
యిది పెద్దలయాచారమొ, యిది ఫలమో పరిచయమున ♦ కెఱుఁగను జెపుమా.

సీ. అవని యువలకెల్ల ♦ నపరిభావ్యము గదా చర్చింపఁ గన్యకా♦జనము మిగులఁ
దఱుచుగాఁ దొల్తఁ గం♦దర్పకాగ్ని దహించుసిగ్గుచు; నావెన్కఁ♦జిత్తమునను
గుసుమేషుశరములు♦గోయునుఁ దోలుదొల్త వినయాదికంబును,♦బిదపఁ గులము
నవల నాచారంబు, ♦ నావెన్క శీలంబు, మమత నావెనుకను, ♦ మర్మములను
తే. గాన నడిగెద నిన్నొక్క ♦ కాంక్షితంబు
నీకు నెక్కుడుప్రియసఖు ♦ లెవరు నాకు
మాఱు మేనున నీదుస♦మాగమమున
మఱువ కీదగు నాకు నో♦మంజువాణి!. 549

ఆ. మేను వదలు టనెడు ♦ మేలుపాచితమును
నాచరించి నాదు♦నఘుషు లెల్లఁ
బాచికొందు నను చుఁ ♦ బలికి కన్నుల నీరు
నించి యూరకుండె ♦ నీరజాక్షి. 550

వ. అంత. 551

ఉ. నేనును సంగతిన్ దెలియ♦నేరమి సిగ్గును భీతి విస్మయం
బూనినయట్లు మోహమును ♦ నూనినపోల్కిని నిక్కువంబుగాఁ
బూని విషణ్ణనై చెపుమ ♦ భూధవపుత్రి! యెఱుంగఁ గోరెదన్
మానవనాథపుత్త్రుఁ డతి♦మానుషమానుఁ డదేమి చేసెనో. 552

చ. కలిగెను నేమి తప్పిదము ♦ కైరవకోమల మైననీమదిన్
గలఁప నసర్హముల్ గలఁచెఁ ♦ గామిని! యేయవినీతి; దాని నేఁ

దొలుతను నాలకించి విదు ♦ తుర్ సతి! ప్రాణము లీవు పిమ్మటన్
దలఁగు మటంచుఁ జెప్పఁగను ♦ దామరసాంబక మళ్ళి యిట్లనున్. 553

చ. విను మవధానతన్ వినుతు ♦ వీడి త్రపన్ బ్రతిఘస్ర మక్కటా
గనఁబడు సారెకున్ గలల ♦ గాఢవిచక్షణధూర్తుఁ డాతఁ డో
వనిత! యొనర్చు దూతికల ♦ పంజరశారులఁ గీరకంబులన్
బనుప రహస్యవార్తలను ♦ బల్కఁగఁ జాలను వానిచెయ్వులన్. 554

ఆ. నిదురఁ బోవు నాడు ♦ సదమలశ్రుతిదంత
పత్త్రగర్భములను ♦ వట్టికోర్కి
మోహితాత్ముఁ డగుచు ♦ మొనసి సంకేతిత
స్థానములను వ్రాయుఁ ♦ దగునె యిట్లు. 555

చ. అనుపును జెమ్మటన్ దడిసి ♦ యక్షరముల్ చెడినన్ నిజంబు సాం
జనపతితాశ్రుబిందువులఁ ♦ జయ్యన నాత్మదశన్ వచింపుచున్
ఘనతరమోహతృష్ణలను ♦ గన్పడఁ జేసెడుమారలేఖలన్;
దనయనురాగము న్నలఁదుఁ ♦ దద్దవదంబుల లాతునుంబలెన్. 556

తే. అవినయంబున నిశ్చేష్టుఁ ♦ డగుచు నఖర
బింబితుం డగుతనుఁ గాంచి ♦ ప్రీతిపాత్రు
ధన్యునిఁగ నెంచి ముఱియును ♦ దరుణి! యతని
చెయ్వు లెన్నని వివరింతుఁ ♦ జెప్పఁ దరమె 557

మ. ఎలదోఁటన్ విహరించు చొక్కదిన మే ♦ నేణాక్షి! యుండంగఁ జం
చలుఁ డీతం డట వచ్చెఁ; బట్టు ననుచున్ ♦ శంకన్ వడిన్ బాఱఁగా
నిలిపెన్ బయ్యెదకొంగు పట్టి చిగురుల్; ♦ నిట్టూర్చ నన్బట్టి యి
చ్చె లతాళుల్; త్రప మార్గ్గం బయినన్ ♦ జేర్చెన్ గవుంగింటిలోన్. 558

మ. స్తనసీమన్ లిఖియించుచున్ మకరికల్ ♦ దా వక్రశీలుండు నే
ర్పును మత్పాణికృతముగ్ధచిత్తమునకున్ ♦ బూఁబోఁడి కౌటిల్యమున్
గనుఁ జిత్తోత్కలికాతరంగపవమా ♦ నప్రౌఢులన్ శీతలా
ననవాతంబుల స్వేదవిభ్రమములన్ ♦ గండమ్ములన్ వీచెడున్. 559

ఉ. చెమ్మటఁ బట్టు తప్పి పడఁ ♦ జెందొవ పట్టికరంబుచేత ని
క్కమ్ము యవాంకురమ్ము లనఁ ♦ గ్రాలునఖాంశులఁ జేయుకర్ణపూ
రమ్ముల దుర్విదగ్ధుఁ డల ♦ రాసుతుఁ డింటియశోకభూమిజా
తమ్మును దన్న నెత్తుపద ♦ తాడన మందును దాను నాదలన్. 560

ఉ. వల్లభ బాల కేసరము ♦ పైఁ బులకింపఁగఁ గ్రోలి శీధువున్
మల్లవనంబునం దుమిసి ♦ మాటికిఁ ద్రావును గొప్పఁ బట్టి నన్
జెల్లరె! దుష్టమన్మథవి ♦ చేష్టితమూఢమనస్కు నేగతిన్
జెల్లెల! యడ్డగించెదను ♦ జెప్పుమ తోఁపదు నాకు నేమియున్. 561

సీ. ఈసుగా భావించు ♦ నింతి! నిరాకృతిఁ; బరిహాస మని నిందఁ ♦ బరిగణించు
మాటాడకుంటయు ♦ మానం బని తలంచు; నపవాదమును గీర్తి ♦ యనుచుఁ దలఁచు
నవమతి నెంచును ♦ నప్రతిహతమైన ప్రణయమంచును; దోష ♦ వర్ణనమును
స్మృత్యుపాయం బని ♦ చింతించు; దోషముల్ గుణములుగా మదిఁ ♦ గోరు నకట

తే. యేమి సేయుదు నిప్పుడు ♦ నెటుల వీని
తులువతనముల నెల్లను ♦ దొలఁచు దాన
విన్న నెవ్వరైన గతి యేమి ♦ సన్నుతాంగి!
కన్న నింకేమి చెప్పంగఁ ♦ గలను జెపుమ. 562

తే. అనుచుఁ జెప్పెడు నాయమ ♦ నట్టె గాంచి
మదిని హర్షంబు నుద్వేల ♦ మగుచుఁ దనర
నాఁపుకొనలేక మది నిట్టు ♦ లనుకొనంగఁ
దొడరితిని రాజచంద్రము! ♦ తోడుతోడ. 563

క. చంద్రాపీడునిమిత్తము, పేంద్రతనూభవుఁడు దీనిఁ ♦ బెంపఱఁ జేసెన్
సాంద్రాశుగచయముల ని, స్తంద్రగతిన్ బరపి యరరె ♦ దారుణుఁ డగుచున్.

క. మదిరాతనూజ నెపమున, మదనుమనోవృత్తి యింత ♦ మమత గలదిగాఁ
బొదలిన మాయేలికపైఁ, బదివే లరుదెంచె మాకుఁ ♦ బండెఁ దపంబుల్. 565

సీ. సాదరవర్ధిత ♦ సహజగుణంబులు సలిపెఁ బ్రత్యుపకృతి ♦ త్ర్యాధవునకు
దెస లెల్ల నీతని ♦ దివ్యయశంబునఁ గడువళక్షములయి ♦ గ్రాలు మిగుల
రతిరససాగర ♦ రమ్యవీచులు రత్నవర్షంబు గురిసె నీ ♦ ప్రభువుపైన
శశియందు యౌవన ♦ సద్విలాసంబులు వ్రాయు నీరాట్పుత ♦ వరుని పేరు

ఆ. నిందుకళలువోలె ♦ నితనిపై లావణ్య, మమృతవృష్టి కురిసె ♦ నధికముగను
నాత్మలక్ష్మి మెఱసె ♦ నమలసౌభాగ్యంబు, సర్వ మమరె మాకు ♦ స్మరునివలన.

చ. అమరె విధూదయంబునకు ♦ నర్హతమం బగు వేళ నేఁటికిన్;
సమకుఱె లేఁత తెమ్మెరకు ♦ సత్సమయంబును; నర్హలాభమున్
సమకుఱెఁ జైత్రమాససుమ ♦ సంపదకున్; గనియెన్ సురాకసా
ఘము సుగుణత్వ మాననము ♦ కామయుగాగమనంబు చూపెఁ బో. 567

తే. అని మనంబున ననుకొని ♦ యంత నవ్వి, వెలికి నిట్లని యంటి నా♦వెలఁదితోడ
దేవి! యిటులైనఁ గోపంబు♦దిగిడి వైచి, క న్మిఁకఁబ్రసన్నబిత్తవో♦కాంత! నీవు•

ఉ. మారుఁడు తప్పుచేయ నిటు ♦ మానిని దేవర మూఱఁ బోలునే
క్రూరసుమాస్త్రుచెయ్వు లివి ♦ కోమలి! రాట్నుతు వేల యెయ్యెడుఁ
సారసగంధి! యూఱడిలు ♦ చాలు నటం చనఁ గౌతుకంబునన్
మారుఁ డటంచుఁ జెప్పితివి ♦ మారుఁ డనంగ నెవండు చెప్పవే. 569

తే. అతఁ డేరూపమున నుండు ♦ నతివ! చెపుమ
యనవు డామెకు నిట్లంటి ♦ నధిపతనయ!
యెక్కడిది రూప మతనికి ♦ నేణనయన!
యతనుఁ డైనధనంజయుం ♦ డతఁడు దేవి!. 570

సీ. కలిగించుఁ దాపంబుఁ ♦ గానుపింపక శిఖాకాండంబుల నతండు ♦ కంబుకంఠి!
గాఱించు కన్నీటి♦కాల్వలఁ బెల్లుగ వెలువుచ్చకయ ధూమ♦విసరములను
నావిర్భవింపించు ♦ నంగపాండిమమును గనుపింపకయ భస్మ♦కణచయంబు
దహియించు దేహంబు ♦ దారుణవృత్తిని దాయక దూరంబు ♦ తలఁగి యున్నఁ
తే. త్రిభువనంబుల నాతని ♦ తీవ్రబాణ, ఘాతమునకు శరవ్యంబు♦గాని ప్రాణి
గలుగదిప్పుడుమును లేదు♦గలుగఁబోదు, నెవఁడుభయపడఁడితనికి♦నింతి! చెపుమ.

వ. మఱియు. 572

సీ. జ్యామండలంబెల్ల ♦ సంకుచితోర్వియాఁ బ్రియునియాకారంబుఁ♦బ్రేమ వ్రాయ
గగనమండలముసం♦కటమానుఁదలఁపులఁ బ్రియముఖేందుసహస్ర♦వితతిఁగాంచఁ
గాల మల్పంబయి ♦ గానుపించును దేవి! ధవసమాగమసుఖ♦తతినిఁ దలఁప
సంఖ్యయు నల్పమై ♦ సతి! కనంబడియెడుఁ గాంతుగుణంబులు♦గణన సేయఁ
తే. వినఁగ; నీపెనుభ్రాంత యా♦వేళ మయినఁ
గాంతలకు నెల్ల నేమందుఁ ♦ గంజనేత్ర
పెక్కుమాటాడ దీ వాణి ♦ ప్రియునికథలఁ
గుసుమచాపంబు ధరియించి ♦ కులుక నితఁడు. 573

చ. అన విని నాదుపల్కుఁ ♦ మారసి యిట్లను బత్రలేఖ! నీ
వనినవిధం బొనర్చెఁ గుసు♦మాయుధుఁ డీజనముల్ నృపాత్మజా
తునివయిఁ బడుపాతమునఁ ♦ దొయ్యలి! యేయవి వీనిరూపులం
చనితివా నాయెడన్ గలుగు ♦ నయ్యవి వానికి నెక్కుడుల్ గదా. 574

చ. మదికి నభిన్నవై తివుడు ♦ మానిని యగ్గైన నిన్నె యీయెడన్
గుదు రగు నాకు నద్ది యది ♦ గోరి వచింపవె. యిట్టివార్తలన్
గదిసి యెఱుంగ నెన్నఁడును; ♦ నాతలిదండ్రుల లోకనిందలన్
గదురఁగఁ జేసి లజ్జఁ గడుఁ ♦ గాంచెదఁ బ్రాణము లేల నా కిఁకన్. 575

తే. జీవితముకంటె మరణంబె ♦ శ్రేయ మనుచుఁ
దలఁచు నామది యది గాదె ♦ తగును నిప్పు
డనెడు నాసతిఁ గని యిట్టు ♦ లంటి మగుడఁ
జాలుఁ జాలును నామాట ♦ నాలకింపు. 576

చ. మరణముచేత నేమి యగు ♦ మానిని! యూరక సేవ లందకే
వరము నొసంగె నున్మథుఁ డ♦పారదయామతి; నీకు నున్నదే
గురజననింద యీయెడను; ♦ గోమలికిన్ దగువానిఁ గూర్పఁగా
స్మరుఁడు తలంచు నొజ్జగతి; ♦ సమ్మతి సేయును దల్లిపోలికన్. 577

వ. మఱియు. 578

చ. జనకునిపోల్కి నిచ్చుఁ; జెలి♦చాడ్పున నుత్కలికం జనింపఁ జే
యును; నుపమాతచందమున ♦ నుజ్జ్వలయౌవనకాలమందు నే
ర్పును రతివిభ్రమంబుల; స♦రోజముఖి! యిఁక భీతి యేటికే
వినవొకొ తామె భర్తలను ♦ వే వరియించినవారిఁ గొందఱన్. 579

చ. ఇది తగ దేనియున్ విఫల ♦ మేనియుఁ గన్యల కేల శాస్త్రముల్
వదరు స్వయంవరంబువిధి ♦ వారిజలోచన! తేరు మింక నీ
పదములఁ బట్టి వేఁడెదను ♦ బ్రాణము వాయుక దంక మానుమా
యిదె కొని తెత్తు నీప్రియుని ♦. నేగెద నిప్పుడె వత్తు వేగమే. 580

చ. పనువుము నన్ను నీప్రియుని ♦ పజ్జకు నేమి వచింతు చెప్పుమా?
యన విని చూడ్కి హర్షమున ♦ నార్ద్రముగా ననుఁ ద్రాగుపోలికన్
గనుఁగొని నడ్డగించినను ♦ గామశరాహతి జర్జరత్రపన్
మునుకొని వ్రచ్చి దారిఁగొని ♦ మూఁకలుగాఁ జనురాగలీలలన్. 581

ఉ. ఆకులితాత్మనై ప్రియుని♦హర్షవచశ్శ్రవణోత్సవంబునన్
సోఁకినచెమ్మటన్ దడిసి ♦ శోభిలువయ్యెద నెత్తి పుల్కలన్
వీఁక ధరించునో యనఁగఁ, ♦ బ్రేంఖితకుండలపద్మరాగప
త్త్రైకశిఖాగ్రలగ్నమయి ♦ యాసతికంఠమునున్ బిగింపఁగా. 582

ఉ. మారుఁడు వైచినట్టిమృదు • మారణచంద్రకరాత్మపాశమా
హారముఁ జక్కఁదీయుచుఁ, బ్ర • హర్షమదంబున విహ్వలాత్మతన్
గూరియుఁ గన్యకాజనులఁ • గూడ జనించిన లజ్జ యూఁతయై
మీఱఁగ మెల్లమెల్ల విను • మీ యని దిక్కులు చూచు చిట్లనెన్. 583

మాలిని. కరకలితకురంగా! • గాంగభంగోత్తమాంగా!
కరుణలసదపాంగా! • కామభస్మోజ్జ్వలాంగా!
నరహరిమదభంగా! • నందిరాజత్తురంగా!
కరివరదవిహంగా! • కామినీచిత్తభృంగా!. 584

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీవేరమాంబాత్ర్యంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైనశృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము సంపూర్ణము.

పూర్వభాగము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. శ్రీ. శ్రీ. శ్రీ.

ఓం తత్సత్.



శ్రీః

శ్రీరామ స్సహాయోఽస్తు

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగార కాదంబరి

## ఉత్తరభాగము

### ప్రథమాశ్వాసము.



క. శ్రీకరశుభకరనామా!
పాకారిప్రముఖవిబుధ • భావితధామా!
ప్రాకటమహిమోద్దామా!
నాకారిప్రచయభీమ! • నయగుణధామా!. 1

వ. దేవా! అవ్వలికథావృత్తాంతంబుఁ జెప్పెద. దయాయత్తమతి నవధరింపుము. అట్లు పత్త్రలేఖ యడుగుటయుఁ గాదంబరి హర్షోత్తరంగితాంతరంగయయి యల్లన నిట్లనియె. 2

#### కాదంబరీ సందేశము.

చ. ఎఱుఁగుదు నీకు నాపయిని • నెక్కుడుప్రీతి చెలంగు నంచు న
త్తెఱఁగున నంతధైర్య మరు•దెంచు శిరీషసుమంబుపోల్కి నే
డ్తెఱ మృదులస్వభావ లగు•తీవియఁబోఁడుల; కందు బాల్యముల్
గొఱలినకన్యకాజనుల•కుల్ మఱి చెప్పఁగ నేల నెచ్చెలీ!. 3

ఉ. కొందఱు భామ లేగుదురు • కోరి స్వయంబుగఁ జెప్పి పుత్తురుల్
కొందరు సిగ్గు నెగ్గు మదిఁ • జెప్పుదు నే మని వారిసాహసం
బందెద సిగ్గు సాహసము • నంది స్వయంబుగఁ జెప్పిపంపుచుల్
సుందరి! బాల నే మెఱుఁగఁ • జూడక ముందును వెన్క నక్కటా. 4

ఉ. ఏ మని చెప్పి పంపుదును • నిత్తఱి నాతని కేను జెప్పుమా
యేమిగఁ దోఁచునో యతని • కేమనినన్ గట పౌనరుక్త్యమా
స్వామి! యతిప్రియుండ వన; • వారవధూలపితంబు నీవయిన్
బ్రేముడి యెక్కు డన్న; జడ•పృచ్ఛ ప్రియాత్మను నీకు నే నన్.

సీ. నినుఁ బాసి బ్రతుక నే♦ననుటయు ననుభవమునకు విరోధమై♦ముదిత! తోఁచుఁ
బరిభవించెడు నన్నుఁ♦బంచబాణుండంట యాత్మదోషోద్ఘాట♦మగునుదలఁప
ననవిల్తుఁ డొసఁగె నీ ♦ కనుటయు మెల్లఁగ దగ్గఱఁ జేరంగ ♦ దగిన వెరవు
బలవంతముగ నిన్నుఁ ♦ బట్టెన ననుటయు బంధకీధార్ష్ట్యమై ♦ పరిణమించు

ఆ. నరుగు దేవలయు ♦ నత్యవశ్యం బిట
కనుట భాగ్యగర్వ ♦ మాచుఁ దోఁచు
నేనె వత్తు నంట ♦ నెలఁతలచపలతఁ
గానుపించు ఔను ♦ గంబుకంఠి!. 6

వ. మఱియు 7

చ. పరిజన మీయ దింకొకరి♦పై ననురక్తము గాద టంటయుఁ
బరఁగును నాత్మభక్తిపరి♦పాటిని వేదనలాఘవంబుగాఁ
గరము నిరాకరించు నను♦కాతరతఁ మఱి చెప్పపంపకుం
టరయఁగ మేలుకొ ల్పవును ♦ నప్రతిబుద్ధునకుం దలోదరీ!. 8

చ. కనెదవు నాదు కూరిమిని ♦ గాయము వాసినవెన్క నంటయుఁ
గనఁగ నసంభవంబ యది; ♦ కాంచి వియోగము మేనఁ బ్రాణముల్
గనెద నటన్న దుఃఖమునఁ ♦ గాలెద నంటయుఁ దోఁచు నెక్కు డొ
ప్రణయముగాఁగ; నే మనుచుఁ ♦ బంపుదు నింక వచింపుమా సఖీ! 9

వ. ఇది యట్లుండె మఱియు. 10

క. *కొనివచ్చిన నాతని నిట, ఘనతర తారళ్యమునను ♦ గడులజ్జితమై
కననీయదు సిగ్గే నను, గనుఁగొనెదు వృథాశ్రమంబుఁ ♦ గంజదళాక్షీ! 11

సీ. పంచబాణవికార♦బాధావిలక్షుమావై లక్ష్య మే ముందు ♦ పడదు నిలువ
నప్రతిపత్తిభ♦యంబున జడమైన జడతయే డాయంగఁ ♦ జనదు వాని
స్వయముగ డాయంగఁ ♦ జన లఘు వగు లాఘవంబె తత్ప్రతిపత్తి♦పరఁగనీదు
బలవంతముగ వానిఁ♦బట్టితెచ్చినదోషమునకు వెఱచు వెఱ♦మొనయ దెదుర

తే. వ్యర్థము లివన్ని నన్నెట్లు ♦ వానిఁ గూర్తొ
యదియె మదనుగ్రహంబుగ ♦ నతివ! తలఁతు
జన్మసాఫల్య మగు నెట్లు ♦ సకియు లెల్ల
గేలికొనకుండఁ జూడుమా ♦ కీర్తిఁ గనుమ. 12

* ఇక్కడినుండి భూషణభట్టుకవిత్వమున కాంధ్రీకరణము

సీ. గురుజనాపత్రపఁ ♦ గూరుటనో రాజకార్యానురోధముల్ ♦ గలుగుటలనొ
సుహృదాననాబ్జంబుఁ ♦ జూచుటనో జన్మభూమిపైఁ బొడమిన ♦ ప్రేమముననొ
తనగృహంబుననున్కి ♦ తమినొ తామగుడ రాఁగూరు ఖేదము పాపి ♦ కొనెడుమదినొ
చిరకాలమునకు నీ ♦ క్షించినబాంధవజనముల విడిచి రా ♦ నైఁపమినినొ

ఆ. యీజనంబుపైన ♦ నిచ్చ లేకుంటనొ
చరణములను వ్రాలి ♦ సకియ! నీవు
వేఁడుకొన్న నతఁడు ♦ వెడలి రా కుండినఁ
జెప్ప నేల నాదు ♦ జీవితంబు. 13

చ. వికచదళారవిందమధు ♦ బిందుసుగంధవహుండు గంధవా
హకుఁడు సమస్తదిక్కులకు ♦ హర్షముఁ గూర్చు ప్రదోషవేళ ద
ర్పకుఁడు స్ఫుటోల్లసత్కుసుమ ♦ వాసన భాములమానగ్రంథులన్
బ్రకటగతిన్ వదల్పు శశి ♦ పాండుకరంబుల వెన్నెలన్ జడిన్. 14

చ. కురియఁగఁ జంద్రకాంతమణి ♦ కూటము లిందుకరంబు లంటుటన్
గరఁగి ఝరంబులై దొరఁగ ♦ గాఢరవంబుల మ్రోఁగు కేళికా
గిరికటకస్థచక్రములు ♦ గీడ్వడఁ జెన్విరహానలంబుచేఁ
దిరుగఁగ వెన్నెలల్ మెసవి ♦ తీఱనికూర్మిఁ జకోరదంపతుల్. 15

సీ. మధుమదముఖరిత ♦ మధుకరకులకలకలకలారావసం ♦ కులభరంబు
విరహిజనస్వాంత ♦ వేదనాకరకోకకోకస్తనీదీన ♦ కూజితంబు
భాసురసుమసార ♦ భాకులదశదిశాభాగంబు శీతలా ♦ వాసకంబు
సర్వసర్వంసహా ♦ సౌందర్యసందోహభూతంబు శశికాంత ♦ భూషితంబు

తే. నయిననీహారగృహమందు ♦ నతని కేలు
తగిలినసుఖంబుచేత స్వే ♦ దంబు గ్రమ్మ
ననఁగను హరిచందనరసా ♦ భ్యంచితోరు
మహితముక్తాశిలాపట్ట ♦ మంచమునను. 16

ఉ. భామిని! పువ్వుశయ్యపయిఁ ♦ బర్ణము లెల్లను రేఁగఁ దావు లా
శాముఖసీమలందు వెద ♦ చల్లెడుకైరవిణీతటంబునం
దీమను జేశసూతి గన ♦ నెవ్వతె నా మదిరాతనూజ నే
నే మధికంబు నాకు నిపు ♦ డేర్పడ ముందటికంటెఁ జెప్పవే. 17

వ. మఱియు. 18

చ. కనఁబడె వేని కీమనుజ ♦ కాంతకుమారుఁడు తొల్త నెవ్వి వా
నిని గనఁగోరు వాకనులు ♦ నిచ్చలు నీయవి, యవ్వియే గదా;

యొనరుప నేమియుం దెలియ ♦ కూరక యుత్తల మందు నీమనం
బును నదె లోనఁ జొచ్చినను ♦ బూనఁగఁ జాలదొ యెద్ది నెచ్చెలీ!. 19

సీ. అదె యీశరీరంబు ♦ నాతనియొద్దను నూరక చిరకాల ♦ ముండె నేది
యదియె యీ కేలును ♦ నమృతగురుల కోడి చేసెఁ దన్గొనకుండఁ ♦ జెనఁటియేది
యతఁడె చంద్రాపీడుఁ ♦ డనపేక్షితాన్యార్తివారద్వయం బుండి ♦ పఱచె నెవఁడు
పరపి నాపయి క్షీణ ♦ బాణుఁ డాటను నొడ్ల నే మొనర్పనిపూవు ♦ టేటెకాఁడు

తే. నతఁడె యెవ్వని నటమటీఁ ♦ డనుచు సకియ!
పెక్కుభంగుల వర్ణించి ♦ పెద్దసేపు
పెక్కుకార్కాణములతోడ ♦ నక్కజముగఁ
జెప్పితివి నీవు నింకేమి ♦ చెప్పుదాన. 20

ఉ. నీ విటు కుందుచుండ నెద ♦ నే నొనరించుకొన న్వివాహ మం
చావిధిఁ జేసితిన్ ప్రతిన ♦ హంసతనూభవతోడ నామెతో
నే వచియించితిన్ మఱియు ♦ నిర్మలమానస యామె యిట్లనెన్
దేవి! యొనర్ప కిట్లు మదిఁ ♦ దెంపు వహింపకు మాను మి య్యెడన్. 21

క. అతిదారుణుఁ డీమదనుం, డతిపాపుఁడు ప్రియజనంబు ♦ లగపడ కున్నన్
దతజనితహృదనురక్తిని, గుతిలపడన్ బ్రాణములను ♦ గొనును నొకప్పున్. 22

క. అనుచు వచించెను లే దది,యును నాకును నంతభాగ్య ♦ మొదవు టెటు కృపా
మన మూనె నిష్ఠురుండగు, ననవిల్తుఁడు నేమియుందు ♦ నాభాగ్యంబున్. 23

చ. మదనుఁడొ దైవమో మదమొ ♦ మానిని! యీవిరహంబొ కూర్మియో
హృదయమొ యౌవనంబొ మఱి ♦ యేదొ యెఱుంగను నాకు నిచ్చ నా
మదనసమున్ గుమారకుని ♦ మాన్యుని ధ్యానమయున్ విచిత్రమా
నెదురుగ నున్న నందఱును ♦ నేరికి సిద్ధునియట్లదృశ్యుఁ డై. 24

చ. సతతము దర్శనం బొసఁగు ♦ సారెకు నాకు; నతండువోలె నీ
క్షితిపతిసూనుఁ డున్నటుల ♦ స్నిగ్ధజనంబుల నిష్ఠురాత్ముఁడై
వెతఁ గుదుపందు వీడి చని; ♦ వీఁడు భయంపడు నావియుక్తికిన్
క్షితికి మగండు గాఁ డితఁడు; ♦ చేరఁడు భారతిచెంత కెప్పుడున్. 25

చ. పగలును రాత్రియున్ గమల ♦ పజ్జ నెలంగఁడు; కీర్తి వర్ధిలన్
వగవఁ డహర్నిశంబు నిలు ♦ వంబడియున్నను గూరుచున్న ని
ద్ర గదిరినన్ మెలంకువను ♦ దార్కొనుచున్నఁ జలించుచున్న నా
కగపడుచుండు మూసినను ♦ నక్షియుగంబు గలం బరుండినన్. 26

సీ. శ్రీమండపంబున ♦ సెజ్జను గృహమున భవనదీర్ఘికలను ♦ బద్మినులను
కేళికావాపులఁ ♦ గ్రీడాచలంబుల దివ్యబాలాపగా♦తీరములను
బ్రమదావనంబున ♦ బాలోపవనములఁ బ్రాసాదశిఖరాగ్ర♦భాగములను
లలితలతాజాల♦కలితకుంజంబుల భవ్యోరుసుమవన♦వాటికలను

ఆ. నిచట నచట ననుచు ♦ నింతి! చెప్పఁగ నేల
కాంతు నతని నెల్ల ♦ కడల మూఢ
జనవిడంబనైక♦చతురుఁ జంచలశీలుఁ
జెప్ప నేల యింకఁ ♦ జెపితి నెల్ల. 27

ఉ. కావున వాని నిచ్చటకుఁ ♦ గైకొని వచ్చెద వార్త మానుమీ
నీ విఁక నంచు నన్నానని♦నిర్భరమూర్ఛను గాంచె నాఁగ నా
భావజునాశుగం బవుడు ♦ పక్ష్మశిఖాసముపిండితంబులై
వావిరి బాష్పముల్ దొరఁగ ♦ వారిజనేత్రయుగంబు మూసి తాన్. 28

ఉ. వేదివితానమధ్యమున ♦ విస్ఫుటదామపటంబు నూఁతగా
నూఁదినదోర్లతన్ ముఖ మ♦నూనమనోజ్ఞజలప్రసూతయా
బోదమృణాళి నంబుహతిఁ ♦ బొందినకోకనదంబుచాడ్పునన్
బాదుకొనంగ; లోఁ గినుక♦పారముగా నటె మిన్నకుండెఁ బో. 29

క. కలిత యుత్పీడిత నాఁ, గ్రాలుచు ద్రవ మయినమాడ్కి ♦ రాజిలుచుఁ గడున్
దాలిచి మానము లోపల, జాలిం గను బాలఁ గాంచి ♦ స్వాంతమ్మున నే. 30

వ ఇట్లని తలంచితిని. 31

తే. తలఁప సంకల్పమయుఁ డగు ♦ ధవుఁడె విప్ర
లంభినుల కెల్ల జీవితా♦లంబనంబు
నిక్కము కులాంగనల కందు ♦ నెక్కుడుగను
గన్యకలకు విశేషించి ♦ గా ధరిత్రి. 32

సీ. పదములపైఁ బడి ♦ బతిమాల దూతికఁ బనుపఁగాఁ బని లేదు ♦ ప్రతినిమేష
మెన్నిసార్లైనను ♦ నిచ్చఁగలయవచ్చు నిచ్చ వచ్చినయట్టు ♦ లేగవచ్చు
నెప్పుడైనను; రతి ♦ నెడలదు కన్యాత్వ మారతిఁ జనుదోయి ♦ యాఁకవలనఁ
గలుగుదుఃఖము లేని♦గాఢపరిష్వంగ మలవడు నఖదంత♦హతులవలనఁ

తే. గలుగువ్రణములఁ గని సిగ్గు ♦ గాదు చికుర
పాళి చెదరనికుంతల♦పాశమహహ

లస్వననిధువనంబులు ♦ నలరుచుండు
నితనితోఁ గూడి క్రీడించు♦నింతులకును. 33

క. కనఁబడ వధరక్షతములు, కనినఁ గురుజనము లెవరు ♦ గల్గు ననుచు భీ
తిని సంకోచంబును నటు, గనఁగాఁ బని లేదు విరహా♦కాతర్యంబున్. 34

క. అని తలఁచుచుండ నేను మ, దనురాగకథారసంబు♦నం దాప్లవమున్
గనె నన నరుణం బాయెను, దిన మట రవిమండలంబు ♦ దిగె పడమరకున్. 35

క. అనుపదమున మదిరాసుత, యనుపమరాగప్రపూర్ణ♦మగుహృదయంబున్
గని సిగ్గునఁ బరువిడె నన, జనె రవిబింబంబు వేగ ♦ త్ర్యావతితనయా!. 36

ఆ. రాత్రి పఱచె సాంధ్య♦రాగపల్లవశయ్య
యామినీముఖంబు ♦ యామినీశ
కాంతతల్ప మంతఁ ♦ గల్పించె సేవకు
పగిదిఁ గథువినీతి ♦ పరఁగ నధిప!. 37

వ. అట్టియెడ బాలికాసహస్రంబులు నిశ్శబ్దంబుగ స్వస్వనియోగంబు లనుష్ఠింపుచు గంధతైలావసిక్తంబులై సురభిగంధోద్గారంబు లౌనర్చుదీపంబులఁ దాల్చి యే తెంచి దూరంబుగ మండలాకృతిన్ నిలువంబడుటయు. 38

మ. తనలావణ్యమునందు బింబితములై ♦ తారొ్ కన్నతద్దీపికా
వనముల్ దేహవిలగ్నమారవిశిఖ♦జ్వాలావళుల్ నాఁ గడున్
దనరన్ సంతతనవ్యకోరకములన్ ♦ సంఘన్న మైనట్టికాం
చనవల్లీగతి నొప్పుచానఁ దదవ♦స్థం గాంచి యి ట్లంటి నేన్. 39

చ. మనముఁ గలంచుతాపమును ♦ మానిని! గై కొన నీకు నర్హ మే
గనుము ప్రసన్నతన్ దొలఁగు ♦ గాటపుఁగోపరయంబు నే నిదే
చని యెద నాన్నృపాత్మజుని♦సన్నిధికిం గొనివత్తు నిప్పుడే
తనువు ని టుల వంతలకుఁ ♦ దార్చెదు కష్టము లోర్వఁ జాలు దే 40

చ. అనుటయుఁ దావకాహ్వయస♦మంచితమద్వచనంబుచే విషా
పనయనమంత్రయుక్తి విమ♦భావితమూర్ఛయుఁ బోలె నప్పుడే
కనుఁగవ విచ్చి నన్నుఁ గని♦కాంతులు పైకొన నెవ్వఁ డిచ్చొ నం
చును బరివారముం బిలిచెఁ ♦ జూడ్కుల వేడ్కలు తొంగలింపఁగన్. 41

సీ. ధవళాంశుకంబులఁ ♦ దాల్చి ద్వారంబున సంకుచితాంగులై ♦ శంక నున్న
జమదగ్నిసుతశర♦శ్వభ్రనిర్గతరాజహంసపంక్తులు నాఁగ ♦ నలరుకన్య

లంసభాగమ్ముల ♦ నలరుమౌక్తికకుండలాంశువుల్ చామర ♦ లట్లు తనర
నానతిం గొన వడి ♦ నరుదెంచు నాం బతత్కర్ణికకిసములై ♦ గ్రాల శ్రుతులు

తే. కమ్రకలహంసకకలాప♦కలసినాద
ములను బ్రతిశబ్ద మిచ్చునాం ♦ జెలంగం జరణ
కటకములు; కుండలము లూంగ ♦ గండపాళిం
బరుగువాఱుచు వేవురు ♦ వచ్చి రంత. 42

వ. అట్లు వచ్చి. 43

తే. దేవి! 'ఆజ్ఞాపయ' యటంచుం ♦ దిన్నందనము
గదుర నిజముఖపద్మంబుం ♦ గనుచు వారు
నిలువంబడి యుండ నాజ్ఞకై ♦ నీరజాక్షి
మోలిం గాంచుచు వారిని ♦ నూర కట్టె. 44

తే. పండి పచ్చలరాతిన్న♦పైని నన్నుం
గాంచి యిట్లనెం బ్రియ మని ♦ కాదు చెలియ!
చెప్పెదను నీకు నినుం గని ♦ జీవితంబుం
దాల్చెదను బత్త్రలేఖ! నేం ♦ దథ్యముగను. 45

తే. అయిన హారపట్టి తేని నీ ♦ వబ్జవదన!
నలువు నీకోర్కి సాధింపు ♦ పలుక నేను
ననుచు నీభూషణంబులు ♦ నంశుకాంగ
రాగతాంబూలభూషణ♦రాజి నొసంగి. 46

తే. అచ్చుపడంగ ననుగ్రహం ♦ బతిశయముగ
ననిపె నాయమ నీయొద్ద ♦ కనుచుం జెప్పి
వాంచి యుంచుక మస్తమా♦పత్త్రలేఖ
మరల నిట్లనె మెల్లన ♦ మనుజనాథ!. 47

ఉ. దేవివినూత్నసాతిశయ♦దివ్యదనుగ్రహ మింత గల్గ సం
భావితనైననేను నల ♦ భామినివంతిం గనంగం జాలమిన్
దేవర! విన్నవించెదను ♦ దేవరయున్ దదవస్థ జేవినిన్
భావమునం దలంప కిటు ♦ బారికి నగ్గము చేయు టొప్పునే. 43

చ. చనునొకొ దీనవత్సలత ♦ సద్యశ మందినయట్టినీసభా
మున కిది యుంచు నాతలియం♦బోండి వచింపంగ నత్తిపొద్చుచున్
దను నటు లాస్యపాత్త్రజుండు ♦ దద్దయు స్నేహరసప్రపూర్ణమై
తనర గభీరమై మిగులం ♦ దాపముం గోపముం గూర్చు చెంతయున్. 49

సీ. సానురాగంబును ♦ సాభ్యర్థనంబును సప్రసాదంబును ♦ సస్పృహంబు
సాభిమానంబును ♦ సావహేళనమును బరిహాసస హితంబు ♦ భావయుతము
సాత్మార్పణమ్మును ♦ సావధారణమును ని ర్వేదసహితంబు ♦ నిస్తులంబు
సాకర్షణంబును ♦ సాభ్యసూయంబును సంస్తవావష్టంభ ♦ సంయుతంబు

ఆ. నగుచు మధుర మయ్యు ♦ నశ్రవణీయంబు
సరస మయ్యు శోక ♦ సంగతంబు
మృదుల మయ్యు బిరుసుఁ ♦ గదిరి వినమ్రంబు
నయినదానిపలుకు ♦ నాలకించి. 50

చంద్రాపీడుఁడు పత్రలేఖ కనుతాపోత్తరం బొసంగుట.

చ. కని కని దుర్భరవ్యథను ♦ గాఱెడునశ్రుల నాప్లుతంబులై
తనరుకశాలనేత్రములఁ ♦ దాల్చినతన్ముఖ మట్టె నిశ్చలే
క్షణముల ధీరుఁ డయ్యు సహ ♦ జంబుగ నిల్పఁగ లేక చిత్త మా
మనుజవరేణ్యపుత్త్రుఁడు స ♦ మాకులమానసుఁ డయ్యె నెంతయుఁన్. 51

వ. మఱియు. 52

సీ. మదిరాతనూజాత ♦ మయినుండి యాలాపపదములతోఁ గూడి ♦ వచ్చె నన్గ
నొకసారిగ నతని ♦ యుల్ల మందెను గిన్క చేరెను గంఠంబు ♦ జీవితంబు
నధరపల్లవమును ♦ నాక్రమించెను గంప మానసం బందెను ♦ నాశ్వసితము
నాసాగ్రమందుని ♦ వాసంబు చేసెను స్ఫురితంబు; బాష్పముల్ ♦ చొచ్చెఁగనుల

తే. నెల్లవిషయంబులను నామె ♦ నెనసి యంత
సంప్రవద్బాష్పవిక్షేప ♦ సరణి వ్యాకు
లాత్ముఁడుం డయి గట్టిగ ♦ నాతఁ డిట్టు
పలికె జలధరగంభీర ♦ ఫణితి నృపతి!. 53

క. శృంగారరత్నంబుల, సంగతి కాదార్యుఁడై న ♦ స్మరుఁ డీతం డీ
యంగనచే నేమేమియుఁ, బొంగుచుఁ జేయించెఁ బెక్కు ♦ పోకల నాకై. 54

ఉ. వానిని నెల్లఁ జేయుఁ దనఁ ♦ బండితుఁగా మది నెంచి యింతయే
జ్ఞానము లేకయుండినను ♦ జ్ఞాని నటంచును దుర్విదగ్ధ మై
పూనుచు దుష్టశిక్షలను ♦ బుద్ధియు దుష్టము గాఁగ నష్టు కె
ద్దాని నలీకధైర్యమును ♦ దాల్చినవెంగలి డెంద మిద్ది దాన్. 55

చ. ఒనరుప నేను నేమియును ♦ నుల్లములోనివికారజాలముల్
గనఁబఱపంగ, మన్మథుఁడు ♦ కాంతను సల్పఁగఁ జేసె వేని వా

నిని మును చూడమిన్ రుచిర♦నీరజనేత్రకు నట్టిరూపు పెం
పున కనురూపమై తగున♦పూర్వవిలాసము లుండు నంచు నేన్. 56

చ. మనమున నెంచుటన్ మతియు ♦ మానిని! తాదృగదృష్ట మూన భా
జనమును గాను నే ననుచు ♦ సల్పుట భావన నవ్వె యెల్ల నా
వనితకుఁ దోడఁబుట్టు లని ♦ వారనిసందియ మంద నన్నుఁ జే
సినహతమానసంబె ననుఁ ♦ జేసెను ద్వత్కృతఘోరనిందకున్. 57

ఉ. దేవిఁ గలంచుచుండు నల ♦ తీవ్రతరవ్యథకుం గతంబుగాఁ;
బావనచిత్త! నా దయిన♦పాపము గల్గునె యిందు లేశ మే
భావనసేయుదున్ మదిని ♦ బాయక మానసమోహకారియై
తాపసమాన్య మైనయొక♦దారుణశాపమె యీయ దంచు నేన్. 58

క, అదిగాక యున్న దేనను, బొదలదు సందేహ మప్ర♦బుద్ధులకును నా
హృదయభవుచిన్న లెదురుగఁ, బొదలఁగ నాబుద్ధి యెట్లు♦మోహముపొందున్.

చ. కలుగును నెవ్వ యొందుమెయిఁ ♦ గన్పడ నెవ్వ సుసూక్ష్మవృత్తులై
యల చిఱునవ్వు చూపులును ♦ నాసరసోక్తులు నావిలాసముల్
లలితవిహారముల్ రుచిర♦లజ్జయుఁ జేష్టలు నింక నెన్నియో
కల వవి యుండ నిమ్మటుల ♦ గాటపుఁగూర్మిని నాత్మకంధరన్. 60

చ. వదలక యెన్నినాళ్లుగనొ ♦ వాస మొనర్చెడు తారహారమున్
వదలిచి యాత్మకంఠము న♦భాగ్యని నామెడ వైచె నప్పుడే
విదితము కాదె దీన నళివేణి మ♦నోంబుజభావ మెంతయోన్
విదితమె నీకునున్ దుహిన♦వేశ్మమునందలివృత్త మంతయున్. 61

క. పొలయలుకఁ గూరి యాగతిఁ, బలికెనొ నాయెడల నెఱుఁగ♦భామిని! చెపుమా
తెలిసెను నాయజ్ఞతచేఁ, గలిగెను నీదోష మెల్లఁ ♦ గావున నిపుడే. 62

ఆ. అసువు లొసఁగి యేని ♦ యతినిష్ఠురాత్మకుం
డితఁ డటంచు నన్ను ♦ నింతి! మదినిఁ
దలఁప కుండులాగు ♦ తప్పక యొనరింతు
ననుచుఁ బలుకు చుండ ♦ నంతలోన. 63

విలాసవతి చంద్రాపీడునిం బిలుపనంపుట.

సీ. కరమున వేత్రంబు ♦ పరఁగఁ బ్రతీహారి తెలుపకయే వచ్చి ♦ తీవ్రగతిని
గృతనమస్కారుఁడై ♦ నతుఁడయి యిట్లనె యువరాజ! వినువిలా♦సవతి యిట్టు

లానతిచ్చెడి నేను ♦ ననుగొనఁ బరిజనుల్ వింటిని నీవెంట ♦ నంటి రాక
యచ్చటనే యున్న ♦ యల పత్రలేఖ తా వచ్చి నిప్పుడు మళ్లీ ♦ వరకుమార!

తే. దానియందును నీయందుఁ ♦ దనయ నాకు
స్నేహభేదంబు లే దెన్నఁ ♦ జిన్ననాఁడు
పెంచితిని నేన దానిని ♦ ప్రీతి మెఱయ
రావె యిట దానితోఁ గూడ ♦ రయము మీఱ. 64

తే. మంచిసమయంబు నీకును ♦ మమ్ముఁ గాంచ
నరయ నభిలాషశతముల ♦ నందినట్టి
నీదుముఖపద్మమును జూడ ♦ నెమ్మనంబు
వేగిరించెడిఁ గలుగ దే♦వేళ నైన. 65

వ. అని నివేదించుటయు నాచంద్రాపీడుఁడును నామాట లాలించి తనమనంబున నిట్లని తలంచె. 66

చ. అరరె మదీయజీవితము ♦ నందెను సంశయడోలఁ దల్లి న
న్నరనిముసంబు గన్గొనక ♦ యందు మహావ్యథఁ, బత్రలేఖచేఁ
ద్వరఁ జనుదెమ్మటంచుఁ జెపి♦పంపె నకారణవత్సలంబు దు
ష్కర మగుదేవ్యనుగ్రహము; ♦ సాధ్యమె రెండును జేయ నేరికిన్. 67

సీ. వాంఛాకులంబు బెడ ♦ వదలంగఁ దగనిది జనకాంఘ్రిసేవన♦సౌఖ్య మరయఁ
బుట్టువు దొరఁకొని ♦ పొరిపెంపుఁ గన్నట్టి జననీప్రియత్వంబు ♦ ఘనతరంబు
మథియించు నెక్కుడు ♦ మన్మథహతకుండు గురుజనలాలన♦సురుచిరంబు
తహతహ యన్ననో ♦ తరముగాదు సహింప బాంధవప్రేమంబు ♦ బంధురంబు

తే. నభినవాశ్లేచ్ఛ చూడంగ ♦ నతికుతుకిని
ప్రియతమాననసారస♦ప్రేక్షణంబె
జీవితఫలంబు గడుదొడ్డ♦చిత్రరథుని
కూఁతుపైఁ గలకూర్మియు ♦ గూఢ మగుచు. 68

వ. మఱియు. 69

చ. జనపతులుల్ మదీయముఖ♦సారసదర్శనలోలు రెప్పుడున్;
మనము విలంబనాసహము; ♦ మానఁగరానిది జన్మభూమి; గై
కొనఁ దగు దేవి చిత్రరథు♦కూఁతురు; దూరము వింధ్యపర్వతం
బునకును హేమకూటకుల♦భూమిధరంబునకున్ గడున్ గటా. 70

చ. అనుచుఁ దలంచు చిట్లు ప్రతి•హారిని వేదితమార్గుఁడై వడిన్
జనియెను బత్త్రలేఖకర•సారసముం గొని తల్లియొద్దకున్
జనవిభుసూనుఁ డచ్చటను • సల్పెను నాదిన మెల్ల మాతృలా
లనసుఖసంపదన్ మదిఁ గ•లంచెదునుత్కలికన్ గణింపకే. 71

## చంద్రాపీడ విరహావర్ణనము.

వ. అంత. 72

సీ. ఆత్మచింతయుఁబోలె • నరుదేర యామిని చీఁకటుల్ గ్రమ్మంగఁ•జేసి దెసల
విరహవేదన సైఁప•నెర వెఱుంగక చక్రవాకముల్ వాపోవ • వఱలఁ గరుణ
యంకోలసుమపాంసు • లాపాండుచంద్రార్కకరములు స్మరశాత•శరము లేయ
వ్యాకోచకుముదినీ•శ్వాససురభివాహి సాంధ్యమారుత మొయ్య • సంచరింప
తే. శయ్యపైఁ బండి ముద్రిత•చక్షుఁ డగుచుఁ
గరము నిద్రావినోదంబుఁ • గాంచ కట్టె
తలఁచుకొనసాఁగె గంధర్వ•ధరణినాథు
తనయరూపంబు సుమశర•ధామకంబు. 73

సీ. హేమకూటమునుండి • యేగుదెంచినగ్లానిఁ బదపల్లవచ్ఛాయఁ•బండె ననఁగఁ
బిక్కలమీఁదుగా • నెక్కి సంహతము లౌసక్థుల లగ్నమై • జరుగు ననఁగఁ
త్రివళిసోపానముల్ • తీరుతియ్యంబులై యలర మధ్యం బెక్కి•చెలఁగుననఁగ
నతిపరిణాహమై • యడరునితంబోరుఫలకంబుపైఁ జెక్కఁ•బడియె ననఁగ
తే. నాభిముద్రిక మునిఁగె న•నంగ నారు
నందు నుల్లసితంబయి • నలరె ననఁగ
విస్తృతోన్నతకుచముల • విడిసె ననఁగఁ
బాయ దాతనిచిత్త మా•పడఁతిరూపు. 74

వ. మఱియు. 75

తే. ప్రాణ మెల్లను బాహులఁ • బాదుకొలిపి
హస్తతలమును నూఁతగా • నరిగి గళముఁ
గౌఁగిటను జేర్చి చెక్కిళ్లఁ • గాఁపురంబు
చేయునో యన నాతని•చిత్త మలరె 76

తే. అధరపుటమున నుత్కీర్ణ • మనఁగఁ జెలఁగి
పరఁగ ముఖదారమున గ్రువ్వఁ•బడియె ననఁగ

వికసితము నాఁగఁ గనుఁగవ ♦ వెలసి ఫాల
శాల వసియించె నన నొప్పెఁ ♦ జాలసేపు. 77

తే దెసలనెల్లను బొఱలుచుఁ ♦ దేజరిల్లు
తత్ప్రభాపూరమునఁ దోఁగి ♦ తరలె ననఁగఁ
జికురభారాంధకారంబుఁ ♦ జేరి యందు
లీన మాయెను నానృపు♦సూను మనము. 78

వ. ఇట్లు నృపపుంగవసూనుండు తద్బాహ్యోపవనంబునఁ దనమనంబు హత్తించి నాటంగోలెఁ దద్గంధర్వరాజపుత్త్రియందు నాత్మీయబుద్ధి గలుగ నిబద్ధనిర్భర స్నేహార్ద్రచిత్తుం డై దానిం బ్రోవ బద్ధకంకణుం డయి కుండలితకార్ముకుండయి కుసుమకోదండుం డానాఁటిపైఁ బ్రయోగించునిశితశరపరంపరలకుఁ దనమే నడ్డంబు నొడ్డుచు నమ్లానమాలతీకుసుమమంజరీగంధంబును నతికోమలంబును నై నతనులతికను నిర్దయుండవయి ప్రహరించునీకు సిగ్గేల గదుర దని కుసుమ నారాచు దూఱు నా నహర్నిశం బుత్తరళత్తారకాంతర్బాష్పుండయి గనుం గొనుచుఁ, గుసుమశరప్రహారజర్జరితాత్మయై మూర్ఛిల్లినయారాజపుత్త్రిం బ్రబుద్ధఁ గావింప నా స్వేదజలంబుల మేనెల్లం దాల్చుచుఁ, గడునడరునిట్టూర్పుల నిగుడించుచు, దానిసేదదేరుటకు ముద మందినపగిది మే నెల్లం బులకలు చెలంగ నలరుచు, మదనవేదనను నైఁపునో నైఁపదో హృదయము నడుగుద మని శూన్యమానసుండయి తనరుచు, న దేమి చెప్పునో విందమనినగతి మౌన ముద్రం దాల్చి తదాననావలోకనాంతరిత మన దేనినిం గన కూరక యుండె మఱియు 79

సీ అమృతధామం బయ్యె ♦ నబ్జబింబము తనియింప లేదయ్యెఁ ద♦దీక్షణములఁ
దద్వచఃపరిపూరి♦తశ్రవణుండు నాఁ బడవయ్యెఁ దత్ప్రీతిం ♦ బలుకు లెవ్వ
యతని డాయంగను ♦ నలఁతులై వెలుపలఁ బడియుండె వల్లకీ♦ధ్వానములును
లలితసుభాషిత♦ములకుఁ బ్రవేశంబు నలవడదయ్యెను ♦ నతనియొద్ద

తే. మిత్త్రుపలుకులుఁ గటువులై ♦ మించె బంధు
జనులజల్పంబులును దమి ♦ సలుప వయ్యెఁ
దనదుభావంబు బయలుగాఁ ♦ దలఁకి నాఁగ
నీయుఁ డాయెను దర్శన ♦ మెవరి కతఁడు. 80

చ. సతతము మండుచుండుసుమ♦చాపహుతాశనుఁ డంతరంగమున్
దతుఁడయి గాల్చుచుండినను ♦ దద్దయుఁ బెద్దలసిగ్గునన్ సము

ధృతనవశీతలాంబురుహ♦దివ్యశయంబును జేరఁడాయె సం
గతములఁ జేయఁడాయె బిస♦కాండములన్ సరసంబులన్ హృదిన్. 81

చ. అనయము ధారలై తొరఁగు♦నంబుకణంబుల శీతలార్ద్రమై
తనరుచు దుర్దినంబుగతిఁ ♦ దద్దయు నొప్పెడు ధారికాగృహం
బును గనఁడాయె నెప్పుడును ♦ బుష్పరసంబులు పాఱి చల్లనై
చనునడుచక్కిఁ జేఁ బొలుచు♦చారులతాగృహహర్మ్యవాటులన్. 82

వ. మఱియు. 83

క. మలయజజలలులితములై, చెలఁగెడిమణికుట్టిమములఁ ♦ జిత్తమునందున్
దలఁపఁడు పరుండ నెప్పుడుఁ, దలిదండ్రులనంగ నెంత ♦ తలఁకో గనుమా. 84

క. హిమకరకరసంక్రాంతిని, గమనీయములైనచంద్ర♦కాంతముకురముల్
హిమధామముఖులు పట్టినఁ, దమిఁ దిలకముఁ జక్క దిద్దఁ♦దలఁపఁడు మదిలోన్.

చ. పలుకఁగ నేల పెక్కులిఁకఁ ♦ బార్థివశేఖర! యాతఁ డెన్నఁడున్
దలఁపఁగఁ జారుచందనముఁ ♦ దా మును గొంచు నలంద కుండినన్
జలరుహనేత్రలిచ్చమెయిఁ ♦ జర్చ యొనర్తు మటంచు వేఁడినన్
భళిరె యలందఁ డంగముల ♦ వాసనభీతి నదెంత లజ్జయో. 86

ఉ. ఈగతి రాత్రియుంబవలు ♦ నెప్పుడు నందక నిర్వృతిన్ గడున్
వేగ జ్వలించుచున్నను వా♦విరహానామము లేక దాహమున్
వీఁగుచుఁ జేయుచుండినను ♦ స్నేహమయేంధనజాలసంక్షయం
బీఁగి వ్యథానుభూతికినె ♦ యిక్షుశరాసనవహ్ని బూదిగాన్. 87

చ. సలుపుచు లో వెలిన్ దనువు ♦ చాల నలంపఁ గృశించియున్ గడున్
దలఁగఁడు మేనిసౌరును క్ష♦ణక్షణవర్ధనశీల; మాగతిన్
దలఁగఁగ రామినిన్ బ్రతియొ♦నర్పఁగ రామి వివర్ధమానుఁడై
చెలఁగెడుమన్మథుం డతఁడు ♦ సేవ యొనర్చుచు నుండినన్ సదా. 88

క. తనయాకారమె జనులకుఁ, గనఁబడకుండంగఁ జేయఁ ♦ గలిగెను బ్రాణం
బును స్మరనారాచములకుఁ, గనఁబఱుపక యుండ వలఁతి ♦ గాఁడయ్యె నృపా!.

సీ. తనుకార్శ్య మెంతేని ♦ దాల్చె నాఁతఁడు త్రపా
కార్శ్య మొక్కింతయుఁ ♦ గాంచఁ డాయెఁ
బ్రజల రావల దనెఁ ♦ బ్రబలునుత్కలికల
రావల దనుతెంపు ♦ మోవఁ డాయెఁ

ప్రాణధారణమందు ♦ వదలె నాదరణంబు
వంశస్థితిని దాని ♦ వదలఁ దయ్యెఁ
సుఖములనే గడు ♦ శోషిల్లఁ జేసెను
ధైర్యశోష మొనర్పఁ ♦ దలఁపఁ దయ్యె.

తే. ముందఱకు నీడ్వ గంధర్వ♦భూధరాత్మ
జాతరూపగుణంబులు ♦ నూఁత లగుచు
నూపిరి యొసంగఁ గాఁ బద ♦ మూనుకొన్న
బలవదనురాగ మాతనిఁ ♦ బట్టె నిట్లు. 90

చ. గురువులపైన నెక్కుడుగఁ ♦ గూర్చినయాకృథరాగ మంతయున్
బరువడి లాగ వెన్కకును ♦ బంధితుఁ డయ్యెను రెంట నాగతిన్
సురుఁగక మీరి స్వస్థితిని ♦ సోమునిచేత సముత్తరంగమై
పరఁగెడుసాగరంబు క్రియఁ ♦ బార్థివసూతి గభీరుఁడై గడున్. 91

వ. ఇట్లు మదనానలజ్వాలావలీఢగాఢమానసుం డయ్యు నా రాజపుత్త్రుండు గురుజనత్రపచే వెలికి రానీయక యొక్కదినం బొక్కయుగసహస్రంబుగ నొక్కమెయిం గడపుచు సౌధాంతరమ్ముల నెమ్మది గదురమి నౌత్సుక్యసకాశంబు నాప్పుపురబాహ్యసీమకు నేతెంచి యుం దభంగభంగానిలశీతలశీకరాసారభాసురంబులై కలకలారావకలహంసచక్రవాకచక్రబలాకాక్రాంతసరససుకుమారసైకతతలాభిరామంబు లగుచుఁ జెంగుసీప్రానదీతీరంబులం బట్టి పోవుచు నొక్కయెడఁ గదురయంబునఁ బఱచుచు నొండొంటిం జేరుచు విడిచనుచు గుంపులుగుంపులుగఁ గూడి పగగులిడి వచ్చుచు నత్యుత్సాహంబున నొండొంటిం దాఁచుచు ముందునకుసాఁగి పేరెములు పాఱుచు బారులు తీరక యందందు నిలుచుచు జాఱిపడుచు లేచుచు రౌతులకుం మెదగక శిక్షితంబు లగుచు నిట్లు బహుప్రకారంబుల విహరించుచున్న పెక్కుతురంగంబుల దూరంబునుండి గాంచి యతికుతూహలితస్వాంతుండయి వానిం గనుంగొని రా నొక్కపురుషునిం బంపి తానును మొలబంటినీటఁ సీప్రానదిఁ దాఁటి చని యల కార్తికేయాలయంబున వానికై ప్రతీక్షించి చూచుచు నావాజిబృందంబుపైఁ జూడ్కులు నిగిడించి యతిమాత్రప్రహర్షితస్వాంతుం డగుచుఁ బ్రక్కనున్న పత్త్రలేఖను గేలఁ దగ్గఱకు రాఁ దివిచి యిట్లనియె. 92

చ. కనుఁగొను పత్త్రలేఖ! యదె ♦ గ్రాలెడి మ్రోలి నెవండొ చంచల
త్కనదురుబర్హిబర్హమయ♦కమ్రతరాతపవారణంబుఁ దా

ల్చి నళినబాంధవాంశువులఁ ♦ జేరఁగ నీయక వచ్చెఁ జుట్టునున్
దనరఁగ నశ్వవారములు ♦ దగ్గఱకున్ దెలియంగ రాదు గా. 93

మ. కనరా దాననసారసం బెవ్వఁడో ని♦క్కం బారయన్ రాదు నూ
మన కేయూరకుఁ డౌనొ? యౌ నతఁడె భా♦మా! సందియం బేల యిం
కను చున్ జెప్పుచు నుండ రాకొమరుఁ డా♦యుద్బాత్శితో, సంత వ
చ్చెను గేయూరకుఁ డశ్వ మెక్కి యటకున్ ♦ శీఘ్రంబుగా భూవరా! 94

సీ. ద్రుతగతి వచ్చుట ♦ ధూళిధూసరమయి శ్యామలంబై దేహ♦మలరుచుండ
రూపాంతరముఁ గన్న♦రూఢిని ద్యక్తాంగరాగుఁడై సంస్కార♦రహితుఁడగుచుఁ
జెన్ను వీడినమోము♦ చెప్ప విషాదంబుఁ జూపఁ జూడ్కులు లోని♦శోకభరము
నడుగ కున్నను మది♦రాత్మజాకష్ట మనతురంబుగఁ దెల్పు ♦ చవతరించి

తే. వారువంబును గనుచుండ ♦ వచ్చుచున్న
యతనిఁ గని ప్రీతివిస్తారి♦తాత్ముఁ డగుచు
రమ్ము ర మ్మని పిలిచి సం♦రంభమునను
బోయి యెదురుగ నారాజ♦పుత్త్రుఁ డంత. 95

తే. బాహువులఁ జాఁచి దవ్వుగఁ ♦ బ్రణతుఁ డగుచు
దగ్గఱకు వచ్చునాతని ♦ బిగ్గఁ గౌఁగి
లించె నాతఁడు తను విడి♦పించుకొనుచు
మగుడఁ బ్రణమిల్లి నిలువ నా♦మనుజవరుఁడు. 96

తే. వానితోఁ గూడ వచ్చిన ♦ వారి నెల్ల
హర్ష మొదవ ననామయం ♦ బడిగి యెదుర
నున్న కేయూరకుని సారె ♦ కుల్ల మలరఁ
గనుచు నిట్లనె కే ల్వట్టి♦కొని యతండు. 97

చ. తెలిపెడి నీదురాకడయ ♦ దేవికిఁ దత్పరివార మంతకున్
జెలఁగును భద్ర మంచు; మఱి ♦ చెప్పెదు నెమ్మది విశ్రమించి యా
వల నరుదెంచినట్టిపని ♦ వారక యంచును మావటీఁడు వే
నిలిపినహస్తి నెక్కి యత♦నిన్ వసియింపఁగఁ జేసి వెన్కలన్. 98

తే. పత్త్రలేఖను నెక్కించి ♦ భవనమునకు, నేగి యచ్చట నృపలోక ♦ మెల్ల ననిపి
వల్లభోద్యానమున కేగి ♦ పరిజనయుతుఁ, డై న కేయూరకునితోడ♦నడరుమదిని.

తే. దివసకృత్యంబు లెల్లను ♦ దిద్ది యెఱుక
లేకయే పత్త్రలేఖతో ♦ నేకతమున

నుండి పరిజనముల నేరి ♦ నుండ నీక
ననిపి కేయూరకుని బిల్చి ♦ యనియె నిట్లు. 100

చంద్రాపీడునకుఁ గేయూరకుండు కాదంబరియవస్థను జెప్పుట.

తే. చెప్పుమ కేయూరకా! దేవి ♦ చిత్రరథుని
పుత్రి మదలేఖ గౌరిసు♦పుత్రి యేమి
చెప్పి పంపిరో యనుచు నా♦క్షితిపతనయుఁ
డడుగఁ గేయూరకుం డిట్టు ♦ లనె వినీతి. 101

సీ. దేవర! యేమని ♦ తెల్పుదు దేవియు నలమహాశ్వేతయు ♦ నంపినట్టి
వాచికలవమును ♦ వఱలదు నాయెడ, నరనాథసుత! మేఘ♦నాథుతోడఁ
బత్రలేఖను బంపి ♦ ప్రతినివర్తిలి నేను ననితి మీరూరికిఁ ♦ జనినవార్తఁ
గనియూర్ధ్వమొక్కింత♦గడుదీర్ఘముగనూర్చియిదియిట్లేయనిలేచి♦యిల్లువెడలి

ఆ. మరలఁ దపము సేయ ♦ నరిగె మహాశ్వేత
స్వాశ్రమమ్ముఁ గూర్చి ♦ యధిపతనయ!
మదిరతనయ దేవి ♦ యద నమోఘనమున
నిహతయైనమాడ్కి ♦ నిష్ఠురముగ. 102

ఉ. ఉన్నటు లుండి మస్తమున ♦ నుగ్రమహాశని కూలినట్లుగాఁ
గన్నులు మూసి లోనివ్యథఁ ♦ గాంచినయట్టులు మూర్ఛ, వంచనన్
గన్నదియో యనన్ ముషిత ♦ నాఁ బరిభూతయొ ముక్తచిత్త నాన్
జన్నది గౌరిపుత్రి యను♦సంగతియున్ దెలియంగ నేరకే. 103

చ. చిర మటు లుండి నేత్రములఁ ♦ జిన్నఁగఁ దెర్చి విలక్షణాఁగ న
చ్చెరువును గాంచెనో యనఁగఁ ♦ జెందెనొ విస్మృతి నాఁగ నీసునున్
బొరసినయట్లు న న్ననిపి ♦ పొమ్ము వచింపుము హంసపుత్రి కం
చరవలితాననాబ్జయయి ♦ యామదలేఖను గాంచి యిట్లనెన్. 104

చ. చెలి! యొరుఁ డేఁడు చేసె మును ♦ చేయును నింకను రాసుతుండు దా
సలిపినదాని; నం చనుచుఁ ♦ జయ్యన లేచి సఖీజనంబులన్
బలుఁగము నెల్ల రావలదు ♦ పజ్జ కటంచుఁ బరుండె సెజ్జపైఁ
దలకు ముసుంగు వెట్టికొని ♦ తద్దయుఁ బయ్యెదకొంగు రాసుతా! 105

క. సలిపెను నాదిన మెల్లను, బలుకక మదలేఖతోడఁ ♦ బ్రాణప్రియతోన్
బిలువక యేరిని నాసతి, తెలవాటెను నెట్లొ తనకుఁ ♦ దెలియక యె నృపా!

సీ. మఱునటి దినమున ♦ వఱువాత డాయంగ నేగిననన్ను నా ♦ యేణనయన
వృథగాత్రులగుమీరు ♦ తెగులుగొన్నటులుండఁ బండియీ దృగవస్థ ♦ నుండుదానఁ
బనియేమి మీతోడఁ ♦ బార్శ్వవర్తులతోడ నిలుతురుముందేల ♦ తొలఁగుఁడవల
నని దూఱునది వోలె ♦ నధికకోపంబున బెదరించునదివోలె ♦ ముదము తక్కి
తే. యశ్రుపూరసమాకులి ♦ తాక్షి యగుచుఁ
గనియెఁ జిరకాల; మట్టుల ♦ గాంచ నాజ్ఞ
యిచ్చినట్టులె పో యనఁ ♦ దెంచి దాని
కెఱుకపఱుపక వచ్చితి ♦ నిటకు నేను. 107

చ. నిను శరణంబుగాఁ గొనిన ♦ నచ్చెలిజీవముఁ బ్రోవఁగా మదిన్
గొని గడునాకులంపడుచుఁ ♦ గుందెడునీతని విన్నపంబు నీ
వనయము నాలకింపఁగ స ♦ మాదృతచిత్త మొసంగి సాకతం
బును నొసఁగంగ నర్హుఁడవు ♦ భూవరపుత్ర! వచింతు నే మిఁకన్. 108

మ. అల కన్యాలతికావనాఖిలము నీ ♦ యాద్యాగతిన్ సౌరభా
కులమందానిలుచే వలెన్ జలితమై ♦ గోల్పోయె నెప్డప్పుడే
యల మారుండు సమస్తభూతలమనో ♦ హారున్ నినున్ మాధవున్
వలె వీక్షించి యశోకవల్లరిగతిన్ ♦ వామాక్షినిన్ బట్టెఁ బో. 109

క. కనుచున్న దివుడు నీకై, పెనువ్రంతను జిత్రరథుని ♦ ప్రియపుత్రిక దా
దినకరునుదయము దొరఁకొని, దినకరకాంతోపలాగ్ని ♦ తెఱఁగున నెపుడున్.

క. పొగ లెగయకుండ బూదియు, నగపడకుండంగ గాలి ♦ నాశింపక యే
భగభగ యని శబ్దింపక, తగ మండెడుఁ దద్వియోగ ♦ దావాగ్ని నృపా!. 111

సీ. కోమలపల్లవ ♦ గుంభితవ్యజనముల్ విడువక పరిజనుల్ ♦ వీచుచున్నఁ
దాళవృతంబులఁ ♦ దడిపి పన్నీటను జలకణాసారంబుఁ ♦ జల్లుచున్న
సరసచందనపంక ♦ సలిలచ్ఛటలు మేన నంచితంబుగ గ్రుమ్మ ♦ రించుచున్న
దళితముక్తాఫల ♦ లలితవాలుకఁ దెచ్చి పిడికిళ్లు పిడికిళ్లు ♦ వేయుచున్న
తే. యంత్రమయరాజహంసంబు ♦ లంబుధార
లొలుకుధారాగృహంబుల ♦ నుంచుచున్నఁ
బ్రళయకాలాగ్నిహోత్రంబు ♦ భంగి భీక
రాకృతిని మండుచుండుఁ జ ♦ ల్లార కద్ది. 112

ఉ. చల్లనివారిధారలను ♦ జల్లుకొలందిని వారియంత్రముల్
పెల్లుగఁ బ్రజ్వరిల్లెడిని ♦ విద్యుదుపర్బుధుతోడఁ బుట్టు నా

నల్లలనామతల్లి మదనాగ్ని కడున్ శిశిరోపచారముల్
మొల్లమి మొల్లమొగ్గలటు ♦ పొల్చెడు చెమ్మటబొట్లఁ జెందెడిన్. 113

ఉ. అచ్చెరువయ్యెడున్ స్మరహుతాశనుఁ డెప్పుడుఁ గాల్చుచుండఁగా
నచ్చపలాక్షి మేనిజిగి ♦ యగ్నివిశుద్ధపటంబు చాడ్పునన్
హెచ్చుగ నిర్మలం బగును; ♦ నీదృశతాపమునం గలంగియున్
బచ్చఁదనంబుఁ బాయ దల ♦ భామిని యే మనువాఁడఁ జెప్పుమా. 114

క. మదగజయానలహృదయము, మృదుశీలం బయ్యె బిసుసు♦మెయి కొనును గదా
యుదకము ముక్తాఫలతను, గదిసినఁ గఠినత్వ మందు♦గతి నని తలఁతున్. 115

సీ. ఎట్లు చెప్పుదు నేను ♦ నేమి యొనర్తును నేవృత్తి వర్ణింతు ♦ నేమి యుక్తి
యేయుపాయంబున ♦ నేఁ బ్రకటించెద నెబ్భంగిఁ దెల్పుదు ♦ నెట్లు మాన్తు
ననుభవవేదనా♦ఘనవిహ్వలప్రాణ దానిని బ్రతికింతుఁ ♦ దద్దవగను
బ్రియసమాగమవాంఛ ♦ పెద్దగదా భువి దానన యున్నాళ్లు ♦ తనువుఁదాల్చెఁ

తే. దెలియరా దేమొ కలలను ♦ దీవ్రబాధ
ప్రాణులకుఁ బ్రత్యహంబును ♦ బడఁతి పడెడు
నాయవస్థను గనుచున్న ♦ నరయ కిట్లు
చూచు చూరక యుండెదు ♦ చోద్య మగును. 116

ఉ. వేయిప్రచండభానువుల ♦ వేయిప్రకాశములన్ సహించు శ
య్యాయిత సారసంబుల ర♦యంబున మిక్కిలి వాడివత్తులన్
జేయుచుఁ దత్సరోజముఖి ♦ నీరజవల్లభమూర్తిఁ గేరెడున్
మాయురె తత్తనూష్మ మది ♦ మాదృశ లెన్న వచింప శక్యమే. 117

క. కరుణారహితుఁ డకారణ, విరసుఁడు కాముండు పెట్టు♦పెనుబాధల కా
తరుణి యొనర్చెడు చెయ్వులఁ, దరమే వచియింప నాకు ♦ ధాత్రీశసుతా! 118

చ. అతికఠినాత్మమానసము♦నందు వసించెద వేల దేవి! యీ
యతిమృదుపుష్పశయ్యపయి ♦ హాయి వసింపు మటంచు నెచ్చెలుల్
సతిఁ గొని తెచ్చి యెట్లొ యొక♦చందమునన్ బడవేయ నందు నా
సతి వసియింప దొక్కనిమి♦షంబును నేమనుదున్ నృపాత్మజా!. 119

మ. అతితాపచ్యుతపాదయావకరసం ♦ బంటంగ నత్యంతశో
ణితశయ్యాకుసుమంబులన్ దనదుహృ♦న్నిష్ఠ్యూతసాస్రుక్స్మరో
గ్రతరాఘాతశరంబు లంచుఁ గడు శం♦కన్ జెంది వే లేచు నా
సతి సంరంభమునన్ దిగున్ శయనమున్ ♦ క్ష్మాపాలపుత్రా! కటా. 120

చ. నిను స్మరియించుటన్ మదిని ♦ నిత్యము పుట్టెడురోమహర్షణం
బును మయినిండఁ దాల్చు మరు♦ముల్కులు దాఁకక యుండఁ గత్తళం
బును వలె; రోమహర్షణముఁ ♦ బొందినదన్నులయందు శ్వాసవా
తనిపతదంశుకంబుఁ దన♦దక్షిణహస్తకుశేశయంబుచేన్. 121

చ. ఉనుచును ముండ్లపాన్పువ్రత♦మూనఁ దలంచెనొ నాఁగ నిన్నుఁ జే
కొనునభిలాష; డారకము ♦ కుందఁగ బాపలిచెక్కు మోసి మో
సి నిలుపలేక స్తబ్ధతను ♦ జెంద; జ్వలన్మదనాగ్ని క్రమ్మఁగా
ననఁగను, బద్ధరాగవల♦యాంశులు క్రమ్మినకేల్వెదిర్చెడున్. 122

చ. అనవరతంబు ధారలయి ♦ యశ్రులు రాలఁగఁ దన్ముఖంబునన్
గనుకనిఁ బాఱుచుండునయ♦నంబులనన్ నళినీదళంబులన్
దనరినతాళవృంతములఁ ♦ దార్కొను గాలికి లేచి పోవు నా
కనదురుకర్ణపూరములఁ ♦ గాంచు చెగాదిగ నూర కుందెడున్. 123

చ. అతికృశతన్ బ్రతిక్షణము ♦ నందెడు నాసతి మాటిమాటికిన్
బతనభయాతిరేకమునఁ ♦ బట్టెడు మంగళకంకణంబు నే
సతతము డోలికాగతిని ♦ సంచలియించెడు మానసంబునన్
క్షితిపతనూజ!. పట్టుకొనుఁ ♦ జేచిగురాకున సారె సారెకున్. 124

ఉ. కేళిసరోజమాల యనఁ ♦ గేవలశీతలవారిబిందులన్
రాలుచు దేహసన్నిహిత♦రమ్యసఖీజనపాణి రాజి నా
బాలిక గ్లానినొందుఁ గదు ♦ భూపతనూజ! యిఁకేమి చెప్పుదున్
జాలదె యింక నేఁ బలుకఁ ♦ జాల వినుండు వచింతు నొక్కఁడున్. 125

సీ. రశనాకలాపంబు ♦ రమ్యాంఘ్రియుగళినిహ్వానయుంబు సంగమా♦భీష్టమునను
గడుకృశమధ్యంబు ♦ కటివిస్తరంబునఁ జెక్కిలి చేసమ్మి ♦ నక్కన నిను
గళమున జీవంబు ♦ సలిలజినీదళప్రావరణం బురో♦భాగమునను
బాష్పనిపాతంబు ♦ భవదీయకథలను జందనంబు లలాట♦జాలజమునను
తే. నంసమునఁ గచభరమును ♦ నతివ యిపుడు
దాల్చుచున్నది ధాత్రీశ♦తనయ! నీదు
వీక్షణముపొంటె హృదయంబు ♦ ప్రీతిఁ గోరు
మూర్ఛ సఖివోలెఁ దచ్చిత్త♦మును స్పృశించు. 126

తే. తప్పి పేరును జెప్పిన ♦ తప్పిదమ్ము
నకునువలె జీవమును దాల్చు♦టకును మిగుల

సిగ్గుపడును; మహోత్కంఠ ♦ చెలివిధానఁ
దత్పతిని లేపు మృదుసుమ♦తల్పముననుం. 127

సీ. పరిచారికాగతిఁ ♦ బట్టి మనోవ్యథ త్రిప్ప నస్తాంగియై ♦ తెలివ తిరుగుఁ
దహతహ సురఁటికై ♦ తలిరులఁ గోయుననుభీతి నదరు నా ♦ ననిలముననుఁ
గదలుచుండెడులతి♦కామండపంబును దూఱును సారెకుఁ ♦ దోయజాక్షి
యురిత్రాడు సేయున♦న్గురుభీలతాపాశములఁ బూలమాటిన♦పుష్పవనము
తే. సారెసారెకుఁ జూరఁబడు ♦ సతతపతిత
రోదనాతామ్రనయనస♦రోజబింబ
ములను గొనుసెజ్జకను భీతి ♦ జలజములను
లోన డాఁచె నన సరసి♦లోన మునుఁగు. 128

సీ. చనుదెంచి యటనుండి♦చనుఁ జయ్యనఁ దమాలవీథికి నటఁ గొమ్మ ♦ నూఁదినట్టి
యూర్ధ్వదోర్లతికపై ♦ నుంచి ముఖంబును ముకుళితనేత్రయై ♦ ముదము తక్క
చంపకవల్లరీ♦సంబద్ధగళ యన శంక జనింపంగ ♦ సల్పు చుండి
యొక్కముహూర్తంబు; ♦ నొంది విశ్రాంతిని జను నట సంగీత♦శాల కంత
ఆ. నచటు వాసి మురజ♦హతి మధురధ్వని
లయసురుచిరనృత్య♦భ సుమువలన
ముక్తధార మగుచు ♦ మొనయుధారాగృహ
మునకు నెమ్మిఁబోలె ♦ ముదిత చనియె. 129

క. ఘనజలధారాశీకర, వనమునఁ గాదంబకలిక♦వడువున మేనన్
బొనరఁగఁ బులకలు వణఁకుచుఁ, జనియెను శుద్ధాంతజలజ♦సరసీతటికిన్. 130

ఆ. అచట భవనరాజ♦హంసనిస్వనముల
విని సహింప లేక ♦ చనుచు నవల
నవుడు జాఱిపడిన ♦ హంసకముం గని
పొగడుఁ గృశత నిపుణ♦బుద్ధిఁబోలె. 131

చ. వలయములన్ ఘటించి బిస♦వల్లుల నెల్లను వాఁడఁ జేసె నం
చలఘుతరప్రకోపమున ♦ నాఁగ్భటముల్ పచరించు చాడ్పునన్
గలకలకూయుచుండెడుని♦శాయవిహారమనోజ్ఞవాపికా
విలసితచక్రవాకముల♦పిండురవంబుల కుల్కు నెంతయున్. 132

వ. మఱియు. 133

చ. శయనవిలాససంభృదిశ • చారుసుమప్రచయంబులై క్రుధా
మయము లనంగ హుంకృతుల • మాటికిఁ దత్ప్రియదావనాళిసం
చయములు భీతిఁ గొల్పు నల • సారసనేత్రకు నేమి చెప్పుదున్
భయమును గొల్పు నేదియును • భామకు దాని క దేమి చిత్రమో. 134

చ. తమి మధురస్వనంబులను • దమ్ము జయించె నటన్నయార్ష్య నా
సుమమృదులాంగిముంగిటను • శోభిలుమావుల నుండుకోయిలల్
గుమి లయి యాకులంపఱచుఁ • గో యని కూసి కలస్వనంబులన్;
సుమశరపాండుగండజిత • నూతనమధ్యదళాంశు కేతకుల్. 135

చ. చలమున ముండ్లు గ్రుచ్చు నసఁ • జాల భయంపడఁ జేయు సాగ నా
చిలుకలకొల్కి; నట్టి స్మర • చేష్టలఁ గుందుచు నెల్లి టో పవల్
సలుపు; విధూనయంబునను • జాఱ ముదంబు తమంబుపోలికన్
నిలుపఁగ లేక డెందమును • నెవ్వగఁ గూరును దూఱుఁ జందురున్. 136

చ. కమలమయం బనంగఁ గడుఁ • గాసిలు డెందము; మీనకేతువున్
గుముదమయుండు నాఁ గెరలుఁ; • గోకమయంబులు నాఁగఁ గోర్కులున్
విముఖము లౌచు వీడి చను; • వీక్షణయుగ్మము శీతభానుకాం
తమయ మనంగఁ జెమ్మగిలుఁ • దామరసాక్షికి నౌర యత్తఱిన్. 137

చ. చెలఁగును సాగరంబు లనఁ • జెల్వకు నూర్పులు వర్ధమానమై;
పలుకు ననక్షరంబుగను • బాల క్షపాకరతాపమున్ విధూ
పలమణికుట్టిమాంతరని • పాతనిశాకరబింబమందు శీ
తలవిషమజ్వరార్తపలెఁ • దార్చును వేపథునన్ వణంకు కేల్. 138

ఉ. మారశరప్రదీర్ణ మగు • మానసమంచలిచంద్రఘృష్టులన్
సారసనేత్ర సీత్కృతుల • సద్రదనాంశువు లన్నిమిషన్ సము
ద్గార మొనర్చు; వేపథులఁ • దా వ్యజనీకృతరంభపర్ణకం
పోరుహితోపదేశమటు • లుగ్మలి కైకొనుమాటిమాటికిన్. 139

తే. కంఠగత మైనజీవంబు • కదలుత్రోవఁ
దెలుపు ననఁ దోఁచు నావులిం • కలను; వెలఁది
బాష్పమోక్షంబులను స్థూల • బాష్పరాజి
వేణిఁ బాఱించి ద్రవమైన • విధము తెల్పు. 140

తే. తప్పి పేరు వచించిన • తరుణమునను
సిగ్గుచేఁ గల్గుచిఱునవ్వు • సిగ్గు లలమ

హృదయతలమునఁ బడినట్టి♦యిక్షుధన్వి
శరసుమరజంబుఁ గ్రక్కు నా♦ జానఁ దోఁచు. 141

తే. చంద్రమణిదర్పణంబుల ♦ సంక్రమించి
పెక్కురూపుల వెలుఁగు నా♦వెలఁది నూఱు
పరియలుగ వ్రీలెనో యనఁ ♦ బార్థివేంద్ర
తనయ! దోఁచుఁ దదార్తి నే ♦ మనుదుఁ జెపుమ. 142

తే. కుసుమశయనంబులను బండు♦కొన్న వెలఁది
తత్పరిమళాగతమిళింద ♦ తండ మెల్లఁ
గ్రమ్మ మదనాగ్నిధూమంబు ♦ గ్రమ్మె ననఁగ
రాకుమారక! చెలఁగునా ♦ రాజవదన. 143

క. సలలితజలజాస్తరణం,బులఁ గేసరపాంసుపుంజ♦ములచేతను బిం
గలదేహ యగుచు నొప్పును, జ్వలనాలీఢాంగి యనఁగ ♦ సారసముఖి తాన్.

క. చెమ్మట యణంగ మెత్తెడు, నిమ్మగుకపురంపుఁబొడుల♦నింతి తనువు భ
స్మమ్మంటినగతిఁ దోఁచును, జుమ్మూర్వీనాథతనయ! ♦ చోద్యం బగుచున్. 145

చ. తెలియఁగ రాదు ముగ్ధతనొ ♦ తీవ్రతరోన్మదనంబుచేతనో
కలికివిలాససంగతినొ ♦ కామిని గానమృదంగరావముల్
సలుపఁగఁ గేకికారవము♦శంకను మూయును వారియంత్రక
మ్ములఁ గలయశ్మగర్భఫణి♦భోజనజాలమునాననంబులన్. 146

సీ. లిఖియించు నుత్కంఠ ♦ లేఖల సంకల్పసంగమాభిజ్ఞాన♦సరణి తెలియఁ
గలలందుఁ జేసిన♦గాటంపుఁదప్పుల దూఱును నంపుచు ♦ దూతికలను
విడిపోవు ననుభీతి ♦ వడిఁగట్టుఁ దూఁడులఁ గుడ్యచిత్రితకోక♦కులము సంజ
శ్రవణోత్పలంబులఁ ♦ జల్లార్చు మణిదీపములను జింతారత♦ములకు మొదల

తే. మగువ, దానికి నరుదెంచు♦మలయమారు
తంబుతోడనె మూర్ఛ చం♦దనసుగంధ
పరిమళమువోలెఁ; జక్రశా♦పంబువోలె
క్షణదతోడ వచ్చును బ్రజా♦గరభయంబు. 147

మ. ప్రతిశబ్దంబు లనంగ వేశ్మవలభీ♦పారావతారావసం
తతితోడన్ జనుదెంచు దుఃఖములు; ను♦ద్యానప్రసూనాళిసం
గతసౌరభ్యముతోడ వచ్చు మరణా♦కాంక్షల్ ద్విరేఫక్రియన్;
సితధామాంశువులన్ స్పృశింపఁ గమలున్ ♦ నీరేజముం బోలుచున్. 148

చ. జలకణికాగతిఁ సరసి♦జాతదళస్థిత యైనయట్టియా
వెలఁది చలించుచుండుఁ; బ్రతి♦బింబము చాడ్పున స్ఫాటికోపలం
బుల మణికుట్టిమంబులను ♦ బొల్పగునద్దములఁ జలంబులోఁ
వలఁ బరిదృశ్యమాన యగు ♦ భామ జనంబుల కెల్లనుఁ నృపా!. 149

ఆ. హంసిగతి మృణాళి♦కాహారసంగతి, జీవయాత్ర సలుపుఁ ♦ జెలఁగుఁ గువల
కుముదసంగసౌర♦భమును వహించుచు, సనుమబాణ యగుచు ♦ శరవయట్లు.

క. జలజప్రకరంబులఁ బ్రస్ఖలితంబులు గాఁగఁ బదకి♦సాలయములు దా
మలఁగుచు నిట్టటు కలువల, చెలిమూర్తివిధంబు రాత్రిఁ ♦ జెల్లించు నెటో.151

క. కుముదినిగతి రేయెల్లను, గుముదాప్తునికిరణములను ♦ గూరుకు రామిఁ
దమకుచు మేల్కాని మేల్కాని, కమలాక్షి యలీకనిద్రఁ ♦ గడపును బవలుఁ.

క. మురరిపుజలశయనక్రియ, వరసుందోచ్ఛ్వాసశేష♦భాసుర యగుచుఁ
దరమీలితలోచనయై, పరఁగుచు నే మేమొ మదిని ♦ భావించును దాఁ.153

క. మలయాపగావిధంబున, సలలితహరిచందనార్ద్ర♦చారుకిసలయా
కులితశిలాతలములఁ బడు, నలికులకచ లేచు మగుడ ♦ నడరి వడిఁ బడుఁ.

క. గాసిలు వనపవనమునకు, భాసురహిమసిక్తపల్ల♦వస్థితి యగుచుఁ
దా నుమకోమలి నృపసుత, పేశల మగు మల్లెమొగ్గ♦విధమున నెపుడుఁ. 155

ఉ. తాపము నోర్వలేక నల♦త్రాఁచుగతిఁ హరిచందనద్రుమం
బాపికవాణి కౌఁగిటను ♦ నట్టె గదించి శిఖండి కేకలఁ
దాపము నొందు; కేసరివి♦తానముఁ జేరదు జింకపోలికఁ
సైఁపఁగ లేక తద్వ్యథ న♦జస్ర మలంపఁ గలంపఁ జిత్తముఁ. 156

సీ. చరితార్థ గాదయ్యె ♦ స్వప్నసమాగమమునను బాణాసుర♦పుత్రిపోలెఁ
బరఁగె నతిక్షామ♦భాసురశ్యామయై వఱలెడుగ్రీష్మసం♦వదయుఁబోలె
సుమశిలీముఖముల ♦ శోభిల్లు నెలదోఁట కలికెను మరువింటి♦కట్టుపోలె
హరితలోహిత చంప♦కాశోకములకును వెఱచు నసురల కు♦ర్వీజపోలె

తే. దానియంగము లెల్లను ♦ మీనకేతు, వేదనల వేశ్మకమలినీ♦బిసలతికలు
వలయరచనల, సకియుల♦వచనము లుప, దేశములఁ దఱిఁగె మిగులు♦ తేలకుండ.

వ. మఱియు. 158

మ. ఎలదోఁటం గలపువ్వులెల్ల వ్యయ మ♦య్యెఁ దత్సతీశయ్యకై;
జలజాతాస్త్రశరంబులుఁ దఱిఁగె స♦త్క్రాంతప్రయోగంబులఁ;

బలుకుల్ పెక్కులిఁ కేల సర్వజనముల్ ♦ త్వన్నామధేయంబులే;
చెలఁగెఁ నీ వయి యెల్లమంతనము లాఁ♦సీమంతనీమాళికిఁ. 159

మ. నిను రప్పించునుపాయముల్ వెదకుటల్ ♦ నిర్నిద్రులై రెల్లరున్;
అనుయోగంబులు నెల్ల నీయుబుసునం ♦ దాసక్తముల్ నిచ్చలున్;
వినుమా మాగధభద్రగీతములు త్వ♦న్నిందోదరంబుల్; సదా
గనుటల్ స్వప్నము లెల్ల నిన్ను పునరు♦క్తంబుల్ నృపోత్తంసమా. 160

చ. సకలవినోదముల్ కథలు ♦ సంభరితంబులు నీదుభావలన్;
మకరపతాకితాపమున ♦ మండుచుఁ బల్కెడువిప్రలాపముల్
ప్రకటభవద్గుణప్రచుర♦భాసురముల్; భవదాహ్వయప్రభో
ధకములు మోహవేగములు; ♦ తన్వికిఁ గార్యము నిల్లిఖించుటే;. 161

తే. అనుచు వచియించు కేయూర♦కునిని మదిర
తనయవెత లెల్ల నాలించి ♦ వినఁగఁ జాల
నిలుపు మింక నిమీలిత♦నేత్రసంజ్ఞ
సలిపె నన రాజసుతుమూర్ఛ ♦ నిలిపె నంత. 162

వ. ఇట్లాచంద్రాపీడుం గ్రమ్ముకొన్నయమ్మహామోహంబు కేయూరకుం గాదంబరీ వృత్తాంతంబుం బలుకకుండ నోనర్చెఁగాని తదవస్థానివేదన వేదనాపరిసమాప్తిఁ గావింపఁ జాలదయ్యె. అట్లుమూర్ఛానిమీలితలోచనుం డగుచు నాకాదంబరిని ధ్యానించు నా నిస్తబ్ధుండైన యారాసుతుఁ ససంభ్రమప్రతిపన్నశరీరుండైన కేయూరకుండును సంగృహీతతాలవృంత యగు పత్రలేఖయు భావ్యర్థప్రాపణపటిష్ఠ యగునియతియు మూర్ఛం దేర్ప నాచంద్రాపీడుండు డించుక దేరి కనులు విచ్చి, తా నతని కట్టిదశ ఘటింపఁజేసి మహాపరాధంబుఁ గావించితిని గదా యని భయంపడినయట్లు సిగ్గుం గాంచినచందంబున విలక్షుండైనవిధంబున నిభృతస్థితుండై యున్న కేయూరకుం గాంచి యంతర్బాష్పనిరుద్ధకంఠుండై యెట్టకేలకు నాలుకకు మాటలు దెచ్చికొని పలుకులు తొట్రిల నతని కిట్లనియె.

చ. తనవయిఁ గూర్మి లేదనుచుఁ ♦ దద్దయు నిష్ఠురమానసుండ నం
చును నను నెంచి తన్మగుడఁ ♦ జూడఁగ వత్తు నటన్నయాశ ద
వ్వావనరిచి నన్నుఁ దెమ్మనచు ♦ నుత్పలలోచన దేవి నిన్నుఁ దాఁ
బనుపఁగ లేద; యాపగిది♦భావన చేతనె హంసపుత్రియున్. 164

ఉ. ఏమియుఁ జెప్పి పంపదఁట ♦ యెన్నక తాదృగనుగ్రహంబుఁ దా;
నామదలేఖ యొండె నను ♦ నాగతిఁ దిట్టదు; పత్రలేఖ యా

భామకుఁ దెల్పె మన్నిఖిల♦భావములన్ గొఱవెట్ట కొక్కఁడున్;
భామిని యేలకో యిటుల ♦ భావన సేయుఁ దలంప రాదు గా. 165

చ. సరళత నాభిజాతతను ♦ సన్మహిమంబునఁ దుల్యశీలతన్
బరమగభీరతన్ బ్రకృతి♦భాసురపేశలతన్ దలంప నా
సరసిజనేత్ర చిత్రరథ♦సత్తనుజాత యెఱుంగ దాత్మఁ దాఁ;
గరము విచారముం గను న♦కారణవృత్తిని; నేమి చెప్పుదున్. 166

చ. అరయ నచేతనం బయిన♦యంబుజశాత్రవకాంతనామతన్
బరఁగెడు ప్రస్తరంబు హిమ♦భానుశరీరము సోఁకినంత నే
గరఁగును గాని తత్కరముఁ ♦ గాంచెడుభాగ్యము గాంచ లేదు? బం
భరములు పక్షపాతమున ♦ భాసిలుచున్ బువుఁ జేరు నంతయే 167

తే. తేనెఁ బుట్టింపఁగా లేవు; ♦ తేనె పుట్టఁ, గోరకస్థితజృంభయే ♦ కారణంబు;
కైరవంబులు పగలెల్లఁ ♦ గ్రాఁగుఁ గాని, చంద్రికానిశ తద్వికా♦సంబు సలుపు.

చ. సరసత యున్న లోనఁ గడు ♦ చైత్రికమాసరమాపరిగ్రహం
బిరువుగ లేక పాదపము ♦ లేమి యొనర్చు నిగిర్చి రక్తిమన్
దెరలినఁ; దప్పు చేసె నిట ♦ దేవియనుజ్ఞయె దాసుఁ డుండ వా
తెరఁ గదలింపఁ గాచికొని ♦ తేకువ భక్తిని మ్రోల నిల్చుచున్. 169

చ. తనను నియుక్తిచేయు కిది ♦ దారుణనిర్దయవృత్తిఁ బూని దే
వినిఁ గను చూరకుండెఁ గడు♦వేదన లీయ వలంతి హాయికిన్
ఘనమగుసూడు సిగ్గు హిత♦కారిణిగాఁ గనుపట్టుఁ బ్రాణమున్
గొనను దెగించు నొడ్లు కను♦గోడును గాంచ దటంచుఁ దెల్పకే. 170

క. ఏమిా వ్యామోహం బా, భామిని పరిజనములకును ♦ బలవంతముగా
నామెకు నుపదేశింపరు, తా మక్కట చూచు చుంద్రు ♦ తగ దిటు చేయన్.

చ. *తనపదదాసుఁ గన్న నిటు ♦ దాల్పఁగ నేటికి సిగ్గు, గారవం
బును గనుపింప నేల, మదిఁ ♦ బూన నవిశ్వసనంబు నేలకో,
గనఁ బ్రతిబంధ మేమి వృథ ♦ గాసిలఁ జేసె శిరీషకోమలం
బును మనసున్; మదీప్సితముఁ ♦ బూని కృతార్థుఁ జేయ దక్కటా. 172

* పాఠాంతరము. తనపదదాసుఁ గన్నఁ ద్రపఁ ♦ దాల్చుట యెట్టిదొ హెచ్చుగారవం
బును గనుపించు టెట్టిదియొ, ♦ పూను టవిశ్వసనంబు నెట్టిదో;
కనఁ బ్రతిబంధ మెట్టిదియొ; ♦ గాసిలఁ జేసె శిరీషకోమలం
బును మనసున్; మదీప్సితముఁ ♦ బూని కృతార్థతఁ జేయ దక్కటా.

చ. పురుషులఁ గన్నఁ జాటునకుఁ ♦ బోవుట స్త్రీలకు నోలి నాగతం
బరయుఁగ హెచ్చు బాల్య మదు♦గంటఁగ వీడక నాలిబుద్ధమై
పరఁగెడుముగ్ధచిత్తమున ♦ వాస మొనర్చెడుకన్యకాళికిన్;
దరుణి త్రపం ద్యజింపఁ బడ♦దాసుని నగ్గని యోపదాయెఁ దాన్. 173

సీ. హరియింపరానిసం♦యమధనంబులుగలమును లేఁడుహృదయంబు♦ముచ్చిలింప
రక్షించుకొనలేరొ; ♦ రాజులకును బట్టుపడనట్టితస్కర♦ప్రవరుఁ డెవఁడొ
వెలివేయఁ బడనట్టి♦వెలివాడవాఁ డేఁడొ శుచికహార్యం బేని ♦ సోఁకు జగతిఁ
బ్రాణిసహస్రముల్ ♦ భస్మీకృతములైననార కుండెడుశ్మశా♦నాగ్ని యెవఁడు
తే. దోషములకెల్ల నిరవయి ♦ తోఁచు మేను, లేని తెవు లేఁడు రూపంబు♦లేనివాఁడు
నెల్లరూపంబులను హరి♦యించువాఁడు, మర్మభేదకుఁ డీహత♦మన్మథుండు.

వ. మఱియు. 175

తే. అపుడ ప్రాణంబులను దీయు♦ననువు కాఁపు
మంచిచెడుగులఁ జూడక♦మలఁగువాఁడు
పరుల కపకార మొనరింపఁ ♦ బండితుండు
కపటధార్మికుఁ డీతఁడు ♦ గలుగు స్వయము. 176

వ. ఇట్టిమన్మథుఁడు. 177

చ. కలఁపఁగ దేవిమే నిటుల ♦ కాంతకు రెండవడెంద మైనయా
చెలి మదలేఖయా సరకు♦చేయకయుండె? న దెట్టు లోర్చెనో
తెలియఁగ రాదు, నాచెవికిఁ ♦ దేవలదా యట నున్నయప్పుడే;
సలుపుదు విన్న నే మిపుడు ♦ చాలదినంబులు పట్టు పోవఁగాన్. 178

చ. మలయసమీరబాలకుఁడు ♦ మంజులమందగతిన్ జరింపఁగా
జలజల రాలుపూలహతి ♦ సైఁపని దాసతిమేను; మారుము
ల్కులు పవిసారనిష్ఠురవి♦కుంఠనచిత్తుల మైనమాకునున్
దలఁపఁగ దుస్సహంబులు; క్షణంబున కేమగునో యెఱుంగనే. 179

వ. తఱుచు కాదంబరి కీవిషయం బవశ్యానుభవనీయంబు. 180

చ. వెతలని యీయ నుత్సుకుఁడు ♦ వెండియు దుర్ఘటనాఘటైకపం
డితుఁడు నకారణక్రుద్ధుఁడు ♦ నిష్ఠురచిత్తుఁడు నైనవాఁడు నీ
హతవిధి, తద్విసంస్థులమ♦హాద్భుతసృష్టిని జూడఁజూడఁగాఁ
బ్రతుకఁడు వీఁ డటంచు మది♦భావన సేయఁడు నింతకాల మేన్. 181

వ. అట్లు కా దేని. 182

సీ. అశ్వముఖులవెంట ♦ నమనుజభూమికిఁ దేరకు నేఁ జను ♦ దేరు టేడ
చనుదెంచి తృషితుఁడై ♦ సలిలంబులరయుచు సురుచిరాచ్ఛోదంబుఁ ♦ జూచు టేడ
చూచి తత్తటమునఁ ♦ జొక్కి విశ్రాంతిని గని యాసుగీతంబు ♦ వినుట యేడ
విని దాని నరయంగ ♦ వేడుకపడి మహాశ్వేతావలోకంబు ♦ చేయు టేడ
తే. యటకుఁ దరళికతో నీవు ♦ నరుగుదేర
నాడుగమనపుమాటలు ♦ నడుచు టేడ
హేమకూటంబునకు నేను ♦ నామెతోడఁ
జనుట కాదంబరిముఖంబుఁ ♦ గనుట యేడ. 183

ఉ. దేవికి నీజనంబుపయిఁ ♦ దీరనికూరిమి పుట్టు టేడ నా
భావములోనికోర్కు లవి ♦ పారము నొందక మున్న నేను రాఁ
బావనమూర్తి తండ్రి యని ♦ వార్యము శాసన మిచ్చు టేడ పో
యావిధి మాదుకర్మబల ♦ మాడఁగఁ జేసిన యట్టు లాడుఁ గా. 184

క. సారాసార మెఱుంగని, కూరాత్ముఁడు నాత్మబుద్ధి ♦ కూరని వాఁడున్
ఘోరాకారుం డావిధి, దూరం బెక్కించి మమ్ముఁ ♦ ద్రోచె దిగువకున్. 185

క. అయినను దేవిని నూఱడ, నయమగుజతనం బొనర్తు ♦ ననుచుఁ దమిని నా
నయవిదుఁ డానృపతనయుఁడు, దయ తోఁపఁగఁ జెప్పుచుండఁ ♦ దపనుఁడు గ్రుంకెన్.

క. ఈమదిరాసుతవార్తన, భూమీధవసూనుఁ డితఁడు ♦ పో తప్తుఁడు దా
నే మరల నాదుతేజున, నే మని తాపం బొనర్తు ♦ నీతని కనుచున్. 187

క. జాతదయుం డాయెనొ యన, భూతేశ్వరదిగ్వికీర్ణ ♦ భూరిజటాసం
ఘాతానుకారము పిశం,గాతతకరజాల మడఁచె ♦ నర్కుం డంతన్. 188

క. ఆతనితోడనె యున్నత, భూతలజాతాగ్రములను ♦ బొల్చెడునార
క్తాతపశకలంబులఁ గొని, వే తనరఁగ దినము నరిగెఁ ♦ బృథ్వీశసుతా!. 189

వ. అంతఁ గ్రమంబున. 190

సీ. కరుణానుబంధంబు ♦ కలదివోలె జలార్ద్రపటము నా రాగంబు ♦ పఱచె సంధ్య
రాత్ర్యాగమంబును ♦ రాజతనూజుండు శూన్యచిత్తుఁడు వీనిఁ ♦ జూడ నేల
యను చాప్తగతి శ్యామ ♦ లాంశుక మొల్లచోఁ బఱచు నాఁ దిమిరంబు ♦ పర్వఁ జేసెఁ
గమలంబులును శోష ♦ కారితాపం బోర్వఁజాలక తల్పంబు ♦ సల్పు ననుచు
తే. భీతి నా ముకుళంబును ♦ బెరయఁ దొడఁగెఁ
బాను పగుటకు నా శుచి ♦ ప్రకృతియుతము

లవుట నార్ద్రార్ద్రకుముదము ♦ లహమహమికఁ
జెంగలింపంగఁ దొడఁగెను ♦ క్షితిపతనయ!. 191

సీ. చక్రవాకంబులు ♦ సహచరీవిరహానలవిధురంబులయి కడు ♦ విసుగుఁ జెంది
చిత్రరథాత్మజ ♦ చెంతకుఁ జను మని బోధించు నన రాజ♦పుత్త్రునకును
సారెసారెకు దయ ♦ జనియింప గట్టిగఁ గుత్తుక లెండంగఁ ♦ గూయఁ దొడఁగె
నఖిలలోకోల్లస♦దాతపత్త్రోపరికలితసుధారౌప్య♦కలశ మనఁగ
తే. పూర్వదిగ్వనితాననా♦పూర్వగంధ, తిలక మనఁగ నభోలక్ష్మీ♦దేహకాంతి
నీరజాకర మనఁగను ♦ నిఖిలలోక,ములకు నాహ్లాదకరుఁడు కు♦ముదసువిభుఁడు.

ఉ. ఆనరనాథసూనుని సు♦ఖాంచితహస్తములన్ స్పృశింప నా
జానగునూఱటం జెనుపఁ ♦ జాలినవెన్నెలనీట వానికిన్
స్నానము సంఘటిల్లఁగను ♦ సల్పఁగ నా నుదయాద్రికోటిపైఁ
దా నధిరోహితుం డగుచుఁ ♦ దారసిలెన్ దిశలెల్లఁ భాసిలెన్. 193

క. అత్తఱిఁ జంద్రాపీడనృ,పోత్తముఁ డల వల్లభాహ్వ♦యోద్యానమునన్
జిత్తడియై వెన్నెలఁ గడు, మెత్తనిశశికాంతవేది ♦ మేఁ జేర్చుటయున్. 194

క. పదముల నొత్తఁగ నొద్దకుఁ, గదిసిన కేయూరకునిని ♦ గని యిట్లనియెన్
మదిరాసుత మే నసువులఁ, గదియించునొ మనము పోయి ♦ కాంచెదు దాఁకన్.

సీ. వలఁతియే మదలేఖ ♦ కలికికి నందాఁకఁ గొలిపి వినోదంబు ♦ నిలుప మేను
నల మహాశ్వేత తా♦నరుదెంచునే దేవి మరల నూఱడఁ జేయు♦మమత నటకుఁ
గొనునె తత్ప్రార్థనఁ ♦ దను పూని మామకపరిచయోద్విగ్నయా♦పడఁతి దేవి
చూతునా మగుడ నే ♦ సునతిస్పృశ్యోపాంతసురుచిరదరహాస♦శోభితంబు
తే. చలితతారకమును ద్రస్త♦చారుహరిణ, శాబకాయతనయనంబు ♦ సన్ముఖంబుఁ
జెపుమ కేయూరకా! యేమి♦చేయువాఁడ, నేమి యెఱుఁగనుదోఁపదు♦నేమిమదికి,

క. అనవుడు నాతం డిట్లను, జనవరసుత! దీమసంబు ♦ సల్పి మనమునన్
జన యత్న మొనర్పుము పరి,జనుల సఖుల నిట నిలుపుము♦చను మొక్కఁడవే.

క. నినుఁ గనవలె ననునిచ్ఛయె, గొనను నిమేషంబు స్వేచ్ఛఁ ♦ గూర్పదు సతికిన్
మనము సమాగమవాంఛయె, గన స్తబ్ధతఁ జేయు ముఖము ♦ గనుమూర్పులనే.

క. ఘనరోమాంచమె మేనును, క్షణమును విడనాడి పోదు ♦ సతి రేవగలున్
గనుఁ ద్రోవఁ గాచి యుండును, ననయము బాష్పాంబువేణి ♦ యవనిపతనయా!.

క. రేయిని జాగారమె కను, మూయక కనిపెట్టియుండు; ముదితను నెటఁ బో
నీయద యరతియె నొంటిగఁ, బాయదు కంఠంబు వాసి♦ప్రాణం బెందున్.200

క. అని చెప్పెడు కేయూరకుఁ, బనిచెను విశ్రాంతిఁ బొందఁ ♦ బయనపుఁ దలఁపుల్
తనుఁ జొచ్చుటయును నృపవర,తనయుఁడు మదినిట్టు లనుచుఁ ♦ దలఁపఁగ సాఁగెన్.

చ. తెలుపక తల్లిదండ్రులకు ♦ దివ్యపదంబులకున్ నమస్కృతుల్
సలుపక మౌళి మూర్కొనుచు ♦ సంతస మందుచు వా రొసంగు మం
గళదము లైన దీవనలఁ ♦ గైకొన కేను యథేచ్ఛఁ బోయినన్
గలుగును నెట్లు సౌఖ్య మటఁ ♦ గల్గును శ్రేయము నెత్తెఱంగునన్. 201

క. కలుగు మహాఫల మేగతిఁ, గలుగును నటు హృదయసుఖము ♦ గనఁగా నెపుడో
గలిగెడు దానికి నై చిం,తిల నేటికి నుండనిమ్ము ♦ తీవర మేలా? 202

చ. జనకుఁడు దుస్తరాహవవి♦శాలసరిత్పతిఁ దాఁట సేతుబం
ధనము నసంధ్యవాంఛితసు♦దానసురద్రువు వైరిశౌర్యకీ
ర్తిని జనకుండ నాఁగు దృఢ♦దీర్ఘతరార్గళదండ మెల్లలో
కనిలయమున్ ధరించుఁ బటు♦కంబము నా స్వభుజంబు నుండి దాన్. 203

ఉ. దించి సమస్తభూభరము ♦ ధీరత నాపయి మోపె నే నుపే
క్షించి యెటేగువాఁడను న♦శేషనృపాళి నపారదంతిరా
ట్సంచయసైంధవోరురథ♦జాలములన్ ధర క్షుబ్ధమై రజో
ధ్వంచితమై చెలంగ ధ్వజ♦వారములన్ గ్రహరాణ్మయూఖముల్. 204

ఉ. ఆకలితంబులై కెరల ♦ నాతపవారణమండలంబులన్
దాఁకక యుండ నెండ పొడ ♦ దాల్చి భటాభిహతిన్ బరాగముల్
వీఁకను రేఁగి సర్వపృథి♦వీవలయంబును ముంప ముందు న
స్తోకతురంగముల్ నడువ ♦ స్తోమములై వెనువెంట సైన్యముల్. 205

చ. కొలువఁగ వచ్చుచున్న గజ♦కోటిబలంబులతోడ శ్రాంతులై
యలఘుబుభుక్షచేఁ గడుఁ బ్ర♦యాసము నందుచునున్న వార ల
య్యలఘుగతిన్ దొఱంగకయ ♦ యుర్విని నెల్లను బర్వ ధారుణీ
శులు నను వెంబడించెదరు ♦ సుస్మితు వారలఁ ద్రోసివేయుదున్. 206

క. కొలువ సముత్సుకు లగు రా,జుల మాట యటుండఁగాక ♦ సుఖసంగతులై
చెలఁగు ప్రజలు జనకునిపై, విలసిల్లెడు కూర్మి సతుల ♦ బిడ్డల నెల్లన్. 207

క. విడనాడి యేగుదెంత్రని, యొడఁదన్ బరికింతు నింక ♦ నేమి యొనర్తున్
విడి నన్నుఁ దాతకును నీ,పుడమిని బ్రియుఁ డౌరుఁ డెవండు ♦ పొల్చును జూడన్.

ఉ. పోయిన నేను, బోయినను ♦ బోవక యున్నను నేమి వీనితోఁ
బో యని నాపయిన్ మిగులఁ ♦ బొంపిరిపోవు ప్రీతి నేనిపై

స్థాయి నొనర్చి దుర్వినయ♦శాలి యితం డనుకోప మేర్చి నా
నాయన యుండునో; యకట ♦ నాజనయిత్రియు మన్ముఖాబ్జముల్. 209

చ. కనుచు సుఖాయితాత్మయగు♦ గాఢమతిన్ నను గానకున్నచో
నను గొనితెమ్మటంచు వగ ♦ నాయన నేమన కూరకుండునే
జనకుడు నుండ నాబడిని ♦ సర్వసుహితల మున్నయట్లె నా
వెనుకను నవ్వుడే నకట ♦ వెళ్లుట యేడనొ యుండు టేడనో. 210

సీ. విశ్రాంతిఁ గొను టేడ ♦ విహరించు టెక్కడ భుజియించు టెక్కడఁ♦బోవు టేడ
మనము దాఁచుట యేడ♦మఱి నిద్ర యొక్కడఁబడుకొను టెక్కడఁ♦బలుకు టేడఁ
జని యొంటి మగుడ నేఁ♦జనుదెంచి యిచటికి వదన మొకలకుఁగ♦న్పఱుతు నెట్లు
లెవ్వఁడే నడిగిన ♦ నేమియు త్తర మిత్తుఁ దిరుగుదుఁ దలయెత్తి ♦ ధరణి నెట్లు

తే. దైవయోగంబుచే నెట్లొ ♦ తప్పి దారి
వెడలితిని నొక్కవేళను ♦ నిడుమఁ గుడుచఁ
దగనితండ్రిని దత్ప్రసా♦దంబువలన
వ్యసన మెఱుఁగనితల్లి నిఁ ♦ గనుగ మిగుల. 211

ఆ. మద్వియోగదుఃఖ ♦ మనుమహార్ణవమునఁ
ద్రోసి యఘముఁ గాంచి♦ తుచ్ఛ నౌదు
నేమి చేసినట్టు ♦ లెన్న స్కంధావార
మెన్ని దినము లాయె ♦ నేగి యింక. 212

ఆ. బహుదినప్రవాస♦బహుఖిన్నమై యుంకు. మసలుచున్న దొక్క♦నుగిడి రాదు
కాన నపరసంవి♦ధానంబుచే నర్ధపథమునుండి మరల♦వలయు నకట. 213

ఉ. తాతకుఁ దల్లికిన్ దెలిపి ♦ తద్దయు వార లొసంగ నావతిన్
వే తగుసంవిధానమున ♦ వెల్వడుదున్ మఱి వచ్చి యేమి నేఁ
దాతకుఁ దల్లికిన్ జెప్పుదుఁ ♦ దా మదిరాసుత నాపయి న్నితాం
తాయత మైనభావింతి నిడి ♦ యల్ల సుమాయుధు చేతఁ బెల్లుగన్. 214

క. ఆయాసపఱుపఁ బడు నని, యాయువతీరత్నము పయి ♦ నగ్గల మనురా
గాయతి నా కని యుండునొ, యాయువతిని బాసి యసువు♦లందననుదునో.

క. దానికి నా కిరువురకును, బ్రాణాలంబనవిధాన♦పరిపాకం బౌ
మానిని హంసాత్మజ చం,ద్రానన జేపట్టఁ జెప్పి ♦ యంపె ననుదునా. 216

క. కని తద్దుఃఖం బోర్వం,గను శక్యము గామి నన్నుఁ ♦ గైకొని పోవం
జనుదెంచెను గేయూరకుఁ,డనుదునొ మఱియేమియంచు♦ననుదునొ యెట్లుఁగన్.

సీ. దొరకదు మఱియొక్కఁ ♦ డుసువగుమిష దీని కరయఁగ మఱలనే♦నరుగనటకు
వసుధయెల్ల జయించి ♦ వచ్చితి నిప్పుడే హాయనత్రయమును ♦ నరుగ లేద
యింకను సైన్యంబు ♦ లెగుదేరఁగ లేదు కతముఁ దెల్పక యెట్లు♦కదలువాఁడ
విడుకుడు నన్నట్లు ♦ గడుకూర్మిఁ గలవారుదల్లియునొండెఁదాఁ♦దండ్రియొండె.
ఆ. మిత్రసాధ్య మగుచు ♦ మెలఁగునీవిషయాన
నెవరు దొరకరె నేని ♦ యే మొనర్తు
నొకఁడ నేను నొద్ద ♦ నుండఁడు నా చెలి
ప్రాణసముఁడు మంత్రి♦సూనుఁ డకట. 217

ఆ. ఏ మొనర్తు నేను ♦ నెవ్వని నడుగుదు, నెవనితోడఁ జెప్పుదు ♦ నెవఁడు నాకు
హితము చెప్ప నిశ్చ♦యించు నిట్లని యెవ్వఁ, డెవని కుండు నంత♦యింగితంబు.
ఆ. ఎవనిమాట విందు ♦ నెవ్వండు నేర్చును
జెప్ప నాకు నంత ♦ చెలిమి యుండు
నెవని కొరుని కింక ♦ నెక్కుడై నాపయి
నెవనితోడ నేను ♦ నీడు తలఁప. 219

సీ. దుఃఖించు నొరుఁడేఁడు ♦ దుఃఖింపఁగా నేను సుఖయించు నెవ్వఁడే♦సుఖపడంగ
నన్యుఁ డేఁడు రహస్య ♦ మావేదనము సేయ సముచితస్థానమై♦జరుగువాఁడు
నన్య నెవ్వని నిఁక ♦ నాధారముగఁ జేసి పనులభారం బెల్ల ♦ నునిచి నేను
నిర్వృతాత్ముండనై ♦ నిచ్చలు సుఖయింతు నన్యుఁ డెవ్వఁడు నన్ను♦నాదరించు
తే. నన్యుఁ డెవ్వఁడు మత్కార్య♦సుందు వ్యగ్రుఁ
డగు నొరుం డేఁడు కుపితుల ♦ నంబఁ దండ్రి
శాంతచిత్తులఁ గావించి ♦ సత్వరముగ
నన్నుఁ గొని తేర వలఁతియా ♦ సన్నుతుండు. 220
తే. అనుచు ననుకొను చుండంగ ♦ నవనినాథ
తనయుఁ డాత్మను నారాత్రి ♦ చనియె దుఃఖ
దీర్ఘ మయ్యెను వేగంబు ♦ దివ్యతేజ !
తెల్లవాఱెను విశదదీ♦ధితులఁ దూర్పు 221
క. జనములు స్కంధావారము, చనుదెంచెను దశపురంబు♦సరస కనుచుఁ దా
మనుకొనఁ దొణఁగిరి నలువా, తనె వినె నా వార్తనృపతి♦తనయుం డంతన్. 222
వ. అట్లు జనవ్యాపృతంబైనస్కంధావారాగమనవార్త నాలించి సముల్లసిత
మానసుండై యాచంద్రాపీడుండు తనమనంబున. 223

మ. అరరే ధన్యుఁడ నైతిఁ బో విధికి న♦త్యర్థం బనుగ్రాహ్యుఁడన్
స్మరియింపంగనె మద్ద్వితీయహృది వై♦శంపాయనుం డద్దిరా
యరుదెంచెన్ గద యంచు నుండఁగఁ బ్రహ♦ర్షాయత్తచిత్తంబుతోన్
బరుగుల్ వాఱుచు; దవ్వునన్ వినతులన్ ♦ గావించుచున్ మోడ్చి కేల్.

క. చనుదెంచెడు కేయూరకుఁ, గని రాసుతుఁ డనియె నిట్లు ♦ కరగత మని సి
ద్ధిని దలఁపుము కేయూరక, మనవైశంపాయనుండు ♦ మనకడ వచ్చెన్. 225

క. అనుటయు వాఁ డామాటను, విని పయనము సాగ దనుచు ♦ వేగ మనమునన్
గని చింత మదిని బైకిటు, లనియెను మే లాయె మదికి♦హాయి యొదవెఁ బో.

క. అనుచునె డాయఁగఁ జని ప్ర, క్కను వైశంపాయనుండు ♦ గడుదగ్గఱకున్
జనుదెంచిన సల్లాపము, లను జెప్పుచుఁ గూరుచుండి ♦ లలిఁ గొంతవడిన్. 227

తే. పరిజనములెల్ల సన్నచేఁ ♦ బాయుటయును
గాంచి రాసుతు వినయంబుఁ ♦ గానుపించి
యంజలి ఘటించి యతినమ్ర♦తాంగుఁ డగుచుఁ
బలికెఁ గేయూరకుం డిట్లు ♦ భావ మలర. 228

సీ. జలదాగమంబును ♦ సర్వత్ర విలసిల్లుశంపాలతికవోలె; ♦ జలము రాక
శ్యామలంబై మించు♦జలదరేఖయుఁబోలె; సితధామునుదయంబు♦ శ్వేతకాంతిఁ
గానుపించెడుతూర్పు♦కరణి; నామని రాక నామోదిమలయాని♦లాగమంబు
విధిని; బల్లవసము♦ద్భేదమభ్యుచ్ఛ్రితమదనమహామధుమాస♦మావిధంబు

ఆ. ప్రసవనిర్గమంబుఁ ♦ బ్రాప్తరాగం బైన, పల్లవోద్గమంబు♦పగిది; వికచ
కాశకుసుమగుచ్ఛ♦గతి శరదాగతి, నీయవస్థ తెల్పు ♦ నీదుగతిని. 229

వ. దేవా! భవదీయం బైనయీయవస్థయె భవదాగమనంబు నిస్సందేహముగఁ దెల్పుచున్నది. వేఱఁ జెప్పం బని లేదు. సందియంబు వీడి యవశ్యంబు దేవి యొద్దకు నరుగవలయు. చంద్రికావిరహితుం డగుచంద్రుని నెవ్వం డేని యెన్నం డైన నెం దైనం గని యెఱుంగునే. కమలినీశూన్యం బైనకమలాకరం బుండునె. లతావియుక్తం బైనయారామంబు గలదే. మఱియు సర్వజన సుందరం బయ్యు మధుమాసంబు సహకారకుసుమమంజరీపరిగ్రహంబు లేక ప్రకాశించునే. యూథపతివదనంబు మదదానధారావిలసితంబు గాక భాసిల్లునే. వైళంబ తరలవలయు. వైశంపాయనుం డరుదెంచి వానితోడఁ గార్యాలోచనంబుఁ గావించి గమనసంవిధానంబుఁ గావింపఁ బెక్కునాళ్లు పట్టు. అంతకున్ దేవి నైఁపదు. ఆమె యవస్థ సర్వంబు నీకు నివేదించితిఁ గదా. అన్నిటికిన్

బ్రత్యాశ బలవత్తరం బయి శరీరధారణంబుం గావించు. దేవీహృదయం బిపుడు భవత్పునరాగమనంబునందు నిష్ప్రత్యాశం బని చెప్పం బనిలేదు. ఆమె యెవ్విధి నూఱశిల్లి యుండును, నే నిట కరుదెంచినవార్త నెఱింగి యా దేవి మేనఁ బ్రాణ మున్నఁ గార్యం బుండు. ఎన్నిదుఃఖములైన నైఁచి యీశరీరముఁ దాల్చెద నని మనంబునఁ దలంచి యొక్కమెయి యూఱడి యుండు. కావున నామనవి యాలకించి చిత్తంబుచే మున్న యరిగినవాఁడ వయ్యు శరీరంబుచే నిపు డనుపదం బవశ్యం బరుగవలయు నని ప్రార్థించెద. 280

ఉ. నే నిటనుండి యేమి పని♦నిర్వహణం బొనరింతు నొండుఁ; నా
చానకుఁ దానకాగమన♦సన్మహవార్తను దెల్పఁ బోవ నా
కానతి నిమ్ము నాదు హృద♦యంబు భవత్ప్రియతాప్రసాదస
మ్మానవిశృంఖలం బగుచు ♦ మాన కనుగ్రహ మీయఁ గోరెదుఁ. 281

క. అని విజ్ఞాపన చేయఁగ, ననఘుఁడు కేయూరకుఁడు మ♦హాంతఃపరితు
ష్టిని వికసిత మై గడు విరిసిన కువలయపూజమాల ♦ చెలువున మిగులఁ. 282

క. అలరెడిచూడ్కిఁ బ్రసాదముఁ, దెలుపుచు రాసుతుఁడు పలికె ♦ ధీవిలసిత! నేఁ
బలుకుదు నేమని యింకిటఁ, దెలియుదు వన్నియును నీవ ♦ తెల్పఁగ నేలా.

చ. కలుగును నేని కన్యనకుఁ ♦ గాఱియ మామక; మోర్వ కీగతిఁ
దలఁపక యాత్మశక్తియును ♦ దార్ఢ్యను నిట్టి ప్రయత్న మేఁ డిటఁ;
గలుగును దేశకాలములఁ ♦ గాంచెడువిజ్ఞత యేరి కొడ్లకుఁ;
గలుగును నేని కన్యనకు ♦ గాఢముగా నిటు భక్తి మాయెడఁ. 284

ఉ. చేసితి మంచియోజననె, ♦ శీఘ్రముగాఁ జనుః మేము వత్తుమం
చాసను గొల్పి ప్రాణముల ♦ నాఁగను దేవికిఁ దెల్ప నిప్పుడే
యాసతి సాకతంబునకు ♦ నగ్రతలం బగుపత్రలేఖ తా
బాసట యౌచు నీకు సతి♦పాదతలంబులయొద్ద కేగుతఁ. 285

ఉ. దీనిని గాంచి సుం తయిన ♦ దీమస మందు నవశ్య మంచు నే
మానసమందు నెంచెదను ♦ మానిని దీనికి నుండు దేవిపై
మానవిభక్తి స్నేహ మను♦మానము లే దని వెన్క నున్నయా
చానను గాంచె రాసుతుఁడు ♦ చయ్యన నాసతి మోము వాంచుచుఁ. 286

తే. ఒసఁగు మాజ్ఞాక్షరములను ♦ నుర్వరేశ
తనయ! యంచును నాసతి ♦ మనవి చేయ

నిశ్చయము చేసి తత్సతీ♦నిర్గమంబుఁ
బనిచె మేఘనాదుని బిలు♦వంగ భటుని. 237

తే పిలుచుటయు వచ్చి దవ్వున ♦ జేరి మ్రొక్కి
సలిపి మ్రోలను నాజ్ఞకై ♦ నిలిచియున్న
యతని స్వామముగఁ బిలిచి యా♦యవనినాథు
తనకుఁ డాశ్లేష మొనరించి ♦ యనియె నిట్లు. 238

చ ఉనిచితి మేఘనాద! నిను ♦ నుత్పలలోచనఁ బత్త్రలేఖఁ గాం
చ నరుగుదేర నెచ్చో నల ♦ చోటికె దీనిని పత్త్రలేఖకన్
గొని చను పీనితోడ నిను ♦ గూడెద నేనును వచ్చి యంతలో
మన ప్రియమిత్రుఁ డైనవర♦మంత్రిసుతుం గని వాజిసేనతోన్. 239

చ. అనుటయు వాఁడు చిత్తమని ♦ యంఘ్రులకున్ బ్రణమిల్లి వేగమే
చనుటకు సంవిధానమును ♦ సల్పఁగఁ బోవుడు; దేవరా! విలం
బన మిఁక నేల యంచు జనఁ ♦ బ్రస్థితుఁడై నిలువంగఁ బద్ద రా
తనయవిపంచికావహునిఁ ♦ దా నృపసూతి ప్రియంబు మీరఁగన్. 240

చ. పిలిచి సబాష్పదృష్టిఁ దమి♦పేర్మిని సారెకు సారెఁ గాంచుచున్
బులకిత మైనదోర్లతల ♦ భూరి గవుంగిటఁ జేర్చి వాచికం
బు లలి ననేకవర్ణపరి♦భూషిత మాతనకర్ణపూరమున్
దలఁగి స్వకీయకర్ణమును ♦ దచ్ఛ్రుతి నుంచి సబాష్పకంఠుఁడై. 2·1

చ. తవిలి యెలుంగు కుత్తుకను ♦ దట్టుపడంగను నక్షరంబులన్
దివిచి బలాత్కృతిన్ మిగులఁ ♦ దిన్నఁగ మత్ప్రియవల్లకీవహా!
యువతికి నాదువాచికము ♦ నొక్కఁడు నీకు వచింప లేదుగా
నవ తరుదైనవాచికము ♦ చానకుఁ బంపుదు నేమి చెప్పుమా. 242

చ. సరగున దేవితో మనవి ♦ సల్పుము; యందు నలీక మాత్త్రపా
భరవహనంబుచే నిను న♦పారముగా శ్రమపెట్ట నేల యీ
వరమతి పత్త్రలేఖ సతి♦పాదసరోజసమీపభూమికిన్
యరుగును గాదె యాయదియ ♦ యంతయుఁ జెప్ప నటంచు నుండఁగాన్. 243

చ. తను నెడఁబాసి యున్నటుల ♦ దర్లపలె న్గన యున్న వేదనన్
జనితము లైనబాష్పములు ♦ జాలయి కాఱ నమంగళం బటం
చు నిలుపలేక యాఁగినను ♦ శూన్యవిలక్షణదృష్టిచారయై
తనచరణాభివాదనముఁ ♦ దార్పఁగ వచ్చినపత్త్రలేఖకన్. 244

## చంద్రాపీడసందేశము.

చ. కని ప్రణయంబుచే నభిము♦ఖంబుగ నిల్చి మొగిడ్చి కేలు రా
తనయుఁడు పల్కె నిట్లని ని♦తాంతవినీతిని బత్త్రలేఖరో!
వినతి యొనర్చి సాంజలిని ♦ విస్ఫుటమామకమౌళిచేత నా
వనజదళాక్షి దేవికి న♦పారగభక్తిని బల్కు మీగతిన్ 245

చ. తొలుతటిదర్శనంబునన ♦ తోరపుసాకతమున్ స్వభావవ
త్సలతను గానుపించినయు♦దారమనస్కను దేవి భక్తిమై
సలిపి ప్రణామమైన నొక♦చాడ్పున మన్నన సేయ కూరకే
సలిపి యవజ్ఞ వచ్చి ఖల♦సన్నిధి నెన్నికఁ గంటి నక్కటా. 246

సీ. జడమయ్యె నాప్రజ్ఞ ♦ చంచలంబయ్యెను ధైర్యమెల్లను; దెల్వి♦ దాల్చె మొఱకు
స్నేహవల్లరి తాను ♦ జెందెను రౌక్ష్యంబు; గౌరవంబెల్లను ♦ గాంచె లఘుతఁ
బ్రియవాదితయుఁ గోరెఁ ♦ బేరుపారుష్యంబు; మృదుహృదయత్వంబు ♦ గదిసె బిరుసు
స్థైర్యమెల్లను బొందెఁ ♦ జంచలభావంబు నార్జవంబెల్లను ♦ నడఁగె మాయఁ
తే. బల్కుఁగా నేల పెక్కులు ♦ పరమకృపత
పొందె నిస్త్రింశతను సిగ్గు ♦ పొందె ధార్ష్ట్య
మలఘుభక్తి యవజ్ఞాన ♦ మందె మృదుత
కఠినతను జెందె నే మందుఁ ♦ గంజనేత్ర!. 247

తే. ప్రశ్రయం బెల్ల నభిమాని♦భావ మందె
శీల మెల్లఁ బురోభాగి♦సిరి వహించె
క్షుద్రతను బొందె సౌందర్య♦శోభ యెల్లఁ
దవిలెను గృతఘ్నతఁ గడు కృ♦తజ్ఞతయును. 248

ఉ. మారెను దోషముల్గ మటు♦మాయఁగ సర్వగుణంబు లీగతిన్
సారసగంధి వేఁడుకొను ♦ సద్గుణ మొండితఁ డేమి గాంచితన్
గూరిమి మీరఁగా మరలఁ ♦ గొమ్మని; దేవియు నట్లు గైకొనున్
మారశరాగ్నిహోత్రమున ♦ మంటలఁ గ్రోసినయాకృతిన్ గటా. 249

సీ. అనృతాత్మదానంబు ♦ నగపడఁగాఁ జేసి పొలఁతిడెందము మోస♦పుచ్చ లేదు
ప్రకృతిపేశల మగు♦భామినీహృదయంబు మ్రుచ్చిలి నేఁ గొని♦పోవ లేదు
ప్రాణసందేహంబు ♦ పడఁజేయునీశకీరావస్థ నదయుండ ♦ నౌచుఁ జూడఁ
గాదు దీనికి నేను ♦ గత మని సర్వదోషాశ్రయుం డగునేను ♦ నంఘ్రులఁ బడి

తే. వేఁడికొంటి నటంచు నా♦వెలఁది నన్నుఁ
గైకొనునొ దేవి? యెటుల ని♦ష్కారణముగఁ
గైకొనును నేగుణంబులు ♦ గలుగ కున్న
దేవిగుణములె యెబ్బంగిఁ ♦ దేవ నాకు. 250

ఆ. ప్రకృతి సరస మగుచుఁ ♦ బరఁగు నీ దైనయా
సరసతయె ప్రసూన♦సాయకాగ్ని
దహ్యమానుఁ డగుచు ♦ దవ్వున నుండునన్
గాచుచున్న దివుడు ♦ గాసి మాన్పి. 251

సీ. సారెకుఁ దత్స్నేహా♦సద్వల్లరియె పిల్చుఁ దత్థ్సిరప్రజ్ఞత ♦ తనను దార్చుఁ
జతురత ప్రాభృతు ♦ సల్పు; వాత్సల్యంబుగైకొనఁగాఁ జేయుఁ♦గరుణ మీర
మృదుహృదయత్వంబు ♦ పదములఁ బడినట్టిదనుఁ దిరస్కారంబు♦సలుపకెపుడు
గ్రుచ్చి లేవఁగ నెత్తి ♦ మచ్చికను మహానుభావత పాటించు ♦ వరమునీమ
తే. పలుకు ప్రియవాదితయును రా♦భావ మొసఁగు
హృదయమునఁ జోటు; నైనను ♦ వదలి లజ్జ
మరల దర్శన మిమ్మని ♦ యరుగఁ దెగువఁ
దాల్పఁగా దేవిసత్ప్రసా♦దములె కతము. 252

చ. మలరహితంబు లో చెవుడు ♦ మానక యుండుట నత్యుదారతన్
గల వపుటన్ దదాశ్రయముఁ ♦ గాంచినయీవిశదప్రసాదముల్
గలిగినవైనఁ దత్క్షణమ, ♦ గల్గఁగఁ జేయవె జీవితాశలన్
గొలువు మదీయసేవ్యతను ♦ గోమలికిన్ స్మరణంబు తప్పకే. 253

చ. కలుగఁగఁ జేయు నుత్సుకతఁ ♦ గాంతపదాంబుజసేవఁ జేయఁగాఁ;
దెలుపును గొల్చునేర్పు; మఱి ♦ తెల్పును దానియుపాయపద్ధతుల్;
పలుకుఁ బ్రియోక్తు లంచు బహు♦వారము నాజ్ఞ యొనర్చు నీ గతిన్
మెలఁగు మటంచుఁ దామ కమి ♦ నేర్పును నీసదనుగ్రహంబులే. 254

వ. మఱియు నీదేవీప్రసాదంబులు. 255

చ. వదనముఁ గాంచఁగాఁ జనెడు♦వారి నకాలమునందుఁ జొచ్చుటన్
గదిరినకిన్క నూఱడిలఁ♦గా నొనరించుఁ; బ్రమోదవేళలన్
గుదురుగ సద్గుణంబులను ♦ గొండలుగా వచియించి సాకతం
బొదవఁగఁ జేయు; లజ్జ నట ♦ నోసరిలన్ దగఁ బట్టి తార్చెడున్. 256

తే. ఈయుపవశాళ నొండొక ♦ యెడను నుండఁ
దత్ప్రిపాదంబు లివి సాక ♦ తంబు గలుగఁ
జేయునవి కాన పీడంగఁ ♦ జెల్ల దటుల
గురువు లౌటనె నూఁతగాఁ ♦ గొనఁగ నయ్యె. 257

తే. విస్తరము లౌట దాఁటంగ ♦ వీలు కావు
పరిహరింపంగ నవి గడు ♦ బాహుళికములు
దూరగతుఁ డై ననన్నుఁ దాఁ ♦ దోయజాక్షి
ముదల నీకున్నఁ గొనిపోవు ♦ ముదితకడకు. 258

చ. చనఁగ ననుజ్ఞ వేఁడకయె ♦ సద్గుణయంత్రణఁ బోదు నంచుఁ దా
మనవి యొనర్చె నేది యుల ♦ మందసరస్వతియే నివేదనం
బొనరుచు నాదురాక వృథ ♦ నొందదొ శూన్యతఁ బొందదో జగం
బును నటు లట్టు మే నిలుపఁ ♦ బూనవలెన్ జతనంబు దేవి కాన్. 259

చ. అను మని చెప్పి యిట్లనియె ♦ నాధరణీశసుతుండు వెండియున్
నను విడిపోఁగా వలసె ♦ నన్న వెతన్ మదిఁ బూనకయ్య త్రో
వను నొడ లోముటం గనకు ♦ పాటన సేయుమి, నోగిరంబు వే
ళను జనకుండు మీరి; యవి ♦ లక్షితమార్గమునందు దేననేన్. 260

చ. చనకుము చూడ కేదొ యొక ♦ చక్కి వసింపకు నిల్వకయ్య యె
వ్వనికొ యెఱుంగనట్టినికి ♦ భావన సేయక యీకు మీయెడం
బును నెపుడున్ శరీరమునఁ ♦ బోవిడు మేమఱుపాటు పత్రలే
ఖ! నలఁగ కూర కిష్టములు ♦ కాంతరొ! నీకును దేవిప్రాణముల్. 261

చ. కనుకన వాని నిల్పుకొనఁ ♦ గా నిటు లొంటిగ నిన్ను వీడితిన్
గను మిదె నీదుహస్తమునఁ ♦ గ్రాలును మామకజీవితంబు నీ
వనయము నెల్లభంగులను ♦ నాత్మను రక్షణ సేయఁగా వలెన్
విను మని కౌఁగిలించికొని ♦ వీడ్కొని కూరిమి మీర దానినిన్. 262

క. కని కేయూరకు దీనిని, గను మవధానత నటంచుఁ ♦ గావించి విధిన్
ననుఁ బిల్చుకొని చనఁగ రమ్మనుచు మహాశ్వేతయాశ్ర ♦ మావని కనుచున్. 263

తే. అనిపె వానిని రాసుతుం ♦ డంతఁ బత్ర
లేఖయును వానితోఁ బోవ ♦ లెస్స వేగ
పోయిరో లేదొ నడుమను ♦ బోవు చుండ
నంతరాయంబు లేమైన ♦ నాఁగు నేమొ. 264

తే. మరల నిట కెన్నిదినముల ♦ కరుగు దెంత్రొ
యనుచు నత్యంతశూన్యమై ♦ మనము దనర
నొక్కతుణ ముండి ప్రతిహారి ♦ నొకని బంపి
సైన్యవార్తల నెఱిఁగింపఁ ♦ జక్కఁగాను. 265

తే. పెక్కునాళ్లుగఁ జూడని♦ప్రియవయస్యు
ననఘమతిని వైశంపాయ♦నుని కెదురుగఁ
బోవ ననుమతి వేఁడంగఁ ♦ బోయె జనకు
పాదజలజంబులసమీప♦భాగమునకు. 266

వ. అట్లు పోయి చంద్రాపీడుండు ప్రతిహారిమండలంబు ససంభ్రమప్రధావితంబయి యతివిశాలమార్గం బొసఁగి యిరుపార్శ్వంబుల నిలువ దూరమునం దుండియె వలకేలుఁ వలమోఁకాలుఁ విమలమణికుట్టిమంబుపై మోపి ప్రతిబింబితాంగుం డగుచు నాయతకుంతలకలాపంబు రెట్టింపఁ దండ్రికి నమస్కరించుటయుఁ దారాపీడుండు దూరంబునన నమస్కరించుచంద్రాపీడుం గాంచి నిర్భరస్నేహగర్భుం బయి సలిలభరమంథరజలధరధ్వాననిభధ్వానంబున రమ్ము రమ్మని సరసకుం బిలువఁ గనుకనిం బఱుచుచు శుకనాసునకు నమస్కారంబుఁ గావించి తనప్రక్క కేతెంచి మణికుట్టిమంబుపై నధివసించుకొడుకుం దివిచి నిజోత్సంగంబుపైఁ గూర్చుండఁ బెట్టికొని యాలోకనకౌతుకం బెంతకుఁ సమయనిచూడ్కులఁ జూచుచు నవనవయౌవనాభిరామంబు లగునంగప్రత్యంగంబులఁ గరతలంబున నిమురుచు సమీపవర్తి యగుశుకనాసుతో నల్లన నిట్లనియె 267

సీ. కనుఁగొను శుకనాస! ♦ కనకమహీధరనీలమణిప్రభ ♦ నివ్వటిలుచు
గంధసింధురగండ♦బంధురమండలోద్భాసి యామదరేఖ♦భాతిఁ గనుచుఁ
ద్విట్పతికాంతులఁ ♦ దేజరిల్లుచుఁ గడుఁగ్రాలెడుశశిలక్ష్మ♦కాంతివోలెఁ
గడువికస్వరశోభఁ♦గాంక్షించుకమలాకరవిలసన్మధుకర♦రాజివోలె

తే. రూపచిత్రవిలేఖన♦రుచిరమేచ
కాంజనశలాక, తారుణ్య♦కాలనీర
దాసితిమరాజి; తత్ప్రతా♦పాగ్నిధూమ
రాజి యితనిలసచ్ఛ్మశ్రు♦రాజి యలరు. 268

తే. మన్మథోద్యానవనగత♦మాలవల్లి, ఘనసముజ్జ్వలస్మరదీప♦కజ్జలశిఖ
మారధోపాదిబాలత♦మస్ముద్గమంబు; నై పొల్చుచున్నది♦మఱియునదియు

తే. పరిణయశుభంబుఁ బడయంగ ♦ వలసినదళ
యరుగుదెంచెను దేవితో ♦ నరసి యొక్క
రాచకన్నియఁ గులరూప ♦ రమ్య జగతి
నరయు మిఁకఁ దామసం బేల ♦ యమలచరిత!. 270

క. కనుఁగొంటిఁ బుణ్యవశమున, ఘనతరతపములను గాక ♦ కనఁజాలనియా
తనివదన మింకను స్నుషా,ననకమలము గాంచి ముద మ♦నంతముఁ గాంతున్.

వ. అని తారాపీడనరేంద్రుం డనుటయు శుకనాసుం డిట్లనియె. 272

చ. జనవర మంచిమంతనము ♦ సల్పితి వీతఁడు సర్వవిద్యలన్
గనె నసమానచాతురిని ♦ గాంచెను సత్కళలందు నైపుణిన్
గనెను జనానురాగమును ♦ గాంచెను దిగ్వనితాకరంబులన్
బ్రణుతకుటుంబినీపదముఁ ♦ బాటిలఁ జేసెను రాజ్యలక్ష్మికిన్. 273

క. చతురబ్ధిమేఖలాలం,కృతవసుమతిఁ జెట్టవట్టెఁ ♦ గేవలుఁడే నీ
సుతుఁ డేమిట లోపం బిఁక, జతనం బొనరింపరాదె ♦ సతిఁ జేపట్టన్. 274

క. అని చెప్పఁగ శుకనాసుఁడు,గని సిగ్గును నమ్రవదన♦కమలుం డగుచున్
జనపతితనయుం డిట్లని,మనమునఁ జింతింప సాగె ♦ మమత యలరఁగాన్. 275

క. అరరే యీసంవాదము, కరము ముదం బొదవఁజేసెఁ ♦ గాంతను గాదం
బరిఁ గదియఁ దలఁచినప్పుడె, గురువు లిటువంటికోర్కి ♦ కుదిరె మనమునన్.

చ. తిమిరముఁ జొచ్చినాతనికిఁ ♦ దీపము; కాననమందుఁ ద్రోవఁ గా
నమి భ్రమియించువానికిఁ గ♦నంబడు నాప్తుఁడు; చచ్చువానిపై
నమృతమువాన; యబ్ధిఁ బడి♦నట్టినికిన్ దరి రాక; నాకు నీ
సుమశరుబారి కగ్గమయి ♦ చొక్కెడువానికి నీయ దెంచఁగన్. 277

క. తలఁపఁగ వైశంపాయనుఁ, డిలకించుట యద్దు నాకు ♦ దేవిఁ గలయఁగాఁ
గలుగదు మఱి యొం డని మదిఁ,దలఁచుచు నుండంగ లేచె ♦ ధరణిపుఁ డంతన్.

క. వినయానమ్రతనుం డగు,తనయుని యంసమున సకల♦ధాత్రీభారం
బును నుద్వహించుగురుతర,ఘనదోర్దండంబు నునిచి ♦ కడు నొయ్యొయ్యన్.

క. నడుచుచు శుకనాసుఁడు వెం,బడి చనుదేరఁగ విలాస♦వతిగృహమునకున్
గడు ముద మొందుచు నేగెను,గొడుకుం గని యామె మిగులఁ ♦ గుతుకితమతియై.

క. చందురునుదయముఁ గని మి,న్నందెడుసాగరము వేల♦యందమున మహా
నందము నొందుచు సంభ్రమ,మందుచు నెదురేగె సమ్ము♦దాశ్రువు లురులన్.

క. అగణితగతి వచ్చెడునా,మగువను గని దూరమునను♦మహినాథుఁడు తా

నగుచును మేలము లాడెదు, పగిది నుపాలంభనమ్ము ♦ పాటిల ననియెన్. 282

ఉ. దేవి! వధూముఖాంబుజముఁ ♦ దేజరిలన్ గని సౌఖ్య మందఁగా
భావమునందు నుమ్మలిక ♦ పాటిల దేలకొ నీకుఁ జూడవే
భావజుఁ గేరునీతనయు ♦ వక్త్రమునన్ విలసిల్లు శ్మశ్రురే
ఖావళి నూత్నయౌవనము ♦ నాదినిఁ బట్టినసూత్రపాతమై. 283

క. తనరెడు వివాహమంగళ, మును సల్పు మటంచుఁ దెల్పు ♦ మునుపటిపగిదిన్
మనయౌవనదుర్విలసిత, మనములు సాగ విఁక వాని ♦ మానఁగవలయున్. 284

ఉ. ఏమి వచింతువో యనుచు ♦ నింతిరో! నిన్నడుగంగఁ బోలుఁగా
నేమి వచింతు దేవి చెవు ♦ మే వచియించితి నెల్ల నింకనున్
మో మటువైవు త్రిప్పెదవు ♦ పొంపిరిసిగ్గున నడ్గకున్న న
న్నేమడుగంగ లే దనుచుఁ ♦ నెన్నుదు నడ్గినఁ జెప్ప వేమియున్. 285

ఉ. ఐతివి మంచితల్లివి య ♦ హా తెలిసెన్ సుతుపైన నీకు న
ప్రీతి, యనాదరమ్ము నతి ♦ వేలతిరస్కృతి యిట్టివేళలన్
మాతకుఁ జెల్లునే పలుకు ♦ మా యని యీదృశనర్మభాషలన్
భూతలనాథచంద్రుఁడు ప్ర ♦ భూతసుఖాంబుధిమగ్నచిత్తుఁడై. 286

క. తడవుండి శరీరస్థితి, నడపఁగఁ జనె నంతట శుక ♦ నాసముఖమునన్
గని యానతి వైశంపా, యనునకు నెదురేగ నరవ ♦ రాత్మజుఁ డంతన్. 287

క. జననీనిశాంతమందే, యొనరించి తనుస్థితిఁ జెలి ♦ యుద్గమనముఁ దా
నొనరింప సంవిధానము, లొనరుచు వేడ్కల నెసలిపె ♦ నోర్చి దివసమున్. 288

తే. రాత్రి నామిత్రదర్శన ♦ రాగమునను
శయనగతుఁడయ్యు మేల్కొని ♦ సమధికముగఁ
దోఁచు యామద్వయంబునుఁ ♦ ద్రోసి యెట్లొ
మన్మథావిష్టచిత్తుఁడై ♦ మహివసుతుఁడు. 289

సీ. గగనంబు కాలిమఁ ♦ గైకొని దానికి బదులు స్వకాంతుల ♦ పంక్తి నొసఁగి
తరుగహనంబుల ♦ హరితత్వమంతయు నప్రతిహతగతి ♦ నపహరించి
క్రిందను నవటముఁ ♦ గీలించి నాఁ జొచ్చి తరులతాచ్ఛాయలఁ ♦ దరిమివైచి
కుంజదరీవన ♦ కుహరోదరంబులన్ దాఁగినచీఁకట్లఁ ♦ దరిమివైచి
తే. శ్వభ్రములఁ జొచ్చునెపమున ♦ బలిగృహంబుఁ
జొరఁగ నుంకించు నా సౌధ ♦ సరణిధవళి

మమున కోకమయి ధవళిమ ♦ మరలఁ గూర్చె
ననఁగఁ జంద్రమయూఖంబు ♦ లలరె దెసల. 290

చ. కపురవుధూళులన్ దెసల ♦ గాఢముగా వెదచల్లునో యనన్
విపులపటీరవారి రజ♦నిన్ దిగఁ బూసెడునో యనంగ నా
విపులను నెత్తి పైకి విను♦వీధిని జెర్చెడునాఁ జెలంగుచున్
విపులముఁ జేయు నాఁగఁ దటి♦నీపులినావళి నెల్ల నొప్పుచున్. 291

వ. మఱియు. 292

సీ. గ్రహతారనక్షత్ర♦గణముల కెల్లను సంకోచభావంబు ♦ సల్పె ననఁగ
దళవికాసము దవ్వ♦సలుపుచు నొకటిగఁ గుముదాకరంబులఁ ♦ గూర్చె ననఁగఁ
గమలవనంబుల ♦ గాసిల్లఁగాఁ జేసి విడివిడి నుంచఁగ ♦ నడఁచె ననఁగ
శిఖరిశిఖరములఁ ♦ జిందెనో యనఁగను బ్రాసాదశిఖలందుఁ ♦ బండె ననఁగ
తే. వారిభంగంబులను దాఁటి ♦ పఱచు ననఁగ
గుంపులై పాఱు ననఁగను ♦ గూడి యొకట
వీధులందెల్లఁ బఱచిన♦విధము తోఁప
మించె నాశశికాంతులు ♦ మిహిరతేజ! 293

వ. మఱియు. 294

సీ. సికతాతలంబులఁ ♦ జిన్నియంచలతోడ జతలయి వేడ్కలు ♦ సలుపు ననఁగఁ
జంద్రశాలాసుప్త♦సతిగండలావణ్యమును సగంబుగఁ బంచు♦కొనె ననంగఁ
జంద్రకాంతచ్యుత♦సలిలధారావళిప్రక్షాళితంబులై ♦ పరఁగు ననఁగ
గగనధునీవీచి♦కలఁ దోఁగెనో యనఁ గైలాసగిరిరుచుల్ ♦ గ్రమ్మె ననఁగ
తే. నవిహతప్రవేశంబులై ♦ యలరి గర్భ
గేహముల దంతవలభికా♦వ్యూహములను
నంది పరభాగము వళక్షు♦మబ్జినీద
లములయందు నఖండమై ♦ యమరి మఱియు. 295

క. ఆరామమ్ములయందును, గూరిచి దినబుద్ధి ప్రాణి♦కోటికి; జ్యోత్స్నా
పూరముఁ గురియునొ చల్లునొ, ధారాపాతంబుగాఁగ ♦ ధారుణిమీఁదన్. 296

క. విరివి నొనర్చు ననన్ గ్రుమ్మరిలన్ జేయునొ యనంగ; ♦ మహి నల్లెడలన్
బరువుచు మదిరాతనయును, దర్పఁ గూర్పఁగ మరుని సర్వ♦బాణము లేయన్.

తే. కొలుచు చెల్లెడఁ దామయై ♦ గూరి ధవళ
కాంతిపుంజంబు వెలుఁగు నా ♦ కౌముదీశు

కిరణముల గమనోత్సాహ♦కలితుఁ డయి
యినుమడిగను జంద్రాపీడ♦జనపసుతుఁడు. 298

వ. శయనగతుఁ డయ్యు నిద్దుర పట్టమి రెండుజాములకే లేచి గమనసంజ్ఞా శంఖంబుఁ బూరింప నియోగించుటయు నాశంఖధ్వానంబు. 299

సీ. గగనభాగంబెల్లఁ♦ గ్రమ్మి విస్తారమై దిక్కుంభములఁ దూఱి ♦ దీటుకొనుచు
నభ్రచుంబితపురా♦దభ్రసాలశ్రేణి కాభ్యంతరమ్ముల ♦ నంది భ్రమను
నున్నతగోపురా♦త్యున్నతాట్టాలకశిఖరాగ్రముల నెక్కి ♦ చెలఁగి మిగుల
హర్మ్యాభ్యంతరంబుల ♦ నాటలాడి చతుష్కచత్వరంబులవికా♦సంబుఁ జెంది

తే. రాజమార్గంబులను బ్రసా♦రంబుఁ గాంచి
భవనసంకటములఁ బరి♦భ్రాంతిఁ జెంది
హర్మ్యగర్భంబులను మూర్ఛ ♦ నొంది చెలఁగి
తద్గమనశంఖరావంబు ♦ తనరె నృపతి!. 300

వ. మఱియుఁ దక్షిణప్రబోధితంబులై నగృహసరోజినీసారసంబులతారతర దీర్ఘారావంబు వెంటనంటిరా, గృహమరాళంబులసహజగద్గదకలరవంబున సారెసారెకు విచ్ఛేదంబు నొందుచు, గమనవేళాప్రణామసంభ్రాంతంబు లగువారాంగనాజనంబులచలద్వలయనూపురరసనాకలకలంబున నిర్ధార్యమాణంబునాఁ గడు దీర్ఘంబై సర్వజనశ్రోత్రంబులఁ బ్రవేశించి విరాజిల్లునావిజయశంఖధ్వానంబు రోదసీగహ్వరంబు నిండి చెలంగె నంత. 301

సీ. ఉత్థాప్యమానంబు ♦ లుత్థితంబులు సమాకృష్యమాణంబు లా♦కృష్టములును
నారోప్యమాణప♦ర్యాణంబులును మఱి పర్యాణకలితసం♦భాసురములు
నీయమానంబు లా♦నీయమానంబులు పూజ్యమానంబులు ♦ పూజితములు
పంక్తిస్థితంబు ల♦పంక్తిస్థితంబులు వాహ్యమానంబులు ♦ వాహితములు

తే. వచ్చుచుండెడునవియును ♦ వచ్చినవియు
నిలువఁ బడియుండునవియును ♦ నిలిచి వేచి
యుండునవియును నగుతురం♦గోత్తమములు
నృపతిద్వారాంగణం బెల్ల ♦ నెఱసి యుండె. 302

తే. సకలరథ్యాంతరంబులు ♦ చత్వరములు
నిండి లోపల వెలుపల ♦ నెఱసి పురము
పట్టకుండంగ నెందును ♦ బరఁగు చుండె
నాతురంగ మసాహస్ర ♦ మధిపచంద్ర!. 303

తే. కుంతవనమయ మన దివి, ♦ క్షోణితలము
ఖురరవమయంబు నా శ్రోత్ర ♦ కుహరములును
హేషితారావమయ మన ♦ నింపెలర్చెఁ
గవికరవమయంబు లనఁగఁ ♦ గ్రాలె దెసలు. 304

వ. మఱియు. 305

తే. వాజిభూషామణిప్రభా ♦ వారమయము
లయ్యెఁ జంద్రమయూఖంబు ♦ లాధరేశ
తనయభవనాంగణం బెల్లఁ ♦ దనరె ఫేన
పిండగుచ్ఛమయంబయి ♦ పృథ్వినాథ. 306

ఉ. ఆయువరాజమౌళిమణి ♦ యంతట వేగమె యేగుదెంచె నిం
ద్రాయుధ మెక్కి రెండవసు ♦ ధాకరబింబ మనంగ మ్రోల న
త్యాయతకాంతిహంసరుచి ♦ నాతపవారణ మాడుచుండ దదీ
యాయవినిర్గమంబు తెలి ♦ యన్ సలుపన్ విడి ప్రాంగణస్థలిన్. 307

మ. తను దర్శింపఁగ నూరెలన్ వరుసగా ♦ ధాత్రీతలాధీశస
త్తనయుల్ పెక్కుసహస్రముల్ నిలిచి గం ♦ ధర్వంబులం దుండియే
ప్రణతుల్ సేయఁగఁ బౌరు లెల్లరును ని ♦ ద్రాలీఢులై యుండుటన్
జనసమ్మర్దము లేకయున్ దురగసై ♦ న్యవ్యూహబాహుళ్యమై. 308

ఆ. చౌరఁగ నిరవు లేని ♦ వరరాజపథమునఁ
దెరువుఁ గాంచి యెట్టొ ♦ ధరణినాథ
సుతుఁడు పురము వెడలె ♦ క్షోణి కంపిల్లంగ
వెడలి పురముచెంతఁ ♦ గడుకుఱంగట. 309

చ. తెలియఁగ రాక స్వచ్ఛతను ♦ దెల్లనివెన్నెలవెల్లి కప్పుటన్
జలములు; గట్టుపైనఁ గల ♦ నాదములన్ భయపడ్డహంసకా
వళులప్రడీనముల్ తెలియుఁ; ♦ బాణితలాంగుళిఁ బిల్చునో యనన్
బొలుచుచు నెల్లెడన్ శిశిర ♦ భూరితరంగసమీరుతాఁకునన్. 310

చ. జలములు చేరువం జెలఁగు ♦ సంగతిఁ దెల్పుచు నొప్పుసిప్రశై
వలిని దరించి, సంకుచిత ♦ భావము లేకయు స్నిగ్ధమై కడున్
సలుపుచుఁ గౌతుకంబు చనఁ ♦ జాలవిశాలతఁ జంద్రకాంతులన్
జెలఁగుచు మ్రోల విస్తృతిని ♦ జెందినమాడ్కిని గోమలంబునై. 311

క. తనరెడుదళపుటభేదన,మున కరిగెడుత్రోవఁ బట్టి ♦ పోవఁ దొడంగెన్

జనవరతనయుఁడు మోదాంబునిధినిమగ్నహృదయుఁడయి ♦ భూవరచంద్రా!.

వ. అంత. 313

మ. తతమై దిగ్వదనంబులన్ బ్రతతికిన్ ♦ దర్పంబునన్ బాఱునా
యతచంద్రాతపవారిపూరమునఁ బ్రో♦యుంబడ్డవో నాఁగ నుం
త్రితనూజాతుని మిత్రుఁ జూడఁగఁ గడున్ ♦ దీవ్రంబు గావించురా
ట్సుతుచిత్తం బన నొప్పుచున్; బఱచు త♦త్క్షోణీశపుత్రాశ్వముల్. 314

చ. దొరయుచు, దానిజంఘలను ♦ దోరసుగా జనియించుగాలిచేఁ
బరువడి నీడ్వఁగాఁ బడిన ♦ ధాతిని దత్తురగంబు లెల్లఁ దా
మరిగెను యోజనత్రయము ♦ నంబుజవైరి మునుంగునంతకే
పరవెను నంత మారుతుఁడు ♦ వాపఁ బథశ్రమ మెల్లనో యనన్. 315

సీ. నిర్భరకౌముదీ♦నీరావగాహంబు సలిపి యార్ద్రార్ద్ర మా♦స్పర్శ మంది
హిమశీకరాసార ♦ మిల నెల్లఁ గురియుచు ముద్రితకుముదాస్య♦ములను విప్పి
సౌరభం బెల్లను ♦ సంగ్రహం బొనరించి దానిచే జడతను ♦ దాల్చి మిగులఁ
బాంసులులితనైక♦భంగి పల్లవయువద్విజితం బయి నిశా♦విరమణంబు

తే. తెలుపు చాహ్లాదమును బురి♦కొలుపుచుఁ గడు
నధ్వగుల కెల్ల నాయాస ♦ మణఁగఁ జేసి
చెమ్మటలు వాపి చిత్తంబు ♦ నేద తేర్చి
మందమారుత మల్లల్ల ♦ మలయుసాగె. 316

ఉ. ఇంచుక నేపులోన నుద♦యించు నమస్కరుఁ డంచు ఖన్నతన్
గాంచెనొ; శర్వరీవిరహ♦గాఢతరవ్యథఁ గుందెనో గడున్;
మించినవేడ్క సంజఁగొలె ♦ మిన్నుఁ గనుంగొను కైరవంబు ల
క్ష్యంచితమైన తేజమును ♦ నానుట క్షీణత నందెనో యనన్. 317

చ. గగనసరస్సునన్ జలముఁ ♦ గాంచును ద్రావెడుమేఘపంక్తినాఁ
దగు హయధూళి గ్రమ్మినక♦తంబున నాఁగను జంద్రమండలం
బగపడెఁ దెల్లనై; గళిత ♦ మాయె నిశాతప మభ్రలక్ష్మి తా
దిగవిడఁ దద్వ్యథన్ బడున♦తిగ్మమయూఖునిపై పటంబు నాన్. 318

ఆ. అపరజలధిపాలి ♦ యానిశాతపజల
పూరమునను బొల్చు♦భూరిఫేన
బుద్బుదాళి యనఁగఁ ♦ బొల్చునక్షత్రంబు
లణఁగె నొక్కొఁ డొక్కఁ ♦ డమలచరిత! 319

ఆ. దళితమౌక్తికముల♦తళుకున గౌరమౌ,చంద్రికానుభావ♦సరణి దెసలు
విడిచి మెల్ల మెల్ల ♦ విస్రవన్నీహార,వారిచేతఁ గడుగఁ♦బడ్డపగిది. 320

ఆ. జలమునుండి పైకిఁ ♦ జనుదెంచునో యనఁ, బైకి వచ్చుచుండెఁ ♦ బాదపములు
లతలు విటపతతులు ♦ వితతంబులై తమ,సహజనీలకాంతి♦చయముతోడ. 321

సీ. వాసరముఖకరి♦వరకుంభసిందూరపాంసు వంబరసరః♦పంకజంబు
పూర్వదిగంగనా♦పూర్వశ్రవణపూరవరరక్తకంకేళి♦పల్లవంబు
భాస్కరస్యందనో♦పరితలోజ్జ్వలరక్తతతవినూతనసుకే♦తనపటంబు
తీర్ణవియోగాబ్ధి♦తీరకోకపరస్పరవ్యాపృతగృధాను♦రాగచయము

తే. సాంధ్యరాగంబు భాసిల్ల; ♦ సాంధ్యరాగ
పరిగతాంతంబుల నివాస♦పాదపముల
దానవహ్నిశిఖాపరీ♦తంబు లనుచుఁ
బత్త్రరథములు విడి దివిఁ ♦ బాఱుచుండె. 322

తే. పిక్కలను నంఘ్రులను గాను♦పింపకుండ
దీర్ఘముగఁ జాఁపి తటుకునఁ ♦ దీసికొనుచు
దవ్వు దవ్వులఁ దాఁటుచుఁ ♦ దరలు చుండె
నిద్రకన్నులతో హరి♦ణీగణంబు. 323

సీ. మనసు వచ్చినయట్లు ♦ మలఁగి పల్వలములఁ దత్తీరముస్తాగ్ర♦తతులు ద్రవ్వి
యలసి పందులగుంపు ♦ లటవీగుహాభిముఖములయి చన ఘుర్ఘు♦రములు చెలఁగ
వేఁటకుఁ దిరిగి రా ♦ విడిచిన నిటు నటు దిరుగాడుగోవులఁ ♦ దెల్ల నాచు
గ్రామసీమాంతిమా♦రణ్యాంతభూములు తనరారఁ జూడ్కులు ♦ దనియ మిగుల

తే. నెగడ వీక్ష్యమాణజనవి♦నిర్గమములు
ఖర్వటములు ప్రసూతిని ♦ గాంచు ననఁగఁ
బూర్వదిగ్భాగ మలరంగఁ ♦ బూష్ణుకిరణ
ముల సమున్నీయమాన మ♦హాలలిని దనరి. 323

సీ. సలిలాశయములెల్లఁ ♦ జెలఁగె నుత్తానంబులనఁ; ఖండ్యమానంబు♦లనఁగ గిరులు
నుర్వీతలంబెల్ల ♦ నుద్ధ్రియమాణమై యలరు ననఁగఁ; గైర♦వాళి యెల్ల
నెటకో యదృశ్యమై ♦ యేగునో యనఁ; దిరోధానకారిణి యగు♦ధ్వాంతపంక్తి
శ్యామలప్రతిసీర♦చందానఁ దొలఁగించి కరముల విరహాగ్నిఁ ♦ గ్రాఁగి క్రాఁగి

తే. గాసిఁ గాంచినకమలినీ♦కాంతఁ గాంచి
యూఱడింపంగనో యన ♦ నుదయశైల

శిఖరతల మెక్కె సూర్యుండు ♦ క్షితికి నెల్ల
భయనుఁడును సప్తవాహుండు ♦ నరవరేణ్య.! 325

తే. ఆకసమునెల్ల వెలిఁగించి ♦ యఖిలదిశలఁ
దేజరిలఁ జేసి లోకోరు♦దీపకములు
దివసకరదీధితులు తోఁచెఁ; ♦ దృష్టిఁ జొన్ప
నర్హ మగునట్టియుత్తతి ♦ నధిపసుతుఁడు. 326

క. కనె రాత్రి వెడలి యచటికిఁ, జనుదెంచిన విడిసియున్న♦స్కంధావారం
బును గ్రోశమాత్రదూరం,బుననే తనయగ్రభాగ♦మునను దటుకునన్. 327

క. ఘన మగునంతఃక్షోభం,బునకున్ భయమంది నాఁగ ♦ భువనము దాఁ గ్ర
క్కెనొ వెలి కన సంఘాతం,బును సైఁపఁగ లేక మదిని ♦ భువి చల్లె నన్.

తే. అపరిమిత మగుధూళిచే ♦ నావృతంబు
నగుదు ననుశంక నాకాశ ♦ మన్నిదెసలఁ
బాఱఁ జల్లెనొ యనఁగఁ; బ్ర♦భాకరావ
లోకము సవిస్తరము చేసె ♦ వీఁక ననఁగ. 329

వ. మఱియు. 330

సీ. కడుదీర్ఘలోచన♦కలితుల కేనియుఁ గనరానిప్రాంతభా♦గంబు గలిగి
యనుజీవిరాజసా♦హస్రకల్పితదృఢఘనతరావష్టంభ♦కలిత మగుచు
నడయాడు రెండవ♦పుడమి నా; నిర్గలప్రాణిమయావని♦భాగ మనఁగ
సంతతోద్గతరజః♦స్సంతతిపూరిత మవిదితవృత్తాంత♦మయ్యె నిట్టు
తే. లట్లు విచలితధవళధ్వ♦జాంబరోల్ల,సన్మదకరీంద్రసాహస్ర♦సంకులంబు
నవిరళబలాకవిభ్రాజి♦తాంబువాహ, మూర్తిమన్మేఘవేళ నాఁ ♦ బొలిచి మిగుల.

తే. విడియు నెలవులు గైకొన ♦ వేగిరమునఁ
బరుగువాఱునసంఖ్యాక♦వారణాశ్వ
నరసమాకులమయి మంథ♦నగవిఘట్ట
నలులితోర్మిమాలాకుల♦జలధిమాడ్కి. 332

క. పొలిచెడిస్కంధావారముఁ, దిలకించి నరేంద్రసుతుఁడు ♦ ధీ నిట్లనుచున్
దలఁచెను నరరే భద్రము, తలఁచిన మాత్రమున మిత్రు ♦ దర్శింతుఁ గదా. 333

తే. అనుచు మనమునఁ దలఁచుచు ♦ నాతపత్ర
చామరాదులతో సర్వ♦భూమిపతుల

సుతుల వారించి ద్రుతగతి • శోభిలంగ
ననుగమింపంగ మూఁడునా•ల్గశ్వములు.                                    334

తే. ఉత్తరీయంబుఁ దలఁ జుట్టి • యుచితగతిని
రయవిశేషంబు గలుగునిం•ద్రాయుధంబు
తోడ నానావిధారంభ•తూర్ణవరతఁ
దవిలియున్నట్టిసైనిక•స్థానకంబు.                                    335

వ. చొచ్చి ప్రతినివాసంబున కరగి వైశంపాయనుఁ డెచట నని యడుగుటయు.

మాలిని. కమలనయనచాపా! • కాందిశీకారిభూపా!
దమితవినతతాపా! • దారితానంగరూపా!
విమలరుచిరరూపా! • విశ్వవిశ్వేకభూపా!
శమితసుజనశాపా! • చండఘోరప్రతాపా!.                                    337

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైనశృంగారకాదంబరి యను మహాప్రబంధంబునం దుత్తరభాగంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీః.

శ్రీరామ స్సహాయోఽస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగారకాదంబరి

## ద్వితీయాశ్వాసము.



మానిభక్తమానస
తామరసాదిత్య! సకల ♦ దైవస్తుత్యా!
సోమామిత్యతురనిత్యా!
ధామాంచితసకలకృత్యా! ♦ ధారితసత్యా!. 1

వ. దేవా! అవ్వలికథావృత్తాంతంబు వినిపింతు. దయాయత్తమతి నవధరింపుము. అట్లు చంద్రాపీడుండు వైశంపాయనుం డేడ నని యడుగుటయుఁ దన్నివాసంబునకు సమీపమున నుండుస్త్రీలతం డెవండైనది యెఱుంగక యథారబ్ధకార్యవ్యగ్రు లగుచుఁ గన్నీళ్లు గాఱ శూన్యహృదయులై భద్ర! ఏల యడిగెదవు. ఇంక నెక్కడ వైశంపాయనుం డని యనుటయుఁ జంద్రాపీడుం డిట్లనియె. 2

### చంద్రాపీడుఁడు వైశంపాయనునివృత్తాంతము వినుట.

ఉ. ఏమిది! పావులార! యిటు ♦ లేల యయోగ్యములన్ వచింత్రటం
చామనుజాధినాథసుతుఁ ♦ డందియె శూన్యహృదంతరాళతన్
భామల వారిఁ బ్రోసికొని ♦ భామల నెవ్వరిఁ బల్కరింప కు
ద్దామభయేణశాబకవి ♦ ధంబున దుర్భరగోవిరోగమున్. 3

చ. తవిలినయుద్గతశ్రవణ ♦ తర్ణకముంబలె యూథవిచ్యుతిన్
దవిలి పరిభ్రమించెడుమ ♦ తంగజపోతముపోల్కి నేదియున్
జెవి నిడ కేరితోడను వ ♦ చింపక చూడక దేనిచాయనున్
దిరుగుచు నేడ నించుకయు ♦ నిల్వక గాంచకయున్ బ్రమోదమున్. 4

ఉ. వచ్చితి నేడ, కెందులకు ♦ వచ్చితి, నేడకు నేగువాఁడనో
వచ్చితి నేడనుండి యిట ♦ వచ్చి యొనర్చితి నే మొనర్పఁగన్

వచ్చితి నేమి యంచును మ♦నంబున నేర కెఱుంగఁగా వడిన్
జొచ్చెను సంధుమాడ్కి బడు♦చొప్పున సైకతమధ్యదేశమున్. 5

చ. బధిరునియట్లు మూగగతిఁ ♦ బార్థివసూనుఁడు చొచ్చి భూతసం
గ్రథితునియట్లు వోలెఁ గట♦కంబును నెల్లఁ బరిభ్రమింపఁగాఁ
బ్రథితతదశ్వమున్ గని నృ♦పాలకపుత్త్రులు వెంటఁ బర్విడన్
మథితసపత్నుఁ డైనతమ♦మానవనాథసుతుండె యంచు వే. 6

చ. వరుగులువాఱు చెల్లెడలఁ ♦ బై పటముల్ భువిఁ బడ్డఁ జూడకే
తోరఁగఁగ నశ్రుపూరములు ♦ తోరములై చనుదెంచె నచ్చటన్
ధరణిపవర్గ మెల్ల ముఖ♦తామరసంబులు వట్టిపోవఁగాన్
బరువుచు నేకమై త్రపఁ బ్ర♦ణామము దూరమునుండి సల్పుచున్. 7

క. చనుదెంచి యెదుర నిలిచినఁ, గనుఁగొని తద్వదనములను ♦ గడు వైశంపా
యనుఁ డేఁడియనుచు నడిగెను, మనుజాధిపతనయుఁ డంత ♦ మహీపతులెల్లన్. 8

క. తలవోసి యొకట నీతరు, తలమునఁ దిగుఁ డంతయును ను♦వంతం బవలన్
బలుకుదు మటంచు మనవిని, సలుపుటయు నృపాత్మజునకు ♦ శంక తలిర్పన్. 9

చంద్రాపీడుఁడు రాజులు వైశంపాయనవృత్తాంతముఁ జెప్పశంకించుటకుఁ దపించుట.

చ. తెలుపుటకంటెనున్ మిగులఁ ♦ దీవ్రతరం బగుతద్వచస్సు చే
నలఘుశరంబు లోఁదగిలి♦నట్లయి డెందము వ్రీల మూర్ఛ తా
నిలిపెను మేను సత్వరిణయి♦నేర్పున; నాతని దించి గుఱ్ఱమున్
సలిపి కుథోపవిష్టునిఁగ ♦ క్ష్మాపతివర్య లలంఘునీయులున్. 10

చ. జనకసమానులై యవుడు ♦ చయ్యనఁ బట్టుకొనంగఁ దన్ను నా
జనపతిపుత్త్రుఁ డేమియును ♦ సంజ్ఞను గన్న నెఱుంగ కొక్కనిన్
గనక యమాత్యపుత్త్రుఁ దన♦గాదిలినెచ్చెలిఁ దన్నుఁ గాంచు చే
నొనరిచినానొ యిట్లు మఱి♦యొ డ్లొనరించిరొ యేడ నుండునేన్. 11

చ. అనుచును నేమిదంచు భ్రమ♦నందినవాఁడునుబోలె మోహమున్
గనినవొ నాఁ దనర్చుకర♦ణంబుల కేమియుఁ దోఁప కున్న నా
జనపతిపుత్త్రుఁ డన్యమును ♦ స్వాంతమునన్ దలపోయ కొండు వ
చ్చినను సమస్తసైన్యములు ♦ స్నేహితుఁ డొక్కఁడు రామి నెంతయున్. 12

ఉ. ఓరువ రానివేదనను ♦ నుల్లము తల్లడ మంద నూర్తునో
యూరక నిల్పుకొంచు మది ♦ నుందునొ యుల్లమునుండి ప్రాణముల్

బారనొనర్తునొ తనువుఁ ♦ బాత మొనర్చి యిఁకేమి సేయుదున్
జేరుదు నొంటి నేదికను ♦ జెల్ల యటంచును నేమి సేయఁగన్. 13

తే. తెలియ నేరక ద్రవమయి ♦ చెలఁగు నసఁగ
దహ్యమానుండు నాఁగ వి♦దారితుఁ డన
నూఱుపరియలుగా లోన ♦ మీఱువ్యథను
దలఁచె నిట్లని మది నృప♦తనయుఁ డంత. 14

## చంద్రాపీడునిస్వగతచింత.

సీ. రమ్యతరం బయి♦రాజిల్లు జీవలోకంబు నరమ్యమై ♦ గానుపించు
జనసమాకులమయి♦తనరుచున్నను బృథ్వి శూన్యంబుగాఁ దోఁచు♦జూడ్కి కడలఁ
జేరలంతలు కనుల్ ♦ కూరి యున్నను దిక్కు లంధంబులై తోఁచు♦నకట నాకు
సంరక్షితం బయ్యెఁ ♦ జక్క నా జీవితఫలమెల్ల మ్రుచ్చిలఁ♦బడియె నకట
తే. వ్యర్థ మయ్యె సునిష్పన్న♦మైననాదు
జన్మ మంతయు నింకేమి ♦ సల్పువాఁడఁ
గనుదు నెవ్వరితోడ నే♦కాంత మింక
మాటలాడుదు నేనితో ♦ మమత తీఱ. 15

ఉ. ఎవ్వనితోడ సౌఖ్యముల ♦ నేఁ గనువాఁడను, నేల జీవితం
బవ్వనజాక్షి చిత్రరథు♦నాత్మజ యేటికి నాకు; నింకనా
కెవ్వఁడు చెప్పు మిత్రుగతి ♦ నెవ్వని నడ్గుదు వానికై కటా
యెవ్వని వేఁడుకొందు నిఁక, ♦ నెవ్వఁడు తాదృశమిత్రరత్నమున్. 16
ఉ. నాకు నొసంగు, నెట్లు శుక♦నాసునిఁ దండ్రిని దల్లిఁ జూచెదన్
నాకు బహిశ్చరాసు వగు♦నర్మసఖున్ విడి యొంటి నేగి నే
నేకరణిన్ సుతవ్యథను ♦ నేడ్చుమనోరమఁ దల్లి నూఱటన్
జేకుఱఁ జేయువాఁడను వ♦చించుచు నేమని యింక నేఁ గటా. 17
చ. అలవడె నేమొ యేదొ యొక♦జ్యాతల మక్కడఁ దానిఁ బట్టఁగా
నిలిచెనొ వెన్క రాక నర♦నేత వినమ్రుఁడు కాఁడొ యెవ్వఁడేన్
సలుప వినమ్రు వాని నట ♦ సల్పునొ తామస మింత లేక తాఁ
దెలిసి కొనంగ నిచ్చెనొకొ ♦ దివ్యము విద్యను నొండు వీడి నన్. 18
చ. అను నివియాదిగాఁ గలుగు ♦ నన్యములన్ మఱి యెన్నియేని తా
ననుకొనుచున్ మనంబునను ♦ నానతవక్త్రకుశేశయుండునై

తనహృదయంబు ప్రీతిమికిఁ ♦ దన్ను విలక్షునిగాఁగఁ దప్పిదం
బును నొనరించినాతనిఁగ ♦ భూరితరాఘునిగాఁగ నెంచుచున్. 19

వ. చంద్రాపీడుండు వదనంబు పైకెత్తకయ యెట్టకేలకు నల్లన నారాజవరుల
కిట్లనియె. 20

ఉ. ఏనిట వచ్చితిన్ బిదప ♦ యెట్టిది కల్గెనొ యుద్ధమెద్దియేన్
మానుషరానిశీఘ్రగతి ♦ మారణమొందఁగఁ జేయు రోగమే
దేని ఘటించెనో కలిగె ♦ నేగతి నిట్టియతర్కితాద్భుతా
నూనపవిప్రపాత మన, ♦ నొచ్చుచు నందఱు నానృపాలకుల్. 21

రాజులు చంద్రాపీడునకు వైశంపాయనవృత్తాంతముఁ జెప్పుట.

చ. శివశివ యంచు శ్రోత్రములఁ ♦ జేతుల రెంటను మూసి దేవ! భూ
ధవసుత! నీదు మేనుగతిఁ ♦ దావకమిత్త్రుఁడు నూటయిర్వదేం
డ్లు వసుధఁ దాల్చి యుండునని ♦ డొంకక చెప్పఁగ, వారివాక్యముల్
చెవిఁ గొని ప్రాణితుం డయిన♦లీల ముదశ్రువు లుబ్బి పాఱఁగాన్. 22

ఉ. ఆదటఁ గౌఁగిలించుచు స♦మాదరణంబున వారి నెల్లరన్
నాదువయస్యుఁ డొందెడను ♦ న న్విడి ప్రాణము తో నిమేషమేన్
బాదుకొనం డటంచు మిముఁ ♦ బ్రశ్న మొనర్పఁగ జీవితుం డటం
చావటఁ బొంద శ్రోత్రములు ♦ నాత్మయుఁ జెప్పితి, రేల రాఁ డిటన్. 23

ఉ. ఎచ్చట నుండువాఁ డిపుడు ♦ నేమి ప్రసక్తిని నుండువాఁడు మీ
రెచ్చట వీడి వచ్చితిరి ♦ యేటికి నొంటిగ వీడినారు మీ
రొచ్చెము లేదె యేమిటను ♦ నుంచక వాని బలాత్కరించి యే
నిచ్చటి కేల తేరయితి ♦ రేమి యుదంతము చెప్పు డంతయున్. 24

క. కలఁగెడు నామన మిప్పుడు, తెలియఁగఁ బదుదంత మెల్లఁ ♦ దేట పడంగాఁ
దెలుపుఁ డని రాకుమారుఁడు, పలుకుటయును వార లిట్లు ♦ పలికిరి కడఁకన్. 25

క. మనవి యొనర్చెద మట జరి,గిన దెల్లను వినుము దేవ! ♦ కికురింపక యొ
య్యన వైశంపాయనుతోఁ, జను దేరుఁడు మీర లెల్ల ♦ సైన్యంబుబడిన్. 26

క. చనియెద నేనని మీరలు, చనితిరి యానాఁడె ఘాస♦సమిధాదికసా
ధనజాతము గ్రహియించుట, నొనరింపక పయన మచట ♦ నుండెను దండుల్.

క. మరునాఁడు గమనదుందుభి, మొరయించి సమస్తవస్తు♦ముఖ్యంబులు స
త్వరముగ సమకూర్చెడు మము, నరసి భవన్మిత్త్రుఁ డనియె ♦ నధిపతితనయా! 28

సీ. అతిపవిత్రంబయి ♦ యచ్ఛోద మనుపేరఁబ్రథితిఁ గాంచినసరో♦వర మొకండు
వెలఁగుఁ బురాణప్ర♦సిద్ధంబు దానను గ్రుంకి తత్తటగత♦కుంభినీస్థ
సిద్ధాయతనమందుఁ♦జెలఁగుమహేశుని భగవంతు శశికళా♦భరితమౌళి
వలగొని ప్రణమిల్లి ♦ వచ్చి పోవుచ మట మరల నెవ్వం డట్టి ♦ మహితభూమి
తే. దివ్యజనసేవితంబును ♦ దీనిఁ గలను
నైనఁ గనుఁగొను నెన్నఁడు ♦ నైన నరరె
యనుచుఁ గాల్నడనే యేగె ♦ నాసరోవ
రంబుతీరంబునకు నట ♦ రాజతనయ! 29

వ. ఆసరస్తీరం బతిరమ్యప్రదేశం బగుట నెల్లయెడలఁ దిరిగి చూచుచు నొకప్ర
దేశంబున. 30

మ. సురభామాశ్రుతికోటి నెక్కఁ బ్రియముల్ ♦ జూపింప నర్హాంబులై
వరవీచీపవనాహతిన్ గదలుభా♦స్వత్పల్లవాళిన్ మనో
హరపుష్పాసవలోభపుంజితములై ♦ యార్భాటముల్ సేయుబం
భరజాలంబులఝుంకృతిధ్వనుల నా♦హ్వానించు నా దవ్వునన్. 31

చ. మరకతరత్ననీలసుమ♦మన్ దళదిక్కుల నెల్లఁ బూయు నాన్
బరఁగుచుఁ దా వొసంగక ప్ర♦భాకరఘృష్టులకున్ నిశీథ మం
తరమున సల్పుచున్ బగటఁ ♦ దద్దయు, వారిదశంక సారెఁ గం
ధరముల నెత్తి క్రేంకృతిని♦నాదములన్ శ్రుతి కింపుఁ బెంపుచున్. 32

క. కనుచుండఁగఁ జిరపరిచితిఁ, గనినట్టియరణ్యనీల♦కంఠములు గడున్
దనరుచు, వారిదవేళా,ఘనపద మన; జడిమనిజని♦కాయం బనఁగన్. 33

సీ. మధుమాసనిర్గమ♦మార్గం బనఁగ సర్వసంతాపప్రతిపక్ష♦సదన మనఁగ
నంగజాశ్రమ మన ♦ నాతనిసతి రతి తహతహవేడుక♦తా వనంగ
సర్వసర్వంసహా♦చారిమాస్పద మన సకలవిభ్రమకళా♦స్థాన మనఁగఁ
గందర్పమార్గణా♦గార మ్మనంగను శిశిరర్తు నావాస ♦ సీమ యనఁగఁ
తే. బరఁగునొక్కలతామండ♦పంబు సతత,చలితపరిమళశీతల♦లలితకలిత
మంథరాచ్ఛోదకాసార♦మహితభంగ,పవనవీజితాంతరశిలా♦పట్టముఁ గనె. 34

చ. కనుఁగొని యెన్నినాళ్లకునొ ♦ కాంచినతమ్ముని మాడ్కిఁ బుత్త్రభా
తినిఁ జెలినట్లు నన్యగత♦దృష్టిని విస్మృతపక్ష్మపాతలో
చనములఁ జూచు చట్టె తమి ♦ స్తంభితునట్లు విముక్తు మాడ్కి మూ
ర్ఛను గరణంబులన్, బుషమి ♦ సంశిథిలాంగకుఁడై తటాలునన్. 35

క. కూలంబడి లో నేమో, వాలాయముగా స్మరించు ♦ వాఁడుం బోలెన్
గ్రాలుచు ధ్యానించెదు గతి, జాలై యశ్రువులు కాఱ ♦ సతతము పైపై. 36

క. ఘోర కథోముఖుఁడై నగఁ, గూరని వదనాబ్జుఁ డగుచుఁ ♦ గూర్చుండెను వాఁ
డారీతి నుండువానిని, నారసి మానసములందు ♦ నలమెను నగ దాన్. 37

క. పరిణామధీరమతులును, వరరసికమనస్కులును ♦ బరిభావితు లా
దురు దేశనా యొకదానను, నరయఁగఁ గౌతూహలముల ♦ కాశ్రయ మగుచున్.

క. అలరెడు తొలి ప్రాయంబునఁ, జెలఁగెడు నవరసికవరులఁ ♦ జెప్పఁగ నేలా
కలిగెను హృదయవికారము, తిలకించి మనోహరోర్వి ♦ దీని నితనికిన్. 39

క. అనికొని మే మప్పుడె యిటు, లనితిమి త్వన్మిత్రతోడ ♦ నార్యచరిత్రా!
కనితిమి రమణీయంబుగఁ, గొన దీనిని యింక లెమ్ము ♦ కూర్పు జలకమున్. 40

సీ. ప్రొద్దుపోయెను గదు ♦ భూగిపై న్యం బెల్ల నాయితం బయి ప్రయా ♦ ణాభిముఖము
నినుఁ బ్రతీక్షించెదు ♦ నీ విం క నాలస్య మేల చేసెదు లెమ్ము ♦ చాలుఁ గనుట
యనుచు మే మనినను ♦ నాతఁడు మామాటఁ బెడచెవినిడి మూఁగ ♦ జడునిపగిది
మూఘునిచందాన ♦ మొనసి యుత్తర మేమి యీయక యనిమేషి ♦ తేక్షణుండు

తే. నిశ్చలకనీనికుఁడు నయి ♦ నిస్సృతాన
వరతబాష్పాంబుపూరముల్ ♦ వరద లగుచుఁ
బాఱ లిఖితునిగతిఁ దేరి ♦ పాఱఁ గనుచు
నుండె నాలతామండపి ♦ నండ నట్టె. 41

ఉ. సారెకు మేము రన్నుచు ♦ సల్పినఁ గర్కశ మెంత దానినే
సారెసుఁ గాంచుచున్ బలికె ♦ స్తంభితుఁ డాతఁడు నిష్ఠురంబుగా
స్థీరలు పొందు రాఁ దగదు ♦ నే నిటనుండి బలంబు లన్నిటిన్
మీరవె కొంచుఁ బొందు నని ♦ నేత్ర్యకుమారుఁ డతండు పోవఁగాన్. 42

ఉ. ఆతనిచేత రక్షితము ♦ లైనబలంబులు నుంప నిచ్చటన్
నీతియె కొంచుఁ బొం దనుచు ♦ నిష్ఠురవృత్తిని నాడునాతనిన్
భూతలనాథపుత్ర! విడి ♦ పోవఁగ రాదని దైవికంబుగా
నీతని కీవిరక్తి జని ♦ యించె నహేతుకమై తటాలునన్. 43

చ. అని తలపోసి మేము నిల ♦ యంబునకున్ జను దెమ్మటంచు సాం
త్వనవచనంబులన్ దెలిపి ♦ తాంతుల మైతిమి నిష్ఠురంబుగా
నని యని వేసటం గనితి ♦ మున్నను నన్ని లతానికుంజమే
కను చిటు త్రిప్పఁ డాయను ము ♦ ఖంబును హావెస కించు కేనియున్. 44

సీ. దేవతారాపీడ♦భూవరుపిమ్మట నార్యుఁ డాశుకనాసు♦నాత్మజుఁడవు
దేవివిలాసవ♦తిసతిచేఁ దమి నంకతలలాలితుం డయి ♦ తనరినావు
దేవచంద్రాపీడ♦ధీమంతుఁడును నీవుఁ బెరిఁగితి రొక్కటఁ ♦ బ్రీతితోడఁ
జదివితి రొకపాఠ♦శాలను జాలనా శ్లథియత్నమున శిక్ష ♦ నందినావు
తే. పెద్దవాఁడును భాగ్యతయుఁ ♦ జేర్మికాఁడు
మిత్త్రుఁడును వత్సలుఁడు నగు♦మేదినీశుఁ
డతులగుణవంతుఁ డని నిన్ను♦నరసి నమ్మి
సర్వమును నీకు నర్పించి ♦ చనియెఁ బురికి. 45
తే. చనిన యంతన యాతండు ♦ సకల మీవు
వీడి యీగతి మానోజ్ఞ♦వీథుఁ దవిలి
యుంట చనునొక్కొ యెవ్వని ♦ కొరున కిట్టి
యుక్తము నయుక్త మెఱుఁగమి ♦ యుండు జగతి. 46
ఉ. నీవయి మాకుఁ జెల్మియును ♦ నిర్మలభక్తియు నుండని మ్మటే
యేవగిదిన్ నినున్ విడిచి ♦ యిట్టిమహాటవి నొంటి నేగి మే
మాపద నొందుశీతలహ్ర♦దంబుజురాసుతు మోహముఁ గాంతుమో
యాప్రభుపుత్త్రుఁ డేమనిన ♦ నందుమ యేమని మేము చెప్పుమా. 47
క. వేరే చంద్రాపీడుఁడు, వేరే నీవును గలుగదు ♦ వేరిమి మీకున్
గూరెద వేటికి మోహము, దూరముగాఁ జేయు దాని ♦ దుందుడు కేలా. 48
క. పురి కేగ మదిఁ దలంపుము, త్వర నన నాతండు మమ్ము ♦ దరహాసితమునన్
బరికించుచు నిట్లనియెను, నరయక ని న్నేల యిట్టు ♦ లాగటసఱుపన్. 49
క. రమ్మని యింటికి నను మీ, రిమ్ముగ బోధింతు రేను ♦ నెఱుఁగను నింకన్
రమ్మనుటకు హేతువు ని,క్కమ్ముగ;రాసుతుని వీడి ♦ క్షణ మేనియు నేన్. 50
క. నిలువఁగఁ జాలను నొండొక, స్థలమున; నా కిపుడు మీకు ♦ సలిపినబోధం
బలరించె నెక్కుడైనను,సలుపుదు నే నేమి యైన ♦ సన్మతులారా! 51
సీ. తలఁచుకొన్న ట్లేమొ ♦ తలఁగి యొండెడ కేగఁ దలఁపదునామది♦తెలియరాదు
కనుఁగొన్నయ ట్లేమొ ♦ కనఁగ నొండొకవైపుఁ గన్గవచూడ్కులు♦కదలుకొనవు
కట్టివేసినయట్లు ♦ కదలవు పాదంబు లడుగు పెట్టఁగ నొక్క♦యెడను సుంత
యెందొ యాసక్తమై ♦ పొందినవిధమున హృదయంబొకింతయే♦నెఱుఁగదేమి
తే. ఖచిత మైనట్లు దేహంబు ♦ కదల కుండు
నుందు నిచ్చోటనే నేను ♦ నూరి కెట్లు

రా వలంతినో మీరె నిర్ణయము సేయ
వలయు బలవంతముగం గొనం దలంతు రేని. 52

చ. కదలిన నీస్థలంబు నిజగాత్రమునం గలిజీవితంబు దాం
గదలక యుండ దంచు మదిం గాంచెద; నుండిన నీస్థలంబునం
దెవ నెఱుంగంగ రాక యొకం డేదియొ వర్తిలు చుండు నేం డిటుల్
గదలక యుండం బట్టి యది గాచును బ్రాణము నంచు నెంచెదన్. 53

ఉ. కావునం జాలుం జాలు ననుం గాఱియవెట్టక పొందు మీర లా
భూవిభుపుత్రదర్శనజభూరిసుఖం బును రుండునంతకున్
బోవక యుండుంగాతం; దనుపుణ్యుండ నా కది చిక్కియుం గటా
దేవుండె చేతినుండి యిటు తీసికొనెన్ గద లాగి దానిం దాన్. 54

క. అని చెప్పుచుం గౌతుకమున, ననె; నేమిది యేల యిట్టు లాడెద వేలా
జనపతిసుతునొద్దకు రా, వని యడుగంగ మే మిటు లనె నాతం డధిపా! 55

చ. కలిగెను లజ్జ యిట్లు పలుకంగను నాకుం గతం బొకించుకేన్
దెలిసిన నేల రా నలంతి దెల్పుండు రాసుతుజీవితంబుతో
నలిపెద సత్య మింక నను సంకటపెట్టకుం డెల్లవృత్తముల్
దెలిసెను గాదె మీ కిపుడు దెల్లముగాం జనుం డెల్ల రంచుం దాన్. 56

చ. పలుకక యూర కుండి యొకపక్షనిపాతము సేవు లేచి యా
కొలనితటంబులన్ వరనికుంజములన్ మఱి చెట్లనీడలన్
జెలంగెడు దేవతాయతనసీమల నాయయిపట్టులందుం దా
మలయుచు నుండె నేమొ పరిమార్గణముల్ బచరించువాండు నాన్. 57

చ. చొనుపక చూపు లొండెడలం జూచుచు నాయయిరమ్యసీమలన్
దనియక చాలసే పటుల తద్ద మలంగి మలంగి శ్రాంతుండై
కని పయివంక నూర్చి త్రపం గన్నవిధంబున వాంచి మోము చొ
చ్చెను నలవల్లరీగృహము శ్రీవరపుత్ర! వసించె నచ్చటన్. 58

ఉ. మేమును నుంటి మచ్చటనె మేకొని తత్ప్రతిబోధనాశచే
జాములు రెండు చెల్లె నట స్నానము భోజన మాది యైనమే
నేమము లాచరింపు మని నిర్భరభక్తిని వేండ నిట్లనెన్
భూమిపపుత్ర! నీడుచెలి పోల మదీయము లైనప్రాణముల్. 59

చ. ప్రియములు మద్వయస్యపృథివీపతిసూనున కివ్వి హెచ్చుగా
దె యివి స్వజీవితంబునకుం దెల్లమ న న్నివి పీడి తెంపుచే

సి యుగు నేని యత్నమును ♦ జేయవలెన్ నిలుపంగ వాని నే
నయముగఁ బోవ కున్నను నొ♦నర్పవలెన్ మఱి యేమి చెప్పుఁడీ. 60

ఉ. ఆతనిదర్శనంబున నె ♦ యాతఁడు గృతార్థుఁడఁ; గాను మిత్రిచే
నాతత మైనప్రార్థనము ♦ నా నిట నిష్ఫల మందు లేచి తా
నాతఁడు కందమూలముల ♦ నాటవికోచితభుక్తిఁ గ్రుంకి వి
ఖ్యాతచరిత్ర! కైకొనియె; ♦ నంత నొనర్చితి మేము తద్విధిన్. 61

చ. పగలును రాత్రి నీపగిదిఁ ♦ బజ్జను బాయక యే మిదంచుఁ బె
న్వగఁ గని యాయుదంతమున ♦ భావనచేయుచు విస్మితాత్ములై
తగ నట వాసరత్రయము ♦ తాలిమి వీడక యుండి యొంతయున్
వికతతదాగమానయన♦విభ్రమచిత్తుల మౌచు సైన్యమున్. 62

చ. నిలిపి యొసంగి కంబలము ♦ నిర్భరమై తిరఁ గాఁపుగా నటన్
దలఁగి యి టేగుదెంచితిమి ♦ తథ్యము మేము నృపాత్మజా! నినున్
బిలువఁగ వాచికాహరుని ♦ వే యొకనిం బనుపంగ వాఁడు నిన్
గలసికొనంగ లేఁడు పయ♦నంబయి నీ విట వచ్చుచోఁ బలన్. 63

చ. అనియును జాలకాలమున ♦ కచ్చట కేగిననీకు నిప్పుడే
పోనరుప నేల యాగమన♦భూరితరశ్రమ మింత మల్లి యుం
చును బనుపంగ లే దనుడు ♦ శోకము నచ్చెరు వొక్కసారిగాఁ
బెనఁగొని చిత్తముం గలఁచఁ ♦ బెగ్గగానుతుఁ డాత్మ నీగతిన్. 64

వైశంపాయనునివైరాగ్యమునుగూర్చినచంద్రాపీడుని పర్యాకులీభావము.

చ. తలఁపఁగ సాగె స్వప్నమునఁ ♦ దాను దలంపనితద్విరాగతా
కలనముఁ గూర్చి యి ట్లనుచు ♦ గాఢతరంబుగ నెట్లు వీనికిన్
గలిగెను సర్వమున్ వదలఁ ♦ గా నొనరించి యరణ్యసీమలన్
గలఁగుచు నుండఁ జేసెడుని♦కామవిరాగత యిట్టు లక్కటా. 65

చ. కలుగదు నాదుతప్పిక మొ♦కండును, దండ్రియు నుగ్రహంబునన్
గొలుతురు వాని నన్ను నెటు ♦ గొల్తురొ యాగతి రాజు లందఱున్
దొలుక కిరీటరత్నరుచి ♦ తోరముగాఁ జరణాంబుజంబులన్
గలుగదు వాని కిష్టసుఖ♦కాంక్షములన్ గొఱ నాకు నట్లపో. 66

సీ. నాదునాజ్ఞ యుఁబోలె ♦ నాతనియాజ్ఞయుఁ జెల్లు నవక్రమై ♦ క్షితితలమున
నతఁడును నాయట్టు ♦ లఖిలలోకములకు నొసఁగు ననుగ్రహం ♦ బెసక మెసఁగ

నడుగుడు రతనికి ♦ నపరాధిజనములు నాకునుబోలె న♦నారతంబు
నతనికి నాకున్న♦యట్టులు సంపదల్ పూర్ణంబులై యుష్ణఁ ♦ బొదలుచుండు
తే. నతని నన్నుఁబోలె లోకంబు ♦ లధికభక్తిఁ
జూచు నతఁ డిట వచ్చెడు♦చో జనకుఁడు
జననియొండెను శుకనాస♦సచివుఁ డొండె
నలమనోరమయొండెను ♦ నాదరమున. 67

క. వనుపరో సుతవాత్సల్యము,కనఁబడ; వినయంబు మిగులఁ ♦ గదుర జనకుఁడొం
డెను శుకనాసుండొండెను, ననిరో యేమేని నొప్పి♦యడరుపలుకులన్. 68

క. కొట్టిరొ తిట్టిరొ యేఁడా,గుట్టెఱుఁగును నందు నితఁడు ♦ కూర్మిని నాపై
ర ట్టొనరుప దుష్టుఁడు గాఁ,డట్టి తరళితహృదయుఁడును ♦ నగుణుఁడు కాఁడున్.

క. గురుభక్తివిహీనుఁడు కాఁ, డరయక యేదేనిఁ జేయు ♦ నాతఁడు కాఁడున్
సిరిగలవానిసుతుం డను,గరువముగలవాఁడు గాఁడు ♦ గానఁగ మఱియున్. 70

తే. దుర్వినీతుండు దుశ్శిక్షి♦తుఁడును గాఁడు
నేకపుత్రత్వదుశ్చేష్టుఁ ♦ డేని గాఁడు
కాఁడు నెవ్వఁడో యొకదుష్ట♦కష్టశీలుఁ
డౌర యీదృగ్విరాగత ♦ యలమె నెట్లు. 71

తే. పుట్టినదిగోలెఁ బ్రేముడి ♦ యుట్టిపడఁగ
సర్వవిధములఁ బ్రోచిన♦జనని జనకు
నిటుల యెవ్వఁడు నొప్పించు ♦ నెవ్వఁ డిలను
వారిసంబంధమును నేఁడు♦బాసి పోవు. 72

క. సమయము కా దిది గార్హస్థ్య,శమమునకును నింక నితఁడు ♦ సజ్జనకర్త
వ్య మయినగార్హస్త్యంబున, విమలంబునఁ జొరఁగ లేదు ♦ వింతయ్యెడుఁగా.

సీ. దేవమానుషపితృ♦దేవతాఋణములఁ దీర్ప లే దింకను ♦ దీర్ప కల్ల
మూఁడుఋణంబుల ♦ మొనసి తద్బద్ధుఁడై యెందేగు నేగిన ♦ నేమిఫలము
పుత్రతత్పుత్రత♦త్పుత్రసంతతులను నిలుపఁడు వంశంబు ♦ నిలను నింక
సల్పుఁడును ననల్ప ♦ సద్దక్షిణలు పెట్టి సవనంబులను బెక్కు ♦ సన్నుతింప
తే. సత్త్రకూపప్రపాహర్మ్య♦సత్తటాక,వనముఖాపూర్తకీర్తన♦వర్ణనముల
ధారుణీస్థలి సమలంకృ♦తంబుగాఁగ,సలుపఁగా లేదు చిరకీర్తి ♦ నిలువ లేదు. 74

క. గురువుల కనువర్తనమున,గురుతరముద మొనవఁ జేసి ♦ కూర్పఁడు సుఖముల్
నిరతము ప్రియబాంధవులకు, నురు వగునుపకార మేమి ♦ యొనరుపఁ డింకన్.

క. చెలులను విశేషవిభవా,కులుల నొనర్పండు సాధు♦కోటిని సంవ
ర్ధిలఁ జేయం డనుజీవుల, కలరఁగ మనువృత్తు లొసఁగఁ ♦ డాదృతిని గడున్. 76

చ. కనఁడు వినండు నంగనలఁ ♦ గానఁడు లోకసుఖంబు లెవ్వియున్
గనియు సుజన్మమున్ గనఁ డొ♦కండును నింకను బూరుషార్థసా
ధనముల ధర్మకామముల ♦ ద్రవ్యము నీతఁడు పొందె నట్లొకో
ఘన మగునీవిరాగతనుఁ ♦ గానఁగఁ జాలఁ గతంబు దీనికిన్. 77

తే. అనుచుఁ దలఁచుచుఁ జిరకాల ♦ మాకులాత్ముఁ
డగుచు నాతరుతలమందె ♦ యధివసించి
యుండె నేమియుఁ దోఁపక ♦ యుల్లమునకు
ననిపి రాజుల నందఱ ♦ నర్హవిధిని. 78

తే. దినముకృత్యంబులను సల్పి ♦ మనుజనాథ
తనయుఁడును లేచి తనకయి ♦ తత్క్షణకృత
మగుచు నుత్తంభితంబయి ♦ యలరునట్టి
తోరణంబులఁ గైసేసి ♦ తోరముగను. 79

సీ. చందనమాలికా♦సమలంకృతం బయి పల్లవముఖపూర్ణ♦భర్మకుంభ
యుగళసముద్భాసి♦తోభయపార్శ్వమై ద్వార మాదిగసర్వ♦ధరణితలము
సిక్తమృష్టం బయి ♦ చెలఁగఁగ లోవెలి సురభిసమాకీర్ణ♦సుమచయంబు
కలిగి నానావిధ♦గాంగేయభృంగారువులఁ దాల్చి యిటునటు ♦ మలఁగుచున్న
తే. పరిజనకదంబకంబులఁ ♦ బరఁగి రత్న
కనకచామరమణిపాదు♦కముల సురఁటిఁ
గరముల ధరించి యుజ్జ్వల♦కనకచేల
ములను దాలిచి వెలయాండ్రు ♦ మలఁగుచుండ. 80

వ. మఱియు. 81

తే. గంధమాదన మనుపేరుఁ ♦ గన్నరాజ,వారణమ్ము మదోదక♦వాసితాఖి
లదిశ మొకప్రక్క విలసిత♦లలితవితత,సితవితానముక్రిందను ♦ జెలఁగుచుండ.
తే. తనర నింకొకప్రక్కను ♦ మనుజనాథ
హయము నింద్రాయుధముఁ గట్టు♦నాలయంబు
బయటి ప్రాంగణమున నైక♦భద్రనాగ
జాల ముపవాహ్యమును జాలఁ ♦ గ్రాలుచుండ. 83

తే. వేత్రహస్తజనంబులు♦వేనవేలు,ద్వారతలముల నిలఁబడి ♦ వార కెవ్వరు

గొలుపఁగ విశాలమై కడు ♦ గొమరు మిగిలి, నైకసత్త్వశరణ్యమై ♦ యతిశయిల్లి.

సీ. యామికస్థితబహు♦హస్తిజాలంబులు తటగతకానన♦తతులు గాఁగ
గంధమాదన మను♦గజరాజ మంతఃప్రవిష్టమహాచల♦విధము గాఁగ
సంచరత్సంభ్రాంత♦సకలసేవకజనజాలంబు కల్లోల♦చయము గాఁగ
మండలావస్థాన♦మహితప్రాహరికజనములు మహావర్త♦కములు గాఁగ

తే. రత్నములు గాఁగ సజ్జన♦రత్నములును
సితపతాకలు కలహంస♦వితతి గాఁగ
కుసుమచయములు డిండీర♦కూటములుగ
నంబునిధిఁ బోలి గంభీర♦మగుచుఁ దనరి. 85

వ. మఱియు. 86

తే. వారవనితల లక్ష్మీని♦వాస మగుచు
నళినదళనేత్రు మాడ్కి న♦నంతభోగ
పరికరంబుల నలరుచుఁ ♦ బరఁగు నొక్క
కాయమానంబుఁ జొచ్చె నా♦క్ష్మాపసుతుఁడు. 87

తే. చొచ్చి ప్రతికర్మమును విడి ♦ సొబగు విడి
మలినవసనంబులను దాల్చి ♦ కలితదైన్య
వదనలై యిట్టునట్టును ♦ బఱచుచున్న
వారవనితలు జాముల♦వారు మఱియు 88

తే. పరిజనంబులు తత్తర♦పాటు గదుర
మ్రొక్క, నదియున్న దిక్కును ♦ మొనసి చూప
గంధమాలోకకౌతుక♦కరణిఁ దెలుప
గంధమాదనమును దాని ♦ గనుచు నురక. 89

తే. పఱపి శూన్యేక్షణముల నా♦వాసభవన
మునకుఁ జని మెల్ల మెల్లన ♦ భూపసుతుఁడు
పలుక కెవ్వరితోడను ♦ బాన్పుపైన
నుస్సు రని మేనుఁ బడవైచె ♦ నూర్పు లెసఁగ. 90

తే. తనుమహీరుహతాలవృం♦తములు వీవ, నంగసంవాహకాదులు ♦ నపనయింప
నధ్వఖేదంబు; రేయెల్ల♦నందకున్న, నిద్ర నప్రాప్తనిద్రుఁడై ♦ నెగులువలన. 91

వ. మగుడ దుఃఖాంతరహేతు వగు నపారచింతాంబుధిన్ మునింగి యాచంద్రాపీడుండు తనమనంబున నిట్లని వితర్కింపఁ దొడంగె. 92

చ. చను మని తండ్రియుం దలియు ♦ నల్పకయే పయనంబు వారి శు
గ్వననిధి ముంచి పుత్త్రు నెడఁ♦బాసినశోకమునన్ గలంగుత
జ్జనని మనోరమన్ జనకు ♦ సజ్జను నాశుకనాసు నూఱటన్
బొనరుప కేను దేవిఁ గనఁ ♦ బోయిన నిచ్చటనుండి యేమనున్. 93

చ. ఇతనిని బోలుదున్; మగుడ ♦ నేగిన వత్తునొ రానొ యన్నయా
తతవిచికిత్స నామనసు ♦ దార్కొనుఁ; గావున నే మొనర్తు నిం
కితరము; నిట్టిశంక మది ♦ నెంతయు నర్హము కాదు చూడఁగా
నితఁడు మదిష్టమిత్త్రుఁ డల♦యింతినిఁ జిత్త్రరథాత్మజన్ గనన్. 94

చ. చనఁగ నుపాయ మేమియును ♦ సంస్ఫురియింపక చింతఁ గూరుచున్
దనికెదు నా కొనర్చి విడి♦నం దను నిట్టి మహోపకారమున్
జన నట నొం డుపాయమును ♦ సల్పె మఱొండువిధంబునన్ గటా
చనవలె నిప్డె యతనిఁ ♦ జయ్యనఁ దేర విలంబ మేటికిన్. 95

చ. వల దని తండ్రియుం దలియు ♦ వారణ సేయుదు; వానితండ్రియున్
వల దనఁ జాలఁ డే నరిగి ♦ వానిని గన్గొని కొంచుఁబోదు నా
వెలఁదుకయంతికంబునకు ♦ వే చన నాతఁడు లేక యొక్కఁడన్
దలఁకఁగ నేల యంచు మది ♦ దార్ఢ్యము సల్పి నృపాత్మజుం డటన్. 96

ఉ. అప్పటి తద్వియుక్తిఁ దగ ♦ నొవమథముం బలెఁ బ్రాంతసౌఖ్యమై
చొప్పడుటన్ దలంచుచును ♦ శోకముఁ దక్కి యుసుంతసేవు దా
నొప్పఁగ విశ్రమించి సుఖ ♦ మూనఁగ నంగములెల్ల నూఁదఁగాఁ
దప్పక మధ్యమాహ్నమును ♦ దాల్చెడుశంఖము లేచె భుక్తికిన్. 97

చ. అలమదిరాతనూజ యెట ♦ నచ్చట నుండును నాదుమిత్త్రుఁడున్
దలఁపఁగ నంచు ధైర్యమును ♦ దాలిచి డెందముఁ జిక్కఁబట్టి ని
శ్చలుఁ డయి రాజవర్గమును ♦ సర్వముఁ గూర్చి శరీరసుస్థితిన్
సలిపెను రాసుతుం డెటులొ ♦ స్నానము శూన్యతఁ గాంచి యుండినన్ 98

వ. అంత. 99

చ. హృదయములోనఁ బ్రజ్వరిలు♦నిత్తుశరాసనవహ్నికిన్ నయ
స్వదృఢవియోగశోకప్రవ♦దళ్ళ్వనకున్ వెలి సీయఁ దాపమున్
బొదలుచుఁ దోడుచూప నన ♦ భూరికరంబులు సాఁచి దిక్కులం
దిదె యొనవింతుఁ దాపమును ♦ నెక్కుడు లీలన యంచు నెంచె నాన్. 100

ఉ. అంబరమధ్య మెక్కె రవి ♦ యాతపదంభమునన్ గభస్తివా
రంబులు రాజతద్రవము ♦ రంజిలఁ గ్రక్కెడునాఁ జెలంగఁ; దే
హంబును జీల్చి చొచ్చు నన ♦ నాతపఖండము లొప్పఁగా మహీ
జంబుల నీడలున్ గనఁగ ♦ సంకుచితత్వముఁ గ్రింది కేగుచున్. 101

సీ. వెలిఁ జూడఁ జూడ్కులు ♦ వెనుదీయ; భూములుదుస్సహస్పర్శలై ♦ తోఁపమిగులఁ
బ్రజ్వరిల్లునో యన ♦ భాసిల్ల దిక్కులు సంచారములఁ బాయ ♦ సరణు లెల్లఁ
బథికపంక్తులు చలి ♦ పందిళ్లనడుమను గుంపులై దూరంగఁ ♦ గోరి జలము
పక్షులు గూళ్లలో ♦ పలు నుండ నాడులఁ గలఁచునూర్పులఁ గడు ♦ గాసిఁ గనుచుఁ
తే. బల్వలాంతర్జలంబులఁ ♦ బడుచు నుండ
మహిషబృందమ్ము లెల్లను ♦ మమత మిగులఁ
దామరసలోచనాగండ ♦ తలము లెల్ల
శోణితాంభోజకాంతుల ♦ సొబగు నింప. 102

క. విదళితముక్తాక్షోదము, పదకంబున స్వేదబిందు ♦ పంక్తులు చెలఁగన్
మదిఁ దలఁపఁబడఁగ వెన్నెల, మొదలు ప్రదోషంబుఁ జూడ ♦ నెలమి వహింపన్.

క. దినపరిణామం బెప్పుడు, చనుదెంచును వచ్చు నెపుడు ♦ జలదసమయ మం
చును గోర జనులు ప్రీతిని, గొనఁగోరఁ దుషారగుణముఁ ♦ గుంభినియెల్లన్.

వ. అప్పుడు. 105

చ. సలిపి శరీరసుస్థితిని ♦ త్ర్యాధవపుత్త్రుఁడు లేచి వచ్చి తాఁ
గొలనిదరిన్ ఘటింపఁబడి ♦ కోమలమై సతతంబు సంపత
జ్జలకణికాభిషేకమున ♦ సారసనాథునితాప మార్చుచున్
జెలఁగెడు వారిమండపముఁ ♦ జేరెఁ గొలందినృపాలు రంటి రాన్. 106

చ. అది యొడ లేక పైపయిని ♦ యూవళు లైపడునీటిధారలన్
గుదురయి పాఱు చున్నయొక ♦ కుల్యను ప్రోదినిచేతనుం బలెన్
బదిలముగాఁగఁ జుట్టఁబడి ♦ భాసిలుచున్ జడిమస్వరూపమై
పొదలుచు నుండె మంచుమల ♦ పుత్త్రుఁడు నా శిశిరర్తునిక్కనాన్. 107

క. దరవికసితసుమపల్లవ, వరలతికావేల్లితముల ♦ వర్ణ్యస్తంభో
త్కరముల రమ్యంబై యాం, తరలంబితవేతసీకృ ♦ తధ్వాంతంబై. 108

సీ. ఆమోదమానార్ద్రి ♦ హారివిస్ఫుటసరోజాతజాలావృత ♦ స్థలయుతంబు
నాకీర్ణసరసబి ♦ సాళివిచ్ఛురితంబు శైవలకిసలయ ♦ స్తబకయుతము

నసమయసంకల్పి తాంబుదాగమకాల మంబువాహానివాస కాలయంబు
ఖద్యోతకరతిర స్కారంబును నిదాఘసమయాప హేళన స్థానకంబు

తే. సకలకాసారహృదయంబు ♦ క్షుపలగృహము
నగుచు స్నానార్ద్రచికురంబు ♦ లార్చుకొనుచు
హారవలయైకభూషణ ♦ లగుచు నున్న
వారవనితాగణంబుల ♦ భాసురంబు. 109

తే. వాసరాఘాత మైనయా ♦ వారిమండ
పమున, నతిరమ్య మాటను ♦ బంచబాణు
క్షుభితుఁ గావించి వారిసం ♦ క్షోదశిశిర
మగుట మిత్రవియోగాగ్ని ♦ రగులఁ జేసి. 110

తే. ఉరుతరాంబుధిచందానఁ ♦ బరవు సలిగి
తీవ్రగంభీర మైనత ♦ ద్దివస మెట్లొ
యొంటి దాఁటెను నాత్మశై ♦ ర్యోడుపమున
నంత నాతప మెల్లను ♦ నరుణ మయ్యె. 111

వ. ఆసమయంబున. 112

తే. విరివి గోమయలేపన ♦ హరిత మగుచు, మందమందానిలాహతి ♦ మంజుగతిని
గదలుసితపుష్పవితతులఁ ♦ గ్రాలు చున్న, వాసభవనాంగణమునకు ♦ వచ్చి క్షణము.

తే. కొలువుదీరి సమాసన్న ♦ కుంభినీప, వారములతోడ మిత్రసం ♦ భాషణముల
సలిపి యొక్కింత రెండవ ♦ జామునందుఁ, గదలవలె దండుసిద్ధమై ♦ పొదల నిందు.

తే. అనుచు సైన్యాధినాథున ♦ కాజ్ఞ యొసఁగి
తారకోదయ మగుడు నా ♦ ధరణినాథ
తనయుఁడు విసర్జితా శేష ♦ ధరణినాథ
వారుఁ డయి చేరె నిజవాస ♦ భవనమునకు. 115

చంద్రాపీడుండు వైశంపాయనుని వృత్తాంతముఁ దెలుప నుజ్జయినికి వచ్చుట.

వ. అంత 116

శా. ఆయుత్తం బయి సైన్య మెల్ల నధ్వర ♦ ప్రారంభముం జేసెఁ దాఁ
బోయొ జాలదినంబు లుజ్జయినికిన్ ♦ బో కంచు నుత్కంఠతో
న్యాయింపఁ బడ కున్న భేరి తెలుపన్ ♦ యానంబు; నిద్రా వినో
దాయామంబును గాన కంత నరనా ♦ థాంగప్రజాతుండునున్. 117

శా. రాఁగన్ మూఁడవయామ మశ్వగజరా♦ట్పాత్తియైకయానంబు భూ
భోగిశ్రేణిక నాతివిస్తృతము తోఁ♦ బోవన్ విసమ్మర్ద మా
భోగాధ్వమ్మున నేగ; నధ్వమున నే♦పో క్షీణమై రాత్రి తా
భోగీడ్లోకమునుండి వచ్చె ననఁగాఁ♦ బొల్చెన్ సమస్తార్థముల్. 118

సీ. వికసించెనో యనఁ♦ వెలిఁగె దృగబ్జముల్ విరళతఁ గనె ననఁ♦ బరఁగె వనులు
జీవలోకము మఱి♦ సృష్టింపఁబడె నన నన్యప్రకారమై♦ యడరు చుండె
నిమ్నోన్నతంబులు♦ నెగడెను విభజింపఁబడినవో యనఁ గడు♦ భాసుర మయి
తరులతాగుల్మముల్♦ దాల్చెను సంకోచ మననొప్పెగహనంబు♦లగుచుమిగుల
తే. నంబరంబున కెక్కెడు♦నహములక్ష్మి
బహుళలాక్షారసారుణ♦పాద మనఁగఁ
గమలినీరాగదాయి వి♦కర్తబింబ
మగపడుచు నుండె స్పష్టమై♦ యవనినాథ!. 119

వ. అంతం బ్రభాతమ్మగుటయు సమస్తసైన్యసమేతుండయి యుజ్జయినిం జేరుటయుఁ గడు దూరంబున నగరబాహ్యప్రదేశంబున బద్ధాంజలులై గుంపులయ్యును గుంపులగుచును బద్ధమండలులై వసించియు వసించుచును నటకె పోదమని పోయి కొంతద వ్వరిగి మగిడి వచ్చుచును మోములు పైకెత్తి తలలు వాంచి యుద్యద్బాష్పనయనులై వివర్ణదీనవదను లగుచు హాహాకారంబు లెసంగ నేడ్చుచు, దుఃఖాతిరేకంబున మౌనంబుఁ దాల్చుచు, మునులయ్యును ముముక్షువులయ్యును వీతరాగులయ్యును నిస్పృహులయ్యును దుర్మార్గులయ్యును స్నేహపరవశులై తండ్రులట్లు మిత్రులట్లు ప్రియబాంధవులమాడ్కి వైశంపాయనవృత్తాంతమునె యడుగుచుఁ జెప్పుచు, విచారింపుచు, ననుభవించు చున్న పెక్కండ్రఁ బౌరజనుల నాలించి చంద్రాపీడుండు తనమనంబున నిట్లని విచారింపఁ దొడంగె. 120

చ. వెలుపలివారికే యిటుల♦ వీనియవస్థ దురంతతాపమున్
గొలుపఁగ వీని నుంచి యెదఁ♦ గూరిమిఁ బెంచియు బాలచాటువా
క్కుల విని నట్టివారి కిఁకఁ♦ గూరఁగఁ జేయునొ యెట్టితాపమున్
బలుకఁగ నేల వీని నిటఁ♦ బాసి యెటొంటిగఁ జూతుఁ దండ్రినిన్. 121

మ. శుకనాసుం గనుఁగొందుఁ దత్సతిని నేఁ♦ జూతుం గటా యేగతిన్
వికృతం బయ్యెడు డెంద మంచు మదిలో♦ నిందించుచున్ బాష్పవా

రికణంబుల్ దిగజాలి నాసికతుదన్ ♦ రింఛోళులై దేనిఁ గాం
చక చొచ్చెన్ నృపసూనుఁ డుజ్జయినిఁ జం♦చద్దుఃఖభారంబుతోన్. 122

ఉ. చొచ్చి నృపాంగణంబున నె♦స్రుక్కుచు డిగ్గి ససంభ్రమంబునన్
జొచ్చుచునే వినెన్ జనియె ♦ క్షోణివరుం డలదేవితోడ నా
సచ్చరితాత్మమంత్రివరు♦సద్మముఁ జేర నటంచు; మళ్లి తా
వచ్చెను మంత్రిగీమునకె ♦ పార్థివసూనుఁడు, వచ్చుచున్ గటా. 128

పుత్రవియోగాతుర యగుమనోరమవిలాపము.

సీ. తొడలపై నిదుకొని ♦ వుడుకుచు నింకను లాలింపఁగా దగు♦బాలుఁ డీవు
నిర్జనాహిసహస్ర♦దుర్జనఘోరశూన్యాటవి నెట్లుంటి ♦ వకట యొక్కఁడ
దుష్టసత్వంబుల ♦ తొందర యణఁగించి దేహారక్ష యొసంగు ♦ తీర్చె సచట
నిద్రాసుఖం బిచ్చు♦నిర్మలసుఖశయ్యఁ గల్పించె నెవ్వండు ♦ కన్నతండ్రి!
తే. విషమభావంబులను నెల్ల ♦ వీడఁ జేయు
భోజనం బెవ్వఁ డిడె నీకుఁ ♦ బుత్ర! వగవ
దప్పికొన్నను నాఁకొన్నఁ ♦ దవుల నిద్ర
తలఁప నీ కేఁడు నాయంక♦తలము విడిచి. 124

చ. సమసుఖదుఃఖభాగ యగు♦చానను గైకొన లేదు నీవు వే
గమ యిట వచ్చులే తడవు♦గా జనకాజ్ఞ వధూముఖాంబుజా
తము గనుభాగ్య మబ్బ నని ♦ తద్దయు నువ్విళులూరితిన్ గటా
యమరుచె నా కపుణ్య; కది ♦ యట్టుల యుండె నిదొంపు కల్గఁగా. 125

చ. కనుటయు నాయె దుర్లభము ♦ కాంతుచు నిన్నిఁక నెట్లు పుత్రకా!
చను మట నన్ను నుం గొనుచు ♦ సౌఖ్యము యెచ్చట నున్న నీకు నీ
జనకునియాజ్ఞఁ బొంది; నిమి♦షంబు నినున్ గనకున్నఁ గాంతునే
తనువును వత్స! శైశవముఁ ♦ దాల్చినయప్పుడు నన్ను మీఱవే. 126

చ. ఉన్నటు లుండి వచ్చె నెట♦నుండి కటా యిటువంటి క్రౌర్యమో
చిన్నికుమార! నీ కెవరు ♦ చెప్పిరి పుట్టువుదొట్టి నీముఖం
బెన్నఁడు కిన్కవాఁడినది ♦ యేఁ గన నేఁ డెటు వచ్చె నాదుపై
నెన్నఁగ రానికోప మది ♦ యీకు నను న్విడియుండ నీగతిన్. 127

సీ. పోయిన రావయ్య ♦ పుత్రకా! వేగంబుప్రార్థింతు నయ్య నిన్ ♦ బదము లంటి
యెవ్వఁడు నాకొరుం♦ డింక దేశాంతరపరిచితి విడితి మా♦పఘుని బ్రీతిఁ

గనక క్షణమ్ము ని ♦ న్మనని చంద్రాపీడుపై నిట్టినిస్స్నేహ ♦ భావ మెట్లు
కలిగెను? మేలెనీ ♦ కిల సుఖం బుంపంగ దగుగురుజనములఁ ♦ దార్ప వెతల
తే. నెఱుఁగ నీ వేమి పొందుదో ♦ యిట్లు చేసి
యనుచు నివి యాదిగాఁ గల్గు ♦ నన్యములను
దలఁచుకొని యంతిపురి నాత్మ ♦ తనయువిరహ
దుస్సహవ్యథ నోర్వక ♦ తూలి పడుచు. 128

తే. పట్టుకొని ప్రక్కఁ గూర్చుండి ♦ పార్థివేంద్రు
సతి యులవిలాసవతి పరి ♦ సాంత్వనముల
నూఱడించిన విలపించు ♦ చున్న యువిద
నలమనోరమ వినెను నా ♦ యధిపసుతుఁడు. 129

క. విని తత్కరుణప్రవిలాపనవిషమున విహ్వలతను ♦ బడసెనొ స్వాపం
బును గూరెనో యన ఘూర్ణిత, తనుఁడై నిశ్చేతనతను ♦ దాల్చెను సపుడే. 130

తే. సహజసత్వసమాశ్రయ ♦ స్తంభితాత్ముఁ
డగుచు నెట్టిటో చొచ్చి తా ♦ నాత్మజనకు
మోముఁ గన సిగ్గుఁ గూరుచు ♦ ముఖము వాంచి
నిశ్చలాఖిలగాత్రుఁడై ♦ నిలిచి సుంత. 131

చంద్రాపీడుఁడు శుకనాసునింట నున్నతనతండ్రిం గాంచుట.

తే. మందరాచల మన నొప్పు ♦ మహితమూర్తి
మంత్రిశుకనాసుతోఁ గూడ ♦ మథనముతుద
స్తిమిత మైనమహాంభోధి ♦ చెలువు తనర
నున్నతండ్రికి మ్రొక్కిడి ♦ యున్న నంత. 132

తే. దూరమునఁ గూరుచున్నట్టి ♦ కూరిమిసుతుఁ
గాంచి కొండొకవడి లోన ♦ మించి పైకి
వచ్చు బాష్పంబు లాఁగుచుఁ ♦ బరఁగ గద్గ
దిక సమాసన్నహర్షమై ♦ తేజరిలుచు. 133

తే. పొలుచుదలదంబునట్టుల ♦ భూవరుండు
తనయుఁ గన్గొని యిట్లనుఁ; ♦ దనయ! నీకుఁ
బ్రాణమునకంటె నెక్కుఁడై ♦ పరఁగు ప్రీతి
గలదు తమ్మునిపై నని ♦ కాంతు నేను. 134

చ. కలుగు సుఖైకహేతు వయి ♦ క్రాలెడునిష్టజనంబువల్ల నే
యిల నవితర్క్య మాత్రమము ♦ నెక్కుడు పీడయు మానవాళికిన్
సలుపఁగ లే? వ వేమి? విను ♦ జన్మవయశ్శ్రుతశీలసంపదా
వళికి వినీతి కొజ్జలయ ♦ పారసుశిక్షకుఁ జెల్మి కంతకున్. 135

చ. అనుచిత మైన చాపకవృయస్యుని తమ్మునియాయుదంతమున్
విని యిది నీదుదోష మని ♦ నిక్కముగా మది సంశయింతు నం
చనుజనపాలుమాటలను ♦ నాఁడుచు నాశుకనాసుఁ డొక్కటన్
దనరెడుశోకమన్యువులఁ ♦ దాల్చి వివర్ణత నాస్య మిట్లనున్. 136

-:- శుకనాసుఁడు చంద్రాపీడునియందు దోషములేదని నిరూపించుట. -:-

సీ. అగ్నిఁజల్లఁదనంబు ♦ నబ్జునియందెండ, తరణియందుఁదమంబుఁ, ♦ దమమునందుఁ
బగలు, మహోదధి ♦ బంకశోషంబును, శేషునందును మహా ♦ శీఘ్రధృతియు
సాధునందుఁ బరార్థ ♦ సాధనానుద్యమ, మప్రియవచనత ♦ యార్యునందు
నవనీసురునియందు ♦ ననృతభాషణమును, రాజునం దప్రజా ♦ రంజనంబు

తే. కలుగు నేనియు యువరాజ ♦ తిలకునందుఁ
గలుగు దోషంబు తెలియక ♦ పలుక నిట్లు
తగునె యామూఢచిత్తుని ♦ తప్పిదంబ
యెంచ నిది యెల్ల వేయేల ♦ యినవరేణ్య!. 137

క. పాపికి మిత్రద్రోహికి, స్త్రీపాప్రియకారి కర్మ ♦ చండాలునకున్
బ్రాపితదుర్భవునకు మా, తాపితృఘాతికిఁ గృతఘ్న ♦ తాభూమికిన్నె. 138

క. ఈతని నీకంటెను గడు, నాతతగుణవంతుఁ గృతయు ♦ గార్హ్యోదయునిన్
శీతలుఁ జంద్రాపీడుని, నీతిరున దూఱఁదగునె ♦ యీకు నరపతీ!. 139

చ. కలదొకొ యింతకంటెఁ గట ♦ కష్టతమంబు వ్యథానిదాన మీ
యిల గుణవంతు దోషిసఁగ ♦ నెంచిన నన్యులున్ వచింపఁగా
వలయునె తల్లిదండ్రులె? న ♦ పారగుణంబులు గల్గు వానికిన్
సలుపఁ దగున్ బురస్క్రియ గు ♦ ణంబులచేతనె భూధవాగ్రణీ!. 140

-:- శుకనాసుఁడు వైశంపాయను నిందించుచుఁ జింతించుట -:-

వ. మఱియు. 141

ఆ. జన్మ మాదినీదు ♦ సతి విలాసవతియు, నంకలాలనంబు ♦ నందినాఁడ
నన్నమాట మఱచి ♦ నట్టిదుష్టాత్మున, కేమి సేయు నీతఁ ♦ డినవరేణ్య!. 142

ఉ. దానముచేతనే మలిన♦తం గడుఁ గాంతురు హస్తిగండముల్
పోనిమలీమసప్రకృతి♦పూరుషు లెవ్వరు వర్తి లేకయే
పూని ప్రసాదముం దలఁగి ♦ పోవక యెవ్వరు ప్రజ్వలింతురో
మానక రత్నదీపముల♦మాడ్కి నధూమపతాకులై భువిన్. 144

తే. అంగలగ్నోరగములట్టు ♦ లనవరతము
పూని దాక్షిణ్యమున యేరు ♦ బుట్టుచుంద్రు
వామమార్గావలంబులై ♦ భూమి నెవరు
స్నిగ్ధులందును గూఢులై ♦ చెలఁగు చుంద్రు. 145

తే. పల్లవములట్లు రాగంబు ♦ వడసి యపుడ
దివసవృద్ధిని రాగంబుఁ ♦ దెగడుచుంద్రు
బాణములయట్లు గుణముక్తిఁ ♦ బడసి యెవరు
దూరవిక్షేపమును గాంత్రు ♦ తొలఁగ జనము. 146

సీ. వక్రు లెవ్వరు ఋజు♦వర్తనులందును సాధులందు నసాధు♦చరితు లెవరు
క్రుద్ధు లే రనురాగ♦బుద్ధులందును మిత్రపరులందు ద్రోహు లౌ♦దురును నేరు
భయశీలురందును ♦ బ్రహరణశీలురు నమ్మినవారిని ♦ నలఁతు రేరు
దుష్టస్వభావులు ♦ శిష్టులందును నేరు భర్తలందు నభృత్య♦భావు లెవరు
తే. ప్రీతిపరులందు ద్వేషులై ♦ ప్రిదుల రేరు
స్త్రీలయందును శూరులు ♦ సేవులందుఁ
గ్రూరు లెవ్వరు దీనుల ♦ దారుణులును
బుణ్యవంతులయందు న♦పుణ్యకరులు. 147

వ. మఱియు. 148

తే. భూతిపరిమార్జనముఁ గాంచి ♦ పోలు చుముకుర
ములపగిది నాభిముఖ్యంబుఁ ♦ బొంది యేరు
సకలము ప్రతీపముగఁ గాంత్రు ♦ సన్నుతింప
నిర్దయాత్ములు గారుణ్య♦నిరతులందు. 149

తే. ఆంతరస్వచ్ఛవర్తన ♦ మందినట్టి
కమలినులమాడ్కి గాఢావ♦గాహమున నె
గలుషతను గాంత్రు సకలంక♦ఖడ్గము లటు
గాంత్రు పరుషత స్నేహంబుఁ ♦ గాంచి యెవరు. 150

సీ. గురువులే లఘువులై ♦ పరఁగుదు రెవరికి నీచులే యున్నతుల్ ♦ నిక్కువముగ
నిల నగమ్యులె గమ్యు ♦ లెవరి కకార్యంబె కార్యమన్యాయంబె ♦ కరము న్యాయ
మస్థితియే స్థితి ♦ యనుచితం బుచితంబు విద్య యవిద్యయే ♦ వినయ మవిన
యం బనాచారంబె ♦ యాచారము కుదృష్టి యేరికి శుభదృష్టి ♦ యెసక మెసఁగ
తే. నగు సుశీలత దాశ్శీల్య ♦ మగు నధర్మ
మగును ధర్మంబు నన్నృతమే ♦ యగును సత్య
మప్రమాణంబును బ్రమాణ ♦ మగును దలఁప
హింసయె యహింస యేరికి ♦ నెంచ నెపుడు. 151

ఉ. ఏరికిఁ దుచ్ఛబుద్ధులకు ♦ నెక్కుడు నే నని తెల్పు శాస్త్రముల్
గూరుపఁ గావు జ్ఞానమును; ♦ గూర్పు యశంబును గాదు విత్తమున్
గూరుప నేరికిన్ బ్రభుత; ♦ కూర్పఁగఁ గాదు పరోపకారమున్
గూరుపఁ బ్రాణితాపమును ♦ ఘోరము శౌర్యము ధాత్రి నేరికిన్. 152
తే. వ్యసనములఁ బెంప నేరికి ♦ నగును స్థిరత
కాదు మైత్రినిఁ బెంపంగఁ; ♦ గామమునకు
ధనపరిత్యాగ మగుఁ గాదు ♦ ధర్మమునకు
నేరి కగు నెల్ల దోసఁగున ♦ కేల చెప్ప. 153

సీ. అట్టివారలు మేనఁ ♦ బుట్టు మహోగ్రముల్ సర్వదోషాశ్రయా ♦ ఖర్వరుజలు
నంతర్విష సుమహా ♦ హిసంతతులు వినాశకారణోగ్రోత్పాత ♦ వాసములును
సర్వవర్తన మహా ♦ శ్వాసతతులు వక్రచారి మహాగ్రహ ♦ జాలకములు
మలినాత్మకులపాంసు ♦ వులు తమోమయప్రదోషములు నిస్త్రపలుబ్ధ ♦ జనములరయ
తే. స్నేహవర్జిత ఖలులు న ♦ చేష్టపశువు
లగుణజాలిను లనకాప్త ♦ హవ్యవహులు
తీర్థరహితాపగలు గడు ♦ తీవ్రమతులు
పుట్టుచుందురు స్వయముగ ♦ భూమిలోన. 153

ఆ. ఇట్టివాఁడె వీఁడు ♦ పుట్టె నోకానోక
పాపి నాకు నిట్లు ♦ పాటుపడెడు
నధిపసూతి కెట్టు ♦ లాచరింతును ద్రోహ
మనుచు మదిని దలఁపఁ ♦ డయ్యె నకట. 154

చ. సలిపిన నిట్లు శాసనము ♦ సల్పు నవశ్యము దేవ రంచునున్
దలఁపక, జాతిపీడుఁ డయి ♦ తాల్చును నాపయిఁ గిన్క యంచునున్

దలఁకక లోన, నే నొకఁడఁ ♦ దల్లికిఁ బ్రాణనిబంధనంబు నై
దలఁగి యెటుండు నం చయినఁ ♦ దాల్పక శంకను నే మొనర్చె హా. 155

చ. జనకుఁడు నేను బిండ మిడి ♦ సంతతిఁ గాతు నటన్న కోరికన్
గనె ననుఁ బెక్కు నోములను ♦ గాంతు నొనర్చి తదీయశాసనం
బును గొన కెట్లు సర్వమును ♦ బూన్కిఁ ద్యజింతు నటంచు నేనియున్
మనమున నెంచఁ డయ్యె నను♦మానముఁ గూరఁడు నెట్టిమూఢుఁడో. 156

ఉ. ఈవిధి నష్టమానసుఁడు ♦ నెంతయు భ్రాంతుఁడు దుష్టమార్గసం
భావితుఁ డజ్ఞుఁడున్ మొదల ♦ భావన సేయఁ డదృష్ట మెన్నఁడున్
భావన సేసినన్ దెలివిఁ ♦ బాసినచీఁకున కాయదృష్ట మే
మావహిలంగఁ జేయఁ గల♦దాను దలంపఁగ నెన్నిభంగులన్. 157

ఉ. దేవరవార లీయపర♦తిర్యగపశ్చిముఁ గీరముం బలెన్
వావిరి పూన్కిఁ బెంచి పెద♦వానిఁగఁ జేసియు విద్య నేర్పియున్
భావితుఁ జేసినారు; పశు♦పక్షులకుం గడు వేడ్క నిచ్చుటన్
బోపదు శిక్షణక్రమము ♦ పొల్లయి; యాపశుపక్షులున్ భువిన్. 158

మ. తముఁ బోషించెడువారిపై మిగుల హా♦ర్దం బెప్పుడున్ బూను స్వాం
తమునన్ దత్కృతముం దలంచుఁ జనవుం ♦ దాల్చున్ గడున్ వానికిన్
దమి దోఁబుట్టువు తల్లిదండ్రులపయిన్ ♦ దర్కింప నీపాపికిన్
గుమతిన్ గూరినవాని కెల్లను నధః♦కుంభిన్ బ్రవేశించెఁ బో. 159

వ. మఱియు. 160

ఉ. ఎవ్వనిదుష్టజన్మమున ♦ నెల్లర మేము సుఖంబు సున్నగా
నివ్విధి దుఃఖవారినిధి ♦ నీఁదుచుఁ గుందుచు నుండువారమో
యవ్విటుఁ డీదృశాచరితుఁ ♦ డందుత జన్మము తిర్యగంగమం
దివ్వసుధాతలంబునను ♦ నెక్కడ నైన నవశ్య మారయన్. 161

చ. తనదుహితంబుపొందె మఱి ♦ తద్దయు నన్యహితంబుపొందెనున్
జనము సమస్త మీవసుధ ♦ సల్పుఁ బ్రవృత్తిని నెందు; నీతఁడో
కనఁగ నొనర్చె మమ్ము నిటు ♦ గాఢతరవ్యథ వ్యర్థ మేరికిన్
దనకును వింతవారికిని ♦ దార్పఁగ లేదు హితంబు చూడుమా. 162

ఉ. ఈగతిఁ దన్నుఁ జంపుకొని ♦ యే మొనరించె నితం డటంచు నే
నేగతిఁ జూచినన్ దెలియ ♦ దెన్నఁగ నీతఁడు దుర్గ్రహుండు దు -

ష్టాగుఁడు మాకుఁ బుట్టె వ్యథ • లందఁగఁ జేయనె యంచు నేత్రముల్
దోఁగ హిమర్తుసుత్పలినితో నెనయై స్రవదశ్రువారిలోన్. 163

తే. పెదవు లదరంగ లోలోనఁ • బెల్లు మండు
మన్యుపూరంబుచేఁ గడు • మథితుఁ డగుచు
వెచ్చ నూర్చుచుఁ బలుకక • తిచ్చపాటు
గదుర శుకనాసుఁ డుండెను • నెదుర నిలిచి. 164

వ. తదవస్థుం డైన శుకనాసునిం గాంచి తారాపీడనరేంద్రుం డిట్లనియె. 165

## తారాపీడుఁడు శుకనాసు నూఱడించుట

చ. తలఁపఁగ మాదృశుల్ తెలుపఁ • దార్కొను టంతయు మేరుధీర! నీ
కలజలదాంబుబిందువుల • నబ్ధిని నించుట; మంచువిప్రమం
బులఁ జెలువల్ సుధాంశునకుఁ • బూన్చుట; దీపమునన్ బ్రకాశమున్
గొలుపుట వహ్నికిన్; రవికిఁ • గూర్చుట వెల్గఁ బగంటివెల్గునన్. 166

వ. అయినను. 167

చ. చదివినఁ బెక్కుశాస్త్రములు • చాలవివేకము గల్గినన్ బలం
బొదవిన ధైర్య ముండినను • నుండినఁ బ్రజ్ఞయు దుఃఖవేగముల్
గదిసిన నెంతవానికిని • గాంచు నవశ్యము వర్ష వారిచే
ప్రాదముగతిన్ మనంబు గడు•నచ్ఛము నావిలతన్ జగంబునన్. 168

చ. కలుషతఁ గాంచినన్ మనము • గాంచఁగ నేరదు దృష్టి సర్వమున్
దెలియదు బుద్ధి చిత్తమును • దేనిని నారయ నేర దెంతయున్
దొలఁగు శుభాశుభంబులనుఁ • దోఁపఁగఁ జేసెడు తెల్వి పత్క్యాన్
దెలియదు నాకు నెక్కు డవ•నిం గలవృత్తము నీవె సర్వమున్ 169

చ. పౌరయశ యేవికారమును • బుచ్చినయట్టిఁడు ప్రాయ మీభువిన్
బరఁగును నేఁడు? యౌవనము • పాటిలినంతనె శైశవంబుతో
గురుజనభక్తి జాఱు నెట•కో, మఱి వేఱుగఁ గ్రొత్తప్రీతి తా
దారఁకొను నెక్కుడై వయసు • దోఁచుకొలందిని దానితోఁడుతన్. 170

సీ. అక్కతోడనె వాంఛ•నతివిస్తరముఁజెందుబలముతోడ [illegible]బు•పసయుఁ బెంపు
దోర్ద్వయితోడనే • స్థూలమౌ బుద్ధియు నడుముతో శ్రుతమును•బడయుఁ గృశత
నాసలతోడనే • మిసమిస మెఱయును మలినతాహేతువౌ • మహితమోహ
మూరుయుగ్మతోడ • నుపచయం బందును నఖిలాపదలగృహం • బవినయంబు

తే. నాకృతిని గూడి హృదయంబు • నందునంటి
వికృతు లెల్లను వెలువడు • విడక వెంట
యౌవనమునందు జనులకు • నవనియందుఁ
జెప్పఁగా నేల వానివి • చేష్టితములు. 171

మ. ధవళంబయ్యు సరాగమై తనరుచున్ • ద్రాఘిష్ఠమై దీర్ఘమున్
దివురం గాంచఁగ లేదు చక్షువు; చొర • న్లేదాఁక లేకుండినన్
జెవి నాచార్యహితోపదేశము; గదున్ • స్త్రీరాగియై డెందమున్
దవులం జాలదు విద్య నొందు నెపుడున్ • దథ్యంబు తచ్చేష్టలన్. 172

తే. కలుగు నస్థైర్యశీలచం • చలత మిగులఁ
గలుగ నేరదు స్థైర్యంబు; • కడఁగి విడువఁ
దగినవ్యసనంబులందును • దద్వికార
సంగతులయందు హేతువు • సరసత యగు. 173

తే జలమయముగాఁగ సర్వంబు • నలుపు చల్ల
సరతయె వర్షవృద్ధికి • నరవి హేతు
వగును యౌవనకాలంబు • నందు జగతి
మనుజులకు నెల్ల సాజమై • తనరుచుండు. 174

వ. మఱియు. 175

సీ. అహ మగు దోషాగ • మార్గమ్ము దోషాగమంబు నాలోకాగ • మార్గ మగును
నగును నసద్దర్శ • నార్థ మనాలోక మగు నసద్దర్శన • మరయమికిని
నరయమి దుష్పథ • మందుఁ జొచ్చుట కగు దుష్పథవృత్తమై • తొట్రుపడుచు
భ్రమియించుచు మనంబు • పడును మోహాంధమై యదిపడఁ దల్లగ్న • మైనసిగ్గు
తే. వడు నవశ్యంబు, సిగ్గు తాఁ • బడినపిదప, వలదు పొమ్మనఁ ద్రోసిన • వదలకట్టె
వచ్చి చేరును డెందంబు • వలపురాజు, నవినయమ్ముల కెల్ల రా • జాధిరాజు.

తే. అడరు చుండంగ నామరుఁ • డాత్మయందు
సత్వ మెల్లను నడుగంట • సల్పు నయూత
రంధ్రములు గల్గ వేటికి • రట్టు చేయ
సత్వ ముడిగిన శీలంబు • సడలకున్నె. 177

వ. అట్లు సత్వ ముడిగి శీలంబు సడలిన. 178

క. వినయమున కేది యవలం,బనము? నిరాధార మగుచుఁ • బరఁగెడు ధైర్యం
బానరుపఁ జాలును నేపని?, నునుచుఁ బద మ్మొచట బుద్ధి • యూర్జిత మగుచున్.

తే. కను నవష్టంభ మెచ్చట ♦ గాఢసుఖము?
దేన వశమయి నిశ్చలం ♦ బౌను మనము?
దేన వినియంత్రితంబులై ♦ తీవ్రమార్గ
గాము లగునింద్రియంబులు ♦ కదల కుండు?. 180

ఆ. భువనగర్హితములు ♦ భూరిదుశ్చరితంబు,లణఁగు వారితంబు ♦ లగుచు దేనఁ?
నొలఁగు మఱియు దేన ♦ దోషాభిసంగంబు,దృష్టిరోధకంబు ♦ తిమిరదంబు.

క. తలఁపఁగ బహుదర్శిత్వ, మ్మలవడ దేఁ దేనిఁ గాంచు? ♦ నది యలవడు నె
ట్టుల యీసమయంబున నే,కలుగఁగఁ దొలివయసుమిసిమి♦కలిమి యడరుచుఁ.

తే. కురులతోడన చరితముల్ ♦ కూడఁ దాల్చు
ధవళిమము; వార్ధకము నగు ♦ ధన్యులైన
వారలకుఁ గొందఱక; యెల్ల♦వారల కిది
కలుగ నేరదు సుకృతంబు♦గరిమఁ గాని. 183

సీ. మోహవిషమహాహి♦ముఖ్యంబు గురుమదవికృతిమత్తద్విప♦విలసితంబు
ససమానదుశ్చేష్టి♦తైకాధిపత్యంబు రతినిద్రలు వసించు♦రమ్యగృహము
నవరాగపల్లవ♦నవోద్గమవిలాసచారు దుశ్చారిత్ర♦చక్రవర్తి
క్రూరాఖిలానర్థ♦కోటినివాసాంధకారబంధురమహా♦కాననంబు

తే. నగుతరుణిమావతారమ్ము♦నందుఁ గలుగు, విషమతరవిషయాధ్వని♦విష్టమైన
సర్వమునకును దోషంబు♦జరుగుచుండుఁ,జింత యేఁటికి దీనికై ♦యింత సుమతి!.

ఉ. లాలనపాలనక్రియల ♦ లక్ష్యులు పిల్లలు చూడ వారిపైఁ
బోలునె నీకు నార్యునకు ♦ భూరితరక్రుధ నిట్లు గైకొనన్?
బాలురపైని ప్రేమ కిటు ♦ పల్కుట క్రోధముఁ బూని యర్హమే
చాలు గురుల్ తలంపఁగను ♦ స్వప్నసమానులు, తన్ముఖంబునన్. 185

చ. వెలువడు మేలొ కీడొ యది ♦ బిడ్డలయందు ఫలించు నిక్కమై
పలికిన దీవనల్ గురులు ♦ పాటిలు నెట్లు వరంబు లౌచు న
ట్టు లవును దిట్లు శాపములు ♦ దుల్ల శుభంబులు దైవతంబు తం
డ్రులు గద పిల్లవాండ్రకు ని♦టుల్ దగునా భువి దూఱ బాలురన్. 186

క. మనవైశంపాయను గిను,కను బరుషము లాడ నీవు ♦ గలిగె మనమునన్
ఘనతరదుఃఖము, స్వయముగఁ, బెనిచినవృతుముల పైనఁ ♦ ప్రేముడి యలరున్.

క. తనుజాతనుజులపైఁ గడుఁ, దనరును ప్రేముడి యటంచుఁ ♦ దర్కం బేలా
చన దీకోపము మానుము, మనవైశంపాయనుపయి ♦ మమత విడిచెదే. 188

ఉ. అంతవిరుద్ధ మైనపని ♦ యాతఁ డొనర్పఁ డొకింత యేని దా
నంతయు సన్న్యసించె నని ♦ యంచు నెఱుంగక హేతు వీగతిన్
సుంతయు శంకఁ దక్క మది ♦ నొవ్వఁగ మోపెద వేల దోషముల్
వింతె యొకానొకప్పు డవి ♦ నీతిజదోషము చక్కనౌఁ గదా. 189

క. పిలుపింత మటకు వానిని, దెలుపుద మీవయనునంతె ♦ తెగ నర్హంబే
ఁలిపితి వేలకొ యిట్లని, సలుపుద మట దాని కేమి ♦ సలుపవలయునో. 190

క. అనుటయుఁ జంద్రాపీడుం, డన శుకనాసుండు మరల ♦ నాతని కిట్లం
చును మీ రనెదరు వత్సల, తను నౌదార్యమున నిట్లు ♦ తగునే చేయన్. 191

క. తలఁపఁగ నేమి విరుద్ధము, కలుగును నొం డింతకంటె ♦ ఘనతర మది తాఁ
దలఁగి యువరాజు క్షణమును, మెలఁగెడు నొండెడను నిచ్చ ♦ మెయి నీతఁడు పో.

చ. అన శుకనాసుఁ డిట్లు మను ♦ జాధిపసూతి కశాభిఘాతుమా
డ్కని జనకుండె దోషములఁ ♦ గీర్తనచేయఁగ నట్లు బాష్పముల్
కనుఁగవఁ గ్రమ్మ నిట్లనియెఁ ♦ గాంచుచు నా శుకనాసుతోడ నా
య్యాన నుపవిష్టుఁ డౌచుఁ గది ♦ యం జని సంక్షుభితాంతరంగుఁడై. 193

చంద్రాపీడుఁడు శుకనాసు నూఱడించి వైశంపాయనుఁగొనిరా నాజ్ఞనడుగుట.

చ. కలుగదు నాదుదోష మని ♦ కాంచితి నీతనయుండు రామి నీ
పలికినమాటలం దయినఁ ♦ బాడియె యిట్టితలంపు తండ్రికిన్
గలుగద యేరి కొడ్డ కతి ♦ గాఢవితర్కము? మిథ్య యైనను
బలికినయట్లయా జనము ♦ పల్కనఁ దండ్రులఁ జెప్ప నేటికిన్. 194

క. జగమున గుణదోషాశ్రయ, మగురూఢి యశోయశముల ♦ నలవడఁ జేయన్
దగునె? పరలోకఫలదం, బగుపరమార్థం బదేడ ♦ నగు ఫలదము దాన్. 195

క. నే వైశంపాయను దే, నీవిభుచే నాకు నాజ్ఞ ♦ నిప్పింపు మిదే
వావిరి ప్రాయశ్చిత్తము, నీవు తలఁచుదోషమునకు ♦ నగు లేల మదిన్. 196

క. పాయదు వేరువిధంబున, నీయఘము మదీయము కత ♦ మే మన వైశం
పాయనుఁడు రాకయుండినఁ, బాయదు జనకునకు నిట్టి ♦ భావన యెపుడున్. 197

క. పోయిన నేనే వైశం, పాయనుఁ దరుదెంచు; నొండు ♦ భంగి యయిన రాఁ
డాయన; గొనిరాఁ దండ్రికిఁ, ద్రోయఁగ రానట్టి యాజ్ఞ ♦ తోడినరపతుల్. 198

క. వలయును బెక్కం డ్రన్యులు, కలిగినఁ గొని రాఁగ వచ్చుఁ; ♦ గానఁ బయనముల్
సలుపఁగ ననుగ్రహింపుము, వల దాలస్యంబు వేగ ♦ వత్తు మగుడ నేన్. 199

చ. హయములతోడ ముగ్గనిన•యధ్వమునం జనునాకుఁ గల్గదా
యయనపరిశ్రమంబు; భవ•దాత్మజుఁ దెచ్చినవానిఁ గాన ని
శ్చయముగ నెంచుమా నను; న•సహ్యము లోఁ గలతద్వియోగజం
బయినవిషాద మెక్కు డక•టా వెలిఖేదముకంటె నారయన్. 200

చ. వెనుకను సైన్యముల్ గొనుచు • వే చనుదెంతును నీవు పొమ్మనం
గను విడి వాని వచ్చితిని • గా కిటు జన్మముఁగోలె నెన్నఁడేన్
జనితిని నాడితిన్ నిదుర•సల్పితిఁ గ్రోలితిఁ దింటి నవ్వితిన్
గొనితిని నూర్పు లేచితిని • గూర్చితి నీసుతుఁ బాసి చెప్పుమా. 201

చ. చన నటనుండియే వినుచుఁ • జయ్యన నంతటి హెచ్చుకీడు గా
దనుచు క్షమింప వేఁడెదను • నాయపరాధముఁ గాచి నన్ను ని
మ్మని నుడువంగ గాతనయుఁ • డాశుకనాసుఁడు నాంతరవ్యథన్
గన నరుణాంబుజాభతను • గాఢతరారుణ మైనమోమునన్. 202

చ. పఱవుచుఁ బక్షపాతయుత•బంధురపంక్తిని బోనిచూడ్కులన్
మఱి యువరాజు పోవఁగను • మన్వి యొనర్చెడు నేమి యానతిన్
నెఱపెద రంచు నొయ్య ధర•ణీపతితోడ వచింప నావిభుం
డఱనిముసంబు డెందమున • నారసి యిట్లను మంత్రితోడుతన్. 203

చ. సుమతి! యెఱుంగుదుర్ సకల•సూత్కృములన్ బరిపూర్ణచంద్రునిన్
విమలసుచంద్రికాగతిని • వేడుక నీతనిఁ జెట్టపట్టఁగాఁ
గుముదదళాక్షి యోర్తుఁ గనఁ • గోరుచు నుంటిని నీదినంబులన్
గమలభవుండు వామపథ•గామి భవత్సుతువార్త నొండిటన్. 204

చ. వయిచె సమావృతాశమయి • భాసిలువారిదవేళభంగి మా
వయి నిది యంతరాయముగఁ; • బాసి యితం డతనిన్ వసింపఁగా
సయిఁపడు వానిఁ దెచ్చుటకుఁ • జాలరు నెవ్వ రటంచు నంటి వీ
వ యిది నిజంబు వీఁడె వ్యస•నార్ణవ మీఁదఁగఁ దేప గావునన్. 205

క. ఆవైశంపాయనుఁ డే, దేవి విలాసవతి వీని • దీవించి వడిన్
బోవఁగ నీకొను నని నే, భావింతును నిక్కువముగఁ •.బయనం బగుతన్. 206

చ. చనవలె వీఁడు దవ్వు గడుఁ • జాల విచారము చేసి లగ్నమున్
దినమును నిర్ణయింపుము సు•ధీంద్రులు జోస్యులతోడ వేగమే
పొనరుపు సంవిధానమును • భూరిగ నంచు వచింప బాష్పలో
చను శుకనాసు, నాత్మసుతుఁ • జాలఁ గనుంగొని చీరి యొద్దకున్. 207

చ. వినయవినమ్రుఁ డైనసుతుఁ ♦ బ్రీతిని నంసమునన్ శిరంబునం
దును భుజయుగ్మకంబునను ♦ దోయజసన్నిభ మైనకేలుచే
తను స్పృశియించుచున్ బలికెఁ ♦ దండ్రి! స్వయంబుగ లోని కేగి నీ
జనని మనోరమామణికి ♦ సర్వము తద్గమనప్రవృత్తినిన్. 208

చంద్రాపీడుఁడు వైశంపాయనుఁ గొనిరా నాజ్ఞఁ గొనఁ దల్లియొద్దకుఁ బోవుట.

చ. తెలుపు మటంచుఁ జెప్పి చను ♦ దేర నమాత్యుఁడు వెంట నంటి త
న్నిలయముఁ జేరె త్త్వావరుఁడు; ♦ నేతృసుతుండును దాల్చి యక్కనం
దలమది రాత్మజావరణ ♦ హార మనన్ గమనాభ్యనుజ్ఞ, లో
నలరియు నప్రహృష్టదృశుఁ ♦ డై చని తల్లికి మ్రొక్కి నగ్గలన్. 209

క. కూర్చుండి తన్నుఁ గాంచుటఁ, బేర్చి ద్విగుణితం బయి వగ ♦ వెల్లు గలఁపఁగా
నేర్చెడుమనోరమను నో,దార్చుచు నిట్లనియె భూమి ♦ ధవపుత్రుఁడు తాన్. 210

క. జనకుఁడు వైశంపాయనుఁ, గొని తేరఁగ నన్నుఁ బుచ్చెఁ ♦ గూరెద వేలా
పెనువగ నింకను దల్లీ!, చన దుడుగుము యూఱడిల్లు ♦ శాంతిని గనుమా. 211

క. కని వైశంపాయనుద,ర్శనసౌఖ్యము పెక్కునాళ్లు ♦ చనియెను నీకున్
బనుపుము గొనివత్తును నిదె, గనకుము మది సందియంబుఁ ♦ గానకుము వగన్.

వ. అనుటయు నామనోరమ యిట్లనియె. 213

మ. ననుఁ బంపించు మటంచుఁ జెప్పుచుఁ గదున్ ♦ నన్నాఱడిం తీవు నా
యన! యే మాఱట యిద్ది నాకుఁ గలదా ♦ హా వాసి మీయిర్వురం
దును వానిన్ గన కుండ నుండ నటు ని♦న్నుం గాన నీ వేగినన్
గని నిన్నాతనిఁ గాన కున్నఁ గనుదున్ ♦ దాల్మిం గటా యెట్లిఁకన్. 214

క. ఇరువురము మేము మీయిరు,వురయుం దొక్కరునిచేతఁ ♦ బుత్రవతుల మై
పరఁగుదుము విషురాత్మకుఁ, డరుదేరక యున్న నాతఁ ♦ డరుగకు తండ్రీ!. 215

క. అని యనుచుండ మనోరమ,యనియె విలాసవతి యిట్టు ♦ లతిధీనముగా
విను సఖి! నీ వనినట్టే, మన కిర్వుర కితఁడు వాని ♦ మాని యెటుండున్. 216

చ. అది యటు లుండ నిమ్మతని ♦ నాఁగుదు వేటి కితండు నాఁగినన్
వదలఁగ రాదు పోక యిది ♦ స్వాంతమునన్ దలపోసి తండ్రి తాఁ
బద మని యాజ్ఞ నిచ్చెఁ జన ♦ భామిని యీతని కంచు నెంతు నేఁ
గదలుత పేఁడు తామసముఁ ♦ గాఁ జన దిప్పుడు వంత యేటికో. 217

క. కనమిని వైశంపాయను, జనితం బగుదుఃఖమునను ♦ జాయ విడినయా

తనిమోమును దినదినమును, గనుకొంటెను నీనిఁ గనమిఁ ♦ గల్గెడువ్యథలన్. 218

క. కనుటది యే లగుఁ గతిపయ, దినములు మన కింక లెమ్ము ♦ తీవ్రంబుగ నీ
తనిఁ బయనము గావింపఁగఁ, జనుదము గమ్మేటి కింకఁ ♦ జనదు తడయఁగాన్!.

క. అనుచు మనోరమ కేలుం, గొని లేచి తనూజు వెంటఁ ♦ గొని చనుదెంచెన్
దనసదనమునకు యువరాజును గమనాలాపములను ♦ జోక సలుపుచున్. 220

తే. జననియొద్దను క్షణ ముండి ♦ చనియెఁ దనదు
సదనమున కంత వ్యపనీత♦సంగుఁ డగుచుఁ
బయనమును గూర్చి యుత్తలం♦పడెడు నెడను
బిలిచి గణకుల నిట్లని ♦ పలికె నతఁడు. 221

మ. జనకుం డొండెను మంత్రియొండె నడుగన్ ♦ సద్వాసరంబుల్ మిముల్
జన నే నీనలు తామసం బొదవ కుం♦డన్ జెప్పఁ మూర్త మం
చన వారల్ వచియించి రిట్లు యువరా♦జా గాము లెల్లన్ శుభం
బొనఁగూర్పం గల విప్పుడే గమనసం♦యుక్తిన్ దగన్ సల్పుఁడీ. 222

చ. మిగులఁ బ్రశస్త మిప్పుడె య♦మేయశుభప్రద మింత యేల కా
ర్యగతినిబట్టి యెప్పుడు ధ♦రాపతి కిచ్ఛ జనించు నప్పుడే
యగును ముహూర్త మందు నర♦యం బని లేద యహర్విచార మిం
పగును నృపుండె కాలమున ♦ కాదిమహేతువు గాఁడె యెన్నఁగన్. 223

ఉ. ఏసమయంబునందు మన ♦ మేర్పడఁ గార్యములందుఁ జొచ్చునో
యాసమయంబె రాజులకు ♦ నర్హముహూర్త మటంచుఁ జెప్పఁగా
నాసమయజ్ఞు లంతట నృ♦పాత్మజుఁ డిట్లనె వారితోడ నే
నీసమయంబునం జనుదు ♦ నేల విళంబము చేయఁగా వలెన్. 224

క. జనకుం డాజ్ఞాపించెను, నని యంటి నవశ్యకంబు ♦ లైనపనులయం
దునుఁ బ్రతిసమయనిరీక్షణ, జనకమ్ములయందు దినవి♦చార మ్మేలా. 225

క. రేపే యేగతి నైనన్, నాపయనము సాగు నట్లు ♦ నరనాథునితో
నేపునఁ జెప్పుఁడు మీ రని, యాపార్థివసుతుఁడు చెప్ప ♦ నట్లే యనుచున్. 226

క. చన వారు రాసుతుండును, జనియెను శారీరకృత్య♦సంపాదనకున్
గని శారీరస్థితి వచ్చిన యాతనికడకు మరలఁ ♦ జేరిరి గణకుల్. 227

తే. చేరి మెల్లన నతనితోఁ ♦ జెప్పి రిట్లు
తావకాదేశ మెల్లను ♦ దంత్రితోడ

మనవి యొనరించితిమి మేము ♦ మహీపతనయ!
సుతవిరహవిక్లబుని మంత్రిఁ ♦ జూచి యతఁడు. 228

తే. తరలవలయును నెల్లుండి ♦ తమిని నిచట
ననుచుఁ జెప్పంగ వార లా♦యినసుతుండు
లెస్స చేసితి రని వారి ♦ లీలఁ బొగడి
వసదనం బిచ్చి వీడ్కొల్పి ♦ పనిచి తాను. 229

క. చెలఁగుచు వైశంపాయను,గలికిని మదిరాతనూజఁ ♦ గట్టెదుటఁ దమిన్
నిలిచినయట్టులు మనమున,దలపోయుచుఁ బత్త్రలేఖ ♦ తరలక యున్నన్. 230

సీ. చనియెద నని మను♦చనెడుచిత్తంబుతో నాల్గుసంద్రంబుల♦నడుమ నున్న
యవనీపసుతులలో ♦ నగ్రగణ్యులు మది నింద్రాయుధమునకు♦నినుమడించి
వేపోద మనుచు ను♦వ్విళులూరువారితో హాయగమనాయాస♦మవగణించి
కడుసముత్సాహంబు ♦ గలరాజసుతులతో నిష్టకథాగోష్ఠి ♦ నెలమిఁ గనుచు

తే. నెట్టొ యాదిన మొకరాత్రి ♦ నెట్టుచుండె
నంత నస్తంగతుం డయ్యె ♦ నహముతోడ
నబ్జినీకాంతుఁ డనురక్త ♦ యైనతనదు
నబ్జినీకాంతవిరహంబు ♦ నోఁప లేక. 281

చ. దినకరపాతశోకమున ♦ దివ్యపదంబును బశ్చిమాశతో
ఘనచితివహ్నిఁ జొచ్చుక్రియఁ ♦ గ్రాలుచుఁ జొచ్చెను సాంధ్యరాగమున్
గనఁబడెఁ దచ్చితాగ్నికణ♦కాండములో యన ఋక్షజాలముల్
కనుఁగవ మూసి దిక్కులును ♦ గానమి సూర్యుని మూర్ఛఁ గాంచె నాన్. 282

చ గగనతలంబుఁ బాయుటను ♦ గల్గినదుఃఖమునన్ మనంబునన్
బొగులుచు నార్తనాదములఁ ♦ బొంపిరి సల్పెడి నాఁగఁ గూయుచున్
ఖగనిచయంబు గూళ్లకయి ♦ గాఢరయంబునఁ బాఱసాగ శ్రే
ణిగఁ జనుదెంచె గోగణము ♦ నింగి చెలంగఁగ నార్భటించుచున్. 233

క. జనితప్రకాశకం బయి, తనరెడుజన్మమును జూచి ♦ తమము నిరాలో
కనదోషాగతగర్భం,బును బోలినదానిఁ జొచ్చె ♦ భూతచయంబుల్. 234

వ అంతఁ జంద్రాపీడుండు కృతప్రస్థానమంగళుండై పయనంబున కనుమతి వేఁడ
నిజజననికడకుం జని ప్రణామంబుఁ గావించుటయు విలాసవతి తద్విరహవ్యథా
భారంబు సైఁపఁ జాలక తదంతర్విలీనయో యన నుద్వేలంబులై కాఱుబాష్ప
వారిపూరంబుల నతివిశాలనేత్రంబుల నమంగళభయంబున నంతనివారించి

నను నివారించుకొనఁ జాలక క్రోధరాగావేగగద్గదికోపరుధ్యమానకంఠయై యతని కిట్లనియె. 235

చంద్రాపీడునిఁ బంపఁజాలక విలాసవతి దుఃఖించుట.

చ. కలుగును నంకలాలితుఁడు ♦ గర్భమయుండు సుతుండు మాతకున్
దొలి జనియించు వేళ నిల ♦ దుర్భరవేదన తీవ్రమై కడున్
గలుగదు తత్ప్రసూతిజఁ జేఁ ♦ గల్గును నిత్తఱి నెట్టిబాధ నీ
తొలిగమనంబునందు నటు ♦ దుర్భరవేదన నాకుఁ బుత్రకా!. 236

సీ. అగలింపఁబడునట్టు ♦ లయ్యెడుహృదయంబుకవ్వధిశమైనటు మేను ♦ గ్రాఁగుచుండు
నుత్పాటితములట్టు ♦ లొప్పును మర్మముల్ ప్రాణముల్ పోయిన ♦ పగిదిఁ దోఁచుఁ
జిత్తము త్ప్లవనంబుఁ ♦ జెందినయట్లవు సంధిబంధంబులు ♦ సడలినట్లు
నుదురుపాటొదవదు ♦ మది కించుకయుఁ; దోఁచు శూన్యమైనట్టుల ♦ చూడ్కి కెల్ల
తే. నిలువఁ జాలను హృదయంబు ♦ నిలిపి నట్లు
దేహమును నేను బాష్పముల్ ♦ తీవ్రముగను
నాఁగినను నెంత యాఁగక ♦ యడుగు సారె
నేమి సేయుదు వత్స! నే ♦ నెటుల సైఁతు. 237

చ. మనము చలించు నెంతయును ♦ మానక, నీ కొదవింప భద్రముల్
తనయ! యొఱుంగ నేల యిటు ♦ తత్తర మందెదు నేమి కందునో
ఘానరును నేటి కిట్టివ్యథ ♦ పాక్కుఁగఁ జేయును నేది యీవ్యథన్
బానరుచు నంచునన్ దెలియఁ ♦ బుత్రక! నేను నిటుల యయ్యెడున్. 238

ఉ. వచ్చెను జాలనాళ్ల కిటు ♦ వచ్చి జనన్ వడి మళ్లి యిప్పుడే
మచ్చిక తీఱఁగా నచటి ♦ మాటలు చెప్పక యే యటంచునో
నెచ్చెలికానిఁ బాయుటను ♦ నెవ్వగఁ గూరిననిన్నుఁ బంపఁగా
వచ్చెను నొంటిగా ననుచు ♦ వత్స! యొఱుంగను నేలకో వ్యథల్. 239

చ. కలఁగుదుఁ గాని యీవ్యథను ♦ గందుచుః నీచెలికానిఁ దోడితే
వలదు చనంగ నంచు నిను ♦ వారణ సేయఁగలేను బుత్రకా!
నిలువన కోరు మానసము ♦ నీగమనం బిపు; డేమి సేయుదున్
దలఁచి మదీదృశం బయిన ♦ తాపము ముందటిపొల్కి నెక్కుడన్. 240

చ. నిలువకు మన్న యేదొ మిష ♦ నిష్క్రియమున్ ఘటియించి; చాలనా
శ్నలుపకు మన్న తామసముఁ; ♦ జయ్యన రమ్మిదె యేతదర్థ మం

జలి ఘటియించి వేఁడెదను; ♦ జాలను దాళఁగ నిన్నుఁ బాసి ము
ద్దులతనయా! యటంచుఁ గడుఁ ♦ దూలెడుతల్లినిఁ గాంచి యంతటన్. 241

చ. వినమితసారితాంగుఁ డయి ♦ విస్ఫురితాంజలిబంధుఁ డౌచు నో
య్యన నిజమాత కిట్లనియె ♦ నాయువరాజు ప్రగాఢభక్తిమై
జననిరో! వల్కె దేల యిటు ♦ జాగొనరించితి జైత్రయాత్ర కా
రణమున నప్పు డిప్పు డటు ♦ రాక రయంబునఁ జాగొనర్తునే. 242

ఉ. ఏగెదు దాఁక నచ్చటకు ♦ నింకొక కార్యము లేదు చూడఁగా;
వేగమె పోదు వచ్చెదను ♦ వేగమ తల్లిరో! యించు కేనియున్
గ్రాఁగకుమమ్మ నీమదిని ♦ గాసిల కమ్మరో! మద్వియుక్తిచే
నేగును నెన్నినాళులకొ ♦ యెన్నఁడు వచ్చునో యంచు శంకచేన్. 243

క. అని చంద్రాపీడుం డిటు, లనుటయు బాష్పాంబువేగ ♦ మాఁపికొని యెటో
తను వూని యాడిలి తా, జనని గమనమంగళముల ♦ సల్పె రయమునన్,

క. అదురుచు మూర్కొని నొదల, వదంక పరిరంభణంబుఁ ♦ బచరించి గడున్
బొదలెడుపాలం దడుపుచు, వదలెను సుతుఁ బ్రాణములను ♦ వదలినమాడ్కిన్.

వ. అట్లు చంద్రాపీడుండు తల్లిచే నెట్టకేలకుఁ బరిముక్తుండై తండ్రికిం బ్రణమిల్లఁ దదావాసభవనంబునకుం జని తనరాకఁ జెప్పివంప ద్వారపాలకుండు దేవ! యువరాజు పయనంబున కనుజ్ఞ వేఁడ నమస్కరింప వచ్చినవాఁ డని తెల్పి తదాజ్ఞం గొనిపోవ వానితోడం బోయి క్షితితలనిహితమస్తకుండై శయ్యాతలవర్తియగుతండ్రిపాదంబులకు నమస్కరించుటయుఁ దారాపీడుండు నమస్కరించుకొడుకుం గాంచి శయనస్థితుం డయి కించిదున్నమితపూర్వకాయుండై నేత్రములఁ ద్రాగువాఁడునుంబోలెఁ గడుప్రీతిన్ బిలిచి గాఢపరిష్వంగం బొనరించి సహజోద్గతావిరళబాష్పపర్యాకులాక్షుండై యంతఃక్షోభవిక్షిప్తాక్షరుం డగుచు నిట్లనియె. 246

ఉ. ఊనకుమయ్య చిత్తమున ♦ నుత్తల మింతయు నన్ను దోషిగాఁ
దాను గణించెఁ దండ్రి యని ♦ తద్ద పరీక్షితుఁ డైతి నీవు వ
త్సా! నయశిక్షణాదిగ ని♦తాంతము మేము నినున్ బరీక్షితున్
గా నొనరించి తావకగుణం బగుణంబును గాంచి నీపయిన్. 247

తే. నిలిపితిమి రాజ్యభారంబు ♦ నిఖిలమును సు
తానురాగంబుచేఁ గాదు ♦ తనయ! వినుము

భరము కడు రాజ్య మీభూమి ♦ భారమునను
కలదె భారంబు లేకున్నఁ ♦ గనఁగ నిందు. 248

రాజ్యలక్ష్మీవర్ణనము.

సీ. కడుసంకటము మహీ♦కాంతసంకటతనే యతిదుర్ధర మనీతి ♦ యులముకొనుట
నతిమహా త్రాచతు♦రంబుధివ్యాప్తినే గడుగహన మనంత♦కార్యతతిని
దుస్సాధనము మహా♦దుర్భరసాధనసాధ్యమై వఱలుట ♦ సంతతంబు
నతిదురారోహంబు ♦ నత్యున్నతోన్నతవంశప్రతిష్ఠితో♦ద్భాసురతను
తే. నరిశతోద్ధృతిచే దురు♦ద్ధరము మిగుల
బహుళతీర్థప్రయోగముల్ ♦ పరఁగుకతన
దురవతారంబు కంటక♦దూషితంబు
నగుట దుర్గ్రహ మీరాజ్య ♦ మగును బుత్ర!. 249

వ. మఱియు. 250

క. అతివిషమము సమవృత్తిత, నతిదుష్ప్రాప్యమ్ము మఱియు ♦ నఖిలజనములున్
నుతిచేయఁ బాల్యమగుటను, మతికలవారికిని నెట్టి♦మాన్యుల కైనన్. 251

సీ. అన్యాయవర్తను ♦ నవివేకిని గృతఘ్ను నప్రియవాదిని ♦ ననృతవాది
నప్రాజ్ఞ నశరణ్యు ♦ నదయు ననేవకు నవశాత్ముని నధర్ము ♦ నవిజితాత్ము
నస్థిరప్రజ్ఞుని ♦ నస్నిగ్ధవత్సలు నవిభాగశీలు న♦నాత్మరతుని
నపరిశుద్ధు నదాత ♦ నమూలలబ్ధ్యుని శాస్త్రానభిజ్ఞుని ♦ శాంతిరహితు
తే. విక్రమవిహీను నబలుని ♦ వినయరహితు
నగుణు నుత్సాహవర్జితు ♦ నప్రహృష్టు
భీరు నసమర్థుని నధీరుఁ ♦ జేర దెపుడు
రాజ్యరమ పుత్ర! రాజన్య♦పూజ్యచరిత.! 252

తే సకలగుణముల సహజచాం♦చల్యయుక్త
మైన దీనిని బలిమిని ♦ నట్టె పట్టి
నిగ్రహింపంగ నెవ్వండు ♦ నేర్చు వాని
కడను నీరాజ్యరమ యుండదుఁ ♦ గదలకుండ. 253

తే. వరము నవరంబు నారయ ♦ వలఁతు లగుచు
స్ఖలనభయమును వీడి ని♦శ్శంకవృత్తి

సంచరించెడుగురువులు ♦ నంచితముగ
నతనియందె ప్రతిష్ఠింతు ♦ రవనిభరము. 254

వ. మఱియు. 255

తే. కాన దీననె నాయందుఁ ♦ గలుగ దెట్టి
దోష మనుచు నెఱుంగుము ♦ దూఱ కెవని
నెవరిపై భారమును మోపు ♦ దించుకయిన
దోష మొనరింతు వెవ్వని ♦ దూఱె దివుడు. 256

తే. సకలలోకంబులకు నీవె ♦ నలుపవలయు
రంజనము చనె మాకాల ♦ మఱి కేల
జాఱిపడకుండ నెన్నాళ్లొ ♦ క్ష్మాతలంబుఁ
నేలినాఁడను లుబ్ధత ♦ నేచఁ బ్రజల 257

సీ. భయపెట్టఁ గినుకను ♦ బ్రాణుల మదమున సుజనుల నెప్పుడు♦న్రుక్కఁ జేయ
గరువులఁ గాఱింప ♦ గురుమానమున నాత్మ నపహసింపఁగఁ జేయ♦హార్షమునను
బరలోకమును బాడు♦పడఁ జేయ మరుబారిరాజధర్మము పడ ♦ రట్టుసేయ
స్వరుచి వృద్ధసపర్య ♦ సల్పితిఁ బలుమాఱు వ్యసనసపర్యను ♦ నాచరింప

తే. సచ్చరిత్రానుసరణంబు ♦ సల్పినాఁడ
నలుపఁగా లేదు కరణాను♦సరణ మేను
ధనువు వంచితిఁ గాని నే ♦ మనము వంపఁ
గాచితిని గాని వృత్తంబుఁ ♦ గావ మేను. 258

తే. నడికి వెఱచితి నెన్నఁడు ♦ చావ వెఱవ
నమరులకు దుర్లభము లైన♦సుఖవిషయ
సుఖములను నెల్లఁ గాంచితిఁ ♦ జొక్క మనము
కొఱఁత లే కుండ నెందును ♦ వఱలినాఁడ. 259

క. చేయ నకార్యం బెన్నఁడు,మాయఁ గనుల్ యావనేచ్ఛ♦మోసఁ గని మదిన్;
జేయఁగ వలసినవానిని, బాయక యొనరించి పర ము♦పార్జించితి నేన్. 260

క. తలఁతు భవజ్జన్మంబున, నిల ధన్యుఁడ నైతి నంచు ♦ నిక్కముగ మదిన్
గల దీకోరిక నా కిఁక, వెలఁది నొకర్తుకను దెచ్చి ♦ వేడ్క లలరఁగాన్. 261

క. పరిణయ మొనర్చి ధరణీ, భరమును నీపైనిఁ బెట్టి ♦ భవపాలనసం
పరిలఘుహృదయంబున నే, నరిగెదఁ దొలిరాజు లరిగి ♦ నట్టిసరణికిన్. 262

క. అనుకొంటిని వైశంపా,యనువృత్తాంతమ్ము నాకు ♦ నవితర్కితమై

పోనరేను బ్రతిబంధకమ్మై, యనుకొన మదభీష్టసిద్ధి ♦ యానని మదిలోన్. 263

క. ఎక్కడ వైశంపాయనుఁ, డెక్కడ నిది యతని కిట్టి ♦ లెన్నఁడు కలలో
నక్కట యనుకొననట్టిది, యిక్కట్టు ఘటించునొకొ మ♦దిష్టం బగునేన్. 264

వ. కావున. 265

చ. చనినను బుత్ర! నీ వటకు ♦ సల్పవె యట్టుల యెట్టుల నామనం
బునను మదీప్సితంబు నిలు♦పుం గన కుండునొ చాలకాల మం
చనుచు వచించి బాష్పముల ♦ నశ్రులఁ గ్రమ్మ నొకింత యెత్తి మో
మును గని తమ్మలం బొసఁగి ♦ పుత్రకు భూపతి పోయి రమ్మనెన్. 266

వ. అనుటయుఁ జంద్రాపీడుండు తదాజ్ఞన్ శిరసావహించి యున్నమితాంగుం డయ్యుఁ గడు నవనమ్రతరాంగుం డయి డాసి తండ్రికిన్ మరలఁ బ్రణామంబుఁ గావించి సవినయంబుగ మంత్రిగృహంబున కరిగి యుందుఁ దనవిరహచింతాపరీతమానసుం డయి యింద్రియోన్ముక్తుండు నా శూన్యశరీరుండై యున్న శుకనాసు, ననవరతావారితాశ్రుపాతపర్యాకులాక్షి యగు మనోరమనుం గాంచి ప్రణమిల్లి వారు శోకాకులచిత్తులయ్యు స్వదుఃఖభారం బెల్లఁ దనపైఁ బెట్టువారుంబోలె దీవించి గమనమున కనుజ్ఞ యొసంగి బహిర్ద్వారంబుదనుక ననుగమింప సారెసారెకుఁ దిరిగి చూచుచు నెట్టకేలకు నిర్గమించి యాయితం బయ్యుఁ గదలక చెవులు రిక్కించి సకిలింపక గమనోత్సాహముఁ దెలుపక యసుభగస్వనం బయి యతిదీనం బయి యమస్కం బయి నిలువంబడి యున్న యింద్రాయుధంబుఁ గాంచి నివారణభీతిని వైశంపాయనావలోకనత్వరను గాదంబరీసమాగమౌత్సుక్యంబునను నించుకయు విలంబంబు నొనర్పక యా యింద్రాయుధంబు నెక్కి పురంబు వెడలె. 267

తే. పురము వెడలి సీప్రాతట♦భూమిఁ దనకు
గమనమంగళ మొనరింపఁ ♦ గల్పితంబుఁ
గాయమానంబుఁ జొరకయే ♦ కదలె నృపతి
తనయుఁ డని కేక లెసఁగఁగఁ ♦ దద్ద వడిని. 268

తే. సంభ్రమంబున నప్పుడే ♦ సలిపి పయన
మరుగుదెంచెడుపరిజనం ♦ బవనినాథ
పుత్రలోకంబు నిటునటు ♦ నాత్రమునను
బరువు లెత్తుచు వెంటరాఁ ♦ బార్థసుతుఁడు. 269

తే. అరిగి కోశత్రయంబును ♦ నచట సులభ,జలసమృద్ధంబు తృణకాష్ఠ♦విలసితంబు

నైనరమ్యప్రదేశంబు♦నందు విడిసి, వేగునందాఁక నటనుండి ♦ వెడలి చనియె.

వ. అట్లు చనుచుఁ దనమనంబున. 271

చ. చని త్రప మోముఁ ద్రిప్పుకొని ♦ చాటుగ నగ్గన కున్న మిత్రునిన్
వెనుకనె పోయి గట్టిగను ♦ నెట్టనఁ గౌఁగిటఁ జేర్చి యొంటిఁ గన్
జనియెద వంచుఁ జెప్పుచును ♦ సారెకు మాన్చెద వానిమార్గ్యముల్
గనియెద హంసపుత్రిక న♦కారణబాంధవ శాంతిరూపిణిన్. 272

చ. కనుఁగొని తత్సమాగమసు♦ఖంబునుగాంచి యకారణప్రస
న్నను, నవితర్కితోపనతు ♦ నగ్గనినంతనె సంతసించు నా
యనఘమతిన్ బ్రయాణము ని♦రంతరమై కొనసాగఁ గొల్చెదన్
జనుదుఁ దదాశ్రమంబుకడ ♦ సైన్యము నెల్లను నుంచి యామెతోన్. 273

ఆ. హేమకూటమునకు ♦ నేగి యచ్చట నన్ను, గుఱుతు వట్టి వేగ ♦ గురుగువాఱి
వచ్చి మదిరతనయ♦వరవుడుకత్తెలు, నతు లొనర్చ నేను ♦ నగరుఁ జొత్తు. 274

వ. చొచ్చి. 275

సీ. అరుదెంచినాఁడ నే♦నంచుఁ దెలియ మోము వికసింప సకియలు ♦ వేడ్కఁ బలరఁ
బూర్ణపాత్రముఁ బెట్ట♦భూచరసుతుఁ డేఁడి చెప్పె నవ్వఁడు వానిఁ♦జెప్పుఁడనుచు
నెంతదవ్వున వచ్చు ♦ నెక్కడ నున్నవాఁ డనుచు మాటికి మాటి♦కడరుతమిని
నడుగుచు నాలించి♦నంతనె నామాట నంగజతాపంబు ♦ న స్తమిల్ల
తే. సిగ్గు గదురఁగ నెదపైనిఁ ♦ జేర్చినట్టి
పద్మినీపత్రమును నట్టె ♦ పాఱవైచి
యుత్తరీయాంశుకాగ్రంబు ♦ నత్తికొంచు
ఘనపయోధరభారంబుఁ ♦ గప్పికొనుచు. 276

వ. మఱియు. 277

చ. తలఁగి శరీరభూషలుగఁ ♦ దాల్చినతామరతూండ్ల నెల్లనున్
జెలఁగుచు వానికంటెఁ గడు♦చెన్నగునాత్మశరీరశోభచేఁ
గలుగఁగఁ జేయుచున్ దనదు♦గాత్రము నంతకు నెల్లభూషలన్;
గలఁచెడుమారతాపము న♦ణంపఁగఁ దాల్చినతారహారముల్. 278

చ. తొడవుగఁ దాల్చి, మై నలఁది ♦ తోరముగా హరిచందనమ్ముచే
నొడలిమెఱుంగు మాటుపడ, ♦ నొయ్యన హస్తకుశేశయంబునన్
దడవుచు, దర్శనీయతను ♦ దార్కొనఁ జేయుచు నంగకమ్ములన్
గడుశయనీకృతంబు లగు♦కంజదళోత్పలకేసరంబులన్. 279

మ. తనులగ్నంబులఁ దీయుచుం; జికురముల్ ♦ దార్ఢ్యంబుగా వీడి మో
మున గండమ్ముల వ్రేల రత్నముకురం♦బుం జూచి కేల్దమ్మి మూఁ
పునఁ దొల్లింటివిధమ్మునం దుఱుముచుం; ♦ మోదాశ్రుపూరంబు లో
చనకంజాతపుటంబులం మరునకుం ♦ జాలాంజలిం పీడుచుం. 280

వ. మఱియు నంగలగ్నం బైనభస్మంబు నా వెలుంగు శుష్కమలయజరసం
బున మదనహుతాశనోపశాంతిని దెల్పుచుఁ గుసుమశయనంబుం బరిత్యజించి
యెదురేగుదెంచుచున్నయా కాదంబరిం గాంచి నేత్రంబుల దర్శనీయావలో
కనసాఫల్యపాత్రంబులఁ గావించెన. అట్లు మదలేఖకు సాంజలిబంధుండనై
ప్రణామంబు గావించి పరిష్వంగంబున గారవించి చరణపతిత యగుపత్ర
లేఖం గ్రుచ్చి కౌఁగిటం జేర్చి కేయూరకుం సారెసారెకుం గాఢపరిష్వం
గంబున నభినందించి మహాశ్వేత వివాహమంగళసంభారంబులు సమకూర్ప,
ససంభ్రమంబున సఖీబృందంబు వైవాహికస్నానంబు నిర్వర్తింప వర్షాభిషిక్త
యగుభూదేవికరంబునట్లు దేవీకరకంజంబుం బరిగ్రహించెన. అతిబహుళకుసు
మధూపానులేపనామోదోద్దీపితహృదయజన్మం బైనశయనాగారంబున రత్న
పర్యంకంబున నధివసించియున్ననాసమీపంబున మదలేఖ నర్మాలాపములాడుచు
నించుక తడ వుండి యరుగఁ ద్రపావనమ్రముఖియై యున్న దేవిని గాదంబరిని
నిష్టపడకున్నను బలిమిని బాహువులం బట్టితివిచికయ్యకుం దార్చి శయ్యపైనుండి
తొడపైకిని దొడపైనుండి యెదపైనికిం దార్చి యిష్టోపభోగంబులఁ దేల్చి దేవ
తాదుర్లభం బయినతదధరామృతంబుఁ దనివి దీఱఁ గ్రోలి జన్మంబుసార్థంబుఁగా
వించెద మఱియు నతికోమలాంగి యగుటం జేసి ద్రవించి లోనం బ్రవేశించె
నానలరుతద్దేవీశరీరంబు బిగియారం గౌఁగిలించి తత్పులకాతిరేకంబునమకరధ్వ
జానలదగ్ధశేషం బయిననా దేహంబును శీతలంబుఁ గావించుకొనియెద. వెండి
యుఁ బరవతి యయ్యు స్వేచ్ఛాప్రవృత్తి గలదానియట్లు ప్రయత్నరహిత
యట్లు నభినందించుదానిపోల్కి, నపసరిల్లునది యయ్యు నాత్మసమర్పణంబుఁ
గావించుదానిమాడ్కి సంకుచితసర్వాంగి యయ్యు నుపదర్శితభావయు నయి
యొప్పునాదేవి కాదంబరితోడ సర్వజనసులభం బయ్యు యోగ్యకగమ్యంబును,
స్పర్శవిషయం బయ్యు హృదయగ్రాహియు, మోహనం బయ్యు సమస్తేంద్రియ
ప్రసాదనంబును మదనోద్దీపనం బయ్యుఁ దన్నివృత్తికరంబును, సముత్పాదితా
ఖిలాంగస్వేదం బయ్యు నత్యాహ్లాదకరంబును, సముపపాదితోచ్ఛ్వాసశ్రమ
స్వేదం బయ్యు సశీత్కారపులకజనకంబును, ననుభూయమానం బయ్యు నుపజ

నితాంతానుభూయమానవాంఛంబును, బహువారానుభూత మయ్యు నపునరు క్తంబును, నతిస్పష్టం బయ్యు ననిర్దేశ్యస్వరూపంబును, నచింత్యంబును నసమానసంగంబును, నతులస్పర్శంబును ననాఖ్యేయప్రతీకారంబును, బరమధ్యానసమాస్సాధిగమంబును నగుసురతాఖ్యసుఖాంతరంబు ననుభవించుచు నొకక్షణంబేని పెడఁబాయక తద్దేవితోడం గూడి తత్తద్రమ్యప్రదేశంబుల విహరించుచు స్వభావరమ్యం బయిన యీయారామవనంబును రమణీయతమంబుఁ గావించెదను. ఇట్లుండి విశ్రంభంబు గలిగినపదంపడి దేవినిఁ బ్రార్థించి వైశంపాయనునకు మదలేఖతోడిసంబంధంబు గావించెదను అనునివియాదిగాఁ గలుగుమనోరథపరంపరాసహస్రంబుల మనంబునఁ దలంచుచు నాఁకలి దప్పుల నెఱుంగక యాయాసంబు గణింపక శ్రమంబు సరకుగొనక ప్రజాగరవ్యథను నెంచక రాత్రియుం బవలును నిరంతరగప్రయాణంబు గావించు చుండె నంత. 281

వర్షర్తువర్ణనము

సీ. కాలాహిశ్రోవకుఁ ♦ గాళరాత్రి రవికిఁ బ్రబలపంకము తపో♦భాగ్యమునకు
ధూమోద్గమము నభ్ర♦భూతధ్వజస్ఫూర్జితములకు రాహువు సు♦ధాకరునకు
మదసమావేశ బు♦మారదంతికిఁ గడు మదనాంధతమసంబు ♦ విరహిణులకు
గాలాయసార్గళ ♦ఘనవండమఁ దిగంతదంతావళవ్యూహ♦దళములకు

తే. హాయచయములకు దుర్భేద్య♦మైనపాద
శృంఖలము నధ్వగులకాలి♦శృంఖలంబు
నయిన వర్షర్తు వరుదెంచె ♦ నర్ధమార్గ
మందె గతిరోధకం బయి ♦ యతని కపుడు. 282

మ. అవిలంఘ్యాటవి ప్రోషితాళికి మహా♦యఃపంజరం బెన్న జీ
వవితానంబున కెల్లఁ బాశ మభిక♦వ్రాతైణసంఘూనకున్
రవితేందిందిరనీలనీరదచయా♦క్రాంతోరుఘోరంబు శ్రో
త్రవిదారిస్తనితస్వనంబు నగుచున్ ♦ దద్వర్షకాలంబు దాన్. 283

క. అరిగతి విద్యుద్గుణమును, గరము సమాకర్షితంబుఁ ♦ గావించి పురం
దరధనువు మండలితమై, పరగఁగ శరవర్షములను ♦ బరపె నతిముతిన్. 284

క. మును చన కుండఁగ మార్గం, బును నాఁగుచు నంధకార♦మును నొనరుచుచున్
గను లంధంబులు సేయుచుఁ, జనకుండఁగ నాతుగతిని ♦ సల్పెను నద్దై. 285

సీ. చనెఁ దొల్త నగరి తత్♦శాన్వంతంబ దేడకో యాపలఁ జనియెను♦హంసచయము
పొలసెఁదచ్ఛ్వసితగం♦ధలవాయువులె మున్ను పొలసెఁగాదంబకా♦నిలములవల

నీలోత్పలము లనఁ ♦ జాలుతదక్షుల జాఱెఁ దొల్తను నీరు ♦ చదల నవల
నలమెఁ దన్మానస♦హారకమూర్ఛలె యఖిలదిక్కులఁ దొల్త ♦ నభ్రము లటఁ

తే. దొలుత నుత్కలికోద్వేగ♦కలిత మగుచు
నాకులంబయ్యె నాతని♦స్వాంత; మవల
నాకులము లయ్యె నదు లెల్ల ♦ నవనిలోన
నధిపకులచంద్ర! తజ్జల♦దాగమమున.

వ. మఱియు నందు.

చ. పొదలెను దుస్తరంబు లయి ♦ భూరిధునీలహరీచయంబులున్
మదనునుమాదముల్; మునిఁగె♦మంజులవర్ష జలాకులంబులౌ
సరములతోయజాతములు ♦ సాగసగంధిసమాగమాశయున్;
హృదయముఁ గందళంబులును ♦ నెన్నఁగ భేదిలె నొక్కసారిగన్.

చ. జలదమరుద్ధతంబు లగు♦చాపకదంబకకుట్మలంబులున్
బులకితదేహముల్ వడఁకెఁ ♦ బొల్పుగ నొక్కట; నేత్రయుగ్మముల్
జలవతనశ్లథంబు లగు♦సారశిలీంధ్రములున్ సమంబుగాఁ
జెలఁగెను నట్టినాచు భువిఁ ♦ జెన్నగునాజలదాగమంబునన్.

తే. పడెను బ్రాణము లుత్కల♦వారిపాత్య
మానమూలంబు లగునదీ♦మహితతటులు;
సురభిళము లైనమాలతీ♦సుమకలికలు
నలరె నుత్కలికాకోటు ♦ లవని నెచట.

సీ. అతిగురునిర్ఘాత♦వితతితోడన భంగమందె మనోరథ♦బృందములును
దీర్ఘాగ్ర కేతకీ♦దివ్యసూచులతోడఁ దెగెను మర్మము లెల్లఁ ♦ దీవ్రముగను
నుచ్ఛిఖశిఖులతో ♦ నుజ్జ్వలగాత్రముల్ దగ్ధంబు లయ్యెను ♦ దారుణముగ
నంధకారితహరి♦దంతాభ్రతమముతో గాఢమై మోహాంధ♦కార మడరె

తే. ధిక్కృతధ్వాంతచంచలా♦తేజములును
గాఢతాపంబు విరివిని ♦ గాంచె నొకట
నవని జనులకు నాజల♦దాగమమునఁ
బిచ్చలించెను మదనుండు ♦ విచ్చలవిడి.

వ. మఱియు నాకసంబున ధరాపీఠబంధంబు గ్రక్కదల నొక్కపెట్టున గంభీ
బుగ గర్జిల్లునవమేఘంబులచేతను నంతరాళంబున సాంద్రజలధారాపాతఁ
నకుం జంచుపుటం దెఱచి యఱచు చున్నచాతకంబులచేతను, నవనిమూ

బున నుద్దామమహారావంబులఁ గావించు భేకవారంబులచేతను, దిక్కుల ననారత ధారాజలఝాంకరణంబుల శకలంబులఁ గావించుజలదానిలంబులచేతను, వర ణ్యంబుల నున్ముక్తకంఠంబులై కలకేకాకోలాహలంబులు సల్పు మదకలంబు లై ననీలకంఠంబులచేతను, బర్వతంబుల విషమశిఖరోపలంబులం బడి కలకల ముఖరంబు లయి జాలువాఱునిర్ఝరంబులచేతను, నదులయందునుల్లోలకల్లోల మాలాస్ఫాలనంబున విషమనిర్ఘోషఝాంకరణంబుఁ గావించుజలప్రవాహంబుల చేతను, నెల్లయెడల నతివితతంబై గిరిదరులఁ బ్రతిహతంబయి గిరుల నత్యుగ్రం బయి పర్వతతటంబుల నతిస్పష్టం బయి పచ్చికబయిళ్ల నతికోమలం బయి చెక్కు ళుల నభిరామం బయి వృక్షంబుల నతిసాంద్రం బయి తృణోపలంబుల నతి కృశం బయి తాళవనంబుల నత్యుల్బణం బయి రాళ్లు పడునట్లు వినంబడుచు నతిమధురం బై యొప్పునజ్జలధరపాతరవంబుచే నత్యుత్కంఠితుం డై యాచం ద్రాపీడుండు వైశంపాయనానుస్మరణంబునను గాదంబరీసమాగమానుధ్యానం బునను రాత్రిని నహంబునను, బల్లియను, నరణ్యంబునను లోపల వెలుపలను ననంబున నుపవనంబునను మార్గంబున నొండె నడచుచు నొండె నిలిచియు నొండె నెట్లును నెందును విశ్రాంతిఁ గొనక నిరంతరప్రయాణం బొనర్చు చుండె. 292

తే. బూది నొనరింపనే గడుఁ ♦ బూనినట్టి
జలదసమయేంధనం బైన ♦ శంబరారి
వీతిహోత్రుండు భిదురాగ్ని♦విధిని నైఁప
రామిఁ గనకయు విశ్రాంతి ♦ రాజసుతుఁడు. 293

ఆ. ధీరభావుఁ డయ్యు ♦ దిగనాడె భావంబుఁ, భూతలంబు నెల్ల ♦ బ్రుంగఁ జేయు
సలిలధారలును న♦జస్రపాతములను, శోషిలంగఁ జేసె ♦ స్రుక్క నతని. 294

తే. దిక్కు లెల్లను వెల్లనై ♦ తేజరిల్ల
నలువఁ జాలినహ్రాదినీ♦జాలములును
జీవలోకంబు నలరుచు ♦ జీవదములు
నతని మూర్ఛాంధకారంబు♦నందుఁ ద్రోసె. 295

చ. జలధరమారుతంబులును ♦ త్మాధవపుత్రునిఁ గాల్పఁ సాగెఁ బో
జలధరమేదురంబు లగు♦సద్ఘనజాలములుం గృశాంగునిన్
నలిపెను; శాద్వలంబులును ♦ జయ్యనఁ బాటలితంబులై గడున్
నలిపెడు నింద్రగోపములు ♦ నల్పెను నాతనిఁ బాండురాత్మకున్. 296

తే. కుసుమధవళంబు లయినట్టి♦కుటజములును, రాగపరవశుఁ జేసె నా♦రాజసుతుని
సకలజీవనహేతు వా♦జలదవేళ, ప్రాణసందేహడోలిక♦పైనఁ బెట్టె. 297

వ. అయిన నాచంద్రాపీడుండు. 298

సీ. ఉత్కూలగాములై♦యొప్పు నవిధివిలసితనదీనిర్ఝర♦శ్రేణి నీఁది
సంతతవర్షాంబు♦జనితమూర్ఛాంధతఁ బంకపటలమందుఁ♦బతితుఁ డగుచుఁ
జలధరాచ్ఛాదిత♦సరణి నయనమందు స్ఖలితపదుం డయి♦జాఱిపడుచుఁ
గాదంబరీప్రాప్తి♦కై చేయుచింతలఁ గడిమిపుప్పొడివానఁ♦గన్నుఁ గవను

తే. మూయు చనుబంధిగతివిఘ్న♦ములను జలద
గర్జనంబుల మూర్ఛను♦గనుచు వడిని
దాఁటఁగా రానియుత్కంఠి♦తములఁ బెక్కు
వాఁగులను దాఁటు చేగ నా♦భవ్యమూర్తి. 299

వ. మఱియు. 300

తే. జలధరంబులు వృద్ధిని♦సలుప మదిర
తనయపైఁ గలకూర్మియుఁ♦దదుపపూర
రయము కైదండ యొసఁగ నా♦రాజసుతుఁడు
జీవితాశను దాల్చుచుఁ♦జెలఁగు చెట్టొ. 301

సీ. బెదరించుచున్నను♦వివిధశంపాలత లాఁగుచున్నను గడు♦నభ్రచయము
భయపెట్టుచున్నను♦బహుళగర్జనములు శతశకలంబులు♦సల్పుచున్న
నిస్త్రింశవృత్తులై♦నెగడుధారాసారములు; దిక్కు లెల్లను♦మూసికొనుచు
జలధరజాలంబు♦సల్పుచున్నను శీఘ్రగతిరోధము తనకు♦గాఢముగను

తే. సకలభువనంబులును దమ♦స్థానములను
నిగడితంబులు నా నెందు♦నివ్వటిలక
యుండు నావానకారున♦నుడుగ కెందు
సలుపక విలంబన మతండు♦చనుచు నుండె. 302

తే. అరయ మదిరాతనూజాస♦మాగమాశ
యంతరాయంబులను నెల్ల♦నవలఁ ద్రోసి
గమనరోధంబు కాకుండఁ♦గడురయమ్ము
గదురఁ గొనిపోవుచుండె నా♦త్మోపసుతుని. 303

సీ. అంబుధారాహతి♦నర్ధమీలితనయనంబులై వలితాన♦నంబు లొంచు
సారసారెకు స్వేద♦సంసిక్తసంపిండకేసరాగ్రంబులు♦భాసిలంగ

బురద గిట్టలు పూడి ♦ పోవంగ నిమ్నోన్నతస్థలంబుల గతి ♦ తప్పి చనఁగ
శీర్యమాణం బౌచుఁ ♦ జెలఁగఁ బల్యాణంబుజవబలోత్సాహముల్ ♦ సన్నగిలఁగ

తే. మీఁదమీఁదను నదులను ♦ నీఁదియీఁది
యార్ద్రపృష్ఠంబు లయి గడు ♦ నలసగతిని
నశ్వసైన్యంబు లెల్లఁ ద ♦ న్ననుగమింపఁ
బయన మొనరించు చుండెను ♦ బాయ కతఁడు. 304

తే. ప్రాణధారణమున కెంత ♦ వలయు నంత
యశనమును గొంచు నభ్యర్థు ♦ లైనరాజ
తనయు లెంత వచించినఁ ♦ గొనక మేనఁ
జక్క దిద్దుకొనక ప్రొద్దు ♦ జాఱువఱకు. 305

చ. పయనము సల్పుచుండ నిటు ♦ పార్థివసూతి త్రిభాగశేష మౌ
నయనమునందె కాంచె నెదు ♦ రై చనుదెంచెడు మేఘనాదుఁ; గాం
చి యచటనుండియే ప్రణతిఁ ♦ జేసెను నాతనితోడ నిట్లనెన్
బ్రియసఖపత్రలేఖకుఁ బ్ర ♦ వృత్తిని నావలఁ బృచ్ఛ చేసెదన్. 306

క. చెలివై శంపాయనువా, ర్తల నడిగెనొ దొలుత; నతని ♦ దర్శించితివే
యలయచ్ఛోదసరస్తటిఁ, గలఁడే యట్లుండ నేమి ♦ కారణ మంచున్. 307

తే. అడిగినాఁడవో యడిగిన ♦ నాతఁ డేమి
యనియె మనలను నెడఁబాసి ♦ యట్టులుంట
కేను వగచునో మనలను ♦ నెంచు నొక్కొ
యడిగెనా నాదువార్తల ♦ నతఁడు చెపుమ. 308

చ. కనితివొ వానియాశయము ♦ గల్గెనొ వానికి నీకు ముచ్చటల్
పనిపెనె తల్లిదండ్రులకుఁ ♦ బల్కు మటంచును నేమి యేని తా
ననితివొ రమ్ము పోద మని ♦ యాతనితోడ వచించినాఁడ వే
మన మిట కేగుదెంచుటను ♦ మానునొకో మఱి వానిమాధ్యమున్. 309

చ. చనునొకొ పాసి యచ్చటు నొ ♦ సంగునొ దర్శన మాలకించునో
మనపలుకుల్ వచించునొకొ ♦ మంతువు నే మయినన్ దినంబుఁ బు
చ్చును నెటు కన్నులం దెఱచి ♦ చూచునొ వచ్చునొ నాదువెంట ర
మ్మన నురకుండు నాతఁ డెటు ♦ లాత్మవినోదము సల్పుఁ జెప్పుమా. 310

వ. అనుటయు మేఘనాదుం డిట్లనియె. 311

చ. అనుపద మేను వచ్చెదను ♦ నాశ్వచయంబులతోడ మిత్రునిన్
గని యని దేవ! పీడ్కొనితి ♦ నన్నటు లాసరసీపథంబునన్
వినఁబడ దావయస్యనిప్ర♦వృత్తియు నెందును మీరు తామసం
బౌనరుప వర్ష కాలము మ♦హోద్ధతి వచ్చుటఁ గాంచి యుత్తటిన్. 812

క. తారాపీడనరేంద్రుఁడు, నారాణివిలాసవతియు ♦ నాశుకనాసుం
డారయ రానీరు బలా, త్కార మ్మొనరించి నిన్నుఁ ♦ దగ దీచోటన్. 813

క. నిలువఁగ నొక్కఁడ వీవని, తలఁచి మదిన్ బత్రలేఖ ♦ తత్కేయూరుం
డలనాఁడె మరలిపో మ్మా,స్థలినుండియె మేము వచ్చి ♦ తారొక్కొందు మటన్.

క. అని నను బంపిరి యచ్ఛో,దనళినికడ నన్ను వీడి ♦ తా మొక్కరు వే
చని రని వచించి యూరక,కనుచుండెను; నతనిఁ గాంచి ♦ తాపసుతుఁడు దాన్.

క. అనియెను నిట్లని నేఁడే, చనుదెంచునొ పత్రలేఖ ♦ చను దేరదొ యే
మని యెద పీవన; మార్గం,బున విఘ్నము లేమి రాక ♦ పోయిన దేవా!. 816

చ. చనుదెంచు నవశ్యము లే, దనుమాన మటంచుఁ దలఁతు ♦ ననుచు నతఁడు దా
ననుటయు, మదిరాతనయను, ఘనవేళావర్ధితసుమ♦కాండోదధిలోన్. 817

క. తనయట్లు వడినదానిఁగ, మనమునఁ దమిఁ దలఁచి తలఁచి♦మఱిమఱి యెదలో
ఘనమై యెరిసెడుమారద,హనుబారికి నగ్గ మగుచు ♦ నడలు నతనికిన్. 818

సీ. అభ్రముల్ యమభటు ♦ లయ్యెఁ దటిత్తులు పంచబాణానల♦జ్వాల లయ్యె
నామంద్రగర్జిత ♦ మంబుజాంబకధనుర్జ్యావల్లరీశబ్ద♦జాల మయ్యె
నంబుధారలు మరు♦నస్త్రంబులయ్యెను గేకికేకలు యమము♦కేక లయ్యె
ఖద్యోతములు లయ♦కాలవహ్నికణంబు లశనులు యమపట♦హంబు లయ్యెఁ

తే. శైతకామోదనము విష♦కలితగంధ
మయ్యె నళివలయంబులు ♦ నయ్యెఁ గాల
పాశములు నావగలు సర్వ♦నాశకార
కప్రవాహంబు లయ్యె నా♦కాలమందు. 819

వ. మఱియు. 820

ఆ. కాలరాత్రు లయ్యె ♦ నీలనీరదదుర్ది,నములు; శమన కేత♦నంబు లయ్యెఁ
బెద్దకొక్కెరగములు;♦పితృపతిహాసంబు,లయ్యెఁ గుటజతరువు ♦ లతని కపుడు. 821

సీ. శారీరసత్వంబు ♦ సాధ్వసంబుగ మాఱె మాఱె బలము కృశి♦మంబుగాఁగఁ
గాంతి వైవర్ణ్యంబు♦గాఁగ మాఱెను మతి యుపకార మిత్తె మో♦హంబుగాఁగ

నశ్రుపూర్ణములయ్యె • నతులు ధైర్యంబు గాఢవిషాదమై • కానుపించ
మానరూపముఁ దాల్చె • మంజులాలాపంబు లంగంబు లసహాత•నందె మిగులఁ

తే. కరణము లపాటవంబులై • పరిణమించెఁ
బలుకు లేటికి నరతిరూ•పంబుఁ జెందె
సకలవిషయంబు లావాన•సమయమందు
నకట తత్ప్రభావంబు నే•మందు నార. 322

వ. ఇట్లు సంకల్పలిఖితంబై నిర్విశేషవృత్తి యగునా కాదంబరిశరీరంబుతోడఁ గంఠగతం బయి స్వల్పావశేషం బగుజీవితంబు నెట్టకేలకుఁ జిక్కఁబట్టుచు ధారాధరక్లిన్నంబు లగుతరుతలంబులును, నాప్లావితంబు లగుప్రాంతహరితశాద్వలంబులును, సంతతతీరవారిప్రవేశంబుచేఁ గలుషితంబు లగుప్రాంతభాగంబులును, నవశీర్యమాణంబులును నున్నాళంబులు నగుకైరవపత్త్రవనంబులును, నాభుగ్నంబులగుకమలఖండంబులును, నుత్ప్లవమానంబు లగుశుష్కకేసరదళనళినంబులును, శిథిలితంబు లైనకల్హారకువలయంబులును, నుద్భ్రాంతములై పరిభ్రమించుమధులిణ్మండలంబులును, నుడ్డీనంబు లగురాజహంసమిథునసార్థంబులును గలిగి, యనవస్థానసారసరసితంబుల నతిదీనంబై, యుచ్చకితంబులై యవశిష్టదళతలంబుల డాఁగుచున్నచక్రవాకంబులచే నతిరమ్యంబై, పరిత్రస్తంబు లైనకాదంబకదంబకంబులకు నాశ్రయంబు లగునుపకూలనడ్వలప్రదేశంబులచే నతిమనోహరంబై, యుపాంతపాదపంబులపై నధిష్ఠించి యుత్కలవిరుతంబులఁ గావించుకలాపికలాపబకబలాకజాలకంబులచేఁ బ్రకాశితంబై, ప్రావృట్పరిపీతం బయి యపూర్వంబునా నేత్రోత్సవప్రదంబు గాక హృదయాహ్లాదం బొదవింపక మనఃప్రమోదంబు సంపాదింపక ద్విగుణీకృతవ్యథం గల్పించుచున్నయచ్ఛోదసరోవరంబుఁ జేరి యశ్వవారంబుం గాంచి యాచంద్రాపీడుండు వారల కిట్లనియె. 323

ఉ. మనలను గాంచి సిగ్గుఁ గని • మానము దాఁపఁగ నేఁడ కేనియున్
జను నొకవేళ మీరు గడు • జాగరితుల్ నలుదిక్కు లుండుఁడీ
యని వచియించి యెక్కెయొ హా•యుంబును వృక్షతలాంతరంబులన్
ఘనలతికావనంబులను • గహ్వరశిలాతలమండపంబులన్. 324

చ. కలయఁ బరిభ్రమించి వెత•కంగఁ దొడంగెను ఖిన్నుఁ డయ్యెఁ దా
నలయువరాజు వానియడ•యాలము వాఁడును సుంత యెందునున్
గలయఁ బరిభ్రమించినను • గన్పడఁ డయ్యెను నేమి చేసినన్
దలఁచె మనంబునం దిటు క•నంబడ కున్నకొలంది ఖిన్నుఁడై. 325

ఉ. నే నిట వచ్చుటం దెలిసి ♦ నిక్క మితం డలపత్రలేఖచేఁ
బూనికఁ దొల్తనే యెటకొ ♦ పోయెను నుండినఁ జన్న లేవియున్
గానఁగ రావె యెంత కని♦నన్ మన మేగఁగ రానిచోటి కెం
దేనియుఁ బోయెఁ గానఁబడఁ ♦ డేడను గష్ట మిదొండు కల్గెఁ బో. 326

చ. పదములు రావ యీస్థలముఁ ♦ బాసి చనంగను మిత్రుఁ జూడకే
మదిరతనూజదర్శనమె ♦ మాన నగునూఁతగ నిల్చి యున్న యీ
మదనశరాహతంబు లగు♦నా మకజీవితముల్ క్షణంబునన్
వదలి చనంగ నేర వల♦వారిజనేత్రఁ గృశించి యుండుటన్. 327

క. కానను వైశంపాయను, గానను గంధర్వరాజ♦కన్యను దేవిన్
గానఁగ సర్వవిధంబుల, చే నష్టుఁడ నైతి నింకఁ ♦ జెప్పఁగ నేలా. 328

క. అని నిశ్చయకుఁ డయినను, మనమునఁ బ్రత్యాశ మిగుల ♦ మల్లడి గొలుపన్
గని యుండు నీయుదంత,మ్ము నలమహాశ్వేత యు నటఁ ♦ బోవ సకలమున్.

క. తెలియు నటంచును మనమునఁ, గలఁచి తదాశ్రమము పొంతఁ♦దత్సైన్యంబున్
నిలిపి భుజగనిర్మోకము,వలె లఘువుల నభరహిత♦వరకౌముదులన్. 330

తే. అతిమనోహరంబులయిన ♦ యంశుకములఁ
దాల్చి పైనికవేషంబు ♦ తలఁగి యొకఁడె
యెక్కి యింద్రాయుధమ్మును ♦ నేగె నట్టి
యులమహాశ్వేత యుండెడు♦నాశ్రమంబు 331

తే. వగి హయమును దిగి యాతఁ ♦ డేగలోని
కామహాశ్వేతఁ గాంచెడు♦మార్గమునను
వెనుక నాకృష్టమై తన♦వెంట రాఁగ
నాతురంగమపరివార ♦ మఖిల మటకు. 332

చ. చని గుహాద్వారమందె కనెఁ ♦ జారుశిలాస్థలి నమ్రవక్త్రయై
యనవరతాశ్రువర్షమున ♦ నాకలనంబు నొనర్చుచున్ గడున్
దనువు వడంక శోకమును ♦ దాళఁగ లేక ప్రకంపనాహతిన్
గనినలతంబలెన్ దరలి♦కాధృతయై చనుహంసపుత్రికన్. 333

క. కనుఁగొని దానిని దాదృశ,మనమునఁ జింతించె నిట్లు ♦ మదిరాసుతకున్
బొనరెనొ కష్టం బేమేన్,గనియును నను నిట్టిదశను ♦ గాంచును నిపుడున్.

క. అని శంకాకులహృదయతఁ, జనె నొద్దకు నసువు లెగిరి ♦ చనఁ దొట్రిలుచున్
గనుచును మూర్ఛను బదపద,మునఁ బడి లేచుచును బోయి ♦ మొగి నాశిలపై.

తే. కూరుచుండెను నొక్కప్రక్క ♦ నూరుచున్న
బాష్పపూరంబుఁ దుడుచుచు ♦ వగవు మీఱ
దీనవదనాబ్జుఁ డయి రాజ♦సూనుఁ డడిగె
నేమి దంపుసు దరళిక ♦ నీరెలుఁగున.　　　　336

తే. అదియుఁ గనెఁ దాదృశావస్థ ♦ నందియున్న
యామహాశ్వేతముఖమును; ♦ నంత నామె
యనుపసంహృతమన్యుర♦యాతిరేక
యగుచు నిట్లని గాద్గద్య ♦ మణఁప గళము.　　　　337

మాలిని. భసితలసితదేహా! ♦ భంజితారిప్రవేహా!
గ్రసితసుమశరోహా! ♦ కాళికాశ్లిష్టబాహా!
విమమనయనభాసా! ♦ విశ్రుతాద్రీంద్రవాసా!
వసనితసకలాశా! ♦ వందితేంద్రాసురేశా!.　　　　338

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాశారవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైనశృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందు నుత్తరభాగంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీః.

శ్రీరామ స్సహాయోఽస్తు.

శ్రీమేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగార కాదంబరి

## ఉత్తర భాగము.

### తృతీయాశ్వాసము.



క. శ్రీగురుచిన్మయరూపా!
యోగానందైకరూప! ♦ సుందరగుణరూపా!
భోగాస్పద! నీరూపా!
వాగాదిసమస్తకరణ ♦ వర్జితరూపా!. 1

వ. దేవా! దయాయత్తమతి నవధరింపుము. అవ్వలికథావృత్తాంతంబు వినుపింతు. అట్లు చంద్రాపీడుం డడుగుటయు నామహాశ్వేత యిట్లనియె. 2

చంద్రాపీడునకు మహాశ్వేత తనదుఃఖకారణమును జెప్పుట.

తే. ఓమహాభాగ! శోచ్య యీ♦యువిద యేమి
పలుకు దుఃఖాభిఘాతైక♦పరమకఠిన
హృదయ వినిపించె నిజదుఃఖ ♦ మెవతె దుఃఖ
ములను విన నసద్వ్యాలకును ♦ మొనసి తొల్లి. 3

తే. దానవే నేను ప్రాణముల్ ♦ దాల్ప నాశ
పడినమందభాగ్యను మహా♦భాగ! పాప
మతిని నిర్లజ్జ నిర్ఘృణ♦మతిని వినుతు
దుశ్శ్రవణ మైననీఘోర♦దుఃఖవార్త. 4

తే. వినుము కేయూరకుఁడు చెప్పు ♦ వింటి నేను
నీవు చనుదెంతు వనువార్త ♦ నిక్కముగను

నగుచును విదీర్ణహృదయను ♦ నప్పుడె మదిని
నిట్టు లనుకొంటి విబుధజ♦నేడ్య చరిత!. 5

సీ. గంధర్వపతికోర్కెఁ ♦ గావింపఁ బూర్ణంబు గావింప మదిరసు♦కాంక్షితంబు
నాత్మాభిలాషంబు♦నాచరింపను మఱి మందిరాభ్యాగత ♦ మనుజనాథ
సుతుఁడు చంద్రాపీడ♦సుమతి కిష్టంబును సమకూర్పఁ గా నింక ♦ సలుప నేమి
ప్రియసమాగమహృష్ట♦ప్రియసఖిఁ గాదంబరిని గానఁ జాలితి ♦ మనఁగ నైతి
తే. నే మొనర్చితి ననుచు న ♦ నేకసుగుణ
కలితవై రాగ్యనై కడు♦గాఢబంధ
నములఁ గాదంబరీస్నేహ♦నద్ధపాశ
ములను దెగఁగోసి తపమూన ♦ మొనసి మరల. 6

క. చనుదెంచితి నిచ్చటి కేఁ,గనితిని నీవంటివాని ♦ గతమానసునిన్
దనుశూన్యుని నుత్తరలా,నను బ్రాహ్మణయువను నొకని ♦ నరవరతనయా!. 7

క. కను చిట్టటు చంచలదృష్టిని నష్టంబైన నేదొ ♦ క్షితి వెతకెడువాఁ
డునుబోలె నతఁడు ననుఁ గని, చనుదెంచె సమీపమునకుఁ ♦ జయ్యన నంతన్.

చ. కనుఁగొన నెన్నఁ డాతనిని ♦ గాఁడును సంస్తుతుఁ డాతఁ డెన్నఁడున్
గనఁడు మదీయసత్కృతిని ♦ గాఁడు వయస్యుఁడు ప్రేమబంధుఁడై
నను గుఱుతించి నాతఁడుగ ♦ నర్మిలి సంస్తుతు నట్లు గాఢమౌ
ప్రణయము గల్గువానిగతి ♦ బాంధవునట్లు వయస్యు పోలికన్. 9

ఉ. ప్రేముడి శూన్యుఁడైన నదొ ♦ వెల్లు స్మరించెడువానిపోల్కి నా
క్రామితదుఃఖుఁడైనను సు♦ఖంబుగఁ గ్రాలెడువాఁడునుం బలెన్
వేమఱు వేఁడువానిగతి ♦ వేసరి మౌనముఁ దాల్చియున్న నాం
డేమియు నడ్గకున్నఁ దను♦నేచునవస్థను దెల్పువాఁడు నాన్. 10

వ. మఱియు. 11

సీ. పొగడువాఁడునుబోలెఁ♦బొగులువాఁడునుబోలె నలరువాఁడునుబోలె♦నడలునట్లు
వెఱఁగన్నవాఁడునా ♦ వెసఁగన్నవాఁడునా ధిక్కృతుండును నాఁగ♦దీను నట్లు
ముషితుం డనంగను ♦ దృషితుం డనంగను గాంక్షించునననఁగన♦ఖచితుఁడనఁగ
స్మరియించువాఁడు నా ♦ మఱచినదానిని మఱిమఱి యఱిమఱి వఱలునట్లు
తే. నిశ్చల స్తబ్ధపక్షుఁడై ♦ నిలిచి బాష్ప,వారిపూరార్ద్రమై కెంపు♦పాటుఁ దలఁగి
యాకులిత తారకంబయి♦యంటి చెవుల,వికసితం బన నొప్పెడు♦ప్రకటదృష్టి

తే. కాంచి చిరకాల మట్టె నన్ ♦ గడఁక లోనఁ
జొచ్చునో యనఁ ద్రాగు నా ♦ మచ్చి కడర
మత్తుపోలిక నావిష్టు♦మాడ్కి నీడ్చు
నన వియుక్తు, నాఁగనుదు ♦ ననియె నిట్లు 13

ఉ. అకృతికిన్ వయస్సునకు ♦ నట్లు భవంబునకున్ సమంబుగా
లోకమునందు నద్వ్రలును ♦ లోలుపులై యొనరించి నిందలన్
జేకొన రీవు చాన! యటు ♦ సేయక యెంతయు వామశీలవై
యాకరణిన్ విధాతగతి ♦ నేల యొనర్తు వనర్హకృత్యమున్. 14

చ. అమృదితమాలతీసుమము♦నట్టుల కోమలమైనయాకరీ
రమునఁ గళికదేశపరి♦రంభసుఖార్హము హారముం బలెన్
గమలముఖీ! యయోగ్య మగు♦గాఢతపశ్చరణంబునన్ వృథా
శమలఁగఁ జేసె దీ వకట ♦ కార్యము గా దిది నీకుఁ బైదలీ!. 15

ఉ. రూపవయోనురూప మగు♦రూఢిరసాశ్రయసత్ఫలంబుతోన్
రూపసి! కూర్చు వేల సుమ♦నోహరవల్లరిఁబోలె నీతనున్;
రూపగుణాదిహీనమయి ♦ రోఁతగఁ బుట్టినప్రాణికోటికిన్
బ్రాపితజీవలోకసుఖ♦వారముఁ గాంచినఁ గాని యాజనిన్. 16

క. పరలోకసుఖప్రదమై, పరగుతపశ్చరణదుఃఖ♦భార మలర దీ
ధరణిని; రమ్యాకృతు లగు,నరులకు వచియింప నేల ♦ నళినదళాక్షీ. 17

తే. అరయఁగ స్వభావసరసమై ♦ యలరు తావ
కీనదేహంబునకుఁ దపః♦క్లేశ మిద్ది
కమలినికి హిమపాతంబు ♦ కరణిఁ దగదు
వెతలఁ గుదిపించు నిన్ను నో ♦ చెలఁది! కంటె. 18

తే. జీవలోకసుఖంబుల♦చెంతఁ గనక,నిన్నుఁ బోలినచెలఁదియు ♦ నిట్టి తపము
చేసి తను గాసిలంగను ♦ జేసె నేని,వ్యర్థ మామనిరాక యిం♦కవనియందు. 19

ఉ. ఎక్కిడినట్టిచాపమును ♦ నిత్యుశరాసనుఁ డేల కొల్పఁగా
నక్కముదాప్తుఁ డేల యుద♦యంబు గనన్ విఫలంబు లౌఁ జుమీ
యిక్కమలాకరంబులును ♦ నీకుముదంబులు నీసరోజముల్
నిక్కము వ్యర్థముల్ తలఁప ♦ నిష్ఫలముల్ ప్రమదావనంబులున్. 20

క. జలదారంభాడంబరములు మలయానిలము వ్యర్థ♦ములు కేళిసరి
త్పులినంబులతోఁ బని యే, మల వెన్నెలతోడ నేమి ♦ యగుఁ గార్య మిఁకన్.

క. అనఁ, బుండరీకవార్తను,వినినప్పటినుండి నేను ♦ విడి కౌతుకమున్
మనుచుండుదాన నావిధ, మనునాతని నేఁటి కిట్టు ♦ లడిగెద ననుచున్. 21

క. ఎవ్వఁడ వీ విచ్చోటికి, నెవ్వఁడువున వచ్చినాఁడ ♦ వేమి యటంచున్
నెవ్వగ నే నడుగకయే, పువ్వులఁ గోయంగ నొండు ♦ భూమికిఁ జనితిన్. 22

క. జని దేవతార్చనమునకు, ననువగుపువ్వులను గోయు ♦ చలతరళికతో
ననితిని నిట్లని తరళిక! కను మీతఁ డెవండో ద్విజుఁడు ♦ గాఁ గానఁబడున్. 23

క. ఈతనిచూపుల మాటల,నీతనిచేష్టలను వీని ♦ యింగితము సము
ద్యోతితమయ్యెను వేరని,యీతని రానీకు మరల ♦ నీచోటునకున్. 24

క. వల దన్న వచ్చెనేనియుఁ, గలుగు నవశ్యం బభద్ర ♦ కం బీతనికిన్
దలఁగ దని చెప్పు మంటిని,వల దన్నను మానఁడయ్యె ♦ వచ్చుట నటకున్.

ఆ. దుర్నివార్యుఁడైన ♦ తోయరుహాస్త్రుని,దోషములను వాని ♦ తోడఁ గూడఁ
గలుగవలసియుంటఁ ♦ గష్టంబు లతనికి,వదలఁడయ్యె నటకు ♦ వచ్చు టతఁడు.

చ. చన నిటు కొన్నినాళ్లు గడు ♦ సాంద్రతమంబగుయామినిన్ రమా
తనయసముజ్జ్వలాగ్నిని ని ♦ తాంతము గ్రక్కున నంగఁ జంద్రికా
ఘనఝరిచంద్రపాదములు ♦ గాఢముగాఁ గురియంగ నిద్రపో
వ నల మదీయదాసి మదిఁ ♦ బాయనిచింతను నొక్కనాఁడు నేన్. 27

ఉ. కూరుకు పట్ట కిం తవల ♦ కున్ జని యాశిలపై శరీరమున్
జేరిచి మందమందగతి ♦ శీతలగంధవహుండు వీచి క
హ్లారసుగంధ మెల్లెడల ♦ నాశలఁ జల్లుచు నుండఁ, జంద్రుఁడున్
సారసుధోరుకూర్చ లనఁ ♦ జాలు గభస్తుల దిఙ్ముఖంబులన్. 28

చ. సలుప వళక్షముల్, గనుచుఁ ♦ జంద్రుని వీఁడు సుధాభివర్షమున్
సలిపి జగానకున్ ముదము ♦ సల్పఁగఁ జాలుమయూఖపాళిచేఁ
ద్వాలుకునో మామకప్రియునిఁ ♦ దోరముగా ననునాళ పెంపున
న్దలఁచుచుఁ బుండరీకునిసు ♦ నామము సారెకు నెమ్మనంబునన్. 29

ఉ. ఎంతటిహీనపుణ్య నొకొ ♦ యేను గటా మదభాగ్యరేఖ నే
యంతటివానిపల్కు నిటు ♦ లాయె నబద్ధము దివ్యమూర్తియై
యెంతయు నాకసంబునకు ♦ నేఁ గనుచుండఁగఁ జన్న యాసుధీ
మంతుని పుణ్యపూరుషుని ♦ మంజులవాక్కు నబద్ధ మాయెఁ గా. 30

ఉ. ఏగతినేని జీవమును ♦ నేను భరింపఁగ జాతసత్కృపన్
వేగ తపస్వి నయ్యుఁ దమి ♦ వీడక ప్రాణములందు నున్న

న్నాగతి నూఱడించె నెవఁ ♦ డాతఁడు దగ్గన మీఁదు మళ్ళితా
నాగతి యేమి యయ్యె నని ♦ సర్ధిలి నాఁడయఁ దొట్టి కష్టుఁడో. 31

చ. అనఘుఁడు పుండరీకుఁడుగ♦తాసుఁడె కై కొనిపోఁబడెన్ దివం
బునకు గృహీతనాముఁడయి ♦ పొల్చెడునాతఁ డొనర్చు నేమిటన్
మనియును జచ్చినాఁడె యిఁక ♦ మాట లవేల కపింజలుండు తాఁ
బనుపఁడు నొక్క వార్త సిటఁ ♦ బాసి గతించెను నెన్ని నా ళ్లహా. 32

తే. అనుచు నివి యాదిగాఁ గల్గు♦నన్యములను
నాలముల జాలముల దుష్టు♦రాల నగుచుఁ
దలఁచుకొనుచు మనంబునఁ ♦ దలఁగి నిద్ర
మేలుకొనియుండ నంత నా♦జాలికుండు. 33

సీ. సంతతనిపతిత♦స్మరశరచయనిచితం బనఁ బులకిత♦తనువు దనరఁ
బ్రథమంబునసె మార♦భస్మితం డనఁ గైతకరజోవళిక్షిత♦గాత్రుఁ డగుచు
సర్వలోకాలంఘ్య♦శాసనుండు మరుండు తప్పక చావంగఁ ♦ దార్చినట్టి
శాసనవలయంబు♦చాడ్పున నొప్పెడుకుండలికమృణాళ♦మండనంబుఁ
తే. దాలిచి భుజాగ్రమునను బ♦దంబు లిడుచు,నల్లనల్లనఁ దారుచు ♦ నశ్రువారి
పూరమునను నాకయిజల♦పూరితాంజలిని సమర్పించునో యను♦లీల జెలఁగ.

వ. మఱియు. 35

ఉ. ఎక్కడి కేగువాఁడ విఁక ♦ నే నిదె చంపుదుఁ జూడు మంచుఁ ద
న్నుక్కు దలిర్పఁ దర్జితుని ♦ నూరక చేసెడు నా భయంబుచే
నెక్కుడుగాఁ జలించు నొక♦యింపగు కైతకగర్భసూచికన్
జక్కరవి ల్తునెచ్చెలిని♦శాకరుసత్కళఁ బోలు దానినిన్. 36

చ. చెవి ధరియించి తాన నను♦ జేకొన స్నానము చేసెనో యన
గ విరివిస్వేదవారిని న♦నారత మాప్లుత దేహుఁడై కదున్
గవియఁగఁ జన్నె రొయ్యల మదిఁ ♦ గానక నీ కని మాటిమాటికిన్
దవిలి నివార్యమాణుఁడో య♦నంగను నూరుల స్తంభనంబునన్. 37

ఉ. దూరమునుండి నన్ను బిగి♦తోరముగాఁగఁ గవుంగిలింపఁగాఁ
గూరినవట్టియాళి భుజ♦కోటులఁ జాఁచు చపారరాగకూ
పారము నుత్తరించు నన ♦ బాయనియుత్కలికాయుతోత్కరం
బారఁగ మున్ బ్రవృత్తముల ♦ నాయతనిశ్వసితానిలంబులన్. 38

క. ఆకృష్యమాణుఁడో యనఁ, బ్రాకటముగ సకలదిశలఁ ♦ బ్లావితములుగాఁ

చేకొని వెలుంగుజోత్స్నా,నీకంబుల నుహ్యమాన♦నిజదేహుండు నాఁ. 39

సీ. దైన్యంబుఁ గైకొని ♦ తలఁగి సత్వంబును ధైర్యంబు నవధీరి♦తంబు చేసి
సిగ్గు నావలఁ ద్రోసి ♦ చేకొని తరళతఁ బరలోకభయమును ♦ బాఱఁ దఱిమి
యధికతంబుగఁ జేసి♦యలఘార్తస్వ్యముఁను పీడియుక్తమయుక్తంబు♦నొసఁగు తెల్వి
నరయ భూతావిష్టు♦నట్టు లున్మత్తునియట్లు మత్తునియట్టు ♦ లలరుచుఁదమి

తే. నలరువిల్కానియాజ్ఞకు ♦ నగ్గ మగుచు
పీడి యాతుర్యమును గడు ♦ వాఁడియున్న
యాననముతోడ దవ్వుగ ♦ నరుగుదెంచు
చున్న వెన్నెలఁ గనఁబడు♦చున్నవాని. 40

క. కనుఁగొని తాదృశుఁ డగునా,తని చేసను నిచ్చలేని ♦ దానను నయ్యెఁ
ఘనతరభయమును గని నే,మనమున ననుకొంటి నిట్లు ♦ మనుజవరేణ్యా! 41

క. అరరే కష్టము వచ్చెను, నరయక యున్మాదమునను ♦ నరుదెంచి ననుఁ
గరమునఁ దాఁకిన నీతఁడు, మరణము మేలగును నాకు ♦ మందసుకృతకుఁ. 42

చ. కలుగును బుండరీకు వల♦కాంతునిదర్శన మంచు నాశతోఁ
దలఁగక యెన్నినాళ్లుగ నొ ♦ దాల్చితిఁ బ్రాణము దుఃఖభాగినై
తలఁపఁగ వ్యర్థమాయ నకట ♦ దగ్ధ్రతి తాఁకిన నీతఁ డంచు లోఁ
దలఁచుచు నున్న నన్నతఁడు ♦ దారసిలెఁ గడు దీనవక్త్రుఁడై. 43

వ. అట్లు తారసిలి నన్నుం గాంచి యాతం డిట్లనియె. 44

ఉ. చంపఁ గడంగినాఁ డితఁడు ♦ చంద్రుఁడు మారసహాయుఁడై కటా
చంపకగంధి! నీచరణ♦సారసముఁ శరణంబుఁ జొచ్చితిఁ
మంపవె దీను నార్తుని న♦నాథు నిరాశ్రయు బంధుహీను నఁ
ముంపకు మారమార్గణస♦ముద్రమునఁ ద్వదధీనజీవితుఁ. 45

చ. ప్రతి యొనరింప నక్షముఁడఁ ♦ బంకజలోచన! యుద్ధరింపుమా
క్షితి శరణాగతావనము ♦ సేయుట ధర్మము తాపసోత్తమ
ప్రతతికి నాత్మదానమునఁ ♦ బాలనసేయవ యేని నన్ను నో
యతివ! వధించు నీశశియ ♦ యంగజుఁ డింకిటఁ జెప్ప నేటికిఁ. 46

క. అనుటయు నే నామాటలు, విని చీయని శిరసునుండి ♦ వెలికి నరుగుదెం
చినజ్వాలగా దిపోలెను, ఘనతరరోషాగ్ని నతని ♦ గాల్చువిధమునఁ 47

క. కనదశ్రువహ్నికణములఁ, దనరెడుమాడ్కిఁ నను నతనిఁ ♦ జ్రింతు ననఁ
గనఁబడి కంపితసర్వాంగ, నగుచు నావిష్టమాడ్కిఁ ♦ గానక నను నేఁ. 48

క. అనితని క్రోధావేశం,బున దూషణపరముగ నిటు ♦ పొక్కుచుఁ బాపీ!
వను ని ట్లనుసీకు మస్తకమున వజ్రం బేల పడదొ ♦ మూర్ఖ! దురాత్మా!. 49

క. చీలదు నీనాలుక వే, చీలికలుగ నేల వాణి ♦ చెంద దవళతఁ
గాలవు నష్టములై నీ, ప్రేలెడునక్షరము లేల ♦ వెంగలి! యింకన్. 50

తే. సకలలోకశుభాశుభ♦సాక్షులైన
పంచభూతంబు లవి లే కుంటంచుఁ దలఁతు
నిక్కముగ నీదు మేనను ♦ నిష్ఠురాత్మ!
యున్న నవి యేల ని న్నిటు ♦ లుంచు నోరి.! 51

సీ. న న్నిట్టు లనునిన్ను ♦ నగ్నిహోత్రుఁడు పట్టి భస్మంబు చేయక ♦ వదలు నేల
యెగఁజిమ్ముకొని పోయి ♦ యెందైన నాయువుపవేయ కూరక ♦ పాయు నేల
యఖిలలోకంబుల♦యంబువు లెల్లను నలమి చుట్టుకు నిన్ను ♦ నణఁప వేల
భూతధాత్రియు నధో♦భువనంబునకు నిన్నుఁ గొనిపోవ కూరక ♦ మనుచు నేల
తే. ఆకసంబును నప్పుడె ♦ యాత్మ నిర్వి,శేషునిగఁ జేయ దేటికిఁ ♦ జీ! యవేవి
లేవు నీదేహమున లేవు ♦ లేవు లేవు, నిక్కువంబుగ లేవు పో ♦ నీచ! మత్త!.

ఆ. అవ్యవస్థితుండ ♦ వైననీవు వ్యవస్థి,తమగుచునట్టిభువన♦తలమునందు
నేల పుట్టినావొ ♦ యిట్లు తిర్యగ్జాతి,యట్లు కామచారి ♦ వగుచు నెలుఁగ. 53

చ. అలర స్వపక్షపాతమును ♦ నానవరాగము నీగతిన్ స్థలా
స్థలము లెఱుంగకే పలుకు ♦ చాతురి యెవ్వఁడు చిల్కఁ బోలె నిన్
గలుగఁగఁ జేసె నాఖలుఁడు ♦ కంజభవుండొ తదీయజాతి నిన్
గలుగఁగఁ జేయ కేల యిటు ♦ గల్గఁ జేసె మనుష్యజాతిలోన్. 54

చ. కలుగఁగఁ జేయువేల యిటు ♦ గాఢముగాఁ బరిహాసధోరణిన్
బలుకుచు నాకుఁ గోపమును♦బాపురె! నీ విటు పల్కుపల్కులన్
గలఁగి యొనర్తు నీ కిదిగొ ♦ గాంచుము దుర్భరసంవిభాగ మీ
పలుకుల కర్హమౌ ఫలము ♦ వచ్చును దాన నొనర్తు వి ట్లికన్. 55

వ. అని కటకటంబడి చంద్రాభిముఖుండై కై మోడ్పుఘటించి నుగుడ నిట్లంటి.56

చ. ప్రకటితలోకపాలభగ♦వంతుఁడ! సర్వజగచ్ఛిరోమణీ!
సకలుని బుండరీకు నుత♦సద్గుణు దేవునిఁ గన్నదాదియిం
కొకపురుషున్ మనంబునను ♦ నూనన యేని యఃళీకకామినీ
విటునిఁ బుట్టఁ జేయు మిదె ♦ నీని మదీరితజాతి సత్కృపన్. 57

మ. నను( గావింపుము సత్యవాక్య నన నే ♦ నాపల్కుటతోఁ గూడ ధా
త్రిని నాతండు పడెన్ గటా యెఱుఁగ నా ♦ తీవ్రోరువాక్ఛక్తి నో
వనవిల్యాకనిజస్వరప్రభావముననో ♦ నట్టాడుతద్దుర్విపా
కనిదాఘాఘపరంపరాగురుతనో ♦ గాలిం ద్రుమంబుం బలెన్. 58

చ. అతఁడు గతాసుఁడౌటఁ గని ♦ హా యని యేడ్చెడు తజ్జనంబుచే
నితఁడు త్వదీయమిత్రుఁ డని ♦ యేఁ గనుఁగొంటి నటంచుఁ జెప్పి యా
యతివ త్రపావనమ్రముఖి ♦ యై మహి నూరక బాష్పవారిఁ బ్లా
వితముగఁ జేయుచుండెఁ; బృథి ♦ వీపతిసూతి తదీయవాక్యముల్. 59

చ. శ్రుతిపుటి సోఁక దీర్ఘమయి ♦ శ్రోత్రము లంటిన కన్నుఁదోయి మీ
లితముగఁ జేసి చూపును వి ♦ లీన మొనర్చి యెలుంగు రాల్పడన్
జతన మొనర్చియున్ మిగులఁ ♦ జారుచరిత్రవు నీ వపుణ్యుఁడేన్
సతి మదిరాతనూజపరి ♦ చర్యసుఖంబు లభింప దీజనిన్. 60

చంద్రాపీడుఁ డావృత్తాంతమునువిని మూర్ఛిలుట.

మ. మరుజన్మంబున నేనియున్ భగవతీ! ♦ మానంగ రా దావనిన్
బోరి సిద్ధింపఁగఁ జేయు మంచు మదిరా ♦ పుత్రీవియోగాధి నా
సరసీజం బెటు భృంగతాడనమునన్ ♦ సంభిన్నకోశం బగున్
ధరణీశాత్మజుఁ డట్లు భిన్నహృదుఁడై ♦ ధాత్రిం బడెన్ భూవరా!. 61

వ. అంత. 62

తే. విడి మహాశ్వేత దేహంబు ♦ వేగ పోయి
పట్టుకొనియెను దరళిక ♦ పార్థివేంద్రు
నాత్మజన్ముచంద్రాపీడు ♦ నాత్మ నట్టి
యని మహాశ్వేత కిట్టు లా ♦ యతివ వగను. 63

వ. భర్తృదారిక! యింకను నాపాదుసిగ్గేల తాల్చెదవు? ఇటు కనుము. 64

సీ. భగ్న మయ్యెను నీని ♦ బంధురకంఠంబు తిలకింపుమా తల ♦ నిలువ లేదు
పొరలించినను సుంత ♦ పొరలఁడు తారకల్ లోనికిఁ జనియెను ♦ లోచనముల
విప్పఁడు దేహంబుఁ ♦ గప్పుకొనం డెటులున్నను నట్టు లే ♦ యుంచుకొనును
నింకైన నూపిరి ♦ యొదను నాడదు చూడు మొండువిధంబయి ♦ యున్న వాఁడు
తే. హా నృపకుమార! హా దేవ! ♦ యధిపతనయ!
యకట కాదంబరీప్రియ ♦ యఖిలలోక

వినుతసుగణ! చంద్రాపీడ ♦ విధుసమాన
యెందుఁ బోదుము నిను వీడి ♦ యేమి చెపుమ. 65

క. అని యార్తనాద మెసఁగఁగఁ, బనవ; మహాశ్వేత త్రిప్పి ♦ వక్త్రము యువరా
జును గని నిశ్చలదృష్టిని, గన నివ్వెఱపాటు మేను ♦ కదలక యుండెన్. 66

వ. అంతఁ దద్విలాపంబు విని. 67

సీ. దుష్టతపస్విని♦దుస్నేహ! రక్కసి! పాప! చేసితి వెట్టి♦పనిని నీవ
యుపకృతాఖిలజగ♦దాపీడుఁ డైన తారాపీడువంశంబు ♦ మాపినావు
సలిపితి వనదల ♦ జనులను మమ్ముల భంజించితివిగుణ♦పథములెల్ల
నర్గళితము లయ్యె ♦ నర్థిలోకాశలు కను నెవ్వనిముఖంబుఁ ♦ గమల యింక
తే. నూఁత యెవ్వఁడు భూమికి ♦ నుజ్జ్వలాత్ము
నెవని సేవింత్రు సేవకు♦లెల్ల నకట
నీవు లేకున్న నీసేవ ♦ నిష్ఫలంబు
పరిజనశ్లాఘన మణంగెఁ ♦ బాసె సుఖము. 68

చ. చనెను సమానశీలతయుఁ ♦ జచ్చెను ద్యాగకథల్ ప్రియోక్తులున్
జనియెను దవ్వులై యకట ♦ సన్నగిలెన్ బరిచారికాధృతిన్
గనితి కథావశేషము న♦కాండమునం దెటు లీవు తొంటినీ
జనములు పోదు రెచ్చటకు ♦ సాధులకున్ గతియేమి చెప్పుమా. 69

క. తారాపీడుఁడు మోసెడు,భారము నెవ్వాఁడు మోయు ♦ భారవహుండీ
వీరీతి విపన్నతఁ గన, ధీరునకు న్నీకు నెట్లు ♦ ధీ కలఁగెఁ గటా. 70

ఆ. కాతరునకుఁ బోలెఁ ♦ గట భిన్న మయ్యెను,నీకు హృదయ మకట♦ నెవ్వగవడిఁ
గలిగె నెట్లు నీకుఁ ♦ గడుకృపావంతున,కిట్టినిర్దయత్వ ♦ మేమి కతము. 71

తే. దేవ! కనుము ప్రసన్నత ♦ ధీరవర్య !
వను ప్రసంగము మాకొక్క♦పారిదైనఁ
బ్రాణములఁ దాల్పు భక్తుల♦ప్రార్థనంబుఁ
గొనుము కనువిచ్చి చూడుము ♦ వినుము పల్కు. 72

క. బ్రతుకునె తారాపీడుఁడు, సుతవత్సలుఁడతఁడు నిన్నుఁ ♦ జూడక యున్నన్
బ్రతుకునె విలాసవతియును, బ్రతుకఁడు శుకనాసుఁ డాన్య♦భావుం డతఁడున్.

సీ. జీవంబుఁ దాల్చునె ♦ క్షితి మనోరమ యింకజీవింతురే ప్రజల్ ♦ క్షితిపవరులు
వీథి యందఱ నొక్క♦వేళను నొంటిగ నెటకేగఁ దలఁచితి ♦ వేటి కయ్య

కలిగె నీకెటు లిట్టి♦కఠినత్వ మక్కట యున్నటులుండియుఁ ♦ జన్న నీకు
గురుజనంబులపైనఁ ♦ బరగెడువరభక్తి నేని చూడక యెటు♦ కేగు దిప్పు

తే. డనుచు నాక్రందనముఁ జేయు ♦ చవనిఁ బడుచుఁ
బరిజనంబులు క్షితిపతి♦ వారములును
వచ్చి రచటికి హాహార♦వంబు లెసఁగఁ
దద్విలాపంబు చెవి సోఁకఁ♦ దత్క్షణంబ. 74

వ. ఆసమయంబున. 75

ఉ. తెప్పల వంచు చెత్తుచును ♦ తేసుతుమోమునఁ జూడ్కి నిల్పుచున్
విప్పు మటంచు నాఁ దనను ♦ వేమరు కళ్లెము వాగె లాగుచున్
దప్పక నాల్గుగిట్టలను ♦ ధాత్రిని గొట్టుచు నోలి దుఃఖ నా
నొప్పఁగ దైన్య మార్తరవ ♦ మూర్జితహేషలఁ జేయు చెంతయున్. 76

కాదంబరి మహాశ్వేతాశ్రమమునకు వచ్చుట.

చ. తనతురగత్వమున్ విడువ♦దద్దయరత్నముఁ గోరుచుండ; రా
తనయుఁడు వచ్చు నం చటకుఁ ♦ దథ్యముగా నని పత్రలేఖ చె
ప్పిన నతనిం గనుంగొనెడు♦వేడ్కను జిత్రరథాత్మజాత వ
చ్చెను గని వత్తు హంససుత ♦ శీఘ్రముగా నని చెప్పి తల్లికిన్. 77

సీ. ఝణఝణాత్కారంబు ♦ సల్పునూపురములఁ గలకలారావమే♦ఖలయుఁ దాల్చి
రమ్యోజ్జ్వలాంశుక ♦ రాజంబు వరవేషభూషావిశేషముల్ ♦ పోలఁ దొడిగి
కైకొని సురభిళ♦గంధమాల్యంబులఁ బటవాసముఖబహు♦పరికరములఁ
జేకొని బంగారు♦శృంగారభృంగారముకురసుపీటీస♦ముద్గకముల

తే. మదనసైనికవిభ్రమం ♦ బొదవఁ జేయు
నాతిబహుళనిజపరిజ♦నంబు వెంటఁ
గొలువఁ గేయూరకుఁడు ముందుఁ ♦ దెలుపఁ ద్రోవఁ
బత్రలేఖాకరాబ్జంబుఁ ♦ బాణి నూఁది. 78

తే. పత్రలేఖ వచించెడుఁ ♦ బ్రత్యహంబు, నేను నిష్ఠురహృదయుఁడా♦నిర్దయుండు
నానిమిత్తమెవచ్చిన♦నమ్మకుండు, నంటయిదియేమిమదలేఖ!♦యనెడు నిట్లు.

వ. మఱియు. 80

చ. హిమగృహమందు నన్నరయు♦నింపున వచ్చి యదృచ్ఛ నాయవ
స్థ మదిని విశ్వసింపక య♦తండు దురాత్మకుఁ డన్న వక్రవా

క్యమునకు సస్మితాస్య నయి ♦ గాంచఁగ నీ వనినాయసంశయై
క మయినయుత్తరం బిప్డు ♦ గాంతరొ! యెంతువొ నీవు కావునన్. 81

ఉ ఆతఁడు నేను జచ్చినను ♦ నాత్మను నమ్మఁడు నాయవస్థ నో
కాతరనేత్ర! నాకొఱకుఁ ♦ గష్టమునే గను నంచు వానికిన్
జ్యోతిత మయ్యె నే నటుల ♦ దుందుడు కందకరాఁడు వచ్చె నే
నాతనితోడ నేఁ బలుక ♦ యాడుఁము సర్వము నీవ యేమియౌన్. 82

చ. పలుకఁగ రాదు చూచినను ♦ వానిని నేమి యొసంగ రాదు పో
సలిపినఁ గాళ్లపైఁ బడుచు ♦ సాంత్వన మేఁ గొనరాద యూఱటన్
గొలుపఁగ రాదు నీవు ననుఁ ♦ గోరి మఱేమి వచించితిన్ జుమీ
గలికి! యటంచు ముచ్చటలఁ ♦ గాంచుచు నామదలేఖ తోడుతన్. 83

ఉ వచ్చి కనుంగొనెన్ విగత♦పల్లవపుష్పవనంబుచాడ్పునన్
విచ్చినచుక్కలం బోలుచు♦లింగవిధంబున బీజకోశమున్
వ్రచ్చినశొప్పువారిజము♦భాతి ననాయకహారముం బలెన్
నొచ్చి గతాసుఁడై నతన♦నూతనకాంతుని రాజపుత్రునిన్. 84

చ. కనుఁగొని వాని సంభ్రమము ♦ గాతరతన్ గదురంగ హా యిదే
మనుచు నతాస్యయై ధరణి ♦ నట్టె పడెన్ మదిరాత్మజాత హా
యని మదలేఖ యేడ్చుచున ♦ యామెఁ గవుంగిటఁ గ్రుచ్చి పట్టె ను
ర్విని బడెఁ బత్రలేఖయును ♦ వీడి నృపాత్మజహస్తమున్ బడిన్. 85

ఉ. అంతటఁ గొంతసేపునకు ♦ నామదిరాత్మజ మూర్ఛఁదేరియున్
సుంతయు నూర్పునన్ మఱచి ♦ శోకభరంబున మూఢనాఁగ దు
ర్దాంతవిచారయుక్తయన ♦ స్తబ్ధవినిశ్చలదృష్టి స్తంభిత
స్వాంతయునై ప్రయత్నమున ♦ నల్పక యేమియుఁ దన్ముఖంబుపై. 86

కాదంబరీవిలాపము.

చ. పరవఁగఁ జేసి చూపులను ♦ బాయక శ్యామలరక్తవక్త్రయై
పరగి గ్రహోపరక్తసిత♦భానుసుమండలపూర్ణిమావిభా
వరికరణిన్ బరశ్వథని♦పాతితవల్లరిపోలె నొప్పుచున్
గర మధరోష్ఠపల్లవము ♦ గంపము నొంద లిఖించినట్లుగాన్. 87

ఆ. స్త్రీస్వభావ మైన♦చిత్తంబుతో నుండె, దానిఁ గాంచి కాళ్ల♦పైనఁ బడుచు
నార్తనాదమొసఁగ♦ననియెను మదలేఖ, యడలు చిట్టు లాహొ ♦ కథిపచంద్ర!.

చ. ప్రియసఖి! యేల యేడ్చెదవు ♦ వీడుము శోకభరంబుఁ దేరుమా
నియతము బాష్పముల్ విడువ ♦ నేరదు వీడఁగ శోకభారమిం
తయు సరసంబు కోమలము♦త్వద్ధృదయంబు విదీర్ణ మౌను నా
రయఁగఁ దటాకముంబలెను ♦ రాయిడి పెట్టెడునీవ్యథల్ గటా. 89

క. కనుఁగొను మదిరాదేవిని, గను దేవుని జిత్రరథుని ♦ గాంచుము కులముల్
నిను విడి రెండుకులంబులు, మన వీభువి నింక మనునె ♦ మదలేఖ యనన్.

క. విని కాదంబరి నవ్వుచు, ననియెను మదలేఖ కిట్లు ♦ లళినికఠినమై
తనరెడునీహతహృదయ,మ్మున కగునే విదళనంబు ♦ ముదమే నాకున్, 91

క. కనియును వేయింతలుగాఁ, దునియదు నాహృదయ మెంత♦తుచ్ఛమ్మొ గదా
మనుదాని కీసమస్తము,జననియు జనకుండు బంధు♦జనములు సఖులున్. 92

చ. మరణము నొందునా కెటులొ ♦ మానిని! జీవితభూతమైనయీ
వరునిశరీర మబ్బె; నిది ♦ ప్రాణముఁ గాంచినఁ గాంచకుండినన్
బరఁగును సర్వదుఃఖచయ♦వారకమై యెటుఁ గూడఁ జచ్చుటన్
సురతసుఖంబుఁ గాంచుటను ♦ శోకము గూరఁగ నేల చెప్పుమా. 93

చ. మదవతి! నానిమిత్త మిట ♦ మానుగ వచ్చుచు వీడెఁ బ్రాణముల్
గదురఁగఁ జేసె గారవముఁ ♦ గానఁగఁ జేసె సమున్నతస్థితిన్
వదలుమదాత్మ కీనృపతి♦బాలుఁడు దేవుఁడు నాకు దాని నేన్
వదలుదు నెట్లు చుల్కన యొ♦నర్చుచు బాష్పవిముక్తిమాత్ర చేన్. 94

సీ. స్వర్గమునోన్ముఖ♦స్వామికి నే నెట్టు లాదవింతు నశుభంబు ♦ రుదితమునను
బదధూళి పదముల ♦ బడిఁజనుగతిబడిఁ జనఁ గడంగుచు నెట్లు ♦ పనవుదాన
దూరంబు లయ్యె నా♦దుఃఖంబు లన్నియు నిపు డేద్తునా నేను ♦ నెలమిఁ గనక
పంచబాణశరాగ్నిఁ ♦ బడిన నాపాట్లెల్ల ఫలియించె నింక నేఁ ♦ బలుక నేల

తే. యౌవనికై కులక్రమమును ♦ నెంచనైతి
గురువులను నుజ్జగించితిఁ ♦ గొల్వనైతి
ధర్మమును జనంబుసడికిఁ ♦ దలఁకనైతి
నతఁడు ప్రియతముఁ డిట్లయ్యె ♦ నడల నేల. 95

చ. సకి! మదనోపచారములఁ ♦ జాల శ్రమంపడఁ జేసితిన్ మిమున్
సకియల నెల్లఁ బ్రాణసఖిఁ ♦ జారుచరిత్రను హంసపుత్రి నూ
రక శ్రమ పెట్టితిన్ గట తీ♦రంబుగ నీమొకు నై దృఢంబుగా
సకులు వినన్ బ్రతిజ్ఞ నటు ♦ సల్పితి నయ్యది యిట్టు లయ్యెఁగా. 96

చ. అనియు మనంబునం దలఁప♦నైతిని వీడితిఁ బాడుసిగ్గు నే
మనియెదు నన్ను నాకునయి ♦ ప్రాణము వాయఁగఁ బ్రాణనాథుఁ డే
మన నటు మొండినై యింకను ♦ మానము ప్రాణము సిగ్గు లేకిఁకన్
జనములఁ జూతు నెట్లు వగ♦సైఁతును నేగతిఁ జెప్పుమా సఖీ! 97

తే. మరణమే జీవితం బిప్డు ♦ మగువ! జీవి
తంబె మరణంబు; నాపైని ♦ దథ్యముగను
బ్రేమ గలదేని హితమును ♦ బ్రియము నీవు
చేయఁ దలఁతేని యొకపని ♦ చేయవలయు. 98

క. జననియు జనకుఁడు నావగఁ, గనకుండఁగ నసువిముక్తిఁ♦గావుము; నాయం
దొనరునభిలాష వారికిఁ,నొనరుప నీయందు దాని♦నొనరువు కడఁకన్. 99

క. పరిజనులు సఖులు నన్నిఁక,స్మరియింపక యుండునట్లు ♦ సల్పుము నామం
దిరమునుశూన్యంబునుగని,యరుగక యుండంగ దెసల ♦ కరసికొను సఖీ! 100

ఆ. నన్నుఁ దలఁచు చీపు ♦ నాయింటి ముంగిట,నలరునాదుపుత్త్రుఁ♦డైనచూత
పోతమునకు నేనె ♦ ప్రోదిచేసినమాధ,వీలతాంగనకును ♦ బెండ్లి సేయు. 101

సీ. మత్పాదతలమున ♦ మన్నించి పెంచినకంకేళితరువుపైఁ ♦ గరుణఁ బూను
చెవికమ్మకైనను ♦ జెడు దానిసొబ గని గిల్లక చేతితోఁ ♦ గిసలయముల
నాప్రోదిచేసిన♦నవమాలతీపుష్పములు దేవతార్చన♦మునకుఁ గోయు
నావాసభవనంబు♦నందు శిరోభాగగతమారపటము ద♦గ్ధంబు సేయు

తే. నేన స్వయముగ మొలవంగ ♦ నిలిపినట్టి
మావులు ఫలంబులను గనఁ ♦ బ్రోవు మీవ
నాదునోడిఁ బండి పెరిఁగిన ♦ నకులిక నిఁక
నీదునోడిఁ బండ చేయుము ♦ నిచ్చలతివ! 102

ఉ. పంజరబంధదుఃఖమును ♦ బాయఁగ నావరిహాస కీరమున్
మంజులరావరమ్యమును ♦ మానితమున్ యమునాఖ్యశారికన్
రంజిల విడ్చిపెట్టుము మల ♦ రాజమరాళి నజాతపక్షమున్
గొంజక యెవ్వఁడేనియును ♦ గొట్టకయుండెడునట్టొనర్చుమా. 103

ఆ. నాదుకరతలమున ♦ నయమారఁ బెరిఁగిన
యలచకోరమిథున ♦ మడలకుండఁ
గేళిపర్వతమునఁ ♦ గ్రీడింపఁగాఁ జేయు
సకియ! యింక నేమి ♦ సల్పుదాన. 104

ఆ. మందిరమున నుండ ♦ మరగని యౌవన, మానుషినిఁ దపస్విఁ ♦ బూని యేను
బట్టి తెచ్చినాను ♦ బలిమిని నిర్బంధ, మునను దాని విడువు ♦ వనమునందె. 105

సీ. క్రీడాద్రి నొసఁగుము ♦ కేవలశాంతుఁడై యొసఁగు తపస్వికి ♦ నెవనికైన
సద్విప్రులకొసంగు ♦ సఖ! నాశరీరోపకరణంబులను నెల్ల ♦ నరయ కేవని
నే నంకతలమునఁ ♦ బూని నిచ్చలు మీటువీణ నీతోడ లప్పై ♦ వెలయునిమ్ము
వలుకు లేటికి నీకు ♦ వలయు నెయ్యది యింకఁ గొనుము దానినినీవ ♦ కొంకు వీడి

తే. యమృతకిరణకభస్తుల ♦ నార్ద్రగంధ
చర్చికల రత్నదర్పణ ♦ స్పర్శములను
సతతధారాగృహాసార ♦ సంతతులను
చందనార్ద్రాబ్జశయ్యలఁ ♦ జాలఁ గ్రాఁగి. 106

వ. మఱియు. 107

తే. బహుళ సంతాన శశికర ♦ వార తార, కిసలు తారహారార్పణ ♦ కేళికలను
సరసబిసకుసుమపల్లవ ♦ ప్రస్తరములఁ, గమలకువలయశయ్యలఁ ♦ గ్రాఁగి క్రాఁగి.

ఆ. దగ్ధశేష మగుచుఁ ♦ దనరు నీ దేహంబు, జ్వలితచితకృశాను ♦ భయదశిఖల
విడుపుదాన విభుని ♦ మెడను గౌఁగిటఁ జేర్చి, పలుక కింక నడ్డ ♦ వాటు పలుకు.

తే. అనుచు మును మేను దొఱఁగఁ బ్ర ♦ యత్న పడిన
యట్టిమదలేఖఁ బడఁ ద్రోసి ♦ యవల కామె
యలమహాశ్వేతసరసకు ♦ నరిగి మెడను
బాహువల్లులఁ బెనవైచి ♦ పనవు చనియె. 110

మ. చెలి! నీ కెట్టిదొ యొక్కయాశ చెలఁగున్ ♦ సిద్ధించుఁ బొందంచుఁ దా
నలరన్ గూరిమి చావుకంటెఁ గడు న ♦ న్యంతంబులౌ నాపదల్
గలుగన్ సైచుచు నత్రపాకరమదుః ♦ ఖంబున్ విగర్హ్యం బహా
స్వలవంబున్ భరియింతు జీవితము నా ♦ కాయాశయున్ లేదుగా. 111

తే. అన్నివిధములను హతాశ ♦ నమ్మ నేను
మరుభవంబున నీదుసం ♦ మాగంబు
గలుగఁ గృపసేయు ప్రియసఖ! ♦ తలఁచుకొమ్ము
భవదభీప్సిత మీడేరి ♦ పడయ సుఖము. 112

వ. అని చెప్పి యాకాదంబరి. 113

సీ. పొరిపొరిఁ బొడమెడు ♦ పులకకేసరముల భాసురంబై మేను ♦ వరఁగ మిగుల
నసమసాధ్వసమూర ♦ తాహతిఁ గంపించు హర్షబాష్పోర్ముల ♦ కదరి వడుచు

స్వేదాంబుమకరంద♦బిందుసందోహంబు గ్రందుగా నొడలెల్లఁ ♦ గాఱుచుండ
ముకుళించు నేత్రకు♦ముదయాచ్చఁ బ్రియుఁడుచంద్రాపీడహిమధాముఁ♦డస్తమింప

తే. విరహవిధురితయై కడు ♦ విహ్వలించు
కుముదినీగతిఁ దదవస్థఁ ♦ గూడఁ బ్రియుని
చరణముల సంస్రవద్ఘర్మ♦జాలకార్ద్రి
కరములను నెత్తి తొడలపైఁ ♦ బరఁగఁ జేసి. 114

తే. చికురపాశంబునందుండి ♦ చిందిపడెడు
కుసుమవిసరంబులను బ్రియు ♦ నెసక మెసఁగఁ
బూజసలుపుచు నుండె నా ♦ పువ్వుఁబోఁడి
చిత్రరథుపుత్రి మన మెందుఁ ♦ జెదరనీక. 115

వ. అంత. 116

చ. సలుపుచు నాప్రదేశమును ♦ జంద్రమయంబుగ నొక్కతేజ మా
చెలికర మంటుటం దవిలె ♦ జీవ మనంగను నొప్పరాజపు
త్రులలితదేహముం వెడలి ♦ దోడన వచ్చెను జంద్రతుల్యమై
వెలుఁగుచు నెల్లకాంతులను ♦ విభ్రమ మందఁగ నంత నచ్చటన్. 117

అశరీరవాణి కాదంబరి నూఱడించుట.

తే. అంత గగనతలంబున ♦ నమృతవృష్టి
పరఁగ వర్షించు నశరీర♦వాణి యొకఁడు
విస్మయమ్మంద వినవచ్చె ♦ వీను లలర
నే మి దే మని యడుగంగ ♦ నెల్ల రిట్లు. 118

వ. వత్సా! మహాశ్వేత! నేనే మరల నిను నూఱడింపవలసె. ఆపుండరీకదేహంబు నాలోకంబున మత్తేజంబుచే నాప్యాయితం బగుచు మరల నినుఁ గలయునభిలాష సుఖం బున్నయది. మత్తేజోమయం బైనయాచంద్రాపీడదేహంబును స్వయముగ నవినాశి. విశేషించి యీకాదంబరీకరస్పర్శంబుచే నాప్యాయమానం బయి శాపదోషంబుచే నాత్మను బాసియుఁ బరకాయప్రవేశంబుఁ జేసినయోగిదేహంబుపగిదిఁ జెడకయుండును శాపావసానం బగునంతకు నీశరీరం బిందె యుండుఁ గాక. దీని నగ్ని దహింపకుఁడు. నీళ్లం బడవేయకుఁడు మఱి యెచ్చటనుం ద్రోయకుఁడు. ఇచ్చట నుంచికొని పునస్సమాగమం బగునఱకుఁ గడుజతనంబున సంరక్షింపుఁడు. అని వినంబడుటయుఁ బత్రలేఖయొ

కృత్తికృఁ దక్కినసకలపరిజనంబెల్ల మీఁదివంకఁ జూచుచు నిర్నిమేషలోచ
నంబయి లిఖితంబు నా నివ్వెఱఁ గంది యుండె నంతఁ బత్త్రలేఖ. 119

మ. హిమశీతంబు ప్రమోదహేతువునునై ♦ యింపారునావెల్లు దే
హముఁ దాఁకెన్ దెలివొందె లేచియు రయం ♦ బారంగఁ బర్వెత్తి భూ
తమునా వేళముఁ గన్నరీతి జని యా ♦ ధాత్రీశపుత్రీశ్వరా
జముఁ దద్రక్షకుచేతినుండి తివిచెన్ ♦ జంచద్బలాత్కారతన్. 120

క. మనవాంట్ల కెట్లు కావల,యును నట్లపుఁ దప్పు దెవుఁడు ♦ నొంటిగ మారం
బునకు జనె రాసుతుఁడు వా,హనమవు కాకున్నవాని ♦ కలరవు నీవున్. 121

పత్త్రలేఖయు నింద్రాయుధమును నచ్ఛోదసరస్సునఁ బడుట.

క. అని చెప్పుచు నింద్రాయుధ,మును గొని చని దానితోడ ♦ మొనసి నరున్ వై
చెను దనశను వచ్ఛోదం, బనుసరసిని జూచుచుండ ♦ నందఱు తెగునన్. 122

వ. అంత నింద్రాయుధంబును బత్త్రలేఖయు నాసరసిం బడి మునింగినయనుక్షణం
బున నాసరోవరంబందుండి. 123

సీ. మస్తకసంలగ్న ♦ మహితశైవలజాలమున గళజ్జలబిందు ♦ వనము నగుచు
నయథావలంబితా ♦ యతశిఖంబయి యాననాన్యోన్యసంసక్త ♦ మగుటవలన
విగతసంస్కారమై ♦ వెలయుట మలినమై చిరతరోపరిబంధ ♦ సిద్ధిఁ దెల్పు
రుచిరపావనజటా ♦ నిచయంబు ధరియించి సలిలార్ద్రదేహసం ♦ సక్త మగుచు

తే. మంజుబిసతంతుమయ మన ♦ మహితమయిన
బ్రహ్మసూత్రంబు భుజమున ♦ భాసిలంగ
మ్లానజలజాతనీలప ♦ లాశవృష్ట
సితజరత్కల్పవల్కంబు ♦ జిలుగుఁ దాల్చి. 124

వ. మఱియు. 125

కపింజలుఁ డచ్ఛోదసరస్సునుండి వెడలి వచ్చుట.

చ. కరమున మోముపైఁ బడెడు ♦ క్రమ్మ జటల్ దొలఁగంగఁ ద్రోయుచున్
నిరతము లోఁజొరంబడిన ♦ నీరజినీజలమో యనన్ గడున్
దొరఁగెడుబాష్పపూరములఁ ♦ దోఁగఁ గనుంగవ నవ్యవస్థుఁడై
పరువిడి లేచి వచ్చె ముని ♦ బాలకుఁ డొక్కఁడు చూడ నందఱున్. 126

ఉ. దూరమునుండియే కనులఁ ♦ దోరములై దిగఁజాఱుబాష్పముల్
సారెకు నాఁగ నాకులతఁ ♦ జాల వహించియు బద్ధలక్ష్యతన్

జూరినచూడ్కిఁ దన్నుఁ గనుఁ ♦ గోమలి హంసతనూజయొద్దకున్
జేరి సశోకగద్గదిక ♦ చేకుఱ నిట్లను నాతఁ డామెకున్. 127

క. ఓగంధర్వకుమారిక!, యీగతి వెఱఁగంది చూచె ♦ దేలకొ నన్నున్
నేఁ గాదె యాజన్మము, నీఁగితి మఱుమేను దీని ♦ నేఁ గైకొంటిన్. 128

ఆ. గుఱుతు పట్టలేదె ♦ కోమలి! వీనిని
ననఁగ నామె శోక♦హర్షములకు
నడుమఁ జిక్కి వేగ ♦ మడరంగ లేచి తా
ననియె నిట్లు మ్రొక్కి ♦ యతని కపుడు. 129

తే. ఓకపింజల! నేను న♦యోగ్యురాల, మందభాగ్యను నిన్నును ♦ మఱచి పోయి
గుఱుతు పట్టంగ లేనైతి ♦ గుణధురీణ!, తగు ననాత్మజ్ఞపై నిట్టి ♦ తలఁపు నీకు.

తే. దేవుఁ డలపుండరీకుండు ♦ దివికిఁ జనిన
బ్రతుకుచున్నాను మొండినై ♦ ప్రబలమోహ
హతనగుచు నింక నేను నో♦యమలచరిత!
లజ్జ లే కింతయును భూత♦లంబునందు. 131

ఉ. ఎవ్వఁడు వాని నెత్తికొని♦యేగెను కైకొని యేగె నేడకో
యెవ్వసుధన్ జరించు నిపు ♦ డీవు కనుంగొనితే యెఱుంగుదే
యవ్విమలాత్మువృత్తమును ♦ నంపవ యింతికు నొక్కవార్త నీ
వివ్విధి దేవునిన్ విడిచి ♦ యేల యొకండవె వచ్చి తీడకున్. 132

వ. అని యివ్విధంబున మహాశ్వేత యడుగుటయుఁ గాదంబరీపరిజనంబును జంద్రాపీడానుగతం బైన రాజపుత్రలోకంబును విస్మయోత్ఫుల్లలోచనంబయి పయి పయింబడి కనుంగొనుచుండ నతం డిట్లనియె. 133

కపింజలుఁడు మహాశ్వేతను వీడి చనినతరువాతి వృత్తాంతముచెప్పుట.

తే. వినుము గంధర్వపతిపుత్రి! ♦ వినుతు నట్టు
లార్తనాదంబులెసఁగంగ ♦ నడలునిన్ను
నొంటిగా వీడి మిత్త్రుపై ♦ నుండుప్రీతి
నడుము బిగియించుకొని యేను ♦ నరుగ లేదా. 134

క. కొనిపోయె దెటకు నాచెలి, నని యాతనివెంట నంటి ♦ యతివేగమునన్
జనితిని వాఁ డేమియు నా, కనక యెు సురమార్గమునను ♦ నమరగణంబుల్. 135

చ. కనఁగొనుచుండ విస్మయముఁ ♦ గాంచుచు ఫుల్లసరోజనేత్రలై
కనఁబడకుండ నాస్యములఁ ♦ గప్పి జలుంగుఁబయంటకొంగునన్
జనునభిసారికల్ దివిజ♦సారసనేత్రలు దారిఁ దీయఁగా
నానుపఁగా నమస్కృతుల ♦ నోలిని జంచలతారతారకల్. 136

తే. గగనకాసారకైరవ♦గణ మనంగఁ
దనరునక్షత్రగణమును ♦ దాఁటి యవలఁ
బొలుచుచంద్రాతపమనోజ్ఞ♦భూతలంబు
చంద్రలోకంబుఁ జొచ్చె నా♦చారుమూర్తి. 137

క. అందు మహోదయ మనుసభ,యందలివిధుకాంత మయమహా♦పర్యంకం
బందు నలపుండరీకుని,సుందరదేహంబు నుంచి ♦ చూచుచు నన్నున్. 138

క. అనె నిట్లు కపింజల! నను, గనుము మృగాంకునిఁగ, నేను♦గనుదునుదయమో
ఘునజగమనుగ్రహింపఁగఁ,జనుదు స్వకార్యంబు నెపుడు ♦ సల్పుచుఁ జదలన్.

వ. ఇట్లుండ నొక్కనాఁడునీప్రియవయస్యుండు కామపరవశుండై తదీయాపరాధం
బునఁ బ్రాణంబుల వీడుచు నిరపరాధుండనైన నన్నుం గనుంగొని రూక్షాక్ష
రంబుల నిట్లనియె. 140

సీ. ఓదురాత్మక! చంద్ర! ♦ దోషాహతమానస! నేనెట్లు త్వత్కర♦నిహతుఁ డగుచుఁ
బ్రాణంబుఁ బాసెద ♦ బాణిప్రియాసమాగమసౌఖ్య మందక ♦ కలిగి కూర్మి
నట్లు కర్మోర్వియై ♦ యలరుభూతలమందు భారతవర్షంబు ♦ పరగు నందు
జన్మజన్మంబున ♦ జాతానురాగుఁడవై సమాగమసుఖ ♦ మందకుండ
తే. ఘోరతరమైనహృత్పీడఁ ♦ గూరి నీవు,జీవితంబును విడుతువు ♦ సిద్ధ మనుచు
ఘోరశాపం బొసంగె నా♦క్రూరచిత్తుఁ,డేను నాశాపవహ్నిచే ♦ నెరసి యున్నై.

తే. ఆత్మదోషానుబంధుండు ♦ నప్రబుద్ధ
చిత్తుఁ డవివేకి యాతఁడు ♦ చేసె నేమి
యనుచుఁ బ్రతిశాప మిచ్చితి ♦ నతని కేను
మత్సమానుండ వగు మని ♦ మన్యు వంది. 142

తే. అంత శాంతింపఁ గినుక నే ♦ నంది తెల్వి
నరసి యాతనివృత్తంబు ♦ హంసతనయ
తోడివ్యతికర మతనికిఁ ♦ దొడరి గుంటఁ
దెలిసికొంటి మహాశ్వేత,దివ్యశయను. 143

తే. ఆమహాశ్వేత మత్కిరణాళిసంభ
వాప్సరఃకులసంభూత • యైనగౌరి
యందు జనియించె నీతఁ డాయమకు భర్త
యాత్మదోషంబుచే నిట్టు • లయ్యె నకట. 144

ఉ. ఈతఁడు నేనునుం గలసి • యీనరలోకమునం దవశ్యసం
జాతులమై వసింపవలె • నైఁచి ద్వివారము; లేకయున్న నీ
యాతతదుఃఖభారమును • నందుచుఁ గుందుచు జన్మజన్మమం
దేతటి నెన్నినాళ్లకును • నేదఁగఁ బారము నుండఁగావలెన్. 145

ఉ. ఎంతకు శాపదోషమును • నీతఁడు వీడునో యంతకున్ దదీ
యాంతరితాత్మదేహమున • కాపద లేమియుఁ గల్గకుండ నే
కాంతమునందు నుంపఁగను • గైకొని వచ్చితి నీశరీరమున్
వంత యణంగ నూఱట నొ•నర్చితి వత్సకు హంసపుత్రికిన్. 146

ఉ. శాపము తీఱునంత కిట • సల్పి నివాసము నాదు తేజునన్
దాప మణంగ నీతనువు • దద్ద సుఖించుత నీవు వోయి యా
తాపసి శ్వేతకేతునకుఁ • దండ్రికిఁ దెల్పుమ యీయుదంతమున్
దాపసపర్యుఁ డాముని యొ•నర్చుఁ బ్రతిక్రియ దీని కెద్దియేన్. 147

క. అని నను వీడ్కొలిపెను నా,యన నేను వయస్యశోక • మధికము గాఁగన్
గనుఁగొనక దేనిఁ బరిధా,వన మొనరించుచును నొక్క•వైమానికునిన్. 148

క. అతికోపను గనుఁగొన కే,నతిరయమున దాఁటి చనితి • నతఁడు కుపితుఁడై
వితతభ్రుకుటికరాళా,యతదృష్టిని కోపవహ్ని • నటు కాల్చెడి నాన్, 149

చ. కనుఁగొని నన్ను ని ట్లనియెఁ•గాఁ! యసత్యతపోబలాతిగ
ర్వ! నను మదంబునన్ గొనక • విస్తృత మాగగనాధ్వమందునన్
జనితివి దాఁటి నీవు గడు • సంజవఘోటకధాటిఁ గావునన్
జననము నందుమీ తురగ•జాతిని మర్త్యజగంబునన్ వడిన్. 150

వ. అట్లనుటయు. 151

ఉ. నేనతిబాష్పపక్ష్ముల • నిల్చి కృతాంజలినై వగన్ గడున్
దీనత తోఁప నంటి నిటు • దివ్యమునీంద్ర! వయస్యశోకతన్
గానక కన్ను దాఁటి నినుఁ • గాంచక పోయితిఁ గాక నీయెడన్
బూనుదునే యవజ్ఞ నిటు • పూనకుఁ గోప మనుగ్రహింపుమా. 152

క. నను దయచేసి మరల్పుము, ఘనతరశాపంబు దీనిఁ • గాదన కనుచున్

వినతి యొనర్చితిఁ బదముల, కని నాతం డిట్లు మరల ♦ నతిశాంతుఁడై. 153

తే. ఏను బలికినమాటకు ♦ నెన్నఁ డేని
యన్యథాత్వంబు కలుగునే ♦ యైన నొకఁడు
చెప్పెదను గొంత కాలంబు ♦ క్షితి నొకనికి
వాహనంబయి యుండుము; ♦ వాఁడు పోలియు. 154

క. నీ వొకసరసునఁ గ్రుంకినఁ, బావనతం గాంతు శాప♦భారము పాయున్
వే వగఁ గూరకు పొమ్మన, నావైమానికున కిట్టు ♦ లంటిని మరలన్. 155

వ. దేవా! అట్లయిన నింక నొకండు నివేదించుకొనెద. దయచేసి యొనర్పు. అదియ నాకుఁ బరమలాభంబు. మర్త్యలోకంబున నాప్రియవయస్యుఁడు పుండరీకుండు శాపదోషంబునఁ జంద్రునితోడం బుట్టవలయునుగదా తురంగమత్వంబు ప్రాప్తించినను నాప్రియవయస్యునితోడ వియోగంబు గలుగకుండ ననుగ్రహింపవే. వానిం బాసి నే నొక్కక్షణంబేని యుండనోప. నను నీదివ్యాపాంగవిలోకనంబునకు గుఱిసేసి యీమాత్రంబైన ననుగ్రహింపవే. యని వేఁడుకొనుటయు నాతం డొక్కముహూర్తంబు ధ్యాననిమీలితలోచనుండై యిట్లనియె. 156

చ. కనుఁగొన నీవయస్యుపయిఁ ♦ గల్గినతత్ప్రణయోరువల్లికన్
మనము కరంగె నాకు నిఁక ♦ మర్త్యజగంబున సుజ్జనిన్ గడున్
దనరియు సర్వసంపదలు ♦ నారకవహ్నిని నార్పుసంతతిన్
గనమిని ఘోరతాపమును ♦ గాంచుచు నొక్కమహీవిభుండు తాన్. 157

క. ఘోరతపం బొనరించెడుఁ, దారాపీడుం డనంగఁ ♦ దనరు నతం డా
భూరమణునకుసుతుండై, తారాధిపుఁ డవతరించుఁ ♦ దప్పక యిపుడే. 158

వ. భవద్వయస్యుం డయినపుండరీకుండును దన్మంత్రియగుశుకనాసునకుఁ బుత్త్రుండై యవతరించు. నీవును బరమోపకారి యగుచంద్రస్వరూపుం డైన యారాజపుత్త్రునకు వాహనంబవు కమ్ము. అన నే నాక్షణంబ యధస్థితం బయినసముద్రమునం బడి గుఱ్ఱంబనై లేచి వచ్చితి. నేగుఱ్ఱంబనైనను నాగుణస్వభావాదు లెవ్వియు మారవు చంద్రావతారం బైన యీచంద్రాపీడుని గిన్నరమిథునానుసారిగ నింతద శ్వేతదర్థంబ గొనివచ్చినవాఁడను నేన. ప్రాక్తనానురాగసంస్కారమున నిన్ను నభిలషింప నీ వెఱుంగక యెవ్వని శాపాగ్నిచే దగ్ధుం గావించితివో యాతండ నావయస్యుం డగుపుండరీకుండు. 159

చ. అని విని హంసపుత్త్రియును ♦ హా యని మత్ప్రియా! పుండరీక! నన్
గనియును వేఱుజన్మమును ♦ నాయనురాగము మర్వనట్టిఁడా!
ననుఁ గన వచ్చితే యకట ♦ నాదుశరణ్యా! మదర్థజీవితా!
కనుదె సమస్తలోకమును ♦ గాంతను నన్నుఁగ జీవితేశ్వరా!. 160

చ. అయితిని మృత్యు వే నకట ♦ యన్యజగంబున నున్ననీకు ని
ర్దయుఁ డగుబ్రహ్మ నన్ను నిటు ♦ ధాత్రి సృజించుటకున్ జిరాయువున్
దయ నొనరించినందులకు ♦ నాకుఁ బ్రయోజన మింతయే నినున్
స్వయముగఁ జంపులే మరలఁ ♦ జంపి యఘంబునఁ గూలులే కటా. 161

చ. ఎవనికిఁ జెప్పుకొందు నిఁక ♦ నెవ్వని దూఱుదు నేని కేడ్తు నిం
కెవనిని వేఁడుదున్ శరణ ♦ మెవ్వఁడు న న్గరుణించు నక్కటా
భువి ననుఁ బ్రోచువా రెవరు ♦ పోవవు ప్రాణము లిప్పుడున్ నినున్
సవ తొనరించి వేఁడుదుఁ బ్ర♦సన్నుఁడవై దయచేసి పల్కుమా. 162

క. అను నీయుత్తరములనే, ననుచున్నను సిగ్గుఁ గాంతు ♦ నక్కట నాపైఁ
బొనరెను వైరాగ్యము నీ,కని తలఁచెద నుత్తరంబు ♦ ననమిఁ బనవినన్. 163

తే. ఆత్మజీవంబువయి నాకు ♦ నడరుచున్న
యలయనిర్వేదమునను నే ♦ హాతను స్వయము
ననుచు వక్షంబు నందంద ♦ యడచి కొనుచు
నార్తనాదంబు లెసఁగంగ ♦ నవనిఁ బడియె. 164

వ. అంతఁ గపింజలుం డట్లు కృతార్తప్రలాపయై యవనిం బడినయామహాశ్వేతం గాంచి పశ్చాత్తాపంబు దోఁప ని ట్లనియె. 165

శా. ఓగంధర్వనృపాత్మజా! గలదె యిం♦దొక్కింత నీదోష మా
వేగంబార ననిందవై ననిను నీ♦వే యూరకే దూఱఁగన్
బాగే సౌఖ్యవిపాక మిప్పు డనుభా♦వ్యంబై తగన్ దుఃఖమున్
భోగింపన్ బనియేమివచ్చెఁ జెపుమా ♦ పూఁబోఁడి! నీ కిగతిన్. 166

ఉ. ఓరువరానిదుఃఖమును ♦ నోర్చితి పీహాతచిత్తు నంగమున్
గూరెదునాక నిర్వరకుఁ ♦ గూరెను మీ కిటు శాపదోషతన్
ఘోరవిప త్తటం చనితిఁ ♦ గోమలి! మీరలు విన్నవార లా
సారసవైరివాక్యములఁ ♦ జాలును వీడుము శోకభారమున్. 167

ఉ. నీకును నీవయస్యునకు ♦ నేరదు మే లొనఁగూడ నీనగన్
జేకొనవమ్మ యుర్వరకు ♦ శ్రేయము చేకుఱ నెత్తపంబు మున్

జేకొని తాతపం బిపుడు; ♦ చేకుఱ దెద్ది తపోబలంబునన్
జేకొనె గౌరి మున్ దపము ♦ చేతనె యీశ్వరునర్ధదేహమున్. 163

క. నీవును శీఘ్రమ నాచెలి,పావన దేహంబునందుఁ ♦ బడ యూనుదు నీ
భావితసుతపోబలమున, భావింపఁగ వగవ నేల ♦ భామిని! నీకున్. 169

వ. అని యూఱడిల్లం బలుకుటయు నమ్మహాశ్వేత యుపశాంతశోకావేగయై యుం
డం గని కాదంబరి ఖిన్నవదనయై కపింజలుం గాంచి యిట్లనియె 170

తే. పత్త్రలేఖయు నీవును బడితి రట్టు
లీసరసి నీట మునిఁగితి ♦ రేను గంటి
నవల నా పత్త్రలేఖ యే ♦ మయ్యె దాని
వృత్త మెఱిఁగింప మిము మ్రొక్కి ♦ వేఁడుదాన. 171

క. అనుటయు నాతం డిట్లను, గన నీ వటు నీటఁ బడితి ♦ గాదే యే మ
య్యెనొ యటపై నే నెఱుఁగను, జననాథకుమారి! యింత ♦ సవ్వడి యేసిన్.

సీ. జనియించె నెచ్చటఁ ♦ జంద్రాత్మకుండు చంద్రాపీడజననాథ ♦ తనయవరుఁడు
పుట్టెను నెచ్చటఁ ♦ బుండరీకాత్మ వైశంపాయనుఁడు రాజ ♦ సచివసుతుఁడు
పత్త్రలేఖయు నెందుఁ ♦ బ్రభవ మందెనొ వీరిసంగతులెల్ల నె ♦ ఱుంగవలయు
మూఁడులోకంబులు ♦ మ్రోల నున్నట్టులఁ గను శ్వేతకేతువు ♦ మునివరుండు

తే. గణ్యుఁ డాతనియొద్దకుఁ ♦ గదలి పోయి
యింతవట్టును నెఱిఁగి నే ♦ నిపుడ వత్తు
ననుచుఁ జదలున కెగసి తా ♦ నరిగె నతఁడు
చూడ నందఱు మినువంకఁ ♦ జోద్యపడుచు. 178

వ. అంత. 174

తే. శోకవృత్తాంత మెల్ల నా ♦ చోద్యమునను,నంతరింపఁ జంద్రాపీడు ♦ నట్టె గనుచుఁ
బరిజనంబును నృపపుత్త్ర ♦ వారము నట,నీకు నించుచుఁ గన్నుల ♦ నోర నుండ.

తే. చిత్త్రరథకుమారిక మహా ♦ శ్వేతఁ జూచి
యనియె నిట్లని ప్రియసఖి! ♦ యలవిధాత
నీకు సమదుఃఖగను జేసి ♦ నిస్సుఖనుగఁ
జేయఁ డాయెను గా నన్నుఁ ♦ జెల్ల! యతఁడు. 176

తే. మచ్ఛిరం బిప్డు బ్రద్దలై ♦ మహిని బడ్డ
పగిది నున్నది నీకు నా ♦ వదన మిట్లు
కనఁబడఁగఁ జేసి ప్రియసఖి ♦ యనుచు నిన్ను
బలుకరించుచు సిగ్గును ♦ బడయఁ గనుమ. 177

తే. జీవితంబును మరణంబుఁ ♦ జెలియ! రెండు
దుఃఖమును గొల్పు నా కేమి ♦ తోఁచ దతివ!
యెవరి నడుగుదు నోపని నే ♦ నింక నాకు
సలుపు నుపదేశ మెవ్వఁడు ♦ సన్నమున. 178

చ. ఇది యిటు లాయె నిందు పయి ♦ నే మొనరింపఁగ నాకుఁ బోలునో
యది వచియించి ప్రోవు నను ♦ నాదృతి నే దొనరింప శ్రేయమేన్
గదుచు న దెద్దియో మదికిఁ ♦ గన్పడ దింతయు నాకు నంచుఁ ద
త్పదముల వ్రాల హంససుత ♦ పల్కెను నామెకు నిట్టు లూఱడన్. 179

చ. అడుగుట చెప్పుటన్ గలుగ ♦ దబ్జముఖీ సఖి! లాభ మేమిటన్
గడు నవిలంఘ్య మాప్రియుని ♦ గాఢసమాగమలోభ మేమి దాఁ
గడఁగును సల్పఁగా నదియె ♦ కార్యము తక్కునఁబొందు యోజనన్
బడఁతిరో! పుండరీకుగతిఁ ♦ బల్కెఁ గపింజలుఁ డంత తేటగాన్. 180

ఉ. అప్పటి కంతమాత్రన స♦మాశ్వసితన్ సఖి! నేను నింతయేన్
జెప్ప నలంతి నొందు నిఁకఁ ♦ జేయుదు వేమియు నీవు నమ్మఁగా
నొప్పినస్థాన మీయదియ ♦ యుగ్మలి! నీతొడపైన నున్నదే
తప్పిన సిద్ధి యొందు మదిఁ ♦ దార్కొనఁ జేయుము యిప్పు డేటికిన్. 181

ఉ. ఈతను వి ట్లపాయమును ♦ నేమియుఁ బొందకయుండు లోపలన్
బ్రీతి సపర్య సేఁత విడి ♦ పేర్మిని నొం డొనరింప నర్హ మే
యాతతమృచ్ఛిలేంధనమ ♦ యంబులు బాల! యదృశ్యదేవతా
ద్యోతితవిగ్రహంబు లిలఁ ♦ దోఁపవు భక్తిని నర్చితంబులై. 182

ఉ. మే లొడఁగూర్చు చుండఁగ న♦మేయమహాత్మత దృశ్యదేవుఁడై
గ్రాలు నృపాత్మజాకృతినిఁ ♦ గాంచిన చంద్రునిఁ జెప్ప నేటికిన్
జాలు నసేవితుండయి ప్ర♦సాద మొసంగఁడె నిత్య మీతఁ డో
బాలరో! యీశరీరమును ♦ భద్రముగా నిట నుంచి కొల్వుమా. 183

కాదంబరి చంద్రాపీడుని దేహమును రక్షించుట.

చ. అని వచియింపుచుండఁగనె ♦ యామదిరాత్మజ లేచి పల్కకే
మనుజవరేణ్యపుత్రకుని ♦ మంజులదేహ మఖేవనీయమున్
గాని చని లేవ నెత్తుకొని ♦ కోమలతన్ మదలేఖతోడుగా
నునిచె శిలాతలంబుపయి ♦ నుగ్రతరాతపశీతవాతముల్. 184

ఉ. వానయు నాదిగాఁ గలుగు ♦ బాధల వేవియు లేనిచోటునన్;
మాని సముజ్జ్వలాభరణ♦మంజులవేషములన్ శుభార్థమై
బూనుచు రత్నకంకణముఁ ♦ బొల్పుగ నొక్కకరంబునందుఁ దా
స్నానము చేసి శుభ్రవస♦నంబులఁ గట్టి ప్రశాంతవేషయై. 185

వ. మఱియు గాఢలగ్నం బైన తాంబూలరాగంబు పోవ నధరబింబంబు సారెసారెకున్ గడిగికొని పయిపయిం బడు బాష్పబిందునికరంబులఁ దుడిచికొనుచుఁ బుల్లుపుల్కనన్ జూచుచు నకృత్యవిచక్షణుండును బ్రతికూలస్వభావుండును నగు నాహతవిధి యచింతితంబును నవితర్కితంబును నబోధితంబును ననభ్యస్తంబును నయోగ్యంబును నపూర్వంబు నగు దాని దేనిం జేయించు దానినెల్లఁ జేయుచు సురతోపభోగంబునకుం దెచ్చిన సురభికుసుమధూపానులేపంబులచే దేవతోచితం బగుపూజావిధి నాచంద్రాపీడదేహంబుం బూజించుచు మేనుఁ దాల్చినశోకంబునా, నార్తిరూపయై తత్క్షణంబు రూపాంతరంబు నొందెనా గతాసువు నా శూన్యముఖియై చంద్రాపీడవదనంబ చూచుచు నసహ్యపీడోత్పీడిత హృదయ యయ్యు బాష్పపూరంబు నాఁగుచు దారుణశోకంబునకంటెను, మరణంబునకంటెను గడు నధికం బైనయవస్థ ననుభవించుచుఁ దచ్చంద్రాపీడచరణద్వయంబు తనయంకంబుపై నునిచికొని దూరాగమనాయాసంబు గలదయ్యు నాఁకొన్నదయ్యు స్నానపానభోజనంబుల మాని ముక్తాత్మ యైనరాజపుత్రలోకంబుతోడను స్వపరిజనంబుతోడ నిరాహారయై యాగంధర్వరాజపుత్రి యాదినం బంతయు నుపవాసంబుచేఁ గడపె. 186

సీ. గంభీరమేఘముల్ ♦ గప్పి యాకసమెల్ల విడువక పిడుగులు ♦ పడుచు నున్న
హృదయబంధములెల్ల ♦ నిట్టటు కంపింప నురుము లురుమ వాన♦కురియు చున్నఁ
జిత్తవృత్తి గలంగ ♦ మత్తశిఖండులు కేకారవంబులఁ ♦ గెరలు చున్నఁ
చెవుడుపట్టఁగ చెవుల్ ♦ చిల్లులు వోవంగఁ గుప్పలై కప్పలు ♦ గూయు చున్నఁ
తే. గనులు మిఱుమిట్లు గొలుపుచుఁ ♦ గ్రమ్మి దిశలఁ
బొదల మెఱుపులు మిడుగురు♦పురుగు లలమి
ద్రుమతలంబులఁ గ్రమ్మిన♦తమము నణఁప
భయద మగు రాత్రిఁ గడపె నా♦బాల యల్లె. 187

తే. వనితలకుఁ దోడఁబుట్టువై ♦ తనరువెఱవు
దూరముగఁ జేసి రాజకు♦మారచరణ
సరసిజంబుల విడువక ♦ సరకుఁ గొనక
తనతనూఖేదమును నింత ♦ తలఁగి నిద్ర. 188

తే. కూరుచుండితి యారాత్రిఁ • గువలయాక్షి
యొకనిమేషంబుగాఁ బుచ్చి • యుదయముననె
లేచి యున్మీలితంబయి • తోఁచుచున్న
యువనినాథతనూజ దే•హమును గాంచి. 189

తే. అల్లనల్లనఁ జేతితో • నంటిచూచి, పార్శ్వమున నున్న మదలేఖ•పజ్జఁ గాంచి
యనుఁగు నెచ్చెలిమదలేఖ! •కనుమి దేమి, ఎఱుఁగ నే నేమియును గత•మేమి చెపుము.

తే. రుచివశంబున నో లేక • ప్రచురమైన, నిర్వికారతనో గాని • నెలఁత! యెఱుఁగ
నీశరీరంబు తొంటియ•ట్లెసఁగు నిదిగొ, చూడు నీవును నాదృతిఁ•జూడ్కిఁ బఱచి.

వ. అనుటయు మదలేఖ యిట్లనియె. 192

చ. ప్రియసఖ! యేమి చూచుదది • పీడుట నాత్మను శాంత మయ్యెఁ జే
ష్టయు; కను మీశరీరమున • శాంతము గాదు మఱేమియు౯; గుశే
శయదళసన్నిభం బగుచు • సద్వదనంబు వెలుంగు నింతయే
నియు సిరి వీడదమ్మ రజ•నీపతిచాడ్పున నొప్పు నిప్పగా౯. 193

చ. చికురకలాప మెంతయును • జిక్కణమై చలదగ్రభాగమై
వికసితమై తనర్చు; నటు•వెల్లవెలుంగుశలాకలుం బలె౯
జకచకలాడుచున్నయవి • చానరొ! వీనిలలాటకాంతులు౯;
ముకుళితనీలవారిజముఁ • బోలి వెలింగెడి నేత్రయుగ్మము౯. 194

తే. పగడములఁ బోలి యొప్పైన • పరఁగు గోళ్లు
వేళ్లుఁ బాణిపదంబుల • వెలఁది! యట్లె
మోవియును లేఁతచిగురాకుఁ • బోలి వెలుఁగుఁ
దొంటియట్ల విశేషంబుఁ • గంటె వేమి. 195

తే. సహజలావణ్యభాసుర•సౌకుమార్య, విలసితావయవంబులు • వెలుఁగు నట్లె
సౌష్ఠవం బింత తలఁగక • సఖ! కపింజ, లోక్తిసత్యంబు శాపవి•ముక్తియయ్యె.

తే. అనుచుఁ దలఁచెద నని యది • యనుచు నుండ, నిర్భరానందపరవశ•నిశ్చలాంగి
యగుచు రాసుత ప్రియసఖు•హంసనుతకు, బద్ధజీవన్నృపాత్మజా•వళికిఁ జూపె

క. అలరాజపుత్రలోకము, కలితాద్భుతవికచనేత్ర•కంజాతంబై
యలరుచుఁ జంద్రాపీడాంఘ్రుల కెఱఁగి నతోత్తమాంగ•కోటీరంబై. 198

ఉ. చేతులు దోయిలించుకొని • చేర్చి ధరాస్థలి జానుయుగ్మము౯
భూతలనాథపుత్రి కనె • భూరిముదం బెసలార నీగతి౯

మాతరో! నీప్రభావ మిది • మమ్ముఁ దొఱంగి సుదూర మేగినా
త్మాతలనేత్రసూనుముఖ• సారస మీగతి నుండఁ గంటిమే. 199

ఉ. తొల్లిటిమాడ్కి మమ్ములను • దోరపుటాసట సాకతంబునన్
బెల్లుగఁ జూచు నంచు మదిఁ • బెంపు వహించెదు నాశ పాదముల్
ఫుల్లసరోజకాంతిఁ గడుఁ • బొల్చెడు ముండటి యట్ల ధాత్రిలోన్
జెల్లము మేమె పుణ్యులము • కృష్టమె యెవ్వనిచేని దెప్పుడేన్. 200

చ. ఇది కడువింత యశ్రుతము • నెవ్వనిచేతను నేనికిన్ లభిం
ప దిది యటంచుఁ జెప్ప నర• పాలతనూభవలోకః మంత నా
మదిరతనూజ లేచి కుసు•మంబులఁ దాఁ గొనివచ్చి స్నాతయై
యుదికినవస్త్రముల్ దొడిగి • యున్నతభక్తిఁ వదీయదేహమున్. 201

చ. వలగొని పూజసల్పి పరి• వారసఖీయుత యాచు సత్కృతిన్
సలిపి సమస్తరాజసుత•సంతతికిన్ భుజియింప నానతిన్
దెలిపి యొనర్చి స్నానమును • దీర్ప భుజిక్రియ వార లంతఁ దా
సలిపెను హంసపుత్రిక యొ•సంగినపండ్లను భుక్తి నామెతోన్. 202

వ. ఇట్లు మహాశ్వేత యొసంగినఫలంబులచే నామెతోడ సపరివారంబుగ నాకాదం
బరి యాహారవిధి నిర్వర్తించి మగుడ నేతెంచి చంద్రాపీడచరణసరసిజంబుల
నంకతలంబున వహించి యాదినమెల్లఁ గడపి మరునాఁడు చంద్రాపీడశరీరం బ
వినాశి యనుదృఢవిశ్వాసంబు గల్గ మదలేఖం గాంచి యిట్లనియె. 203

చ చెలియరో! శాపమోక్షణము • చేకుఱునంతకు నుండఁగా వలెన్
సలుపుచు నీశరీరపరి• చర్య నవశ్యము జీవితాశచేఁ
దలఁగక యుందఱు న్మనము • చంద్రికి నంబరఁ జిత్రమై కడున్
జెలఁగెడునీయు నంతకును • జెప్పుము నీ వట కేగి సర్వమున్. 204

చ. తలఁపరు నన్ను వేరుగను • దాల్పరు నాదగుదుఃఖమున్ మదిన్
గలఁగుచు నీయవస్థ నిటు • గాంచిన నన్ననరాక యుందురున్
సలిపిన నిట్లు వారు సకి!; • చాలను దుఃఖముఁ దాల్చ నేను వా
రలఁ గని; యేన్వ నేను నల• రాజసుతుం డు మృతుం డటంచునున్. 205

చ. బ్రతుకు నటంచు రాసుతుఁడు • పాయఁడు జీవిత మం చెఱింగి నే
గతవిచికిత్సనై తి నిఁకఁ • గాంచుచు నేనును సల్పుదాన నే
మితర మటంచు నేడ్చెదను • నింతిరో యంచు వచించి పోయి రా
యతివ! యటంచు వీడ్కొలుప • నాసతి వేగమె యేగి పచ్చెఁ దాన్. 206

తే వచ్చి ప్రియసఖ! నీదగు♦వాంఛితంబు
సఫల మయ్యెను వగవకు ♦ చాన! వినుము
జనకుఁ డగుచిత్రరథుఁడును ♦ జననియైన
మదిరయును నిన్నుఁ గౌఁగిటఁ ♦ గదియఁ జేర్చి. 207

తే. శిరము మూర్కొని యిట్లని ♦ చెప్పవలయు
మాదుపలుకుగ నని చెప్పి ♦ మగువ! యిట్లు
చెప్పి రని చెప్పఁ దొడఁగె నా♦చెలియ యిట్లు
వత్స! యిన్నాళ్లు నీవిట్లు ♦ వరునిఁ గూడ. 208

తే. చూడవలెనని మామది♦సుదతి! లేదు
వరుని వరియించితివి నీవె ♦ పరమహర్ష
మొదవె మాకిప్డు భాగ్యంబు ♦ పొదలెఁ బుత్రి!
రాజసామాన్యుఁడె యితండు ♦ రాజవదన !. 209

తే. లోకపాలకుఁ డగునుడు♦లోకనాథుఁ, డైనచంద్రుని యవతార♦మమ్మ యితఁడు
సంభవించెనునిదివిశే♦షంబౌకండు, మాతపముపండెఫలియించె♦మాదుకోర్కి.

చ. సుదతిరో! కొన్నినాళ్ల కిఁకఁ ♦ జూతుము శాపము తీఱి యల్లుతో
ముదమునఁ గూరుబొమ్మముల♦బ్రుంగిననీవదనారవిందమున్
గదురఁ బ్రహర్ష మం చనిరి ♦ కల్కిరో యం చన హృష్టచిత్తయై
మదిరతనూజ దేవుగతి ♦ మానక కొల్చుచునుండెఁ దత్తనున్. 211

వ అంత జలదసమయంబు సనుటయు. 212

సీ. జీవలోకంబులు ♦ చెఱసాల విడినట్లు ఘననిరోధవిముక్తిఁ ♦ గాంచి చెలఁగ
గ్రామాంతములు ఫల♦స్తోమభానతకలమసనకిడార♦కాంతి వెలిఁగఁ
గాననస్థలములు♦కాశనూనగుళుచ్ఛధవళంబు లయి దెసల్ ♦ దవిలి మెలఁగఁ
బ్రాసాదతలములు ♦ భామినీవిహారణభాసమానంబులై ♦ పరగ మిగుల

తే. పల్వలంబులు కహ్లార♦భాసురములు, యామినులు కైరవామోద♦హర్షదములు
యామినీవదనంబులు ♦ యామినీశ, కాంతిరుచిరంబులును నయి ♦ గ్రాలె జగతి.

వ. మఱియు. 214

సీ. సేఫాలికామోద♦సిద్ధిఁ గాంచి చెలంగె క్షణదాంతపవమాన♦శాబకములు
వికసితోత్పలరజో♦విస్ఫురత్సౌరభభాసమానము లయ్యె ♦ వాసరములు
సుకుమారసైకత♦శోభితతటసుఖోత్తరణంబు లయి గఱఁ ♦ దనరె నదులు
విగతజంబాలాశ్వ♦వికటఖురసహిష్ణువు లయి చెలఁగె మార్గ♦భూస్థలములు

తే. విగతపంకంబు లయి యొండె ♦ విశదము లయి
తనరి బాలతృణాచ్ఛాదితంబు లగుచు
నవనిపులరాకపోకల ♦ కనువు లగుచుఁ
దనరెఁ ద్రోవలు సుళువులై ♦ జనవరేణ్య!. 215

వ. అంత నొకనాఁడు. 216

తే. అధిపసుతుపాదములచెంత ♦ నధివసించి, యున్నకాదంబరీదేవి ♦ యొద్ద కేగు
దెంచె నా మేఘనాదుండు ♦ తీవ్రగతిని, నంజలిఘటించి యిట్లనె ♦ నతివినీతి.

చ. ఇటఁ జనుదెంచి రాకొమరుఁ ♦ డేగెను నెన్నియొ నాళ్ల టంచుఁ దా
మటమటఁ జెందుడెందమున ♦ నంపిరి వాచికహారులన్ సతీ!
యిటకుఁ బ్రభుండు ప్రభ్వియును ♦ నేమును వారికి నీకు శోకసం
ఘటన మొనర్పరా దనుచుఁ ♦ గంజదళాక్షిరో! సర్వవృత్తమున్. 218

చ. తెలిపి వచించినార మిటు ♦ దేవియుఁ జిత్రరథాత్మజాతయున్
దెలుపదు రాకుమారకుఁడు ♦ దేవరయున్ దెలుపం డిఁ కేమియున్
దెలిపినవార మంతయును ♦ దీవ్రగతిన్ జని మీరు రాజరా
ట్తిలకునకున్ విలాసవతి ♦ దేవికిఁ దెల్పుఁడు సర్వవృత్తమున్. 219

చ. అనుటయు వార లిట్లనిరి ♦ యంతఁ గ్రుధాన్వితు లౌచు నౌను మీ
రనినటు లుండనిం డిఁకఁ గ్ర ♦ మాగతహార్దము భక్తియున్ సదా
యనుసరణంబు కార్యగురు ♦ తాత్తకుతూహలమున్ నృపాత్మజున్
గన మము వేగిరించెడిని ♦ గాఢముగా వదలంగ రాదుగా. 220

తే. మీర లీయర్థమును విన్న ♦ వార లైన, నటేఁగి మీవల్ల మగుడ మే ♦ మేగుటరయఁ
దగును గనులారఁ జూచిన ♦ మగిలుమీర, లట్టిభాగ్యంబు మాకును ♦ నమరరాదొ.

సీ. చిరకాల మేమును ♦ క్షితిపసూనుని గొల్చి పూతదేహులమయి ♦ పొదలినాము
మమ్మును యువరాజు ♦ మన్నించి దర్శన మొసఁగి ప్రసాదంబు ♦ నొసఁగె నెసఁగఁ
గలిగె నే మిప్పుడు ♦ గడవరానిదొసంగు తత్పదాంభోజాత ♦ దర్శనంబు
వందనానుగ్రహ ♦ బృందంబుఁ దలఁగించి చనుఁడు మీ రని చెప్పఁ ♦ జతురులార!

తే. వారలమె మేము యువరాజ ♦ పాదలగ్న
పాంసులము మమ్ము దేవికిఁ ♦ బార్థివేంద్ర
తనయునకుఁ దెల్పి తత్పాద ♦ వినతి మాదు
గమనఖేదంబు సఫలంబు ♦ గాసలుపుఁడు. 222

తే. ఇంతదూరంబు చనుదెంచి ♦ యేము రాజ
తనయుదేహంబు గనకయె ♦ మనుజవరుని

సన్నిధికిఁ బోయి యేమంచు ♦ క్ష్మాతలేంద్రుఁ
డడుగ నేమంచు మేమందు ♦ మయ్య చెపుమ 223

తే. అనిరి మాచిత్తమంచని ♦ మనవి చేసి, యూరకుండెను నాతఁడా ♦ యువిదయపుడె
యూఱడింపంగ రానట్టి ♦ యురుతరార్తి, సంభవించెను శ్వశురవం ♦ శమున కనుచు.

తే. తలఁచి నీ రాజునో యనఁ ♦ దగుణిలోన, సంచితములైన యశ్రులఁ ♦ జంచలములు
నాకులములైన కన్నుల ♦ నాను చట్టె, గద్గదికఁ గూరి కంఠంబు ♦ కదలకున్న.

తే. చాలసేపున కెట్టులో ♦ సంబడించు,కొనుచుఁ గంఠంబు నిట్లనె ♦ వనజనేత్ర
వారు చనకుంటయుక్తంబు ♦ వారు దేవుఁ,గనక యేపోయి యేమంచు ♦ ననుదురచట.

వ మఱియు 227

క. భావింప జగదతీతం, బీవృత్తాంతంబు పుట్ట ♦ దెవరికిఁ గన్నన్
వే విశ్వాసం బిట్టిది, యీవిషయము చూడకున్న ♦ నేల వచింపన్. 228

ఉ. కైతవహార్దపల్లవముఁ ♦ గన్పడఁ జేయుచు జీవితంబుపై
భ్రాంతిఁ దొలంగకే మనము ♦ పార్థివపుత్రునిఁ జూచుచుండఁగా
నాతతజీవితాశ విడి ♦ యుద్భవుఁ బ్రేముడిఁ జూపుభృత్యులా
యాతనిఁ జూడరా దనఁగ ♦ నర్హులు? రమ్మను వేగ వారినిన్. 229

చ. కనుదురుగాక రాసుతునిఁ ♦ గాంక్షలు తీఱఁగ నెల్లవారు లో
చనముల మార్గభేదమును ♦ సల్పి ఫలాన్వితముల్ గఁ బిమ్మటన్
జనుదురుగాక యం చనుడు ♦ సారసలోచన మేఘనాదుఁడున్
గొని చనుదేర బాష్పములఁ ♦ గూరుచు నంగములై దిటన్ ధరన్. 230

చ. కవుఁగిటఁ జేర్చి వారు క్షితి ♦ కాంతసుతాంఘ్రిసరోజయుగ్మమున్
దవిలి నమస్కరించి గదు ♦ దవ్వననుండియె నిర్నిమేషులై
ప్రవిహతవృత్తులై గనుచు ♦ వారక నిల్వ ననన్యదృష్టియై
ధవళసరోజనేత్ర కని ♦ తద్దయు నేవును వారికిట్లనెన్. 231

క. ప్రేమయు సద్భావంబును, స్థేమంబై సంప్రదాయ ♦ సిద్ధం బగుచున్
ధామ మగువారి కెల్లను, భూమిని లోకాతిశయము ♦ పొలుచు సులభమై. 232

క. నిరవధిక మగుచు దుఃఖమె, పరిణామము గాఁగఁ బరఁగు ♦ పరమవ్యథయే
మరణ మన వెఱచువారికిఁ, గరము శుగావేగకరము ♦ గాక మఱొండే. 233

క. తలఁప సుఖోదర్కంబై, చెలఁగెడు దుఃఖంబు ప్రోల ♦ సిద్ధం బగుచున్
మెలఁగు సుఖాశను మదిలో,వలఁ జొరదు నిజంబు ♦ పెక్కుపల్కు లిఁకేలా.

క. కావున నీవృత్తాంతం, బీవిధమున నుండనిందు ♦ నించుక వగకున్

దా వాదవమి యేగాడికిఁ, దా వాదవదువిస్మయంబు ♦ తారొక్కనుటకున్.

క. పరిబోధంబున నేమగుఁ, బరికింపఁగ నెందు మనుజ♦వారములోనన్
బరికింపని యీవార్తను, బరికించితి రెల్లమీరు ♦ ప్రత్యక్షముగన్. 236

క. కనుఁగొనినారలు మీరలు, మునుపటియు ట్లక్షతాఁగు ♦ భూపతిసుతుమో
మును; కనక దేవు సంభావనయును లే దదియుఁ గల్గె ♦ వచ్చినమీకున్. 237

క. చనుఁ డిపుడ యిచటివార్తల, విన వేగిరపడెడుధరణి♦విభుచెంతకుఁ గ
న్గొనియును బ్రత్యక్షమ్ముగఁ, దను పుపరత మయ్యెఁ జెపక ♦ తద్ద తనపుటన్.

క. తెలుపకుఁ; డచ్ఛేదం బను, జలజాకరతీరమందు ♦ సపరిజనుండై
మెలఁగును గంటిమి మే మని, తెలుపంగావలయు మీరు ♦ దేపరతోడన్.

క. కలుగు నవశ్యము మరణం, బిలఁ బ్రాణుల కెల్ల దీని ♦ నెల్లజనంబుల్
తలఁతురు నిజమని; యసువులఁ, దలఁగియు మేనుంట చెపక♦తథ్య మనుదు రే.

క. తెలిసిన దీనిని దవ్వునఁ, జెలఁగెడుగురుజనుల మరణ♦సింధువునఁ బడన్
గొలిపినయట్లవు దీనను, గలుగదు లాభం బొకండు ♦ క్రౌర్యము దక్కన్.

తే. ప్రాణనాథుండు జీవంబు ♦ పడసె నేని
యద్భుతావహ మైనయీ♦యర్థమెల్ల
గురుజనంబుల కెల్లను ♦ బరఁగఁ దెలియఁ
దనకుఁ దాఁ జెప్పనేటికిఁ ♦ దగు నటంచు. 242

వ. అనుటయు వార లిట్లనిరి. 243

చ. మనవి యొనర్తు మే మనుచు ♦ మానిని! యీవిషయంబు మే మటన్
జనమిసిఁ జెప్పుమిన్ దెలియ ♦ సంభవ ముండదు రెంట రెండునున్
బొనరవు మాదుహస్తమున, ♦ భూధవపుత్ర తదీయమిత్రవా
ర్తను విన కెంతయు న్వగచు ♦ ధాత్రివరుండు తదీయదేవియున్. 244

ఉ. ఆతనిమంత్రియున్ బనుప ♦ నాతురతన్ జనుదెంచినట్టిమే
మీతను పూని యచ్చటకు ♦ నేగక యుంట ఘటిల్లునే తనూ
జాతునుదంతమున్ వినఁగఁ ♦ జయ్యన నుర్వీళులశారుచుండు నా
త్మాతలనాథుఁ డత్సతిని ♦ మంత్రి వ్యథాప్లుతనేత్రవక్త్రులన్. 245

చ. కనుఁగొని నిర్వికారతను ♦ గాంచినమోములఁ దాల్చియుండఁగా
వను వగు నొక్క మా కనుఁడు ♦ నా నిది యట్టుల యంచు మేఘనా
దుని గని యిట్లనెన్ వికచ♦తోయజలోచన మేఘనాద! యీ
చనవు గలట్టివారి కిది ♦ శక్యము గా దని నే నెఱుంగుదున్. 246

క. ఐనను గురుజనములు మది, నూనెడువగఁ జూచి గలుగ ♦ దొం దని నేనే
పూని వచించితి నిట్లని, పూనుమ దుఃఖంబు నొందు ♦ భూరితరముగన్. 247

క. ఇది యేమి! మహాశనినమ, మదిః యిదియనునుండుఁగాక♦యురుగఁగవలయున్
గదురఁగ నమ్మిక నమ్మిక, కుదిరిన వాఁ డొకఁడు వీరిఁ ♦ గూడి యచటకున్.

వ. ఇచటివార్తలనెల్లఁ బ్రత్యక్షముగఁ గన్నవానిని నొకని వీరితోడం బనుపు మని యాజ్ఞాపించుటయు మేఘనాదుఁ డిట్లనియె. 249

ఉ. దేవిరో! రాజలోకమును ♦ దెల్పఁగ నేమిటి కీసమస్త మా
సేవకవర్గమున్ దృఢముఁ ♦ జేసి మనంబున నిశ్చయించె నీ
దేవరపాదముల్ విడి ప్రతీపముగా మనలోన నొక్కఁడేన్
బోవఁగ రా దటంచు ఫల♦మూలములన్ భుజియించుచున్ గడున్. 250

ఉ. ఆపదలందు సంపదల ♦ నారసి కొల్తురు స్వామిమానులై
చూపరు గర్వ మెన్నఁడును ♦ జూప రనాదృతి ధిక్కరించినన్
బ్రాపితు లయ్యు నున్నతిని ♦ బాయరు నమ్రత నించు కేనియున్
తాపము నొంద రే మనినఁ ♦ దాల్మి వహింతురు మారు పల్కరున్. 251

సీ. చెప్పక యున్నను ♦ జేయుదు రెంతయుఁ జేసినదానిని ♦ జెప్పుకొనరు
నడిగిన హితము ప్రియంబును నగుదాని మనవి యొనర్తురు ♦ మాన కొందు
సల్పి శౌర్యము తమ్ము ♦ శ్లాఘించుకొన రెవ్వ శ్లాఘించినను సిగ్గు♦చాలఁగంద్రు
పోరు కల్గినయెడ ♦ పోదురు ముందర కేతనంబులమాడ్కిఁ ♦ గెరలి మిగుల

తే. నిచ్చునప్పుడు వెన్కకు♦నేగుదెంత్రు, ధనముకంటెను స్నేహమే♦ఘన మటంద్రు
సేవకులు వీరు మరణంబు♦జీవితంబు,కంటె శ్రేయంబురాజాజ్ఞఁ♦గడవమంద్రు.

తే. సాధములు నుంటకంటెను ♦ స్వామిపాద
మూలమున నుంద్రు సుఖముగ ♦ ముదిత! వీరు
స్వామిపాదాంబురుహపరి♦చర్యయందె
యాశ వీరికి మఱి దేన ♦ నలర దెపుడు. 253

క. నరపతివదనముఁ గనుటను, బరగును నాసక్తి నృపుని ♦ వరగుణమణులన్
గరము నొనియాడ వీరికిఁ, బరగును వాచాలత మఱి ♦ పరగ ద దెవ్వన్. 254

సీ. పరులదోషంబులు ♦ పరికించుచున్నను నంధులవిధమున ♦ నలరువార
లన్యాపవాదంబు ♦ లాలించుచున్నను బధిరులవిధమునఁ ♦ బరఁగువారు
వాఙ్మూలయ్యును దాము♦పరదూషణంబుల మూఁగవారలయట్లు♦మొనయువార
లెఱిఁగినవా రయ్యు ♦ నిసుఁడు చెప్పెడువాని వినలేని జడులట్లు ♦ వినెడువార

ఆ. లవికలాంఘ్రిపాణు ♦ లగుచుఁ గుంటులువోలె, షండులట్లు లేమి ♦ నల్పుఁజాల
రాత్మ యున్నను నవశాఖలేంద్రియులును, వీరు భృత్యు లువిద! ♦ వేయు నేల.

క. ప్రతిబింబంబులపోలిక, క్షితిపతిహృద్దర్పణములఁ ♦ జెలఁగుదు రెపుడున్
బతి వీడకుంటఁ గృపణులు, సతి! యీసేవకులు మిగుల ♦ సజ్జను లరయన్.

క. దేవివి నీ వెల్లరకును, దేవరస్థానంబునందుఁ ♦ దేజరిలుదువున్
దేవీ! యాజ్ఞాపించినఁ, బోవము మే మనెడువారు ♦ పొలఁతీ! గలరే. 257

ఆ. అనుచు మేఘనాదుఁ ♦ డంతఁ ద్వరితకుఁడన్, సేవకునిఁ గుమార♦సేవకునిని
నొకని వారివెంట ♦ నొనరంగఁ బంపెను, దాల్చి దేవియాజ్ఞ ♦ తలను భక్తి.

వ. అంత నక్కడ విలాసవతి వార్తాహరు లరిగి బహుదినములు చనుటయు నచటి వార్త లేమియుం దెలియరామిని మిగుల వగలన్ గుందుచుఁ దనయుండు వయస్యునితోడ వేగరా మ్రొక్కుకొన్న మ్రొక్కుబడిన్ జెల్లింప నవంతీనామ నగరదేవతాయతనంబునకు నరుగుదెంచి యందుఁ బూజావిధుల సలుపుచుండఁ బరిజనంబులు ససంభ్రమంబునఁ బరుగులిడుచు వచ్చి దేవి! నీయదియదృష్టము. అవంతిమాతృకలు ప్రసన్నలైరి. యువరాజవృత్తాంతము నెఱింగిరా ననిపిన వార్తాహరు లిదె యరుదెంచిరి. అని చెప్పుటయు నానందబాష్పలలితంబై యతి దీర్ఘం బయినచూడ్కి జలార్ద్రేందీవరస్రజంబుచేఁ బూజించునదివోలెఁ బెద్ద యుం ప్రొద్దు భ్రష్టబాలపోతం బగుమృగాంగనవిధంబున దిక్కులు చూచుచు నూర్పులుపుచ్చుచుఁ బ్రాకృతయట్టు లార్తిం గనుచు నావిలాసవతి యిట్లనియె.

ఉ. ఎవ్వఁడు నాపయిం గురిసె ♦ నీసుధ నిప్పుడు వాక్ఛలంబుచే
నెవ్వని కుద్భవించె దయ ♦ యీజనులందు నెవండు చూచెనో
యెవ్విధి నున్నవాఁ డనిరి ♦ యెచ్చట నుండెడు నెంతవవ్వనన్
నవ్వులో వాస్తవంబో మఱి ♦ నాసుతుసేమము చెప్పిరే తగన్. 260

ఆ. అనుచు నడుగుచుండ ♦ నంతలో వచ్చిరి
యటకు నాయుదంత ♦ హారులు తాము
తమ్ముఁ గాంచి జనులు ♦ ధాత్రీశభృత్యులు
తదితరులు నవంతి ♦ తలము వారు. 261

తే. గుంపులై పరువువారుచుఁ ♦ గూడరాఁగ, రాకుమారకు నెంతదూ♦రంబునందు
విడిచివచ్చితి రిప్పు డా♦క్కడను నుండు, వేగి కనుఁగొంటి రాతని ♦ నెచటమీరు.

సీ. వాహనమాత్రుఁడై ♦ పరగు నాశం డెటఁ గడపెను సీతువుఁ ♦ గష్టతరముఁ
దలఁతుము త్రోవనే ♦ తోలఁగ సీతు నటంచు నెఱుఁగును ద్వరితకుం ♦ డెల్లదీనిఁ

తెలిపిన నే మగు ♦ దీనిఁ దెల్పెఁడు దాని వినసుతుం డెవనికై ♦యింతశ్రమము
పడ నాతని నమాత్యు♦పట్టివై శంపాయనుని గాంచె నే వానిఁ♦ గొనుచు నిపుడు
తే వచ్చుచున్నాఁడె చేరిరా ♦ పత్త్రలేఖ
మేఘనాదుండు యువరాజు♦మేలుగాను
వర్ధమానుండు మీ రిట ♦ వచ్చునపుడు
చెప్పి పంపఁడె యేమియుఁ ♦ జిత్ర మగును. 263

ఉ సాదులలోన నాద్యుఁడయి ♦ సన్నుతిఁ గన్న మదీయమాతులుం
డాదృతి మాకుఁ జెప్పు మని ♦ యంపఁడె యాపృథువర్మఁ డేమియున్
సాదులు క్లేశముల్ గనిరి ♦ చాల నటంచుఁ దలంతు మాత్మలోన్
మోదమె యశ్వసేనకు న♦మోఘబలాధిపశాలికిన్ గడున్. 264

సీ. పంపఁడు మాతండ్రి ♦ భవదీయకరమునఁ జిహ్న మేమియుమాకుఁ♦జిత్ర మాను
యువరాజగృహమున♦నుండఁ గంటిరె మీరు భరతసేనుని నాదు♦భ్రాతృవరుని
సేమమే మాభద్ర♦సేనునకు ననీకపతికి సపరివార♦భారునకును
గొల్చునే యువరాజుఁ ♦ గూర్మి వినీలిని మత్సుతుం డైనకు♦మారవర్మఁ
తే. డచట సేమని యనుకొందు ♦ రలబలాధి
కృతుని నావంతిసేనుని ♦ కృత్యములను
గూర్చి యువరాజు వానిపైఁ ♦ గుపితుఁ డయ్యె
నగ్రమానార్హమై యతం ♦ డడల లేదొ 265

క. క్షితిపతిగృహమున నెవ్వం, డతిమాత్రము వర్ధమానుఁ ♦ డగుచుఁ బ్రసాద
వ్యతికరమున మాన్యతఁగని, యతిముదమున మెలఁగుచుండు♦నశ్రాంతంబున్.

క ఏవాఁ డిన్నిదినంబులు, సేవించి గడించె నేమి ♦ చెపుమ యనేకుల్
భూవిభున కభినవప్రియ, సేవకులై రన్యమెల్లఁ ♦ జెప్పకు మింకన్. 267

సీ. వీక్షించె నెవ్వాఁడు ♦ వీరసేనునిసర్వసేనాత్మజుని వాని♦క్షేమవార్త
వచియించుమా న తండు ♦ వాఁడు తండ్రి గతింప దీనుఁడై దేశముల్♦దిరుగసాగెఁ
దద్దుఃఖమున వాని♦తల్లి యుపాసంబుఁ జేయుచున్నది ప్రియు♦చింత వీడి
బ్రతుకునే యది సూను♦గతి యిట్లుగాఁ బతి దివికేగఁ దద్దుఃఖ ♦ దీర్ణయగుచు
తే. ననుచు నివి యాదిగాఁగల్గు ♦ నన్యములను
నడుగ జనములు ప్రతిపద♦మందు వెంటఁ
బడుచు వారికి బదు లేమి ♦ పలుక కురక
యధ్వఖేదంబుచేతఁ దూఁ♦గాడ మేను. 268

ఉ. కోపముతోడిచూడ్కులు వికూణికపై నటియింపఁ బాదముల్
తోఁపఁ బ్రయాస మీడ్చుచును ♦ దొట్రిలుచుం మలినాంబరమ్ములం
జూపుచు దైన్యముం దనువు ♦ స్రుక్కఁగ మూర్ధజపాళముల్ రజో
వ్యాపన మంది ధూసరము♦లై మలినాంగకముల్ చెలంగఁగాం. 269

చ. శ్రమనిలయంబులా యలఘు♦సర్వవిషాదనిగుంఫనంబులా
యమితపథశ్రమధ్వజము♦లా పరదేశనివాసభూములా
ప్రమథనదార్క్యసస్యపద♦పంకరుహాక్రమణంబులా యనం
గ ముదముఁ దక్కి వచ్చు కృశ♦గాత్రుల లేఖకవారులం గనెం. 270

మ. కని యామాతృగృహాంగణమ్మున నె యాం♦కంజాక్షి నిల్చుండి వా
రినిఁ దోడ్తేరఁగఁ బంచె నంతట విత♦ర్కింపంగ రానట్టియా
వనితాదర్శనమాత్రనం ద్విగుణమై ♦ వర్షింప బాష్పాంబువుల్
గనుచుం దుఃఖము శూన్యదేహు లగుచుం ♦ గష్టాత్ములో నాఁ దగం. 271

మ. పరిముక్తాత్ములొ నాఁగ నింద్రియములం ♦ భావింప నిర్జీవులో
పరిముష్టాత్ములొ నాఁగ దీను లగుచుం ♦ వక్త్రంబులం వాంచి ముం
థరయానంబుల వచ్చు లేఖవహులం ♦ దా దవ్వునం గాంచి యా
ధరణీశాంగన బాష్పముల్ దొరఁగ నే♦త్రద్వంద్వమం దంధమై. 272

చ. ఎదురుగఁ బోయి తొట్రిలఁగ ♦ నెంతయు భీతిని బాదపద్మముల్
గదుర గళంబు గద్గదిక ♦ గట్టిగ మ్రొక్కెడువారి కిట్లనెం
మది ననుమానముం గనక ♦ మత్సుతువార్తను వేగ చెప్పుఁడీ
యదరెడు నామనంబు గడు ♦ నందెడు సందియ మొందు తోఁచెడుం. 273

చ కనుఁగొనినారొ నాసుతునిఁ ♦ గాంచితి రెచ్చట మీరు చెప్పుఁడీ
యనుటయుఁ గాల్వలై దొరఁగు♦నశ్రుజలంబుల దుడ్చికొంచు మ్రొ
క్కనుమిష వాంచి మస్తమును ♦ నానన మెత్తి యొకింత నెట్టెటో
మనవి యొనర్చి రిట్లనుచు ♦ మన్యువు గూరుచు వార లక్కటా. 274

క. కనుఁగొంటిమి యచ్ఛోదం, బనుసరసీతీరమునను ♦ నధిపతిసుతునిం
మనవి యొనర్పను శేషిం,చిన పల్లను త్వరితకుండు ♦ చిత్తము దేవి. 275

క. అనుటయు బాష్పాననయై, జనపతిసతి యనియె నిట్లు ♦ చాలు నితం డే
మని వచియించును నాం డిఁక, మనవి యొనర్చితిరి మీరె♦మానక యొందుం.

ఉ. దూరమునుండియే ముదము ♦ దూరముగాఁ జనినట్టిరాక చేఁ
గూరెడునశ్రుపూరముల ♦ గ్రుక్కుచుఁ దూలెడుతాపకాత్ములం

భారము లేనిదుఃఖమునఁ ♦ బాలినమోహముల లేఖమాలికా
భారము లేనిమస్తములఁ ♦ బల్కుటి రంత వచింతు రే మిఁకన్. 277

## విలాసవతీవిలాపము.

సీ. జగదేకచంద్ర! హా ♦ చంద్రశీతలశీల! చంద్రాస్య! చంద్రాభ!♦చారుసుగుణ!
వత్స! చంద్రాపీడ! ♦ వచ్చెను నీ కేమి యేల రా వింకను ♦ నచట నుండు
వచ్చినాఁడవో మఱి ♦ వచ్చెదవో తండ్రి! భూలోచనానంద♦భూత! మదన!
కోపంబునను గాదు ♦ గూరి పెన్వగ నిట్లు పల్కెడఁ దప్పుగాఁ ♦ బట్ట కయ్య
తే. యమ్మ! యాలస్య మింతయు ♦ నాచరింపఁ
బోయివచ్చెద నని నాదు♦మ్రోలఁ బలికి
పోయి పోయినపోకగాఁ ♦ బుత్ర యెందొ
మసల నర్హమె నీ కహా ♦ మాన్యచరిత!. 278

చ. చనుటయు నీవు తత్క్షణమె ♦ శంక జనించెను నీహతాత్మకున్
గనితిని దాన నీముఖముఁ ♦ గాంచను దుర్లభ మద్ది యింక నా
కనుచును వత్స! యాగతియె ♦ యాయెను నాగతి యింక నేమి నే
నొనరుచుదానఁ బోయితివె ♦ యున్నటులుండి బలాత్కృతిన్ సుతా!. 279

చ. కలుగున నీదుదోవ మిటఁ ♦ గాంచ నపుణ్యను మందభాగ్యనై
చెలఁగెడినాదుదుష్కృతము♦ చేష్ట లి వన్నియు నక్కటా భువిన్
గలుగున నన్నువంటియఘ♦కారిణి పుణ్యవిహీనయున్ గటా
కలిగితి వీవా కండవె య♦ఖండమునన్ గొనిపోయి నల్వ నిన్. 280

చ. హతవిధి మోసపుచ్చె నను ♦ నక్కట దూరమునందునున్ననీ
యతిమృదులాంఘ్రియుగ్మలం బడుదు ♦ నయ్య నివర్తిలు మొక్కసారియేన్
సుత! నను నమ్మ యంచు మదిఁ ♦ జొక్కఁగఁ బొల్చెదునీముఖాబ్జమున్
గుతుకమునన్ గనంగఁ దమిఁ ♦ గోరెదు నామన మన్న! యక్కటా. 281

సీ. జన్మ మాదిగ నీదు♦శైశవక్రీడలఁ దలఁచి చింతిలుదు నా♦తండ్రి! వత్స!
యౌవనాభోగంబు ♦ నలరించు నిప్పటి నీరూపుసిరిఁ గని ♦ నెగులుదు నోహో
దీవ్యదవష్టంభ♦ధీరమై రాఁబోవుప్రాభవం బారసి ♦ పనవుదు నోహో
దేనిఁ గన్గొని పరి♦దేవనం బొనరింతు నే నెఱుంగను దండ్రి! ♦ యే మొనర్తు
తే. నిట్లు విలపించున న్గని ♦ హృదయగతుఁడ
వీవు సుత! దుర్లభక! నన్ను ♦ నెడసి తాను

బ్రతుకును విలాసవతి యని ♦ స్వాంతమందుఁ
దలఁప కోయన్న! బ్రతుకదు ♦ తథ్య మిలను. 282

చ. బ్రతికియు నేను నే ననుచు ♦ భద్రక! చూపుదు మోము నీ కిఁకన్
గతము నెఱుంగ నీపయిని ♦ గల్గిన ప్రీతినో నీదురూపునన్
సత మయియున్న నమ్మికనో ♦ సారసనేత్రలతోడఁ బుట్టువై
యుత మగు ముగ్ధభావమున ♦ నో మఱి దేననో పుత్ర! యింకనున్. 83

ఉ. నామది నమ్మకున్నయది ♦ నాయన! నీయశుభంబు; దాననే
యీమది వేయివ్రక్కలయి ♦ యింతకు వ్రీలదు; చాలభీతనై
యీమనుజుండు తెచ్చిన త్వ♦దీయకఠోరవిపత్ప్రవృత్తి నే
నేమనుచున్ వచింపఁగను ♦ నిచ్చ యొనర్పక యుండుదున్ సుతా!. 284

చ. వినను నవర్ణ్యమున్ వినక ♦ వీడుట ప్రాణము మేలటంచు నెం
తును మదిఁ; బుత్రుపైఁ గలుగు ♦ తోరపుఁ బ్రేమ ననర్హమైన యీ
ఘనతరవిక్లబత్వమునఁ ♦ గాఁగల దెయ్యది సిగ్గుచేటు కా
కనినఁ దనూజ! రోదనము ♦ నందక యూరక యుండు నే నిదే. 285

చ. అనుచును మూర్ఛఁ గాంచెఁ జెలు ♦ లంతికవర్తిను లట్టి పట్టఁగాఁ
దనువును; నంతఁ బర్విడుచుఁ ♦ దత్పరిచారిక లెల్ల వేగమే
చని వచియించి రంతయును ♦ క్ష్మాపతి కాతఁడు మందరాహతిన్
వననిధియట్లు క్షుబ్ధుఁడయి ♦ వచ్చెను దానును మంత్రి యప్పుడే. 286

వ. ఇట్లు తారాపీడుండు ససంభ్రమసముత్థితుండయి యాజామసేవకై యరుదెంచిన యతిజవం బగుమదకరేణుక నెక్కి సమధికవేగంబున దప్పికొన్నవాని మాడ్కి రాజమార్గంబుఁ బట్టి ముందుఁ జనుచు నేమి దేమి దని హాహాకారంబు లొనరించుచు నలుదెసలన్ బరుగువారివచ్చుజనంబు లనుగమింప శుకనాసద్వితీయుండై యుజ్జయినీపురంబు వెడలి యవంతీమాతృకగృహంబుకడకుం జనుదెంచి యేనుఁగున్ డిగి బాష్పాకులనేత్రులై పరిజనంబులు మలయజజలంబులఁ జల్లుచున్, గదళీదళంబుల వీచుచు, జలార్ద్రపాణిపల్లవంబుల వహించుచు నిట్లు పెక్కుభంగులఁ బ్రబోధింప నెట్టకేలకు ఘర్మకాలకమలినియట్లు లర్ధోన్మీలితలోచనయుగళ యగువిలాసవతిం గాంచి తత్క్షణప్రవృత్తంబయిన బాష్పవారిపూరంబున నవశిష్టమూర్ఛ నపనయింప నాఁ దడుపుచుఁ బ్రక్కనఁ గూర్చుండి స్పర్శామృతంబు వర్షించు నిజకోమలకరంబున ఫాలభాగంబునఁ దడ

వుచు, నేత్రంబులఁ దుడుచుచుఁ, గపోలంబులఁ బుడుకుచు వక్షంబు నిమురుచు
భుజాలతలఁ స్పృశించుచుఁ బ్రవృద్ధబాష్పగద్గదకంఠుఁడయి మెల్లననిట్లనియె.

-తారాపీడునివిలాపము.-

ఉ. నిక్కువ మేని యేదొ యొక ♦ నెవ్వ తనూజున కింకఁ బ్రాణముల్
దక్కవ యేల వానికయి ♦ దాలిమి తూలఁగ నేడ్చె యూరకే
కక్కస మందఁ జేసెదవు ♦ కామిని యాత్మను బ్రాణికోటికిన్
దక్కునె యిట్టి విక్లబత ♦ ధాత్రిని సాజము యెల్లవారికిన్. 288

ఉ. చేసితి మింతెపుణ్యమును ♦ జేయము హెచ్చుగ నింతకంటెనున్
గాసిల నేల పాత్రులము ♦ గాము సుఖాతిశయంబుఁ గాంచఁగాఁ
జేసిన హృద్విదారణము ♦ చెందఁగ లేమ నిజేచ్ఛనేమియున్
జేసినఁగాక దైవ మనఁ ♦ జేడియ! యుండు నొకానొకం డిలన్ 289

క. వానికి నేది రుచించునొ, దానిని నొనరించు నతఁడు ♦ తప్పక వాఁడె
వ్యాసికిఁ గాఁ డాయత్తుఁడు, మానిని! పరతంత్ర మెల్ల ♦ మహిఁ బరికింపన్.

వ. ఇట్లు సర్వం బతనియధీనంబయి యుండ మన మేమి యొనర్పఁ గలవారము.

సీ. అతిదుర్లభం బగు ♦ నాత్మజుజన్మోత్సవంబు గ్రొత్తి మతి ♦ వైభవమున
సంకతలంబున ♦ నధిరోహితునిఁ జేసి కంటిమి సుతుమోముఁ ♦ గాంతు తీఱ
వెలికిలఁగాఁ బండి ♦ కిలకిలనగువాని ముద్దాడి ముద్దాడి ♦ మురిసినాము
ధూళిఁ దోగాడుచు ♦ ధూసరితాంగుని నెత్తి కౌఁగిటఁ గ్రుచ్చి ♦ యెనసినాము
తే. చెవులు తనియంగ వినినాము ♦ చిన్ననాఁటి
మధురమృదుభాషణంబుల ♦ మమత తీఱ
సరసకేళీవినోదంబు ♦ సల్పుసుతుని
బాలచాటూక్తులను గని ♦ బ్రమసినాము. 292

వ. మఱియు. 293

సీ. సకలవిద్యల నేర్చి ♦ సద్గుణుం డన విని యాత్మఁ బ్రమోదము ♦ నందినార
మెలప్రాయమున నుండ ♦ లలితామనుజరూపశోభనశక్తియుఁ ♦ జూచినాము
యువరాజపట్టంబు ♦ నొంది చెలంగఁగ మహాళిమూర్కొని మేను ♦ మఱచినాము
సకలదిక్కుల గెల్చి ♦ జయరమాశ్లిష్టుఁడై ప్రణమిల్లఁ గౌఁగిటఁ ♦ బట్టినార
తే. మన్నియును గాంచితిమి గాని ♦ యాత్మజుండు
భార్యతోఁ గూడ సంసార ♦ భారమెల్ల

నిర్వహింపంగ వానిపై ♦ నిలిపి రాజ్య
మురుగ మయితిమి తపమున ♦ కటవి కకట. 294

ఆ. సకలవాంఛితములు ♦ సమకూరు టంతయుఁ, బూర్వజన్మసుకృత♦పుణ్యరాశి
ఫలముగాక యరక ♦ పడయంగ వచ్చునే, కొఱఁతపడక యుండఁ ♦ గోర్కు లెల్ల.

చ. కలిగెను నేమిపుత్త్రునకుఁ ♦ గామి యొకం డిపు డక్కటా యిఁకన్
దెలియఁగరాదు స్పష్టముగఁ ♦ దెల్పరు నెవ్వరు నింతవట్టు నేఁ
దెలిసితి వచ్చె లేఖలను ♦ దెచ్చెడువారలతోడ నెవ్వఁడో
తెలియును వాఁడు సర్వమును ♦ దేటగ నంచు జనంబు లాడఁగన్. 296

క. త్వరితకుఁడు వాఁడు తనయుని, పరిచారకుఁ డంచు వారు ♦ పల్కినయటు లా
నరసితివె వాని లేదివు, డరయుద మింతయును వాని ♦ నడిగినఁ జెప్పున్.

ఆ. అవలఁ జావొ బ్రతుకొ ♦ యంగీకరింతము, ఇప్పు డేల యంచు ♦ నిసుఁడు పల్క
ద్వారపాలకుండు ♦ త్వరితకుఁ బరిజనాం,తరితుఁ బిలిచి చూపె ♦ నరవరునకు.

వ. అంతఁ ద్వరితకుండు దూరంబునం దుండియె క్షితితలనివేశితోత్తమాంగుండై రాజునకునమస్కరించినిలుచుటయునరవరుండు సుతునిపయింగలనిరవధికస్నేహంబున రమ్ము రమ్మని సరసకుం బిలుచుకొని కోమలకరతలంబుచేఁ వదీయోత్తమాంగంబు స్పృశింపుచు నిట్లనియె. 299

చ. పలుకును యేమి సంభవిలెఁ ♦ బట్టికి నేనుచు దల్లి మంత్రియున్
నిలువక యెందు రమ్మనుచు ♦ నెమ్మిని వ్రాసిన రాఁడి దేటికో
దెలుపఁడు స్వామికిం గతము ♦ తెల్పు మటం చన వాఁడు సర్వమున్
దెలుపఁ దొడంగుదున్ నృపతి ♦ దీర్ఘహృదుండయి సాఁచి చేతులన్. 300

చ. వగచుచు నార్తనాదముల ♦ నందుకుచున్ గను భద్ర! చెప్పఁగాఁ
దగినది యెల్లఁ జెప్పితివి ♦ దానిని వింటిని నేనునున్ విన
దగినది యెల్ల మాను మిఁకఁ ♦ దచ్ఛ్రవణోరుకుతూహలంబునన్
దెగ నడుగంగఁ గోరికయుఁ ♦ దీఱె ఫలించెను శ్రోత్రజన్మముల్. 301

క. హృదయము హర్షితమయ్యెన్, బొదలెను స్నేహంబు చాలఁ ♦ బొదలెసుఖంబున్
గదిరెను సర్వము నా కిఁకఁ, గొదలే దొక్కండు నెందుఁ ♦ గోరను దేనిన్.

సీ. స్ఫుటితహృదుండవై ♦ శోకించితివె తండ్రి! యొక్కండవే నీవు ♦ వెక్కి వెక్కి
సన్మిత్రుఁ డైనవై ♦ శంపాయనుని మీఁదఁ జొక్కంపుఁ బ్రేమను ♦ జూపినావు
దుఃఖభాగులమయి ♦ దురపిల్లుచిటు మేము కర్మచండాలతఁ ♦ గాంచినాము
వజ్రసారముకంటె ♦ వనిత! యాస్మద్ధృది కఠినతరంబయి ♦ కానుపించు

తే. వేయివఱియలుగాఁ దానె ♦ వ్రీల దేల
ప్రాణములు పోవు సుతువెంటఁ ♦ బాసి స్వయము
మరణభీరువు లవి చూడు ♦ మగువ! లెమ్ము
మనము పోవుద మాతండు ♦ చనిన త్రోవ. 803

తే. చనుద మాతండు గడుదవ్వు ♦ చనక ముందె
యేల శుకనాస యింకను ♦ జాలిపడుచు
నుండెదవు స్నేహమును జూప ♦ నుచితవేళఁ
జితినిఁ జేర్పింపుమా శివు ♦ చెంత నిపుడె. 804

సీ. చేర్పుఁడు కట్టెలు ♦ శీఘ్రంబ యిచటికిఁ గాష్ఠికులార! వే ♦ కదల రేల
సంకోచ పడ నేల ♦ చనుఁడు కంచుకులార! చోర నగ్ని వలసిన ♦ పరికరములఁ
గొనిరండు మిన్నక ♦ పనవిన నే మగు నిర్నిరోధంబుగా ♦ నిఖిలధనము
దేవి! యొసంగుము ♦ ద్విజుల కెల్లరకును బాలింతు వెవనికై ♦ భామ! యింక

తే. పాలనాదిక మెల్లను ♦ బాసి నిపుడు
క్షీణపుణ్యుఁడ నా కేమి ♦ సిద్ధిఁ గాంచుఁ
బొందు మీభూములకు మీరు ♦ భూమిపతులు
వదలితిని మిమ్ముఁ బ్రజలను ♦ వదలినాఁడ. 305

తే. ఇపుడె యువరాజుశోకంబు ♦ నెఱుఁగ రెట్టు
లట్టు ప్రజలను నరయుఁడీ ♦ యకట నాదు
తనయుఁడు కథావశిష్టుఁడై ♦ ధాత్రిఁ బాసె
నెవని రాజును జేసి నే ♦ నేగు దింక. 306

తే. అనుచు నార్తప్రలాపంబు ♦ లపర మిగుల, నపలు నా రాజచంద్రుని ♦ నతని దేవి
యాత్మదుఃఖంబు నింతయు ♦ నరయకట్టె, పుడమిపడకుండఁ బట్టెను ♦ విడెమునొడిని.

వ. అంత నప్పుడు త్వరితకుం డిట్లనియె. 308

క. దేవర! తావకపుత్త్రుఁడు, భావింపఁగ స్ఫుటితహృదయ ♦ పద్ముం డైనన్
బోవిడువఁడు దేహంబును, భావింపకుఁ డొందు మదిని ♦ బాపపువార్తన్.

ఆ. శాపదోషమునను ♦ సచివపుత్త్రుని యట్లు, జనన మొందె నీదు ♦ తనయుఁ డవని
వినుము వినుతు నెల్ల ♦ విషయంబులను దేవ!, విడువకుండ నొకఁడు ♦ వివరముగను.

క. అనుటయుఁ దారాపీడుఁడు, విని యాయద్భుతపుశోక ♦ వేగం బెల్లన్
ఘనకుతుకాంతరితం బయి, తనరఁగ ననిమేషదృష్టిఁ ♦ దడవ వెకనుచున్.

క. భూతావిష్టుని వగిదిని, నాతతదత్తావధానుఁ ♦ డగుచుఁ ద్వరితకుం

డాతురతఁ జెప్ప సర్వము, క్ష్మాతలనాథుండు వినియె ♦ జరిగిన దెల్లన్. 312

తే. అద్భుతాస్పద మగుచును ♦ నధికదుఃఖ, కారణంబయి కౌఁతుక♦కరము నగుచు
దుశ్శ్రవంబయి విశ్వాస♦దూరమైన, తత్ప్రవృత్తిని బెక్కు ని♦దర్శనముల. 313

తే. నస్మకము పుట్టఁ జెప్పంగ ♦ నరవరేణ్యుఁ, డాలకించి మొకింపుక♦యాననంబు
త్రిప్పి నిశ్చలతారక♦దృష్టిఁ బరపె, నాత్మసముఁ డగుశుకనాసు♦నాననమున.

ఉ. పూనుదు రాత్మదుఃఖములఁ ♦ బోవిడి మిత్రులదుఃఖ మార్పఁగా
మానితు లైనసౌహృదు ల♦మూననిరంతరదుఃఖ మందుమన్
దానును నాయవస్థఁ గని ♦ దందడిఁ గుందుచు నున్నస్వస్థుచం
దాన జనాధినాథునకుఁ ♦ దచ్ఛుకనాసుఁడు పల్కె నీగతిన్. 315

శుకనాసుఁడు తారాపీడు నూఱడించుట.

వ. దేవ! అతివిచిత్రం బైనయీసంసారంబునందు సుఖదుఃఖమగ్నులై వర్తించు
దేవాసురమనుష్యతిర్యగ్యోనులకును సత్త్వరజస్తమోగుణాత్మకం బయినప్రధా
నమునకును బరమాణ్వాదిబ్రహ్మాండమువఱకును గలసమస్తమునకు నుత్పత్తి
స్థితిలయకారణభూతుఁ డీశ్వరుండు తదిచ్ఛచే ధర్మాధర్మసాధనంబును నిష్టానిష్ట
ఫలప్రదంబును నగుశుభాశుభకర్మపరిపాకంబునను స్వయముగను ననేకప్రకారం
బులఁ బుట్టుచు వృద్ధిపొందుచు నశించుచు ననియతవ్యాపారంబు లగుస్థావర
జంగమంబులకు సంభవిల్లనియవస్థలు లేవు. కాన నీవిషయంబున దేవర కేల
యీవిచారంబు! యుక్తివిచారముచే విమర్శింత మన్నఁ గేవలాగమప్రమాణం
బుచే నంగీకరింపఁబడినవైనను బెక్కువిషయంబులు యుక్తివిరహితంబులై
విసంవాదరహితములుగఁ గనఁబడుచున్నవి. మంత్రప్రయోగంబువలనఁ గాని
నాగమంత్రధ్యానమువలనఁ గాని విషమూర్ఛితుఁడు విషముక్తుండై లేచు
చున్నాఁడు. ఇం దేమియుక్తి యున్నది? మఱియు నయస్కాంతమునకు నయ
స్సునాకర్షించుశక్తిఁ గలిగించుటవలనను వైదికావైదికమంత్రములకు ననేక
ప్రకారంబు లగుపెక్కుకార్యంబుల సాధించుసామర్థ్యం బొసంగుటవలనను
నానావిధద్రవ్యసంయోగంబులకు జీవితమరణాదులఁ గల్పించునేర్పును, నప
హరించుచాకచక్యమును లోఁబడఁజేయు వైశారద్యంబును ద్వేషముపుట్టించు
శక్తియు నుత్పాదించుటవలనను మఱియు నెన్నిటికో యిట్టిసామర్థ్యం బొద
వించుటవలనను నాగమములు సర్వప్రమాణంబులు. అట్టియాగమములయం

దును బురాణరామాయణాదులయందును ననేకవిధంబు లగుశాపవార్త లనేక
ప్రకారంబులఁ బ్రతిపాదింపఁబడియున్నవి. ఎట్లనిన. 316

సీ. అమరేంద్రపదవిని ♦ నందిననహుషుఁ డజగరమయ్యె నగస్త్య♦శాపయుక్తి
మానుషాదత్వంబుఁ ♦ బూనె సౌదాసుండు వాసిష్ఠసుతశాప♦మహిమ నవన
యౌవన మందె యు♦యాతి చెందెను జర క్రవ్యాదగురుశాప♦కారణమున
నందెఁ జండాలత్వ ♦ మలత్రిశంకుఁడు తాను జనకునిదారుణ♦శాపమునను

తే. నమరలోకనివాసిమ♦హాభిషుండు, శంతనుం డయి యీభువి ♦ జన్మ మందె
నతనిభార్యాత్వ మందిన♦యమరతటిని, శాపమున నష్టవసువుల♦జన్మ మనని.

వ. వీరిమాట యటుండ నిమ్ము. మఱియొకయద్భుతంబు చెప్పెద నాకర్ణింపుము.

క. తనయుండై జమదగ్నికి, జనియించెను శౌరి దివిజ♦సన్నుతుఁ డజుఁడున్
జనియించె నల్లె నల్గురు, తనయులుగా దశరథునకుఁ ♦ దా నొక్కండే. 319

చ. మనుజులయందుఁ బుట్టుదు ర♦మర్త్యులు సంభవమే యిదెందునున్
గన నగుఁ దొంటిమానవుల ♦ కంటెను దేవుఁడు తీసిపోవునే
గొనములఁ; బద్మసంభునకుఁ ♦ గోకనపత్నుఁడు హెచ్చుగాఁడుగాఁ
గను మిట సంభవం బిఁకను ♦ గానిది యెయ్యది యెంచ వెండియున్. 320

చ. కనితిరి దేవి గర్భమును♦గాంచినయొప్పుడు చంద్రుఁ డామెమో
మును జొరఁబాఱుటన్; గనితి ♦ భూధవ నేనును బుండరీకద
ర్శనమును స్వప్నమందు నిఁక ♦ సందియ ముండదు వారు వానిలోన్
జననము నందుటన్ విను వి♦నాశము నొందరు వారు చూడఁగన్. 321

ఉ. వారలు నాశముం గనిన ♦ వారిశరీరము లుండు టెట్లొకో
వారలు మళ్లి జీవమును ♦ వారక గాంతురు నిక్కువం బిటన్
గారణ మీసమస్తభువ♦నంబుల ఖ్యాతినిఁ గన్ననిర్జరా
హారమొకండు; లే దితర ♦ మంతకు మించినకారణం బిఁకన్. 322

క. కల దమృతము శశియం దని, యిలను బ్రసిద్ధంబు దేవ!♦యెఱుఁగు మిదెల్లన్
గల గా దని యీదృత్తను, విలసనములు పుట్టు నెట్లు ♦ వేరొకచోటన్. 323

సీ. అచిరకాలమునందె ♦ యంది శాపవిముక్తి పెండ్లాడి గంధర్వ♦ప్రియతనూజ
హర్షాశ్రువులు జాఱ ♦ నతివతోఁ జనుదెంచి పదపంకజములకుఁ♦బ్రణతి సేయుఁ
దత్పుత్రుఁడై యవ♦తారంబు నంది చంద్రాపీడనామంబుఁ ♦ దాల్చినట్టి
లోకపాలకుఁ జంద్రు ♦ లోచనోత్సవకరుఁ గాంచి జన్మం బాది ♦ గాంచినట్టి

తే. గాఢసంతాపమును వీడి ♦ కరము సుఖముఁ
గాంతుమో దేవ! యుడుగుము ♦ వంత యింక
వరము మన కిది శాపంబు ♦ వారి కగుఁ
వలదు దేవియు నీవును ♦ బనవ నిచట. 324

సీ. అభివర్ధిలఁగఁ జేయు ♦ మఖిలమంగళములు; నన్యజన్మోపాత్త ♦ మైనసుకృత
మభివర్ధనముఁ జేయు ♦ నభిమతదేవతారాధనంబున ధన♦రాశి నీవి;
నల నియమవ్రతా♦ద్యాచరణమ్ముల నశుభం బణంపుము ♦ యధికనిష్ఠ
మఱియు నే దేదియు♦మదికి శ్రేయస్కరమని యెఱుంగుదువిధదు♦మదియు నెల్ల

తే. నేఁడు మొదలుగఁ జేయింపు ♦ నిచ్చ లీవు
చేయు స్వీయముగ లక్ష్యంబు ♦ చేసి భక్తి
వైదికావైదికక్రియా♦వార మెల్ల
నించుకైన నసాధ్యంబు ♦ లిలను గలవె. 325

తే. కడుప్రయాసంబులను బడి ♦ కన్నవీరి
జన్మమును నిట్టిచొప్పున ♦ సంభవించె
ననుచు శుకనాసుఁ డనుచుండ ♦ నవనిపతియు
నడలు చిట్లనె దుఃఖంబు ♦ నాఁప లేక. 326

ఉ. ఈ వనినట్లు సర్వమును ♦ నెవ్వఁ డెఱుంగు నోరుండు; చెప్పుమా
కీవలె మానసంబునకు ♦ నెక్కుఁగ నన్యుఁ డెపండు; మేమునున్
బోవిడకేనిపల్కులను ♦ బొందికఁ గొందుము చెప్పు మైన నో
పావనచిత్త! నీసుతుని ♦ పాటును గాంచి మదీయమూతికిన్. 327

చ. హృదయము భిన్న మయ్యె నిది ♦ యట్టిదుగన్ గనుపించి దేనినిన్
మదిఁ జొర సీదు గానఁబడు ♦ మానక యెందు వినంబడున్ సదా
యదియ మనంబునం బొదలు; ♦ నాతనిమోమును గాన కున్న నేఁ
గుదురప లేను దేహమును ♦ ఘోరతరవ్యథ మాట లేటికిన్. 328

క. నాగతి యీగతి నుండఁగ, నాగరితగతిన్ మఱే♦మనంగలవాఁడన్
వ్రేఁగగుఁ దత్పరిబోధము, వే గమనమె మేను నిల్వ ♦ వెర వాండేదీ. 329

క. అనుటయుఁ దారాపీడుఁడు, తనయవ్యథ భర్తృనెదురఁ ♦ దలఁగి త్రపను దా
జనపతిసతి సాంజలియై, యనియెను నుచ్చైస్స్వనంబు ♦ లడర వగపునన్. 330

ఉ. తామస మేల యట్లయినఁ ♦ దగ్గుద మిప్పుడ లెమ్ము వేగమే
నామది వేగిరంపడుఁ గ♦నన్ సుతుఁ డెందము ప్రీల మేలొనన్

రామిని దుఃఖ మోర్వఁగను; ♦ రా దటు చేయఁగఁ జూడఁ గోరు నే
నేమన నెంతు దుఃఖముల ♦ నీఁదుచు మత్సుతుఁ గాంచుకోరికన్. 331

చ. కనుఁగొన నొక్కసారి సుతుఁ ♦ గాంచుట దీఱఁగ మేను దాల్చెదన్
గనుచు మహోగ్రదుఃఖములఁ ♦ గంథము శోషిల నేడ్చు చిట్టు; చా
వను నివు డేను దుఃఖములఁ ♦ బాయఁగఁ గాన దురాశహేతువై
తనరెడునామనంబునకుఁ ♦ దగ్ధమనంబు వినోదహేతు వౌ. 332

ఆ. తనయుమోముఁ గాంచఁ ♦ దహతహాపడునాదు
హృదయమునకు నటకు ♦ నేగుకంటె
నేవి యింపు లౌను ♦ నిప్పుడే వెడలుఁడు
తనయుఁ జూడ కేను ♦ దాళఁ జాల. 333

వ. అని విలపించుచున్నయావిలాసవతియొద్దకు నొకవృద్ధబ్రాహ్మణుం డరుదెంచి స్వస్తిపూర్వకముగ నాశీర్వదించి యి ట్లనియె. దేవీ! యెల్లయెడల నపరిస్ఫుటంబుగ నల్లుకొన్న యీవార్తాకలకలంబున నాకులీకృతయై మనోరమ స్వయముగ నల్లదె యిట వచ్చుచున్నయది. రాజుం గాంచి సిగ్గుపడి యిటకు రా వెఱచి యవంతిమాతృగృహంబునకుఁ బిఱింది దెస నున్నయది. "మీ రేమి వచించిరి. నాసుతుండు వైశంపాయనుండు జీవితుండె. క్షేమది నున్నవాఁడె" యని ని న్నడుగుచున్నది. అని చెప్పుటయుఁ దారాపీడుండు తన్మరణవార్తకంటెను గష్టతమం బైనతద్వార్త విని దుఃఖవిదీర్ణయన నొప్పువిలాసవతి కి ట్లనియె. 334

క. విని యెఱుఁగ దేమి సీసఖి, తనయులవృత్తాంత మీవు ♦ తక్కఁగ నితరుల్
వినిపించిన విని జీవం,బును వీడును నొక్కవేళఁ ♦ బోవు మెదురుగన్. 335

ఆ. ధైర్య మూని నీవు ♦ దరుణి! స్వయమ్ముగ, సర్వవృత్త మల్ల♦సతికిఁ జెప్పి
మేనుఁ బాయకుండ ♦ మేకొనఁగాఁ జేయు, పయనమునకు నడ్డు♦పడక యుండ.

ఆ. అనుచు సపరివార ♦ యగు విలాసవతిని, బంపి నృపతి గమన♦పరికరములఁ
జక్కఁ జేయు చుండె♦సచివుని శుకనాసుఁ, గూడిసంభ్రమంబు♦గూరమిగుల.

వ. అంత. 338

క. జనపతి ప్రయాణమగుటయు, జననాథునిపై నిగూర్మిఁ ♦ జంద్రాపీడున్
గను నుత్సుకతను నచ్చెరు,వును గనుకౌతూహలమున ♦ భూపతిసుతుతోన్.

క. మును చనిన పుత్త్రమిత్త్రుల, జనకులఁ దోఁబుట్టువులను ♦ స్వజనము లెల్లన్
గను వేడ్క నగరమెల్లను, జనఁ దివిరె గృహంబు లరయు♦జనములు దక్కన్.

వ. తారాపీడుండు నొక్కనాఁటన మరలి రాఁ దలంచి శీఘ్రగమనవిఘాతహేతువు లైనవారి నెల్ల రావల దని నిషేధించి పరిమితపరికరుం డయి బయలు వెడలి యించుకదవ్వు చని యిప్పు డెంతదవ్వు వచ్చితిమి. ఇం కెంతదవ్వు చనవలయు నెన్ని నాళ్లకటఁ జేరఁగల మని మాటిమాటికిఁ దురగాధిరోహితుం డగుత్వరితకు నడుగుచు ననవరతప్రయాణంబులఁ గొలఁదిదినంబులలోన నాయచ్ఛోదసరోవరంబుఁ జేరి వికల్పశతంబులఁ దలంచుకొని యుత్తలంపడెడుమనంబుతోఁ గడుదవ్వుననుండియె పరమాప్తుఁ డగునొకయశ్వవారుని ద్వరితకునితోడఁ దన రాక నెఱింగింప ముందుఁ బంపె. 341

మాలిని. శ్రితజనపరిపాలా! ♦ సేవితానంతలీలా!
నతదురితవిఫాలా! ♦ నందిసేవావిలోలా!
పతితజనవిదూరా! ♦ భావితాంతర్విచారా!
శ్రుతితతినుతచారా! ♦ సూరిసంస్తుత్యధీరా!. 342

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లివంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియతనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైన శృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందు నుత్తరభాగంబునందుఁ దృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః.

శ్రీరామ స్సహాయోఽస్తు.

శ్రీ మేధాదక్షిణామూర్తిః ప్రసీదతు.

# శ్రీ శృంగార కాదంబరి

## ఉత్తర భాగము.

### చతుర్థాశ్వాసము.



నిగమవినుతచరణా!
మానివ్రజశరణ! మథిత◆మారవితరణా!
జ్ఞానవ్రతానుసరణా!
దీనజనోద్ధరణ! దివ్య◆తేజఃకరణా!. 1

వ. దేవా! దయాయత్తమతి నవధరింపుము. అవ్వలికథావృత్తాంతముఁ జెప్పెద. అట్లు తారాపీడుండు పరిజనపరివారపరివృతుండయి నిజసుతమంత్రిసుతదర్శనార్థం బచ్ఛోదసరోవరంబు చెంత కరిగి. 2

సీ. దేహసంస్కారంబుఁ◆ దీర్పమి నతికృశమలినశరీరంబుఁ◆ గలిగి మిగుల
బాష్పపూరంబులు◆ పాఱఁ గాలువలయి జీవించుటకుఁ గడు◆ సిగ్గుఁ గనుచు
బలిసద్మమును జొరఁ◆బాఱఁ దలంచుచు మును రాఁగ మ్రోలకుఁ◆బూనుచు వెఱ
నొండొరు మాటుగ◆ నానరించికొని వచ్చి క్షితితలవినిహిత◆శిరసు లగుచు
తే. నశ్వవారునితోఁ గూడ◆ నరుగుదెంచి, ప్రణతు లొనరించుయువరాజ◆పాదపద్మ
బద్ధజీవితు లగునర◆పాలసుతులఁ, గాంచె నుజ్జయినీపుర◆స్వామివిభుండు. 3

ఉ. కాయములెల్లఁ గాయములఁ◆ గాంచక యున్న సమాహతాంగులో
యాయతసేవకప్రచయ◆ మంతయు నుండియు నేరులేనివా
రో యన జీవముల్ గనియు◆ నుజ్ఝితజీవితులో యనంగ నా
భూయువతీలలామవిభు◆పుత్త్రులు వెన్కకు నీడ్వఁ బాదముల్. 4

ఉ. దీనత మేఘనాదునిని◆ ధీరుని ముల్ జనఁజేసి వెంబడిన్
మే నసియాడఁ దూలుచును◆ మిన్నక సంతస మింత మోమునం

మానక యేగుదెంచి మును ♦ నుర్విని వ్రాలి నతోత్తమాంగులై
మౌనముఁ దాల్చియున్నయ♦క్ష్మాధవపుత్రులఁ గాంచి రాజు తాన్. 5

క. ఘనశోకనిమగ్నుం డ,య్యును స్వస్థునిపగిది నేత్ర♦యుగి వికసింపన్
దనయుఁ డవినాశి యాటను, మనమునఁ గడు నమ్మి మురలి♦మగువకు ననియెన్.

క. బ్రతికితిమి దైవవశమున, సుతుఁడు గతాసుండు గాఁడు ♦ సుమ నిక్కువ మీ
క్షితిపతితనయులు వచ్చిరి, సుతుదగ్గఱనుండి వీరు ♦ సుతుననుజీవుల్. 7

క. అనుటయు విలాసవతి తా, విని తద్వచనంబు నింత ♦ విశ్వాసంబున్
గని యావరణపటాంచల,మును నించుక తొలఁగఁ ద్రోసి ♦ భూపతనయులన్.

క. కనుఁగొని నిశ్చలదృష్టిని, దనయునిగతిఁ జాలసేపు ♦ ధైర్యము విడుచున్
గనుఁగవ నశ్రులు గురియఁగ, వనరంగాఁ దొడరె నిట్లు ♦ వావిడి పెలుచన్.

క. పసితనమునాఁడు నీతో, నెసలారఁగఁ బాంసుకేళి ♦ నెలమి గనినయీ
వసుధేశసుతులనడుమను, నెసఁగెడునిను నొకనిఁ గాన♦నే సుత! కట్టా. 10

క. ఆగతిని బెలుచ వనరెడు, నాగరితను నూఱడించి ♦ యడలకు శోకం
బాఁగు మని మేఘునాదుని, నీగతిఁ బ్రశ్నించె నృపతి ♦ యిటు రమ్మంచున్. 11

ఆ. ఓయి మేఘనాద! ♦ యూరకుండెద వేల, చెపుము సుతునివార్త ♦ చెప్పకుండ
దాఁచె దేల శంకఁ ♦ దలఁగి సర్వమ్మునఁ, జెప్పఁ దొడఁగె నతఁడు ♦ చిత్తమెరియ.

చ. కనఁబడుఁ జేష్టలే మయునిఁ ♦ గానఁగరా దలచేతనంబు దా
దినదిన మెక్కు వౌచు జిగి ♦ తేజరిలున్ గడు నంగకంబులం
దనుడుఁ దదుక్తి రాజు విని ♦ యాత్మజుజీవితమందుఁ బ్రత్యయం
బును గని వీనిమాటలను ♦ బోటిరో! వింటివిగాదె లెమ్మికన్. 13

చ. తనయునిమోముఁ గాంచి యిఁక ♦ ధన్యత నందుద మేగుదెమ్మటం
చనుచును లేచి యొక్కమద♦హస్తిని గాఢజవంబు నెక్కి తాఁ
జనియెను వేగ హంససుత♦సన్నిధి కప్పుడె దేవితోడ నా
మనుజవరేణ్యుఁ; డంత నల ♦ మానిని గన్గొని వారు వచ్చుటన్. 14

చ. మును వెదచల్లఁగాఁబడిన♦ముత్తెములన్ బురుడించుబాష్పబిం
దునికరముల్ దొరంగఁగను ♦ ఘోరములై కట మందభాగ్యఁ బా
పిని వ్యసనైకభాగినిని ♦ బెల్లుగ నొచ్చితిఁ జచ్చితిన్ గటా
కనుఁగొనఁ జావున్ మఱచి ♦ కాలముఁ బుచ్చెదు నేను నేమియున్. 15

చ. వెతలనొసంగఁ బండితుఁడు ♦ వేధ ననున్ దహియింపఁ డేల యీ
వెతల బహుప్రకారముల ♦ విద్ధను జేయును నెంతదాఁక నా

హతవిధి యంచు సిగ్గునను ♦ హాయని యేడ్చుచుఁ బర్వువాఱు చా
వితతగుహాంతరంబునను ♦ వేగ జొరంబడె నార్తనాదయై. 16

తారాపీడుఁడు మొదలగువారు మహాశ్వేతాశ్రమమునకు వచ్చుట.

చ. కనె మదిరాతనూజయును ♦ గాటపు మోహతమంబు నిర్ఘృవృ
త్తిని బరివారమెల్లఁ జను♦దెంచి ధరన్ బడకుండ నూఁతగా
జనపతి వార లట్లయిన ♦ సంగతిఁ గాంచుచుఁ దాను మంత్రియున్
జనెను దదాశ్రమంబునకు ♦ స్వాంతము జల్లన డిల్లవోవుచున్. 17

వ. అంత. 18

క. చనియెను విలాసవతియును, దన కూఁతగ మంత్రిరమణి ♦ తనరంగను నా
తనయుం డేఁడీ యనుచును, గనుకనిఁ బరువిడుచుఁ ♦ గనులఁ గాఱఁగ నశ్రుల్.

వ. అట్లు చని గతాఖిలప్రయత్నుండయి కాంతివిరహితుండు గాక సుప్తునియట్లు భూమిపైఁ బడియున్నపుత్త్రుం గాంచి తారాపీడుఁడు రాకమున్న తనకు నవలంబనమై యున్నమనోరమ నవలఁ ద్రోసి యంతంతన భుజవల్లికాయుగ్మంబు సాఁచి యుద్వేలంబులై దొరంగు బాష్పపూరంబులను దక్షిణప్రోద్గతంబు లయిన పయఃప్రస్రవణంబులను నాయాశ్రమపదంబెల్ల నభిషిక్తంబు గావించుచు. 20

సీ. తనయ రా ర మ్మిటు ♦ దర్శించితిని నెన్నినాళ్లకుఁ బ్రతివచ♦నం బొసంగు
కను మొక్కసారి యేన్;♦గతినచిత్తను నన్నుఁ దగునె నీ కీయుని్క♦తండ్రి! కనవె
యంకతలం బెక్క ♦ నరుదెంచి తనయెడోదిత స్నేహమును జూపు♦తనయ! నాకుఁ
బసితనంబున నాదు♦పలు కాదరింపమి నెఱుఁగ వెన్నం డిపు ♦ డేల వినవు

తే. కోప మేటికి నాపైని ♦ కొడుక! చెపుమ
పదములం బడి ప్రార్థింతు ♦ వత్స! నిన్ను
నెదురుగా నేగి మ్రొక్కుము ♦ జనకునకును
వచ్చెఁ గడుదవ్వ నీపైని♦వఱలుప్రీతి. 21

సీ. చనె నీగుణము లెందుఁ♦జనె నెందునాస్నేహ మల్లనీగురుభక్తి♦యరిగె నెందుఁ
బాఱె నీపితృపక్ష♦పాతిత్వ మేడకుఁ దరలె నీధర్మజ్ఞ♦తయును నెటకుఁ
బఱచె నేడకు నీదు♦బాంధవప్రేమంబు పరిజనప్రేమంబు ♦ పఱచె నెటకు
నన్నియు నాయభా♦గ్యమ్మున నొక్కట వదలి ఔదాసీన్య ♦ మొదవె నెట్లు

ఆ. తనయ! నీకు సుఖము ♦ తార్కొను నెట్లట్లు
మెలఁగవయ్య యంచు ♦ నెలుఁగు రాయ

బిగ్గఁ గౌఁగిలించి ♦ ప్రిదులక సారెకు
గొంతు వాయ నేడ్చెఁ ♦ గోమలాంగి! 22

ఉ. ఔదలఁ దాల్చుచున్ సుతుని ♦ యంఘ్రుల మూర్కొనుచున్ శిరంబునన్
బాదములందు వక్షమున ♦ వ్రాలుచుఁ జెక్కుల ముద్దుఁగొంచునున్
వేదన సైఁపలేక కడు ♦ వేఁదుఱుఁ గొన్నటు కేడ్చునామె నా
భూదయితుండు పట్టుకొనె ♦ భూపరిరక్షణదక్షబాహులన్. 23

తారాపీడుఁడు విలాసవతి నూఱడించుట.

క. తనదుఃఖము మది నెంచక, తనయునిఁ గౌఁగింటిలోనఁ ♦ దార్చక వగతో
ననియెను నీగతి దేవీ!, మన కీతఁడు తనయుఁ డయ్యె ♦ మనపుణ్యమునన్. 24

ఆ. అరయ దేవతాత్ముఁ ♦ డౌను దేవి! యితండు
వగవ నేల యితని ♦ వంతఁ గుఱిచి
మానవార్హమైన ♦ మమతను దుఃఖింపఁ
దగునె నీకు వీడు ♦ వగవు తరుణి!. 25

తే. కలుగ దీశోకమున నేమి ♦ కాంత! మనకుఁ
గంఠమొకఁడు విదీర్ణ మౌఁ ♦ గాదు హృదయ
మేటి కీవ్యర్థవిలపిత ♦ మేగ దుసురు
వడు నిరాసంగ బాష్పముల్ ♦ వడదు మేను. 26

వ. మఱియు. 27

చ. కలుగక యున్న వత్సముఖ ♦ కంజవిలోకన మింతి! వంతఁ జిం
తిలవలె వీనిమోముఁ గడుఁ ♦ దేజరిలన్ గనుచుండ నంతచిం
తిల మనకేల? యొండు విను ♦ తేర్పవలెన్ శుకనాసుఁ దత్సతిన్
గలఁగెడునీవె నేనె చని ♦ నాఁడు తదాత్మజుఁ డొండులోకమున్. 28

ఉ. వీరల నుండని మ్మెవతె ♦ విశ్వజనీనమహత్త్వసంపదన్
గూరె సుతుండు జీవమును ♦ గూరె మహోత్సవ మెల్లవారి కా
చారుచరిత్ర చిత్రరథు ♦ సత్సుత కోడలు నీకు నల్లదే
చేరఁగ వచ్చుటన్ మనము ♦ చెప్పఁగ శోకముఁ గూరి మూర్ఛిలెన్. 29

చ. పిలుచుచుఁ బేరుకొంచుఁ దమి ♦ పెల్లున నెచ్చెలులెల్ల నూఁతయై
నిలుపఁగఁ జేతులం దనువు ♦ నేరక తేఱఁగ మూర్ఛ నింకనున్
బలుకకయొండు లేపి తొడ ♦ పై నిడి మూర్ఛను దేర్పు మావలన్
సలిపెదు గాక రోదనముఁ ♦ జాలఁగ నిష్టముతీఱ నెంతయేన్. 30

క. అనుటయు జనపతి యట్లా, వనితయు నాసుతునిప్రాణ♦వరదాత్రియనూ
ననయగుణ కోడ లెక్కడ, ననుచున్ జేరంగఁబోయి ♦ యధికరయమునన్. 31

ఉ. అంకతలంబునం దునిచి ♦ యప్రతిబుద్ధను దానిఁ జేతితో
శంకను దక్కి కైకొని వి♦సంజ్ఞనిమీలితలోచనాంబురు
ట్సంకలితాధికద్యుతిని ♦ సద్వదనంబును గాంచుచున్ గురం
గాంకితఖండశీతలమ♦నంతరబాష్పము సార్ద్రగండమున్. 32

చ. ఉనుచుచుఁ దత్కపోలమున ♦ నుంచుచు ఫాలమునన్ స్వఫాలమున్
గనులను గన్నులన్; సుతునిఁ ♦ గాటపుఁగూర్మి స్పృశింపఁ జల్లనై
తనరుస్వహస్తకంజమునఁ ♦ దద్హృదయంబు స్పృశింపుచున్ దమిన్
జనని! సమాశ్వసింపు మిఁక ♦ సంజ్ఞను నూనుము కన్ను విప్పుమా. 33

క. ఇదిమొద లెవ్వరు నాసుతుఁ, బదిలంబుగ నరయువారు ♦ బాలిక! నిన్నున్
వదలిన నీపుణ్యంబునఁ, గదిసెను సుతుదర్శనంబు ♦ గావవె మమ్మున్. 34

తే. అమృతమయువంచు నిన్ను నే ♦ నరయుదానఁ
గాకయుండిన మగుడ నేఁ ♦ గాంతు నెట్లు
మత్సుతుముఖంబు; తల్లిరో ♦ మాకు నీవు
దైవమవు కోడలవుగావు ♦ తలిరుఁబోఁడి!. 35

వ. అనుటయుఁ గాదంబరియు రాజసుతనామగ్రహంబునను దత్సపర్యాభిన్నంబైన విలాసవతీశరీరస్పర్శంబునను మూర్ఛం దేఱి లజ్జావనమ్రముఖియై యేమి చేయనుం దోఁపక నిస్తబ్ధయై యుండ నామెను దత్సఖి మదలేఖ విలాసవతి యుత్సంగతలం బవతరింపించి యామెచే నెల్లరకు యథాక్రమంబున నమస్కారంబులు చేయించి వారు చిరకాలంబు దీర్ఘసుమంగళవై మనుమని దీవింప మెల్లఁగ లేపి విలాసవతికిన్ బిఱిందిదెస నతిసమీపంబునఁ గూర్చుండఁ బెట్టి తా నూఁతయై కూర్చుండి యుండె నంత. 36

చ. జనపతి యట్లు రాజసుత ♦ సంజ్ఞను జెంద సుతుండు జీవమున్
గనినటు లెంచి తత్తనువు ♦ గాఢతరంబుగఁ గౌఁగిలింపుచున్
గనుచు స్పృశింపుచున్ వదన♦కంజము ముద్దిడుకొంచు నుండి తాఁ
గని మదలేఖఁ బిల్చి యిటు ♦ కట్టడ చేసెను దాని కెంతయున్. 37

చ. సలువుచు నేసపర్యలను ♦ సన్నుతి కెక్కఁగ నిన్నినాళ్లు కో
డలు మదిరాతనూజ నిక♦టంబున నుండుచు నాదుపట్టికిన్

దలఁపక యొండుబుద్ధి ముఖ♦దర్శన మబ్బఁగఁ జేసె నాసవ
ర్ణ్యల విడరా దిసుంతియును ♦ నాయమ సిగ్గున మాదురాకచేన్. 38

ఉ. ఊరక గాంచువారలమె ♦ యుగ్మలి మే మొకకార్యభారమున్
నేరము నిర్వహింప నిట ♦ నిల్చినఁ బోయిన నిన్నినాళు లే
వారిజనేత్ర తాఁకుటను ♦ వారక యెప్పుడు నీశరీర మే
పారుచు నుండు నొందకయ ♦ భంగము నాస్నుష యున్నఁ జాలదే. 39

తే. ఇతనిపజ్జను నుండుత ♦ నీపశంతి, యనుచు నానతి యొసఁగి యా♦యవనివిభుఁడు
తనకు నుపకల్పితంబయి ♦ తనరుచున్న, పటగృహంబున కేగక ♦ పజ్జనున్న. 40

తే. తాపసజనోచితంబయి ♦ దాఁపునందు, నలరు నొకయాశ్రమమ్మున ♦ సమలశీత
లోపలస్థలసంకలి♦తోజ్జ్వలతరు, వల్లరీమండపమునందు ♦ వచ్చి నిల్చె. 41

వ. స్వనిర్విశేషదుఃఖం బైనసకలరాజచక్రంబుఁ బిలిచి సబహుమానంబుగ వారి
కిట్లనియె. 42

తారాపీడుఁడు తపంబుఁ జేయఁ బూనుట.

చ. తలఁపకుఁ డేను శోకములు ♦ తార్కొనఁ దాపసవృత్తి నిచ్చటన్
నిలిచితి నంచు మీరు మును ♦ నిశ్చిత మీవిషయంబు భార్యతో
మెలఁగెడుపుత్త్రుమోముఁ గని ♦ మేదినిభారమునెల్ల వానిపై
నిలిపి ఋషుల్ వసించునొక♦నిర్మల మహామునిపల్లె నుండుచున్. 43

చ. అపరవయస్సు పుచ్చవలె ♦ నంచుఁ దలంచితి దాని నీగతిన్
గృపణుఁడు ప్రేతరాజా పరి♦కింపఁ బురాకృతకర్మజాలమో
యపర మదేదొ నే నెఱుఁగ ♦ నప్పుడె తార్చెను నేమొనర్తు నే
నపరిమితంబు నీనియతి ♦ నో నొకో మీఱఁగ నేరి కీయిలన్. 44

తే. ఆత్మచేష్టాకృతం బగు♦నాత్మజన్మ, సౌఖ్య మప్రాప్య మది భువి♦సర్వులకును
బ్రజలపాలనఫలము మీ♦బాహులంబె, యవిరతంబయి వర్ధిలు♦నడుగ నేల.

తే. అవనిఁ బ్రజలను బాలించు ♦ నవుడె మేము
సర్వభారంబు మీభుజా♦స్తంభములనె
నుంచినారము కావున ♦ నుంతు మిపుడు
నభిలషించెద నాకోర్కె ♦ నాదరింప. 46

తే. తనువునం గలసారంబుఁ ♦ దనివి తీఱఁ
బాన మొనరింప జర నాత్మ♦భార మెల్లఁ

దనయులం దుంచి పరిలఘు•తనువు లగుచు
నరుగుదురు ధన్యు లిలను లో•కాంతరముల. 47

తే. నులిమి పదమునఁ గంఠంబు • బలిమి నెపుడొ
యిష్టపడకున్న శమనుండు • కష్టపెట్టి
యీడ్చుకొని పోవు జనముల • నెంచఁగ నది
మేలె వారలు ధన్యులె • మీఁదు గలదె. 48

చ. తనపద మొక్కపాత్రమున • దార్కొన నిల్పి జరాభరంబునన్
దనువు కృశింప వీడి సుఖ•తండములన్ బను లేమి లేకయే
మను చోకమాంసపిండ మని • మానవులెల్ల ననన్ గడించిరన్
ఘనపరలోకసౌఖ్యముల • గాఢతరం బగులాభ మయ్యదే. 49

తే. కాన నీవస్తువున కేను • గాంక్షఁ జేసి
మిమ్ముఁ బ్రార్థింతు వినుఁడు ని•క్కమ్ముగాను
ననుచు సుఖములనెల్ల న•వ్యపహితముల
వీడి నన్యసుఖంబుల • వేడ్క నిలిపె. 50

వ. అదె ట్లనిన. 51

సీ. తరుమూలముల హర్మ్య•తలము లటంచును లతల నంతఃపుర•లలన లనుచు
వల్కంబులు దుకూల•వస్త్రంబు లనుచును సారంగములమిత్ర•చయములనుచు
జటలఁగూర్చుట కేశ•చయముఁగూర్చుటయంచుమూలంబులాహార•జాలమనుచు
నక్షసూత్రము పట్టు • టస్త్రధారణ మంచు ధర్మకథలు నర్మ•కర్మ మనుచు

తే. నెంచె నారాజు పరము జ•యింప నెంచె
నుంచెఁ గోశగృహాస్పృహ • నురుతపమునఁ
గుసుమకుశసమిదాదులఁ • గొంచురాను
నవనిపాలనదక్షత • నలవరించె. 52

చ. తనయులయందు నుండెడుని•తాంతపుఁగూరిమి వృక్షపంక్తులం
దునిచెను సర్వభోగముల • నుండెడురాగ మరాగతన్ శమం
బున రణకాంక్ష నుంచె నల•భూపతి యాజ్ఞను మానమానుటం
దునిచెను దాపసవ్రతము • నూనెను దత్క్రియలెల్లఁ జేయుచున్. 53

చ ఒకమెయి సిగ్గు వీడి యెటొ • యున్నతమానసహంసపుత్రియున్
బ్రకటసుశీల చిత్రరథు•పట్టియు నిత్యము తత్తదర్హమౌ
సకలసపర్యలన్ సలుప • క్ష్మాపతి వానిని నుజ్జగించి వా
రక వఱువాఁత మావు ధయున•రాజును గాంచుచు దుఃఖ మొంచకే. 54

ఆ. పట్టమహిషితోడఁ ♦ బరివారములతోడ, మంత్రితోడ నతని ♦ మగువతోడ
నుండె నచటనె సక ♦ లోర్వీధవులతోడ, సతత మదియె యిల్లు ♦ సల్పి నృపతి.

వ. అని చెప్పి యాజాబాలి కథవినుచున్న హారీతప్రముఖుల నాసమస్తతాపసుల నాలోకించి యిట్లనియె. 56

తే. ఈకథారసాకర్షణ ♦ చాకచక్య, మరసితిరె మీరు మానసం ♦ బపహరించె
దేనిఁ జెప్పంగఁ బూనితి ♦ దాని విడిచి, దూరమరుదెంచితినికథా ♦ చారిమమున.

క. సురలోకభ్రష్టుండై, ధర వైశంపాయనుఁ డనఁ ♦ దనయువినీతిన్
వరశుకనాసాత్మజుఁడై, స్మరహతచిత్తుం డెవండు ♦ సంజనియించెన్. 58

క. అతఁడే యీతండు స్వయం, కృతమగునవినయమునఁ బిత ♦ కినిసి శపింపన్
సతి హంససుతయుఁ దిట్టన్, క్షితి శుకజాతిని జనించె ♦ శీఘ్రము యవుడే. 59

చిలుకకు స్వవృత్తాంతమును విన్నంతఁ బూర్వవిద్యలు వచ్చుట.

క. అనవుడు నతఁ డాపసితన, మున సుప్తోత్థితునకట్లు ♦ మునుపటిమేనన్
గనినట్టివిద్య లెల్లన్, గనఁబడి జిహ్వాగ్రసీమ ♦ నాట్యము సల్పెన్. 60

ఆ. సకలకళలయందు ♦ సామర్థ్య మొదవెను, మానవునకుఁ బోలె ♦ మధురమృదుల
కలితలలిత మగుచుఁ ♦ గమ్రమౌ వాక్కును, గలిగె నాకు నవుడె ♦ కౌశలంబు.

సీ. సంప్రాప్త మయ్యెను ♦ సర్వవస్తుజ్ఞాన మలమహాశ్వేతపైఁ ♦ గలిగెఁ గూర్మి
యాకామవశతయు ♦ నలరెను దదవాప్తిఁ గూర్చి యుత్కంఠత ♦ గూరెమిగుల
నరపతిసుతుపైన ♦ నడరె నాస్నేహంబు నలరెఁ దరళికతో ♦ ననిన మాట
మును నేను వ్రాసిన ♦ ముద్దుపద్యము మ్రోలఁ గనులఁగట్టినయట్లు ♦ గానఁబడియె

తే. వినఁబడెఁ గపింజలుఁడు నన్ను ♦ ననినపల్కు
కలిగె సర్వంబు మానవ ♦ కాయ మొండు
తక్క తెక్కలు రామి నా ♦ తరుణమునను
పూర్వభవచేష్టితంబులు ♦ పొందవయ్యె. 62

సీ. తలిదండ్రులకును నా ♦ తాత తారాపీడపతికిఁ దల్లి విలాస ♦ వతికి మఱియు
నమలమిత్త్రుండు చం ♦ ద్రాపీడునకు నట్లు తొలివయస్యుఁడు కపిం ♦ జలసుమతికి
మద్బహిఃప్రాణంబు ♦ మహితతపస్విని యగుమహాశ్వేతకు ♦ నమలమతికిఁ
దత్ప్రాణసఖికి నా ♦ దర్పకులేఖను దాని కందించిన ♦ తరళికకును

ఆ. నెవరి కెవరి కెట్టు ♦ లెట్లు జ్ఞప్తికివచ్చి,తినో యెఱుంగఁ బూర్వ ♦ దేహకలిత
సర్వవృత్తమొక్క ♦ సారిగ నవగతం, బగుటఁ జేసి ముదితుఁ ♦ డైతి నేను. 63

తే. కడుఁ బ్రహ్మాస్త్రాంశరాత్మసం♦కలితుఁడ నయి
శిర మవనతంబుఁ గావించి ♦ క్షితిని మోపి
చాలతడ వుండి నిజదుష్ట♦చరిత వినట
కలిగినత్రపా భరంబునఁ ♦ దలను బైకి. 64

తే. ఎత్తఁ జాలక యొట్టెటో♦యొత్తి సుంత, గాంచిజాబాలిపినయుంబు♦కదురఁగేలు
మోడ్చిమెల్లనసిట్లంటి♦మునివరేణ్య!, త్వత్ప్రసాదంబుననుదెల్పఁ♦దాల్చినాఁడ.

చ. తలపున కెల్ల బాంధవులు ♦ తారొకని రక్షత నిన్నినాళ్లు వా
రలు స్మృతి కెట్లు రారో యట ♦ రావు తదీయవియోగదుఃఖముల్
తలఁచిన వారి సిప్పుడు వి♦దారిత మయ్యెడు నాదుడెంద మ
ల్లలనగుఁ గాదు రాసుతుని ♦ నాత్మఁ దలంచినయట్టు లక్కటా. 66

చ. అగలక యుండునే యతని♦స్వాంతము నాస్థితి విన్నయంతనే
యగపడకున్న నేను నొక♦యర్ధనిమేషము తల్లడిల్లు నా
యగణితసద్గుణుండు నను ♦ నారయ కెన్నిదినంబు లుండునా
వగను దదీయవృత్తమును ♦ వారక తెల్పి యనుగ్రహింపవే. 67

క. తెలిసినఁ దదీయవృత్తము, చెలఁగుచుఁ జని వానిచెంతఁ ♦ జేరి వసింతున్
దెలియవు తిర్యగ్యోనిని, మెలఁగెడునా కవుడు వెత లు♦మేయమనీషా!. 68

క. అని నేను మనవి సలుపఁగ, మునిపతి జాబాలి నన్ను ♦ మొగిఁ గని యార్ద్రన్
గని స్నేహకోపగర్భము, గను నవెని ట్లనుచు మోము ♦ కళవళపడఁగన్. 69

క. ఓరీ దుర్మతి! యెవ్వతె, కూరిచె నీకిట్టిదశను ♦ ఘోరతరము నా
నారిని చంచలహృదయను, గోరెదు గూడంగ నేల ♦ కుమతిని మగుడన్.

క. తెక్కలు రా వింకను నీ, వెక్కరణిని నెగయఁ జాలు ♦ దింతికడకు నీ
విక్కడనె యుండు నడుపగఁ, జక్కఁగ సామర్థ్యమొనవు♦సమయమువచ్చున్.

తే. అప్పు డడుగుము చెప్పెద ♦ నతనివృత్త
మనుచుఁ జెప్పంగ హారీతుఁ ♦ డతిముదమున
ననియెఁ దండ్రికి నిట్లని ♦ యద్భుతంబు
పొడముచున్నది యీకథ♦పొలుపు విన్న. 72

మ. మునిజాలిం జరియించునీతనికి నా♦మోహాంధ్య మెబ్బంగిఁ దా
ర్జనియించెన్ నిలుపంగఁజాల దుసురున్ ♦ దానన్; సురలోకంబునన్
జననం బందినదీనికాయు విటు లే♦చందంబునన్ స్వల్పమై
తనరెన్ జెప్పవె తండ్రి! యంచు నడుగన్ ♦ దన్మౌనిచంద్రుం డొగిన్. 73

చ. కలుషమలంబు సర్వమును ♦ తూళన నొప్పఁగఁ జేయు నాఁగ ని
ర్మలదశాస్త్రవారులను ♦ రాజిల నవ్వుచు వాని కిట్లనన్
దెలియదె కారణం బిచటఁ ♦ దెల్లము వీడు మనోజరాగమో
హాలసిత స్వల్పసత్త్వ మగు ♦ నంగనవీర్యమునన్ జనించెఁ బో. 74

జాబాలి చిలుకకు నల్పాయువు మొదలగునవి కలుగుటకు హేతువును జెప్పుట.

క. ఎది దేనివలనఁ బుట్టునొ, యది యట్టిది యగు నటంచు ♦ నాగమవితతుల్
విదితముగాఁగ వచించెదు, వదలుము సందియము మదిని ♦ వత్స! తెలియుమా!

తే. ధరను గార్యంబు లెల్లను ♦ దలఁచు హేతు
గుణములనె పొంది వెలుఁగొందుఁ ♦ గోవిదులకుఁ
దెలియు నిది యెల్లవారికిఁ ♦ దెలియ దనుచుఁ
బలుకుచుండు నాయుర్వేద ♦ భాషితంబు. 76

సీ. అల్పసారం బగు ♦ నతివవీర్యంబునఁ బుట్టు నేజంతువు ♦ భూమిపైన
నది స్థైర్యహేతువై ♦ యధికసారం బగుపురుషవీర్యము లేమిఁ ♦ బొందులయము
గర్భమందైనను; ♦ గాంచును బుట్టువు చచ్చియైనను; బుట్టి ♦ చాలనాళ్లు
బ్రతుకదు; వీఁ డట్టి ♦ భవము నందెను గానఁ గలిగె నీదృశమగు ♦ కామపరత

తే. కామవేగజ్వరంబును ♦ గడఁగి సైఁపఁ, జాలమిని గల్గె దీనికిఁ ♦ జావు నట్టు
లివుడు నల్పాయువే యీతఁ ♦ డింక మీఁద, నందు దీర్ఘాయువును శాప ♦ మరిగినంత.

క. అనుటయు నే నామాటలు, విని యవనితలంబునందు ♦ విని వేశితమా
ళి నగుచు మ్రొక్కుచు నతనికి, మునవి యొనర్చితిని నిట్లు ♦ మాన్యచరిత్రా!

వ. అయ్యా! నేను మందభాగ్యుండ. ఈతిర్యగ్యోనియందుండి యేమి యొనర్పను నసమర్థుండ. నాకు వాక్కును నీయనుగ్రహంబువలన నిపుడు సంప్రాప్తంబయ్యె. తొల్లింటి తెలివియు నలవడె. మీయనుగ్రహంబుకతంబున నాయుస్సంవర్ధకంబులగుకర్మముల ననుష్ఠింప సమర్థంబైన శరీరంబు మఱుమేన నాకు సంభవించు నేని మహాకర్మసాధ్యం బగునక్షయంబైనయాయువు నా కెబ్బంగిఁ గలుగఁ గలదో యదియు నానతీయవే యని నే నడుగుటయు నామునికులపతి జాబాలి నలుదిక్కులన్ బరికించి యిట్లనియె. ఇదె క్రైటింగితివో యదియు నట్లెఱుంగఁ గలవు. ఈకథ యిట్లుండనిమ్ము. ఏతత్కథారసాకర్షణంబుచే మనకుం దెలియక యె తెల్లవాఱవచ్చె. 79

## ప్రభాతవర్ణనము.

చ. అదె ద్విజరాజబింబ మప♦రాంతమునందు వెలుంగు ప్రేలుచున్
సదమలకాంతి వీడి మలి♦నంబయి తోమనివెండికుండ నాన్
బొదలుచుఁ బంపయందుఁ గల♦భూరిపతత్త్రులు మేలుకొన్న యా
మృదులమనోహరధ్వనులు ♦ మీాఱెను శ్రావ్యము లౌచు నెల్లెడన్. 80

చ. అరుణపురస్సరాగ్రరుచి♦రావళి పూర్వదిగంగనాతమ
స్సురుచిరకేశపాశమును ♦ సొంపునఁ బాపటఁ దీసి దువ్వుచున్
జరదరవిందపత్త్రముల♦చాయను లోహితపాండురచ్ఛవిన్
బరఁగెడిఁ జూడు మీఁచెడిని ♦ బాలసమీరుఁడు మెల్లమెల్లనన్. 81

తే. తిమిరము సశేషమై యుంట ♦ దివి నకాండ
కలుషితము లైనయీాప్రభా♦కరుని ప్రభలఁ
జొరఁబడఁ దొడంగె నోలిని ♦ సూక్ష్మముగను
నొక్కఁ డొక్కఁడుగాఁ దార ♦ లుడిగి కాంతి. 82

తే. వీతిహోత్రునిఁ గొలువంగ ♦ వేళ యయ్యె
స్నాన మాడెదుతటి యయ్యెఁ ♦ జనుఁడు మీారు
నేను నరిగెద ననుచు నా♦మౌనివరుఁడు
గోష్ఠిఁ జాలించి లేచెను ♦ నిష్ఠఁ దీర్ప. 83

వ. అంత. 84

సీ. లేవ నాజాబాలి ♦ పావనతాపసపరిమత్తు తత్కథా♦పరతఁ దవిలి
మఱచి గురూచిత♦సుర్యాద లన్నియుఁ దత్కథాశ్రవణంబుఁ ♦ దవిలియె యన
నుత్కంఠతను నద్భు♦తోల్లసన్ముఖుయయి యొక్కసారిగ నెల్ల ♦ నుమ్మలించి
హా హా యటంచును ♦ హర్షశోకాశ్రులు ధారలై కాఱంగ ♦ స్తబ్ధ మనఁగ
ఆ. వీతరాగ మయ్యు♦వీతకౌతుక మయ్యు, మోక్షమార్గమునను♦మొనసి యుండి
విడిచి నన్ను నచట ♦ వెడలంగఁ జాలక, యుండెఁ జాలకాల ♦ మూర్ధ్వరేళ! 85

తే. అంతఁ దమతమనెలవుల ♦ కరిగె నఖిల, తాపసవ్రాత మంతయు; ♦ దండనున్న
మునికుమారకబృందంబు♦పనుప కెవరిఁ, గొంచు జనియెను హారీత♦కుండె నన్ను.

క. కొనిచని స్వవర్ణశాలకు, నునిచి స్వశయ్యకుఁ గుఱఁగట ♦ నుచిత మగుస్థలిన్
జనియెను బ్రాభాతికవిధు,లను దీర్పఁగ నంత నే వి♦లక్షణుఁ డగుచున్. 87

## చిలుక స్వస్థితింగూర్చి చింతించుట.

తే. సకలకార్యంబు లొనరింపఁ♦జాల నట్టి, పక్షిజాతిని జననంబుఁ ♦ బడసినాఁడ

నక్కటక్కట యని వగ♦నడరుమదిని, దలఁప సాగితిఁ దద్వ్యథఁ♦దాల్మిఁదూలి.

చ. ఇలను ననేకజన్మముల ♦ నేచినపుణ్యవిశేషసంపదన్
గలుగునరత్వమే మిగులఁ ♦ గష్టము పొందఁగ; దాన సర్వజా
తులకును నెక్కుడై తసరు♦తోరపువిప్రత యింకఁ గష్టమా
గలుగఁగ; ముక్తి దాఁపునను ♦ గ్రాలుమునిత్వము నింకఁ గష్టమా. 88

ఉ. కష్టతమంబు గాంచ ముని♦కాంక్ష్యము నిర్జరలోకవాసమున్
భ్రష్టుఁడనైతి నట్టిసుర♦వాసమునుండి నిజావినీతిచే
దుష్టుఁడనై జనించితిని ♦ దుచ్ఛవిహంగమజాతి నక్కటా
కష్టము దీనినుండి కడఁ♦గాంచుట యెట్లొకొ యేమి సేయుదున్. 89

చ. కలుగును నెట్లు పూర్వభవ♦గాఢతరప్రియతామహత్త్వసం
కలితసమాగమోరుసుఖ♦కౌతుక మక్కట దానిఁ గాంచనేన్
గలుగును నేమి వ్యర్థముగఁ ♦ గాచితియీలఘుజీవితంబు చేఁ
దలఁగెద నారకాత్మ నిఁకఁ ♦ దాల్పఁగ రాదు సుఖంబు దీనిచేన్. 90

ఉ. ఎందుల కీశరీర మిఁక ♦ నెం దయినన్ బడిపోవుఁగాక నా
కందఁగఁ జేయు దుఃఖముల ♦ నాత్మను నెప్పుడు చింతఁ గూరుచున్
గుందుచునుండు నల్ల విధి♦కోరిక లీరిక లెత్తుఁ గావునన్
గందఁగ నేల యంచు మది ♦ గట్టిగడంకను వీడఁ బ్రాణముల్. 91

చ. తలఁచుచుఁ గన్ను మూసితిని, ♦ దార్కొని నంతనె మొల్కనవ్వులన్
విలసితమై ముఖాంబుజము ♦ వేడ్కలు నింపగ సంభ్రమంబునన్
బలుకుచు నన్న! వర్ధిలుదె ♦ బాగె యటంచు హారీతకుండు నే
నులికిపడంగఁ; దార్కొని స♦ముచ్ఛ్వసితున్ దగఁ జేయు చిట్లనన్. 92

తే. అరుగుదెంచెను నీతండ్రి♦సరసనుండి
యల కపింజలుఁ డల్లదె ♦ యరయు మనుచుఁ
జెప్ప నప్పుడె రెక్కలు ♦ చెందినట్లు
వానికడ కేగఁ దలఁచుచు ♦ స్వాంతమునను. 93

వ. ఒక్కింత కంధరం బెత్తి యతం డెక్కడ నని హారీతు నడుగ నతం డిట్లనియె.

తే. అతఁడు మాతండ్రికడనుండు ♦ ననుచుఁ జెప్ప
నటకు ననుఁగొనిపొమ్ము నే ♦ నరుగుదెంతు
నతనిఁ గాంచంగ నాడెంద ♦ మధికకుతుక
మనుచు నుండఁగ నతఁ డట ♦ కరుగుదెంచె 95

కపింజలుఁడు చిలుకయొద్దకు వచ్చుట.

సీ. చదలునఁ బఱచిన ♦ సత్వరంబున వీడి చెదరినకెంజటా♦శ్రేణితోడ
వాయుసరణివచ్చు♦వడి జాఱి నేలపైఁ జేరాడుపై వల్వ♦చెఱఁగుతోడ
నర్ధత్రుటిత మైన♦యజ్ఞోపవీతంబు కలుగునిర్మాంసవ♦క్షంబుతోడఁ
జదలెల్లఁ దిరిగిన♦శ్రమమునఁ బైపయి జనియించునిట్టూర్పు♦చయముతోడ
తే. గట్టిగా వల్కలంబునఁ ♦ జుట్టి నడుము
నన్నుఁ గన్నదుఃఖంబున ♦ నయనజలము
పెల్లుగాఁ గురియుచు దుర♦పిల్లు చెదురఁ
గనఁబడెఁ గపింజలుఁడు క్లిన్న♦గాత్రుఁ డగుచు. 96

ఆ. మలయమారుతములు ♦ పొలయుచు నున్నను, నాకసమున కెగిరి ♦ యధిక ఖేద
మంది గగనగంగ♦యందుఁ జొచ్చుటఁ జేసి, యాననమునఁ జెమట♦లలరువాఁడు.

సీ. పరమముముక్షువై ♦ పరఁగియు నాపైని స్నేహంబు విడలేక ♦ చెలఁగువాఁడు
వీతరాగుం డయ్యు ♦ విడనేరమిని నన్ను మఱిప్రియహితుఁడయి♦మనెడువాఁడు
నిస్సంగుఁ డయ్యును ♦ నిచ్చలు మత్సమాగమమహోత్సుకతను ♦ గ్రాలువాఁడు
నిర్మముం డయ్యును ♦ నిత్యసమారూఢమదనురాగుం డయి ♦ పొదలువాఁడు
తే. సుంతయును దురహంక్రియా♦శూన్యుఁ డయ్యు
నేనె యితఁ డని నన్నెప్పు ♦ డెంచువాఁడు
క్లేశముల వీడి నాకుఁగాఁ ♦ గ్లేశపడుచుఁ
బ్రాణమునకుఁ బ్రాణంబయి ♦ పరఁగువాఁడు 98

వ. అట్టికృతజ్ఞుని స్నేహలప్రకృతిని సుకృతిని ననుగతునిభావార్ద్రహృదయుని మహాత్మునిఁ గపింజలుని గని నకృతజ్ఞుండ రూక్షచిత్తుండ మందభాగ్యుండ వామస్వభావుండ నేకాంతనిష్ఠురుండ దురాత్ముండ నగునేను నుద్వేలబాష్పప్రవాహుండనై ప్రత్యుత్థానం బొనరింపఁ గడంగి యున్నని నిట్టూర్పు నిగిడించి యతనితో నిట్లంటి. 99

శుకకపింజలులసల్లాపము.

చ. కడచెను రెండుజన్మములు ♦ గాంచి నినుం సఖ! కంటి నేఁటికిం
గడువడి లేచి దవ్వనె ♦ గారవ మారఁగఁ జాఁపి చేతులం
గడు బిగియారఁ గౌఁగిట న♦ణంచి తదీయసుఖంబుఁ బొంద ని
ప్పు డలఁతిఁ గేలు పట్టికొని ♦ పోయి వసింపఁగఁ జేసి పీఠికన్. 100

చ. శ్రమ ముడుగంగ వీచి పద♦సంవహనం బొనరించి తేర్ప న
క్షముఁడను నే నటంచు మది♦ గాటపుటుమ్మలికం గలంగునన్
సుమతి కపింజలుండు గని♦ శోకముఁ గూరుచు లేపి కేల వ
క్షము గదియించి నన్నుఁ జిర♦కాలము కౌఁగిటఁ జేర్చి సొక్కుచున్. 101

తే. కౌదల ఘటించి మచ్చర♦ణాంబుజముల
మన్యురయ మారఁగా నస♦మర్థుఁ డగుచుఁ
బ్రాకృతునియట్లు దుఃఖించెఁ♦ బ్రాణమిత్రుఁ
డట్లు దుఃఖించు నాసఖు♦ నట్టె గాంచి. 102

వ. వాగ్మాత్రంబుచేనైనఁ బ్రతీకారంబుఁ గావింప నెంచి యతని కిట్లంటి. 103

తే. సఖ! కపింజల! క్లేశసం♦చయపరీత, పాపి నగునాకుఁ జెల్లు నీ♦భంగి నగవ
నీకుఁ జెల్లునె నిర్వాణ♦నిత్యశాత్రవులు మహాసంసృతినిపాత♦ము లగువగలు.

క. బాలుఁడ వగుతత్రి వీనికిఁ, దూలవె యిపుఁ డేల యిట్లు♦ దూలెదవు గదున్
జేలవయి మూఢజనములు, వాలాయము నడచుత్రోవ♦ వర్తింతు కటా.

క. రమ్మిటు కూర్చుండుము సఖ!, యిమ్ముగ నడచినది యెల్ల♦ నెఱిఁగింపఁ గదే
యమ్మయు నయ్యయుఁ గుశలురె, మమ్ములఁదలఁతురె వగతురె♦మద్వ్యసనములన్.

క. విని నావృత్తము జనకుం, డనియెను నేమంచుఁ గినుక♦నందెనొయంచున్
వినుచు మన నతఁడు హారీ,తునిశిష్యుఁడు తెచ్చినట్టి♦తోరపుఁబీటన్. 107

ఆ. అధి వసించి నన్ను♦ నంకతలంబున, నుంచికొని హారీత♦కోపనీత
సలిలమునను మోము♦ క్షాళన మొనరించి, చెప్పసాగె నిట్లు♦ చిత్రముగను.

సీ. సఖ! నీదుజనకుండు♦సౌఖ్యమందుచునుండుమనయీయుదంతంబుఁ♦గనెనుదో
దివ్యదృష్టినిఁగని♦ద్రిప్పనాయశుభంబుసత్కర్మమొండుదా♦సలుపఁగడఁగెఁ[లిన
గడఁగుడునవు డశ్వ♦శాయంబు విడి నేను జనితిని దత్పాద♦సమిధమునకుఁ
జని భయంబున డాయఁ♦జనక దవ్వున నుండి కన్నీరు కార్చున♦న్గాంచికరుణఁ

ఆ. జేరఁ జీరి యిట్లు♦ జేసెను నానతి, విడు స్వదోషశంక♦ కొడుక! యిందు
నాదెదోషమెల్ల♦ నారయ నెఱిఁగియు, సలుపనేమి జనన♦సమయమునన.

తే. ఇప్పు డాకార్య మైనట్ల♦ యేల యింక, నుమ్మలింపంగ నాకడ♦నుండు మనుచు
నాన తీయంగ గతభయుఁ♦ డౌచు నేను, నతని కిట్లంటిని వినీతి♦యదరమిగుల.

తే. జనక! కలదేని నాపైని♦ సాకతంబు
పుట్టె నెచ్చట నీతండు♦ పోవ నటకు

నాజ్ఞ నొసఁగుము నా కని ♦ యడుగుటయును
నాతఁ డిట్లనె మరల నా ♦ కధికకృపను. 111

తే. అందె జన్మంబు శుకజాతి♦యందు నాతఁ
డేగినను నీవు వానిని ♦ నెఱుఁగలేవు
వాఁడు నిన్నును నెఱుఁగంగ♦ లేఁడు తలఁప
నుండు నాయొద్దనే దక్క ♦ యొండుతలఁవు. 112

క. అని నేఁటిప్రభాతమ్మున, ననుఁ బిలిచి భవత్సఖుండు ♦ నయమార మహా
మునిజాబాల్యాశ్రమపద,మునకు నరుగుదెంచినాఁడు ♦ పూర్వభవికముల్.

క. తెలిసికొనువలను నతనికిఁ, గలిగెను నివు డరుగు మటకుఁ ♦ గన్గొన వానిన్
చని నేను జెప్పినట్లుగ, నను మతనికి ననుచు నిట్టు ♦ లనియెను నాతోన్.

తే. పుత్ర! నాచేయుకర్మంబు ♦ ముగియుదాఁక, నుండవలయును జాబాలి♦నంతనీవు
చనకు మెం దని నుడివె నీ♦జనని లక్ష్మి, యందెయున్నది సేవించు♦చతనినిపుడు.

తే. ఆమెయు శిరంబు మూర్కొని ♦ యనియె నిట్లు
సారెసారెకుఁ ద్వద్దుఃఖ♦సాగరమున
మునుక లిడుచున్నయది సఖ! ♦ యనుచుఁ జెప్పి
యల్లనల్లన నా మేను ♦ హస్తమునను. 116

క. తడవుచు వ్యత్యస్తం బగు, నొడలును సరిదిద్దు చెదను ♦ నడలఁ దొడఁగె; నా
వడవున నడలెడు వానినిఁ, గడువగఁ గని యంటి నిట్లు ♦ కరుణ యడరఁగన్.

క. కంటివి తురంగమత్వము, నుంటివి యొకనొద్ద లొంగి ♦ యురుపుణ్యుఁడ వీ
వొంటిగ నాకై పాపికిఁ, గంటివి బహుదుఃఖములను ♦ గడగండ్లఁ గటా.

సీ. సోమపానార్హమై ♦ సొగయునీ కోటను గవికరాయిడి నోర్వఁ♦గలిగి తెట్లు
మెత్తనిపూసెజ్జ ♦ నొత్తిలు నీవీఁపు గంతయొత్తిడి లాడిఁ ♦ గాంచ దెట్లు
పూలు రాలిన నోర్వఁ♦జాలనినీ మేను ఖరకశాహతు లోర్వఁ ♦ గలిగె నెట్లు
బ్రహ్మసూత్రము మోయ ♦ బడలునీయంగంబుబందంబునోరిపిల్లఁ♦గంద దెట్లు

తే. చదువుకొనుపాత్రముల మోయఁ♦జాలనట్టి
యతఁడ వీ వెట్లు మోసితి ♦ వధిపసుతుని
ననుచు నిది యాది యగు తోలి♦తనువువార్త
లాడితి విహంగమత్వాధి ♦ వీడి నుంత. 119

వ. అంత మధ్యాహ్నం బగుడు హారీతుండు కపింజలునకును నాకును యథోచి

తాహారంబు నొసంగె. కృతాహారుండైన కపింజలుండు క్షణ మూరకుండి
నాతోడ నిట్లనియె. 120

మ. చనరా రొండెడ కీవు వీడి మునిరా♦ట్జాబాలిపాదాబ్జముల్
తనసత్కర్మము పూర్తియౌ దనుక నీ♦స్థానంబునం దుండఁగా
వ్జను నంచుం దెలుపంగ నీకుఁ బనిచెన్ ♦ నన్దండ్రి; నే నావనిన్
విని యుక్తుండను బోవఁగావలయు నే ♦ నిల్వంగరా దం చనన్. 121

మ. విని నే నావచనంబు డెందము గదుర్ ♦ ప్రీతిన్ విషణ్ణుండనై
యనిన న్నీ విటు లేమి చెప్పుదు సఖా! ♦ యాయంబరున్ దండ్రికిన్
బనుతున్ వాచిక మే మెఱుంగుదువు స♦ర్వం బీ వనన్ నేను న
న్ననుపం జెప్పి హారీతుతో నచట వి♦ద్యున్మార్గమున్ బట్టి తాన్. 122

చ. చనియెను వాఁడు తాపసులు ♦ సర్వులు విస్మయ మంది యుద్గతా
ననులయి చూడఁ; గౌఁగిటను ♦ నన్ను గదించి విసృత్తవక్త్రుఁడై
కని కృప నన్ హారీతకుఁడు ♦ గాటపుటూఱటఁ గొల్పి దేహయా
త్రను సలుపంగఁ బోయె నొక♦తాపసపుత్త్రుని నుంచి నాకడన్. 123

వ. అంత నాహారీతుండు స్నానాదిక్రియాకలాపంబులనెల్ల నిర్వర్తించికొనివచ్చి యపరాహ్ణసమయంబునఁ దనతోడ నాకును నాహారం బొసంగె. ఇట్లతండు ప్రతిదినంబును నాయెడ సావధానచిత్తుఁడై నిర్భరస్నేహంబునఁ గడుఁబ్రీతిన్ బెంపఁ బెరిఁగి పెద్దవాఁడనై రెక్కలు వచ్చి యెగిరిపోవ సమర్థుండనైతి. అంత నొక్కనాఁడు. 124

ఉ. పారఁగ నాకసంబునను ♦ బాటిలె శక్తి నృపాత్మజోద్భవం
బారయఁ దెల్వియుం గలిగె ♦ హంసతనూభవ యల్లదే యుఁకన్
గూరిమిఁ దెల్వి దుఃఖములఁ ♦ గుందఁగ నేటికి వారిఁ గాంచకే
నూరక; పోదు నచ్చటకు ♦ నుండెద రెక్కడ వార లిప్పుడే. 125

—చిలుక జాబాల్యాశ్రమమునుండి తప్పించుకొనిపోయి చండాలునిచేఁ బట్టుపడుట.—

క. అని యొకనాఁటియహర్ముఖమున విహరింపంగఁ బోయి ♦ మునికొని ధనదా
శను బట్టి చనితి బహునాళ్, చన కొకయెడ నుంటఁ జేసి ♦ చని కొంతవడిన్.

చ. శ్రమమున దేహమెల్ల నవ♦శంబయి డస్సెను దప్పిచేత వ
క్త్రము గడునెండె నూర్పులును ♦ దార్కొనె పైపయి నాళమెంతఁ బ
క్షము లెగురంగఁజాలక యు♦సత్వము లయ్యెను నిందు నీమహీ
జముపయి వ్రాలువాఁడ నల ♦ క్ష్మాజముపైఁ బడువాఁడ నం చెదన్. 127

చ. తలఁచుచుఁ బోయి పోయి యొక ♦ ధ్వాంతసమూహమనంగ నెండకున్
నిలువఁగ నీడ లేక దళ ♦ నీలకిసాలయభారనమ్రమై
చెలఁగు సరస్తటీలలిత ♦ శీతలకుంజముపైన వ్రాలితిన్
దలఁగి పథశ్రమక్లమము ♦ తద్దయు సేపున కంత దిగ్గితిన్. 128

సీ. దిగి శీతలచ్ఛాయఁ ♦ దేజరిల్లెడుదాని సైకతస్థలమున ♦ సంవసించి
పంకజకింజల్క ♦ పాంసువాసిత మయి బిసరసతూవర ♦ రసము నగుచు
దళగహనచ్ఛన్న ♦ లలితశీతల మయి త్రాగుకొలఁది నింకఁ ♦ ద్రాగవలయు
ననుతలం పొదవించు ♦ నాసరోవారిని దనివితీఱఁగఁ గ్రోలి ♦ దప్పి తీఱ

తే. మృదులసారసకర్ణికా ♦ సదమలమధు, బీజములఁ దీరతరువర్ణ ♦ పేశలాంకు
రముల నాఁకలి వాపి వి ♦ శ్రాంతిఁ గాంచి, యెండ మిటమిటకాయఁగ ♦ నేగలేక,

ఉ. వ్రాలినఁ బశ్చిమాశ రవి ♦ వర్త్మముఁ బట్టుద మంచు నెంచి నేఁ
దూలఁ బథప్రయాస మొక ♦ తోరపుకొమ్మలచెట్టుతొఱ్ఱలో
వ్రాలి పథప్రయాసుల ♦ భం బగు నిద్దురఁ గన్ను మూసితిన్
దేలితిఁ జాలసేపు సుఖ ♦ నిద్రను విస్మృతిఁ జెంది దేహమున్. 130

ఉ. అంతఁ బ్రబోధ మంది విని ♦ యంత్రితదేహుఁడ నౌచు నేను న
త్యంతమహోగ్రపాశముల ♦ నగ్రతలంబునఁ బాశహీనుఁ డ
య్యంతకుఁడో యనంగ నసి ♦ తాయసనిర్మితదేహుఁడో యనన్
నంతున కెక్క నీలతను ♦ భాసితుఁ గంటిని నొక్కపూరుషున్. 131

సీ. అపరయముం డన ♦ నఘకులాశ్రమమునఁ బుణ్యచయారి నాఁ ♦ బొల్చువాని
రౌద్రరసోద్గార ♦ రక్తకేకరతర పటుతారకలచేతఁ ♦ బరఁగువానిఁ
గోపకారణ మేమి ♦ తోఁపక యున్నను భీషణభ్రుకుటిచే ♦ వెలుఁగువాని
సకలభయంకర ♦ శమనునకును భీతిఁ గొలుపువానిని గడు ♦ నలుపువాని

ఆ. నాశయాలకముల ♦ నస్నిగ్ధుఁ డగువాని, నాస్యమునను దెల్వి ♦ నంధకారు
వర్ణచరితముల సు ♦ వర్ణతురంగుని, వసనకర్మములను ♦ నసితు నతని. 132

వ. మఱియు. 133

ఆ. వచనదేహములను ♦ బరుష నదృష్టాశ్రు
తానురూపుఁ డయ్యు ♦ మేనిప్రత్య
యమునఁ గ్రౌర్యదోషుఁ ♦ డనుచు నూహింపంగఁ
దగినవానిఁ జూచి ♦ తలఁగి యాశ. 134

క. అడిగితి నెవ్వఁడ వీవి, క్కడ కేటికి వచ్చి తేల ♦ గట్టితివి నన్నున్

గుడువఁగ మాంసం బభిరుచి, వాడమిన నిదురించునపుడె♦పొలియింపక నన్.

క. ఊరక నిరాగుసుని నగఁ, గూరఁగ బంధించి తేల ♦ కుతుక మొనఁగున్నన్
కోరిక బంధించితివే, తీఱెఁ గదా కుతుక మింకఁ ♦ దిరుగ విడువుమా. 186

క. ప్రియజనముఁ జూచువేడుకఁ, బ్రియపడి త్వర నేగువాఁడ ♦ విడువుము నన్నున్
దయఁదలఁచి; చాలదూరము,నయగుణ!పోవంగవలయు♦న్యాయమె యాఁగన్.

తే. తామసం బోర్వఁగా లేదు ♦ తథ్య మాత్మ
హృదయ మీవును ధర్మంబు ♦ నెఱుఁగ వెట్టు
లాలసింపక విడువవే ♦ యార్యచరిత!
యనుచుఁ జిత్తంబు కరుగంగ ♦ నంటి నేను. 188

వ. అంత నాతం డి ట్లనియె. 139

ఉ. నే నొకక్రూరకర్ముఁడను ♦ నిక్కము జాతిని మాలవాఁడ నిన్
మానితుఁ గౌతుకంబునను ♦ మాంసముత్పృష్ణను నొండెఁ బట్టఁగాఁ
బూనినవాఁడఁ గాను విను ♦ పూతచరిత్ర! మదీయరక్షకుం
డీనికటస్థపక్కణము ♦ నేలెడువాఁడు మతంగుఁ డుండెడున్. 140

చ. అతనిప్రియాత్మజాత నవ♦యౌవనభూషిత కౌతుకాత్మ యా
యతివ దురాత్ముఁ డెవ్వఁడు మ♦హాత్ముని యీమునియాశ్రమంబునన్
దతగుణ మద్భుతావహము ♦ నవ్యము కీర మొకండు వర్తిలున్
సతి! యని చెప్పె వాని విని ♦ జాతకుతూహల యాచు నన్నుదేన్. 141

చ. పనిచెను బెక్కురన్ జనుల ♦ భామిని మాదృశులన్ మహాత్మ! నేఁ
గనితిని నిప్పు డిచ్చుటనుఁ ♦ గానిలి పుణ్యము చేసి యెంతయున్
గొని చనుదున్ మదీయవిభు♦కూఁతుపదంబులయొద్ద కంత నా
వనిత వలంతి నిన్ను విడ ♦ బంధము వాపి వలంతులే యొరుల్. 142

చిలుక చండాలునిచేఁ జిక్కి చింతించుట.

క. అనుటయు నే నాపలుకులు, విని భిదురము మాళిఁ బడ్డ♦విధమున వగపున్
గను చుద్విగ్నాత్ముఁడనై, మనమున ననుకొంటి నిట్లు ♦ మనుజవరేణ్యా!.

సీ. సకలసురాసుర♦సత్కిరీటార్చిత పదపద్మ యగుశ్రీకిఁ ♦ బట్టి నగుచుఁ
ద్రిభువనజనవంద్య♦దివ్యమహామునిశ్వేతకేతువు ప్రీతిఁ ♦ బెంపఁ బెరిఁగి
సకలాభివాంఛిత♦స్వర్గలోకాశ్రమ సతతనివాసైక♦సౌఖ్య మంది
నిరతవేదాభ్యాస♦పరత నొలఁగువిప్రపరిమత్తులో మాన్య♦పదవిఁ గాంచి

తే. పేరుఁ గాంచిన నా కరమో ♦ ఘోరదుష్ట
మున్కరతురుష్కజాతిని ♦ మొనసి దూర
మునను ద్వజియింపఁ దగుమూఢ♦జనమతంగ
పక్కణంబుఁ బ్రవేశింప♦వలసె నకట 144

చ. ఒకయెడ నుండఁగావలయు ♦ నొప్పి మతంగులతోడ నొక్కచోఁ
బ్రకటజరన్మతంగకుల♦భామ లొసంగెడు నన్నభుక్తి నం
గకములఁ బెన్పఁగావలయుఁ ♦ గాఁ బ్లవబాలురకెల్లఁ గేళికం
దుకమును గావలెన్ హతక! ♦ దుష్టుఁడ! నీ విఁకఁ బుండరీక! పో. 145

చ. పరగెను నీదుకర్మపరి♦పాక మి టొచు సహస్రభంగులన్
బరియలుగాఁగ శీర్ణమయి ♦ పాపివి పోవఁగరాదె తొల్లనే
శరణము నీదు పాదములు ♦ సర్వగఁకున్ జననీ! రమా! ననున్
బరిగహానప్రభీతుఁడను ♦ బాపి భయంబును బ్రోవవే దయన్. 146

తే. తండ్రి! భువనత్రయాపావన♦పతీ! వంశ, తంతువును నొక్కనినినన్ను♦మంతువుడిపి
ప్రోవవే నీవు పెంచితి ♦ పుణ్యమూర్తి!, నిర్దయతఁ జూచెదే యిప్డు♦నిన్ను నీవ.

తే. సఖ! కపింజల యేదిక్కు ♦ జనితి వయ్య
తిరిగి వేగిర మీవు చన్♦దెంచి యిటకు
నన్ను విడిపింప కుండిన ♦ నాసమాగ
మాశ విడువంగవలయు జ♦న్మాంతరమున. 148

తే అనుచు నీగతి మఱియు న♦నన్యప్రకార
మునను మనమున విలపించి ♦ మూర్ఛఁ గాంచి
తేటి యొక్కింత ప్రార్థనా ♦ దీనముగను
నంటి యామాలకి ట్లని ♦ యడలు చేను. 149

క. జాతిస్మరణము కలిగిన, జాతిమునిని నన్నుఁ బాప♦సంకట మనుపెన్
ఘాతమువలనన్ బాపిన, నాతతపుణ్యంబు నిన్ను ♦ నందు సులువుగన్. 150

క. కన రెవ్వరు విడిపించినఁ, గనినను బాపంబు నీకుఁ ♦ గలుగదు కరుణన్
జూనివి మది విడువు న న్నిఁక, ఘనమతి! భద్రముఖ! నతులఁ♦గావింతు నిదే.

చ. అనుచుఁ బదంబులన్ బడితి ♦ నాతఁడు నవ్వుచు మోహితాత్మ నీ
తనువునుండి ధర్మము న♦ధర్మముఁ గాంచెదులోకపాలకుల్
గనుఁగొన రేవు రెవ్వనిని ♦ గాంచెద రన్యు లటన్న భీ నఘుం
బొనరుపఁ డాతఁ; డేమిటికి ♦ నొందుదు భీతిని నిర్భయంబుగన్, 152

చ. ఇదె కొనిపోవుదుఁ గనుమ ♦ యిప్పుడె స్వామియనుజ్ఞ నంచు వాఁ
డదయత నన్నుఁ గై కొనుచు ♦ నట్టె స్వపక్కణ ముంపునాకకున్
గదలెను; నేను దద్వచన♦గాఢగదాహతి భిన్నమూర్ధనై
గదలక మూకభావమును ♦ గాంచి మనంబున ఖేద మొందుచున్. 158

క. తొలి నాయేకర్మంబుల, ఫలమో యిది తెలియ దనుచు ♦ భావించు చెదన్
దలఁగఁగఁ బ్రాణము ధైర్యముఁ, దలఁకక దృఢనిశ్చయంబుఁ♦దాల్చితి నంతన్.

చిలుక మాలపల్లెకుం గొంపోఁబడుట.

క. కొనిపోఁబడు చాతనిచేఁ, గని కరుణను విడుచు నన్న♦గాఢతరాశన్
గనుఁగొంటి ముందుఁ గంఠంబును జాఁపి యొకండు నరక♦భూమిని బల్లెన్.

క. అది తత్పక్కణ మంచును, మది నిశ్చయముగఁ దలంచి ♦ మత్ప్రాణంబుల్
వదలఁ దొడంగెను విడి నను, గదిరెను మేనెల్లఁ జెమట ♦ కదిరె వణంకున్.

సీ. బీభత్సవేషులు ♦ పీవరమూర్తులు నాఖేటకనివృత్తి♦హస్తధనులు
మృగవిపాటితజీర్ణ♦మేదురవాగురాసంగ్రథనవ్యగ్ర♦చతురమతులు
నావర్తకానాయ♦కార్ష్ణకానిభృతాంగులు మలినతా♦సంగతనులు
నుత్త్రుటితోన్నాథ♦కోద్గ్రథనాయుస్తకుంతప్రచండాస్త్ర♦ఘోరకరులు
తే. గ్రాహకవిహంగమానేక♦పవకుళిలులు, సారమేయవిముక్తిసం♦చరణపరులు
నైనచండాలబాలకు ♦ లాడుచుంద్రు, వేఁట లాపక్కణమ్మున ♦ వీధులందు.

ఆ. నెదుకుపొదలనడుమ ♦ వెల్గు నాపల్లియుఁ, గానరావు డాసి♦కాక యిండ్లు
విస్రగంధ మగుచు ♦ వినువీధి కెగసెను, పొగఁ గనంగవచ్చుఁ♦బొలుచునంచు.

చ. పరఁగును నస్థికూటములె ♦ వప్రములై యటఁ జుట్టు వీధులన్
బరఁగును నెందుఁ జూచినను ♦ బావాళికీకసఖండజాలమే
పరఁగును నేకుటీరమునఁ ♦ బ్రాంగణభూముల నెత్తురేర్లు దు
ర్భర మగుమాంసకర్దమము ♦ పాటితజంతుశవవ్రజంబులున్. 159

చ. మనుగడ వేఁట భోజనము ♦ మాంసము శయ్యలు చర్మముల్ వసన్
ఘున మభిలాష ద్యూతమునఁ ♦ గాంతలమధ్యమునన్ బునర్థ మూ
శునకములే బలంగములు ♦ శోభిలుగోవులె మావు లచ్చటన్
దనరెడువారి కెల్లరకు ♦ ధర్మవిధంబు పశూపహారముల్. 160

తే. సర్వనరకాకృతి యనంగ ♦ సర్వపాప, సత్తనం బన యాతనా♦వాస మనఁగ
సర్వపితృవనసన్నివేశం బనంగ, నలరు నాపక్కణముఘోర♦మగుచు మఱియు.

తే. తలఁచిన భయంకరము విన్న ♦ దారుణంబు
పాపజనకంబు గనిన నా♦పక్కణంబు
జన్మమునఁ గర్మమున నట ♦ జనము లెల్ల
మలినతమములు తలఁపంగ ♦ మనుజనాథ!. 162

తే. క్రూరహృదయులలో నెల్లఁ♦గ్రూరహృదయు,లవ్యవస్థితకాంతాగ♦మాభిలాషు
లచటిజనులెల్ల బాలకు ♦ లాదిచేసి, సర్వజనముల కాచార♦సరణి యొకఁడె.

వ. ఇట్లపుణ్యాకర్షాపణంబై నరకవాసులకు సహిత ముద్వేగకరం బగు నప్పక్క
ణంబుఁ గాంచి రోఁత పొడమి మనమున నిట్లని తలంచితి. 164

క. నను నామతంగబాలిక, కని దూరమునందె కరుణఁ ♦ గాంచి విడుచునో
యొనరుప దేటికి జాతికి, నను వగుకార్యంబు నట్టి ♦ దబ్బునొ నాకున్. 165

క. అరనిముసం బేనియు నేఁ, జరణము నిటఁ బెట్ట నంచుఁ ♦ జాలకడఁకతో
నరయుచు నుండఁగ నాప్లవుఁ,డరిగివినమ్రుఁడయి మ్రొక్కి ♦ యతివినయమునన్.

క. ఈతనిఁ గొనివచ్చితి నే, మాతరొ! యని నన్నుఁ జూపె ♦ మాతంగుం డా
మాతంగదారికకు నది, ప్రీతిని గేల్దోయిఁ గొంచుఁ ♦ బ్రేము దలిర్పన్. 167

క. తనయా! యరుదెంచితివా, చన దెక్కడ కింకఁ జెప్పు ♦ సమయింతును నీ
ఘనకామచారితను నిదె, కను మని చెప్పుచును మాల♦కన్నియ నన్నున్. 168

ఆ. పరుగువాఱి మాల♦బాలురు తెచ్చిన, యర్ధశుష్కలోమ♦శామగంధి
ధేనుచర్మవర్ధ్రి♦కానద్ధ మగునొక, దారుపంజరంబు♦తలుపుఁ దెఱచి. 169

తే. ఉండు మిం దని తెఱగంటి♦యువిదలకును, దర్శనీయమహాశ్వేత♦దర్శనంబుఁ
గోరునామనోరథశత♦కోట్లతోడ, నుంచె నాపంజరమున నా♦యుత్పలాక్షి.

వ. అట్లుంచి యిట్లనియె. 171

చండాలదారికచేఁ బంజరమున నుంచఁబడిన చిలుక చింతించుట.

క. ఇచ్చట నుండుము సుఖముగ, నెచ్చటకుం బోకు మింక ♦ నెఱుఁగుమటంచున్
గ్రచ్చుఱ మిన్నక యుండెను, నచ్చంచలనేత్ర! యంత ♦ స్వాంతమ్మున నేన్.

క. కడుసంకటమునఁ బడితిని, విడువంగాఁ బడుదు నెట్లు ♦ విడుపు మటంచున్
నుడివి మదీయావస్థను, నడుగుదు నా దీని మ్రొక్కి ♦ యవనమ్రుఁడనై. 173

క. ఏగుణదోషంబున నే, వాగురకుం జిక్కి పట్టు♦వడితినొ యిపుడే
యాగుణమె ద్విగుణితం బవు, నీఁగఁగ రాకుండఁ జేయు ♦ నీయాపద నన్. 174

క. జిలిబిలిపలుకుల మదిరం,జిలఁ జేయఁగఁ జాలు వేల్పు♦చిలుక యి దంచీ

వెలఁదుక ననుఁ బట్టించెను, ఫల మేమీ సతికి నన్నుఁ ♦ బట్టించుటచే. 175

చ. తనయుఁడఁ గాను జుట్టమను ♦ దమ్ముఁడనుం జెలి నన్నఁ గాను నీ
వనితకు నేను; నేల నను ♦ బంధితుఁ జేయును నాదుపల్కులన్
వినవలె నన్కుతూహలము ♦ వేగిర పెట్టినఁ గాక; కాన నే
మనక ధరించి మౌనమును ♦ నట్టె పరుండెదఁ బంజరంబునన్. 176

చ. సలిపిన నిట్లు కోపమునఁ ♦ జాలహితం బొనరించి యేమి యే
న్నలుపును నింతకంటెను ఘు♦నంబగువంతను నొక్కవేళ నా
వెలఁదుక; క్రూరజాతి యిది ♦ పెల్లుగ నింతకు హెచ్చుకష్టముల్
సలిపిన మేలె మాదిగెల♦సంగతి వీడినఁ జాలు నా కదే. 177

ఉ. మౌనముఁ దాల్చి యున్నను ♦ మానక వేసటఁ జెంది విప్పునో
మానితినేని మౌనమును ♦ మానిని వీడునె యెన్నఁ డేనియున్;
మాని సుపర్వలోకమును ♦ మానవలోకమునందు జన్మమున్
బూనితిఁ బక్షిజాతి నిటు ♦ పుట్టితి మాలలచేతఁ జిక్కితిన్. 178

ఉ. పంజరబంధనవ్యథయుఁ ♦ బాటిలెఁ జూడఁగ దీని కంతకున్
గుంజక యింద్రియంబులను ♦ గోరినయట్టులు పోవ నిచ్చుటే
రంజిలు కారణం; బివుడు ♦ రచ్చకు వచ్చినమీఁద నే మగున్
గుంజెద నింద్రియంబులను ♦ గోరినయట్టుల పోవనీ నిఁకన్. 179

క. అని నిశ్చయించి మనమునఁ, గని మౌనము మాటలాడఁ ♦ గడఁగిన బెదరిం
చినఁ గొట్టి తిట్టి యాండ్చిన, నన కేమియు నూరకుంటి ♦ నమలచరిత్రా!.

క. బిట్టుగఁ బెట్టినబాధల, గట్టిగఁ జీత్కార మొప్పఁ ♦ గడలద్రవంగాఁ
బెట్టుచుఁ గూఁతల నిట్టటు, మిట్టాడుచుఁ బంజరమున ♦ మిడుకుచు నుంటిన్.

క. పానము నశనముఁ దేరఁగఁ, బూనక భక్షింప నెంత ♦ పూన్కి నుడివినన్
మానక మౌనవ్రతమును, నూనితి నుపవాసదీక్ష! ♦ నుర్వీరమణా!. 182

క. ఆదిన మంతయు నట్లే, బూది యొనర్చుచును నున్న♦భూరిక్షుధ న
న్నేదియును గొనక యుంటిని, బైదలి చాటూక్తు లెన్ని ♦ పచరించినన్.

చండాలదారిక చిలుక కాహారమిచ్చుట, అది భక్షింపకుండుట, చాటూక్తి.

ఉ. ఆమరునాఁడు భుక్తిసమ♦యంబు చనన్ క్షుధఁ దూల మేను నా
కామదిరాయతాక్షి తన♦హస్తమునన్ గొనితెచ్చెఁ బ్రీతితో
నామఫలంబులన్ గడు న♦నామఫలంబులఁ బెక్కుభంగులన్
గోమలశీతలాంబువులఁ ♦ గోరె భుజింపఁగ నన్ను మాటికిన్. 184

క. తిన కున్ననన్నుఁ గని యీ, వనిత యరుణితాక్షి యగుచు ♦ వారనిప్రేమన్
గనఁబఱచుదానిపోలిక, ననియెను హిత ముట్టిపడెడు♦నట్టుల నాకున్. 185

చ. తనరుచు నిర్విచారతను ♦ దప్పిని నాఁకటి నార్తిఁ గూరుచున్
మనుపశుపక్షిజంతు లుప♦నమ్రము లైనఫలాదివస్తువుల్
తినమి యసంభవంబు; గను♦తింపఁగ భోజ్య మభోజ్యమన్ వివే
చన మొనరింప వే మయినఁ ♦ జాలు లభించిన వన్నియున్ దినున్. 186

ఉ. ఈ వటుగాక మేము తమి ♦ నిచ్చ్ఛుడునోగిర మారగింపమిన్
భావనసేయుదాన తొలి♦ బాముకాలంబు నెఱుంగునొక్కసం
భావితమానివంచు నిను ♦ భక్ష్య మభక్ష్య మటన్నజ్ఞానమున్
వావిరిలేనిపత్త్రరథ♦వంశమువాఁడవు నీ కభక్ష్యమే. 187

ఉ. ఏల భుజింపవన్న భువ♦నైకపవిత్రతమాభిజాత్యమున్
దాలిచి యాత్మదోషమునఁ ♦ దాలిచి పత్త్రికులాన జన్మమున్
గ్రాలెదునీవు దీన నిటు ♦ గాఢవిచారము చేసె దేటికిన్
జాలును దొల్తనే తెలివి♦నల్పుఁగ లే దిపు డాత్మజాతికిన్
బోలినయట్టు నల్ప నిటు ♦ పొక్కెద నేటికిఁ దప్పు లే దిటన్. 188

మ. దినవచ్చున్ దినరా దటన్ననియతిన్ ♦ దీపించువారున్ విప
త్తున భక్షించి యభక్ష్యమున్ దనువుఁ బా♦ల్తురా నీవు హెచ్చేమి నేఁ
గొనిరా నట్టివి మానువెల్లగును గై♦కోవచ్చునస్యంబులన్
గొని యేతెంచితి వాని శంక విడి గై♦కోవచ్చుఁ గాదే యిఁకన్. 189

చ. ధరఁ బడనేని నీరము మ♦తంగులకుంభములోని దైనన్
బరమపవిత్ర మంచును జ♦నంబులు చెప్పఁగ విందు నేటికిన్
వరతనువున్ దృజించెదవు ♦ వారనిదప్పిని నాకటన్ గరం
బరయక యీఫలంబులను ♦ నంబువులన్ దిన కాన కీగతిన్. 190

చ. అనుచు పచింప మాలలకు ♦ నర్హము లైనతదీయభాషణం
బునకును దెల్విఁకిన్ మదినిఁ ♦ బొంది మహాద్భుత మేను జీవితా
శను విడి రోఁతయున్నమతి ♦ శాపవశంబున దానిమాటలన్
మనము కరంగ నాఁకలియు ♦ మానక రేఁపఁగ నారగింపఁగన్. 191

క. ఈకొంటిఁ గాని మానము, నీకొన వీడంగ నిట్టు ♦ లేగఁగఁ గొన్నాళ్
ప్రకట మగుతారుణ్యము, ప్రేఁకముఁ దాల్చితిని నోలి ♦ రేవారమాడ్కిన్.

తే. అంత నొకనాఁటివేకువ ♦ నక్షియుగముఁ
దెఱచి కనుఁగొంటి నేను నీ♦దివ్యకనక
పంజరంబున నుంట నా ♦ ప్లవతరుణియు
మత్పురోభాగమున నుంట ♦ మనుజనాథ! 193

తే. అమరపురసన్నిభంబయి ♦ యలరుచున్న
సకలతత్పక్కణంబును ♦ సరవిఁ గాంచి
ప్లవజననివాస మనుభ్రాంతిఁ ♦ బాసి మదిని
యచ్చెరువుఁ గాంచి యిది యేమి ♦ యనుచుఁ దమిని. 194

తే. అడుగవలె నని మౌనంబు ♦ విడువఁ గడఁగు
లోపలనె నన్నుఁ గొని తెచ్చి ♦ లోలనయన
నీపదంబులయొద్ద కీ♦నెలఁత యెవతె
యేల చెప్పను దాను జం♦డాలి నను చు. 195

తే. ఏల నను బట్టుకొని యెను ♦ నేల యిటకుఁ
దెచ్చి ననుఁబట్టి యేమి సా♦ధించు పొంటెఁ
దెచ్చె నేను నెఱుంగను ♦ దేవునట్టు
లపగతకుతూహలుండనై ♦ యలరుదాన. 196

వ. అనుటయు శూద్రకరాజును దానిపలుకు లాలకించి సంజాతాధికకుతూహలుం డయి యాచండాలదారికం బిలువ మ్రోల నున్న ప్రతిహారిం బంపుటయు నదియు వైళంబఁ గొని తేర నాచండాలదారిక వచ్చి రాజున కెదుర నిలిచి నిజమహోజ్జ్వలకాంతిచే రాజు నభిభవించుచు నతిప్రౌఢిమ నిట్లనియె. 197

చండాలకన్యక తనవృత్తాంతము శూద్రకనృపతికిఁ జెప్పుట.

తే. భువనభూషణ! రోహిణీ♦ధవ! మృగాంక!, చిత్రరథపుత్రికానేత్ర♦సింధుచంద్ర!
వినినవాఁడవు నృప నీవు ♦ వీనినాదు, పూర్వవృత్తాంత మెల్లను ♦ భూపతిలక!.

సీ. ఈజన్మమునఁ దండ్రి ♦ యెంత వారించినఁ గామరాగాంధుఁడై ♦ కనక మీఁదుఁ
దండ్రియాజ్ఞను మీరి ♦ తనతన్వియొద్దకు వెడలుటయును వీఁడె ♦ వినిచె నీకు
నిట్టిదురాత్మున ♦ కేను దల్లిని శ్రీని నీతఁడు వెడలుట ♦ యెఱిఁగి తాను
జ్ఞానదృష్టిని వీని♦జనకుండు నను జేరి శాసించె నిట్లని ♦ సర్వజనులు

తే. తెలియమిని నవిసీతిని ♦ దెచ్చుకొంద్రు
వెతలఁ నను తాపమునఁగాని ♦ విడరు వానిఁ

గానఁ జగతిని జనుల కే♦కరణి నైన
బలిమి ననుతాపమును గడుఁ ♦ గొలువవలయు. 199

ఉ. ఈతఁడు నీసుతుం డెపుడొ ♦ యీవిహగాత్మను వీడి యెందు నేఁ
బాతము నొందు నే సలుపఁ ♦ బట్టినకార్యము పూర్తిచేయు దా
కాతతజాగరూకతను ♦ నారసి వీనిని బట్టి కట్టి యీ
భూతలమందె యుంచు మని ♦ భూర్యనుతాపముఁ బుట్టఁ జేయుమా. 200

క. అని యాజ్ఞ నొసఁగె నాకున్, వినయము గలిగింప వేరు ♦ వెరవు దొరకమిన్
గని యిదె యుర వగువెర వని, యొనరించితి వీని కిట్టి ♦ యొత్తిడి నృపతీ!.

తే. ముగిసె నాకార్య మిప్పుడు ♦ ముగిసె శాప
కాలమును మీకు శాపంబు ♦ కడచనంగఁ
గలుగవలయును నొక్కట ♦ గాఢసౌఖ్య
మనుచుఁ గొనితెచ్చితిని వీని ♦ మనుజవర్య!. 202

ఉ. నేను మతంగకన్య నని ♦ నీ కెఱిఁగించితి లోకసంగతిన్
మానుప; నిప్పు డిర్వురును ♦ మాని జరామరణాదికవ్యథా
స్థానము లీశరీరములఁ ♦ జయ్యన నిష్టసమాగమక్రియా
నూనసుఖంబులన్ దనిసి ♦ నూత్నవికాసములన్ సుఖింపుఁడీ. 203

చ. అనుచును భూషణధ్వనుల ♦ నంబర మెల్లను జెవ్వుపట్టఁగాఁ
జనియెను నాకసంబునకు ♦ క్ష్మాతలమున్ విడి ఫుల్లనేత్రులై
జనములు గుంపులై తనదు♦ఛాయఁ గనుంగొన విస్మయంబునన్
వనజగృహావతారయగు♦పంచమభామిని సంభ్రమంబునన్. 204

వ. అంత నాశూద్రకభూకాంతుండు పూర్వజన్మంబునుం దలంచుకొని సఖ! వైశంపాయనాహ్వయపుండరీక! దైవవశంబున మన కిద్దఱకును శాపావసానం బొక్కసారి కలిగె. మనయదృష్టం బేమని యనుచుండ దత్క్షణంబ మకరకేతుండు ఆకర్ణాకృష్టకార్ముకుండై కాదంబరిని నిశాతశరంబుఁగాఁ జేసికొని జీవితాపహరణంబు గావింపకుండఁ బ్రతిరోధించువానిమాడ్కి నాశిలనెల్ల నిరోధించుచు నేతెంచి యారాజునెదురఁ దద్హృదయమధ్యం బధిష్ఠించె నంత. 205

చంద్రాపీడావతారుండగు శూద్రకుని విరహతాపవర్ణనము.

చ. నరపతిమానసం బపు డ♦నంగుఁడు కైకొని వెళ్లఁగొట్టఁ గా
శరణముఁ జొచ్చెఁ జిత్రరథు♦సత్ప్రియపుత్త్రిని దిక్కులేక; త

చ్ఛరహతి భీతి నాఁగ జన ♦ శ్వాసమరుత్తులు రాజదేహముం
దొరఁగి సచేతనంబులయి ♦ తోరములై పరుగెత్తు చెంతయుం. 206

సీ. దేహమెల్ల వణంకెఁ ♦ దీయవిల్తునిబాణపఙ్క్తిపాతాహతిఁ ♦ బడసె ననఁగఁ
దనువెల్లఁ బులకలఁ ♦ దనరెను స్మరశరశల్యభరాహతి ♦ సల్పె ననఁగ
నేత్రయుగము బాష్ప♦నీరంబులఁ దొరంగెఁ దచ్ఛరపాంసువుల్ ♦ దవిలె ననఁగ
వదనలావణ్యంబు ♦ పాండురత్వం బందెఁ దత్పరాభవఖిన్న♦తను ననంగ
తే. నేత్రయుగళంబు హృద్వ్యథా♦నీతమీల, నత్రిభాగంబు తనరెను♦నళినబాణ
కార్ముకగుణధ్వనిశ్రుతి♦కారణమున, నందె నుద్వేజనం బన ♦ నవనిపతికి. 207

వ. మఱియు. 208

చ. మనమున నందుచుండు సుమ♦మార్గణపావకధూమసంహతిన్
గనె నన శోషిలెన్ మిగులఁ ♦ గంపిలునోష్ఠకిసలయంబు; ధా
త్రినిఁ బడెఁ దమ్మలంబు నటు ♦ తీయనివిల్తునివెట్ట శుష్కమై
తనరి ముఖోద్గతం బగుని♦తాంతసరాగహృదంబుజంబనన్. 209

తే. పచ్చికట్టెల నీరంబు ♦ వచ్చుపగిది, దహ్యమానాంగుఁ డగురాజు♦తనువునుండి
వెడలెఁ జెమ్మట మరుబాణ♦విద్ధ మనఁగ, వివశమయ్యెను మేనెల్ల♦విన్నయువుడె.

చ మును మదిరాతనూజ నిడి ♦ మూర్ఛిల మారుఁడు పెట్టుబాధలన్
దనకెడిరాజు తాపము న♦ణంపఁ దదంగకరూపశోభచేఁ
దనర జయింపఁగాఁబడిన♦తాపహారంబులు నైనవస్తువుల్
మునుకొన లేకపోయె వెత♦మున్గెడునాతనిఁ జూచుచుండెఁగా. 211

సీ. పాణిపదంబునఁ ♦ బద్మపల్లవములు స్మితరుచి ఘనసార♦సితరజంబు
దృష్టినిఁ గువలయ♦దివ్యదామకములు లావణ్యమున జ్యోత్స్న♦లలితసుమను
గండస్థలంబునఁ ♦ గనకదర్పణములు బాహులతల బిస♦ప్రాభవంబు
నఖమయూఖంబుల ♦ నళినారిరశ్మలు పృథుముఖంబున శశి♦బింబకంబు
తే. దశనకాంతుల మౌక్తిక♦దామకములు
జఘనభరమున మణివేది♦చారుకుట్టి
మంబుల జయించె నారాజ♦మఘువుఁ డౌర
యువిదె యిప్పుడు తాపంబు ♦ నడరఁ జేసె. 212

తే. కడఁగి బాహ్యప్రతీకార♦కలనచేత
నతనితనుతాప మార్పంగ ♦ నఖిలజనులు

జతన మొనరించి రెంతయు ♦ సల్పి రెవరు
హృదయతాపంబుఁ దీర్పంగ ♦ నేమి యపుడు. 213

తే. అతని మదికి సుఖం బీయ♦వాయె నితర
వివిధసర్వవినోదముల్ ♦ వేడుకలును
నపుడు కాదంబరిని మది ♦ నెన్నుకొనుచు
కనుచు దానిని గోరుచుఁ ♦ గాంక్ష నతఁడు. 214

సీ. దానిఁ గౌఁగిటఁ జేర్చి ♦ తనియుచు సల్లాపసౌఖ్యంబుఁ గాంచుచు ♦ దానతోడ
నేకాసనంబున ♦ నెసఁగుచు దానితోఁ బొలయల్కఁ బచరించి♦పొలుపుఁగనుచు
ననునయించుచు దాని♦యడుగులపైఁ బడి బతిమాలి బతిమాలి♦భంగపడుచు
నెలదోఁట దానితో ♦ నెలమిఁ గ్రీడించుచుఁ బంచబాణప్రౌఢిఁ ♦ బరిఢవిలుచు

తే. సతత మూసతిఁ బాయక ♦ స్వాంతమునను
వీడి పనులెల్లఁ బగలును ♦ విచ్చి కనులు
చూడ కెవ్వరి రే నిద్రఁ ♦ జొరక తండు
కుసుమబాణునికాఁకలఁ ♦ గుంద సాగె. 215

చ. పలుకక మిత్రుతో నయినఁ ♦ బాటన సేయక యేరు వచ్చినన్
దలఁకక వృద్ధులన్ బ్రణతిఁ ♦ దార్పక వారికి ధర్మకార్యముల్
సలుపక సౌఖ్య మెంచకను ♦ జచ్చుటకున్ వెనుదీయ కెంతయున్
దెలియక దుఃఖ మిట్టి దని ♦ తేఁకువ మాని త్రపం దొలంగియున్. 216

చ. చెలిమిని వీడి దేహమునఁ ♦ జెప్పఁగ నేటికిఁ బెక్కు లింక నా
చెలిమదిరాసుతన్ గలయఁ♦జేయక యత్నము సారె సారెఁ గే
వలము విసంజ్ఞదంభమునఁ ♦ బాయఁగ జీవము నర్హమున్ దనున్
సలుపుచు వేగుచుండె నల ♦ త్మాపతి మన్మథుబారి కగ్గమై 217

సీ. వ్యాకులచిత్తులై ♦ యపరి తాప మణంపఁ జాలినసాధన♦చయముఁ గూర్చి
యాపాదమస్తక ♦ మలఁది శ్రీగంధంబు నార్ద్రారవిందంబు ♦ లడుగుల నిడి
కరములు నీహార♦ఖండంబులను బచ్చకర్పూరవుంబొడిఁ ♦ గలపి చేర్చి
యెదను నీహారార్ద్ర♦సదుసుమహారం బుంచి నొసటను విధుకాంత♦మెసఁగ నుంచి

తే. మూపురంబుల బిసనాళ♦ములను నుంచి, యనఁటియాకుల వీవన♦లనవరతము
నార్ద్రశిశిరానిలంబుల ♦ నల్లనల్ల, పొలయ వీచుచు సుసుతల్ప♦ములనుగూర్చి.

క. ధారాగృహయంత్రంబుల, ధారాసారముల నతను♦తాపం బారన్
గూరఁగఁ జేయుచు ససలిల, సారసకింజల్కలసిత♦సౌగంధికముల్. 219

క. కూరిచి మణికుట్టిమములఁ, జారుతుషారోదకములఁ ♦ జల్లి కడుగుచున్
గూరుచు నలజడిఁ గడువడిఁ, బారుచు శిశిరోపచార ♦ పరికరములఁ దేన్. 220

తే. శిశిరభూగృహాభ్యంతర ♦ సీమలందుఁ, జేర్చు చుద్యానదీర్ఘికా ♦ శ్రేణితీర
వల్లికామండపంబుల ♦ వకుళవాటి,కలను జేర్చుచు నుపచార ♦ కలితు లగుచు.

తే. ఆప్తపరిజనమిత్రు లా ♦ యువనిపతికి
నతనుతాపంబుఁ దీఱంగ ♦ నవనిఁ గల్గు
శిశిరమృదులోపచారముల్ ♦ చేసి యలసి
రంతియే గాని కామాగ్ని ♦ నార్ప రైరి. 222

తే. శిశిరమృదులోపచారముల్ ♦ చేయుకొలఁది
నతనుపావకుఁ డధికుఁడై ♦ యడరసాగె
నతనిపగిది మహాశ్వేత ♦ నాత్మఁ దలఁచి
మండుచుండె వైశంపాయ ♦ నుండు మదిని. 223

వ. ఆసమయంబున. 224

క. చనుదెంచె మరల నామని, జనవరుకామాగ్ని రగుల ♦ సల్పు ననఁగ ద
క్షిణపవను సరసకిసలయ, తనులతికల కాటనేర్ప ♦ దత్తుఁ గొలుపుచున్. 225

సీ. ఆట లాడించుచు ♦ నాలోలపల్లవజాలరక్తాశోక ♦ శాఖికలను
వంచుచు వాంఛితా ♦ భ్యంచితకోరకమంజరీభరమున ♦ మావిగముల
నుత్కోరకంబుల ♦ నొనరించుచును నీపకురవకచంపక ♦ కుటజములను
బచ్చఁగఁ జేయుచుఁ ♦ బచ్చగోరంటలఁ గకుభమహీరుహ ♦ కాండములను

తే. జల్లు చతిముక్తకామోద ♦ చారిమంబు
వెలుఁగఁ జేయుచుఁ గింశుక ♦ వీధికలను
బిచ్చలింపఁగఁ జేయుచు ♦ విచ్చలవిడి
కామిజనచిత్తముల మధు ♦ కాల మొప్పె. 226

ఉ. పాటిత మయ్యె మానము వి ♦ పాటిత మయ్యెను సిగ్గు కోపమున్
గీటడఁగెన్ బిగింపులును ♦ గ్రిందఁ బడెన్ బతిమాలుకొంటలున్
మాటికి వీటుపోయె నను ♦ మానములెల్ల నశించెఁ జంబనా
ర్భాటము పెల్లెసంగె విట ♦ రాజికి నామధుమాసజృంభికన్. 227

ఉ. ఉపవనకాననద్రుమము ♦ లుజ్జ్వలపల్లవరాజి కిమ్ములై
వ్యపగతశుష్కపర్ణతను ♦ భాసిలె ఫుల్లరసాలసౌరభ

స్నపితములై దెసల్ పదియు ♦ సన్నుతి కెక్కఁ బ్రమత్తకోకిలా
లపితము లధ్వగాళి ప్రవి♦లాపము లెందుఁ జెలంగెఁ గ్రందుగన్. 22

చ. సతతమరందబిందుకణ♦జాలకదుర్దినమై సమున్మద
త్తతసకలప్రపంచమయి ♦ దర్పకహర్షదమై భ్రమన్మధు
వ్రతచయఝుంకృతిస్వనవి♦రాజితమై విరహార్తచిత్తసం
గతయువలోకమై యొసఁగె ♦ త్త్వాతలి నామధుమాస మంతటన్. 229

చ. మగునిశితాస్త్ర మాసురభి♦మాసమునన్ మదిరాత్మజాత దు
ర్భరవిరహాకులాత్మయయి ♦ ప్రాప్తిల ఘోరమహోత్సవంబు తాఁ
గరము మహాప్రయత్నమున ♦ ఘనస్రము నెట్లొ యొకట్లు పుచ్చి భా
స్కరుఁడు మునింగి చీఁకటులు ♦ గ్రమ్మఁగ దిక్కుల నెల్ల మాపునన్. 23

ఉ. స్నానము చేసి ధౌతవస♦నంబులఁ దాలిచి సల్పి పూజలన్
మీనపతాకదేవునకు ♦ మీఱఁగ నాతనిమ్రోలఁ దాన రా
ట్సూనునకున్ సుగంధపరి♦శుద్ధజలంబుల స్నాన మార్చి స
మ్మానితసౌరభాంచితము ♦ మంజుల మాహరిచందనంబునన్. 23

క. తనువెల్లఁ బూసి పరిమళ, ఘనసుమదామముల నెత్తి♦గట్టి చికురముల్
చొనిపి చెవిని సత్కుసలయ, కనదుగుకం కేళిగుచ్ఛ♦గశ్రుతిభూషన్. 23

వ. మఱియుఁ గర్పూరకుసుమప్రచురంబు లగునాభరణవిశేషంబుల నాచంద్ర
పీడుదేహంబు చక్కఁగ నలంకరించి రెప్పవాల్పను మఱచి పానం బొనరించి
నా భావార్ద్రంబు లగుచూపులఁ జాలతడవు చూచుచు నాకాదంబరి గడు
గడుఁ దహతహపడుచు సారెసారెకు నూర్పులు పుచ్చుచు నేపమానగాత్రియై
వెఱపెల్లిదంబున క్లిన్నాఖిలావయవ యగుచు రోమాంచకంచుకితశరీరయై
పెదవు లెండ మహాశ్వేత కనుంగొను ననుథయంబున మాటిమాటికి నల
దిక్కులఁ జూడ్కులు సారించి చకితచకితయై చూచుచుఁ జంకును గొంకును
గదుర మెల్లఁగఁ జేరునకుం జనుదెంచి ధైర్యం బవలంబించి సిగ్గుం బరిత్యజిం
యబలాజనసహజం బగుభీతి నవలం బుచ్చి త్రిభువనోన్మాదకారి యగుకం
ర్పునకుం జిక్కి ప్రాణంబును నిల్పికొనఁజాలక యెవ్వరినిన్ లేకుండఁ జూ
సాహసించి ముకుళితనయనయై విగతప్రజ్ఞుండయి యున్నయాచంద్రాపీడున
సకుం జేరి యిటునటు చూచి జీవితునిచూడ్కి వతని నతినిర్భరంబుగ
గాఁగిలించె నంత. 2

—◎ చంద్రాపీడుఁడు జీవించుట. ◎—

క. అమృతము చల్లినపగిదిని, నమితాహ్లాదంబుఁ గొల్పు♦నాభుజపరిరం
భమున సుదూరగతప్రాణము మగుడఁగ వచ్చి చేరె ♦ నరపతిసుతునిన్. 234

క. దివసక్లమమీలితకై, రవము శరజ్జ్యోత్స్న యంటి ♦ రాజలునట్టా
యవనిపతిసూనుహృదయము, తవిలి వికాసంబుఁ జెందెఁ ♦ దక్షణము కడున్.

క. కనుఁగవ రవికిరణస్పర్శనమున నీలాబ్జకలిక♦చందమునఁ గడున్
దనరెను గర్ణము లంటుచు, ఘనమయి వికసించి రుచులఁ ♦ గ్రాలుచు విరివిన్.

క. వదనము ఫుల్లాంబుజరుచి, సదనంబయి వెలుఁగఁ జొచ్చె ♦ సన్నుతకళలన్
బొదలెను సర్వాంగంబులు, కదలెను సుప్తప్రబుద్ధ♦కరణిని నతఁడున్. 237

వ. ఇట్లు చంద్రాపీడుండు కాదంబరీకంఠగ్రహంబుచే సముపలబ్ధజీవుండై కంఠ
లగ్న యగు నా కాదంబరిని జిరవిరహదుర్లభంబు లగునిజబాహువులన్ బిగియా
రన్ గౌఁగిలించుకొని వాతచలిత యగుబాలకదళివిధంబున భయోత్కంపి
తాంగియై గాఢతరామీలితలోచన యగుచు విడువను బరిగ్రహింపను జాలక
లోఁ బ్రవేశింప నిచ్ఛగించె నా వక్షంబునన్ వ్రాలియున్నదానిం జూచి కర్ణం
బులకును హృదయంబునకు ననుభూతపూర్వం బగుస్వరంబున హర్షంబు గదుర
ని ట్లనియె. 238

చ. వదలుము భీరు! సాధ్వసము; ♦ వచ్చెను బ్రాణము నీదుకౌఁగిటన్
బొదలుటఁ జేసి; యచ్చరల♦పుణ్యకులంబునఁ బుట్టినావు నీ
మది స్మరియించితే నాపలుకు ♦ మానిని! యీతను వేద దంచు నీ
మదిరతనూజ యంటుటను ♦ మంజులమై సుఖయించు నంటిఁగా. 239

ఉ. ఇన్నిదినమ్ము లీవు కడు♦నింపునఁ గేలున నంటుచుండినన్
బన్నుగ ఘోరశాపమునఁ ♦ బ్రాణముఁ గూరను నేను; నీకునై
సన్నుతగాత్రి! దుస్సహన♦శంబరవైరిపిదాహవేదనా
పన్నతఁ గాంచునాఁకుఁ జనెఁ ♦ బాపపుశాపము తీవ్రతాపమున్. 240

చ. వదలితి నీవియోగ మను♦వారనిదుఃఖము గూర్చు చెప్పు దుః
ఖద మగు మర్త్యదేహమును ♦ గాంతరొ! శూద్రకనామధేయమున్
గదిరెను నీకు దీనిపయి ♦ గాటపుఁగూరిమి యన్న హేతుచేఁ
గుదురఁగఁ బ్రోచితిన్ సుదతి! ♦ కూర్పను నీకుఁ బ్రియంబు నిన్నినాళ్. 241

ఉ. కావున నీస్పృలోకమును ♦ గ్లాభువనంబును రెండు నిత్తతిన్
బావనచిత్త! నీచరణ♦పద్మములన్ వసియించు నింకఁ బో

నీవరమిత్ర హంససుత • నెచ్చెలియుఁ విగతాఘుఁడై యిదే
పోవిడి పూర్వదేహమును • బొల్చుచు నుండెడువాఁడు చూడుమా. 242

——పుండరీకుఁడు కపింజలునితోఁడ వచ్చుట.——

వ. అని చంద్రాపీడశరీరాంతరితదేహుం డగుచంద్రుండు చెప్పుచుండఁ జంద్రలోకావస్థానసంలగ్నం బగునమృతపరిమళంబు వహించుచుఁ దొల్లి మహాశ్వేతపయి మరులుగొని మరణంబు నొందిననాఁటివేషంబుఁ దాల్చి కంఠంబున నాయేకావళి ధరించి పూర్వప్రకారంబున నాపాండుతామకపోలయుగళంబగు ముఖంబుతోఁడఁ గపింజలునిచేయి వట్టుకొని యాకాశంబునుండి దిగి పుండరీకుం డటకు నేతెంచె. అట్లు వచ్చుచున్నపుండరీకుని దూరంబుననుండి కాంచి కాదంబరి పరిత్యక్తచంద్రాపీడవక్షస్థలయై స్వయముగఁ బరుగువారి పోయి మహాశ్వేతఁ బిగియారఁ గౌఁగిలించికొని పుండరీకుం డేతెంచువార్తఁ దెల్పులోపల నాపుండరీకుం డాకాశంబునుండి దిగివచ్చి పరమోపకారియై చంద్రాపీడశరీరుండైన చంద్రునకు నమస్కారంబు చేయుటయు నాచంద్రాపీడుం డిట్లనియె.

క. తొలిపుట్టువు చుట్టరికముఁ, దిలకింపఁగ నల్లుఁ డీవు • తెలియుము నాకీ
వలిపుట్టువునఁ సఖుఁడవు, మెలఁగుము చెలివగుచు నాకు • మిత్రమ! యెపుడున్.

క. అనుటయుఁ జంద్రాపీడుఁడు, విని కేయూరకుఁడు చనియె • వేగమె నావా
ర్తను హంసచిత్రరథులకు, వినిపింపఁగ హేమకూట•పృథ్వీభృతికిన్. 245

క. అరిగెను మదలేఖయుఁ దాఁ, బరుగిడి మృత్యుంజయజప•పరుఁడై యెపుడున్
బరఁగెడు తారాపీడన్పవరుసరసకు నావిలాస•వతిసరసకునున్. 246

తే. అరిగి పదములపైఁ బడి • యార్యచరిత!
లెస్స లే దేవియును నీవు • లెమ్ము లబ్ధ
జీవితుండయ్యె యువరాజు • జీవితుండు
తత్సఖుండును శుకనాస•తనుభవుండు. 247

తే. అనుచుఁ జెప్పంగ నానంద • మావహిల్ల
నాలకించి తద్వాక్యమ్ము • నవనివిభుఁడు
దేహసంస్కారవిరహజ•దీర్ఘపరుష
ఫలితలోమశమణిబంధ • బాహుయుగళి. 248

ఆ. బిగ్గఁ గౌఁగిలించి • ప్రీతి నామదలేఖ, హర్షపరవశుఁడయి • యులవిలాస
వలికి నంత గాఢ•పరిరంభణ మొసంగి, యాత్మసుతున కిట్టు • లనియె వెలమి,

ఆ. తనయ! నీకు నేను ♦ దండ్రి నైతిని నెట్టొ, శాపదోషమునవో ♦ స్వకృతపుణ్య
మునవో యెఱుఁగ లోక ♦ పూజ్యుఁడ వగులోక, పాలకుఁడవు నీవు ♦ బాలకుఁడవె.

తే. అలరు నాయందు సత్కృతి ♦ కర్హమైన
యంశ మెయ్యది యదియు నీ ♦ యందుఁ జొన్పి
నాఁడ రెంటను నీకు నే ♦ నమ్రుఁడ నయి
ప్రణతి యొనరింపఁగాఁ దగు ♦ వాఁడ ననుచు. 251

తే. పాదములఁ బడె జనకుఁ డ ♦ న్భావ ముడిగి
నరపతిసహస్రములతోడ ♦ నరవరుండు
జనకుచే నట్లు ప్రణతుఁడై ♦ తనరుచున్న
కొడుకుఁ గనుఁగొని యాదేవి ♦ కూర్మి యెసఁగ. 252

తే. నిర్భరానందవశయయి ♦ నిర్భరముగ, సారెసారెకు నొదల ♦ సల్లలాట
గండతలముల ముద్దిడి ♦ గాఢముగను, గాఁగలించెను గొడుకుఁ బ్రే ♦ గాఢమతిని.

వ. అంతఁ జంద్రాపీడుండు తల్లిచే నాలింగితోన్ముక్తుండయి సారెసారెకుఁ దల్లికి
దండ్రికి నమస్కరించి శుకనాసునకు వందనం బాచరించి వారొసఁగునాశీ
స్సహస్రంబుల సంవర్ధితప్రహర్షుండై పుండరీకుని కేలుపట్టికొని క్రమంబున స్వ
జననీజనకులకును శుకనాసునకు మనోరమకును వీఁడె మీవైశంపాయనుం డని
వినయవిలతావనమ్రవదనుం డయినయాపుండరీకునిఁ జూపుసమయంబునఁ గపిం
జలుండు చేరువ కేతెంచి శుకనాసుఁ గాంచి యిట్లనియె 254

క. అనిపె నను శ్వేతకేతువె, యను ముని నీతోడ నిట్టు ♦ లార్యచరిత! వీ
నిని బుండరీకుఁ గని పెంచినవాఁడను నేను నింతె ♦ చేయు నిఁ కేమిక్. 255

క. తనయుండు నీకు నీతఁడు, తనయును నీపై నికూర్మి ♦ తద్ద యితనికిన్
గను మీతని వైశంపా, యనుగా మది నవినయముల ♦ నణఁచి మనువుమా.

క. పరుఁ డీతఁ డనుచు నెపుడొ, ప్పరికింపకుఁ డయ్య శాప ♦ పరిముక్తుండై
పరగినను వీనిఁ గొని నే, నరుగను నీతండు నీకె ♦ యాత్మజుఁ డింకన్. 257

వ. మఱియుఁ జంద్రావతారుం డగుచంద్రాపీడుఁ డెందాఁకనుండు నందాఁక నితని
నీయొద్దన యుంచి కృతార్థుండ నయ్యెద. ఇపుడు నాసత్వాఖ్య తేజం బీదివ్య
లోకంబుఁ బాసి మీఁది దగులోకంబున కరుగ నుంకించుచున్నది. పోయి
వచ్చెద నని చెప్పె నని చెప్పుటయు శుకనాసుండు వినయావనతుండై యున్న
పుండరీకుని కేలు వట్టికొని కపింజలుం జూచి కపింజలా! సకలజగదాశయజ్ఞుం
డయినయా శ్వేతకేతుం డేల యిట్లు చెప్పి పంపెను. ఎన్నండైన నీపుండరీకు

నిపై స్నేహంబు పాయునే. యని సగర్వలు పూర్వజన్మవృత్తాంతానుస్మరణ
కథాలాపంబుల నొండొరుల విచారించుకొనుచు నమేయహర్షంబున నిష్టకథా
గోష్ఠి నెరపుచు నుత్ఫుల్లలోచనులై వినోదించుచుండ నారాత్రి వారికిం
దెలియకయ కడచుటయు మరునాఁడు పఱువాతఁ జిత్రరథహంసులు మదిరా
గౌరులతోడ సకలగంధర్వలోకం బనుగమింప నట కేతెంచిరి. 258

చిత్రరథాదులు మహాశ్వేతాశ్రమమునకు వచ్చుట. కాదంబరీచంద్రాపీడాదుల వివాహము.

సీ. తనుదెంచి సిగ్గుచే ♦ వినమితాననలయి యలరుకూఁతులఁ గాంచి ♦ యధికముదముఁ
గాంచి యల్లుండ్రను ♦ గనుఁగొని యుత్ఫుల్లలోచనులై వింతఁ ♦ జూచి చూచి
యప్రయత్నపరస్ప ♦ రార్ద్రసంబంధంబు సమకూరుటకు మది ♦ సంతసించి
సన్నుతశుకనాస ♦ సచివుఁడు నృపతి తారాపీడుఁడును దాము ♦ రహిని నొకటఁ
తే. జేరి యనుభూతసంబంధ ♦ చిత్రకథల
సరససల్లాపముల గోష్ఠి ♦ సలిపి కొంత
సమధికమహోత్సవానంద ♦ సాంద్రు లగుచుఁ
బరిణయాలాపకథలు ప్ర ♦ వర్తిలంగ. 259

తే. చిత్రరథుఁడు తారాపీడ ♦ క్షితిపవరునిఁ, గాంచి యిట్లనె నోమహీ ♦ కాంతవర్య!
నిజగృహం బుండ సిద్ధమై ♦ నివ్వటిలుచు, నీమహోత్సవ మటవిని ♦ నేలసలుప.

క. మన కిరువురకిం బెండ్లియొ, చను ధర్మ్యము నభిమతంబు ♦ సన్నుతమయి యై
నను లోకవ్యవహారముఁ, జన దే పాటింప నింత ♦ క్ష్మాపతిచంద్రా!. 261

క. చనుదము మాపురికైనను, జనుదము మీపురికినైన ♦ శశిభువికైనన్
జనుదము సందియ మేటికిఁ, ననఁ దారాపీడుఁ డనియె ♦ నతని కిటు దమిన్. 262

ఆ. జరుగు నెచట నధిక ♦ సౌఖ్య సంపద యది
యటవియైన భవన ♦ మగుచుఁ దనరు
జరుగు నిట్టి సౌఖ్య ♦ సంపద యొండెడ
మనకుఁ జెపుమ విబుధ ♦ మాన్యచరిత !. 263

వ. మఱియు. 264

తే. భవనములకెల్ల నీయిల్లుఁ ♦ బ్రభువుఁ గాఁగ
సలిపితిని నిప్పుడే వాని ♦ చానతోడఁ
గొంచుఁ జను గృహసుఖములఁ ♦ గూర్పుము సఖ!
యనఁగ గంధర్వపతి యాత్మ ♦ నలరి మిగుల. 265

క. నీ కెయ్యది యభిమతమో, నాకును నది యభిమతంబు ♦ న్యాయ్యం బనుచున్
జేకొని చంద్రాపీడుని, బ్రాకట మగు హేమకూట♦పదవికిఁ జనియెన్. 266

మ. చని కాదంబరితో స్వరాజ్యము సమ♦స్తంబున్ నివేదించెఁ గొ
మ్మని యాచిత్రరథుండు రాసుతునకున్ ♦ హంసుండు దాఁ బుండరీ
కునకున్ స్వాత్మజతో స్వరాజ్యమును గై♦కొమ్మంచుఁ బ్రార్థించెఁ గై
కొని రాకన్యలమాతృపితృప్రియులఁ గై♦కోకొండు వా రాదటన్. 267

వ. అంత. 268

సీ. జన్మాభివాంఛిత♦సన్నుతప్రియలాభ ముదితాత్మజనబంధు♦ముఖ్యులు దనుఁ
గొనియాడ సౌఖ్యంబు ♦ గూరియు నొక్కనాఁడు కాదంబరీదేవి ♦ కనులనిండ
నీరు దెచ్చికొని దీన♦నీరేజముఖియయి తనగృహంబునకు వ♦చ్చినస్వనాథు
శశిని జంద్రాపీడ♦జనపతిసుతమూర్తిఁ గాంచి యిట్లనియెను ♦ గరుణ దోఁప

ఆ. మనుజనాథతనయ! ♦ మనమందఱ మిట్టు
చచ్చి బ్రతికి మరల ♦ సంగతులము
పత్రలేఖ యొకతెఁ ♦ బఱచెను దద్వార్త
యెఱుక పడ దొకింత ♦ యేని యెందు 269

క. అనుటయుఁ జంద్రాపీడుఁడు, గని సంతస మాత్మ దానిఁ ♦ గని యిట్లనియెన్
వనితరో! యెట్లుండును నిట, చనియెను నాచాన తనదు♦జగమున కపుడే.

క. మునిసుతశప్తుఁడనై నేఁ, జనుదెంచెడునపుడు మనుజ♦జగతికి నాకా
మిని యిట్లనియెను వల్లభ, నిను విడి నిముసంబు నుండ♦నేరను నిచటన్.

క. మనుజజగంబున నొంటిగ, ననుఁ బాసి యుండు దీవు ♦ నరపతి! నేనున్
జనుదెంతు నీదువెంబడిఁ, గొని పొమ్మన వల దటంచుఁ ♦ గొసరి నుడివినన్.

క. విన కాసతి నావెంటను, మును భూలోకంబునందుఁ ♦ బుట్టెను నాసే
వను సల్పఁగ జన్మాంతరమును గొను చే మృతినిఁ బొంద♦ముదితయుఁ దానున్.

క. మనుజజగంబున మగుడన్, జనియింపఁగఁ గోరవలదు ♦ సతి! యని నేఁ బ
ల్కిని బంపితి నిజలోకంబున కచ్చటఁ గాంచఁ గలవు ♦ పొలఁతిరో! దానిన్.

క. అనవుడుఁ గాదంబరి తా, విని రోహిణిపేశలతకు ♦ విమలస్నేహం
బునకును బాతివ్రత్యంబునకు నుదారతకు మదిని ♦ బొదల వెఱఁ గడున్.

క. ఘనతరలజ్జాభరమున, ననసేరక యేమి యవన♦తాస్య యగుచుఁ గ్రిం
దును గాంచు చుండె నంతటఁ, జనెఁ బశమరదెపకు సార♦సస్వామి వడిన్.

క. జననద్వయాభికాంక్షిత, వనితాసంభోగసుఖముఁ ♦ బ్రభుచంద్రునకున్

దనర నొనర్పఁగ నా రవి, చనె రాగపతాకయనఁగ ♦ సంజయు నలరెన్. 277

వ. అంత విభావరి యేతెంచి ప్రపంచమెల్లఁ జంద్రోదయాభిరామంబై వెలుం
గుటయు. 278

సీ. అనుభావితపరస్ప♦రాలింగనసుఖంబు వికసితవదనాబ్జ♦విలసితంబు
శిథిలనీవీబంధ♦చేష్టితవ్యాపృతపాణినివారణ♦ప్రౌఢిమంబు
నశిథిలితాశ్లేష♦విశదబంధోజ్జ్వలదశవిధచుంబన♦దర్పితంబు
నప్రార్థితరతిస♦మాప్తిత్రపాభోగ మమణితశ్రవణభ♦యానకంబు
తే. నగుచుఁ జిరకాలకాంక్షిత ♦ మైన ప్రథమ
సురతసుఖసాగరంబున ♦ సుదతిఁ జిత్ర
రథకుమారితఁ దేల్చి యా ♦ రాజసూనుఁ
డభిమతానందసందోహ ♦ మడరఁ జేసె. 279

క. పదిదినముల నొకదినముగ, మదినలరుచుఁ గడపి యంత ♦ మామ యనుపఁగాఁ
బొదలుచుఁ జనియెను నిజపితృ, పదసరసీజములకడకుఁ ♦ బడఁతియు నతఁడున్.

క. చని తనతోఁ గష్టంబులఁ, గనినట్టినృపాలతనయ♦గణములనెల్లన్
దనసరివారిగ నొనరిచి, పనిచెన్ జెలిఁ బుండరీకుఁ ♦ బాలింప మహిన్. 281

క. పనులెల్ల మాని భగవంతునిఁ గొలుచుచు ముదముఁ గనుచు ♦ దూఁగుచు సిరులన్
దనరెడుతలిదండ్రుల నను, దినమున్ సేవించుచుండెఁ ♦ దియ్యఁదనమునన్.

సీ. పురివారు ముదమునఁ ♦ బొరిఁబొరిఁ దనుఁజూడ జన్మభూప్రీతి ను♦జ్జయిని నొకప్డు
ననుపమరమణీయ♦ఘనహేమకూటంబునం దొక్కపరి శ్వశు♦రాదరమున
నొకపరి రోహిణీ♦యుపతిపైఁ దమి సుధాసురభిశీతలనిశా♦కరుజగానఁ
బుండరీకప్రీతి ♦ నిండువేడ్క నొకప్డు జలజాలయావాస♦సద్మములను
తే. దేవికాదంబరికి నెటఁ ♦ దియ్యఁదనము
పుట్టు నయ్యయిసురుచిర♦భూములందు
నాతఁడు వసించు చొక్కొక్క♦యపుడు వివిధ
సుఖములం దేలుచుండె నా♦సుదతితోడ 283

వ ఇట్లు జన్మద్వయాకాంక్షితంబులును బ్రతిదిననవనవంబులును ననితరానుభూత
పూర్వంబులును నగునయ్యయివినోదవిశేషంబులం దవిలి యాచంద్రాపీడుండు
కాదంబరితోడ నిచ్ఛావిహారంబులం గ్రీడించుచుండె. అట్లొక్కచంద్రా
పీడుండను గాదంబరియును కాదు కాదంబరియు మహాశ్వేతయు, మహాశ్వే
తయుఁ బుండరీకుండును, బుండరీకుండును జంద్రాపీడుండును సర్వకాలసర్వా

వస్థలం బరస్పరం బెడఁబాయక వివిధాఖిలసుఖసందోహంబుల యథేచ్ఛం గాం
చుచు నిర్భరనిరతిశయానందంబునం బొదలు చుండిరి. 284

తే. స్వస్తి యగుఁ గాతఁ బ్రజలకు; ♦ క్ష్మాతలంబు
రాజు లేలుత న్యాయమా♦ర్గమున నెపుడు;
గోద్విజులకు శుభంబు చే♦కూరుఁ గాక;
జగములకు నెల్ల సౌఖ్యంబు ♦ జరుగుఁ గాక. 285

## కృతిసమర్పణము.

క. నీకృప పెంపున సల్పిన, యీకృతి నర్పింతు నీకు ♦ నెలమి దలిర్పన్
జేకొనుము భక్తవత్సలా!, ప్రాకటముగ దక్షిణాస్య! ♦ భక్తసువశ్యా!. 286

ఉ. దీనజనావనా! వినుత♦దివ్యగుణా! భవపాశమోచనా!
దానవమర్దనా! హృషిత♦తాపససత్కృతపాదపూజనా!
మానితసజ్జనా! మదన♦మానవిదారణ! శేషభూషణా!
మానక యీకృతిన్ సుకవి♦మాన్యముఁ జేయవె దక్షిణాననా!. 287

చ. కొడుకులు కూఁతులున్ గలరు ♦ కుంభిని నిల్పు మదీయనామ మం
చడరుదునా యొనర్చితిని ♦ నాశితధర్మము లివ్వి నా కొసం
గెడుఁ బరలోకసౌఖ్యముఁ ♦ గీర్తిని నంచు ముదంబుఁ గాంతునా
యడరుదు దేన నీకృతియు ♦ యన్నిటికిన్ దయ దీనిఁ బ్రోవవే 288

శా. సంతానంబులలోన నెక్కు డగునీ♦సంతానమే నీకృపన్
సంతోషం బెసలారఁ గంటి శివ! యా♦శావీధులం దీని వి
శ్రాంతిం బొందఁగఁ జేసి సత్కవులకున్ ♦ సమ్మోదముం గూర్చి నా
చింతల్ మానిచి నాదుపేరు నిలువం ♦ జేయంగదే యీశ్వరా!. 289

క. సంతానంబులలోఁ గృతి, సంతానమె సత మటంచు ♦ శాస్త్రముల సుధీ
మంతులు పల్కుదు రానుడి, సంతస మందంగ నిజము ♦ సల్పుము దేవా!.

క. అలఁతిని మఱి దేనను నే, నిలువఁగ నాపేరు భువిని ♦ నీదయ దీనన్
నిలుపంగఁ దలఁచినాఁడను, సలుపవె నాప్రార్థనంబు ♦ సఫలము దేవా. 291

మ. చలచిత్తుండను భ్రాంతుఁడన్ జడుఁడ న♦శ్రాంతాధిసంవాసుఁడన్
దెలియన్ సత్తు నసత్తు కేవలము నే ♦ దీనుండ నాచే నెటో
పలుకం జేసినవాఁడ నీకృతిఁ గృపన్ ♦ బాలించి దీనిన్ భువిన్
గలకాలంబు వెలుంగఁ జేసి ముదమున్ ♦ గావించి రక్షింపవే. 292

ఉ. ఎవ్వనినామ మీభువిని • నెన్నిదినంబులు నుండు నన్నినాళ్
ళవ్వగ లేక స్వర్గమున•నిత్యసుఖంబుల నందు నాతఁ డా
మవ్వపుఁబల్కులన్ మదిని • నమ్మి రచించితి దీని సత్కృపుల్
నవ్వకయుండఁ బ్రోవు కరు•ణన్ భువి నారవితారకంబుగన్. 293

ఉ. వేఁడను రాజ్యమున్ ధనము • వేఁడ దుకూలములన్ సువర్ణముల్
వేఁడను నగ్రహారముల • వేఁడ హయంబుల సామజంబులన్
వేఁడెద నీపదాంబురుహ•వీధి వసించుచు నీదుదాస్యమున్
వీడక యొప్పు మానసిక•వేదన మాని సుఖంప నీశ్వరా. 294

మాలిని. జయతు జయతు దేవా! సర్వతోజేతృరావా!
జయతు జయతు దేవా! జన్మపాథోధినావా!
జయతు జయతు దేవా! సర్వపాపౌఘదావా!
జయతు జయతు దేవా! సన్నుతోరుప్రభావా!. 295

మత్తకోకిల. మంగళం బగు నీకు నెప్పుడు • మారమానవిదారణా!
మంగళాలయ మంగళాసతి•మంజువాఙ్మధుపారణా
భృంగినందిగణేంద్రవందిత • భీనివారణపండితా!
సంగరాంగణశూరనందిత • సాధుపాలనమండితా!. 296

గద్య. ఇది శ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధసరసకవిత్వవైభవ చింతలపల్లి వంశపయఃపారావారరాకాకైరవబాంధవ శ్రీపేరమాంబాత్ర్యంబకప్రియ తనూభవ సుజనవిధేయ నరసింహనామధేయప్రణీతం బైనశృంగారకాదంబరి యను మహాప్రబంధంబునందు నుత్తరభాగంబునందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

సర్వము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు. శ్రీమేధాదక్షిణామూర్త్యర్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. శ్రీ శ్రీ. శ్రీ.
ఓంతత్సత్.



# శ్రీః.

# శ్రీశృంగారకాదంబరీశోధనపత్రము.



## పూర్వభాగము, ప్రథమాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 5 | 25 | శ్రుతిచరం | శ్రుతచరం |
| ,, | 26 | దజ్ఝ | దజ్జ్ఝ |
| 7 | 40 | గడగికొను | గడిగికొను |
| 8 | 50 | గదనార్జుం | గదనార్జునుఁ |
| 13 | 79 | బరపిరి | బనిపిరి |
| 15 | 99 | వినీతజగతి | వినేతజగతి |
| 17 | 110 | యతి | నతి |
| ,, | 113 | చీని | జీని |

## పూర్వభాగము, ద్వితీయాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 24 | 4 | సత్యంబు | సత్వంబు |
| 30 | 39 | త్రాచు | తాచు |
| ,, | 43 | మ్రాలకలితంబు | మాలికాంతంబు |
| 32 | 50 | డెటొ | డెట్టొ |
| 35 | 71 | హరిణ | హరిణి |
| 39 | 97 | నీమము | నేమము |
| 40 | 112 | గోమాయ | గోమాయు |
| 43 | 134 | వీటఁబుచ్చి | వీటిఁబుచ్చి |
| 44 | 140 | జక్కఁపదం | జక్కఁబదం |
| 50 | 185 | మునులు | మునులఁ |
| 50 | 185 | ధైర్య | దైన్య |
| 55 | 224 | సమ్మతుఁడు | సమ్మతుఁడ |
| 59 | 251 | బలిస్నిగ్ధ | బలిసిక్థ |
| ,, | ,, | కుశముల | కుశలను |
| 60 | 263 | సల | స్థల |
| ,, | ,, | నృపేందా! | నృపేంద్రా! |

## పూర్వభాగము, తృతీయాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 64 | 23 | పాసాద | ప్రాసాద |
| ,, | ,, | మనంగా | మనగ్గా |
| 69 | 54 | యుంధిష్ఠిరనకు | యుంధిష్ఠిరఃనకు |
| ,, | 56 | పులకింపఁగఁగ | పులకింప నక |
| 71 | 70 | ప్రటిత | ప్రకటిత |
| 72 | 72 | ఘుష్యమానో | ఘుష్యమాణో |
| 76 | 102 | లిత్రు | లిత్త్రు |
| 77 | 113 | మాన్షని! | మానని |

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 84 | 160 | బంపిన | బంబిన |
| 95 | 235 | బలాధికుఁ | బలాహకుఁ |
| 96 | 245 | పలాహకుండు | బలాహకుండు |
| 100 | 274 | తాష్టాది | తాష్టది |
| 101 | 287 | మండలమున | కుండలమున |
| 102 | ,, | జలధరనముల | జలధరదినముల |
| ,, | 291 | సుందమూర్తి | సుందరమూర్తి |
| 111 | 353 | సుప్రకోష్టం | సుప్రకోష్ఠం |
| ,, | ,, | పురవ | పురుష |
| 112 | 357 | సరో | సవో |
| 114 | 368 | శిత | సిత |
| 115 | 379 | వీరనయుఁ | వీరణయుఁ |
| 120 | 417 | ముందురముల | మందిరముల |
| 125 | 463 | బాయోఁడా | బాయఁడా |

## పూర్వభాగము, చతుర్థాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 127 | 8 | వూనవుం | మానవుం |
| 129 | 23 | పగిదిని | పవిదిని |
| ,, | 25 | షోఛ్రి | షోచ్ఛ్రి |
| 132 | 43 | వానికి | దానికి |
| 133 | 52 | నిర్వ్యసనిత్వము | నిర్వ్యసనత్వము |
| 141 | 110 | లయి | లై |
| ,, | 111 | శపరీ | శఫరీ |
| 159 | 261 | మండపకంభం | మండపికంబం |
| ,, | 265 | నప్రాకృతమయి | నప్రాకృతయయి |
| 162 | 288 | యొప్పు | యొప్ప |

## పూర్వభాగము, పంచమాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 171 | 45 | గాలిగుడు | గాలిగుడి |
| 174 | 67 | పాతాపసి | తాపసు |
| ,, | 70 | నిరాదరము | నిరాదరత |
| 187 | 185 | శిలీముఖు | శిలీముఖ |
| 193 | 229 | నీమము | నేమము |
| 196 | 252 | జెలమి | జెలిమి |
| 198 | 264 | కాంతి | కాంత |
| 199 | 271 | నెత్తమ్ములు | నెమ్ములు |
| 200 | 277 | బడి | బడు |

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 204 | 301 | దక్థ | దత్థ్న |
| ,, | 305 | జీవింతుడై | జీవితుండై |
| 205 | 313 | నిరుమ తేజ! | నిరుపమ తేజ! |
| ,, | ,, | నర్మలి | నర్మిలి |
| 220 | 415 | ని-రూదరతన్ | కృ-శోదరతన్ |
| 221 | 422 | కట్టనుంగు చెలిని | కట్టనుంగుఁ జెలిని |
| 223 | 441 | మరలించు | మలరించు |

పూర్వభాగము, షష్ఠాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 229 | 41 | సంచరచ్ఛ్రీ | సంచరత్త్రీ |
| 234 | 90 | సోత్థతి | సోత్థితి |
| 246 | 182 | యూమానిని | యామానిని |
| 251 | 224 | గాత్రిచిత్ర | గాత్రిఁజిత్ర |
| 257 | 268 | మహత్త్వమ్మునన్ | మహత్త్వమ్మునన్ |
| 258 | 276 | నచ్చటికి | నచటికి |
| 259 | 284 | వలగొన | వలగొను |
| 260 | 289 | తొగలతేని | తొగలవిందు |
| 262 | 307 | వ్యతనీత | వ్యపనీత |
| 263 | 316 | మానమోద్దావన | మానవోద్భావన |
| 297 | 355 | వతుల | పతుల |
| 293 | 534 | పమ్ముల | ఫమ్ముల |
| 296 | 560 | జేయుంకణ్ణ | జేయుఁగణ్ణ |

ఉత్తరభాగము, ప్రథమాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 309 | 58 | తావ | దావ |
| 317 | 112 | తాళవృతంబు | తాళవృంతంబు |
| 318 | 117 | మాదృశ | మాదృశు |
| 320 | 132 | చాడ్చు | చాడ్పు |
| 329 | 203 | ధరించుఁబటు | ధరించుపటు |
| 331 | 217 | లేద | లేడ |
| 345 | 323 | పూష్ణకిరణ | పూషకిరణ |

ఉత్తరభాగము, ద్వితీయాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 351 | 24 | యేటికి | ఏటికి |
| 354 | 49 | నిస్నేల | నస్నేల |
| 357 | 73 | గార్హ్వస్థ్యంబు | గార్హస్థ్యంబు |
| 362 | 117 | న్వాయింపఁబడ | న్వాయింపంబడ |
| 367 | 153 | నులనకాష్ట | కులనకాష్ఠ |
| 370 | 171 | యుంగ్మతోడ | యుంగ్మముతోడ |
| 374 | 204 | యూర్తుఁ | యూర్తు |
| 375 | 215 | నిభురా | నిష్ఠురా |
| 377 | 231 | పను | మను |
| 378 | 237 | నుదురు | కుదురు |
| ,, | 239 | జనున్ | చనున్ |
| 382 | 267 | దనవిరహా | దనయవిరహా |
| ,, | ,, | యమునస్కృంబయి | యమునన్కృంబయి |
| 385 | 281 | నసమానంగంబును | నసమానంగంబును |
| ,, | 282 | విరహిసులకు | విరహిణులకు |
| ,, | ,, | దళములకు | దళములకును |
| 387 | 292 | జలధర | జలధారా |

ఉత్తరభాగము, తృతీయాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 395 | 12 | పత్తుంఁడై | పత్తుఁడై |
| 396 | 13 | విరయుంతు, నాఁగ నుడు | విరయుంతుఁడు, నాఁగను |
| 397 | 31 | పున్న | పున్నన |
| 398 | 35 | భస్త్రితండన | భస్త్రితుండన |
| ,, | 37 | యన | యనన్ |
| 399 | 48 | గ్రింతు | దర్గింతు |
| 400 | 49 | దురాతా | దురాత్మా |
| 406 | 103 | నటొనర్పుమా | నట్లొనర్పుమా |
| 407 | 106 | కభస్తులు | గభస్తులు |
| ,, | 109 | చిత | చితి |
| 412 | 145 | తేతతి | దేతతి |
| 416 | 181 | జేయుంము | జేయుంమ |
| 417 | 185 | నొక్కు | నొక్కు |
| ,, | 186 | తక్షణంబు | తత్క్షణంబు |
| 418 | 197 | ప్రియసఖు | ప్రియసఖ |
| 419 | 205 | దాల్చ | దాల్ప |
| 434 | 321 | యెప్పుడు | యప్పుడు |

ఉత్తరభాగము, చతుర్థాశ్వాసము.

| పుట. | పద్య. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 439 | 11 | బాఁగు | బాగు |
| 441 | 23 | కేడ్చు | లేడ్చు |
| 452 | 114 | చని | జని |
| ,, | 116 | ద్వద్గుగళ | ద్వద్దుగళ |
| ,, | 117 | పడవున | పడువున |
| 453 | 121 | రాకొండెడ | రాదొండెడ |
| 455 | 141 | డెప్పఁడు | డెప్పఁడొ |
| 457 | 158 | నెదురు | నెదురు |
| 460 | 187 | దాన తొలి | దానఁ దొలి |
| ,, | 189 | దినవచ్చున్ | లినవచ్చున్ |
| 463 | 212 | రత్నలు | రస్నలు |

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.